# మహా భారతం




మూల రచన

**కీ.శే. చక్రవర్తుల రాజగోపాలాచారి**

మాజీ గవర్నర్ జనరల్ ఆఫ్ ఇండియా

తెలుగు అనువాదం:

**కీ.శే. మల్లాజోస్యుల అప్పారావు**

అనువాద సరళీకరణ:

**యు. రామకృష్ణ**



ప్రచురణ

**సనాతన సమధర్మ ప్రచార పరిషత్ సంఘం**

*డోర్ నెం : 41-28/8-85, రాణిగారితోట, కృష్ణలంక,*

*విజయవాడ, ఫోన్ : 9989104273*

MAHA BHARATAM

ప్రథమ ముద్రణ : **అక్టోబర్, 2020**

ప్రతులు : **1000**

వెల : అమూల్యం



*ప్రచురణ*

**సమధర్మ ప్రచార పరిషత్ సంఘం**

ఫోన్ : 9989104273

**ముద్రణ**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ

website : www.psbh.in

prajasaktipublishinghouse@gmail.com

# విజ్ఞప్తి

**విజ్ఞులైన పెద్దలారా!**

మనమంతా భారతీయులం, విశ్వమానవ కళ్యాణమే భారతీయత. అందుకే ప్రపంచ నాగరికత చరిత్రలో భారతీయ తాత్విక పరంపర విశిష్టమైన స్థానం నేటికీ కలిగి ఉంది.

'వసుధైవ కుటుంబకమ్' అన్నారు మన పెద్దలు. అంటే ఈ భూమండలం మీద ఉన్న యావన్మంది ప్రజలూ పరస్పర ప్రేమానురాగాలతో జీవించాలని అర్థం. ఎంతటి మహత్తరమైన భావన ఇది!



ఐతే, ఈ మహదాశయాన్ని విస్మరించి దేశాల మధ్య, ప్రాంతాల మధ్య ఘర్షణలు, యుద్ధాలు జరుగుతున్నాయి. ఇంకొక దేశాన్ని ఎంత ద్వేషిస్తే అంత గొప్ప దేశభక్తి మనకి ఉన్నట్టుగా లెక్కవేస్తున్న దుర్దినాలు దాపురించాయి.

'లోకాస్సమస్తాస్సుఖినోభవంతు' అని వేదపండితుల స్వస్తి ప్రవచనాలు చెప్తాయి. సమస్త లోకాలూ మానవులేగాక సమస్త ప్రాణికోటీ, జీవజాలమూ సుఖంగా ఉండుగాక అని దాని సారాంశం. కాని సమున్నతమైన ఈ భావనకు విరుద్ధంగా పర్యావరణ విధ్వంసం జరిగిపోతోంది. మానవుల మధ్యే రక్తపాతాలు జరిగిపోతున్నాయి. మానవత దిగజారిపోతోంది.

'మా విద్విషావహై' అంటే మేం పరస్పరం ద్వేషించుకోము అని అర్థం. పూర్వకాలం గురుకులాల్లో విద్యార్థుల చేత రోజూ చేయించే ప్రమాణం ఇది. కాని దీనిని పూర్తి విరుద్ధంగా విశ్వవిద్యాలయాల్లో పరస్పర దాడులు, ద్వేషపూరిత వాతావరణం నెలకొంటోంది. ఎట్టి అవధులూ లేకుండా జ్ఞానసముపార్జన జరగవలసిన విద్యా సంస్థల్లో నిర్బంధం, నిషేధం, భయానక వాతావరణం నెలకొంటోంది. ప్రపంచానికే జ్ఞాన భిక్షపెట్టిన భారతదేశంలో ఉండవలసిన పరిస్థితి ఇదేనా?



యావత్ ప్రపంచానికే హిందూమత విశిష్టతను చాటి చెప్పిన యుగపురుషుడు స్వామి వివేకానంద. ఆ మహానుభావుడు "మతం అంటే పరమ సత్యాన్ని గ్రహించడానికి ఉపకరించే సాధనం. భగవత్ స్వరూపాన్ని ఆత్మ దర్శించడానికి మతం సాధనం" అన్నారు. "ప్రపంచంలోని సర్వమతాలూ చెప్పే సారం ఇదే. ఆయా మతాల పేర్లు

వేరువేరుగా ఉండొచ్చు. మత ప్రబోధకులు వేరువేరుగా ఉండొచ్చు. వేరువేరు పద్ధతులను, సాంప్రదాయాలను కలిగి ఉండవచ్చు. కానీ, భారతదేశంలో మారుమూల కీకారణ్యాల్లో బోధించినా, జెరూసలేం కొండలపైన బోధించినా, అరేబియాల్లోని ఎడారుల్లో బోధించినా ఆ బోధనల పరమార్థం ఒక్కటే. మన ఆత్మ పరమాత్ముని సందర్శించగలగడం. ఒకసారి ఆ విధంగా పరమాత్మను సందర్శించగలిగిన వారికి ఇక మతం అవసరమే ఉండదు. ఇది విశ్వసత్యం" అన్నారు స్వామిజీ.

ఈ పరమాత్మ అన్వేషణలో భాగంగానే "మానవసేవే మాధవ సేవ" అని ఆచరణాత్మక మార్గాన్ని కూడా స్వామిజీ మనముందు ఉంచారు. "దరిద్ర దేవో భవ" అన్నారాయన. "ఆకలి గొన్న వాడొక్కడు మిగిలి ఉన్నా నీకు మతాన్ని గురించి మాట్లాడే హక్కులేదు" అని ఆయన మన కర్తవ్యాన్ని స్పష్టంగా బోధించారు. "ప్రార్థించే పెదవుల కన్నా సేవ చేసే చేతులు మిన్న" అని మదర్ థెరిసా చెప్పిన మాటలు కూడా ఇదే కోవకు వస్తాయి.

కాని నేడు మన చుట్టూ విద్వేష భావనలు పెరుగుతున్నాయి. ఇందుకోసం ప్రజల మత విశ్వాసాలను ఇష్టం వచ్చినట్టు వాడుతున్నారు. తామే మత ప్రవక్తలమన్నట్టు కొందరు వ్యవహరిస్తూ సమాజంలోని ప్రశాంత వాతావరణాన్ని ద్వేషమయం చేస్తున్నారు. ఈ పరిస్థితులను చూస్తూ మౌనంగా ఊరుకుంటే మనం తప్పుచేసిన వాళ్లం అవుతాం. దారితప్పుతోన్న మన భారతజాతికి మన



సముజ్వల వారసత్వాన్ని చాటిచెప్పడం ద్వారా తిరిగి సరైన దారిలోకి నడిపించాలి. స్వామి వివేకానంద చూపిన మార్గంలో మనం నడవాలి. ఈ మహదాశయంతో ఏర్పడినదే **సనాతన సమధర్మ ప్రచార పరిషత్ సంఘం**.

మన దేశం పలు మతాలకు పుట్టినిల్లు, పలు దేవతల, సాంప్రదాయాల, భిన్న ఆరాధనా విధానాల సమాహారంగా హిందూ మతం విలసిల్లుతోంది. ఈ గడ్డ మీదే గౌతమ బుద్ధుడు ఆవిష్కరించిన బౌద్ధం వన్నెకెక్కి పలు ప్రపంచ దేశాలకు వ్యాప్తి చెందింది. జైనమతం, సిక్కుమతం ఈ గడ్డమీద పుట్టినవే. జొరాస్ట్రియన్, క్రైస్తవ, ఇస్లాం మతాలు వేయి సంవత్సరాలకు పైగా ఈ దేశంలోనూ కొనసాగుతున్నాయి. స్వామి వివేకానంద చెప్పినట్టు ఈ మతాల సారం ఒక్కటే. అందుకే మతపరమైన విద్వేషాలకు భారతదేశంలో తావు ఉండరాదన్న ప్రచారాన్ని "సనాతన సమధర్మ ప్రచార పరిషత్ సంఘం" చేపడుతుంది.

పరమ గురువుల్లో అగ్రగణ్యులు ఆదిశంకరాచార్యులు. వారు "అహం బ్రహ్మాస్మి" అని ప్రవచించి బ్రహ్మతత్వాన్ని ఉపదేశించారు. ప్రతీ వ్యక్తి పరమాత్మ స్వరూపమేనని మరొకసారి నొక్కి చెప్పడానికే "తత్త్వమసి" అన్నారు. అంటే నాలో పరమాత్ముడున్నాడు, నీలోనూ ఉన్నాడని అర్థం. మరి అందరూ పరమాత్మ స్వరూపాలే అయినప్పుడు ఇక కుల, మత విద్వేషాలకు, కలహాలకు, అంటరానితనం, దేవాలయ ప్రవేశం నిషేధం వంటి సంకుచిత ధోరణులకు తావే ఉండదు గదా. పరమ భక్తుడు అన్నమయ్య సైతం 'బ్రహ్మమొక్కటే...' అంటూ 'మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే, ఛండాలుండుండేటి సరి భూమి యొకటే' అని స్పష్టంగా కుల విభేదాలు తగవని చాటి చెప్పాడు.



మనం అందరమూ గౌరవించే తత్వవేత్త పోతులూరి వీరబ్రహ్మంగారు సజ్జనుడు "సర్వదేవతలను, సర్వమతాలను సమముగా నెరుంగు" అని, "దుర్జనుడు వాటిలో దోషములనెంచు" అని మనుషుల్లోని తేడాలను ఎరుకపరిచారు. "సర్వమానవులను సమముగా ప్రేమించు, కులమతాలనెంచి కోపపడకు" అని బోధించారు. విశ్వమత

సామరస్యమే బ్రహ్మంగారి జీవిత సందేశం. దీనిని భారతీయ సమధర్మ ప్రచార పరిషత్ తన కర్తవ్యంగా ఎంచుకుని పనిచేస్తుంది.

'సనాతన సమధర్మ ప్రచార పరిషత్ సంఘం' భారతీయుల ఉత్తమ తాత్విక వారసత్వాన్ని కొనసాగిస్తుంది. కుల విభేదాలను అసాంఘిక అనాచారాలను విడనాడేలా ప్రజలను చైతన్యపరిచేందుకు కృషి చేస్తుంది. స్వామి వివేకానందుడు, షిర్డి సాయిబాబా, అన్నమయ్య, పోతులూరి వీరబ్రహ్మం, యోగి వేమన, నారాయణ గురు వంటి యోగులు, జ్ఞానులు బోధనలను విస్తృతంగా ప్రచారం చేస్తుంది. కేవలం మాటలకు పరిమితం కాకుండా ఆచరణాత్మక, నిర్మాణాత్మక లక్ష్యాలతో ఈ సంఘం పనిచేస్తుంది. అన్ని రకాల సాంఘిక అసమానతలూ, వివక్షలూ తొలగిపోవాలన్న మహదాశయంతో జీవితకాలమంతా కృషిసల్పిన త్యాగధనుల ఆశయాల సాధన కోసం పాటుపడుతుంది. 'మానవ సేవే మాధవసేవ' అన్న పూజ్య బాపూజీ, మథర్ థెరిసాల సేవా మార్గంలో తన ఆచరణను మలుచుకోవడానికి భారతీయ సమధర్మ ప్రచార పరిషత్ కృషి చేస్తుంది.





# సనాతన సమధర్మ పరిషత్ సంఘం అష్టాదశ కార్యక్రమం

1. ప్రపంచ నాగరికతలో చరిత్ర విశిష్ట స్థానమాక్రమించిన భారతీయ తాత్విక పరంపరనూ, నిజమైన ఆధ్యాత్మిక వారసత్వాన్ని చాటి చెప్పుట.
2. భారతీయ కళలు సంస్కృతి సంగీత సాహిత్యాలు శిల్ప చిత్రకళలు పురాణాలు ఇతిహాసాలలో ఇమిడి ఉన్న ఔన్నత్యాన్ని ప్రజలకు చేరువచేయుట.
3. సామాన్య ప్రజల భాషలో జానపద కళలు, తత్వాలు, భజనలు, కోలాటాలు వంటి వాటిని ప్రచారం చేసే బృందాలను ఏర్పాటు చేసి శిక్షణనిచ్చుట.
4. శీలవంతమైన అంత:కరణను పెంపొందించే ప్రవచనాలు, ధర్మ ప్రసంగాలు, పిల్లల పోటీల ఉత్సవాలు నిర్వహించుట.
5. స్వచ్ఛంద సంస్థలూ సేవా ట్రస్టులకు సహకరించుట. “మానవ సేవే మాధవ సేవ” అన్న స్ఫూర్తితో వాటి సహకారం తీసుకొని భక్తులకు యాత్రీకులకు అపన్నులకు సహాయం అందించుట.
6. విశ్వ వ్యాపితంగా వివిధ మతాల విశ్వాసాలలోని విశిష్టతలను ఆకళింపు చేసుకోవడంతో పాటు వాటి మధ్య ఆరోగ్యకరమైన ఆదానప్రదానాలు సమన్వయం పెంచే సంయుక్త కార్యక్రమాలు నిర్వహించుట.
7. కళాకారులను, కవి పండితులను ప్రోత్సహించుట.



8. భిన్న విశ్వాసాల మధ్య చర్చను ప్రోత్సహించడం ద్వారా సత్యాన్వేషణ జరుపుట.

9. ప్రాచీన గ్రంథాలు లేదా కొత్తగా వెలువడే ఉత్తమ రచనలు ప్రచురించుట.

10. పండుగలు, ఉత్సవాల సందర్భంలో భక్తులు సందర్శకులకు సేవ చేయుట.

11. పోతులూరి వీరబ్రహ్మం, అన్నమయ్య, త్యాగయ్య, కబీరు వంటి వారి బోధనలను కీర్తనలను ప్రచారం చేయుట.

12. బాలలు, స్త్రీలు, వృద్ధుల కోసం ప్రత్యేకంగా కృషి చేయుట.

13. మత సామరస్యం కోసం శాంతియుత కృషి చేయుట.

14. అందరి సహకారంతో సేవా కార్యక్రమాలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించుట.

15. ధర్మ ప్రచారం నిమిత్తం సంచారము, ఆలయములలో భజనలు, చర్చలు - సమావేశాలు, గ్రామాలు పట్టణాలలోనూ నగరాలలోనూ నివాస సముదాయాలలోనూ ఉమ్మడి కార్యక్రమాలు ఏర్పాటు చేయుట.

16. యువతలో విద్యార్థులలో శాంతి, సమానతా భావనలు వ్యాప్తికి విద్యాలయాలు, హాస్టళ్లు సందర్శించుట.

17. ప్రకృతి పర్యవరణ, జంతు సంపద పరిరక్షణ.

18. ప్రకృతి వైపరీత్యాలు, ఆపత్సమయంలో ఆదుకొనుట.



ఈ బృహదాశయాల సాధనలో మీరందరూ కలిసిరావాలని, వెన్నుదన్నుగా నిలిచి ప్రోత్సహించాలని సవినయంగా విజ్ఞప్తిచేస్తున్నాం.

| | | |
|---|---|---|
| సర్వేపి సుఖినస్సంతు | : | అందరూ సుఖంగా ఉండాలి |
| సర్వే సంతు నిరామయాః | : | అందరూ నిరామయులు కావాలి |
| సర్వే భద్రాణి పశ్యంతు | : | అందరూ శుభములనే చూడాలి |
| మా కశ్చిద ః కభాగ్భవేత్ | : | ఏ ఒక్కడూ దుఃఖితుడు కారాదు |

సమస్త సన్మంగళాని భవంతు

ఓ శాంతిః శాంతిః శాంతిః




సనాతన సమధర్మ ప్రచార పరిషత్ సంఘం

*డోర్ నెం : 41-28/8-85,*

రాణిగారితోట, కృష్ణలంక,

విజయవాడ,

ఫోన్ : 9989104273


విజయ శంకరస్వామి

# విషయాలు



## అధ్యాయాలు



మల్లాజోస్యుల అప్పారావు పంతులు గారు

# మా మాట

**మ**ల్లాజోస్యుల అప్పారావు పంతులు మా తాతగారు, మేమందరం ఆయన మనవలం, మనవరాళ్లం, మా అందరికీ చిన్నతనాల జ్ఞాపకాలలో మా తాతగారు విడదీయలేనంతగా అల్లుకుపోయారు. మా రైల్వే ఇంట్లో తాతగారికి ఒక గది ఉండేది. ఎప్పుడు ఆయనని చూసినా కళ్ళజోడు పెట్టుకుని దీక్షగా వ్రాస్తూ ఉండేవారు. ఆయన దస్తూరి ప్రత్యేకమైన అందం. రామాయణ, మహాభారతాలు, రాజగోపాలాచారి గారు ఆంగ్లంలో రాసినది తెలుగులో అనువాద రచనలు చేశారు. మా తాతగారు మేమందరం ఈ రెండు పుస్తకాలూ చదువుతూ పెద్దవారమైనాము. సుమధురమైన శైలి, కథనం, భాషమీద ఆయనకున్న పట్టు... ఇవన్నీ ఆ రచనలలో కనపడతాయి. కథ చదువుతూ ఉంటే రంగుల సినిమా వలె కళ్ళకు కట్టినట్లు అనిపించేది.

మనవలు/మనవరాళ్ళందరికీ ఆయన హితుడు, స్నేహితుడు, శ్రేయోభిలాషి, ఆప్తుడు, మాలో ఎవరికి ఏరకమైన కష్టం వచ్చినా, అవసరం కలిగినా, మేము మొదట పరుగెత్తేది తాతగారి దగ్గరకే. ప్రతీ సమస్యకీ ఆయన దగ్గర ఏదో ఒక సమాధానం ఉండేది. జీవిత పయనంలో ఒక్కొక్కరం ఇల్లు వదలి బయటకు వచ్చేటప్పుడు, అమ్మ, నాన్నలతో పాటుగా తాతగారిని వదిలి వెళ్ళడం ఒక నొప్పితో కూడిన అనుభవం. మా చిన్నతనంలో, తెల్లవారు ఝామున నిద్ర లేవడం నుంచీ, హోమ్‌వర్క్ చేయించడం, పద్యాలు, పాఠాలు వల్లె వేయించడం, రాని లెక్కలు, అర్థం కాని సోషల్ సైన్సు పాఠాలు, తెలుగు, హిందీ, ఇంగ్లీషు గ్రామరు – ఒకటేమిటి? ఆయనే ఒక స్కూలు.

మేము చాలా అదృష్టవంతులం.

ఆయన నేర్పిన వాల్మీకి రామాయణ శ్లోకాలు మా అన్నయ్యలు గడగడా రాగయుక్తంగా పాడుతుంటే అందరూ (రామలక్ష్మణులు) అని పొగిడేవారు. 'కుశలవులు'

మహాభారతం, రామాయణం వంటి మహాకావ్యాలు మనకు వారసత్వంగా వచ్చిన అమూల్యమైన సంపద. దైనందిన జీవన గమనంలో నిండా మునిగిపోయివుండే సామాన్యులకు జీవితం పట్ల కొంత విశాల దృక్పథాన్ని, విలువలను, ఆదర్శాలను కల్పించ గల గ్రంధాలు ఇవి. పురాణాలలో ఉన్నదంతా వాస్తవ చరిత్ర అని భ్రమించినా, లేక అవన్నీ పుక్కిటి పురాణాలని కొట్టిపారేసినా అవి మనం గతం నుండి నేర్చుకోవడానికి ఆటంక పరిచే దృష్టికోణాలే.

మా తాతగారు తెనిగించిన మహాభారతం మేమంతా చదివి ఆనందించాము, నేర్చుకున్నాము. ఇన్ని సంవత్సరాల తర్వాత, ఆయన మమ్మల్ని వదలి వెళ్ళిపోయిన 37 సంవత్సరాల తర్వాత, మా అందరికీ ఈ ఆలోచన వచ్చింది; ఈ రచనని ప్రజల వద్దకు తీసుకొని వెళ్ళాలి అని. అదే ఈ చిన్న ప్రయత్నం. అందరూ ఈ పుస్తకాన్ని చదవాలి మేము ఎంతగా ఆనందించామో అదే ఆనందం అందరికీ అందాలి.

ఆయన విరక్తుడై జీవించారు. భగవంతుడిలో ఐక్యం అయ్యే ఉంటారని మా నమ్మకం, మీరంతా ఆయన రచనను ప్రేమిస్తే, మా అందరికీ ఆనందం.

**మనవలు:**

- వెంకటరమణయ్య, అప్పారావు, కామేశ్వరశర్మ, సుబ్రహ్మణ్య శర్మ, కపర్దీ
- సత్య శ్రీనివాస్, వెంకట రమణమూర్తి
- శ్రీనివాస్
- లక్ష్మీనరసింహమూర్తి, సత్య ప్రసాద్

**మనవరాళ్ళు:**

- జగదాంబ(వినత), వెంకటరమణమ్మ
- ఉమ, రమణమ్మ, కామేశ్వరి
- రాజేశ్వరి, వీరకనకలక్ష్మి
- భారతి,సావిత్రి, కాసులాంబ

# మహాభారతం

## గణపతి ద్వారా మహాభారత రచన

**ప**రాశర మహర్షి కుమారుడే వ్యాసుడు. ఆయన వేదాలు రాశాడు. అందువల్ల 'వేద వ్యాసుడు' అంటారు. మహాభారతం కూడా ఆయనే రాశాడు. వ్యాసుడు సృష్టికర్త బ్రహ్మను ఊహించగా.. ఆయన ప్రత్యక్షమయ్యాడు. వ్యాసుడు బ్రహ్మకు సాష్టాంగదండ ప్రమాణం చేసి ఇలా అన్నాడు.

"స్వామీ నేకొక గొప్ప గ్రంథాన్ని ఊహించాను. నేనది చెప్తుండగా సమర్థవంతంగా రాయగలవారు ఎవరన్నదీ ఊహించలేకపోతున్నాను".

బ్రహ్మ.. వ్యాసుణ్ణి మెచ్చుకుంటూ.. "ఓ రుషోత్తమా, దాన్ని గణపతిని రాయమని కోరు" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

వ్యాసుడు.. గణపతిని మనస్సులో తలుచుకున్నాడు. మరుక్షణంలోనే వ్యాసుని ముందు గణపతి నిలిచాడు. గణపతిని యథోచితంగా గౌరవించాడు. తర్వాత, "ఓ గణపతి ప్రభూ.. నేను 'మహాభారతం' కథ చెప్తాను. దయుంచి మీరా కథను రాయాలని కోరుతున్నాను" అన్నాడు. గణపతి.. వ్యాసుడిని ఉద్దేశించి.. "బాగుంది. మీరు కోరిన ప్రకారమే రాస్తాను. కానీ, నేను రాయడం మొదలు పెట్టాక ఆగకుండా కొనసాగేలా చూడాలి. కనుక మీరు ఆపకుండా, తత్తరపాటు చెందకుండా కథ చెప్పాలి. ఆ ప్రకారమైతేనే నేను రాయడానికి ఒప్పుకుంటాను" అన్నాడు గణపతి.

అందుకు వ్యాసుడు అంగీకరించాడు. "నేను కూడా ఓ నిబంధన పెడుతున్నాను. నేను చెప్పే కథను అర్థం చేసుకున్న తర్వాతే మీరు రాయాలి" అన్నాడు వ్యాసుడు.

గణపతి చిరునవ్వుతో వ్యాసుని నిబంధనను ఒప్పుకున్నాడు.

ఇక వ్యాసుడు 'మహాభారతం' కథను చెప్పడం ప్రారంభించాడు. అప్పుడప్పుడు కొన్ని కఠినమైన ఘట్టాలను ఊహించి చెప్తున్నాడు. గణపతి దాని అర్థం తెలుసుకొని రాసే సమయంలోనే వ్యాసుడు ముందు చెప్పబోయే విషయాన్ని సిద్ధపరుచుకునేవాడు. ఇలా మహాభారత గ్రంథం బయటకు వచ్చింది.

ఆ కాలంలో ముద్రణా యంత్రాలు లేవు. జ్ఞాపకశక్తే ఓ పుస్తకం. విజ్ఞానవంతులు, మేధావులు తమ జ్ఞాపకశక్తిని ఉపయోగించి చెప్పే కథలే పుస్తకాలుగా భావించేవారు. వ్యాసుడు ఈ గ్రంథాన్ని తొలుత తమ కుమారుడు శ్రీశుకుడికి చెప్పాడు. తర్వాత చాలామంది శిష్యులకు చెప్పాడు.

ఈ మహాభారతం కథను నారదుడు దేవతలకూ, శ్రీశుకుడు.. గంధర్వులకూ, రాక్షసులకూ, యక్షులకూ చెప్పినట్లు తెలుస్తోంది. బహు జ్ఞానవంతుడూ, వ్యాసుడి శిష్యుడూ అయిన వైశంపాయనుడు ఈ కథను ప్రపంచానికి వెల్లడి చేశాడు. పరీక్షిత్తు మహారాజు కుమారుడు జనమేజయుడు ఓ గొప్ప యాగం చేయతలపెట్టి వైశంపాయనుడిని మహాభారత కథను చెప్పాలని కోరాడు. వైశంపాయనుడు అలాగే చేశాడు. ఇది విన్న సూతుడు నైమిశారణ్యంలోని శౌనకాది రుషులందరికీ వినిపించాడు.

సూతుడు.. శౌనకాది రుషులతో ఇలా అన్నాడు. "మనుషులకు ధర్మం, నీతి, మోక్షమార్గం కలిగించడానికి మార్గదర్శి వ్యాస మహర్షి రాసిన మహాభారతాన్ని నేను వినడం నా అదృష్టం. ఆ కథను నేను మీ అందరికీ వినిపిస్తాను.

ఈ మాట విన్న రుషులంతా కథ వినడానికి కుతూహలంగా సూతుడి చుట్టూ చేరారు. "జనమేజయుడు యజ్ఞం నిర్వహించిన కాలంలో వైశంపాయనుడు భారతం పురాణాన్ని, అందులోని ఇతిహాసాలను చెప్పినప్పుడు నేను విన్నాను. తర్వాత నేను తీర్థయాత్రలు చేసి పుణ్యక్షేత్రాలు సందర్శించాను. మహాభారత యుద్ధ స్థలం 'కురుక్షేత్రం'ను కూడా చూశాను. అవి పూర్తయిన తరువాత నేనిక్కడికి వచ్చాను" అని సూతుడు మహాభారతం కథను ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

◈

# మహా భారత కథా సంగ్రహం

**శ**ంతను చక్రవర్తి చనిపోయాక చిత్రాంగదుడు హస్తినాపురానికి రాజయ్యాడు. తర్వాత విచిత్రవీర్యుడు రాజయ్యాడు. విచిత్రవీర్యుడికి ఇద్దరు కుమారులు. ధృతరాష్ట్రుడు, పాండు. పెద్దవాడైన ధృతరాష్ట్రుడు పుట్టుకతోనే అంధుడు కావడం వల్ల తమ్ముడు పాండు సింహాసనం అధిష్టించాడు. పాండురాజు తన పరిపాలనా కాలంలో ఓ తప్పు చేసి ప్రాయశ్చిత్తం కోసం తన ఇద్దరి భార్యలతో కలిసి అడవులకు పోయాడు. అక్కడ చాలాకాలంపాటు జపం, తపం చేస్తూ కాలం గడిపాడు. వీరంతా అడవుల్లో ఉన్న కాలంలోనే పాండురాజు భార్యలైన కుంతి, మాద్రి ఐదుగురికి జన్మ ఇచ్చారు. వీరినే "పంచ పాండవులు" అని పిలిచేవారు. వీరి అరణ్యవాసంలోనే పాండురాజు మరణించాడు. పసివాళ్లయిన ఆ ఐదుగురినీ అడవుల్లోని మునులు పోషించారు. ఈ ఐదుగురిలో పెద్దవాడయిన యుధిష్టరుడికి పదహారు సంవత్సరాలు వచ్చాయి. అప్పుడు మునులు.. పాండవులను హస్తినాపురం తీసుకొని వెళ్లి భీష్మడికి అప్పగించారు.

స్వల్పకాలంలోనే పాండవులందరూ వేదవేదాంగాలు, ఇతర విద్యలు, కళల్లో ప్రావీణ్యం సంపాదించారు. రాజోచితమైన అన్ని విద్యల్లోనూ ప్రవీణులయ్యారు. అంధుడైన ద్రుతరాష్ట్రుడి కుమారులైన కౌరవులకు పాండవుల పట్ల అసూయ, ఓర్వలేనితనం ఏర్పడ్డాయి. అందువల్ల కౌరవులు పాండవులను అనేకవిధాలుగా హింసించే ప్రయత్నం చేశారు. పెద్దయిన భీష్ముడు మధ్యవర్తిగా కురుపాండవుల మధ్య స్పర్ధలేకుండా ఓ దారికి తెచ్చాడు. దీనిప్రకారం పాండవులు ఇంద్రప్రస్థం రాజధానిగా, కౌరవులు హస్తినాపురం రాజధానిగా చేసుకొని వారివారి రాజ్యాలను పాలించుకుంటున్నారు.

కొంతకాలం తరువాత అప్పటి క్షత్రియ నిబంధనలను అనుసరించి కౌరవులకూ, పాండవులకూ మధ్య పాచికల ఆట జరిగింది. కౌరవుల పక్షాన ఆడుతున్న శకుని జూదంలో పాండవ యుధిష్టరుడిని ఓడించాడు. ఈ ఓటమి కారణంగా పాచికల

ఆట షరతుల ప్రకారం పదమూడేళ్లపాటు పాండవులు దేశాన్ని వదిలిపెట్టి వెళ్లాల్సివచ్చింది. పన్నెండేళ్లపాటు వనవాసం, ఏడాదిపాటు అజ్ఞాతవాసం చేయాల్సి వచ్చింది. ఇది పూర్తి చేసుకుని బయటకు వచ్చిన పాండవులు మళ్లీ వచ్చి తమ రాజ్యభాగం తమకివ్వాలని దుర్యోధనుణ్ణి కోరారు. దుర్యోధనుడు ఇదివరికే పాండవుల రాజ్యం ఆక్రమించడంతో తాను ఇవ్వబోనని పాండవులకు తేల్చి చెప్పాడు. దీంతో కురుపాండవుల మధ్య యుద్ధం జరిగింది. పాండవులు దుర్యోధనుణ్ణి ఓడించి తమ తండ్రి నెలకొల్పిన రాజ్యాన్ని తిరిగి పొందారు.

పాండవులు రాజ్యాన్ని 36 సంవత్సరాలు పాలించారు. తరువాత వారి మనుమడు పరీక్షిత్తుడికి రాజ్యం ఇచ్చేసి నార దుస్తులు ధరించి భార్య ద్రౌపదితో అరణ్యాలకు వెళ్లిపోయారు. ఇదే మహాభారతం కథ. పురాతన, అద్భుత ఇతిహాసాలతో, ధర్మమార్గ ఉపదేశ కథలుగా పాండవుల జీవితంలోని హెచ్చుతగ్గులు వివరించబడ్డాయి. మహాభారతం నిశ్చయంగా లెక్కించ వీలులేని ముత్యాలు, మణులు వంటి మహా సముద్రం వంటిది. ఈ మహాభారతం, రామాయణం, కలసి మన మాతృభూమికి నిరంతరం జలం ఇచ్చే యంత్రంలా ధర్మబోధక అంశాలు, జ్ఞాన వృద్ధిని కలుగజేసే అంశాలు మనకు అందిస్తున్నాయి.

◈

తన కుమారుడు దేవవ్రతుణ్ణి
(భీష్ముని) తండ్రి శంతనునికి
అప్పగిస్తున్న గంగ



## అధ్యాయం- 1

# దేవవ్రతుడు

'నీవెవరివైనా నాకు భార్యవు కాక తప్పదు"

గంగాదేవి మానవ శరీరం ధరించి అపరూప లావణ్యంతో ఎదుట నిలబడి ఉండగా, ఆమెను చూసి అనురాగ పరవశుడై ఆమెతో శంతను చక్రవర్తి పలికిన పలుకులవి. శంతను చక్రవర్తి ఆమె మీద ప్రేమతో తన రాజ్యాన్ని, ధనాన్ని, తన సర్వస్వాన్ని, ఆఖరికి తన ప్రాణాన్ని కూడా ఆమెకు సమర్పించడానికి సిద్ధపడ్డాడు.

"ఓ రాజా, నేను నీకు భార్యను అవుతాను. దానికి కొన్ని నియమాలు ఉన్నాయి. నేనెవరినో, ఎక్కణ్ణుంచి వచ్చానో, నువ్వుగాని, మరెవ్వరైనాగాని నన్ను ప్రశ్నించకూడదు. మంచి, చెడు ఏది చేసినా నీవు నాకు అడ్డు రాకూడదు. ఏ సమయంలోనూ నాపై కోపం రాకూడదు. నాకు అయిష్టమైనదేదీ నీవు మాట్లాడకూడదు. ఈ నియమాలను తప్పితే తక్షణమే నిన్ను విడిచి వెళ్లిపోతాను. నీకిది ఇష్టమేనా?" అడిగింది గంగాదేవి.

ఆమె పట్ల అనురాగపూరితుడైన శంతనుడు ఆమె నియమాలకు అంగీకారం

తెలిపాడు. గంగాదేవి శంతనుడికి భార్య అయ్యింది.

ఆమె ఔదార్యం, నడవడి, తన పట్ల ఉన్న అతిప్రేమ వల్ల శంతనుడి హృదయంలో గంగాదేవికి గాఢమైన స్థానం ఏర్పడింది. ఇద్దరూ అత్యంత ప్రేమతో కాలం తెలియకుండా జీవిస్తున్నారు. వారికి చాలా మంది పిల్లలు జన్మించారు. పుట్టిన వెంటనే ప్రతి శిశువునూ గంగాదేవి నదిలో పడేస్తోంది. తిరిగి శంతనుడి వద్దకు నవ్వు ముఖంతో వస్తోంది. ఆమె చర్య శంతనుడికి రాక్షసమైనదిగా అనిపించినా తన హృదయ వేదనను అణచుకొని అంతకుముందు ఆమెకిచ్చిన వాగ్దానాన్ని పాటిస్తున్నాడు. మౌనం వహిస్తున్నాడు. ఆమె ఎవ్వరో, ఎక్కణ్ణుంచి వచ్చిందో, పిల్లలను గంగానదిలో ఎందుకు పడేస్తోందో శంతనుడు తనలో తనే ఆశ్చర్యంతో ప్రశ్నించుకుంటున్నాడు. ఆమెతో వివాహ సమయంలో తానిచ్చిన వాగ్దానం మేరకు ఆమెను నిందించడానికిగాని, బతిమిలాడటానికిగాని సాహసించలేదు.

ఇలా ఆమె ఏడుగురు పిల్లలను గంగానదిలో పారవేసింది. ఎనిమిదో శిశువు జన్మించగానే నదిలో పడవేయబోయే ప్రయత్నం చేయబోగా.. శంతనుడు తన మనస్సును ఆపుకోలేకపోయాడు. "ఆగు.. ఆ అమాయక పసికందులను చంపడం ప్రకృతి వ్యతిరేక ఘాతుక చర్య. నీకెందుకీ ఈ పట్టుదల." అని శంతనుడు ఆమెను వారించాడు.

"ఓ చక్రవర్తీ.. నీవు నాకు ఇచ్చిన వాగ్దానాన్ని మరిచిపోయావు. నీ మనస్సు పిల్లలపై లగ్నమై ఉంది. ఇంకా నేను నీకేమి అవసరం. నేను వెళ్తున్నాను. నేను ఈ శిశువును చంపను. కానీ నీవు నా సుగుణ దుర్గుణాలను ఎంచకముందు నేను చెప్పే కథను విను.

"దేవతలతోనూ, మానవులతోనూ పూజింపబడే గంగను నేను. వశిష్టుడి శాప కారణంగా మనిషి రూపంలో ఇలాంటి ఘాతుక కృత్యాలను చేయాల్సి వచ్చింది. వశిష్టుడు.. ఎనిమిది మంది పిల్లలను మానవగర్భం నుంచి జన్మించాలని శాపం పెట్టాడు. ఆ విధంగా నీవల్ల నేనా పిల్లలకు తల్లినయ్యాను. ఎనిమిది మంది పిల్లల జన్మకు కారకుడవైనందుకు నీకు స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. నేను నీ కనిష్ట కుమారుడిని కొంతకాలం పెంచి పెద్దచేసి అతణ్ణి నా ప్రసాదంగా నీకిస్తాను" అని చెప్పి శిశువుసహా గంగాదేవి అదృశ్యమైంది. కాలక్రమంలో "భీష్ముడు" పేరుతో పిలిచే మహనీయుడే ఆ శిశువు.



ప్రతిజ్ఞ చేస్తున్న భీష్ముడు

## అధ్యాయం - 2

# భీష్మ ప్రతిజ్ఞ

**శ**ంతనుడు మహా తేజశాలి అయిన యువకుడు దేవవ్రతుణ్ణి తన హృదయానికి హత్తుకున్నాడు. తరువాత అతణ్ణి యువరాజుగా నియమించి కిరీటాన్ని పెట్టాడు.

ఇలా నాలుగేళ్లు గడిచాయి. ఓ రోజు శంతనుడు యమునా నది ఒడ్డున విహరిస్తున్నాడు. ఆ సమయంలో గాలి ఎంతో పరిమళభరితంగా, శరీరానికి హాయి కలిగిస్తోంది. ఈ పరిమళానికి కారణం ఏమై ఉంటుందా అని చుట్టూ చూశాడు. ఆ సువాసన ఓ అందమైన దేవకన్య లాంటి యవ్వన స్త్రీ నుంచి వస్తోందని కనుక్కున్నాడు. ఆమె శరీరం నుంచి సుగంధ పరిమళం వీచేటట్లుగా ఓ మునీశ్వరుడు ఆమెకు వరమిచ్చాడు. ఆ పరిమళ వాయువులే శంతనుడి శరీరాన్ని తాకాయి. ముక్కుపుటాలను సోకాయి.

గంగాదేవి తనను విడిచిపెట్టిన దగ్గర్నుంచి తన ఇంద్రియ ప్రవృత్తులను శంతనుడు స్వాధీనంలో ఉంచుకున్నాడు. ఆ పరిమళభరిత యవ్వన కన్యను చూసిన దగ్గర్నుంచి అతడి ఇంద్రియ ప్రవృత్తులు కట్టలు తెగాయి. ఆమెను పొందాలనే వాంఛ

ఆయనలో ఏర్పడింది. ఆమెను తన భార్యగా రావాలని కోరాడు. అందుకామె, "నేనో జాలరి యువతిని. ఈ గ్రామ పెద్దే నా తండ్రి. దయచేసి తమరు ఈ వివాహ విషయం నా తండ్రి గారి వద్ద ప్రస్తావించండి. ఆయన అనుమతి తీసుకోండి" అన్నది.

ఆ మాటలు శంతనుడికి ఎంతో మాధుర్యంగా అనిపించాయి. ఆమె తండ్రి దాశరాజు మంచి బుద్ధి కలవాడు. అతడు శంతనుణ్ణి ఉద్దేశించి, "ఈ వయసులో ఉన్న ఇతర కన్యల మాదిరిగానే నా కుమార్తెను కూడా ఎవరికైనా ఇచ్చి వివాహం చేయడంలో సంశయం లేదు. మీ వంటి ప్రభువు ఆమెకు తగినవారు. అయినా తమరు ఆమెను వివాహమాడటానికి ముందు నాకొక వాగ్దానం చేయాలి" అన్నాడు.

దానికి శంతనుడు, "కేవలం వాగ్దానమే అయితే చేస్తాను" అన్నాడు.

యువతి తండ్రి, "నా కుమార్తెకూ మీకూ కలిగే కుమారుడే మీ తరువాత రాజ్యాన్ని పాలించాలి" అనే వాగ్దానం చేయాలని కోరాడు. అయితే శంతనుడు ఆ వాగ్దానం చేయలేకపోయాడు. ఎందువల్లనంటే.. ఆ విధంగా వాగ్దానం ఇవ్వడం అనేది, యువరాజై ఉండి రాజు కాబోయే దైవాంశ సంభూతుడైన దేవవ్రతుని, గంగాపుత్రుని వెనుకకు నెట్టినట్లు ఉంటుంది. ఈ మూల్యం చెల్లించి యువతిని వివాహమాడటం సిగ్గుచేటు. తక్షణమే అతడు తాను కోరినది నెరవేరలేదనే విచారంతో హస్తినాపురానికి తిరిగి వచ్చాడు. ఈ విషయం ఇతరులకు తెలియకుండా తనలో తనే మధన పడుతున్నాడు.

ఓ రోజున దేవవ్రతుడు తండ్రి శంతనుడిని ఉద్దేశించి.. "తండ్రీ, మీకు కావలసినవన్నీ ఉన్నాయి. ఎందుకు మీరు విచారంగా, అస్వస్థులైనట్లు ఉన్నారు. మీరు ఏదో ఓ రహస్య అంశం గురించి మధన పడుతున్నట్లు అనిపిస్తోంది" అన్నాడు.

"నాయనా.. నీవన్నది నిజం. ఎంతో హృదయభారంతో, ఆందోళనతో ఉన్నాను. నువ్వు నాకు ఏకైక కుమారుడివి. నువ్వెప్పుడూ యుద్ధ సంబంధ కార్యాల్లోనూ, శత్రురాజులను జయించడంలోనూ మునిగి ఉంటావు. ఈ ప్రపంచంలో జీవితం బుద్బుదప్రాయం వంటిది. యుద్ధాలు నిరంతరం ఉండేవే. ఏదైనా జరగరాని హాని నీకు జరిగితే మన వంశం అంతరించిపోతుంది. నీవు నూరుగురు కుమారులకు సమానం. జ్ఞానులు, వేదవేత్తలు ఏమంటారంటే.. క్షణ భంగురమైన ఈ ప్రపంచ సృష్టిలో ఏకైక కుమారుడిని కలిగి ఉండటం, అతడు లేనట్లుగానే తలంచాలి. వంశ సంతతి నిలపడానికి ఒక్క ప్రాణిపై ఆధారపడటం సరికాదు. అదీగాక, మన వంశ వృద్ధి చేయాలనే కోరిక కలిగింది. ఇదే నా విచారానికి కారణం" అని శంతనుడు చెప్పాడు. వాస్తవంగా జరిగిన కథను చెప్పడానికి సిగ్గుపడి శంతనుడు డొంక తిరుగుడుగా కుమారుడికి చెప్పాడు.

బుద్ధిశాలియైన దేవవ్రతుడు తండ్రి మనోవేదనకు ఏదైనా రహస్య కారణముంటుందని ఊహించాడు. తన తండ్రి ఇలా ఉండటానికి కారణమేమై ఉంటుందని రథ సారధిని ప్రశ్నించాడు. అతడు.. యమునా నద్ది ఒడ్డున ఓ జాలరి కుమార్తెను చూసినట్లు చెప్పాడు. దేవవ్రతుడు జాలరి పెద్ద వద్దకు వెళ్లి ఆయన కుమార్తెను తన తండ్రి శంతనుడికి ఇచ్చి వివాహం చేయవలసిందిగా కోరాడు. జాలరి పెద్ద కూడా చాలా మర్యాదస్తుడే.

అతడు దేవవ్రతుడితో ఇలా అన్నాడు. "నా కుమార్తె నిశ్చయంగా రాజుకు భార్య కాదగినదే. అప్పుడామె కుమారుడు రాజు కావద్దా?. మీరేమో యువరాజుగా ఉన్నారు. మీ తండ్రి తరువాత మీరే రాజు అవుతారు. ఈ అంశమే మా కుమార్తెతో మీ తండ్రి గారి వివాహానికి అడ్డుగా ఉంది" అని అన్నాడు.

దేవవ్రతుడు జాలరి పెద్దతో.. "నేను చెప్పేది వినండి. ఇదే నా వాగ్దానం. నీ కుమార్తెకు జన్మించిన కుమారుడే రాజవుతాడు. ఇది నిశ్చయం. అలాంటి కుమారుడి కోసం నాకున్న యువరాజ్యాధికారమూ, తరువాత లభించే రాజు అధికారమూ వదిలివేస్తున్నాను" అని దేవుని సాక్షిగా ప్రమాణం చేశాడు.

జాలరి పెద్ద.. దేవవ్రతుణ్ణి ఉద్దేశించి... "ఓ భారత వీర శ్రేష్ఠుడా.. ఇప్పటివరకూ ఏ క్షత్రియ వంశస్తుడూ చేయని కార్యం నీవు చేశావు. నిశ్చయంగా మీరు మహావీరులు. నా కుమార్తెను మీ తండ్రి గారి వద్దకు తీసుకువెళ్లండి. యువతి తండ్రిగా నేను చెప్పే ఈ మాటలను శ్రద్ధగా వినండి. మీరు సత్యవాక్కు కలవారు. ప్రతిజ్ఞను నిలుపుతారని నాకు తెలుసు. కానీ మీ కుమారులు న్యాయంగా వారికి చెందవలసిన రాజ్యం గురించి ఊరుకుంటారా?. మీ కుమారులు కూడా మీ వలేనే గొప్ప వీరులవుతారు. వారే రాజ్యం ఉంచుకునే ప్రయత్నం చేస్తే వారిని అడ్డుకునేదెవరు?. ఈ అంశమే నన్ను బాధిస్తోంది" అన్నాడు.

జాలరి పెద్ద మాటల్లో ఇమిడి ఉన్న కఠిన సమస్యను అవగాహన చేసుకున్నాడు దేవవ్రతుడు. అయినా, తండ్రి అభిమతాన్ని గౌరవించదలచి.. జాలరి పెద్దతో ఇలా అన్నాడు. "ఇదే నా కఠిన ప్రమాణం. నేనసలు వివాహమే చేసుకోను. నిరంతర బ్రహ్మచర్యానికే నా జీవితాన్ని ధారపోస్తాను" అంటూ రెండు చేతులు పైకి జోడించి చెప్పాడు. వైరాగ్య పూరిత ప్రమాణం చేశాడు దేవవ్రతుడు. దేవతలు దేవవ్రతుడిపై పుష్ప వర్షం కురిపిస్తూ.. "భీష్మ.. భీష్మ.." అని పలికారు. "భీష్మ" అంటే ఓ కఠిన ప్రతిజ్ఞ చేసి, దాన్ని తు.చ. తప్పకుండా అమలు చేసేవాడు అని అర్థం. "భీష్మ" అనే పేరు ఆ క్షణం నుంచి దేవవ్రతుడికి సార్థక నామం అయ్యింది.

తరువాత భీష్ముడు.. జాలరి పెద్ద కుమార్తె సత్యవతిని తోడ్కొని తన తండ్రి

శంతనుడికి అప్పగించాడు. శంతనుడికి సత్యవతి వల్ల ఇద్దరు కుమారులు జన్మించారు. వారే 'చిత్రాంగదుడు', 'విచిత్రవీర్యుడు'. వీరిద్దరూ ఒకరి తరువాత మరొకరు రాజ్యాన్ని పాలించారు. విచిత్రవీర్యునికి ఇద్దరు కుమారులు కలిగారు. ఒకరు ధృతరాష్ట్రుడు, మరొకరు పాండు. విచిత్రవీర్యుని ప్రథమ భార్య అయిన అంబికకు ధృతరాష్ట్రుడు జన్మించాడు. రెండో భార్య అంబాలికకు పాండు పుట్టాడు. ధృతరాష్ట్రుడికి నూరుగురు కమారులు కలిగారు. వీరిని 'కౌరవులు' అన్నారు. పాండుకు ఐదుగురు కుమారులు కలిగారు. వీరు 'పాండవులు' అనే ఖ్యాతి గడించారు.

భీష్ముడు తమ వర్గం వారందరితోనూ గొప్ప గౌరవాన్ని పొందుతూ.. చాలా కాలం జీవించాడు. అతడు కురుక్షేత్ర మహాయుద్ధం అంతం వరకూ జీవించాడు.

వంశవృక్షం

శంతనుడికి గంగాదేవి వల్ల భీష్ముడు,
సత్యవతి వల్ల చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు జన్మించారు.
విచిత్రవీర్యుడికి అంబిక వల్ల ధృతరాష్ట్రుడు జన్మించాడు.
ధృతరాష్ట్రుడికి కౌరవులు జన్మించారు.
విచిత్రవీర్యుడికి అంబాలిక వల్ల పాండు జన్మించాడు
పాండుకు పాండవులు జన్మించారు.



అంబ, అంబిక, అంబాలికలను
అపహరిస్తున్న భీష్ముడు

అధ్యాయం - 3

# అంబ - భీష్ముడు

సత్యవతి కుమారుడైన చిత్రాంగదుడు ఒక గంధర్వుడితో యుద్ధం చేసి మరణించాడు. అతనికి సంతానం లేదు. అందువల్ల అతని తమ్ముడైన విచిత్రవీర్యుడు రాజయ్యాడు. విచిత్రవీర్యుడు పిన్న వయసువాడు అవడం వల్ల అతని స్థానంలో భీష్ముడు రాజ్య పాలన చేస్తున్నాడు.

విచిత్రవీర్యుడు యుక్త వయస్కుడయ్యాక అతడికి వివాహం చేయడానికి తగిన యువతిని అన్వేషించేందుకు భీష్ముడు బయలు దేరాడు. అప్పటిలో కాశీరాజు ముగ్గురు కుమార్తెలు పురాతన క్షత్రియ లాంఛన ప్రకారం స్వయంవరం పేరుతో వరుడిని ఎన్నుకొనేవారని విని భీష్ముడు.. తన తమ్మునికి భార్యలను సంపాదించడానికి అక్కడికి వెళ్లాడు. కోసల, వంగ, పుండ్ర, కళింగ మొదలైన దేశ రాజులు, రాకుమారులు, ఇతర దేశ ప్రధానులు స్వయంవర సభకు వచ్చారు. వారంతా వారి వారికి తగిన క్షత్రియ అలంకారాలతోనూ, దుస్తులతోనూ సభలో ఉన్నారు. కాశి రాజు కుమార్తెలు

ఎంతో అందమైనవారు. గొప్ప విద్యావంతులు, దేశవిదేశాల్లో ఖ్యాతి గడించినవారు కావడంతో రాజకుమారుల మధ్య పోటీ కోలాహలంగా ఉంది.

క్షత్రియుల్లో భీష్ముడు అత్యుత్తముడు, శ్రేష్టుడు అనే పేరు పొందాడు. మొదట్లో రాజులంతా భీష్ముని రాకకు కారణం స్వయంవరోత్సవాన్ని చూడటానికే అనుకున్నారు. కానీ తాను కూడా ఓ భార్య కోసమే వచ్చాడని తెలుసుకొన్న తరువాత అక్కడి రాజకుమారులందరికీ ధైర్యం సన్నగిల్లింది. వారందరికీ కోపం వచ్చింది. వాస్తవంగా భీష్ముడు తన తమ్ముడి కోసం వధువును అన్వేషించేందుకు వచ్చాడని రాజకుమారులకు తెలియదు. దీంతో భీష్ముడిపై అసూయను పెంచుకున్నారు. ఆయన పట్ల వారు నిందాపూర్వకంగా కూడా మాట్లాడుకుంటున్నారు. "భరతాన్వయాన జన్మించిన ఈ జ్ఞాని ఉత్తమ క్షత్రియుడు. తాను ముసలివాడని ఎరుగడు కాబోలు. తన బ్రహ్మచర్య దీక్షను కూడా మర్చిపోయాడు కాబోలు. ఈ ముసలివాడికి ఈ స్వయంవరంతో సంబంధమేమిటి?. ఛీ.ఛీ." వరులను ఎన్నుకోవడానికి సభలోకి వచ్చిన కాశీరాజు కుమార్తెలు ముగ్గురూ భీష్ముడివైపు కన్నెత్తి కూడా చూడలేదు. మరోవైపునకు మొహం పెట్టారు.

భీష్ముడికి తీవ్ర ఆగ్రహం వచ్చింది. స్వయంవరానికి వచ్చిన రాజకుమారులను తనతో పోరాడి వీరత్వం చూపాలని అరుస్తూ వారందరినీ వరుసబెట్టి ఓడించాడు. ఆ ముగ్గురు యువతులను తన రథముపైన హస్తినాపురం తీసుకువెళ్తున్నాడు. కొంతదూరం వెళ్లాక ఆ ముగ్గురు యువతుల్లో 'అంబ' అనే ఆమెను ప్రేమించిన సౌబల దేశపు రాజు సాల్వుడు భీష్ముడికి అడ్డుపడ్డాడు. యుద్ధానికి దిగాడు. అంబ కూడా సాల్వుడిని ప్రేమించింది. యుద్ధంలో భీష్ముడి చేతిలో సాల్వుడు ఓడిపోయాడు. భీష్ముడు గురితప్పని విలుకాడు. రథంలో ఉన్న అంబ భీష్ముడిని వేడుకోగా సాల్వుడిని చంపకుండా వదిలేశాడు.

భీష్ముడు హస్తినాపురం చేరాడు. విచిత్రవీర్యునికి వివాహ ప్రయత్నంలో ఉన్నాడు. వివాహానికి ప్రముఖులందరూ వచ్చారు. అంబ భీష్ముడిని అపహాస్యం చేస్తూ.. "ఓ గంగా పుత్రా.. శాస్త్రాలు చదివావు. ధర్మాలన్నీ నీకు తెలుసు. నేను మానసికంగా సౌబల రాజు సాల్వుడిని పతిగా ఇదివరకే వరించాను. నీవు నన్ను ఇక్కడికి బలవంతంగా తీసుకువచ్చావు. ఈ అంశాలను తెలుసుకొని శాస్త్ర, ధర్మాలను అనుసరించి ఏమి చేయాలో అదే చేయి" అన్నది

ఆమె మాటల తీవ్రత ఆలోచించిన భీష్ముడు, ఆమెను ఉచిత సాయంతో సాల్వుడి వద్దకు పంపాడు. మిగతా ఇద్దరు యువతులు 'అంబిక', 'అంబాలిక'తో

విచిత్రవీర్యునికి వివాహం సానుకూలంగా జరిగింది. అంబ అవధుల్లేని సంతోషంతో సాల్వుడి వద్దకు చేరి జరిగిన కథంతా పూసగుచ్చినట్లు అతడికి చెప్పింది. అలాగే "నేను మొదటి నుంచీ నిన్నే పతిగా వరించాను. భీష్ముడు నన్ను నీ వద్దకు పంపాడు. శాస్త్రోక్తంగా నీవు నన్ను వివాహమాడాలి" అన్నది.

"భీష్ముడు అందరి మధ్యా నన్ను ఓడించి నిన్ను తీసుకొని పోయాడు. అలా నాకు అవమానం జరిగింది. కనుక నేను ఇప్పుడు నిన్ను భార్యగా స్వీకరించబోను. భీష్ముడి వద్దకే వెళ్లు. సాల్వుడు ఆయన ఎలా చెపితే అలాగే చేయి" అంటూ అంబను భీష్ముడి వద్దకే పంపేశాడు. అంబ.. భీష్ముడి వద్దకు వెళ్లి జరిగినదంతా చెప్పింది. భీష్ముడు విచిత్రవీర్యుడి వద్దకు వెళ్లి అంబను పెళ్లాడవలసిందిగా కోరాడు. ఎప్పుడో తన హృదయాన్ని ఇతరులకు ఇచ్చిన యువతిని తానెంత మాత్రమూ వివాహమాడబోనని విచిత్రవీర్యుడు చెప్పాడు. చివరికి అంబ భీష్ముడినే తనను వివాహమాడాల్సిందిగా కోరింది. ఆ పరిస్థితుల్లో ఆమెకు మరో మార్గం కనిపించలేదు. అంబ పట్ల భీష్ముడికి ఎంతో సానుభూతి, దయ కలిగాయి. అయినా తన బ్రహ్మచర్య ప్రతిజ్ఞకు భంగం కలిగించలేకపోయాడు. మళ్లీ విచిత్రవీర్యుడి వద్దకే వెళ్లి అంబను పెళ్లి చేసుకోవాల్సిందిగా కోరాడు. అది నిష్ఫలమైంది. చేసేది లేక మరలా ఆమెను సాల్వుడి వద్దకే వెళ్లి వేడుకోవాలని సూచించాడు. మళ్లీ సాల్వుడి వద్దకు వెళ్లడం సిగ్గుచేటని భావించిన అంబ.. హస్తినాపురంలోనే చాలా సంవత్సరాలు ఉండిపోయింది. ఈ కాలంలో చాలా చిక్కిపోయింది. మరోసారి సాల్వుడి వద్దకు వెళ్లి తనను వివాహం చేసుకోవాలని కోరింది. సాల్వుడు మళ్లీ నిరాకరించాడు. అంబకు ఆశాభంగమైంది. తీవ్రంగా కృశించి పోయింది. ఇలా ఆరేళ్లు గడిచాయి. ఎంతో అందం. మాధుర్యం, సౌమనస్యం ఉన్న అంబ తన జీవితాన్ని నాశనం చేసిన భీష్ముడిపై తీవ్ర ద్వేషాన్ని పెంచుకుంది. దేశంలోని ప్రతి ఒక్క రాజునూ కలిసి తనకు జరిగిన అన్యాయం తెలిపి.. యుద్ధంలో భీష్ముడిని ఓడించి తనకు జరిగిన పరాభవానికి ప్రతికారం తీర్చాలని కోరింది. మహావీరులు సైతం భీష్ముడి పేరు వినగానే భయపడ్డారు. అంబకు ఎవరూ సాయపడలేదు. చివరికామె ఘోరమైన తపస్సు మొదలు పెట్టింది. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని వేడుకొంది. స్వామి ప్రత్యక్షమై ఎప్పటికీ వాడని 'పద్మపూలమాల' ఇచ్చి .. "ఈ దండ ఎవరు ధరిస్తారో వారు భీష్ముడికి శత్రువు అవుతాడు" అని అంతర్ధానం అవుతాడు.

అంబ ఆ పూల దండను తీసుకొని మరలా ప్రతి రాజకుమారుడి వద్దకూ వెళ్లి, ఆ మాల సుబ్రహ్మణ్యస్వామి ప్రసాదించిందనీ, దానినెవరైనా ధరించి యుద్ధంలో

భీష్ముడిని చంపి తన వేదనను పోగొట్టాలనీ కోరింది. కానీ గతంలో వలెనే ఏ రాజూ భీష్ముడితో తగవు ఇష్టపడలేదు. ఆమెను పంపేశారు. చివరికామె ద్రుపదరాజు వద్దకు వెళ్లింది. అతడూ భీష్ముడితో విరోధానికి ఒప్పుకోలేదు. ఇక ఆమె ఆ మాలను ద్రుపదుని కోట సింహద్వారానికి వేలాడదీసి అడవులకు వెళ్లిపోయింది. మార్గంలో కొందరు మునులను దర్శించి వారికి తన కథనంతా వివరించింది. అంబ చరిత్ర విని పరశు రాముడు దయతలిచి.. "బిడ్డా.. నీకేమి కావాలి?. నీకిష్టమైతే నిన్ను వివాహమాడ వలసిందిగా సాల్వుడితో చెపుతాను" అన్నాడు. అంబ.. "స్వామీ నాకా కోరిక లేదు. నాకు వివాహం, సంసారం, సౌఖ్యాలపై రోత పుట్టింది. నా జీవితంలో నాకు ఒక్కటే కోరిక మిగిలి ఉంది. భీష్ముడికి ప్రతి క్రియ చేయడమే నేను కోరుకునేది" అన్నది. పరశురాముడు.. ఆమె దీనావస్థను చూసి "భీష్మణ్ణి చంపడమే ఆమె లక్ష్యంగా ఉందని, క్షత్రియులతో తనకున్న వైరాన్ని దృష్టిలో పెట్టుకొని భీష్ముడితో యుద్ధానికి దిగాడు. ఆ యుద్ధం చాలా సంవత్సరాలు జరిగింది. గెలుపు ఓటమి లేక యుద్ధం కొనసాగుతూనే ఉంది. వారిద్దరూ సాటిలేని మేటి బిరుదులు పొందారు. చివరికి పరశురాముడు భీష్ముడి చేతిలో ఓడిపోక తప్పలేదు. పరశురాముడు అంబతో.. "నేను చేయగలిగిందంతా చేశాను. నేను ఓడిపోయాను. కనుక నీవు భీష్ముడినే శరణు కోరు. అదే నీకు నేను చేయగలిగిన సాయం" అన్నాడు. అంబకు విచారమూ, ఆగ్రహమూ కలిగాయి. కేవలం భీష్ముడిపై పగ సాధించాలన్న ఆమె కోరిక ఆమెను జీవింపచేస్తోంది. ఆమె హిమాలయ ప్రాంతానికి వెళ్లి పరమ శివుణ్ణి గురించి ఘోర తపస్సు చేసింది. శివుడు ఆమె ముందు ప్రత్యక్షమై 'తర్వాత జన్మలో ఆమె భీష్మణ్ణి చంపుతుంది' అని వరం ఇచ్చాడు.

తాను కోరిన ముఖ్య కోరిక అయిన భీష్మణ్ణి చంపడం, తర్వాత జన్మ వరకూ పొడిగింపబడటం, ఆలస్యమవడం ఆమెలో క్రోధాగ్నిని పెంచింది. అంబ అగ్నిని రాజేసి ఆ మంటల్లోకి ఉరికి మరణించింది. ఈశ్వరానుగ్రహం వల్ల ఆమె ద్రుపదుని కుమార్తెగా జన్మించింది. కొంతకాలం తరువాత తాను పూర్వ జన్మలో కోట గుమ్మానికి కట్టిన పద్మమాల అలాగే ఉండటం చూసింది. భీష్ముడి భయంతో దానిని ఇతరులెవరూ ధరించలేదని తానే మాలను మెడలో వేసుకుంది. ఆమె పుష్పమాలను ధరించి కోరి అపాయం తెచ్చుకుంటోందని, భీష్ముడి ఆగ్రహాన్ని తాను చవి చూడాల్సి వస్తుందని భయపడి కుమార్తెను ఆమె తండ్రి ద్రుపదుడు బహిష్కరించి అడవులకు పంపాడు. అంబ అడవిలో చేసిన తపస్సు ఫలితంగా 'శిఖండి' అనే నామంతో వీర పురుషుడైంది.

అర్జునుడు కురుక్షేత్ర యుద్ధంలో తన రథంలో శిఖండిని ముందుపెట్టి భీష్మణ్ణి

ఎదురించాడు. అంబ పుట్టుకతో స్త్రీ అని తెలిసిన వాడవడంతో భీష్ముడు యుద్ధ ధర్మం మేరకు శిఖండితో ఏ విధమైన యుద్ధమూ చేయకుండా ఊరుకున్నాడు. ఈ కారణం వల్లే ఆ యుద్ధంలో శిఖండిని పక్కనుంచుకొని యుద్ధం చేసి పాండవులు భీష్ముణ్ణి జయించారు. ఇదేగాక భీష్ముడు మహాజ్ఞాని అయినందున తానిక భూమిపై ఉండే కాలపరిమితి సమీపిస్తోందని తలిచి ఓటమికి సంసిద్ధుడయ్యాడు. అయితే ఈ యుద్ధంలో తన శరీరంలోకి లోతుగా దిగిన బాణాలు శిఖండి వేసినవి కాదని, అర్జునుడు వేసినవేనని భీష్ముడు గుర్తించాడు. యుద్ధభూమిలో భీష్ముడలా నేలకొరిగాడు.

◈



బావిలో నుండి దేవయానిని రక్షిస్తున్న యయాతి

## అధ్యాయం - 4

# దేవయాని - కచుడు

**పూ**ర్వం ముల్లోకాలపై ఆధిపత్యం కోసం దేవతలకూ, రాక్షసులకూ గొప్ప యుద్ధం జరిగింది. దేవతలకు వేదవేదాంగాలు చదివిన, మహాబుద్ధి కలిగిన బృహస్పతి గురువు. ఒక విధంగా చెప్పాలంటే దేవతలను తన ఆలోచనలకు అనుగుణంగా నడుపుతున్నాడు. అలాగే రాక్షసులు శుక్రాచార్యుడి బుద్ధి కుశలతపైన ఆధారపడేవారు. శుక్రాచార్యుడికి చనిపోయినవారిని బతికించగల ఓ విద్య (సంజీవని) ఉంది. అందువల్ల దేవతలకూ, రాక్షసులకూ మధ్య జరుగుతున్న యుద్ధంలో చనిపోయిన రాక్షసులు తిరిగి బతకడం, మళ్లీ యుద్ధంలో పాల్గొవడం జరిగేది. ఇలా జరగడం వల్ల ఆ యుద్ధం ఎంతకూ ముగిసేది కాదు. నిరవధికంగా జరుగుతూ ఉండేది. దేవతలకు ఇలాంటి సంజీవని లేనందువల్ల శత్రువులైన రాక్షసులతో ఎడతెగని యుద్ధం చేయాల్సి వస్తోంది. ఈ యుద్ధంలో చాలా మంది దేవతలు నష్టపోయారు కూడా. దేవతలు బృహస్పతి కుమారుడైన కచుడి వద్దకు వెళ్లి అతడి సహాయం కోరారు. ఎలాగైనా

సరే, రాక్షస గురువైన శుక్రాచార్యుడిని ఆశ్రయించి అతడి దయకు పాత్రుడై, ఆయనకు శిష్యుడవ్వాలని కచుణ్ణి వేడుకున్నారు. శుక్రాచార్యుడి వద్ద నమ్మకం గలిగిన శిష్యుడిలా వ్యవహరించి సంజీవని రహస్యాన్ని తెలుసుకొని దేవతలకు మహోపకారం చేయాలని రాక్షసులు కచుణ్ణి కోరారు. కచుడు దీనికి అంగీకరించాడు. రాక్షసరాజైన శుక్రాచార్యుడిని దర్శించుకోవడానికి అతడి పట్టణానికి వెళ్లాడు. శుక్రాచార్యుడి ఇంటికి వెళ్లిన కచుడు ఆయనకు నమస్కరించి.. "అయ్యా నా పేరు కచుడు. అంగీరస రుషి మనుమణ్ణి. బృహస్పతి కుమారుణ్ణి. మీ వద్ద విద్యనభ్యసించడం కోసం వచ్చిన బ్రహ్మచారిని (అప్పటికాలంలో తగిన శిష్యుడు కోరినప్పుడు బుద్ధిమంతుడైన గురువు ఆ శిష్యుడికి విద్య చెప్పాలనే న్యాయ సూత్రం ఉండేది) అన్నాడు. శుక్రాచార్యుడు అందుకు అంగీకరించి కచుడితో.. "నీవు మంచి కుటుంబానికి చెందినవాడవే. నిన్ను నా శిష్యుడిగా స్వీకరించాను. బృహస్పతి వారిపట్ల నాకున్న గౌరవ భావాన్ని కూడా ఈ విధంగా చూపుతున్నాను" అన్నాడు శుక్రాచార్యులు.

కచుడు.. శుక్రాచార్యుడికి శాస్త్రోక్తంగా శుశ్రూష చేస్తూ, ఎన్నో ఏళ్లుగా విద్యను అభ్యసిస్తున్నాడు. గురువుగారి గృహ సంబంధ కార్యాలు కూడా ఉచితంగానే నిర్వర్తిస్తున్నాడు. శుక్రాచార్యుడికి దేవయాని అనే కుమార్తె ఉంది. ఆమెపై తండ్రికి ఎనలేని ప్రేమ ఉంది. కచుడు తనకు వీలున్నప్పుడు దేవయానిని ఆటపాటలతో, సంభాషణలతో సంతోష పరుస్తూ ఆమె ప్రేమకు పాత్రుడయ్యాడు. అయితే కచుడు తన బ్రహ్మచర్య నియమాన్ని మీరలేదు. కచుడు.. శుక్రుడికి ప్రియ శిష్యుడు కావడమేగాక దేవయాని అభిమానాన్ని కూడా సంపాదించాడు. ఈ విషయం తెలుసుకొన్న రాక్షసులు అప్రమత్తమయ్యారు. వీడెలాగైనా శుక్రాచార్యుడి వద్దనున్న సంజీవని విద్య సంపాదిస్తాడేమోనని అనుమానించి అలాంటిది జరక్కుండా జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉన్నారు.

ఒకనాడు కచుడు తన గురువుగారి పశువులను మేపుతుండగా రాక్షసులు అతణ్ణి ముక్కలుముక్కలుగా నరికి వాటిని కుక్కలకు ఆహారంగా వేశారు. సాయంత్రం కేవలం పశువులే ఇంటికి తిరిగి వచ్చాయి. కచుడు రాకపోయిన విషయాన్ని గమనించిన దేవయాని ఆందోళన చెంది తండ్రి వద్దకు వెళ్లింది. "సూర్యాస్తమయం అయ్యింది. రాత్రి వ్రేల్చవలసిన తమ అగ్నిహోత్రాలు వ్రేలాయి. ఇంకా కచుడు ఇంటికి చేరలేదు. పశువులు మాత్రమే వచ్చాయి. కచుడికి ఏదైనా అపాయం సంభవించి ఉండొచ్చు. అతడు లేకుంటే నేను జీవించలేను" అని ఏడ్చింది. చనిపోయి మాంసం ముద్దలుగా మారి కుక్కలకు ఆహారమైన కచుణ్ణి.. శుక్రాచార్యుడు సంజీవని విద్యతో తిరిగి బతికించాడు. కచుడు నవ్వుతూ గురువుగారికి నమస్కరించాడు. "ఇంటికి

రావడం ఎందుకు ఆలస్యమైంది" అని దేవయాని అడిగింది. "తాను పశువులను మేపుతున్నప్పుడు రాక్షసులు వచ్చి నన్ను చంపేశారు. మళ్లీ ఎలా బతికానో తెలియదు" అని చెప్పాడు.

మరొకనాడు.. కచుడు దేవయాని కోసం పువ్వులను కోస్తుండగా రాక్షసులు అతడిపై పడి చంపేశారు. ఆ శరీరాన్ని ముద్దగా నూరి సముద్రంలో కలిపేశారు. ఎంతకాలమైనా కచుడు ఇంటికి రాకపోవడంతో దేవయాని ఆందోళన చెంది మళ్లీ తండ్రి వద్దకు వెళ్లి మొరపెట్టుకుంది. శుక్రాచార్యుడు తిరిగి సంజీవని విద్యతో కచుణ్ణి సజీవుణ్ణి చేశాడు. అతని నుంచి జరిగిన విషయాలన్నీ తెలుసుకున్నాడు.

మూడోసారి కూడా కచుణ్ణి రాక్షసులు చంపేశారు. ఈ సారి అతడి శరీరాన్ని దహనం చేసి ఆ బూడిదను సారాలో కలిపేసి తాగడానికి శుక్రాచార్యుడికి ఇచ్చారు. రాక్షసుల ఆచారం ప్రకారం సారాను గురువుగారికి ఎలాంటి అనుమానమూ రాకుండా అందజేసి తాగించారు. తాము ఎంతో తెలివిగా ప్రవర్తించామని రాక్షసులు సంతోషించారు.

పశువులు యథాప్రకారం కచుడు లేకుండానే ఇంటికి వచ్చాయి. మళ్లీ దేవయాని తండ్రి వద్దకు వెళ్లి కచుడు రాని విషయం చెప్పి ఆందోళన చెందింది. శుక్రుడు కుమార్తెను ఓదార్చాడు. "చనిపోయిన కచుణ్ణి నేను అనేకసార్లు బతికించాను. రాక్షసులు ఎలాగైనా కచుణ్ణి చంపి తీరాలని నిశ్చయించినట్లు కనిపిస్తోంది. మరణం అనేది ప్రతి జీవికీ సహజంగా సంభవించేదే. ఈ విషయంలో నీవంటి బుద్ధిమంతురాలు చింతించడం తగదు. నీకు అందం, యవ్వనం ఉన్నాయి. నువ్వు ప్రజల పట్ల అనురాగం కలిగి, నీ జీవితమంతా ఆనందంతో గడుపు. అంతేగాని విచారించొద్దు" అన్నాడు శుక్రాచార్యుడు.

దేవయాని కచుణ్ణి గాఢంగా ప్రేమించింది. తండ్రి చెప్పిన ధర్మ పన్నాలు ఆమె ప్రియ వియోగ బాధను తొలగించలేకపోయాయి. "కచుడు గుణవంతుడు. మనకు సేవలందించేందుకు ఎప్పుడూ అప్రమత్తంగా ఉండేవాడు. నేనతణ్ణి గాఢంగా ప్రేమించాను. అతణ్ణి చంపినందుకు నాకీ జీవితం భరింపలేనిదిగా మారింది. కాబట్టి నేను కూడా అతణ్ణి అనుసరిస్తాను" అని తండ్రితో చెప్పి నిరశన వ్రతం చేపట్టింది.

శుక్రాచార్యుడు తన కుమార్తె హృదయ విదారక స్థితి చూసి, రాక్షసుల వ్యవహారంపై తీవ్ర ఆగ్రహం చెందాడు. ఇలాంటి బ్రహ్మహత్య చేసిన రాక్షసుల జీవితం చెడిపోతుందని భావించాడు. సంజీవని విద్యనుపయోగించి కచుణ్ణి ఆహూయము చేశాడు. అయితే కచుడి శరీర బూడిద సారాతో కలపబడి శుక్రాచార్యుడి ఉదరంలో ఉండటంతో దానిలోనుంచి బయటకు వచ్చేందుకు వీలు లేకపోయింది. ఈ విషయమే

కచుడు ఉదరం నుంచి ధ్వని ద్వారా గురువుగారికి తెలిపాడు. శుక్రుడిలో తీవ్ర ఆగ్రహం పెల్లుబికింది. "ఓయీ కచుడా, నాలోకి నీవెలా వచ్చావు?. ఈ పని కూడా రాక్షసులే చేశారా?. ఈ వ్యవహారాలు చాలా చెడుగా ఉన్నాయి. జరిగిన విషయమంతా చెప్పు" అని అడిగాడు. జరిగిన విషయమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు కచుడు గురువుగారి ఉదరం నుంచి. మహానుభావుడు, తపస్వి, జ్ఞాని అయిన శుక్రాచార్యుడు కోపోద్రిక్తుడయ్యాడు. రాక్షసులే మద్యంలో కచుడి మృత శరీర బూడిదను కలిపి తన పొట్టలోకి చేర్చడమా? అని అయోమయం వ్యక్తం చేశాడు. కుమార్తెవైపు తిరిగి "ప్రియ కుమారీ.. ఇప్పుడో క్లిష్ట పరిస్థితి ఎదురైంది. కచుడు జీవించాలంటే నా పొట్ట చీల్చుకొని బయటకు రావాలి. అంటే నా మృతి తప్పదు" అన్నాడు

దేవయాని ఏడుస్తూ.. "అయ్యో ఏ మార్గం చూసినా నా మరణమే నిశ్చయం అనిపిస్తున్నది. మీ ఇద్దరిలో ఎవ్వరు మరణించినా నేను జీవించను" అంది.

శుక్రాచార్యుడు ఈ చిక్కు నుంచి ఎలా తప్పించుకోవాలా అని ఆలోచించసాగాడు. ఈ పరిస్థితికి అర్థం స్ఫురించింది. ఇదొక నాటకమని అతడికి అర్థమైంది. "ఓ బృహస్పతి కుమారుడా.. నీవు నా వద్దకు ఏ ఉద్దేశంతో వచ్చావో ఇప్పుడు నాకు తెలిసింది. నిశ్చయంగా నీ కోరిక నెరవేరినట్లే. దేవయాని కోసం నిన్ను బతికించాలి. కావున ఇప్పుడు నాకు కనిపించే మార్గమేమంటే.. నీవు నా పొట్టను చీల్చుకొని వచ్చినప్పుడు నేను చనిపోతాను. ఆ తరువాత నన్ను బతికించడానికిగాను నీకు సంజీవని విద్యను ఉపదేశిస్తాను. తరువాత నన్ను సజీవుణ్ణి చెయ్యి. అప్పుడు దేవయాని మన ఇద్దరి విషయమై ఎలాంటి విచారమూ చెందవలసిన అవసరం ఉండదు" అని చెప్పి.. తన పొట్టలో ఉన్న కచుడికి సంజీవని విద్యను ఉపదేశించాడు. కచుడు తక్షణమే శుక్రుడి పొట్టను చీల్చుకొని మేఘాలు విడివడ్డ చంద్రునిలా ప్రకాశిస్తూ బయటకు వచ్చాడు. శరీరమంతా చీలికలై శుక్రాచార్యుడు మరణించాడు. తక్షణమే కచుడు తాను నేర్చుకున్న సంజీవని విద్యను ఉపయోగించి గురువుగారైన శుక్రాచార్యుడిని బతికించాడు. కచుడు శుక్రుడికి ప్రణమిల్లి ఇలా పలికాడు. "అజ్ఞానులకు జ్ఞానోపదేశం చేసేవాడే తండ్రి. మీ శరీరం నుంచి బయటపడినందున మీరు నాకు తల్లి కూడా అయ్యారు" అన్నాడు.

మరికొన్ని సంవత్సరాలు కచుడు.. శుక్రాచార్యుడి వద్ద శిష్యరికం చేశాడు. తాను ప్రారంభంలో నిశ్చయించుకొన్న విద్యాకాలం కూడా పూర్తయింది. దేవలోకం వెళ్లాలి. గురువుగారి వద్ద సెలవు తీసుకొన్నాడు. ఇక బయలుదేరడానికి సిద్ధమైన తరుణంలో... దేవయాని కచుడితో ఇలా అంది. "ఓ ఆంగీరస పుత్రుడా.. నీ దోషంలేని జీవితం, నీ విద్య, నీ వంశ మర్యాద నా హృదయాన్ని ఆకర్షించాయి. నీవు కఠిన

బ్రహ్మచర్యం ఆచరిస్తున్నప్పటికీ నిన్నింత కాలమూ మనసారా ప్రేమిస్తూనే ఉన్నాను. నీవిప్పుడు నా ప్రేమను అంగీకరించి నన్ను వివాహమాడి ఆనందింప చెయ్యి. బృహస్పతులవారూ, నీవూ నా పూర్తి మర్యాదను, గౌరవాన్ని పొందగలరు" అన్నది (అప్పటికాలంలో బుద్ధి, జ్ఞానం, విద్య కలిగిన బ్రాహ్మణ కన్యలు, వారి హృదయ సంబంధమైన రహస్యాలను, అంశాలను మర్యాదగా ఇతరులకు తెలపడం అరుదైన అంశం కాదు).

కచుడు ఇలా అన్నాడు.. "ఓ నారీ రత్నమా!. నీవు నా గురువుగారి కుమార్తెవు అయినందువల్ల నిరంతరం నా మర్యాదకు నోచుకున్నావు. నీ తండ్రి గర్భాన్ని చీల్చుకొని బయటకు రావడం వల్ల నేను బతికాను. కనుక నేను నీకు సోదరుడను. కనుక చెల్లెలా.. పెళ్లాడమని నీవు నన్నడగడం అక్రమం" అన్నాడు. అందుకు దేవయాని, "నీవు బృహస్పతి కుమారుడవుగాని, నా తండ్రి కుమారుడవు కావు. నిన్ను నా తండ్రి బతికించిన కారణం నేను నిన్ను ప్రేమించడమే. నిశ్చయంగా, నిరంతరంగా ప్రేమిస్తూ ఎప్పటికైనా నీవే నా భర్తవు కాగలవని ఆశిస్తున్నాను. ఎలాంటి పాపమూ అంటని నా వంటి దాన్ని, మాయలూ మర్మాలూ తెలియని దాన్ని, నీ పట్ల మిక్కిలి మక్కువ ఉన్న దాన్ని నన్ను నీవు విడిచిపెట్టడం సరికాదు" అన్నది

అందుకు కచుడు.. "అధర్మ మార్గాన ప్రవేశించడానికి నన్ను ప్రోత్సహించకు. నీవేమో సౌందర్యవతివి. కోపంలోనూ ఎంతో ప్రకాశిస్తున్నావు. కానీ నేను నీకు సోదరుడినే. దయచేసి నాకు వీడ్కోలు ఇవ్వు. నిత్యమూ, నిరంతరమూ నా గురువైన శుక్రాచార్యుడిని పూర్తిగా పూజిస్తూ ఉండు. సేవ చేస్తూ ఉండు" అంటూ కచుడు మెల్లగా అక్కడ నుంచి దేవతల రాజు అయిన ఇంద్రలోకానికి బయలుదేరాడు. శుక్రాచార్యుడు తన కుమార్తెను ఓదార్చాడు.



యయాతి పక్కన నిలబడి శర్మిష్టను
ప్రశ్నిస్తున్న దేశయాని

అధ్యాయము - 5

# దేవయాని వివాహం

**ఒ**కానొక రోజు సాయం సమయాన ఉద్యానవన విహారంతో అలసిపోయిన రాక్షస రాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ.. నిర్మలంగా పారుతున్న సెలయేటి వద్దకు వెళ్లింది. శర్మిష్ట, దేవయాని సహా అందరూ వారి వస్త్రాలు ఒడ్డున ఉంచి స్నానం చేయడానికి నీటిలోకి దిగారు. ఇంతలో గాలి వచ్చి వారి వస్త్రాలన్నీ కలిసిపోయి కుప్పగా పడిపోయాయి. స్నానాలు అయిన తరువాత తమ వస్త్రాలను ధరించే సమయంలో పొరబాటున శర్మిష్ఠ.. దేవయాని వస్త్రాలను ధరించింది. దీంతో దేవయాని తనలో నొచ్చుకుంటూ.. పైకి మాత్రం హాస్యంగా.. "శిష్యుని కుమార్తె గురు పుత్రిక దుస్తులను ధరించడం చాలా పొరబాటు" అని శర్మిష్ఠతో అన్నది. దేవయాని ఈ మాటలు హాస్యంగా అన్నప్పటికీ శర్మిష్ఠ కోపంతో ఊగిపోయింది. తాను రాజు కుమార్తె అనే అహంభావంతో.. "నీ తండ్రి శుక్రాచార్యులు ప్రతిదినమూ రాక్షస రాజు అయిన నా తండ్రి పట్ల గౌరవంతో తలవంచుకుంటాడని నీకు తెలియదా. నా

తండ్రి దయాదాక్షిణ్యంతో జీవిస్తున్న భిక్షగాడి కుమార్తెవు నీవు. నేను నలుగురికీ సగర్వంగా దానధర్మాలు చేసే క్షత్రియ కన్యను. నీవు అన్నమో, ముష్ఠో ఎత్తుకొని జీవించే జాతికి చెందిదానివి. ఈ సంగతి నీవు మర్చిపోయావు కాబోలు. ఇలాంటి దానివి నాతో హాస్యం పలుకుతావా" అంటూ కోపోద్రిక్తురాలైంది. తర్వాత దేవయాని చెంప మీద దెబ్బ కొట్టి అక్కడే ఉన్న పాడుపడిన బావిలోకి తోసింది. రాక్షస కన్యలు దేవయాని మరణించిందని తలచి ఇళ్లకు వెళ్లిపోయారు. ఆ నూతిలో నీరు లేకపోవడంతో ఆమెకు ప్రాణహాని కలగలేదు. కానీ అపాయ స్థితికి వెళ్లింది. నూతి గోడలపై పాకడానికి వీలులేని విధంగా దాని గోడలు ఎత్తుగా, నిలువుగా ఉన్నాయి.

భరత వంశానికి చెందిన యయాతి చక్రవర్తి ఆ అడవిలో వేటాడుతూ.. దాహం తీర్చుకోవడానికి ఆ నూతి దగ్గరకు వచ్చాడు. తొంగి చూశాడు. ఏదో ఉన్నట్లు అస్పష్టంగా కనిపించింది. మరింత జాగ్రత్తగా పరిశీలిస్తే.. ఓ సుందరి కనిపించింది. ఆశ్చర్యపోయాడు. "ఓ సుందరీ, నీవు నూతిలో ఎలా పడ్డావు?. ఎవరు నీవు?, నీ తండ్రి ఎవరు?" అని అడిగాడు. ఆందుకు నూతిలో ఉన్న దేవయాని.. "నేను శుక్రాచార్యుని కుమార్తెను. నేను నూతిలో పడిన విషయం నా తండ్రికి తెలియదు. నన్ను పైకి తీయండి" అంటూ రెండు చేతులనూ పైకి అందించింది. యయాతి ఆమె రెండు చేతులను పట్టుకొని పైకి తీశాడు.

రాక్షసరాజు పట్టణానికి తిరిగి వెళ్లడానికి దేవయాని ఇష్టపడలేదు. శర్మిష్ఠ చేష్టలు, తనపై దూషణలు గుర్తు చేసుకుంది. అందువల్లే పట్టణానికి తిరిగి వెళ్లడం ఏ మాత్రం మంచిది కాదని దేవయాని భావించింది. "నీవొక కన్యకు ప్రాణ దానం చేశావు. కనుక ఆమెను నీవు తప్పకుండా పెళ్లి చేసుకోవాలి. నీవు నాకు అన్ని విధాలా తగినవాడవని తోచింది." అని దేవయాని అన్నది. అందుకు యయాతి.. "ఓ చిన్నదానా..నేనొక క్షత్రియుణ్ణి. నీవు బ్రాహ్మణ కన్యవు. నిన్నెలా వివాహం చేసుకుంటాను? ప్రపంచానికే ఉపదేశం చేయగల ప్రజ్ఞా దురంధరుడైన శుక్రాచార్యులవారి కుమార్తెవు. నావంటి క్షత్రియుడికి భార్య ఎలా అవుతావు?. నీవు గౌరవనీయురాలైన కన్యవు. నీవు ఇంటికి వెళ్లు" అని యయాతి తన రాజధానికి బయలుదేరాడు.

పురాతన ధర్మశాస్త్రం ప్రకారం ఒక క్షత్రియ యువతి, ఓ బ్రాహ్మణ యువకుడిని వివాహం చేసుకోవచ్చు. కానీ బ్రాహ్మణ యువతిని క్షత్రియ యువకుడు పెళ్లి చేసుకోవడం అన్నది లేదు. దీని ఉద్దేశం స్త్రీల వంశోత్కృష్టతను నీచ పరచకుండా ఉంటడానికే అని చెప్పబడుతోంది. కనుక 'అనులోమ' అంటే హెచ్చు జాతి పురుషులను తక్కువ జాతి వారు వివాహమాడటానికి అనుమతి ఉంది. కానీ 'ప్రతిలోమ' అంటే

తక్కువ జాతి పురుషుణ్ణి హెచ్చు జాతి స్త్రీ పెళ్లాడటం శాస్త్రం నిషేధించింది.

ఇంటికి వెళ్లడం ఇష్టం లేక దేవయాని, ఆ అడవిలోనే ఒక చెట్టు నీడన కూర్చొని విచారిస్తోంది.

శుక్రుడు దేవయానిని తన ప్రాణాలు కన్నా ఎక్కువగా ప్రేమించాడు. తన చెలికత్తెలు, స్నేహితులతో ఆటలాడేందుకు వెళ్లిన కుమార్తె దేవయాని రాకకోసం శుక్రాచార్యుడు చాలా సేపు ఎదురుచూశాడు. ఆమెను వెదికేందుకు ఒక సేవకురాలిని పంపాడు. ఆమె వెదికి వెదికి దేవయానిని ఒక చెట్టు కింద కూర్చొని ఉండటం చూసింది. దేవయాని విచారంతో, నిస్పృహతో, ఎర్రబడిన కళ్లతో ఉంది. దేవయాని సేవకురాలితో.. "చెలీ, తక్షణమే నీవు వెళ్లు. వృషపర్యుని పట్టణంలో నేను కాలుపెట్టను" అంటూ ఆమెను తండ్రి శుక్రుడి వద్దకు పంపింది. కుమార్తె పరిస్థితికి శుక్రుడు ఖిన్నుడై వెంటనే ఆమె ఉన్న ప్రదేశానికి వెళ్లాడు. కుమార్తెను ప్రేమతో ముద్దాడాడు. ముందు నా ప్రశ్నకు బదులివ్వు అని తండ్రిని సూటిగా అడిగింది దేవయాని. "వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ .. మీరు రాజులను పొగుడుతూ డబ్బు తీసుకునే ముష్టివాడి కూతురువు అని నన్ను అనడమేగాక చెంపదెబ్బ కొట్టింది. పక్కనే ఉన్న పాడుబడిన నూతిలోకి తోసింది. దాని తండ్రి రాజ్యంలో నేనుండను" అని ఏడ్చింది.

శుక్రాచార్యుడు గంభీరంగా.. ఓ దేవయానీ, నీవు సభల్లో రాజుల కీర్తి పాడుకొని జీవించేవాడి కూతురువి కాదు. నీ తండ్రి ఇతరులను పొగుడుతూ బతికేవాడు కాదు. ఈ ప్రపంచమంతా గౌరవించే నా కూతురువి. దేవతల రాజు ఇంద్రుడికి ఈ సంగతి తెలుసు. వృషపర్వుడు కూడా నేతడికి చేసిన ఉపకారం మర్చిపోయేవాడు కాదు. ఏమయితే ఏమి? మంచివాడు తనను తాను ఎప్పుడూ పొగుడుకోడు. కనుక నా గొప్పతనం గురించి నేను చెప్పాల్సిన పనిలేదు. నీవు కుటుంబానికి గౌరవం సంపాదించగల స్త్రీలలో మణిపూసవు. ఓపికపట్టు. ఇంటికి వెళ్దాం పద" అన్నాడు.

ఈ సందర్భంలో వ్యాసుడు ప్రజల కోసం చేసిన ఉపదేశాలను.. శుక్రాచార్యుడు దేవయానికి వివరించాడు. ఇతరుల నిందలను ఓర్పుతో సహించి ఉన్నవాడే ప్రపంచాన్ని జయిస్తాడు. మాట వినని రథాశ్వాలను ఓర్పుతో లొంగదీసుకునే వాడే రథ సారధి అవుతాడు. అంతేగాని నిమిత్తమాత్రం కళ్లెం పట్టుకొని గుర్రం ఎక్కడికి వెళ్తే తానూ అక్కడికే వెళ్లేవాడు రథ సారధి కాదు. కోపం అణచుకొని కార్యాన్ని సాధించాలి. ఎవరయితే.. పాము కుబుసం విడిచినట్లుగా క్రోధాన్ని విడిచిపెడతారో వారే వీరులూ, నాయకులూ అవుతారు. ఇతరులు తనను ఏమిచేసినా, చీకాకు పెట్టినా కలత చెందక ధైర్యంగా ఉండేవాడే తన కార్యాన్ని సాధిస్తాడు. నూరేళ్లు బతికినవాడికంటే క్రోధం

చెందనివాడే గొప్పవాడు. ఎవరైతే కోపం ప్రదర్శిస్తారో అతనికి స్నేహితులు, సోదరులు, భార్యాపిల్లలు దూరమవుతారు. ధర్మం, సత్యం తనను విడిచిపోతాయి. చిన్నపిల్లల వాక్యాలను బుద్ధిమంతులు లెక్కచేయరు" అని వివరించాడు.

దేవయాని.. "నేను చిన్న పిల్లనేగానీ, మీరు వివరించిన ఈ గొప్ప మాటలను అర్థం చేసుకొని తద్వారా మంచి ధర్మాలు నిర్వర్తించే వయసు నాకుంది. కానీ మాన మర్యాదలు తెలియని జనంతో జీవించడం మంచిది కాదు. తన కుటుంబాన్ని నిందించే ఇతరులతో బుద్ధిమంతులు కలిసుండలేరు. వారెంత ధనికులైనా వారు మర్యాదలేని వారే, నీచులు, జాతిబాహ్యులతో మంచివాళ్లు కలిసి ఉండకూడదు. వృషపర్వుడి కూతురి నిందా వాక్యాలు నా హృదయాన్ని మండిస్తున్నాయి. ఆయుధాల వల్ల ఏర్పడిన గాయాలైనా కొంతకాలానికి మానతాయి. కానీ నిందా పూర్వక మాటలు చేసిన గాయాలు జీవితాంతం అలాగే ఉంటాయి" అన్నది.

శుక్రాచార్యుడు వృషపర్వుడి వద్దకు వెళ్లాడు. అతణ్ణి తీక్షణంగా చూశాడు. విస్పష్టంగా ఆయనను ఉద్దేశించి... "ఓ రాజా! ఒకానొకడి పాప ఫలితం త్వరలోనే కనపడకపోయినా, కొద్ది కాలంలోనే ఆ చెడు ఫలితం ప్రజ్వరిల్లి, అతడి ఐశ్వర్యం సమూలంగా నాశనం అవుతుంది. బృహస్పతి కుమారుడు కచుడు బ్రహ్మచారి. అతడు తన ఇంద్రియాలను జయించాడు. ఏ పాపమూ చేయలేదు. నా వద్ద శిష్యుడుగా ఉండి విశ్వాసంతో సేవలు చేశాడు. ఎప్పుడూ ధర్మాన్ని వదల్లేదు. నీ అనుచరులు అతణ్ణి చంపాలని ప్రయత్నించారు. ఆ పనిని సహించాను. మర్యాదగా జీవించే నా కూతురుని, నీ కుమార్తె అమర్యాదకరంగా నిందించింది. పైగా నా కుమార్తెను ఓ నూతిలోకి తోసింది. నా కుమార్తె నీ రాజ్యంలో ఎంతమాత్రమూ ఉండదు. ఆమె లేకుండా నేనిక్కడ ఉండను. కనుక నీ రాజ్యం వీడి వెళ్తున్నాను" అన్నాడు.

రాక్షసరాజు వృషపర్వుడు ఖిన్నుడయ్యాడు. "మీరిప్పుడు నా ముందు వెల్లడించిన అభియోగాల సంగతి నాకు తెలియనే తెలియదు. మీరు నన్ను విడిచి వెళ్తే నేను అగ్నిలో దూకి మరణిస్తాను" అన్నాడు. దీనిపై శుక్రాచార్యుడు.. "మీ అనుచరుల కంటే నా కుమార్తె సౌఖ్యమే నాకు ముఖ్యం. ఆమె నా ప్రాణం కంటే నాకు ప్రేమపాత్రురాలు. ఆమెను నీవు శాంతింప చేస్తే మంచిది. లేకపోతే నేను వెళ్లిపోక తప్పదు" నిక్కచ్చిగా చెప్పాడు. వృషపర్వుడు తన పరివారంతో అడవికి వెళ్లాడు. ఒక చెట్టుకింద కూర్చొని ఉన్న దేవయాని వద్దకు వెళ్లి ఆమె పాదాల మీద పడ్డాడు.

"నేనొక బిక్షగాడి కుమార్తెనని నిందించిన శర్మిష్ట నాకు దాసి కావాలి. నా తండ్రి నాకు వివాహం చేసే భర్త ఇంటా ఉండాలి" అని షరతు పెట్టింది దేవయాని. దీనికి వృషపర్వుడు సమ్మతించాడు. తన కుమార్తె శర్మిష్ఠను తీసుకొని రావాలని

సేవలకులను పంపాడు. శర్మిష్ఠ..దేవయాని ముందు నిలబడింది. తన తప్పులను ఒప్పుకొని తల వంచుకుంది. “నా చెలి దేవయాని కోరినట్లుగానే చేయండి. నేను చేసిన తప్పుల వల్ల నా తండ్రి వారి గురువుగారిని పోగొట్టుకోవాల్సి వస్తోంది. నేను దేవయానికి దాసిగా ఉంటాను” అన్నది శర్మిష్ఠ. దేవయాని శాంతించింది. తన తండ్రితో ఇంటికి వెళ్లింది.

మరోమారు యయాతి దేవయానికి ఎదురయ్యాడు. తనను వివాహమాడాలని మళ్లీ కోరింది. యయాతి కూడా మునుపటి వలెనే.. తాను క్షత్రియుణ్ణనీ, బ్రాహ్మణ యువతిని వివాహమాడబోనని, పదే పదే అడగటం తగదని అన్నాడు. తుదకు ఇద్దరూ శుక్రాచార్యుడి వద్దకు వెళ్లారు. వారి వివాహానికి ఆయన అంగీకారం పొందారు. అరుదైన పరిస్థితుల్లో ప్రతిలోమ వివాహానికి ఇది ఉదాహరణ. చేయదగిన, చేయకూడని శాస్త్రాల గురించి వివరించాడు శుక్రాచార్యుడు. యయాతి–దేవయాని వివాహం జరిగింది.

యయాతి–దేవయాని ఎంతో సౌఖ్యమైన దాంపత్యం కొనసాగిస్తున్నారు. శర్మిష్ఠ దేవయానికి దాసిగా కొనసాగుతున్నది. ఒక రోజు శర్మిష్ఠ.. రహస్యంగా యయాతిని కలిసింది. తనను పెళ్లి చేసుకోవాలని కోరింది. యయాతి ఆమె పట్ల ఆకర్షితుడయ్యాడు. దేవయానికి తెలియకుండా రహస్యంగా శర్మిష్ఠను పెళ్లి చేసుకున్నాడు. ఈ విషయం దేవయానికి తెలిసింది. ఆమెలో పట్టరాని కోపం బుసలు కొట్టింది. తక్షణమే ఈ సంగతిని తండ్రి శుక్రాచార్యుని చెవిన వేసింది. శుక్రాచార్యుడు ఆగ్రహం వ్యక్తం చేస్తూ.. “నీకు అకాల వార్ధక్యం వచ్చుగాక” అని యయాతిని శపించాడు.

శుక్రాచార్యుడి శాపంతో నిండు యవ్వనంలోఉన్న యయాతికి అకాల వార్ధక్యం వచ్చింది. యయాతి ఖిన్నుడయ్యాడు. శుక్రాచార్యుణ్ణి చేరి క్షమాపణ వేడుకొన్నాడు. శుక్రాచార్యుడు కూడా కాస్త ఆలోచించాడు. శర్మిష్ఠ తన కుమార్తెను నూతిలోకి తోసినప్పుడు యయాతి పైకి తీసిన విషయాన్ని గుర్తు చేసుకున్నాడు. కాస్త శాంతించాడు. “నీవు యవ్వనాన్ని, తేజస్సును, గొప్పదనాన్ని కోల్పోయావు. నా శాపం తిరిగి తీసుకోలేనిది. ఎవరైనా తన యవ్వనాన్ని నీకు ఇచ్చి, నీ వార్ధక్యాన్ని వారు తీసుకుంటే ఈ మార్పు జరుగుతుంది” అని యయాతిని ఆశీర్వదించి శుక్రాచార్యుడు వెళ్లిపోయాడు.

◈



శాపానికి గురైన యయాతి
శుక్రాచార్యుని క్షమాపణ వేడుతున్నాడు

## అధ్యాయం - 6

# యయాతి

**య**యాతి చక్రవర్తి పాండవ వంశ పెద్దల్లో ఒకడు. ఓటమి ఎరుగడు. శాస్త్రాన్ని అనుసరించి నడిచేవాడు. దైవాలను పూజించేవాడు. పెద్దలను గౌరవించేవాడు. వారి పట్ల భక్తిశ్రద్ధలు చూపేవాడు. చక్రవర్తిగా ప్రజా పాలనలో అతడికి సాటి లేదనే ఖ్యాతి సంపాదించాడు. అలాంటివాడు తన భార్య దేవయానికి అన్యాయం చేసి అతడి తండ్రి శుక్రాచార్యుని శాపానికి గురై అకాల వార్ధక్యానికి గురయ్యాడు.

హఠాత్తుగా వార్ధక్యం పొందిన యయాతి ఇంద్రియ సౌఖ్యాలను కోరుకుంటున్నాడు. అతడికి.. బాగా విద్య నేర్చిన, ధర్మపరులైన కుమారులు ఉన్నారు. తన కుమారులందరినీ తన వద్దకు పిలిపించుకొన్నాడు. వారిపట్ల తనకున్న వాత్సల్యాన్ని ప్రకటిస్తూ.. "మీ తాత శుక్రాచార్యుడి శాపంతో నేను అకస్మాత్తుగా వృద్ధుణ్ణయ్యాను. జీవితానందం వల్ల నాకు తృప్తి లేదు. ఈ వార్ధక్యం రాకముందే నా యవ్వనాన్ని అతి జాగ్రత్తగా, పరిమితంగా మాత్రమే అనుభవించాను. మీలో

ఒకరు నా వార్థక్య భారాన్ని తీసుకొని మీ యవ్వనాన్ని నాకు ఇవ్వండి. ఏ కుమారుడైతే దీనికి అంగీకరిస్తాడో అతడే ఈ రాజ్యానికి రాజు అవుతాడు. యవ్వనాన్ని పొంది ఆనందాన్ని పూర్తిగా అనుభవించాలని నాకు కోరికగా ఉంది" అన్నాడు యయాతి. మొదటిగా పెద్ద కుమారుణ్ణి అడిగాడు. అతడు.. "ఓ మహారాజా..! మహిళలు, సేవకులు కూడా తమరి ముసలితనాన్ని తీసుకోరు. అందరూ నవ్వుతారు. వెక్కిరిస్తారు. నేనలా చేయలేను. నాకంటే మీకు ప్రియతములైన నా తమ్ముళ్లను అడగండి" అన్నాడు. యయాతి రెండో కుమారుణ్ణి అడిగాడు. అతడూ నిరాకరిస్తూ.. "తండ్రీ నీవు నన్ను ముసలితనాన్ని తీసుకోమంటున్నావు. ఈ ముసలితనం బలాన్ని, అందాన్ని, పోగొట్టడమేగాక, ఇప్పుడున్న బుద్ధిని కూడా మందగింప చేస్తుంది. నేనా పని చేయలేను" అన్నాడు. మూడో కుమారుణ్ణి అడిగాడు. "ముసలివాడు గుర్రాన్నిగాని, ఏనుగునుగాని స్వారీ చేయలేడు. అతని మాటలు వణుకుతాయి. అలాంటి పరిస్థితిలో నేనేమి చేయాలి?. ఇందుకు నేనొప్పుకోను" అన్నాడు మూడో కొడుకు. తన కోర్కెను ముగ్గురు కుమారులూ తిరస్కరించడంతో యయాతి కుంగిపోయాడు. అయినా ఆశతో నాలుగో కుమారుణ్ణి కూడా అడిగాడు. "నీవు నా ముసలితనాన్ని తీసుకో. నీ యవ్వనాన్ని నాకివ్వు. కొంతకాలం అయిన తరువాత మళ్లీ నేను నీ నుంచి నా ముసలితనాన్ని తీసుకుంటాను" అని అర్థించాడు. నాలుగో కుమారుడు కూడా దీన్ని వ్యతిరేకించాడు. తాను యవ్వనాన్ని ఇవ్వలేకపోతున్నందుకు క్షమించాలని కోరాడు. వృద్ధుడు తన శరీరాన్ని శుభ్రం చేసుకోవాలన్నా ఇతరుల సాయం తప్పనిసరి. ఇదెంతో దారుణం. ఏ కుమారుడైనా తండ్రిని ఎంతగా ప్రేమించినా ఆ పనిమాత్రం చేయలేడు.

నలుగురు కుమారులూ తన కోరికను కాదన్నందుకు యయాతి తీవ్ర విచారగ్రస్తుడయ్యాడు. అయినా ఆశతో.. తన ఐదవ కుమారుణ్ణి కూడా అడిగాడు. "నువ్వయినా నన్ను కాపాడాలి. ఈ వార్థక్యాన్ని నేను భరించలేను. ఎల్లప్పుడూ నిస్సత్తువ. శరీరం ముడతలు, తెల్ల వెంట్రుకలు. వీటితో నేను భరించలేను. దయచేసి నీవయినా నా కోరికను మన్నించు" అని అడిగాడు. ఐదో కుమారుడైన "పురు" పితృ వాత్సల్యంతో.. "తండ్రీ, నా యవ్వనాన్ని నీకు ఆనందంగా ఇస్తున్నాను. ఆ విధంగా మీకు ముసలితన విచారం, రాజ్య భారం లేకుండా చేస్తాను. సౌఖ్యంగా ఉండు" అని తండ్రిని ఉద్దేశించి అనడంతో యయాతి ఆనందానికి అవధి లేకపోయింది. యయాతి 'పురు'ను కౌగలించుకున్నాడు. కుమారుణ్ణి స్పృశించిన తక్షణమే యయాతి యవ్వనుడుగా మారిపోయాడు. 'పురు' ముసలివాడయ్యాడు. యయాతి తొలుత వాగ్దానం చేసినట్లుగా రాజ్యాన్ని 'పురు'కు అప్పగించాడు. 'పురు'.. రాజ్యాన్ని చక్కగా పరిపాలించి గొప్ప ఖ్యాతిని పొందాడు.

యయాతి చాలా కాలం యవ్వన ఆనందాన్ని అనుభవించాడు. అయినప్పటికీ ఆయన తృప్తి చెందలేదు. కుబేరుడి ఉద్యానవనానికి వెళ్లి అక్కడ అప్సరసతో కొంతకాలం గడిపాడు. తనలో కామతృష్ణ తలపునకు వచ్చిన కొద్దీ పెరుగుతోందనే వాస్తవాన్ని గ్రహించి 'పురు' వద్దకు వచ్చాడు. "ప్రియ కుమారా! ఇంద్రియ సంబంధమైన కోర్కెలు ఆగ్నికి ఆజ్యం తోడైనట్లుగా పెరగడమేగాని అవి తగ్గవు. కామవృత్తులు, ధనం, ధాన్యం, పశువులు, స్త్రీలు మొదలైనవి ఎన్నడూ పురుషుని కోరికలను సంతృప్తి పరచవు. ఇష్టాఇష్టాలకు అతీతమైన హృదయ నిర్మలత్వం కలిగితేనే శాంతి పొందగలుగుతాం. దానినే బ్రహ్మప్రాప్తి అంటాం. నీ యవ్వనాన్ని నువ్వు తీసుకొని ఈ రాజ్యాన్ని బాగా పరిపాలించు" అన్నాడు యయాతి. తరువాత ఐదో కుమారుని నుంచి వార్ధక్యాన్ని స్వీకరించాడు. 'పురు' తన యవ్వనాన్ని తిరిగి పొందాడు. యయాతి చేత పట్టాభిషిక్తుడయ్యాడు. యయాతి అడవులకు వెళ్లి తపస్సు చేస్తూ శరీరాన్ని చాలించాడు.

◈



దృతరాష్ట్రునితో చర్చిస్తున్న
విదురుడు (ఎడమపక్క)

## అధ్యాయం - 7

# విదురుడు

**మాం**డవ్య మహాముని మనోధైర్యాన్ని, గొప్ప జ్ఞానాన్ని కలిగి వేదవేదాంగాలు చదివాడు. ఆయన తపస్సుతో, సత్యమే మాట్లాడుతూ జీవితాన్ని గడుపుతున్నాడు. పట్టణం వెలుపల అడవిలో కుటీరం నిర్మించుకొని అక్కడ నివసిస్తున్నాడు. అయన ఒకనాడు తన పర్ణశాల బయట ఓ చెట్టుకింద తపస్సు చేస్తున్నాడు. ఆ సమయంలో ఓ దొంగల గుంపు అడవి గుండా పరుగుపెడుతోంది. వారిని సైనికులు, ఉద్యోగులు తరుముతున్నారు. ఆ సమయంలో దొంగలు మాండవ్య మహాముని పర్ణశాల చూశారు. దాక్కోవడానికి అనువుగా ఉందని భావించారు. పర్ణశాలలోకి వచ్చి దొంగసొత్తును ఓ మూల పెట్టి దాక్కున్నారు. ఇంతలో వారిని తరుముతూ వస్తున్న ప్రధానోద్యోగి తపస్సులో ఉన్న మాండవ్యుణ్ణి కఠినంగా ప్రశ్నించాడు. “దొంగలీ పక్కగా వెళ్లడం చూశావా?. వారెక్కడికి వెళ్లారు?. త్వరగా చెప్పు. మేం వారిని వెంటాడి పట్టుకోవాలి” అని అన్నారు. మాండవ్య మహాముని మౌనముద్ర దాల్చి ఉన్నాడు. సమాధానం రాకపోవడంతో రాజోద్యోగి మళ్లీ కఠినంగా ప్రశ్నించాడు. మాండవ్యుడు తపస్సులో

లీనమై తన ఎదుట ఏమి జరుగుతోందో గ్రహించకుండా ఉన్నాడు. ఈలోగా కొంతమంది ఉద్యోగులు ఆశ్రమంలో  వెదుకుతూ.. ఆశ్రమంలో ఓ మూలనున్న దొంగసొత్తును కనుగొన్నారు. ఆ ఉద్యోగులు.. "ఈ బ్రాహ్మణుడు మౌనం వహించి మునీశ్వరుడిలా ఎందుకు నటిస్తున్నాడో నాకు బోధపడింది. వీడు నిజంగా దొంగల నాయకుడే" అనుకొని తన అనుచరులను సొత్తు వద్ద కాపలా ఉంచి రాజు వద్దకు వెళ్లాడు. అడవిలో మాండవ్య ముని దొంగ సొత్తుతో పట్టుబడ్డాడని ఫిర్యాదు చేశాడు. రాజు ఇది విని.. ప్రపంచాన్ని మోసగించడానికి బ్రాహ్మణ మునీశ్వరుడి వేషం వేసుకొని ఇంత పనిచేసిన దొంగల నాయకుడి ధైర్యానికి ఆశ్చర్యపోయాడు. దీనిపై ఎలాంటి విచారణ జరపకుండానే, మరో ఆలోచన చేయకుండానే దొంగల నాయకుడైన మాండవ్యుడికి శిక్ష వేయాలని రాజు ఉత్తర్వు ఇచ్చాడు. రాజ ఉద్యోగి మాండవ్యుడి ఆశ్రమానికి వచ్చి ఒక వాడిగల ఈటె మొనపై కూర్చోపెట్టి శిక్ష వేశాడు. సొత్తును తీసుకు వెళ్లి రాజుకు అప్పగించారు. మహారుషి మాండవ్యుడుకి తీవ్రమైన శిక్ష వేసినప్పటికీ మరణించలేదు. శిక్ష వేసిన సమయంలో ఆయన తపస్సులో ఉన్నందున ఆ యోగ బలం వల్ల ఆయనకు మరణం సంభవించలేదు. ఆ అడవిలో ఉన్న ఇతర మునులు మాండవ్యుడి పర్ణశాలకు వచ్చి పరామర్శించారు. వారిని ఉద్దేశించి... నేనెవరినీ నిందించను?. ఈ ప్రపంచాన్ని ఏలే రాజు ఉద్యోగులు నాకీ శిక్ష విధించారు" అని  మాండవ్యుడు చెప్పాడు.

శిక్ష వేయబడిన ముని ఇంకా బతికే ఉన్నాడని, ఆ అడవిలోని ఇతర మునులు ఆయన చుట్టూ చేరారని విని రాజు ఆశ్చర్యపడి ఆ తరువాత భయాందోళన చెందాడు. తక్షణమే తన అనుచరులతో అడవికి వెళ్లి మాండవ్యుడిని కొరత నుంచి విముక్తి చేశాడు. తర్వాత రాజు మాండవ్యుడి కాళ్లపై పడి.. తాను అజ్ఞానంతో తప్పు చేశానని, క్షమించాలని మొరపెట్టుకున్నాడు. మాండవ్యుడికి రాజుపైన ఆగ్రహం అయితే కలగలేదుగాని.. యమలోకంలోని ధర్మదేవత వద్దకు బయలుదేరాడు. యమలోకంలోని సభలో సింహాసనంపై కూర్చొని అభియోగాలను విచారిస్తున్న యమధర్మరాజును ప్రశ్నించాడు.  "రాజు నాకు కఠిన శిక్ష విధించడానికి ఇదివరలో నేనేమైనా నేరాలు చేశానా?. అవేమిటి?" అని ప్రశ్నించాడు. యమధర్మరాజు మాండవ్యుడి మహత్తు తెలిసినవాడు కావడంతో.. నమ్రతగా సమాధానం చెప్పాడు. "నీవు పక్షులను, ఈగలను బాధపెట్టావు. మనం చేసిన స్వల్ప, మంచి పనైనా, చెడ్డ పనైనా వాటి మంచీ చెడూ బట్టి ఫలితాలు వస్తాయని నీకు తెలియదా" అని యమధర్మరాజు అన్నాడు. ఈ సమాధానానికి మాండవ్యుడు ఆశ్చర్యపోయాడు. "ఈ నేరం నేనెప్పుడు చేశాను?" అని ప్రశ్నించాడు. యమధర్మరాజు కలిగించుకొని.. 'నీవు చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడు'

అని చెప్పాడు. దీంతో ఆగ్రహం చెందిన మాండవ్యుడు యమధర్మరాజును శపించాడు. "పసివాడిగా ఉన్నప్పుడు అజ్ఞానంలో చేసిన తప్పులకు నీవు వేసిన శిక్ష అత్యంత కఠినంగా ఉంది. కావున నీవు మానవ లోకంలో జన్మించు" అని శపించాడు.

ఇలా మాండవ్యుడి శాపానికి గురైన యమధర్మరాజు.. విచిత్రవీర్యుని రెండో భార్య అంబాలిక వద్ద ఉండే దాసీ వనితకు విదురుడుగా జన్మించాడు. విదురుడు ధర్మదేవత (యమధర్మరాజు) అని చెప్పడానికి ఈ కథ చెప్పవలసి వచ్చింది. ప్రపంచంలోని మహానుభావులందరూ విదురుణ్ణి మహాత్ముడనీ, ధర్మశాస్త్రాలు తెలిసినవాడనీ, రాజ్య పాలనలో గొప్ప నిపుణుడనీ, ఇతడికి సాటి మరెవ్వరూ లేరని, కోపం లేనివాడనీ అనేవారు. బాల్యంలోనే విదురుణ్ణి.. రాజైన దృతరాష్ట్రుడికి ప్రధానమంత్రిగా భీష్ముడు నియమించాడు. ముల్లోకాల్లో ధర్మ, జ్ఞానాల్లో విదురుడితో సమానులు లేరని వ్యాసుడు చెప్పాడు.

దృతరాష్ట్రుడు రాజకుమారులు ద్యూతం (జూదం) ఆడటానికి ఆజ్ఞ ఇచ్చినప్పుడు.. విదురుడు రాజు పాదాలపై పడి ద్యూతం వద్దని విన్నవించాడు. "ఓ రాజా, ప్రభూ.. ద్యూతం ఆడటానికి మీరిచ్చిన ఆజ్ఞ నాకు సమ్మతం కాదు. ఈ ద్యూతం మీ కుమారుల్లో క్రోధం, కక్ష పురికొల్పుతుంది. దయఉంచి మీ ఆజ్ఞను వెనక్కి తీసుకోండి" అని విదురుడు వేడుకున్నాడు. దృతరాష్ట్రుడు కూడా దుర్మార్గుడైన తన కుమారుడు దుర్యోధనుడికి ద్యూతం వద్దని అనేక సార్లు చెప్పాడు. మీరు ఈ ద్యూతం ఆడవద్దు. విదురుడికి ఇది ఇష్టం లేదు. విదురుడు గొప్ప జ్ఞాన సంపన్నుడు. ఎప్పుడూ మన మేలు కోరేవాడు. ఈ ద్యూతం మూలంగా మీ ఉభయుల మధ్య కక్ష, పగ, శత్రుత్వం పెరుగుతాయి. వాటి వల్ల మన రాజ్యం కూడా దగ్ధమవుతుందని విదురుడు చెపుతున్నాడు." అన్నాడు. కానీ దుర్యోధనుడు ఆ మాటలను లక్ష్య పెట్టలేదు. దృతరాష్ట్రుడు వార్ధక్యంలో ఉండి తన పెద్ద కుమారుడి పట్ల అనురాగంతో అతడేమి చేసినా మాట్లాడక, ఆ ప్రేమతో తన బుద్ధిని కూడా కోల్పోయి ద్యూతం ఆడటానికి రావలసిందని యుధిష్టరుడికి ఒక ఉత్తరం పంపాడు.

◈



పాండురాజు విజ్ఞప్తితో కుమారుని
ఇవ్వాలని ఇంద్రుని వేడుకుంటున్న
కుంతి

## అధ్యాయం - 8

# కుంతీదేవి

శ్రీకృష్ణుడి తాత సూరుణ్ణి యాదవ కులంలో యోగ్యుడుగా భావిస్తారు. అతడి కుమార్తె 'పృథ'. సౌందర్యరాశి. సుగుణవంతురాలు. దగ్గర బంధువు కుంతి భోజుడుకి సంతానం లేకపోవడంతో అతనికి తన కుమార్తె పృథను దత్తత ఇచ్చాడు సూరుడు. దత్తత తండ్రి పృథకు కుంతి అనే పేరు పెట్టాడు.

కుంతి బాలికగా ఉన్నప్పుడు దుర్వాస మహాముని వారింటికి అతిథిగా వచ్చాడు. కుంతి ఓ ఏడాదిపాటు అతనికి భక్తిశ్రద్ధతో ఉపచారాలు చేసింది. కుంతి మంచి నడవడికకు దుర్వాసుడు సంతోషించి ఆమెకు ఓ దివ్య మంత్రాన్ని ఉపదేశించాడు. "ఈ మంత్రం పఠిస్తే ఏ దైవమైనా నీకు ప్రత్యక్షమై తన వంటి కుమారుణ్ణి నీకు ఇస్తాడు" అన్నాడు దుర్వాసుడు.. భవిష్యత్తులో కుంతికి కాబోయే భర్తకు వచ్చే దుర్దశను తన యోగవిద్యతో తెలుసుకొని ఆమె ఉపయోగం కోసం దుర్వాసుడు ఈ మంత్రాన్ని ఉపదేశించాడు.

యువతిగా ఉన్న కుంతి కుతూహం కలిగి దుర్వాసుని మంత్ర ప్రభావాన్ని చూడదలిచి ఆకాశంలో దేదీప్యమానంగా వెలుగుతున్న సూర్య భగవానుణ్ణి ఆహ్వానించింది. తక్షణం ఆకాశం మేఘావృతమైంది. చీకటి ముసురుకుంది. ఆ మేఘాల మధ్య నుంచి సూర్యుడు.. సౌందర్యవతి అయిన కుంతిని సమీపించి తన ప్రేమపూరిత నయనాలతో.. హృదయానురంజకమైన మనస్సుతో చూశాడు. దేదీప్యమానంగా వెలుగొందుతున్న సూర్య భగవానుణ్ణి చూసి కుంతి చకితురాలైంది. "ఓ దైవమా? మీరెవరు?" అడిగింది కుంతి. "ఓ సుందరీ నేను సూర్యుణ్ణి. పుత్రదాయకమై నీవు ఉచ్ఛరించిన మంత్ర ప్రభావంతో నేనిక్కడికి వచ్చాను" అన్నాడు సూర్యుడు. "తండ్రిపై ఆధారపడిన అవివాహితను నేను. నాకు మాతృత్వం అవసరం లేదు. దుర్వాసుల వారు ఇచ్చిన మంత్ర ప్రభావాన్ని పరీక్షించబోయాను. నేను ఇది అజ్ఞానంతో చేసిన పని. మీరు నా పొరపాటును క్షమించి తిరిగి వెళ్లండి" అని అన్నది కుంతి. కానీ సూర్య భగవానుడు అక్కణ్ణుంచి కదల్లేదు. దుర్వాస మహాముని మంత్ర ప్రభావం వల్లనే అలా జరిగింది. దీంతో కుంతి.. తనపై ప్రపంచం ఏమి నింద వేస్తుందోనని భయాందోళన చెందింది.

సూర్యుడు కలుగజేసుకొని.. "నీకేమీ దోషం అంటదు. నీవు నా కుమారుణ్ణి కన్న తరువాత నీకు కన్యత్వం మరలా సిద్ధిస్తుంది" అన్నాడు. తేజస్సూ, ప్రాణమూ ఇచ్చే సూర్యుడి దయతో కుంతి గర్భం దాల్చింది. అయితే మనిషి జననం మాదిరిగా కాకుండా, గర్భంలో బిడ్డను నవమాసాలు మోయకుండానే తక్షణమే శిశువును కన్నది కుంతి. అతడే కర్ణుడు. సహజ కవచ కుండలాలతో సూర్యునిలా దేదీప్యమానంగా ఆ శిశువు ప్రకాశిస్తున్నాడు. సూర్యుడు ముందే చెప్పిన విధంగా శిశువును కన్న తరువాత కుంతికి కన్యత్వం సిద్ధించింది.

ఆ శిశువును ఏమి చేయాలా అని కుంతి ఆందోళన చెందుతోంది. తన తప్పును కప్పిపుచ్చుకోవడానికి శిశువును ఒక పెట్టెలో ఉంచి, దాన్ని నదీ ప్రవాహంలో విడిచిపెట్టింది. నదీ ప్రవాహంలో కొట్టుకు వస్తున్న పెట్టెను ఓ రథ సారధి చూశాడు. తీరానికి తెచ్చాడు. పెట్టి విప్పి చూస్తే.. అందులో అసమాన తేజోవంతమైన ఓ మగశిశువు కంటపడ్డాడు. సంతానం లేని అతడు పరమానందం చెందాడు. ఆ శిశువును తీసుకువెళ్లి తన భార్యకు ఇచ్చాడు. ఆమెకు కూడా ఆ శిశువు పట్ల మాతృభావన ఏర్పడింది. ఆ విధంగా సూర్యభగవానుడి కుమారుడైన కర్ణుడు ఆ రథ సారధి కుమారుడుగా పెరిగాడు.

కుంతికి వివాహ వయస్సు వచ్చాక కుంతి భోజుడు ఆమెకు స్వయంవరం

ప్రకటించాడు. కుంతి రూపలావణ్యం, ధర్మనిరతి తెలిసిన లోకంలోని రాజపుత్రులంతా తండోపతండాలుగా స్వయంవరానికి వచ్చారు. అలా హాజరైన వారిలో అతి సౌందర్యవంతుడైన పాండు రాజు మెడలో కుంతి పూలమాల వేసి అతణ్ణి పతిగా వరించింది. వారి వివాహం గొప్పగా జరిగింది. కుంతి భర్త పాండు రాజుతో ఆ దేశ రాజధానీ నగరమైన హస్తినాపురానికి బయలుదేరి వెళ్లింది.

భీష్ముడి ఆలోచన మేరకు అప్పటి ఆచారం అనుసరించి మద్రరాజు సోదరి మాద్రిని పాండు రాజు తన ద్వితీయ భార్యగా స్వీకరించాడు. పురాతన కాలంలో రాజులు కేవలం వారసత్వాన్ని నిలుపుకోవడానికి ఇద్దరు, ముగ్గురు భార్యలను స్వీకరించేవారు.



శతశృంగ పర్వతం మీద పాండురాజు

అధ్యాయం - 9

# పాండురాజు మరణం

**ఓ** రోజున పాండు రాజు వేటకు వెళ్లాడు. ఓ రుషి, అతడి భార్య ఆ అడవిలో మృగ వేషంలో ఆడుకుంటున్నారు. మృగ వేషంలో ఉండటం చేత వారు మనుషులని తెలియక పాండురాజు వేట తమకంతో మగలేడిని బాణంతో కొట్టాడు. ఆ రుషి చనిపోతూ.. పాండురాజును.. "ఓరీ పాపీ! పడకగది సౌఖ్యం నీకు ఎప్పుడు సంభవిస్తుందో అప్పుడే నీవు మరణిస్తావు" అని శపించాడు. శాపంతో పాండురాజు హృదయం ముక్కలైంది. రాజ్యాన్ని భీష్ముడు, విదురుడికి అప్పగించి భార్యలతో.. అడవులకు వెళ్లి బ్రహ్మచర్యం ఆచరిస్తూ తపస్సు చేస్తున్నాడు. రుషి శాపం వల్ల తనకు ఇక సంతానం కలిగే అవకాశం లేదని పాండు రాజును ఆందోళన వెంటాడుతోంది. పాండురాజు ఆందోళలనను గమనించిన కుంతి.. తాను దుర్వాస మహాముని వద్ద పొందిన కుమారదాయకమైన మంత్రం గురించి వివరించింది.

పాండు రాజు తన భార్యలైన కుంతి, మాద్రిని ఆ మంత్ర శక్తితో సంతానం పొందాలని కోరాడు. ఈ ప్రకారంగా ఆ ఇద్దరు భార్యలకు పంచ పాండవులు జన్మించారు. వారు అడవుల్లో మనుషుల మధ్యే పెరిగి పెద్దవారయ్యారు. పాండు రాజు తన భార్యలతో, పిల్లలతో చాలా కాలం అడవుల్లోనే ఉన్నాడు.

అది వసంతకాలం. ఒకనాడు పాండురాజు, మాద్రి వసంతకాల సృష్టి విచిత్రాలను తిలకిస్తూ.. పక్షులు, పూలు, లతలు, మొదలైన వాటిని చూసి ఆనందిస్తున్నారు. ఆ సమయంలో పాండు రాజు హృదయోద్వేగం చెందాడు. ఇంతలో మాద్రి 'వద్దు.. వద్దు..' అంటున్నా.. పాండు రాజు లక్ష్య పెట్టలేదు. ఆ వసంతకాల సమయాన ఇంద్రియోద్వేగాన్ని అణుచుకోలేకపోయాడు. ఆయనలో బ్రహ్మచర్య వ్రత దీక్ష సడలింది. రుషి శాపానుసారం తక్షణమే పాండురాజు మరణించాడు.

మాద్రి తన విచారాన్ని దిగమింగలేకపోయింది. పాండురాజు మరణానికి తానే కారణమని తలచి కుంతిని బతిమాలి తండ్రి, తల్లి లేని తన కుమారులను కాపాడమని అప్పగించి ఆమె అగ్నిలో దూకి మరణించింది. ఆ అడవుల్లోని మునులు కష్టంలో ఉన్న కుంతిని, ఆమె పుత్రులను హస్తినాపురం తోడ్కొని వెళ్లి భీష్ముడికి అప్పగించారు. అప్పటికి పాండవుల్లోని యుధిష్టరుడికి పధ్నాలుగేళ్ల వయసు.

మునీశ్వరులు హస్తినాపురం వచ్చి అడవిలో పాండురాజు మృతి విషయం తెలపడంతో రాజ్యమంతా విచారసాగరంలో మునిగిపోయింది. విదురుడు, భీష్ముడు, వ్యాసుడు, ధృతరాష్ట్రుడు కొంతమంది బంధువులు పాండురాజుకు అంత్యక్రియలు నిర్వహించారు. రాజ్య ప్రజలంతా పాండు రాజు వియోగాన్ని తమకు కలిగిన గొప్ప నష్టంగా పరిగణించారు. వృద్ధురాలైన సత్యవతితో వ్యాసుడు ఇలా అన్నాడు. "గతించిన కాలం బాగానే గడిచింది. రాబోయే కాలం బహుకష్టంతో నిండి ఉంటుంది. ప్రపంచపు యౌవ్వనావస్థ కల మాదిరిగా కరిగిపోయింది. ప్రపంచమిక మోహంతో నిండిపోయి పాపకార్యాలు, విచారాలు రెండోవ్యవస్థపై పడబోతున్నాయి. కాలం అనివార్యమైంది. దానికి అడ్డులేదు. ఈ రాబోయే విషాదాంశాలను, నీ సంతతికి కలగబోయే ఆపదలను నీవు చూడటానికి ఇక్కడ నీవు ఉండనవసరం లేదు. ఈ పట్టణాన్ని వదిలి కనిపించిన ప్రదేశానికి వెళ్లి అక్కడ కుటీరంలో నివసిస్తూ.. దైవచింతనతో శేషజీవితం గడపడం మంచిది. సత్యవతి వ్యాసుని హితోపదేశాలతో అంబిక, అంబాలికతో కూడా అడవులకు వెళ్లింది. ఈ ముగ్గురు రాణులు తపోధనులై స్వర్గస్తులయ్యారు. కానీ వారి సంతానం పడిన కష్టం చూడనవకాశం కలగజేసుకోలేదు.

బాల భీముడు



## అధ్యాయం - 10

# భీముడు

**పాం**డు రాజు కుమారులైన పాండవులు, ధృతరాష్ట్రుడి నూరుగురు కుమారులు హస్తినాపురంలో బాల్య చేష్టలతో పెరుగుతున్నారు. వీరందరిలో భీముడు బలాఢ్యుడుగా తయారయ్యాడు. దుర్యోధనుణ్ణి, మిగిలిన కౌరవులను ఆటపాటల్లో హాస్యానికి వారి జుట్టును పట్టుకొని భీముడు ఈడ్చడం, తలలను ఢీకొనడం, నీటిలో దిగి ఆడుకుంటున్నప్పుడు వారిని ముంచడం, చెట్టెక్కినప్పుడు ఆ వృక్షాన్ని కాలితో తన్ని కింద పడేయడం వంటివి చేస్తుండేవాడు. భీముడి హాస్య చర్యల కారణంగా ధృతరాష్ట్రుడి కుమారులు ఎప్పుడూ ఏదో ఒక దెబ్బతో బాధపడుతుండేవారు. ఈ కారణాల వల్ల ధృతరాష్ట్ర కుమారులకు, వారి బాల్య దశనుంచే భీముడిపై క్రోధం, అసూయ ఉండేది.

ఈ విధంగా పెరుగుతున్న రాజపుత్రులకు రాజోచితమైన విలు విద్య, అస్త్ర, శస్త్ర విద్య, ఇంకా ఇతర విద్యలను కృపాచార్యుడు వారికి నేర్పుతుండేవాడు. భీముడి పట్ల దుర్యోధనుడికి ఉన్న అసూయ, ద్వేషాల వల్ల అతడి మనస్సు సంకుచితమై

భీముణ్ణి పెట్టరాని కష్టాలు పెడుతున్నాడు.

దుర్యోధనుడు చాలా ఆందోళన చెందుతున్నాడు. తన తండ్రి అంధుడు అవడం వల్ల రాజ్యాన్ని పాండు రాజు పరిపాలిస్తున్నాడు. పాండు రాజు మరణించినందున న్యాయానుసారం ప్రస్తుతం యువరాజుగా ఉన్న యుధిష్టరుడు కొద్ది కాలంలో రాజు అవుతాడు. తన తండ్రి ధృతరాష్ట్రుడు అంధుడైనందున నిస్సహాయుడు. కనుక యుధిష్టరుడు రాజు కాకుండా ముమ్మందు భీముణ్ణి చంపే ఉపాయాన్ని దుర్యోధనుడు ఆలోచించసాగాడు. భీముడు చనిపోతే మిగతావారి ప్రతిభ సన్నగిల్లుతుంది. భీముణ్ణి గంగానదిలో తోయడానికి, అర్జునుణ్ణి, యుధిష్టరుణ్ణి ఖైదు చేయడానికి, ఆపై రాజ్యం చేజిక్కించుకొని పాలించడానికి దుర్యోధనుడు తమ్ముళ్లను ఏర్పాటు చేసుకున్నాడు. దుర్యోధనుడు తన తమ్ముళ్లతోనూ, పాండవులతోనూ కలిసి గంగానదిలో ఈదడానికి వెళ్లారు. ఈతవల్ల, ఇతర ఆటల వల్ల అందరూ అలసిపోవడంతో వారు తమ గుడారాల్లో నిద్రించారు. ఆటల్లో భీముడు బాగా అలసిపోవడంతోనూ, అతడు తిన్న ఆహారం విష మిశ్రమమై ఉండటంతోనూ తాపం భరించలేక నది ఒడ్డునే పడుకున్నాడు. దుర్యోధనుడు, తదితరులు నిద్రిస్తున్న భీముణ్ణి నారతడపలతో, తీగలతో బాగా బంధించి గంగా నదిలో పడేశారు. ఇదివరకే నదిలో అడుగున భీముణ్ణి పడవేసిన స్థలంలో సూది మొనలుగల ఆయుధాలను అమర్చారు. నదిలోకి భీముణ్ణి పడవేసినప్పుడు సూది మొనలుగల ఆయుధాలు గుచ్చుకొని త్వరగా భీముడు మరణిస్తాడని కౌరవుల తలంపు. కానీ అదృష్టవశాత్తూ భీముణ్ణి పడవేసిన చోట నదిలో సూదిమొన తేలిన ఆయుధాలు లేవు. నదిలోని నీటి విష సర్పాలు భీముణ్ణి కరిచినా, అంతకుముందు తాను తిన్న ఆహారంలో విషమూ, పాముల విషమూ ఒకదానికొకటి విరుగుడుగా మారి భీముడికి ఎలాంటి హానీ కలగలేదు. కొద్దిసేపటిలోనే గంగ భీముణ్ణి ఒడ్డుకు తోసింది. అయితే తాము చేసిన ఏర్పాట్ల వల్ల అంటే.. బంధించి గంగానదిలో తోయడం, విషసర్పాలు కరవడం, సూదిమొనల ఇనుప ఆయుధాలు గుచ్చుకోవడం వల్ల భీముడు చనిపోయి ఉంటాడని భావిస్తూ ఆనందంగా అందరితోనూ కౌరవులు ఇళ్లకు వెళ్లారు.

భీముడు అందరితోపాటు రాకపోవడం గురించి యుధిష్టరుడు.. దుర్యోధనుణ్ణి అడిగాడు. దీనికి దుర్యోధనుడు.. భీముడు అందరికంటే ముందే పట్టణానికి బయలుదేరి వెళ్లాడని చెప్పాడు. యుధిష్టరుడు అది నిజమే అనుకొన్నాడు. ఇంటికి వెళ్లిన వెంటనే భీముడు వచ్చాడా అని తల్లిని అడిగాడు. ఆమె రాలేదని చెప్పింది. భీముడుకు సంబంధించి ఏదో మోసం జరిగిందని భావించి, తన తమ్ముళ్లతో కలిసి అడవికి వెళ్లి అంతా వెదికాడు. కానీ భీముడి జాడ తెలియలేదు. విచారంతో వారంతా ఇంటికి వచ్చారు.

కొంతసేపటికి భీముడు మేలుకొన్నాడు. తడబడుతూ, ఆయాసంతో ఇల్లు చేరాడు. కుంతి, యుధిష్ఠరుడు భీముడి రాకకు సంతోషించారు. కౌగలించుకొని కుశలప్రశ్నలు వేశారు. భీముడు తన శరీరంలో జీర్ణించుకున్న విషంతో మరింత బలశాలి అయ్యాడు. కుంతి.. విదురుడికి కబురు పంపి ఆయన్ను రప్పించి ఆయనతో రహస్యంగా మాట్లాడింది. "దుర్యోధనుడు దుర్మార్గుడు. క్రూరుడు. అతడు రాజ్యం పొందాలని భీముణ్ణి చంపే ప్రయత్నం చేశాడు. నాకిది ఎంతో ఆందోళనగా ఉంది" అని కుంతి అన్నది. "నీవన్నది నిజం. ఈ విషయం నీలోనే ఉంచుకో. దుర్మార్గుడైన దుర్యోధనుణ్ణి తగవుబెట్టి చికాకు పరిస్తే అతడి కోపం మరింత పెరుగుతుంది. నీ కుమారులకు దీర్ఘాయువు ఉంది. అందువల్ల ఆ విషయమై నీవు ఆందోళన చెందవద్దు" అన్నాడు విదురుడు. యుధిష్ఠరుడు కూడా భీముణ్ణి వారించాడు. "ఈ అంశాలను మరిచిపోయి మౌనంగా ఉండు. ఇకపై మనమంతా జాగరూకతతో ఉందాం. ఒకరికొకరు సాయం చేసుకుందాం. మనల్ని మనమే రక్షించుకోవాలి" అన్నాడు యుధిష్ఠరుడు. మరోవైపు. భీముడు నదిలో నుంచి తిరిగి రావడం చూసి దుర్యోధనుడు ఆశ్చర్యపడ్డాడు. అతడికి భీముడిపై కోపం, కక్ష ఎక్కువయ్యాయి. ఓ దీర్ఘ నిట్టూర్పు విడిచి తనలో తాను విచారంతో కుంగిపోయాడు.

◈



కర్ణుని పట్టాభిషేకం

## అధ్యాయం - 11

# కర్ణుడు

**పాం**డవులు, కౌరవులు అస్త్ర, శస్త్ర, శర, శరాసనాది రాజ విద్యలన్నీ మొదట్లో కృపాచార్యుడి (కృపుడు) వద్ద, తరువాత ద్రోణాచార్యుడి (ద్రోణుడు) వద్ద నేర్చుకున్నారు. ఓ రోజున రాజకుమారుల శస్త్ర విద్యల నైపుణ్య పరీక్ష ప్రదర్శన ఏర్పాటు చేశారు. తమ ప్రియమైన రాజపుత్రుల విద్యలను చూడటానికి రాజకుటుంబాల వారు, రాజ్యంలోని ఇతర ప్రజలు కుతూహలంతో ఉన్నారు. రాజ కుటుంబీకులంతా ఆశీనులై ఉన్నారు. ప్రేక్షకజనం కోలాహలంగా ఉంది. ఆయుధాల ప్రయోగంలో అర్జునుడు అసమాన ప్రతిభ కనబర్చాడు. జనాలు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. దీంతో దుర్యోధనుడి మొహం ద్వేషంతో నల్లబడింది.

సాయంకాలం అవుతున్న వేళ.. ప్రదర్శనశాల సింహద్వారం నుంచి ఒక గొప్ప పిడుగువంటి ధ్వని వినవచ్చింది. అందరి దృష్టీ ఆ ధ్వని వైపు మరలింది. ప్రజల మధ్య నుంచి దైవ సమానుడిలా, తేజస్సు విరజిమ్ముతున్న ఓ యువకుడు

బల ప్రదర్శన వేదిక వద్దకు రావడాన్ని ప్రజలు నిశ్శబ్దంగా చూస్తున్నారు. ఈ యువకుడు అందరినీ ఓ మారు కలయజూసి కృపాచార్యుడు, ద్రోణాచార్యులకు నిర్లక్ష్యంగా అభివాదం చేసి తిన్నగా అర్జునుడి వద్దకు వెళ్లాడు. వీరిద్దరూ అన్నదమ్ములైనా వారి రక్త సంబంధం తెలుసుకోలేక ఒకరి మొహం ఒకరు చూసుకున్నాడు. ఆ వచ్చిన యువకుడే కర్ణుడు.

కర్ణుడు.. అర్జునుడుతో.. "అర్జునుడా.. నీవు కనబరిచిన ఆయుధ పనితనం కంటే నేనధికంగా ప్రదర్శించగలను" సింహగర్జనతో పలికాడు. ద్రోణుడి అనుమతి తీసుకొని.. యుద్ధ ప్రియుడైన కర్ణుడు.. అర్జునుడు అంతకుముందు ప్రదర్శించిన విద్యలన్నీ అతి నిర్లక్ష్యంగా, అతి లాఘవంగా ప్రదర్శించాడు. ఇది చూసిన దుర్యోధనుడి ఉత్సాహానికి అవధుల్లేకుండా పోయింది. కర్ణుణ్ణి కౌగలించుకొని దుర్యోధనుడు ఇలా అన్నాడు. "స్వాగతం. నీవు మహాబలుడవు. మా అదృష్టం కొద్దీ నీవు దైవాదేశంతో మా వద్దకు వచ్చావు. నేనూ, ఈ కురు రాజ్యమూ నీ ఆజ్ఞలకు లోబడి ఉంటాము" అని దుర్యోధనుడు పలికాడు. దానికి కర్ణుడు ఇలా అన్నాడు. "కర్ణుణ్ణయిన నేను.. ఓ రాజా! నీకు విశ్వాసపాత్రుణ్ణవుతున్నాను. నేను రెండు కోరికలు కోరుతున్నాను. "ఒకటి నీ ప్రేమ. రెండోది కేవలం అర్జునుడిపై పోరాటం మాత్రమే" అన్నాడు కర్ణుడు. దుర్యోధనుడు మరలా కర్ణుణ్ణి కౌగలించుకున్నాడు. "నా ఐశ్వర్యమంతా నీవు అనుభవించవచ్చు" అని దుర్యోధనుడు అన్నాడు. దుర్యోధనుడు.. కర్ణుడి పట్ల అమిత ప్రేమను వ్యక్తం చేయగా.. అర్జునుడి హృదయం క్రోధంతో నిండింది. కౌరవ సోదరులందరి అభినందనలు అందుకుంటూ నిలబడిన కర్ణుణ్ణి ఉద్దేశించి అర్జునుడు.. "కర్ణా.. నీవు నా చేతిలో మరణిస్తావు. కోరకుండా, ఆదరించకుండా, పిలవకుండా ఇక్కడికి వచ్చి ప్రేలాపనలు చేస్తున్నావు. నీవు నరకానికి పోతావు" అని అన్నాడు. కర్ణుడు నవ్వి నిర్లక్ష్యంగా.. "ఈ ప్రదర్శన భూమి అందరికీ నిర్ణయించబడినదే. ఓ అర్జునా! ఇది నీ ఒక్కరి కోసమే కాదు. బలమే అధికారం ఇస్తుంది. న్యాయాన్యాయాలు కూడా బలంపైనే ఆధారపడి ఉన్నాయి. బలంలేని వారి ఈటెల్లాంటి మాటల వల్ల ప్రయోజనమేమిటి?. మాటలు మాని బాణాలు వదులు" అన్నాడు. ఆ విధంగా కర్ణుడు.. అర్జునుణ్ణి ప్రేరేపించాడు. దీంతో అర్జునుడు ద్రోణుడి అనుమతి తీసుకొని, తన అన్నదమ్ములను కౌగలించుకొని, కర్ణుడితో పోరాటానికి సిద్ధపడ్డాడు. ఆ వైపు కర్ణుడు కూడా కౌరవ సోదరుల వద్ద సెలవు తీసుకొని అర్జునుణ్ణి సాయుధంగా ఎదుర్కొన్నాడు. ఈ ఇద్దరి తండ్రులు కూడా తమ పుత్రులను యుద్ధానికి ప్రోత్సహించారు. మేఘగర్జనల సృష్టికర్త ఇంద్రుడు, ఎడతెగని కిరణాలుగల సూర్యుడు ఆకాశమార్గంలో కనిపించారు. కుంతి కర్ణుణ్ణి చూసింది. అతడు తన పెద్ద కుమారుడు

అని తెలిసి మూర్ఛలో మునిగిపోయింది. విదురుడు ఇది కనిపెట్టి ఓ సేవకురాలిని పంపి కుంతికి సేద తీర్చే ఏర్పాటు చేశాడు. కుంతికి ఏమి చేయాలో తోచక మౌనంగా అక్కడే ఉద్వేగంతో నిలుచుండి పోయింది.

వీరులు ఇద్దరూ పోరు ప్రారంభించే సమయంలో.. ద్వంద యుద్ధ నిపుణుడు, న్యాయ శాస్త్ర కోవిదుడు కృపాచార్యుడు.. కర్ణుడు – అర్జునుడు మధ్య జొరబడి, "ఓయీ! నీతో పోరాడటానికి సిద్ధంగా ఉన్న ఈ రాజపుత్రుడు పాండురాజుకూ, కుంతికీ జన్మించిన కుమారుడు. కురువంశం వాడు. నీ పితృ, మాతృవర్గాన్ని, ఏ వంశం వల్ల నీ పుట్టుక గొప్పది అయిందో ఆ వివరాలు చెప్పు. నీ వంశ క్రమాన్ని తెలుసుకొన్న తరువాతే అర్జునుడు నీతో పోరాడతాడు. పెద్ద వంశపు రాకుమారులు వంశాన్వయంలేని ప్రతి సాహసికుడితో ద్వంద్వ యుద్ధం చేయకూడదని యుద్ధ నీతి చెపుతున్నది" అని వివరించాడు. కృపాచార్యుడి మాటలు విన్న కర్ణుడు, అధిక వర్షంతో బరువెక్కిన పద్మం మాదిరిగా ముఖం దించేశాడు. దుర్యోధనుడు కలగజేసుకొని.. "కేవలం రాజు కాదన్న అంశంపైనే కర్ణుడితో పోరాటం కాదంటే.. నేనిప్పుడే కర్ణుణ్ణి అంగరాజును చేసి కిరీట ధారణ చేస్తాను. భీష్మ, ధృతరాష్ట్రుల అనుమతి పొంది శాస్త్రప్రకారం జరగవలసిన పట్టాభిషేకం జరిపి, కర్ణుడికి అంగరాజ్యాధిపత్యం ఇచ్చి, తలపై కిరీటం ఉంచి, నవరత్నాలతో పొదిగిన రాజు కూర్చుండే వంటి ఆసనం ఇచ్చాడు. ఇక కర్ణార్జునుల పోరాటం జరగబోతున్నదనగా.. కర్ణుడిని పెంచిన అతిరథుడు చేతిలో ఒక కర్ర పట్టుకొని వణుకుతూ సభలోకి వచ్చాడు. ఆ ముదుసలిని చూసిన వెంటనే.. అప్పుడే అంగరాజు అయిన కర్ణుడు శిరస్సు వంచి, చేయాల్సిన మర్యాదలన్నీ బహుభక్తిగా చేశాడు. ముదుసలి.. కర్ణుణ్ణి, "కొడుకా" అని పిలిచి అతణ్ణి తన నీరస బాహువులతో కౌగలించుకున్నాడు. ఆనందాశ్రులు రాల్చుతూ.. అప్పుడే అంగరాజుగా అభిషిక్తుడైన కర్ణుడి శిరస్సును ఆర్ద్రతగా నిమిరాడు.

ఈ దృశ్యాన్ని చూసిన భీముడు.. నవ్వి.. "ఓహో.. కర్ణుడు తుదకీ ఈ రథ చోదకుడి కొడుకా. ఇతడు అర్జునుడి చేతిలో చనిపోవడానికి పాత్రుడు కాదు. ఇదే కాదు. అంగ రాజ్యాన్ని కూడా పరిపాలించడానికి వీలులేదు" అన్నాడు. ఆ విపరీత వ్యాఖ్యలు విని కర్ణుడి పెదవులు వణికాయి. కర్ణుడు నిట్టూర్పు విడిచి అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూస్తూ మౌనంగా ఉండిపోయాడు. కానీ దుర్యోధనుడు తీవ్ర ఆగ్రహంతో అడ్డువచ్చాడు. "ఓయీ వృకోదరా, నీవిలా మాట్లాడటం తగదు. క్షత్రియుడికి సాహస పౌరుషాలే ప్రధాన గుణాలు. అదీగాక గొప్పగొప్ప వీరుల చరిత్ర మూలాధారం వెదకుట అర్థంలేని అంశం. గొప్పవారు సాధారణ వంశస్తులయిన ఉదాహరణలు నేను వందల కొద్దీ ఇవ్వగలను" అదీగాక, నీ పుట్టుక గురించి కూడా అడగడానికి

వీలులేని కొన్ని ప్రశ్నలు అడిగే అవకాశముంది. ఈ కర్ణుడి యుద్ధ నైపుణ్యం, శరీరాకృతి, ఇతని కవచకుండలాలు – వీటన్నింటినీ చూసి చెప్పు. కచ్చితంగా ఈ కర్ణుడి వెనక ఏదో ఒక రహస్యం ఉండివుండాలి. పులి కడుపున లేడి పుడుతుందా? నువ్వేమంటున్నావు? ఈ కర్ణుడు ఈ ప్రపంచాన్ని మొత్తంగానే పాలించడానికి తగినవాడుగా భావిస్తున్నాను." అని చెప్పి కర్ణుడిని తన రథంపై ఎక్కించుకుని అక్కడి నుంచి వెళ్లిపోయాడు.

సూర్యాస్తమయం అయింది. జనాలందరూ కోలాహలంగా చెదిరిపోయారు. దీపాలవెలుగులో అక్కడ ఇంకా ఉన్న కొద్దిమంది గట్టిగా చర్చించుకుంటున్నారు. కొందరు అర్జునుడిని పొగిడారు. కొందరు కర్ణుడిని, మరికొందరు దుర్యోధనుడిని – ఎవరికి నచ్చిన విధంగా వారు సమర్థించారు.

తన కొడుకైన అర్జునుడికి, కర్ణుడికి గొప్ప పోరాటం తప్పదని ఊహించిన ఇంద్రుడు ఒక బ్రాహ్మణ వేషంలో వచ్చి దానకర్ణుడని పేరు తెచ్చుకున్న కర్ణుడి వద్దకు వచ్చి అతని కవచ కుండలాలను యాచిస్తాడు. ఈ విధంగా ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో రాబోతున్నాడన్న విషయాన్ని సూర్యుడు అంతకుముందే కర్ణుడికి కలలో కనిపించి హెచ్చరించాడు. ఐతే తనను అర్థించిన యాచకులకు కోరినది ఇచ్చివేసే దానగుణం కర్ణుడు ఇప్పుడు కూడా ఆ విధంగానే చేశాడు. పుట్టుకతోటీ మొలిచిన కవచకుండలాలను కత్తితో వొలిచి ఇంద్రుడికి దానంగా ఇచ్చాడు.

దేవరాజు ఇంద్రుడు ఆదానాన్ని స్వీకరిస్తూ సంతోషాన్ని, ఆశ్చర్యాన్ని కూడా ఏకకాలంలో పొందాడు. కర్ణుడి వంటి దాతలింకెవ్వరూలేరని అతనిని పొగిడాడు. తనలో తాను కర్ణుడి గొప్పతనాన్ని చూసి సిగ్గుపడి ఏదైనా ఒక వరం కోరుకోమని అన్నాడు. "శత్రువును చంపగల శక్తి అనే ఆయుధం నీవద్ద ఉంది. దానిని నాకు ఇవ్వు" అని కర్ణుడు కోరాడు. దానికి ఇంద్రుడు అంగీకరిస్తూనే "ఈ ఆయుధాన్ని నీ శత్రువులలో ఒకరిమీదే ఉపయోగించగలుగుతావు. ఆ శత్రువు ఎంత బలశాలి అయినా అతడిని ఈ ఆయుధం చంపివేస్తుంది. ఆ తర్వాత ఈ ఆయుధం నీకు ఉపయోగపడదు". అని షరతు విధిస్తాడు. ఆ తర్వాత ఇంద్రుడు అక్కడి నుంచి అదృశ్యమవుతాడు.

ఆ తర్వాత కర్ణుడు పరశురాముడి వద్దకు వెళ్లి తాను బ్రాహ్మణుడినని చెప్పి అతని శిష్యుడవుతాడు. అతని వద్దనుండి బ్రహ్మాస్త్రాన్ని పొందుతాడు. దానిని ఏ విధంగా ప్రయోగించాలో ఆ మంత్రవిద్య అంతా నేర్చుకుంటాడు. ఒకనాడు పరశరాముడు కర్ణుడి ఒడిలో తలపెట్టి నిద్రిస్తూవుంటాడు. అప్పుడు ఒక కీటకం వచ్చి కర్ణుడి తొడను కొరికి వేయనారంభిస్తుంది. గాయం నుండి రక్తం ప్రవహిస్తూవుంటుంది. కర్ణుడికి విపరీతమైన బాధ కలుగుతుంది. కాని తన గురువు

పరశురాముడికి నిద్రాభంగం కలగరాదని కర్ణుడు ఆ బాధనంతనూ ఓర్చుకుంటాడు. ఆ రక్తపు వెచ్చదనానికి పరశురాముడికి మెలకువవస్తుంది. అతను లేచి "ఓ ప్రియ శిష్యా, నువ్వు బ్రాహ్మణుడివి కావు. ఎటువంటి శారీరక బాధనైనా తట్టుకోగలిగేది క్షత్రియుడే. అది ఇతరులకు సాధ్యం కాదు. ఎవరు నువ్వు? నిజం చెప్పు" అని నిలదీస్తాడు. తాను బ్రాహ్మణుడనని ఆరంభంలో చెప్పినది అసత్యమని ఒప్పుకొంటూ తాను రథ చోదకుని కుమారుణ్ణని చెప్పాడు. పరుశురాముడికి కోపం ఆకాశానికి అంటింది. కర్ణుణ్ణి శపించాడు. "నీవు గురువును దగా చేశావు. నీవు నేర్చిన బ్రహ్మాస్త్రం నీకు అవసర సమయంలో దగా చేస్తుంది. నీకు అంత్యదశ ప్రాప్తించే సమయంలో ఈ మంత్రం నీకు స్మరణకు రాదు.

ఈ శాపం కారణంగా అర్జునుడితో తన చివరి పోరాట మహాతరుణంలో కర్ణుడికి అదివరకు బాగా గుర్తున్న బ్రహ్మాస్త్ర మంత్రం అప్పుడు స్మరణకు రాలేదు. కర్ణుడు.. దుర్యోధనుడికి విశ్వాసంగల స్నేహితుడు. ఇతడు చివరి వరకూ కౌరవుల పట్ల ఎంతో విశ్వాసంతో ఉన్నాడు. యుద్ధంలో భీష్ముడు, ద్రోణుడు పడిపోయిన తరువాత కర్ణుడు కౌరవ సేనకు ముఖ్య సేనాని అయ్యాడు. తరువాత రెండు రోజులు బహు పరాక్రమంతో పోరాడాడు. తుదకు కర్ణుడి రథచక్రం భూమిలో కుంగిపోయింది. ఆ చక్రాన్ని పైకి తీసి యుద్ధాన్ని నడపటానికి వీల్లేకుండా పోయింది. కర్ణుడు రథ చక్రాన్ని పైకి తీసే క్రమంలో ఉండగా అర్జునుడు అతణ్ణి చంపేశాడు. కుంతి ఎంతో విచారగ్రస్తురాలైంది. అంతకంటే విచారకరమైన సంగతి ఆ సమయంలో కర్ణుడి చరిత్రను దాచలవసి రావడమే.



ద్రోణాచార్యుని శిక్షణ

# అధ్యాయం - 12

# ద్రోణుడు

ద్రోణుడు భరద్వాజ అనే బ్రాహ్మణుడి కుమారుడు. ఇతడు వేదవేదాంగాలు నేర్చుకోవాలనుకొని ధనుర్వేదంలో ఆసక్తి కలిగి, ఆ విద్యను పూర్తిగా నేర్చుకున్నాడు. భరద్వాజ స్నేహితుడైన పాంచాల రాజు కుమారుడు ద్రుపదుడు, ద్రోణుడు ఒకే ఆశ్రమంలో ఒకే గురువు వద్ద విద్యనభ్యసించిన సహ పాఠకులు. వీరిద్దరూ యువకులు అవడం చేత త్వరగా స్నేహితులయ్యారు. ద్రుపదుడు తన యవ్వన ఆనందంలో ఉన్నప్పుడు తాను రాజు కాగానే ద్రోణుడికి అర్ధ రాజ్యమిస్తానని అతడితో అనేవాడు. విద్య నేర్చుకొని ద్రోణుడు వివాహం చేసుకొన్నాడు. వారి కుమారుడు అశ్వద్ధామ. ద్రోణుడు తన భార్య పట్ల, కుమారుడి పట్ల ఎంతో ప్రేమ కలిగి ఉండేవాడు. ఇదివరికెన్నడూ ద్రవ్యం అంటే ఎంతో నిర్లక్ష్యంగా ఉండే ద్రోణుడు ఇప్పుడు భార్య, కుమారుడి కోసం ద్రవ్యం సంపాదించాలన్న కోరిక కలిగింది. పరుశురాముడు తన సంపదనంతా

బ్రాహ్మణులకు ఇచ్చివేస్తున్నాడని ద్రోణుడు అతడి వద్దకు వెళ్లాడు. కానీ పరుశురాముడు అదివరకే తన ధనమంతా బ్రాహ్మణులకిచ్చేసి తపోవనానికి వెళ్లేందుకు ఉద్యుక్తుడయ్యాడు. కానీ ద్రోణుడికేదైనా సాయం చేయాలనుకొని తనకు బాగా అలవాటున్న శస్త్రాస్త్ర సంపదలను నేర్చి ద్రోణుడికి ఇస్తానని చెప్పాడు. ద్రోణుడు కష్టపడి తానిదివరకే గొప్ప ధనుర్వేది అయ్యి ఉన్నందున, పరుశురాముని వద్ద నేర్చుకొన్న మహాస్త్ర శస్త్ర విద్యలతో కూడా మహాపరాక్రమశాలి అయిన గొప్ప విలుకాడు అయ్యాడు. అప్పటికాలంలో ద్రోణుడు గొప్పగొప్ప రాజపుత్రులకు విలువిద్య, అస్త్ర శస్త్ర మొదలైన రాజోచిత విద్యలన్నీ నేర్పడానికి తగిన గురువు. ఆ కాలంలో పాంచాల దేశ రాజు చనిపోవడంతో ఆయన స్థానంలో ద్రుపదుడు రాజయ్యాడు. వారిద్దరూ సహపాఠకులు. ధృపదుడు కనబర్చిన స్నేహభావాన్ని.. రాజయిన తరువాత, అంతకుముందు అతడు తనతో అన్న మాటలు తలుచుకున్నాడు. ద్రోణుడు.. ధృపదుని వద్దకు వెళ్లాడు. కానీ విద్యాభ్యాస కాలపునాటి ధృపదునికీ, రాజయిన ఇప్పటి ద్రుపదునికీ తేడా ఉందని ద్రోణుడికి తోచింది.

పూర్వపు స్నేహితుణ్ణని ద్రోణుడు తన గురించి పరిచయం చేసుకున్నాడు. ద్రోణుణ్ణి చూసిన ధృపదుడు సంతోషం వ్యక్తం చేయలేదు. అతడు తన వద్దకు రావడం, తన వద్ద స్వతంత్రం తీసుకొని మాట్లాడటం సహించరాని విషయమని తలిచాడు. ధృపదుడు... "ఓయీ బ్రాహ్మణుడా! ఎంత సాహసం నన్ను నీ స్నేహితుణ్ణని పలుకరించానికి?. ఒక మూర్ధాభిషిక్తుడైన రాజుకూ, దేశదిమ్మరి అయిన ముష్టివాడికి స్నేహం ఎలా ఉంటుంది?. రాజ్యాన్ని పాలించే ఓ ప్రభువుతో.. పూర్వమెప్పుడో స్నేహముందని అనడం చూస్తే నువ్వో మూఢునిలా కన్పిస్తున్నావు. ఓ దరిద్రుడైన ముష్ఠివాడు రాజుకు స్నేహితుడు ఎలా అవుతాడు?. విద్యలేని శుంఠకు.. సకల శాస్త్ర పారంగతుడయిన విద్యావంతుడు స్నేహితుడెలా అవుతాడు? ఓ పిరికిపంద.. ధైర్యోపేతుడైన వీరుడికి స్నేహితుడెలా అవుతాడు? స్నేహమనేది సామాన్య పరిస్థితులుగల వారి మధ్యే ఉంటుంది. దేశాలు తిరిగే బిచ్చగాడు, రాజుకు స్నేహితుడు కాదు" అన్నాడు ధృపదుడు.

రాజు ధృపదుడి నిందా వాక్యాలు ద్రోణుడిలో కోపాగ్నిని రగిలించాయి. కోపంతో బుసలు కొడుతున్న ద్రోణుణ్ణి రాజసౌధం నుంచి గెంటివేశారు. తనను పరాభవించిన, పవిత్రమైన పూర్వ స్నేహాన్ని తోసిపుచ్చిన ధృపదుణ్ణి శిక్షించి తీరవలసిందేనని ద్రోణుడు శపథం తీసుకున్నాడు.

ఏదైనా వృత్తిని చేపట్టడానికి ద్రోణుడు హస్తినాపురం వెళ్లాడు. అక్కడ తన బావమరిది అయిన కృపాచార్యుడి ఇంట కొన్ని రోజులు ఏ పనీ లేక ఉన్నాడు. ఒకరోజు రాజు కుమారులందరూ పట్టణంలోని బహిరంగ ప్రదేశంలో బంతి ఆట ఆడుకుంటున్నారు. ఆ ఆటలో బంతితోపాటు యుధిష్టరుడి ఉంగరం ఒక నూతిలో పడింది. రాకుమారులంతా నుయ్యి చుట్టూ మూగారు. నూతి అడుగుభాగాన ఉన్న నిశ్చలమైన నీటిలో మెరుస్తున్న ఉంగరాన్ని చూశారు. కానీ ఎవ్వరూ దాన్ని బయటకు తీయడానికి ఉపాయం ఆలోచించడం లేదు. ఓ నల్లని బ్రాహ్మణుడు నవ్వుతూ వారి వెనుకే నిలబడి ఈ సంగతి చూస్తున్నాడని రాజకుమారులకు తెలియదు. ఆ బ్రాహ్మణుడు రాజకుమారులతో ఇలా అన్నాడు. “ఓ రాజకుమారులారా?. మీరంతా ప్రతాపానికి పేరెన్నికగన్న భరత వంశ జాతులకు చెందిన వారు. ధనుర్విద్య నేర్చిన ఎవ్వడైనా ఈ బంతిని ఎందుకు తీయలేకపోతున్నారు?. మీకోసం ఈ బంతిని తీయనా?” అన్నాడు. దీనికి యుధిష్టరుడు నవ్వుతూ.. హాస్యంగా.. “ఓ బ్రాహ్మణుడా.. మీరీ బంతిని పైకి తీస్తే కృపాచార్యుల ఇంట మీకు కడుపునిండా భోజనం పెట్టిస్తాను” అన్నాడు. దీంతో ద్రోణుడు ఓ గడ్డి పోచను నూతిలో విడిచి కొన్ని మంత్రాలను ఉచ్ఛరించాడు. ఆ గడ్డిపోచను నూతిలోకి దింపుతూ తుదకు ఒక బాణం వేసి బంతికి గుచ్చుకునేటట్లు చేశాడు. తరువాత ఒకటి తర్వాత ఒకటిగా గడ్డిపోచలను నూతిలోకి వదిలాడు. చివరికి ఓ బాణం గొలుసులా తయారైంది. దాంతో ద్రోణుడు బంతిని బయటకు తీశాడు. ఆశ్చర్య పోవడం రాజకుమారుల వంతైంది. యుధిష్టరుడి ఉంగరాన్ని కూడా బయటకు తీయాలని ఆ బ్రాహ్మణుణ్ణి కోరారు. ద్రోణుడు ఒకరి విల్లు పుచ్చుకొని అమ్ము తొడిగి నూతికి అడుగు భాగాన ఉన్న ఉంగరం మధ్యకు సారించాడు. ఆ బాణం చండ ప్రచండ వేగంతో నూతి అడుగు భాగాన్ని తాకి ఉంగరంతోపాటు బయట పడింది. బ్రాహ్మణుడు ఆ ఉంగరాన్ని నవ్వుతూ రాజకుమారులకు ఇచ్చాడు.

ఆ బ్రాహ్మణుడి ప్రతిభావంతమైన క్రియలను పరిశీలించిన రాకుమారులందరూ ఆశ్చర్యపోయారు. “ఓ బ్రాహ్మణోత్తమా, మేమందరం మీకు వందనాలు చేస్తున్నాం. తమరెవరు? మీకు మేము చేయాల్సిన ఉపకారం ఏమైనా ఉందా అని అడిగారు. అందుకు ద్రోణుడు, “ఓ రాకుమారులారా మీరంతా భీష్ముడి వద్దకు వెళ్లి నేనెవరినో ఆయనను అడిగి తెలుసుకోండి” అన్నాడు. రాకుమారులు భీష్ముడి వద్దకు వెళ్లి గుర్తులు చెప్పి అతడెవరైనదీ అడిగారు. వారు చెప్పిన వర్ణనను బట్టి ఆ బ్రాహ్మణుడు ప్రసిద్ధి చెందిన ధనురాచార్యుడైన ద్రోణుడే అని భీష్ముడు గ్రహించాడు. పాండవ కౌరవులకు మిగిలి ఉన్న విద్యాభ్యాసమంతా చేయించడానికి ద్రోణుడే సరైనవాడని భావించాడు.

ద్రోణాచార్యుల వారిని ప్రత్యేక గౌరవంతో ఆహ్వానించి.. రాజపుత్రులకు ధనుర్వేద గురువుగా నియమించాడు.

కౌరవ, పాండవ కుమారులందరూ వారి వారి విద్యలు పూర్తి చేసిన తరువాత గురుదక్షిణగా ద్రుపదరాజును బంధించి ప్రాణంతో తన వద్దకు తీసుకురావాలని కర్ణుణ్ణి, దుర్యోధనుణ్ణి కోరాడు. ద్రోణుడి ఆదేశం మేరకు వారిద్దరూ వెళ్లి తమ కార్యాన్ని నెరవేర్చలేక తిరిగివచ్చారు. తరువాత అదే పనిమీద అర్జునుణ్ణి పంపారు. అతడు యుద్ధంలో ద్రుపదుణ్ణి ఓడించి, ఆయననూ, ఆయన మంత్రిని కూడా బంధించి తెచ్చి ద్రోణుడి ముందు పడేశాడు.

ద్రోణుడు నవ్వుతూ.. ద్రుపదుడితో ఇలా అన్నాడు. “ఓయీ రాజశ్రేష్ఠుడా! నీ ప్రాణాల విషయమై భయపడకు. మన చిన్నతనంలో ఇద్దరం సహ విద్యార్థులం, స్నేహితులం. ఈ అంశాన్ని ప్రభువయ్యాక నీవు మరిచి నన్ను అవమానించావు. రాజుకు రాజే స్నేహితుడని నువ్వు నాతో చెప్పావు. నీ రాజ్యాన్ని జయంచి నేనిప్పుడు రాజునయ్యాను. నేను రాజునయినా నీ స్నేహాన్ని విడిచిపెట్టను. కనుక నాకు సంక్రమించిన రాజ్యంలో నీకు అర్ధ భాగం నీకు తిరిగి ఇస్తున్నాను. సమాన రాజుల మధ్యే స్నేహం ఉంటుందని నీవు అన్నావు. ఇప్పుడు మనిద్దరం సమాన రాజులం. కనుక మన స్నేహాన్ని నిలుపుకుందాము. నీ మొదటి రాజ్యంలో సగభాగం నాది, సగ భాగం నీది” అన్నాడు ద్రోణుడు. ఇదివరకు ద్రుపదుడి చేతిలో తాను పొందిన పరాభవానికి ఇది సరిపోయిందని ద్రోణుడు.. ద్రుపదుణ్ణి స్వేచ్ఛగా విడిచిపెట్టాడు.

ద్రుపదుడికి గర్వభంగమైంది. ద్రోణుడిపై పగ, ద్వేషంతో కళ్లు ఎరుపెక్కాయి. తన జీవితంలో ఏవిధంగానైనా ద్రోణుడికి పరాభవం చేయాలనే లక్ష్యం పెట్టుకున్నాడు ద్రుపదుడు. అందుకు ఉపవాసాల, యజ్ఞాలు, తపస్సులు చేశాడు. ఇవన్నీ దేవతలకు సంతోషమిచ్చాయి. ద్రోణుణ్ణి చంపగల దృష్టద్యుమ్నుడు అనే కుమారుణ్ణి, అర్జునుణ్ణి వివాహమాడే ద్రౌపది అనే కుమార్తెను ద్రుపదుడు వరంగా పొందాడు. ఈ దృష్టద్యుమ్నుడే కురుక్షేత్ర యుద్ధంలో పాండవ సేనా నాయకుడయ్యాడు. కొన్ని విచిత్ర పరిస్థితులలో యుద్ధంలో ద్రోణుడిని దృష్టద్యుమ్నుడు చంపగలిగాడు. ద్రౌపది పాండవులకు భార్య అయ్యింది.

◈

## అధ్యాయం - 13

# లక్క ఇల్లు

**భీ**ముడి దేహబలం చూసి, అర్జునుడి ధనుర్ నైపుణ్యాన్ని చూసి దుర్యోధనుడిలో ఈర్ష్య అసూయలు పెరిగిపోతున్నాయి. కర్ణుడు, శకుని దుర్మార్గపు పన్నుగడలు పన్నుతున్నారు. ప్రతి విషయంలోనూ వారు దుర్యోధనుడికి తోడ్పడుతున్నారు. దృతరాష్ట్రుడు నిస్సంశయంగా బుద్ధి, జ్ఞానం కలవాడే. అతడు తన తమ్ముడైన పాండు రాజు బిడ్డలను అమితంగా ప్రేమించాడు. కానీ మనో దౌర్భల్యం వల్ల, వృద్ధాప్యం వల్ల, తన పుత్రుల పట్ల ప్రేమకు పూర్తిగా లోబడి ఉండేవాడు. తన పిల్లల కోసం చేయరాని పని చేయదగిందిగా యోచిస్తూ.. ఒకప్పుడు తెలిసి కూడా చెడు మార్గాన పడేవాడు.

పాండవులను చంపేయడానికి కౌరవులు అనేక మార్గాలు అన్వేషిస్తున్నారు. కౌరవుల కుట్రల నుండి పాండవులను రక్షించే కోరికగల విదురుడి రహస్య సహాయంతో పాండవులు చావకుండా బతికి ఉన్నారు. పట్టణంలోని ప్రజలందరూ పాండవులనే పొగడటం దుర్యోధనుడి దృష్టిలో మహాపరాధం అయ్యింది. యుధిష్టరుడే రాజు అవడానికి తగినవాడని ఎల్లవేళలా ప్రజలు అనుకోవడమే పాండవులపై క్రోధానికి

కారణమైంది. ప్రజలు ఒక చోట గుమిగూడితే రకరకాలుగా చెప్పుకునేవారు. ధృతరాష్ట్రుడు ఎప్పటికీ రాజు కాలేడు. అతడు పుట్టు గుడ్డి కనుక. అతడు రాజ్యాన్ని చేతిలో ఉంచుకోకూడదు. భీష్ముడు కూడా రాజు కాలేడు. అతడు సత్యవంతుడు. తనకు రాజ్యం అక్కరలేదని గట్టి నిర్ణయం తీసుకున్నాడు. కనుక యుధిష్టరుడే రాజ్యానికి అర్హుడు. అతడే కురు వంశాన్ని, రాజ్యాన్ని, న్యాయంగా పాలించడానికి అర్హుడు అని ప్రజలు చెప్పుకుంటున్నారు. ఈ మాటలతో దుర్యోధనుడు ఈర్ష్య చెందాడు. కోపంతో దహించుకుపోయాడు.

దుర్యోధనుడు తండ్రి ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్లి ప్రజలనుకునే విషయాలను చెవిన వేశాడు. “తండ్రీ జనులు ఎందుకు అలా మాట్లాడుతున్నారు. కనీసం భీష్ముడన్నా, మీరన్నా గౌరవం ఎందుకు లేదు. తక్షణమే యుధిష్టరుకి రాజ్యం ఇవ్వాలని కోరుతున్నారు. మీరు అంధులవడం వల్ల మిమ్ములను తోసిపుచ్చి పాండురాజు రాజయ్యాడు. యుధిష్టరుడు తండ్రి తరువాత రాజయితే తమకేమిటి లాభం?. మీ సంతానానికేమిటి గతి. యుధిష్టరుడి తరువాత అతడి కుమారుడు, ఆ తర్వాత అతడి కుమారుడు రాజు అవుతాడేమో. ఇంక మేము ఎప్పుడవ్వాలి?. దరిద్ర బంధువుల కూటమిలోకి దిగిపోయి రాజ్యం చేసేవారిచ్చే భత్యపు నూకలు ఆహారంగా తీసుకునే వాళ్లమవుతాము. అలా బతికే కంటే చావే గొప్పదవుతుంది” అన్నాడు దుర్యోధనుడు. కుమారుడి మాటలతో ధృతరాష్ట్రుడు ఆలోచనలో పడ్డాడు. “కుమారా నువ్వు చెప్పినది నిజం. అయినా యుధిష్టరుడు ధర్మమార్గము తప్పడు. అతడందరినీ ప్రేమిస్తాడు. చనిపోయిన తన తండ్రి సుగుణాలన్నీ అతడిలో ఉన్నాయి. ప్రజలు ఆయనను పొగుడుతారు. సహాయం చేస్తారు. పాండురాజు తన సుగుణ సంపన్నతతో మంత్రి వర్గానికి, సేనా నాయకులకు ప్రేమ పాత్రుడై ఉన్నాడు. వారందరూ ఇప్పుడు యుధిష్టరుడినే బలపరిచి ఆయన మాటలే మాట్లాడతారు. పాండవులను దైవాలుగా చూస్తున్నారు. వీరందరినీ మనమే ఎదుర్కొనలేము. మనమేదైనా అన్యాయం చేస్తే ప్రజలు తిరుగుబాటు చేసి మనను చంపేసే పరిస్థితీ రావచ్చు. లేదా వెళ్లగొట్టడమైనా చేస్తారు. అలాంటి పరిస్థితులు ఏర్పడితే మనకు సిగ్గుచేటు అవుతుంది” అన్నాడు ధృతరాష్ట్రుడు. దుర్యోధనుడు తండ్రి మాటలకు అడ్డం వస్తూ.. “మీ భయానికి కారణం లేదు. భీష్ముడు తటస్థంగా ఉంటాడు. అశ్వద్ధామ ఎప్పుడూ నాతోటి వాడే. అతడి తండ్రి ద్రోణాచార్యుడు, మామ కృపాచార్యుడు మనవారే. విదురుడు బహిరంగంగా మనకు ఎదురు రాజాలడు. అతడు దుర్బలుడు. వెంటనే పాండవులను వారణావతానికి పంపండి. నేను ప్రమాణ పూర్తిగా చెబుతున్నాను. నాకు ఇది ఎంతో విచారంగా ఉంది. ఇది మరింత హెచ్చితే నేను భరించలేను. ఈ రాజ్య అంశం నా గుండెలో గుచ్చుకుంటోంది. నిద్రలేనివాడిగా చేస్తోంది. నాకీ జీవితమే దుర్భరంగా ఉంది.

పాండవులను వారణావతానికి పంపితే.. మన భాగమంతా బలపరుచుకోవచ్చు" అన్నాడు దుర్యోధనుడు.

తర్వాత మరికొంతమంది రాజకీయ వేత్తలను దుర్యోధనుడి పక్షం వహించేలా దుర్యోధనాదులు బలవంతం చేశారు. వారు ధృతరాష్ట్రుడికి.. స్వపక్షానికి ఉపయోగించుకునేలా సలహాలు ఇస్తున్నారు. ఈ రాజకీయాలకు నాయకుడు శకుని మంత్రి అయిన కణికుడు. అతడు ధృతరాష్ట్రుడిని ఉద్దేశించి.. "ఓ రాజా, పాండు రాజు కుమారుల పట్ల జాగ్రత్తగా ఉండు. ఎందవలనంటే.. వారి మంచితనం, ప్రజల ఆదరణ, నీకూ, నీవారికీ చాలా ప్రమాదం. పాండవులు నీ తమ్ముడి కుమారులు. బంధుత్వం దగ్గరైన కొద్దీ కుట్రలూ, అపాయాలూ ఎక్కువవుతాయి. వారేమో బలవంతులు. రాజనేవాడు పేరులోనేగాక.. కార్యాల్లో కూడా గొప్పవాడుగా ఉండాలి. కార్యాలు ఆచరణలో పెట్టినప్పుడే ప్రజలకు రాజు ప్రభావమేమిటో తెలుస్తుంది. రాచకార్యాలు రహస్యంగా ఉంచాలి. ఓ చక్కని ఉపాయం సూచించే కార్యాన్ని చేపట్టినప్పుడే మన ప్రజలకు మన ఘనత తెలుస్తుంది. అదీ గాక చెడును నివారించాలి. ఒక ముల్లు శరీరంలో గుచ్చుకొని ఉండగా.. దాన్ని నిర్మూలన చేయనప్పుడు అది ఓ వ్రణమై బాధను కలిగిస్తుంది. ప్రతాపమున్న శత్రువులను చంపాలి. అంతేగాని కనికరించడం మిక్కిలి తప్పు. శక్తిలేని శత్రువును కూడా వదిలి పెట్టకూడదు. ఎందుకుంటే.. నిప్పుకణికైనా అడివిని కాల్చేస్తుంది. ఒక బలవంతుడైన శత్రువును ఉపాయంతో చంపాలి. అంతేగాని కనికరించడం మిక్కిలి పొరబాటు. పాండు కుమారుల పట్ల నీవు జాగరూకతతో ఉండు. వారు మిక్కిలి బలమూ, పరాక్రమమూ కలవారు".

దుర్యోధనుడు.. చాలా మంది ప్రముఖులను తన పక్షానికి సంపాదించానని తండ్రి ధృతరాష్ట్రుడికి చెప్పాడు. "ఇది వరకు పాండు రాజు రాచరికంలోని పరిచారికల, ఉద్యోగుల అభిమానాన్ని డబ్బిచ్చి, మర్యాద చేసి పొందగలిగాను. మంత్రులనూ అలాగే మన పక్షానికి చేర్చాను. నీవు పాండవులను వారణావతం వెళ్లేలా చాతుర్యం ప్రదర్శించి ప్రోత్సహిస్తే.. పట్టణ ప్రజలూ, రాజ్య ప్రజలూ మన పక్షమే వహిస్తారు. ఇక్కడ వారికి ఒక్క స్నేహితుడు కూడా ఉండడు. ఎప్పుడైతే రాజ్యం ఒకసారి మన సొంతమైందో పాండవులకు మనలను శాసించే శక్తి పోతుంది. వారిని మరలా ఇక్కడికి రమ్మనడానికి కూడా అవకాశం ఉండదు" అన్నాడు దుర్యోధనుడు.

తాను ఏదయితే నమ్మదలిచాడో ఆ అంశాలే ఇతరులూ చెప్పడం వల్ల ధృతరాష్ట్రుడిలో మార్పు వచ్చింది. తన కుమారుడి ఊహలకు ఒప్పుకున్నాడు. ఇక చేయాల్సింది వారు ఇదివరకే నిర్ణయించుకున్న రహస్య పన్నాగాన్ని అమల్లో పెట్టడమే. మంత్రులందరూ పాండవుల సమక్షాన వారణావతాన్ని వేనోళ్లా పొగిడారు. శివుడి

ఉత్సవం అనేక వినోదాలతో, అలంకారాలతో జరుగుతుందని చెప్పారు. ఏమీ ఎరుగని అమాయకులైన పాండవులు దీన్ని నమ్మారు. "పాండవులు తప్పక శివోత్సవాన్ని చూడాలని ధృతరాష్ట్రుడు ప్రేమ పూర్వకంగా పాండవులకు చెప్పాడు. వాస్తవంగా ఉత్సవాలు కూడా చూడదగినవే. ఈ ఉత్సవాలను తిలకించడానికి వచ్చే పాండవులను మర్యాదతో ఆహ్వానించడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. దీనితోపాటు ధృతరాష్ట్రుడు చెప్పడం వల్ల కూడా పాండవులు వారణావతానికి వెళ్లడానికి భీష్మాది పెద్దల వద్ద సెలవు తీసుకొని బయలుదేరారు.

దుర్యోధనుడి ఆనందానికి అవధులు లేవు. అతడు కర్ణ, శకునితో ఆలోచించి వారణావతంలో కుంతిని, పంచ పాండవులను చంపడానికి కుట్రపన్నారు. మంత్రి పురోచనుణ్ణి పిలిపించి రహస్య ఆజ్ఞలు జారీ చేశాడు. పురోచనుడు వారి ఆలోచనలను కార్యరూపంలో పెట్టడానికి ఎంతో విశ్వాసంతో అంగీకరించాడు. పాండవులు వారణావతం చేరకముందే, పురోచనుడు.. తనకిచ్చిన రహస్య ఆలోచన ప్రకారం వారికంటే ముందే అక్కడికి వెళ్లాడు. పాండవులను ఆహ్వానించడానికి, వారి ఉపయోగ నిమిత్తమూ ఒక గొప్ప భవనాన్ని నిర్మించడానికి ఏర్పాట్లలో నిమగ్నమయ్యాడు.

త్వరగా నిప్పంటుకునేప అనువైన వస్తువులను (టేకు, లక్క, నెయ్యి, నూనె, కొవ్వులను) భవన నిర్మాణానికి వినియోగించారు. గోడలకు వేసి మెరుగు పూత శీఘ్రంగా హతమయ్యే వస్తువులతోనే చేశారు. ఈ గృహంలోని కొన్ని భాగాల్లో వేగంగా నిప్పంటుకునే ఎండు పదార్థాలను ఉంచారు. కూర్చోవడానికి, పడుకోవడానికి ఏర్పాటు చేసిన స్థలాల్లో అతి త్వరగా నిప్పంటుకొనే పదార్థాలను ఎక్కువగా అమర్చారు.

పాండవుల సౌకర్యార్థం.. వారు పట్టణంలో కొత్త భవనం సిద్ధమయ్యేలోపుగా ఎలాంటి అనుమానానికి తావు లేకుండా నివసించడానికి వీలైన అన్ని ఏర్పాట్లూ చేశారు. కొద్ది కాలంలో పాండవులు లక్క ఇంటిలో నివసించడానికి వెళ్లిన తరువాత.. రాత్రి నిద్రించే సమయంలో నిప్పంటించి వారిని హతమార్చడమే దుర్యోధనాదుల లక్ష్యం. కానీ వారణావతం ప్రజలు పాండవులకు చేసే గౌరవ మర్యాదలు, సదుపాయాలు చూస్తే పాండవులకు ఏ విధమైన అనుమానమూ రాదు. నిప్పుతో లక్క ఇల్లు దగ్ధమైతే అదో ప్రమాదంగా భావించేలా రహస్య పన్నాగానికి రూపకల్పన చేశారు. ఇందులో కౌరవులను అనుమానించడానికి ఎవరికైనా ఎలాంటి అవకాశమూ లేనంత పగడ్బందీగా ప్రణాళిక వేశారు.

◈



లక్క ఇంటి నుండి తప్పించుకుంటున్న పాండవులు

## అధ్యాయం - 14

# పాండవుల విమోచన

**పె**ద్దల వద్ద మర్యాద పూర్వకంగా సెలవు తీసుకొని మిత్రులను కౌగలించుకొని పాండవులు వారణావతానికి బయలుదేరారు. రాజపుత్రులు, పురజనులు వారిని కొంతదూరం సాగనంపి తిరిగి పట్టణానికి తిరిగి వచ్చారు. ఒక్క యుధిష్ఠరుడికి మాత్రమే అవగాహన అయ్యేలా విదురుడు.. జాగ్రత్త అని చెప్పాడు. "తెలివైన శత్రువు ఉద్దేశాన్ని గ్రహించి వారికన్నా ముందజ వేసి పనిచేసినవాడే అపాయం నుంచి తప్పించుకోగలడు. ఉక్కు లోహంతో చేసిన ఆయుధం కంటే ప్రమాదాన్ని కలుగజేసే ఆయుధాలున్నాయి. బుద్ధిమంతుడైనవాడు వాటి నుంచి తప్పించుకోవాలంటే వాటినుంచి తనను తాను కాపాడుకోవడానికి సాధనాల కోసం ప్రయత్నించాలి. అడవిని కాల్చేసే అగ్ని.. కన్నంలోని ఎలుకను గాని, సొరంగం చేసుకొని భూమిలో ఉండే ఏదు పందిని గానీ ఏమీ చేయలేదు. బుద్ధిమంతుడైనవాడు నక్షత్ర గణన వల్ల తాను ఏ పరిస్థితుల్లో ఉన్నదీ తెలుసుకోగలడు" అని అన్నాడు విదురుడు. దుర్యోధనుడు ఏదో కుట్ర చేసి

ఉండొచ్చని, దాని నుంచి తప్పించుకునే మార్గాన్ని పరోక్షంగా విదురుడు తనకు చెప్పాడనిపించింది యుధిష్ఠరుడికి. విదురుడు తనకు చెప్పిన అంశాలను కుంతీ దేవికి వివరించి చెప్పాడు. పాండవులంతా మహదానందంతో ప్రయాణం ప్రారంభించారుగానీ వారి గమనం రానురాను విచార హృదయాలతో సాగుతోంది.

వారణావత ప్రజలు పాండవుల రాకను విని ఎంతో ఆనందంతో వారిని పట్టణంలోకి ఆహ్వానించారు. పాండవుల కోసం నిర్మాణం మొదలెట్టిన ప్రాసాదం పూర్తయ్యే వరకూ వారిని ఇతర గృహాల్లో కొద్దికాలం ఉంచారు. భవంతి సిద్ధమైన వెంటనే పురోచనుడు ముందుండి వారిని అక్కడికి తీసుకువెళ్లాడు. ఆ భవంతికి "శివం" అనే పేరు పెట్టారు. "శివం" అంటే 'అదృష్టం' అనీ, శ్లేషగా అయితే 'మారణ యంత్రం' అనీ అర్థముందని చెపుతారు.

యుధిష్ఠరుడు.. విదురుడి మాటలను తలుచుకొని గృహాన్ని ఓ మారు జాగ్రత్తగా పరిశీలించాడు. ఆ గృహం శీఘ్రంగా తగులబడే వస్తు సముదాయంతో కట్టబడిందని అవగతం చేసుకున్నాడు. "ఈ గృహం 'మారణ యంత్రం' అని మనకు తెలిసినా.. మనకీ సంగతి తెలిసినట్లు పురోచనుడికి తెలియకూడదు. సకాలంలో మనము పారిపోవాలి కనుక ఏమాత్రమైన అనుమానాన్ని అతడికి కలిగించినా మనం పారిపోవడానికి వీలుండదు" అన్నాడు యుధిష్ఠిరుడు భీముడితో.

పాండవులు ఆ గృహంలో హాయిగా కాలం వెళ్లబుచ్చుతున్నారు. ఎలాంటి చింతా లేకుండా కాలం గడుపుతున్నారు. ఈలోగా విదురుడు పంపిన సైనికుడు పాండవులను రహస్యంగా కలిశాడు. "మీరిక్కడికి వచ్చేటప్పుడు విదురుడు నర్మగర్భంగా కొన్ని మాటలు చెప్పారు. నేను తమ సహాయార్థం, అంటే మిమ్మల్ని రక్షించడానికి విదురుడు పంపగా వచ్చాను" అని చెప్పాడు సైనికుడు.

అప్పట్నించీ ఆ సైనికుడు పురోచనుడికి తెలియకుండా రహస్యంగా అక్కడ చాలా దినాలు పనిచేశాడు. ఆ లక్క ఇంటి నుంచి పట్టణం వెలుపలికి ఓ సొరంగం తవ్వారు. ఇంటి గోడ పునాదుల నుంచి, ఇంటి చుట్టూ ఉన్న కందకం దిగువ నుంచి ఈ సొరంగాన్ని తవ్వారు. ఈ లక్కకోట ద్వారం వద్దనే పురోచనుడి ఇల్లు ఉంది. పాండవులు రాత్రిపూట సాయుధులై జాగ్రత్తగా ఉండేవారు. పగలు అడవికి వేటకు వెళ్లేవారు.

పాండవులు లక్క ఇంటిలో నివాసం చాలా కాలమైందని భావించాడు. యుధిష్ఠరుడుకు కూడా దుర్యోధనాదుల కార్యాచరణ కాలం సమీపించిందని తెలుసుకున్నాడు. యుధిష్ఠరుడు తమ్ముళ్లను పిలిచాడు. ఈ రోజే మనం పారిపోవాలని, ఈ రోజు తప్పితే పారిపోవడానికి కుదరదని, చావాల్సి వస్తుందని హెచ్చరించాడు.

ఆ రోజే కుంతీదేవి తమ కోటలోని (లక్క ఇంటిలోని) సేవకులకు, దాసదాసీజనానికి విందు ఇచ్చారు.

అర్ధరాత్రి సమయంలో ఆ లక్క భవనానికి అక్కడక్కడా భీముడు నిప్పంటించాడు. కుంతీదేవీ, పాండవులు నేల సొరంగంలో ప్రవేశించి.. ఆ చీకటిలోనే తడుముకుంటూ బయటపడ్డారు. కొద్ది సమయంలోనే లక్క భవంతిని మంటలు చుట్టుముట్టాయి. ఆ భవన పరిసర ప్రాంత ప్రజలు తీవ్ర భయందోళన చెందారు. కొంతమంది ఎలాగైనా ఆ మంటలను ఆర్పాలని ప్రయత్నించారు. వీలుకాలేదు. "అయ్యో ఇది కచ్చితంగా దుర్యోధనుడి పనే. ఏ పాపం ఎరుగని పాండవులను చంపేస్తున్నాడు'' అంటూ అరుస్తున్నారు. లక్క భవంతి మొత్తం కాలి బూడిదైంది. పురోచనుడి గృహానికి కూడా మంటలు అంటుకున్నాయి. అతడు పారిపోవడానికి వీలులేకపోయింది. అతడి దుర్మార్గపు స్వభావం అందరికీ తెలిసిన విషయం కావడం చేత ఆయన మరణించినప్పటికీ ఎవ్వరూ జాలి పడలేదు.

లక్క భవంతి కాలిపోవడం గురించి వారణావత ప్రజలు హస్తినాపురానికి వార్త పంపారు. "పాండవులు నివసించిన భవంతి కాలిపోయింది. మంటల నుంచి పాండవులు బయటపడే వీలులేకపోయింది. వారు చనిపోయారు" అని సమాచారం ఇచ్చారు. ధృతరాష్ట్రుడు, అతని కుమారులు పాండవుల విషాదాంతంపై విచారం తెలపడానికి కట్టుబట్టలు వదిలి ఏక వస్త్రాలను ధరించారు. సోదరుడి కుమారులు చనిపోయినప్పుడు ఇలా వస్త్రాలు ధరించడం ఆచారం. పాండవులు, కుంతీ చనిపోయారని భావించి వారికి అంత్యక్రియలు (ఉదక క్రియలు) నిర్వహించారు. వారి మరణానికి ఎంతో గాఢంగా విచారించినట్లు చూపరులు భావించడం కోసం గట్టిగా ప్రయత్నించారు. అంతమందిలోనూ ఒక్క విదురుడు మాత్రమే విచారం కనబరచడం లేదనే భావన కొందరిలో వ్యక్తమైంది. ఆయన గొప్ప వేదాంతి అయినందున అలా ఉన్నాడని భావించారు. వాస్తవంగా పాండవులు సులువుగా ప్రాణహాని లేకుండా తప్పించుకున్నారని విదురుడి అభిప్రాయం. అతనికి విచారం అంటూ ఉందంటే అది పాండవులు పడుతున్న బాధల గురించే. అదీ మనస్సులో మాత్రమే. బయటకు కనిపించదు. భీష్ముడు విచారంలో మునిగి ఉన్నాడని తెలుసుకొని విదురుడు ఆయన వద్దకు వెళ్లాడు. ఆయనను ఓదార్చుతూ జరిగిన విషయాన్ని, పాండవులు సురక్షితంగా ఉన్నట్లు తెలిసిన విషయాన్ని రహస్యంగా చెప్పాడు.

తల్లి, అన్నదమ్ములు నిద్రలేక జాగరూకులై ఉండటం వల్ల, భయాందోళన వల్ల చాలా అలసి పోయారని తలచాడు భీముడు. తల్లిని భుజంపైన, నకుల సహదేవులను తన తొడలమీద, తన రెండు చేతులతో యుధిష్టరుడు, అర్జునుణ్ణి

నిలిపాడు. ఎలాంటి ఆయాసమూ చెందక అడవిలో ఓ ఏనుగు మాదిరిగా చెట్లనూ, తుప్పలను తప్పిస్తూ, మార్గాన్ని ఏర్పరుస్తూ తీసుకువెళ్తున్నాడు. వారు గంగానది ఒడ్డుకు చేరేసరికి ఓ పడవ ఉంది. ఆ పడవ నడిపేవాడికి వీరి రహస్యం తెలుసు. కనుక అక్కడ పడవతో సిద్ధమై ఉన్నాడు. ఆ చీకటిలోనే వారు గంగానదిని దాటి ఓ గొప్ప అరణ్యంలో ప్రవేశించారు. రాత్రంతా చీకటి ముసుగులో ఇమిడిపోయి అడవి జంతువుల భయంకరమైన అరుపులు వింటూ నడిచారు. అందరూ పూర్తిగా అలసిపోయారు. దాహం భరించలేక, శరీర కష్టం వల్ల అపస్మారక లక్షణాలు కలిగాయి. దాంతో కూర్చుండిపోయారు.

కుంతీదేవి అలసటతో నేల మీద పండుకొంది. అంతలోనే నిద్రలోకి జారుకుంది. ఆ చీకటిలో భీముడు తాగునీటి కోసం దట్టమైన అడవిలో వెతకడం ప్రారంభించాడు. ఓ నీటి మడుగు కనిపించింది. తన వస్త్రాన్ని తడిపి, తామరాకులతో దొప్పలు తయారు చేసి, వాటిలో నీటిని నింపి తీసుకొచ్చి తల్లికీ, అన్నదమ్ములకీ అందజేశాడు. దాహం తీర్చుకున్న అందరూ నిద్రలోకి జారుకున్నారు. భీముడు మాత్రమే మెలకువగా ఉండి దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. "అడవిలోని మొక్కలు, తీగలు సైతం ఒకదానికొకటి సాయం చేసుకొని సుఖంగా జీవిస్తున్నాయి. దుర్మార్గుడైన ధృతరాష్ట్రుడు, దుర్యోధనుడు మమ్మల్ని ఎందుకింత కష్టపెడుతున్నారు" అనుకున్నాడు భీముడు.

పాండవులు చాలా కష్టాలు పడతూ.. అపాయాలను ఎదుర్కొంటూ నడుస్తున్నారు. నడక తొందరగా సాగడానికి కొంతదూరం పాటు తల్లిని ఎత్తుకొని మోయడం తప్పనిసరయింది. మార్గంలో వ్యాస మహర్షిని కలిశారు. వారంతా ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశారు. ఆయన వాక్యాలతో ధైర్యం పొందారు. కుంతి తాము పడిన కష్టాలన్నీ వ్యాసుడికి చెప్పింది. "ఎంతటి ధార్మికుడైనా, సర్వ కాలాల్లోనూ ధర్మమార్గాన్నే అనుసరించ కలిగినంత ధైర్యం కలిగి ఉండడు. ప్రతివారూ వారి వారి ఖర్మ ఫలితాన్ని అనుభవించాల్సిందే. విచారానికి తావీయకండి" అన్నాడు వ్యాస మహర్షి. వారంతా వ్యాసుడి సూచనను అనుసరించి బ్రాహ్మణ వేషాలు ధరించి ఏకచక్రపురంలో ప్రవేశించారు. అక్కడొక బ్రాహ్మణుడి ఇంటిలో ఉంటూ మంచి రోజులకోసం ఎదురు చూస్తున్నారు.



బకాసురుణ్ణి వధిస్తున్న భీముడు

## అధ్యాయం - 15

# బకాసుర వధ

**పాం**డవులు ఏకచక్రపురంలో బ్రాహ్మణ వేషంలో నివసిస్తున్నారు. వారు బ్రాహ్మణ వీధుల్లో బిచ్చమెత్తుకుంటున్నారు. తెచ్చిన ఆహారాన్ని వారి కోసం బెంగతో ఎదురుచూసే తల్లికి ఇస్తున్నారు. వారు సకాలంలో తిరిగి రాకపోతే ఏదయినా ప్రమాదం వాటిల్లిందేమోనని ఆమె ఆందోళన చెందుతుండేది. వారు భిక్ష ద్వారా తెచ్చే ఆహారాన్ని రెండు సగ భాగాలు చేసేది. ఒక సగాన్ని భీముడికి, మిగతా సగాన్ని మిగతా నలుగురికీ పెట్టేది. భీముడు వాయు దేవుడికి పుట్టినవాడు. గొప్ప బలవంతుడు. జఠరాగ్ని ఎక్కువ కలిగినవాడు. భీముడు పేరుతో వృకోదరుడనేవాడు కూడా ఒకడున్నాడు. వృకోదరుడు అంటే తోడేలు కడుపున పుట్టినవాడు అని అర్థం. తోడేలు ఎప్పుడూ డొక్కు కడుపుతోనే ఉంటుంది. అది ఎంత తిన్నా దాని ఆకలి తీరదు. భీముడి తృప్తి చెందని ఆకలి, ఏకచక్రపురంలో వారికి లభించు కొద్ది ఆహారం ఈ రెండూ కలిసి భీముణ్ణి నీరసింపచేశాయి. ఇది తల్లికి, వారి అన్నదమ్ములకు చాలా ఆందోళన కలిగిస్తుండేది.

కొంతకాలమైన తరువాత భీముడికి ఒక కుమ్మరితో పరిచయం కలిగింది. భీముడతడికి మట్టి తవ్వి తెచ్చి ఇస్తుండేవాడు. దీనికి ఆ కుమ్మరి ఓ పెద్ద కుండను భీముడికిచ్చాడు. ఆ కుండను చూసి వీధిలోని పిల్లలందరూ నవ్వుకొనేవారు.

ఒక రోజు మిగిలిన నలుగురూ భిక్షకు వెళ్లగా.. భీముడు మాత్రం తల్లి వద్దే ఉండిపోయాడు. తాము నివసించిన బ్రాహ్మణ ఇంటిలో నుండి పెద్దగా రోదిస్తున్నట్లు వినిపించింది. ఆ కుటుంబానికేదో ఆపద సంభవించినదేమో అని ఆ విషయం తెలుసుకోవడానికి కుంతి ఆ ఇంటిలోకి వెళ్లింది. బ్రాహ్మణుడు, అతడి భార్య ఏడుస్తున్నారు. కానీ మాట్లాడటానికి శక్తి చాలలేదు. చివరికి బ్రాహ్మణుడు తన భార్యను ఉద్దేశించి.. "ఓసీ నిర్భాగ్యులారా, తెలివి తక్కువదానా, ఈ ఊరు విడిచి పోదాం, ఎక్కడైనా బతుకుదాం అని నేనెన్నిసార్లు కోరినా నీవు ఇష్టపడటం లేదు. నేను ఇక్కడే పుట్టి పెరిగాను. నా తల్లిదండ్రులు, బంధువులు ఇక్కడే జీవించి చనిపోయారు అంటూ ఈ ఊరు విడుచిపోవడానికి ఇష్టపడక పట్టుదలతో ఉన్నావు. నా సర్వస్వం నీవే. పిల్లలనుగన్న భార్యవు. ప్రేమస్వరూపిణి అయిన తల్లివి. నిన్ను వివాహమాడిన కాలం నుంచీ నాకు జీవితంలో పట్టుగొమ్మగా నిలిచావు. ఇలాంటి నిన్ను నేనెట్లా పోగొట్టుకుంటాను. నేను జీవించి నిన్ను చావడానికి తోడ్పడలేను. ఈ పసిపిల్లలను మనకు భగవంతుడు ఇచ్చాడు. ఆయన ఈ పిల్లలను మనకు అప్పగించాడు. యుక్తకాలంలో ఎవరైనా తగిన యువకుడికి ఇచ్చేయడానికి నియమించాడు. సంతానాన్ని కలిగించే "దేవదత్త"ను చావడానికి పంపడం అధర్మం. ఈ కుమారుడిని కూడా అలాగే చావడానికి పంపడం అసంభవం. ఈ జీవితంలో మనం ఎవరిపైన ఆశలు పెట్టుకున్నామో, జీవితాంతాన మనకు ఉత్తరగతులు ఎవరు చేయగలరో అలాంటి కుమారుడు మరణించాక మనం ఎలా జీవిస్తాం? వాడు చనిపోతే మనకు, మన పూర్వీకులకు ఉత్తరక్రియలు ఎవరు చేస్తారు. అయ్యో నా మాటలు వినవు. నీ మొండిపట్టు ఫలితమే ఇప్పటి మన ఆపద. నేను ప్రాణాలు ఇస్తే ఈ పిల్ల, పిల్లవాణ్ణి రక్షించేవారు లేక తప్పక చనిపోతారు. నేనేమి చేయను? మనందరం ఒకేసారి చనిపోవడమే సమంజసమని తోస్తోంది" అంటూ ఆ బ్రాహ్మణుడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"నీకు నేను తగిన భార్యనై ఓ కుమార్తెను, ఓ కుమారుణ్ణి కని నా బాధ్యత నిర్వర్తించాను. మీరు పిల్లలను పెంచడానకి సమర్థులుగాని నేను కాదు. పనికిరాని పదార్థం పారవేస్తే.. దానిని ఆకలిగొన్న మాంసాహార పక్షులు ఎలా తీసుకుంటాయో అలాగే ఒక బీద వితంతువు.. దుర్మార్గులకు, మర్యాద లేనివారికి సులభంగా చిక్కుతుంది. నేతిలో ముంచిన ఓ గుడ్డ పీలిక కోసం కుక్కలు జగడమాడి ఇటూ

అటూ పీకి దాన్ని చిన్న ముక్కలుగా చేస్తాయి. ఆ ప్రకారంగానే రక్షకుడులేని స్త్రీ దుర్మార్గుల ఆట వస్తువవుతుంది. వారితో ఇటూ అటూ ఈడ్చివేయబడుతుంది. తండ్రిలేని ఇద్దరు పిల్లలను రక్షించడం నా తరంకాదు. ఆ పిల్లలు నీరులేని మడుగులోని చేపల్లాగా చనిపోతారు. కనుక నన్ను రాక్షసుడికి ఇవ్వడమే మంచిది. భర్త జీవించి ఉండగా.. చనిపోయిన భార్య చాలా అదృష్టవంతురాలు. ఈ సంగతి శాస్త్రాల్లో ఉన్నదనే విషయం మీకు తెలిసిందే. కాబట్టి నాకు వీడ్కోలు ఇవ్వండి. పిల్లలను జాగ్రత్తగా చూసుకోండి. మీతో నేను సుఖపడ్డాను. నేను చాలా ఘన కార్యాలు చేశాను. మీపట్ల నేను మహాభక్తితో వ్యవహరించాను. కనుక నాకు మోక్షం తప్పక లభిస్తుంది. పతివ్రత అయిన స్త్రీకి చావనేది భయమే కలిగించదు. నేను చచ్చిన తరువాత మరొకరిని పెళ్లి చేసుకోండి. మీరు ధైర్యంగా ఉండి మీ నవ్వు ముఖాన్ని నా కుమారుడికి చూపండి. మీరు నన్నాశీర్వదించి రాక్షసుడి వద్దకు పంపండి" భార్య పలికిన వేదనాభరిత మాటలతో బ్రాహ్మణుడు ఆమెను కౌగిలించుకున్నాడు. ఆమె ప్రేమకు, ధైర్యానికి పరవశుడయ్యాడు. చిన్నపిల్లాడివలే ఏడ్చాడు. కొంతసేపయ్యాక కుదుటపడ్డాడు. "అవేం మాటలు? నీవు లేకుండా జీవించలేను. వివాహితుడి ప్రథమ కర్తవ్యం భార్యను రక్షించడమే. ప్రేమనూ, కర్తవ్యాన్నీ వీడి నిన్ను రాక్షసుడికి ఇచ్చిన తరువాత నేను బతికివుంటే మహాపాపిని. నిందితుణ్ణి అవుతాను" అన్నాడు బ్రాహ్మణుడు. తల్లిదండ్రుల విచారకర సంభాషణను వింటున్న కుమార్తె ఏడుస్తూ.. నేను చెప్పేది వినండి. చిన్నదాననైనా నేను చెప్పేవి మీరు వినాలి. ఆ తర్వాత ఏది కర్తవ్యం అని తోస్తే అలాగే చేయండి. నన్నే మీరు రాక్షసుడి వద్దకు పంపండి. నా ఈ శరీరాన్ని త్యజిస్తే మిగతావారంతా రక్షించబడతారు. ఈ దుఖ:సాగరాన్ని ఈదటానికి నన్నే తెప్పగా ఉపయోగించుకోండి. మీరిద్దరూ చనిపోయాక ఈ దుష్ట ప్రపంచంలో నేను, నా చిట్టితమ్ముడు రక్షణ లేక త్వరలో చనిపోతాం. మన కుటుంబమంతా నా చావుతో రక్షింపబడుతున్నప్పుడు నా మరణం తప్పనిసరి. మీరు నా మంచిని గురించి ఆలోచించినప్పటికీ మీరు నన్ను రాక్షసుడికి ఇవ్వవలసిందే" అని కుమార్తె ధైర్యంగా అనడంతో తల్లిదండ్రులు ఆమెను గాఢంగా హత్తుకొని ఏడ్చారు.

వీరందరూ ఏడుస్తుండగా.. పసివాడయిన కుమారుడు.. "అమ్మా.. నాన్నా.. అక్కా.. ఏడవకండి" అంటూ ప్రతివారి ఒడిలోనూ ఒక్కోసారి కూర్చున్నాడు. తరువాత ఓ కర్రముక్క తీసుకుని దాన్ని తిప్పుతూ ముద్దు మాటలతో.."నేనీ కర్రతో రాక్షషుణ్ణి చంపుతాను" అన్నాడు. పిల్లవాడు కర్రను తిప్పడం, మాట్లాడటం చూసి వారంతా ఆనందించారు. కానీ ఆ తరువాత మరింత విచారంలో మునిగిపోయారు.

తాను జోక్యం చేసుకోవడానికి ఇదే సమయమని భావించిన కుంతీదేవి,

లోనికొచ్చి వారి విచారానికి కారణమేంటని అడిగింది. ఈ విషయంలో తానేమైనా సాయం చేయొచ్చా అని వారిని ప్రశ్నించింది.

బ్రాహ్మణుడు అందుకొని.. "తల్లీ మా విచారం మీరు సాయం చేయడానికి సైతం అతీతమైనది. ఈ పట్టణ ప్రాంతంలో ఓ కొండ గుహ ఉంది. అక్కడ మహాబలవంతుడూ, క్రూరుడైన బకాసురుడు అనే రాక్షసుడు ఉన్నాడు. పదమూడేళ్ల కిందట తన బలంతో ఈ పట్టణాన్ని వశం చేసుకున్నాడు. అప్పట్నించి మా లాంటి మానవులందరినీ క్రూర హింసలు పాల్జేస్తున్నాడు. ఈ దేశ క్షత్రియ రాజు మమ్మల్ని రక్షించలేక 'వేత్రకీ' అనే పట్టణానికి పారిపోయాడు. ఇదివరకీ రాక్షసుడు తన ఇష్టం వచ్చినప్పుడల్లా గుహ నుంచి బయటకొచ్చి ఆకలితో పట్టణంపై పడి పురుషులను, స్త్రీలను, చివరికి పసిపిల్లలను సైతం తినేస్తున్నాడు. ఈ పరిస్థితుల్లో.. విచక్షణ లేకండా మానవులను చంపకుండా ఒక పద్ధతి ప్రకారమే వారిని భుజించేలా ఒక ఒప్పందం చేసుకుందామని పుర ప్రజలు రాక్షసుడికి మొరపెట్టుకున్నారు. "నీ ఇష్ట ప్రకారం దుర్మార్గంగా మమ్మల్ని చంపొద్దు. వారానికోసారి నీకు సరిపోయే మాంసం, అన్నం, పెరుగు, మద్యపానీయాలు తదితర పదార్థాలను నీ వద్దకు తెచ్చి ఇవ్వగలం. రెండెడ్ల బండికి సరిపడా ఈ పదార్థాలను తీసుకొచ్చి నీకు అందజేస్తాం. బండి తోలేందుకు ఒక మనిషిని కూడా పంపుతాము. అన్నం, పదార్థాలతోపాటు రెండెద్దులనూ, తెచ్చిన ఆ మనిషినీ తినీ నీ ఆకలి తీర్చుకో. మమ్మల్ని విచక్షణ లేకండా చంపడం మానుకో" అని మొరపెట్టుకున్నారు. దీనికి బకాసురుడు అంగీకరించాడు. ఆ రోజు నుంచి ఈ రాక్షసుడు పట్టణాన్ని క్రూర మృగాలు, ఇతరుల బారి నుంచి రక్షిస్తున్నాడు. ఈ ప్రకారంగా చాలా సంవత్సరాల నుంచి జరుగుతోంది. అందువల్ల మేమీ బాధను తట్టుకోలేకోతున్నాము. ఈ దేశంలో ఆ రాక్షసుడి బారి నుంచి ప్రజలను రక్షించగలిగే వీరుడెవ్వడూ కనిపించ లేదు. అలా వెళ్లిన అనేక మంది రాక్షసుడి ఆకలికి బలయ్యారు. తల్లీ.. మా దేశపు రాజే మమ్మల్ని రక్షించలేక పోయాడు. ఏ దేశపు రాజు బలహీనుడో ఆ దేశంలోని ప్రజలు వివాహం చేసుకున్నా పిల్లలను కనకూడదు. తగిన గృహస్థాశ్రమం, విద్య నాగరికత, సౌఖ్యం.. సౌమ్యుడు, బలవంతుడైన రాజు పాలనలోనే ఉంటాయి. తగిన రాజు పాలనలో లేనప్పుడు అవి రక్షించబడవు. చాలా కాలం నుంచి ఇతరులు పడే బాధలను కళ్లారా చూసి విచారిస్తున్న మాకు ఈ రోజు రాక్షసుడికి ఆహారంగా పంపడానికి మా వంతు వచ్చింది. మాలో ఎవరైనా.. రాక్షసుడికి ఆహారమైపోతే మిగతావాళ్లం బతకలేము. కనుక నేను, నా కుటుంబం అంతటితో కలిసి రాక్షసుడి వద్దకు వెళ్తాము. దుర్మార్గుడైన ఆ మాంస భక్షకుణ్ణి మా అందరినీ తిని కడుపు నింపుకోనివ్వండి. ఈ బాధతో మిమ్మల్ని కష్టపెట్టాము. మీరు అడిగారు కనుక

చెప్పాను. దేవుడొక్కడే మాకు సాయం చేయగలడు. అయితే ఆ ఆశను కూడా వదిలిపెట్టేశాము" అని కుంతీదేవితో అన్నాడు బ్రాహ్మణుడు.

అంతా విన్న కుంతి ఈ సమాచారాన్ని భీమసేనుడి చెవిన వేసింది. తిరిగి మళ్లీ బ్రాహ్మణుడి వద్దకు వచ్చి.. "విచారంతో ఉత్సాహాన్ని పోగొట్టుకోకండి. భగవంతుడు మనందరికీ అతీతుడు. నాకు ఐదుగురు కుమారులు కలరు. వారిలో ఒకడు బకాసురుడికి అన్నం తీసుకు వెళ్తాడు"అన్నది కుంతి. ఈ మాటలు విన్న బ్రాహ్మణుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. తుళ్లిపడ్డాడు. తరువాత విచారగ్రస్తుడై ఇలాంటి పనికి తాను అంగీకరించబోనని చెప్పాడు.

"ఓయీ బ్రాహ్మణోత్తమా, భయపడొద్దు. నా కుమారుడు మంత్రసిద్ధిని పొందినవాడు. మంచి ప్రజ్ఞావంతుడు. వాడు నిశ్చయంగా ఆ రాక్షసుణ్ణి చంపుతాడు. ఇలాంటి రాక్షసులను ఎంతోమందిని చంపడం నేను చూశాను. నేను చెప్పిన ఈ విషయాన్ని రహస్యంగా ఉంచు. ఇది బయటకు తెలిస్తే నా కుమారుడి ప్రభావం నశిస్తుంది" అన్నది కుంతి. ఈ సమాచారం దుర్యోధనాదులకు తెలిస్తే.. ఈ పని పాండవులు చేసి ఉంటారని తెలుసుకొని తమ ఉనికినీ, సమాచారాన్నీ తెలుసుకోగలుగుతారని కుంతి భావించింది. అందుకే ఈ విషయాన్ని రహస్యంగా ఉంచాలని బ్రాహ్మణుణ్ణి కోరింది.

కుంతి చెప్పగా విన్న భీమసేనుడు ఎంతో ఉత్సాహాన్ని, ఆనందాన్ని ప్రదర్శించాడు. మిగతా పాండవ సోదరులు భిక్షతో ఇంటికి వచ్చారు. ఇదివరకు భీమసేనుడి మొహంలో అలాంటి ఉత్సాహం చూడని మిగతా అతని సోదరులు.. భీముడేదో కార్యానికి సిద్ధపడ్డాడని భావించారు. వెంటనే విషయమేంటని కుంతిని అడిగారు. ఆమె విషయమంతా పూసగుచ్చినట్లు చెప్పింది. యుధిష్టరుడు కలుగచేసుకొని.. "ఇదేమిటి?. తొందరతో, అనాలోచితంగా చేసిన పనిలా అనిపిస్తోంది. భీముడి బలాన్ని నమ్మి మనందరం ఏ చింతా, భయం లేకుండా నిద్రపోతున్నాం. వంచకులైన మన శత్రువులు హస్తగతం చేసుకున్న రాజ్యాన్ని భీముడి పరాక్రమంతో తిరిగి పొందాల్సి ఉంది. భీముడి బలపరాక్రమం వల్లనే కదా.. మనందరం లక్క ఇంటి నుంచి రాగలిగాం. ప్రస్తుతం మనలను రక్షిస్తున్న, ముమ్ముందు మరింత మేలు చేయగలడని ఎవరిపైనేతే ఆశలు పెట్టుకున్నామో.. అలాంటి భీముడి ప్రాణాలను మీరిప్పుడు ప్రమాద పరిస్థితుల్లోకి నెడుతున్నారు. మీరు పడ్డ కష్టాలు మీ బుద్ధిని పాడు చేశాయనుకుంటాను" అన్నాడు యుధిష్టరుడు.

కుంతీదేవి అందుకుని.. "కుమారులారా, ఎన్నో సంవత్సరాల నుంచి ఈ బ్రాహ్మణుడి ఇంటిలో ఆనందంగా ఉంటున్నాం. ఒకరి సుగుణం.. ఇతరులతో పొందిన

మేలుకు ప్రత్యుపకారం చేయడం వల్లనే బయటపడుతుంది. భీముడి శౌర్యం, పరాక్రమం గురించి నాకు తెలుసు. అతడి విషయమై నాకేమీ భయం లేదు. మనలను వారణావతం నుంచి ఇక్కడికి తెచ్చిందెవరో, హిడింబాసురుణ్ణి చంపింది ఎవరో గుర్తు పెట్టుకోండి. కనుక ఈ బ్రాహ్మణ కుటుంబానికి సాయం చేయడం మన విధ్యుక్త ధర్మం" అన్నది.

పట్టణ వాసులు.. మాంసం, తినే పదార్థాలు, పెరుగు, మత్తును కలిగించే తాగుడు పదార్థాలను ఒక రెండెద్దుల బండిపై వేసుకొని బ్రాహ్మణుడి ఇంటికి వచ్చారు. ఆ బండిని తోలుకు వెళ్లాల్సిన వంతు బ్రాహ్మణుడిదే కనుక. భీముడు ఆ బండిని ఎక్కి రాక్షసుడి గుహకు బయలుదేరాడు

బండి రాక్షసుడైన బకాసురుడి గుహకు కొంత దూరానికి చేరగానే.. ప్రజలంతా భీముడి శకటాన్ని వదిలి అపాయంలేని స్థలానికి వెళ్లారు. బకాసురుడి గుహకు ఎదురుగా ఉన్న స్థలం అంతా ఎముకలు, వెంట్రుకలు, రక్తపు ముద్దలు, పురుగులు, చీమలతో నిండి ఉంది. ఇంకా ముక్కలైన చేతులు, కాళ్లు, తల కపాలాలు కూడా ఉండటంతో వాటి వాసన పసిగట్టి భూమి పైన ఎత్తుగా మాంసాహార పక్షులు, గద్దలు వగైరా ఎగరడం భీముడు చూశాడు. బండిని ఆపాడు. వాటిలోని ఆహార పదార్థాలను తినడం మొదలు పెట్టాడు. "బకాసురుడితో యుద్ధం వల్ల ఈ పదార్థాలు పాడయి పోతాయి. కనుక ముందుగానే తినడం మంచిది. పైగా రాక్షసుడిని చంపాక వీటిని తినడం సరికాదు" అని మనసులో అనుకున్నాడు.

తాను ఆహారం భుజించే సమయం దాటి పోవడంతో రాక్షసుడు గుహ నుంచి బయటకు వచ్చి తేరపార చూశాడు. గుహ ఎదుట స్థలంలో నిలిపిన బండిలోని ఆహారాన్ని భుజిస్తూ భీముడు.. రాక్షసుడి కంట బడ్డాడు. రాక్షసుడికి కోపం తారాస్థాయికి చేరింది. భీముడు రాక్షసుణ్ణి చూశాడు. చేతనైతే తనతో యుద్ధానికి రావచ్చని గట్టిగా అరిచాడు. రాక్షసుడు భారీ కాయంతో.. ఎర్ర రంగు జుట్టుతో, దట్టమైన గడ్డం, గుబురు మీసం, పెద్ద నోరును కలిగి ఉన్నాడు. రాక్షసుడు.. భీముడి వైపు పరిగెడుతూ చేతులు చాశాడు. భీముడు నిర్లక్ష్యంగా నవ్వుకుంటూ రాక్షసుడి చేతులను తప్పించుకుంటున్నాడు. రాక్షసుడి వైపు తన వీపు చూపుతూ నెమ్మదిగా ఆహారం ఆరగిస్తున్నాడు. తనపైపు ఉన్న భీముడి వీపుపై రాక్షసుడు పిడికిలితో గుద్దుల వర్షం కురిపిస్తున్నాడు. కానీ భీముడు రాక్షసుడి వైపు చూడటం లేదు. ఆహారమూ తినడం మానలేదు. రాక్షసుడు ఓ చెట్టును పెరికి భీముడిపై వేసినప్పటికీ అతడి వంక చూడలేదు. తన ఎడమ చేతిలో చెట్టును వెనక్కినెట్టాడు. అన్నిపాత్రల్లోని ఆహారపదార్థాలను ఖాళీ చేశాడు. ఇక రాక్షసుడికి ఎదురు నిలిచాడు.

వీరిద్దరి మధ్య గొప్ప యుద్ధం జరిగింది. రాక్షసుడితో భీముడు

చెలగాటమాడుతున్నాడు. రాక్షసుణ్ణి నేల మీద పడవేస్తున్నాడు. మళ్ళీ అతణ్ణి నిలిపి తిరిగి కొట్టడం చేస్తున్నాడు. చివరికి భీముడు బకాసురుణ్ణి పడదోసి వాడి మీద కూర్చొని శరీరంలోని ఒక్కో ఎముకను విరిచి వేస్తున్నాడు. రాక్షసుడు రక్తం కక్కుకొని బిగ్గరగా అరుస్తూ కుప్పకూలి చనిపోయాడు. భీముడు రాక్షసుడి కళేబరాన్ని పట్టణ సింహద్వారం వరకూ ఈడ్చి పడేశాడు. బ్రాహ్మణుడి ఇంటికివచ్చి స్నానం చేసి శుచి అయ్యాడు. బకాసురుణ్ణి చంపేసిన విషయం తల్లి కుంతీదేవికి పూసగుచ్చినట్లు చెప్పాడు. ఆమె సంతోషించింది.

◈



పాంచాల రాజకుమారి ద్రౌపది
స్వయంవరం

## అధ్యాయం - 16

# ద్రౌపదీ స్వయంవరం

ఏకచక్రపురంలో పాండవులు బ్రాహ్మణుల వేషధారణలో ఉన్నప్పుడు పాంచాల రాజు కుమార్తె ద్రౌపదికి స్వయంవరం ప్రకటించారు. ఈ విషయం పాండవులకు తెలిసింది. ఏకచక్రపురానికి చెందిన చాలా మంది బ్రాహ్మణులు పాంచాల పురానికి వెళ్లడానికి సన్నాహాలు చేస్తున్నారు. అక్కడి ఉత్సవాలను, రాజుల వివాహాలకు సంబంధించిన ఆడంబర అలంకారాలను చూసేందుకు, కట్నకానుకలు అందుకునేందుకు బ్రాహ్మణులు పాంచాల పురానికి బయలుదేరారు. కుంతీదేవి మాతృ హృదయంతో.. తన కుమారులు కూడా పాంచాల పురానికి వెళ్లి ద్రౌపదిని స్వయంవరంలో గెలుచుకోవాలని కోరిక కలిగింది. ఆ విషయమే యుధిష్టరుడితో ప్రస్తావించింది. "మనం ఈ పట్టణంలో చాలా కాలం ఉన్నాము. మరోచోటకు వెళ్లడం మంచిది. ఇక్కడి కొండలు, లోయలు చూసి చూసి విసిగిపోయాం. మనకు ఇచ్చే

భిక్షాహారమూ తగ్గిపోతున్నది. మనల్ని ఇక్కడ గౌరవిస్తున్నారని దీర్ఘకాలం ఉండకూడదు. దృపదరాజు రాజ్యం న్యాయ యుక్తంగా నడుస్తున్నదని, సకల ఐశ్వర్యాలతో నిండి ఉందని వింటున్నాము. మనం ఆ దృపదుని రాజ్యానికి వెళ్దాము. ప్రపంచ జ్ఞానంలోనూ, బుద్ధి కుశలతలోనూ కుంతీదేవిని మించినవారు లేరని ప్రతీతి. ఆమె తన కుమారుల మనసులోని కోరికలను గ్రహించింది. వారు తనను అడగడానికి బిడియమూ, సిగ్గూ పడతారని ఊహించి ఆమే పై విధంగా అన్నది.

బ్రాహ్మణులు స్వయంవరాన్ని తిలకించేందుకు గుంపులుగుంపులుగా వెళ్తుండగా, వారిలో కలిసి పాండవులు కూడా బ్రాహ్మణుల వేషంలో వెళ్లారు. పాండవులు, కుంతి ఓ కుమ్మరి ఇంట బీద బ్రాహ్మణుల మాదిరిగా బస చేశారు.

ద్రుపదుడు, ద్రోణుడు బహు సైన్యంతో బయటకు అన్యోన్యంగా ఉన్నా.. దృపదుడు మాత్రం ద్రోణుడు తనను పరాభవించిన సంగతిని ఎన్నడూ మరువలేదు. ఆ పరాభవాన్ని క్షమించలేడు. తన కుమార్తెను అర్జునుడికి భార్యగా చేయాలని ఉండేది. ద్రోణుడు అర్జునుణ్ణి మిక్కిలి ప్రేమిస్తాడు. అందువల్ల అర్జునుడి మామ అయ్యే తన పట్ల ద్రోణుడు శత్రుభావంతో ఉండలేడు. ఏదైన యుద్ధం సంభవిస్తే అర్జునుడి మామ అవడం వల్ల ఇంకా శక్తిమంతం కాగలడు. వారణావతంలో పాండవులు చనిపోయారని విని దృపదుడు దుఖ సాగరంలో మునిగిపోయాడు. తరువాత పాండవులు చనిపోకుండా పారిపోయారని విని కొంత సంతోషం వ్యక్తం చేశాడు.

స్వయంవరానికి వచ్చేవారికి, ఇతర అతిథులకు తగు వసతి గృహాలు అందంగా నిర్మించారు. ఈ నూతన గృహాల మధ్య స్వయంవర భవంతి చాలా సుందరంగా నిర్మించారు. చూడదగిన దృశ్యాలు, ఆడదగిన ఆటలు మొదలైనవన్నీ ఏర్పాటు చేశారు. ప్రజలను ఇవి విశేషంగా ఆకర్షిస్తున్నాయి. వరుసగా పధ్నాలుగు రోజులు గొప్ప వింతలు, విందులు ఏర్పాటు చేశారు.

స్వయంవర భవంతిలో విశాలమైన స్థలంలో ఒక పెద్ద ఉక్కు బాణాసనాన్ని ఉంచారు. "ఎవరైతే ఈ బాణాసనానికి నారి తగిలించి ఒక ఉక్కు బాణం గురిపెట్టి అంతరిక్షంలో వలయాకారంగా తిరిగే ఓ చక్రం మధ్య రంధ్రం ద్వారా నిర్దిష్ట పదార్థాన్ని కొట్టగలడో అతడు ద్రౌపదికి వరుడు కాగలడు" అన్నాడు దృపదుడు.

ఈ కార్యసాధనకు మనుషులకు అతీతమైన బలం, ఉపాయం, లాఘవం, పరిశ్రమ అవసరం. దృపదుడు స్వయంవరానికి వచ్చినవారితో.. "ద్రౌపదిని పొందగోరే వీరుడు పైన ఉదహరించిన కార్యాన్ని చేయాలి" అన్నాడు. భరత ఖండంలోని ఆయా

ప్రదేశాల నుంచి చాలా మంది రాజపుత్రులు స్వయంవరానికి వచ్చారు. ధృతరాష్ట్రుడి కుమారులు, కర్ణుడు, శ్రీకృష్ణుడు, శిశుపాలుడు, జరాసంధుడు, శల్యుడు వచ్చారు. స్వయంవరంలో పాల్గొనేవారే కాకుండా దాన్ని తిలకించడానికి వచ్చిన వారిలో కూడా అతిరథ మహారథులు ఉన్నారు. అక్కడి జనసమూహం నుంచి బయలుదేరిన శబ్దాలు సముద్రపు హోరును తలపిస్తోంది. ఆ హోరును మించి వివాహ మంగళవాద్యాలు మొదలయ్యాయి. ద్రౌపది భద్ర గజంపై ఆసీనురాలై ఉండగా.. అన్న దృష్టద్యుమ్నుడు ముందుగ అశ్వారూఢుడై బయలుదేరాడు. ద్రౌపది మంగళ స్నానమాడి నూతన పట్టు వస్త్రాలను ధరించింది. ఏనుగును దిగి స్వయంవర స్థలానికి వచ్చింది. వర పూలమాలను పట్టుకొని, సిగ్గు దొంతరలతో, ఓర చూపులతో స్వయంవరానికి వచ్చిన రాజకుమారులను చూస్తోంది. రాజకుమారులు ఆమె సౌందర్యానికి ముగ్ధులై అలాగే చూస్తుండి పోయారు. ఆమె వేదిక ఎక్కింది. బ్రాహ్మణుల మంత్రోచ్ఛారణలతోనూ, అగ్నిహోత్ర హోమాలతోనూ స్థలమంతా ధ్వనిస్తోంది. శాంతి వచనాలు పలికాక గీతాలను ఆలపించారు. దృష్టద్యుమ్నుడు చెల్లెలు ద్రౌపది చేయి పట్టుకొని స్వయంవర స్థల మధ్య భాగానికి తీసుకువచ్చాడు. అతడు బిగ్గరగా.. "ఈ సభలో కూర్చున్న ఓ రాజపుత్రులారా, దయచేసి వినండి. ఇక్కడ శరాసనం ఉంది. పైన గురిపెట్టి కొట్టడానికి నిర్దిష్ట వస్తువుంది. ఇక్కడ బాణాలున్నాయి. తిరుగుతున్న చక్రం మధ్యలో ఉన్న రంధ్రం ద్వారా ఐదు బాణాలను వరుసగా వదిలి, గురి తప్పకుండా నిర్దిష్ట జీవ పదార్థాన్ని పడగొట్టాలి. అలా పడగొట్టిన వాడు మంచి కుటుంబీకుడై ఉండాలి. సుముఖుడై కూడా ఉండాలి. అప్పుడే నా చెల్లెలును పొందగలుగుతారు" అన్నాడు. తరువాత దృష్టద్యుమ్నుడు అక్కడ కూర్చున్న రాజుల పేర్లనూ, వారి కుల గోత్రాలనూ చెప్పాడు.

స్వయంవరానికి వచ్చిన రాజపుత్రులు ఒకరి తరువాత ఒకరు లేచి శరాసనానికి నారి బిగించడానికి ప్రయత్నించి విఫలమయ్యారు. ఆ శరాసనం వారికి చాలా బరువుగానూ, మోటుగానూ తోచింది. వారు సిగ్గు, అవమానంతో తమ స్థలానికి వచ్చి కూర్చున్నారు. శిశుపాలుడు, జరాసంధుడు, దుర్యోధనుడు, శల్యుడు.. ఇలా వారు ప్రయత్నించి విఫలమయ్యారు. తర్వాత కర్ణుడు ముందుకు రాగా, అతడు స్వయంవరంలో తప్పకుండా విజయుడు అవుతాడని అందరూ తలిచారు. కానీ గురిపెట్టిన నిర్దిష్ట జీవ పదార్థాన్ని వెంట్రుక వాసి తేడాతో కొట్టలేకపోయాడు. వింటి నారి కూడా సడలి పోయింది. ఆ విల్లు కర్ణుడి చేతి నుంచి నిర్దిష్ట జీవ పదార్థానికి వెంట్రుకవాసి సమీపానికి వచ్చేసరికి అతడి చేతి నుంచి ఎగిరిపడింది. దీంతో స్వయంవర సభలో కలకలం బయలుదేరింది. ఆగ్రహంతో కూడిన మాటలు

మొదలయ్యాయి. "చేయ వీలులేని ఇలాంటి క్లిష్టమైన పరీక్ష పెట్టడం వచ్చిన రాజులను అవమానించడానికే" అని కొందరు బిగ్గరగా అన్నారు. ఆ తరుణంలోనే బ్రాహ్మణుల గుంపులోంచి ఒక యువకుడు సభా మధ్యలో ఉన్న బాణాసనం వద్దకు వస్తున్నాడు. దీంతో సభలో కలకలం సద్దుమణిగి నిశ్శబ్దం నెలకొన్నది. అతడు బ్రాహ్మణ వేషంలో ఉన్న అర్జునుడు అని రాజపుత్రులకు తెలియదు. ఆ బ్రాహ్మణ యువకుడు బాణాసనం వద్దకు వచ్చి అక్కడ నిలబడగానే ప్రజల్లో చాలా మంది ఎగతాళిగా మాట్లాడుకోవడం ప్రారంభించారు. బ్రాహ్మణుల్లో కొందరు తమలో స్వయంవర పోటీకి వచ్చిన యువకుడు ఉన్నాడని సంతోషించారు. మరికొందరు కర్ణుడు, శల్యుడు వంటి వారు చేయలేని ఘనకార్యాన్ని మనవాడు చేయగలడా అంటూ 'ఎందుకు ఇలాంటి ప్రయత్నాలు చేయడం' అని గొణుకున్నారు. ఇంకొందరు ఆ బ్రాహ్మణుడి అంగ సౌష్టవం, ఠీవి, భుజ బలం చూసి ఆశ్చర్యపోయారు. మరికొందరు.. "ఇతడికి రాజపుత్ర లక్షణాలున్నాయి. స్వయంవరంలో నెగ్గుతాడేమో. నెగ్గడానికి ఏమైనా తపో మహిమ ఉందేమో?. అతడు మాత్రం ఈ పోటీలో ఎందుకు పాల్గొనకూడదు" అంటూ వ్యాఖ్యానించసాగారు.

బ్రాహ్మణ వేషంలో ఉన్న అర్జునుడు.. శరాసన వేదిక వద్ద దృష్టద్యుమ్నుణ్ణి ఉద్దేశించి.. "బ్రాహ్మణుడు ఈ వింటిని వంచడానికి ప్రయత్నం చేయొచ్చా" అని అడిగాడు. అందుకు దృష్టద్యుమ్నుడు.. "ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా, మంచి కులంలో పుట్టి, మంచి అంగసౌష్టవం ఉన్న ఎవరైనా ఈ విల్లు వంచి నిర్దిష్ట జీవ పదార్థాన్ని ఛేదిస్తే వారికి నా చెల్లెలు భార్య అవుతుంది. నా మాటలు ఎప్పటకీ నియమబద్ధమైనవే" అన్నాడు. అప్పుడు అర్జునుడు.. శ్రీమన్నారాయుణుడిని ధ్యానించి వింటికి నారిని సునాయాసంగా తొడిగాడు. ఒక బాణాన్ని నారికి తగిల్చాడు. నవ్వుతూ, చుట్టూ ఉన్నవారిని చూశాడు. జనం మంత్రముగ్ధులయ్యారు. సభ నిశ్శబ్దంగా మారింది. ఒక బాణం వెంట మరోటి వరుసగా ఐదు బాణాలను తిరిగే యంత్రం మధ్య భాగంలోని రంధ్రం ద్వారా నిర్దిష్ట జీవ పదార్థాన్ని నేరుగా కొట్టి కింద పడేశాడు. దీంతో సభలో కోలాహలం మిన్నుమిట్టింది. గీత వాద్యాలు మొదలయ్యాయి. సభలో కూర్చున్న అసంఖ్యాక బ్రాహ్మణులు ఆనందోత్సాహాలతో కరతాళ ధ్వనులు చేశారు. వారి దర్భాసనాలను ఆనందంతో పైకి తిప్పుతూ బ్రాహ్మణ జాతే ఈ పందెం గెలిచిందనేంత ఉత్సాహవంతులయ్యారు. ద్రౌపది బ్రాహ్మణుడి వేషంలో ఉన్న అర్జునుణ్ణి చూసింది. అతడి ముఖం ఆనందంతో ప్రకాశిస్తుండటం గమనించింది. ద్రౌపది వర మాలను ఆ బ్రాహ్మణుడి మెడలో అలంకరించింది.

యుధిష్ఠరుడు, నకుల, సహదేవులు తాము బస చేసిన కుమ్మరి వారి ఇంటికి వెళ్లి తల్లికి శుభవార్త చెప్పేందుకు లేచి వెళ్లారు. అర్జునుడికి క్షత్రియుల నుంచి ఏదైనా అపాయం రాగలదేమో అని ఊహించి భీముడు సభలోనే ఉన్నాడు.

భీముడు తలిచినట్లే.. రాజకుమారులందరూ అగ్రహోదగ్రులయ్యారు. "స్వయంవరం ప్రక్రియ, వరుణ్ణి ఎంచుకోవడం ఇవి బ్రాహ్మణ కులంలో లేనివి. ఈమె ఒక రాజకుమారుడిని పెళ్లాడటానికి ఇష్టం లేకపోతే ఆమె అవివాహితగా అగ్నిలో దూకి మరణించాలి. బ్రాహ్మణుడు ఆమెను ఎలా వివాహమాడతాడు? ఈ వివాహ కార్యం సరికాదు. ఈ పరిణయం చెల్లదు అని మనందరం చెప్పాలి. రాజ ధర్మాన్ని నిలుపుతూ స్వయంవర ప్రక్రియ మాసిపోకుండా చూడాలి" అని తలా ఒక మాట అనడం ప్రారంభించారు. అక్కడ ఒక యుద్ధ వాతావరణం ఏర్పడింది. భీముడొక చెట్టును పీకి దాని ఆకులను దూసి దాన్ని ఆయుధంగా చేసుకొని అర్జునుడి పక్కన నిలబడ్డాడు. ఎంతటి పరిస్థితిని ఎదుర్కోవడానికైనా సిద్ధపడ్డాడు. భీముడు కూడా బ్రాహ్మణుడి వేషంలోనే ఉన్నాడు. కృష్ణుడు, బలరాముడు ఆగ్రహం వ్యక్తం చేస్తున్న రాజకుమారులను శాంతించే ప్రయత్నం చేస్తున్నారు.

అర్జునుడు.. ద్రౌపదిని తీసుకొని తాను బసచేస్తున్న కుమ్మరి ఇంటికి తీసుకువెళ్లాడు. భీమార్జునులు ద్రౌపదిని తమ బసకు తీసుకొని వెళ్తుండగా దృష్టద్యుమ్నుడు వారికి కనిపించకుండా అనుసరించాడు. అక్కడ ఆతడు చూసిన దృశ్యానికి ఆనంద పరవశుడయ్యాడు. వెంటనే తండ్రి వద్దకు వెళ్లి.. "నేను వారికి కనపడకుండా చెల్లిని అనుసరించాను. తండ్రీ వారు పాండవులని నా అనుమానం. అక్కడ ఐదుగురు బ్రాహ్మణ యువకులు, ఒక గౌరవనీయురాలైన స్త్రీని చూశాను. ఆమె కుంతీ దేవే అయ్యింటుంది" అన్నాడు.

బ్రాహ్మణ వేషాల్లో ఉన్న మహిళను (కుంతిని), ఐదుగురు అన్నదమ్ములను (పాండవులను) తన రాజప్రాసాదానికి ఆహ్వానించాడు ద్రుపదుడు. వారు తాము పాండవులమని ద్రుపదుడికి చెప్పారు. తాము ఐదుగురమూ ద్రౌపదిని వివాహమాడటానికి నిశ్చయించామని కూడా చెప్పారు. వారు పాండవులు అని తెలుసుకున్నాక ద్రోణుడి విషయమై ద్రుపదుడిలో ఉన్న భయాందోళన పోయింది. కానీ, పాండవులు ఐదుగురూ ద్రౌపదిని వివాహమాడతామన్న అంశంపై చీకాకు పడ్డాడు. దానికి అంగీకరించలేదు. "ఇది అధర్మం. ఈ ఊహ మీకెలా వచ్చింది?. ఈ ఊహ నీతిబాహ్యమైంది. ఇదివరకెన్నడూ కనీవినీ ఎరుగనిది" అన్నాడు ద్రుపదుడు. యుధిష్ఠరుడు అందుకుంటూ.. "ఓ రాజా, దయవుంచి మమ్ములను క్షమించు. ఒకానొక

క్లిష్ట పరిస్థితిలో మేము ఉండగా.. ఏదైనా సంభవిస్తే, అందరూ సమంగా పంచుకొని అనుభవించాలని ఒట్టుపెట్టుకున్నాం. కనుక ఆ ప్రతిజ్ఞను వీడబోం. మా తల్లి మమ్మల్ని అలా అజ్ఞాపించింది" అన్నాడు. చివరికి ద్రుపదుడు అంగీకరించాడు. ఆ వివాహ మహోత్సవం ఘనంగా జరిగింది.

◈



ఖాండవ వనాన్ని దహిస్తున్న
కృష్ణార్జునులు

## అధ్యాయం - 17

# ఇంద్రప్రస్థము

**పాం**చాల స్వయంవర వార్తలు, అంశాలు హస్తినాపురం చేరాయి. విదురుడు బాగా ఆనందించాడు. వెంటనే విదురుడు ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్లాడు. "ఓ రాజా, మన కుటుంబానికి మరింత బలం చేకూరింది. ద్రుపదరాజు కుమార్తె మన కోడలైంది. మన తారాబలం బాగున్నది." అన్నాడు. అంధుడైన ధృతరాష్ట్రుడు తన కుమారుడైన దుర్యోధనుడే ద్రౌపదిని గెలిచాడని అనుకున్నాడు. ధృతరాష్ట్రుడికి దుర్యోధనుడు అంటే అంత ప్రేమ. విదురుణ్ణి ఉద్దేశించి ధృతరాష్ట్రుడు.. "నీవు చెప్పినట్లు నిజంగా మనకు మంచి కాలమే. వెంటనే వెళ్లి నీవు ద్రౌపదిని తీసుకొని రా. ఆమెకు ఆనందం కలిగించే విధంగా స్వాగతమిద్దాం" అన్నాడు. ధృతరాష్ట్రుడి పొరబాటు భావనను సవరించే ఉద్దేశంతో విదురుడు.. "మంచివారైన పాండవులు బతికే ఉన్నారు. అర్జునుడు ద్రుపదరాజు కుమార్తెను స్వయంవరంలో గెలిచాడు. శాస్త్రసమ్మతంగా పాండవులు ఐదుగురూ ద్రౌపదిని వివాహమాడారు. వారి తల్లి కుంతీదేవితో కూడా వారు సౌఖ్యంగా

ద్రుపదుడి వద్ద ఉన్నారు" అన్నాడు. విదురుడి మాటలతో ధృతరాష్ట్రుడి అభిప్రాయం దెబ్బతింది. పైకి మాత్రం అలా కనపడలేదు. బహు ఆనందం ఉట్టిపడినట్లు ధృతరాష్ట్రుడు విదురుడితో.. "ఓయీ విదురా, నీ మాటలు విని చాలా అనందించాను. ప్రేమాస్పదులైన పాండవులు నిశ్చయంగా బతికే ఉన్నారా?. వారు చనిపోయారేమోనని మనం విచారిస్తూనే ఉన్నాం. ఇప్పుడు నీవు తెచ్చిన వార్త నా ఆందోళనను మాన్పింది. అయితే ద్రుపదుని కుమార్తె మన కోడలైంది. బాగు బాగు, చాలా మంచిది" అన్నాడు.

పాండవులపై దుర్యోధనుడి ఈర్ష్య, అసూయ, పగ, రెట్టింపయ్యాయి. వారు లక్క ఇంటి నుంచి సజీవులుగా వెళ్లడం, ఒక సంవత్సరంపాటు ఎవరికీ తెలియకుండా ఉండటం, గొప్ప పరాక్రమవంతుడైన పాంచాల చక్రవర్తి బాంధవ్యంతో ఇప్పుడు మరింత బలం కలవారు కావడం దుర్యోధనుడికి మింగుడు పడటం లేదు. దుర్యోధనుడు, దుశ్శాసనుడు తమ మేనమామ శకుని వద్దకు వెళ్లారు. "మామా, మన కార్యం చెడి నిస్సహాయులమయ్యాం. పురోచనుణ్ణి నమ్మినందువల్ల మనం దగా పడ్డాం. మన శత్రువులైన పాండవులు మనకంటే తెలివైనవారు. వారికి అదృష్టం పట్టింది. దృష్టద్యుమ్నుడు, శిఖండి కూడా వారి సహాయులయ్యారు. మనం ఏమి చేయగలం?" అన్నాడు దుర్యోధనుడు ఎంతో విచారంతో.

కర్ణుడు, దుర్యోధనుడు కలిసి ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్లారు. "మీరు విదురుడితో మనకు ముందు మంచి రోజులు ఉన్నాయని చెప్పారు. మన సహజ శత్రువులైన పాండవులు మనలను రూపుమాపగల శక్తి సంపన్నులు కావడం మనకు మంచి రోజులా?, వారిపై ప్రయోగించిన మన కుట్ర పనిచేయలేదు. మన కుట్రయే అని వారు గ్రహించడం మరింత అపాయం కలిగించింది. వారిని ఇప్పుడు ఇక్కడే నాశనం చేయాలి. లేదా మనమే చావాలి.

ధృతరాష్ట్రుడు జోక్యం కల్పించుకొని.. "ప్రియ కుమారా, నీవు చెప్పినది నిజం. కానీ మన మనసులో ఏముందో విదురుడికి చెప్పకూడదు. అందుకోసమే నేను అలా అన్నాను. మనం ఏమి చేయాలో నువ్వు ఆలోచన చేయి. నేను వింటాను" అన్నాడు. దుర్యోధనుడు అందుకొని.. ''నా మనసు తీవ్ర వ్యాకులంగా ఉంది. ఏ ఉపాయమూ తోచడం లేదు. ఈ పాండవులు ఒక తల్లికి పుట్టినవారు కానందున ఈ అంశాన్ని ఆధారం చేసుకొని కుంతి కుమారులకు, మాద్రి కొడుకులకు తగవు పెట్టాలి. ఇదీగాక ద్రుపదుణ్ణి మన పక్షం వహించాలని ధనమిచ్చి అతణ్ణి ప్రలోభ పెట్టాలి. తన కుమార్తెను పాండవులకు ఇచ్చి వివాహం చేసినా.. ధనమిచ్చి మనవైపుకు లాక్కురావాలి. ద్రవ్యం చేయలేంది ఏదీ లేదు" అన్నాడు.

కర్ణుడు నవ్వుతూ.. "ఇదంతా పనికిరాని సంభాషణ" అన్నాడు. దీనికి

దుర్యోధనుడు.. "మనం ఎలాగైనా నిశ్చయంగా చేయవలసిందేమంటే.. పాండవులు ఇక్కడికి వచ్చి మనమాక్రమించిన రాజ్యాన్ని అడగకుండా చేయడమే. మనం కొంతమంది బ్రాహ్మణులను దృపదుడి రాజ్యానికి పంపి వాళ్లతో పాండవులు హస్తినాపురానికి వస్తే గొప్ప అపాయం సంభవిస్తుందని దృపదుడి రాజ్యంలోనూ, పట్టణంలోనూ వార్తలను ప్రచారం చేయాలి. అవసరమైతే పాండవులతో కూడా ఆ మాట చెప్పించి భయపెట్టాలి. అప్పుడు పాండవులు ఇక్కడికి రావడానికి భయపడతారు. మనం సురక్షితంగా ఉంటాము" అన్నాడు. కర్ణుడు ఇలా అన్నాడు. "ఇది కూడా పనికిరాని సంభాషణే. ఆ ప్రకారం నీవు పాండవులను భయపెట్టలేవు" అన్నాడు. దుర్యోధనుడు అడ్డం వస్తూ.. "ద్రౌపది మూలంగా పాండవుల్లో తగవులను పెంచలేమా;. ఆమె బహు భర్తృత్వమే ఇందుకు మనకు పనికి వస్తుంది. వారిలో వారికి అనుమానాలు, అపార్థాలు పెరగడానికి స్త్రీ, పురుష ప్రేమ శాస్త్రంలో బాగా ప్రవేశమున్నవారితో ప్రయత్నాలు చేయించాలి. మనం తప్పకుండా జయించగలం. ఒక అందమైన స్త్రీని ఏర్పాటు చేసి కుంతీ తనయుల్లో కొంతమందినైనా ఆమె వలలో పడేటట్లు చేయాలి. దీంతో ద్రౌపది తప్పక వారితో తగువు పడుతుంది. పాండవులు ఎవరినైనా అనుమానిస్తుంటే అలాంటి వాళ్లను ఇక్కడికి పిలిపించి వారిని మనలో కలుపుకుని మన కార్యాన్ని సిద్ధింప చేసుకోవాలి" అన్నాడు. కర్ణుడు ఈ ఆలోచనను కూడా నవ్వుతూ హేళన చేశాడు. "నీవు చెప్పినట్లు ఈ ఆలోచనలేవీ పనికిరావు. పాండవులను నీవు మాయతో, యుక్తితో జయించలేవు. రెక్కలురాని పక్షుల్లా ఉన్న చిన్నతనం నుంచే వారిని మనం వంచించలేకపోయాం. వారిప్పుడు పెరిగి పెద్దవారై ప్రపంచజ్ఞానాన్ని సంపాదించారు. అదీగాక వారిప్పుడు దృపదరాజు జాగ్రత్తలో ఉన్నవారు. నీ యుక్తులన్నీ వారికి అవగతమయ్యాయి. ఇకపై మాయలు, కుయుక్తులు పనికిరావు. వారిలో వారికి తగవులు పెట్టలేము. బుద్ధిమంతుడు, మర్యాదగలవాడు అయిన దృపదుడికి నీవు లంచం ఇవ్వలేవు. ద్రౌపది కూడా పాండవులను వ్యతిరేకించడం అసంభవం. కాబట్టి మనకు మిగిలింది ఒకటే మార్గం. వారింకా బలవంతులే. స్నేహితులు మొదలైనవారు వారి పక్షంలో చేరకమునుపే పాండవులను ఎదుర్కోవాలి. శ్రీకృష్ణుడు తన యాదవ సైన్యంతో సహాయం రాకుండా మనం పాండవులపై, దృపదుడిపై హఠాత్తుగా దాడికి దిగాలి. క్లిష్ట పరిస్థితులను నుంచి మనం బయట పడటానికి క్షత్రియోచిత వీర మార్గాన నడవాలి. మాయా మార్గాలు సరిపడవు" అన్నాడు కర్ణుడు. దీనికి ధృతరాష్ట్రుడు కూడా ఓ నిశ్చితాభిప్రాయానికి రాలేకపోయాడు. ఆయన భీష్మ, ద్రోణులను రప్పించి మంతనాలు చేశాడు. పాండవులు బతికి ఉన్నారని, పాంచాల రాజు దృపదుడి కుమార్తెను పెళ్లాడి వారిపుడు అక్కడే ఉన్నారని విని భీష్ముడు చాలా ఆనందించాడు.

అప్పుడనుసరించాల్సిన కార్య విషయమై ఆయనతో ప్రస్తావించారు. "పాండవులను రప్పించి వారికి సగౌరవంగా అర్ధరాజ్యం ఇవ్వడమే ఇప్పుడు చేయదగింది. రాజ్య ప్రజలు కూడా అలాగే పరిష్కరించాల్సిందిగా కోరుతున్నారు. మన కుటుంబ గౌరవం నిలుపుకోవడానికి ఇదొక్కటే మార్గం. వారణావత లక్క ఇంటి అగ్ని ప్రమాదం గురించి ప్రజలు నీకు ప్రతికూలంగా చెప్పుకున్నారు. పాండవులను రప్పించి వారికి అర్ధరాజ్యం ఇస్తే, నీపై నిందలు, అనుమానాలన్నీ మాసిపోతాయి. ఇదే నా ఆలోచన" అని భీష్ముడు ప్రకటించాడు. ఇక ద్రోణుడు కూడా భీష్ముడి మాదిరే సలహా ఇచ్చాడు. మన దూతను పాండవుల వద్దకు పంపాలని, అతడి సమక్షంలోనే ఉభయులకూ శాంతియుతంగా, అనుకూలంగా కార్యం నెరవేరేటట్లు చెప్పాడు. ఈ సలహాకు కర్ణుడు ఉగ్రుడయ్యాడు. కర్ణుడికి దుర్యోధనుడు అత్యంత ప్రియతముడు. రాజ్య భాగం పాండవులకు ఇవ్వాలని చెప్పడాన్ని ఆయన సహించలేకపోయాడు. కర్ణుడు.. ధృతరాష్ట్రుడితో ఇలా అన్నాడు. "ధనం, గౌరవం, మీ వద్ద గడించి ద్రోణుడు ఇలాంటి సలహాలను ఎలా ఇస్తున్నాడో నాకు ఆశ్చర్యంగా ఉంది. రాజనేవాడు మంత్రులిచ్చే సలహాలను జాగ్రత్తగా పరిశీలించి తరువాతనే ఆయా సలహాలను ఒప్పుకోవడం లేదా నిరాకరించడం చేయాలి".

కర్ణుడి మాటలతో ద్రోణుడు అగ్రహోదగ్రుడయ్యాడు. "ఓయీ క్రూరుడా.. రాజును చెడు మార్గం పట్టమని సలహా ఇస్తున్నావు. నేనూ, భీష్ముడూ చెప్పినది ధృతరాష్ట్రుడు చేయకపోతే అతి స్వల్ప కాలంలోనే మీ కౌరవులందరూ రూపు మాసిపోతారు" అన్నాడు.

తరువాత ధృతరాష్ట్రుడు.. విదురుడి అభిప్రాయాన్ని అడిగాడు. "మన వంశపు పెద్దలైన భీష్ముడు, గురువైన ద్రోణుడు చెప్పిన సలహాలు సమంజసంగానూ, నీతియుక్తంగానూ ఉన్నాయి. వాటిని తోసివేయ తగదు. దుర్యోధనుడు, అతడి అన్నదమ్ములు నీకు ఎలాగో, అలాగే పాండవులు కూడా నీ పిల్లలే. పాండవులను హింసించాలని నీకు సలహా ఇచ్చినవారంతా నీ వంశ నిర్మూలనకు ప్రయత్నిస్తున్నారని గ్రహించు. ద్రుపదుడు, అతని కుమారులు, కృష్ణుడు, యాదవులు అందరూ పాండవులకు సహాయం చేస్తారు. వారిని యుద్ధంలో గెలవడం అసంభవం. కర్ణుడి సలహా తెలివితక్కువది. పొరబాటు కూడా. పైగా మనం పాండవులను లక్క ఇంటిలో చంపదలిచామని దేశమంతా వదంతి ఉంది. పాండవులు సజీవులై ఉన్నారని విని వాళ్లను రప్పించాలని ఆ విధంగా వారిని సందర్శించాలని పట్టణ ప్రజలు, దేశ పౌరులు ఆరాట పడుతున్నారు. దుర్యోధనుడి మాటలు వినకు. కర్ణ, శకుని ఇద్దరూ అనుభవం లేని యువకులు.

వారికి రాజనీతి తెలియదు. సలహాలు ఇవ్వడానికి పనికిరారు. భీష్ముడి సలహాను అనుసరించు." అన్నాడు విదురుడు. చివరికి ధృతరాష్ట్రుడు.. పాండు పుత్రులకు అర్ధరాజ్యాన్ని ఇవ్వడానికీ, శాంతి ప్రతిష్టాపనకూ నిశ్చయించాడు. పాండవులను తోడ్కొని రమ్మని విదురుణ్ణి పాంచాలకు పంపాడు.

విదురుడు ద్రుపద పట్టణానికి రకరకాల రత్న వస్తువులు, విలువైన సామాగ్రితో వెళ్లాడు. విదురుడు ద్రుపదుడికి తగిన మర్యాదునిచ్చాడు. ద్రుపదుడు నుంచీ విదురుడు అలాంటి మర్యాదనే అందుకున్నాడు. ధృతరాష్ట్రుడి తరఫున తాను వచ్చిన పని గురించి చెప్పాడు విదురుడు ద్రుపదుడుతో. పాండవులను ద్రౌపదితోపాటు హస్తినాపురానికి పంపాలని విదురుడు కోరాడు.

ధృతరాష్ట్రుణ్ణి ద్రుపదుడు నమ్మడు. "అది పాండవుల ఇష్టం. వారు తమ ఇష్ట ప్రకారం చేయవచ్చు"అన్నాడు ద్రుపదుడు విదురుడుతో. విదురుడు కుంతీ దేవి వద్దకు వెళ్లి ఆమె పాదాలకు నమస్కరించాడు. "ఓ విచిత్ర వీర్య పుత్రా, నీవు నా కుమారులను రక్షించావు. కావున వారు నీ బిడ్డలు. నేను నిన్ను నమ్ముతాను. నీవు ఎలా చేయమంటే అలా చేస్తాను" అన్నది కుంతి. ఆమెకు కూడా ధృతరాష్ట్రుడు అంటే అపనమ్మకమే. "నీ బిడ్డలు ఎన్నడూ ధనం కోసం రారు. వారు రాజ్యం పొంది గొప్ప కీర్తి సంపాదిస్తారు. రండి వెళ్దాము." అని విదురుడు అన్నాడు. చివరికి ద్రుపదుడు కూడా పాండవులు హస్తినాపురం వెళ్లడానికి అనుమతి ఇచ్చాడు.. పాండవులను, ద్రౌపదిని, కుంతిని తీసుకొని విదురుడు హస్తినాపురానికి బయలుదేరాడు.

సంవత్సరాల తరబడి హస్తినాపురాన్ని విడిచి అనేక చోట్ల తిరిగి కష్టాలు అనుభవించి వచ్చిన పాండవులు హస్తినాపురం వస్తున్నారని తెలిసి వారికి స్వాగతం చెప్పారు. వీధులను చక్కగా పూలతో అలంకరించారు. ఇదివరకే నిర్ణయించిన మేరకు పాండవులకు అర్ధం రాజ్యం ఇచ్చారు. యుధిష్టరుడికి రాజ్యాభిషేకం చేశారు. ధృతరాష్ట్రుడు నూతనాభిషిక్తుడైన యుధిష్టరుడిని ఆశీర్వదించాడు. తరువాత వీడ్కోలు పలికాడు. "నా తమ్ముడైన పాండు ఈ రాజ్యాన్ని ఎంతో వృద్ధి చేశాడు. అతడి కీర్తిని నీవు నిలపాలి. నేనిచ్చే సలహాలను పాండు ఆనందంగా స్వీకరించేవాడు. అలాగే నీవూ నన్ను ప్రేమించు. నా కుమారులు క్రూరులు. గర్విష్టులు. మీ ఉభయుల మధ్యా రోష క్రోధాలు లేకుండా చేయడానికే ఇలా రాజ్య విభజన చేశాను. ఖాండవ ప్రస్థానానికి వెళ్లు. అదే నీ రాజధానీ నగరం. మన పూర్వులైన పురూరవసుడు, నహుషుడు, యయాతి అక్కడి నుండే రాజ్య పాలన చేశారు. అదే మన పురాతన రాజధానీ

నగరం. ఆ పట్టణాన్ని మరలా నీవు ప్రసిద్ధికి తెచ్చి కీర్తి సంపాదించు" అని ప్రేమతో ధృతరాష్ట్రుడు.. యుధిష్టిరుడికి చెప్పాడు.

పాండవులు శిథిలమైన ఖాండవప్రస్థాన్ని నూతన నగరంగా తీర్చిదిద్దారు. కోటలు, పెద్ద పెద్ద భవంతులు కట్టించారు. పునర్నిర్మించిన ఆ నగరానికి 'ఇంద్రప్రస్థము" అని పేరు పెట్టారు. ఆ పట్టణం అందంగా తీర్చిదిద్దబడి, ధనధాన్య సంపత్తి పొంది ప్రపంచమంతా పేరు తెచ్చుకుంది. పాండవులు అక్కడ తల్లి కుంతితోనూ, భార్య ద్రౌపదితోనూ, ధర్మమార్గం తప్పకుండా ముప్పై ఆరు సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు.

◈

## అధ్యాయం - 18

# సారంగ పక్షులు

**పు**రాణాల్లో చెప్పిన కథల్లో మనుషుల మాదిరే.. పక్షులు, మృగాలు మాట్లాడతాయి. ఒక్కొక్కప్పుడు అవి చక్కని అభిప్రాయాలను, బ్రహ్మజ్ఞాన విషయాలను కూడా బోధిస్తాయి. కానీ ఆ జంతువుల స్వతసిద్ధమైన గుణాలే మనుషుల హృదయాన్ని తరచిచూసే శక్తి కలిగేలా చిత్రంగా కథల్లో చూపారు. పౌరాణిక గ్రంథాల్లో అందంగా ఉండే ప్రకృతినీ, మన బుద్ధి విశేషాలనూ మేళవించి చూపారు. రామాయణంలో ఒక ఆనందదాయకమైన భాగంలో.. బహు బుద్ధిమంతుడు, చదువుకొన్నవాడు అని పొగడ్తలందుకున్న హనుమంతుడు.. లంకలో రావణుడి అభ్యంతరాంగణంలో ఓ అందమైన స్త్రీని చూసి, ఆమే సీత అని ఊహించి కోతి సహజ లక్షణాలతో గంతులు వేయడం గురించి వివరించారు.

పక్షులు, మృగాలు మాట్లాడినట్లు వర్ణించిన కథలు సాధారణంగా పిల్లలకు

ఆనందం కలిగిస్తాయి. కానీ పురాణ కథలు పెద్దవారి కోసమే ఊహించబడ్డాయి. ఆ కథలో జంతువులు.. మనుషుల భాషలో మాట్లాడటం గురించి పూర్వ చరిత్రొకటి చెప్పేవారు. సాధారణంగా చెప్పే పూర్వ చరిత్ర ఇలా ఉండేది. పక్షులూ, మృగాలూ పూర్వ జన్మలో మనుషులని, ఉదాహరణకు ఒక లేడి పూర్వ జన్మలో ఓ రుషి అని, లేదా ఒక నక్క ఓ రాజుగా ఉన్నాడని, అలాంటి నీచ జన్మకు కారణం శాపమే. ఆ కథల్లో లేడి సంచరిస్తూ.. రుషిలా మాట్లాడుతుంది. నక్క జన్మ ఎత్తినప్పుడు దాని జిత్తులమారితనం, ఒక అనుభవశీలుడైన రాజు గుణాలతో పోలిఉంటుంది. ఇలా ఉండే ఈ కథలు ఆనందాన్ని కలిగించేవని చెపుతుండేవారు.

పాండవుల పాలనలోకి వచ్చేసరికి ఖాండవ ప్రస్థం ఎలా ఉండేదంటే.. తుప్పలు, ముళ్లు, ఎత్తుపల్లాలు కలిగి ఓ అడవిలా దర్శనమిచ్చేది. చాలా కాలం నుంచి ఆ పట్టణం అలా వదిలేసి ఉంది. అందువల్ల పట్టణం పాడయిన గోడలు, పడిపోయిన ఇళ్లతో భయంకరంగా ఉండేది. పక్షులూ, మృగాలూ ఆ శిథిల పట్టణాన్ని నివాసంగా ఏర్పరుచుకున్నాయి. అంతేకాదు.. దొంగలతోనూ, దుర్మార్గులతోనూ పట్టణం నిండి ఉంది. కృష్ణుడు, అర్జునుడు ఆ అడవంతా తగులబెట్టించి ఆ స్థలంలో కొత్త పట్టణాన్ని నిర్మించాలని నిర్ణయించారు.

ఓ వింత ఆడ పక్షి తన నలుగురు పిల్లలతో ఆడవిలో నివాసం ఏర్పరుచుకొని ఉంది. మగపక్షి అడవిలో ఆనందంగా సంచరిస్తూ.. మరో ఆడపక్షిని తోడు చేసుకొని తన భార్యను, పిల్లలను వదిలేసింది. దిక్కులేని ఆడపక్షే పిల్లలను పెంచుతోంది. కృష్ణార్జునుల ఆజ్ఞపైన ఆ అడవికి నిప్పు పెట్టగా.. మంటలు అన్ని దిశలకూ వ్యాపించి దహించుకుపోతోంది. అనాధ అయిన తల్లి పక్షి ఆందోళనతో విచారిస్తోంది. మంటలు త్వరత్వరగా వ్యాపిస్తూ తల్లి పక్షి ప్రాంతానికి వస్తున్నాయి. కొద్ది క్షణాల్లో తల్లీబిడ్డ పక్షులు ఆహుతి అవుతాయి. మిగతా అడవి ప్రాణులు ఆశలు వీడి ప్రాణావసాన దశలో ఉన్నాయి. అప్పుడు తల్లి పక్షి.. రెక్కల్లేని పిల్లల్లారా, మిమ్మల్ని ఈ మంటల నుంచి ఎలా కాపాడగలను?. మీ తండ్రి మనలను మోసగించి విడిచిపెట్టాడు. మిమ్మల్ని మోసుకొని ఎక్కడికైనా సురక్షిత ప్రాంతానికి తీసుకుపోదామన్నా నాకు ఎగిరే శక్తిలేదు" అంటూ ఏడుస్తున్న తల్లికి పిల్ల పక్షులు ఇలా అన్నాయి. "అమ్మా మా గురించి నీవు విచారించకు. మమ్ముల్ని మా అదృష్ట దురదృష్టాలకు వదిలివేయి. మేమిక్కడ చనిపోతే రాబోయే జన్మలోనైనా మాకు మంచి జన్మ లభిస్తుంది. మా కోసం నీవు ప్రాణాలు వదిలితే మన వంశమే నశిస్తుంది. నీవు అపాయంలేని ప్రాంతానికి వెళ్లిపో. మరో భర్తను పొంది, సంతానం కంటే మమ్మల్ని మరిచిపోతావు. తల్లీ మన వంశానికి ఏది

శ్రేయస్కరమో ఆలోచించి ఏది తోస్తే అదే చేయి” అన్నాయి. పిల్ల పక్షులు ఎంత బతిమిలాడినా తల్లి పక్షికి తన పిల్లలను వదిలి వెళ్లబుద్ధి కాలేదు. నేనిక్కడే ఉండి ఈ మంటల్లో మీతోపాటు పడి చనిపోతాను.

ఈ పక్షుల చరిత్రకు సంబంధించి వెనుకటి కథ ఒకటి ఇలా ఉండేది. మందపాలుడనే రుషి ఒకడుండేవాడు. అతడు చాలా కాలం నుంచి బ్రహ్మచర్య వ్రత దీక్ష పూని ఉన్నాడు. అతడు చనిపోయి స్వర్గానికి వెళ్లినప్పుడు ద్వార పాలకుడు.. ‘ఇక్కడ సంతానంలేని వారికి తావు లేదు’. అని అతణ్ణి పంపేశాడు. అప్పుడతడు ఒక సారంగి పక్షి అయ్యి జన్మించాడు. ‘జరిత’ అనే ఆడ పక్షితో సంసారం చేశాడు. ఆడపక్షి నాలుగు గుడ్లు పెట్టింది. అప్పుడతడు (సారంగ పక్షి) ‘జరిత’ను విడిచి అడవుల్లో స్వేచ్ఛగా తిరుగుతూ ‘లపిత’ అనే ఆడపక్షితో సంపారం చేయడం మొదలు పెట్టాడు. జరిత నాలుగు గుడ్లనూ పొదిగింది. పిల్లలూ పెద్దవయ్యాయి. అవే, పైన చెప్పిన కథలోని నాలుగు పక్షి పిల్లలు.

తల్లి పక్షి నలుగురు పిల్లలతో ఇలా అంది. “ఈ చెట్టు పక్కనే ఓ ఎలుక బిలం (కలుగు) ఉంది. అందులో మిమ్మల్ని ఉంచుతాను. మీరు ఆ కలుగులోకి వెళ్తే మంటల నుంచి తప్పించుకోగలుగుతారు. ఆ కలుగును నేను మట్టితో పూడ్చుతాను. మంటలు మిమ్మల్ని చేరవు. మంటలు చల్లారాక మిమ్మల్ని నేను కలుగు నుంచి బయటకు తీస్తాను” అంది తల్లి పక్షి. దీనికి పిల్ల పక్షులు ఇష్టపడలేదు. “ఆ కలుగులోని ఎలుక మమ్మల్ని మింగేస్తుంది. ఎలుకవాత పడి నీచంగా చనిపోయేకన్నా మంటలకు ఆహుతై చనిపోవడం మేలు” అన్నాయి పిల్ల పక్షులు. తల్లిపక్షి పిల్లల భయాందోళనను పోగొట్టాలనుకుంది. “ఓ గద్ద ఆ ఎలుకను చంపి తినగా నేను చూశాను. కానీ కలుగులో ఏ అపాయమూ ఉండదు” అన్నది తల్లి పక్షి.

“ఆ కలుగులో ఇంకా ఎలుకలు ఉండొచ్చు. గద్ద ఒక ఎలుకను తిన్నంత మాత్రాన మాకు అపాయం తప్పదు. కనుక ఈ మంటలు మన దగ్గరకొచ్చి మనం నివసించే చెట్టు తగులబడిపోకముందే ఎగిరిపోయి నీ ప్రాణాలను రక్షించుకో. మేమైతే ఎలుక కలుగులోకి చొరబడము. మా కోసం నీ ప్రాణాలను ఎందుకు పణంగా పెడతావు. నీకు ఏం చేశామని అంత ప్రేమ మామీద. మేము నీకు పుట్టింది మొదలు నీకు కష్టాలే తెచ్చి పెట్టాము. మరో మగ పక్షితో హాయిగా ఉండు. మంటల్లో కాలి చనిపోయిన మేము ఊర్ధ్వ లోకానికి వెళ్తాం. మేం ఒక వేళ దైవికంగా చావకపోతే మంటలు చల్లారిన తరువాత నువ్విక్కడికి వచ్చి మమ్మలను చూడు. ఆలస్యం చేయకు. వెంటనే వెళ్లు” అన్నాయి పిల్ల పక్షులు.

ఎంత నచ్చచెప్పినా వినని పిల్లల హెచ్చరికతో తల్లి పక్షి ఎగిరిపోయింది. మంటలు పిల్లలున్న చెట్టును చుట్టుముట్టాయి. కానీ ఆ చిన్న పక్షులు ఎలాంటి ఆందోళనకూ గురికాలేదు. ఈ పిల్ల పక్షుల్లో పెద్దదైనదొకటి "బుద్ధిమంతుడు ముందుగానే రాగల అపాయాన్ని ఊహించి.. అలాంటిది జరిగినప్పుడు తన మనస్సును నిశ్చలంగా ఉంచుకోవాలి" అంది. చిన్న పక్షలు ఇలా అన్నాయి. "నీవు పెద్దదానివి. బుద్ధిమంతురాలివి. ఒక మహాజ్ఞాని మాత్రమే నీలాగా ఉంటాడు" అన్నాయి. మంటలు చిన్న పక్షల దగ్గరకు వచ్చాయి. అవి నవ్వుతూ "ఓ అగ్ని దేవుడా.. మా తల్లి మమ్మల్ని వదిలి వెళ్లింది. మా తండ్రిని మేము చూడనే లేదు. మాకు ఇంకా పూర్తి ఊహ రాకముందే అతడు ఎటో వెళ్లిపోయాడు. ఓ అగ్ని దేవుడా, ధూమం నీ పతాకం. నీవే మాకు శరణ్యం. మేం రెక్కలు రాని నిస్సహాయులం. మమ్మల్ని రక్షించడానికి ఇతరులెవరూ లేరు. నీవే రక్షకుడవు" అని పిల్ల పక్షులు అగ్నిదేవుడు కాళ్ల మీద పడ్డాయి. అడవినంతటినీ కాల్చేసిన ఆ అగ్ని దేవుడు దయతలిచి ఆ చిన్న పక్షులను విడిచిపెట్టాడు. అగ్ని చల్లారిన తరువాత తల్లి పక్షి తిరిగొచ్చి సురక్షితంగా ఉన్న పిల్ల పక్షులను కౌగలించుకొని ఆనందించింది.

ఈ నేపథ్యంలోనే తల్లి పక్షి (జరిత)ని వదిలేసి ప్రియురాలైన లపిత అనే ఆడ పక్షితో వెళ్లిపోయిన భర్త పక్షి (మందపాలుడు) అగ్ని ప్రమాద సందర్భంలో తన పిల్లల రక్షణ గురించి ఆతృత పడ్డాడు. ఆ మాటే ప్రియురాలైన లపితకు చెప్పాడు. లపిత ప్రియుడికి చివాట్లు పెట్టింది. "నీ మనసు నాకు తెలుసు. నా వల్ల సౌఖ్యాన్ని పొంది జరిత వద్దకు వెళ్లడానికి ఈ అగ్ని కారణం చూపుతున్నావు. జరిత సంతానం అగ్ని వాతపడదని, అగ్ని దేవుడు వరమిచ్చాడని నీవు నాతో చెప్పావు. నువ్వు నిజం చెప్పు. నీ కిష్టముంటే నీ భార్య అయిన జరిత వద్దకే వెళ్లు. పురుషుల్ని నమ్మి అలాంటి నీచులతో వంచితురాలై, ఆడవుల్లో పడిన దిక్కులేని ఆడవాళ్లలో నేనూ ఒకదాన్ని అవుతాను" అన్నది లపిత. ప్రియుడైన మందపాలుడనే పక్షి.. "నీవు ఊహించింది తప్పు. నేను సంతానం కోసం పక్షి జన్మను స్వీకరించాను. కనుకనే పిల్ల పక్షులంటే నాకు ఆతృత. నేనొకమారు వెళ్లి పిల్లలను చూసి మరలా నీ వద్దకే వస్తాను" అని లపితను ఓదార్చి అక్కణ్ణుంచి వెళ్లి జరిత కూర్చొన్న చెట్టు మీద వాలింది. జరిత మందపాలుణ్ణి చూడలేదు. తన పిల్లలు సురక్షితంగా ఉన్నందుకు ఆనందంలో మునిగి ఉంది. తర్వాత పక్కకు చూడగా.. తనను వదిలి వెళ్లి పోయిన భర్త మందపాలుడు కనిపించాడు. "మళ్లీ ఎందుకు తిరిగి వచ్చావు" అని ఎంతో నిర్లక్ష్యంతో ప్రశ్నించింది. మందపాలుడు ఎంతో ప్రేమగా.. "నా పిల్లలు సౌఖ్యంగా ఉన్నారా.. వీరిలో పెద్ద

ఎవరు?" అని అడిగాడు. "ఓహెూ నీకు పిల్లలంటే అంత ప్రాణమా?. ఎవతి కోసం నన్ను విడిచి వెళ్లావో దానివద్దకే వెళ్లు. దానితోనే ఆనందించు" అన్నది తల్లి పక్షి (జరిత).

మందపాలుడు.. "స్త్రీ తను సంతానవతి అయ్యాక తన భర్త విషయమై లక్ష్యం ఉంచదు. ప్రాపంచిక ధర్మమది. నిర్దోషి అయిన వశిష్టులవారిని కూడా అరుంధతి అలాగే నిరాకరించింది" అన్నాడు.

◈



జరాసంధుని జననం

## అధ్యాయం - 19

# జరాసంధుడు

**పాం**డవులు ఇంద్రప్రస్థపురాన్ని ఎంతో వైభవంగా పరిపాలిస్తున్నారు. యుధిష్ఠరుడి ఇష్టులంతా ఆయనను రాజసూయ యాగం చేసి చక్రవర్తి పదవిని పొందాలని ప్రోత్సహించారు. ఆ రోజుల్లో కూడా పాలించడానికి గొప్ప ఆశయాలుండేవని దీన్నిబట్టి తెలుస్తోంది. ఈ విషయంలో యుధిష్ఠరుడు శ్రీకృష్ణుడి అభిప్రాయాన్ని కోరాడు. ధర్మపుత్రుడు తనను చూడాలని అడిగిన విషయం గుర్తుకు రావడంతో శ్రీకృష్ణుడు జవాశ్వాల రథంపై ఇంద్రప్రస్థపురానికి చేరాడు.

"నావాళ్లందరూ నన్ను రాజసూయ యాగం చేయాలని ప్రోత్సహిస్తున్నారు. రాజులందరితో మంచి అనిపించుకొని, వాళ్లతో కప్పాలు కట్టించుకోగల ప్రజ్ఞ కలవాడే యజ్ఞం చేసి చక్రవర్తి బిరుదు సంపాదించగలడనే అంశం మీ అందరికీ తెలిసిందే. నాకు నీవు సలహా ఇవ్వు. ప్రేమాతిశయంతో నీ మనసు మార్పు చెందదని, ఏ విషయంలోనైనా అనాలోచితంగానూ, పక్షపాతంగానూ నీవు ఉండబోవని నాకు తెలుసు. ఇతరులకు సంతోషం కలిగిస్తుందని నీవెన్నడూ సలహాలు ఇచ్చేవాడివి కాదు.

ఇతరులు సంతోషించడంలో నీకు సంబంధం లేదు. నీవు ఇచ్చే అభిప్రాయం, సలహా ధర్మంగానూ, ఆచరణీయంగానూ ఉంటుంది' అన్నాడు యుధిష్టరుడు.

దానికి శ్రీకృష్ణుడు.. "అలాగే, ఆ కారణం వల్ల నేను చెప్పేదేమంటే.. మగధరాజు, ఘనుడని చెప్పే జరాసంధుడు జీవించి ఉన్నంత కాలమూ నీకు చక్రవర్తి బిరుదు రాదు. అతడు చాలా మంది రాజులను జయించి వారిని తనకు భృత్యులుగా మార్చుకున్నాడు. క్షత్రియులంతా, పరాక్రమవంతుడైన శిశుపాలుడు కూడా జరాసంధుడి ప్రభావానికి భయపడి అతనికి లోబడి పోయాడు. ఉగ్రసేనుడి కుమారుడు, దుర్మార్గుడు అయిన కంసుడి గురించి విన్నావు కదా. అతడు జరాసంధుడి అల్లుడు. అతడికి కంసుడు సహాయకుడు అయిన తరువాత నేను, నా ప్రజలు జరాసంధుడిపై దాడికి వెళ్లాం. మూడేళ్లపాటు ఎడతెగని యుద్ధం జరిగింది. మేం ఓడిపోయామని చెప్పక తప్పదు. అప్పుడు మేం మధుర వదిలి పశ్చమదిశలో ఉన్న ద్వారకకు వెళ్లాం. అక్కడొక గొప్ప పట్టణాన్ని నిర్మించుకొని సుఖంగా, సమృద్ధంగా జీవనం గడుపుతున్నాం. దుర్యోధనుడు, కర్ణుడు, ఇంకా ఇతరులు నీవు చక్రవర్తి పదవి పొందడానికి సమ్మతించినా జరాసంధుడు తప్పకుండా నీకు ఎదురు తిరుగుతాడు. కనుక.. తిరుగుబాటు లేకుండా చేయడానికి అతణ్ణి ఓడించి చంపాలి. అప్పుడు నీవు రాజసూయం పూర్తి చేయడమే కాకుండా, జరాసంధుడి వల్ల బందీలైన రాజులను విముక్తులను చేస్తే వారి స్నేహాన్ని గౌరవాన్ని కూడా పొందుతావు.

కృష్ణుడి మాటలు విన్న యుధిష్టరుడు.. "నేను ఒప్పుకుంటాను. రాజ్యాలను న్యాయంగా, ధర్మ సమ్మతంగా పాలిస్తూ అత్యాశకు పోకుండా సౌఖ్యంగా జీవించే అనేకమంది రాజుల్లో నేనొకణ్ణి. చక్రవర్తి అవ్వడం అనేది "అంత పదవికి అర్హులం" అన్నది తెలియజేయడానికి, గర్వపడటానికి మాత్రమే తప్ప వేరు కాదు. రాజు అన్నవాడు తన రాజ్యంతో ఎందుకు సంతృప్తి చెందకూడదు. కనుక చక్రవర్తి కావాలనే కోర్కెను నేను విడిచిపెడుతున్నాను. ఆ బిరుదు నిశ్చయంగా నన్ను ఆశ పెట్టడం లేదు. నా అన్నదమ్ములు అలా కోరారు. నీవే జరాసంధుడికి భయపడుతుంటే.. మేమేమి చేయగలం" అన్నాడు. ఈ మాటలు భీమసేనుడికి ఏ మాత్రమూ రుచించలేదు. "రాజుకు ఆశ గొప్ప గుణం. తన బలం తెలుసుకోలేనప్పుడు అది ఉండీ ఫలమేమిటి?. సోమరితనంతో కాలం గడుపుతూ.. ఇలా తృప్తి పడటం నాకు ఇష్టం లేదు. ఎవరైతే సోమరై సుఖపడే చెడు అలవాటును వదిలి పెడతాడో, రాచ కార్యాల్లో యుక్తంగానూ, బుద్ధిగానూ పని చేయగుతాడో అతడు తనకంటే బలవంతుణ్ణి కూడా జయించగలడు. బాహుబలం, యుక్తీ కలిస్తే అది ఎంత పనయినా చేస్తుంది. నా బాహుబలానికి తోడు, కృష్ణుడి బుద్ధిబలం, అర్జునుడి చాకచక్యం కలిసి ఉంటే ఏ కార్యాన్నైనా

సాధించగలం. మేం ముగ్గురం కలిసి అనుమానాలు, భయాలు వీడి ఈ పనికి సిద్ధపడితే జరాసంధుణ్ణి జయించగలం" అన్నాడు భీమసేనుడు.

కృష్ణుడు ఇలా అన్నాడు. "జరాసంధుణ్ణి నిశ్చయంగా చంపవలసిందే. మరణమే వాడికి తగినది. వాడు 86 మంది రాజపుత్రులను అన్యాయంగా కారాగారంలో ఉంచాడు. నూరు మంది రాజులను హింసించే కోరికతో మరో 14 మంది రాజుల కోసం ఎదురు చూస్తున్నాడు. భీముడు, అర్జునుడు సమ్మతిస్తే నేను వారితో వెళ్తాను. మేం ముగ్గురమూ కలిసి ఆ మగధ రాజును యుక్తితో చంపి, బందీలుగా ఉన్న రాజులను విడిపిస్తాం. ఇది నా ఆలోచన" అన్నాడు.

యుధిష్టరుడు ఈ అభిప్రాయాన్ని ఇష్టపడలేదు. "కేవలం చక్రవర్తి అనిపించుకోడానికి, మనకు తగని ఆశ పెట్టుకోవడానికి, దానికోసం నా రెండు కళ్లయిన భీమార్జునులను మృత్యువాతకు సిద్ధం చేసినట్లే. ఇలాంటి అపాయకర కార్యానికి నేను పంపను. రాజసూయ యాగం ప్రసక్తే లేదు. ఆ ప్రయత్నం వద్దు" అన్నాడు యుధిష్టిరుడు.

అర్జునుడు కలగజేసుకుంటూ.. "మనం ప్రఖ్యాతి చెందిన వంశంలో పుట్టాం. ధైర్యం, శౌర్యం, వీర కృత్యం లేకుంటే జీవించి ఫలితమేంటి?. క్షత్రియుడికి ఎన్ని సుగుణాలున్నా తాను కార్యసాధనకు పాటుబడకపోతే ఆ రాజుకు కీర్తి లభించదు. ఉత్సాహం జయానికి సూచిక. మనం చేపట్టిన కార్యం శక్తి, యుక్తితో చేస్తే సంపదను పొందగలం. మంచి బలవంతుడైనా అశ్రద్ధతో చేసే ఏ కార్యమైనా విజయవంతం చేయలేడు. తన బలాన్ని గుర్తించకపోతే ఓటమి తప్పదు. మేం బలవంతులమని తెలుసు. దాన్ని ఎంతవరకు ఉపయోగించాలో అంతవరకే ఉపయోగించడానికి మేం భయపడం. యుధిష్టరుడు మనం యుద్ధం చేయడానికి అసమర్థులమని ఎందుకు అనుకోవాలి. వృద్ధాప్యం వస్తే అడవులకు పోయి శేష జీవితాన్ని నియమానుసారంగా తపస్సు చేసుకోవాలి. ఇప్పుడు మేం వీరత్వంతో మన వంశ ఘనతను నిలుపుతూ కాలాన్ని గడపాలి" అన్నాడు.

ఈ మాటలు వింటూ కృష్ణుడు ఆనందపడ్డాడు. "భరత వంశంలో కుంతికి జన్మించిన అర్జునుడు మరే ఇతర సలహా ఇవ్వగలడు. వీరుడికి, బలహీనుడికి కూడా మరణం తప్పదు కదా. కానీ క్షత్రియుడి వంశాచారం ఏమిటి?. శత్రువును ధర్మ యుద్ధంలో జయించి కీర్తి సంపాదించడమే. చివరికి యుధిష్టరుడు జరాసంధుణ్ణి సంహరించే విషయంలో అంగీకారం వ్యక్తం చేశాడు.

◈



జరాసంధుని వధిస్తున్న భీముడు

## అధ్యాయం - 20

# జరాసంధ వధ

మగధ రాజ్యాన్ని బృహద్రధుడు పాలిస్తున్నాడు. గొప్ప వీరుడనే పేరుంది. మూడు సైన్య పటాలాలకు ఆధిపతిగా ఉన్నాడు. బృహద్రధుడు కాశీ రాజు కవల కుమార్తెలను పెళ్లాడాడు. వారిరువురి పట్లా పక్షపాతం చూపనని వాగ్దానం చేశాడు. అతడికి చాలా కాలం వరకూ సంతానం కలగలేదు. తనకు ముసలితనం రావడంతో రాజ్యాన్ని మంత్రులకు అప్పగించి తన ఇద్దరు భార్యలతో అడవులకు పోయి తపస్సు చేయడం ప్రారంభించాడు. సంతానం లేదన్న చింతతో విచారగ్రస్తుడై గౌతముని పుత్రుడైన కౌసిక్ మహాముని వద్దకు వెళ్లాడు. ఆ రుషి.. రాజు విచారాన్ని చూసి కనికరించి 'నీకేమి కావాలి' అని ప్రశ్నించాడు. దానికి రాజు.. "నాకు సంతానం లేదు. నా రాజ్యాన్ని వదిలి అడవికి వచ్చాను. నాకు పిల్లలను ప్రసాదించు" అన్నాడు. రుషి హృదయం దయతో ద్రవించి పోయింది. 'ఈ రాజుకు నేను ఎలా సాయం చేయగలనా' అనే ఆలోచనలో ఉన్నాడు. అంతలో ఓ మామిడి పండు రివ్వున వచ్చి

ఆయన ఒడిలో పడింది. దాన్ని రాజుకిచ్చి "ఇది తీసుకో, నీ కోరిక నెవరేరుతుంది' అన్నాడు.

రాజు ఆ పండును రెండు సగ భాగాలు చేసి ఒక్కో భాగాన్ని ఒక్కో భార్యకు ఇచ్చాడు. ఇదివరకు తాను వీరిరువురి పట్ల పక్షపాతం లేకుండా ఉంటానన్న వాగ్దానాన్ని అనుసరించి అలా చేశాడు. ఆ ఫలాన్ని తిన్న కొంతకాలానికి రాజు భార్యలు గర్భవతులయ్యారు. సకాలంలో ప్రసవించారు. బిడ్డలు కలిగారన్న సంతోష సమయంలో వారికి సంతోషం మిగల్లేదు. ఇద్దరు భార్యలూ శిశువు అర్ధ భాగమే ప్రసవించారు. రుషి అందచేసిన మామిడి పండును రెండు భాగాలు చేసి భార్యలకు ఇవ్వడం వల్ల వారికి అర్ధ శిశువులు జన్మించారు. ఆ అర్ధ శిశువులు అసహ్యంగా ఉన్నారు. ఆ సగాలు ఒకే శిశువు చెరో పార్శ్వ భాగాలే. సగం ముఖం, ఓ కన్ను, ఒక చేయి, ఒక కాలు, ఓ చెవితో శిశువులు ఉన్నారు. రాజు, అతడి భార్యలు తీవ్రంగా విచారించి.. దాసీలను పిలిపించారు. ఈ శిశువు భాగాలను ఒక గుడ్డలో చుట్టి బయట పారవేయాలని చెప్పారు. దాసీలు వాటిని  వీధిలోని చెత్తకుప్పపై పడవేశారు.

మాంసాహారి అయిన ఓ రాక్షసి ఆ పెంట కుప్ప వద్దకు వచ్చింది. రెండు శిశు మాంసపు ముద్దలను చూసి ఇక తన పంట పండింది అనుకుంది. తనకు మంచి ఆహారం లభించిందని సంతోషించింది. రెండు ముక్కలనూ ఒకేమారు చేతితో పట్టుకుంది. కాకతాళీంగా ఆ రెండు సగాలు ఒకే శిశువుగా రూపుదిద్దుకున్నాయి. పైగా సజీవంగా ఉంది. ఆ మార్పుకు రాక్షసి ఆశ్చర్య చకితురాలైంది. ఆ శిశువును తిన దలుచుకోలేదు. రాక్షసి ఓ అందమైన స్త్రీ రూపం ధరించి రాజు వద్దకు వెళ్లి "ఇదిగో నీ బిడ్డ' అని  చేతిలో పెట్టింది. రాజు బ్రహ్మానందభరితుడై బిడ్డను భార్యకిచ్చాడు.

ఆ శిశువే జరాసంధుడు. అతడు పెద్దవాడవుతున్నాడు. బాహుబల సంపన్నుడు అవుతున్నాడు.  అతడి శరీరం రెండు సగ భాగాల కలయికతో ఏర్పడి ఉంది. తగినంత శక్తి ఉపయోగస్తే మరలా ఆ కాయాన్ని రెండు ముక్కలుగా చీల్చడానికి అవకాశం కలిగి ఉంది. అలా విడదీసినా మళ్లీ ఒకే కాయంగా రూపుదిద్దుకుంటుంది. ఇలా ఎన్నిసార్లు చేసినా మళ్లీ మళ్లీ శరీరం కలిసిపోతూ ఉంటుంది.

జరాసంధుణ్ణి జయించే, చంపే అంశం నిశ్చయమైన తరువాత కృష్ణుడు ఇలా అన్నాడు. "హంసుడు, హిడింబకుడు, కంసుడు మొదలైన జరాసంధ సహాయకులు చనిపోయారు. ఇప్పుడు జరాసంధుడు ఏకాకి. కావున అతన్ని చంపడానికి ఇదే మంచి తరుణం. సేనలను సమకూర్చుకొని, యుద్ధం చేయడం వల్ల ఉపయోగం లేదు. ద్వంద్వ యుద్ధానికి ప్రేరేపించి వాణ్ణి చంపాలి" అన్నాడు. ఆ కాలపు క్షత్రియ

ధర్మాన్ని అనుసరించి ఆయుధంతోగాని, నిరాయుధుడైనాగాని, ద్వంద్వ యుద్ధానికి పిలిస్తే సమ్మతిస్తారు. నిరాయుధ యుద్ధం అంటే ముష్టియుద్ధమే. పిడికిళ్లకు బరువైన సంచులు బిగించి చేసేది. లేకపోతే అది కుస్తీ అయినా కావచ్చు. క్షత్రియ ధర్మ యుక్త కుస్తీ యుద్ధంలోనే జరాసంధుణ్ణి చంపడానికి కృష్ణుడు, పాండవులు నిశ్చయించారు.

జరాసంధుడికి దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. వీటిని పోగొట్టుకోవడానికి బ్రాహ్మణులతో శాంతి పౌష్ఠిక కర్మలను చేయిస్తున్నాడు. అతడు కూడా ఉపవాసాది కర్మలతో ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాడు. శ్రీకృష్ణ, భీమార్జునులు నిరాయుధులై జరాసంధుడి కోటలోకి ప్రవేశించారు. ఆ వచ్చినవారి తేజస్సును, గొప్పదనాన్ని చూసి జరాసంధుడు వారిని ఎవరో మహానుభావులని గుర్తించి వారిని సగౌరవంగా ఆహ్వానించాడు. జరాసంధుడు వారి యోగ క్షేమాలను విచారించాడు. భీమార్జునులు మౌనంగా ఉండిపోయారు. వారి పక్షాన శ్రీకృష్ణుడే... "వీరిరువురూ ప్రస్తుతం వారి మత సంబంధమైన వ్రత దీక్షను అనుసరించి మౌనంగా ఉన్నారు. అర్ధరాత్రయిన తరువాతే మాట్లాడతారు" అన్నాడు. జరాసంధుడు వారు ముగ్గురుని తన అగ్నిహోత్రశాలలోకి ఆహ్వానించి తాను కోటలోకి వెళ్లాడు.

మహామహులైన ఉత్తమ అతిథులు తన గృహానికి వ్రత దీక్ష పూని వచ్చినప్పుడు వారితో వారి సావకాశాన్ని అనుసరించి ఏదైనా ప్రసంగం చేయించడం జరాసంధుడికి అలవాటుగా ఉంది. అందువల్ల అర్ధరాత్రి సమయంలో వారిని దర్శించడానికి వెళ్లాడు. వారి నడవడిక గమనించిన జరాసంధుడికి ఓ విధమైన అనుమానం కలిగింది. వారి చేతులపై వింటి నారి మచ్చలు, కణుపులు కనపడ్డాయి. వారిలో క్షత్రియులకుండే రాజసం కనిపిస్తోంది. జరాసంధుడు వారిని వాస్తవం చెప్పమని కోరాడు. "మేము నీకు శత్రువులం. ఈ క్షణమే నీతో యుద్ధాన్ని కోరుతున్నాం. మాలో ఎవరినైనా నీకిష్టమైనవారిని ఎన్నుకొని యుద్ధానికి రా" అన్నారు భీమార్జునులు. ఆ వచ్చిన ముగ్గురు ఎవరో పూర్తిగా అర్థం చేసుకున్నాడు జరాసంధుడు. "కృష్ణుడా.. నీవు పశు వుల కాపరివి. అర్జునుడు చిన్నవాడు. భీముడు బలశాలి అనే పేరున్నవాడు. కనుక భీముడితో యుద్ధం చేస్తాను" అన్నాడు. భీముడు నిరాయుధుడిగా ఉన్నందున జరాసంధుడు కూడా యుద్ధ ధర్మానుసారం నిరాయుధుడుగానే యుద్ధం చేయడానికి సంసిద్ధుడయ్యాడు.

బలంలో భీమజరాసంధులు ఇద్దరూ సమానమే. విరామం లేకుండా, నిద్రాహారాలు లేకుండా పదమూడు రోజులు వారు పోరాడారు. వారిని గమనిస్తున్న కృష్ణార్జునులకు ఒకోసారి ఆశ.. మరోసారి నిరాశ కలిగేది. పద్నాలుగో రోజున జరాసంధుడిలో అలసట కనిపించింది. శ్రీకృష్ణుడు.. జరాసంధుణ్ణి చంపడానికిదే

సమయం అని భీముడిని అప్రమత్తం చేశాడు. తక్షణం భీముడు జరాసంధుణ్ణి పైకెత్తి నూరుసార్లు గిరగిరా తిప్పి నేలకు కొట్టి రెండు కాళ్లూ పట్టుకొని అతడి శరీరాన్ని రెండు భాగాలుగా చీల్చి గంభీరంగా అరిచాడు. రెండుగా నిలువుగా చీల్చిన దేహం మళ్లీ ఏకమై మళ్లీ భీముడితో తలపడ్డాడు. భీముడు ఆ సంఘటనకు చకితుడయ్యాడు. ఏమి చేయాలో తోచలేదు. శ్రీకృష్ణుడు.. భీముడు తన వంక చూసినప్పుడు ఓ గడ్డి పరకను రెండుగా చీల్చి వాటిని అభిముఖంగా గాక, వ్యతిరేక దిశలో పడేశాడు. ఇది గమనించిన భీముడు యుద్ధంలో జరాసంధుణ్ణి చీల్చి ఆ రెండు ముక్కలను వ్యతిరేక దిశలో పడేశాడు. ఈసారి చీల్చబడిన జరాసంధుడి దేహం ఏకం కాలేదు. జరాసంధుడు మరణించాడు.

రాజపుత్రులు చెరసాల నుంచి విడుదలయ్యారు. జరాసంధుడి కుమారుడు మగధకు రాజయ్యాడు. శ్రీకృష్ణ, భీమార్జునులు ఇంద్రప్రస్థపురానికి తిరిగి వచ్చారు. జరాసంధుడి మరణంతో పాండవులకు రాజసూయయాగం చేయడం తేలికైంది. ఆ యజ్ఞాన్ని వారు వైభవంగా నిర్వహించారు. యుధిష్టరుడు “చక్రవర్తి” స్థాయిని పొందాడు. కానీ ఈ ఉత్సవంలో ఆనందాన్ని ఆవిరి చేసిన ఓ సంఘటన జరిగింది. ఉత్సవం పూర్తవుతున్న సమయంలో సభాసదుల మధ్య ఉన్న శిశుపాలుడు అసందర్భంగా ప్రవర్తించాడు. శ్రీకృష్ణుడి కోపాగ్నికి గురై మరణించాడు. (ఈ కథ తర్వాత అధ్యాయంలో వస్తుంది)

◈

శిశుపాలుని వధించిన శ్రీకృష్ణుడు



## అధ్యాయం - 21

# మహామహుడికి అగ్రపూజ

సభలో ఒకరు తనకేదయినా ఇష్టంలేని అంశం చర్చించేటప్పుడు.. తన సమ్మతిని తెలియజేస్తూనే, ఆ సభ నుంచి బయటకు వెళ్లడం కొత్త అలవాటు కాదు. మహాభారతం వల్ల ఈ అంశం అప్పటికాలంలోనూ ఉండేదని తెలుస్తోంది. అప్పటికి హిందూ దేశం అనేక స్వతంత్ర రాజ్యాలతో నిండి ఉంది. ప్రతి చిన్న స్వతంత్ర రాజ్యాన్ని, దాని స్వతంత్రతను గౌరవించేవారు. అప్పుడప్పుడు ఎవరో ఆశగల ఒక రాజు తన తోటి రాజులతో సంప్రదించి, వారి అనుమతి పొంది, తాను "చక్రవర్తి" అని వారిపై కూడా అధికారం చెలాయించేవారు. చక్రవర్తి కాబోయే రాజు మిగతా రాజుల అంగీకారంతో రాజసూయ యాగ ప్రయత్నం చేసి, ఆ రాజులను ముందుగానే ఆహ్వానించి, వారి సమక్షంలో యజ్ఞం చేసిన తర్వాతే తన ఆధిపత్యాన్ని స్థిరపర్చుకోవాలి.

ఈ ఆచారం ప్రకారం, జరాసంధుణ్ణి చంపిన తరువాత రాజులందరినీ పిలిచి యుధిష్ఠరుడు యజ్ఞాన్ని పూర్తి చేశాడు.

యజ్ఞం పూర్తయ్యేటప్పుడు జరగాల్సిన ముఖ్య మర్యాదలను చేసే తరుణం వచ్చింది. అక్కడి సభలో ఉన్న రాజులందరిలోనూ అగ్రపూజ అందుకోవడానికి తగినవాడని నిర్ణయించి, అతడికి మొదట గౌరవంగా పూజ చేయడమన్నది ఆచారంగా ఉంది. ముందుగా ఎవరికి పూజ చేసి గౌరవించాలీ అన్న ప్రశ్న ఎదురైంది. ద్వారకాధిపతి శ్రీకృష్ణుడే ఈ అగ్రపూజకు తగినవాడని కుల పెద్ద భీష్ముడు నొక్కి చెప్పాడు. యుధిష్ఠరుడి అభిప్రాయం కూడా అదే అని తెలియజేశాడు. దీంతో యుధిష్ఠరుడు.. భీష్ముడి అభిప్రాయాన్ని అనుసరించాడు. అతడి ఆజ్ఞతో సహదేవుడు.. శ్రీకృష్ణుడికి శాస్త్రోక్తంగా అగ్రపూజ చేశాడు.

చేదిరాజు శిశుపాలుడు కృష్ణుడికి బద్ధ విరోధి. దుర్మార్గానికీ, సన్మార్గానికీ ఈ వైరుధ్యం ఎప్పుడూ ఉన్నదే కనుక శ్రీకృష్ణుణ్ణి పూజించడం సహించలేకపోయాడు. శిశుపాలుడు.. వికటాట్టహాసం చేసి ఇలా అన్నాడు.

"ఎంత అసందర్భం. అన్యాయం. ఇలాంటివి ఇక్కడ జరగడం వింతకాదు. 'ఎవరు అగ్ర పూజార్హులు' అని ప్రశ్నించినతడు వివాహమాడిన దంపతులకు పుట్టినవాడు కాదు (అంటే కుంతి సంతానాన్ని నిందించాడు), అగ్రపూజ అందుకోదగిన వ్యక్తి పేరు చెప్పినవాడు ఎప్పుడూ ఎత్తు నుంచి దిగువకు వచ్చు దాని కుమారుడు (అంటే ఎత్తు నుంచి పల్లానికి ప్రవహించే గంగానది పుత్రుడైన భీష్ముణ్ణి నిందించాడు), ఎవడైతే అగ్రపూజ చేశాడో వాడూ వివాహం చేసుకున్న దంపతులకు పుట్టినవాడు కాదు. ఇక పూజంపబడినవాని గురించి నేనేమి చెప్పను?. పుట్టుకతో శుంఠ, పశువుల కాపరి, ఇక ఈ అంశం గురించి ఏమీ అనకుండా ఊరకున్న సభికులంతా మూగవారు. ఈ సభ తగు మనుషులండేది కాదు" పేట్రేగి అన్నాడు శిశుపాలుడు. సభికుల్లో కొంతమంది రాజకుమారులు శిశుపాలుణ్ణి పొగిడారు. శిశుపాలుడు ఈ పొగడ్తకు ఉబ్బి మరింత రెచ్చిపోయాడు. "ఈ సభలో ఇంతమంది రాజ కుమారులుండగా నీవు శ్రీకృష్ణుడికి అగ్రపూజ చేయడం సిగ్గుమాలిన పని. ఎక్కడైతే మర్యాద చేయడానికి అర్హత ఉందో అక్కడ మర్యాద చేయకపోవడం, ఎక్కడైతే మర్యాద చేయడానికి అర్హత లేదో అక్కడ గౌరవించడం, ఈ రెండూ క్షమించరాని పొరబాట్లు. చక్రవర్తినీ, రాజధర్మ నైపుణ్యం తెలిసినవాణ్ణీ అనుకొనే నీకు.. ఇంతమాత్రం తెలియకపోయింది'' అని నిందాపూర్వకంగా పలుకుతూ మరింత హెచ్చు స్వరంతో, కోపంతో శిశుపాలుడు ఇలా అన్నాడు. "నీవు సగౌరవంగా ఆహ్వానించి తెచ్చిన ఈ రాజులందరినీ నిర్లక్ష్యం చేసి, వాళ్లను కోరి అగౌరవపర్చి, నీవు అగ్రపూజను ఒక అనామకుడైన పశువుల

కాపరికి చేశావు. కృష్ణుడి తండ్రి వసుదేవుడు.. ఉగ్రసేనుడి సేవకుడు. అతడు రాజవంశానికి చెందినవాడు కాదు. దేవకి కొడుకైన కృష్ణుడి పట్ల నీ పక్షపాతబుద్ధిని ప్రదర్శించడానికి ఇదా కాలము?. స్థానము?. పాండురాజు కుమారులు చేయదగిన పనా ఇది?. ఓ పాండురాజు పుత్రులారా! మీరు.. రాజ్య సభలను నడిపించడంలో శిక్షణ లేనివాళ్లు. ఈ ముసలి భీష్ముడు తెలివి తక్కువగా సలహా ఇచ్చి మిమ్మల్ని మూఢులుగా మార్చాడు. కృష్ణుడు రాజయినా కాడే?. ఓయీ యుధిష్టరా! ఈ గొప్ప రాజ్య సభ మధ్యలో నీచుడైన కృష్ణుడికి నీవు అగ్రపూజ చేయడానికి ఎలా సాహసించావు?. వయసులో పెద్దవాడనే ఘనతా ఇతడికి లేదు. నీకు తల్లిదండ్రులకల యందు గౌరవం ఉంటే ఈ కృష్ణుడి తండ్రి బతికే ఉన్నాడు కదా. కృష్ణుడు నీకు గురువనుకున్నా.. నీ గురువైన ద్రోణుడు ఈ సభలోనే ఉన్నాడు. యజ్ఞాలు చేయడంలో నేర్పరివని ఆ కృష్ణుణ్ణి పూజించావా?. గురువైన వ్యాసుడు కూడా ఇక్కడే ఉన్నాడే. నీవు.. నీ కుటుంబ పెద్ద అయిన భీష్ముణ్ణి పూజించినా కొంత బాగుండేది. అతడికి ముసలితనపు స్వల్ప బుద్ధులున్నా, మీ కుటుంబంలో వయసులో పెద్దవాడనే ఘనత అతడికి ఉంది. నీ కుటుంబ గురువైన కృపాచార్యులు కూడా ఇక్కడే ఉన్నాడు. ఈ సందర్భంలో ఆ పశువుల కాపరికి అగ్రపూజ ఎలా చేశావు?. మహావీరుడు, సకల శాస్త్ర పారంగతుడు అశ్వద్ధామ కూడా ఇక్కడే ఉన్నాడు. ఆయన్ను మరిచి ఈ శ్రీకృష్ణుడిని ఎందుకు ఎన్నుకున్నావు. ఇంకా ఇక్కడకు వచ్చిన రాజుల్లో దుర్యోధనుడు కూడా ఉన్నాడు. పరుశురాముడి శిష్యుడైన కర్ణుడూ ఉన్నాడు. ఈ కర్ణుడే కదా.. ఒక్కడే జరాసంధుడితో యుద్ధం చేసి ఓడించాడే. చిన్నపిల్లల తరహా పక్షపాత బుద్ధిని కనపరిచి కర్ణుణ్ణి వదిలి కృష్ణుడికి అగ్రపూజ చేశావు. కృష్ణుడు రాజూ కాదు. వీరుడూ కాదు. చదువూలేదు. అతడు కేవలం ఒక నీచ పశువుల కాపరి. అగ్రపూజ పేరుతో మమ్మల్నందరినీ అవమానపరిచావు. ఓ రాజులారా! ఈ యుధిష్టిరుడు చక్రవర్తి అయి ఉండటానికి, అతడివల్ల భయంతో మనం సమ్మతించలేదు. అతడు శత్రువైనా, మిత్రుడైనా మాకంత లక్ష్యం లేదు. కానీ ప్రజలదరూ ఇతణ్ణి గురించి న్యాయ ప్రభువన్న ప్రేలాపన విని, ధర్మాన్ని నిలపడానికి అతడు తగునని మనం సమ్మతించాం. ఇప్పుడే యుధిష్టరుడు మనలందరినీ న్యాయమూ, ధర్మమూ అని పలుకుతూ ఇలా నీచపరిచాడు. జరాసంధుణ్ణి అన్యాయంగా చంపిన ఈ కృష్ణుడికి మర్యాద చేసి అగ్రపూజ చేయడంలో ఈ యుధిష్టరుడికి నీతి, ధర్మం ఎలా ఉపయోగపడ్డాయి?. ఇక్కణ్ణుంచి మీరంతా యుధిష్టరుణ్ణి 'అధర్మరాజు' అని పలుకుతుండాలి. ఓయీ కృష్ణా! తప్పు మార్గంలో పాండవులను నడిపించిన నీకు వారు తగని మర్యాదలు చేసినా, పుచ్చుకోవడానికి నీకు సిగ్గులేకపోయింది. నిన్ను నీవు మరిచిపోయావా. లేక సదాచారాలు మరచావా?.

ఎవరికీ అక్కరలేని ఆహారాన్ని ఒక కుక్క దొంగిలించినట్లు నీవూ దాన్ని అనుసరించావా?. ఈ జరిగిన నాటకమంతా ఓ విధంగా నిన్ను ఈసడించి, వెక్కిరించి, అవమానపర్చడానికని నీకు తెలియదా?. అందమైన వస్తువులను గుడ్డివాడికి చూపడం, నపుంసకుడికి కన్యనిచ్చి పెళ్లి చేయడం వంటి వెక్కిరింపు పనుల లాంటివే ఇవి కూడా. అలాగే ఈ రాచమర్యాదలు నిశ్చయంగా నిన్ను నీచపరచడానికే జరిగాయి. కాబోయే చక్రవర్తి అయ్యే యుధిష్ఠరుడు, ముసలివాడు అయినందున బుద్ధి చలించిన భీష్ముడు, ఈ నీచుడైన కృష్ణుడు ఈ ముగ్గురూ ఒకే రకం వారు.''

ఈ పరుష మాటలు అని శిశుపాలుడు తన ఆసనం నుంచి లేచి, ఈ కార్యక్రమం ఇష్టంలేని పలువురు రాజులతో కలిసి సభా భవనం నుంచి బయటకు వెళ్లాడు. యుధిష్ఠరుడు వారి వెంట వెళ్లి వారిని శాంతింపచేసేందుకు ప్రయత్నించాడు. కానీ వారందరూ ఆయనపై మిక్కిలి కోపం ప్రదర్శించి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడరు. శిశుపాలుడి డాంబిక చెడు ప్రేలాపనలు మరింత పెరిగాయి. దీంతో శ్రీకృష్ణ, శిశు పాలుడి మధ్య పెద్ద జగడం వచ్చింది. ఆ సందర్భంగా జరిగిన యుద్ధంలో శిశు పాలుడు మరణించాడు. రాజసూయ యాగం పూర్తయింది. యుధిష్ఠరుణ్ణి "చక్రవర్తి"గా అందరూ ఆమోదించారు.

◈



శకుని, దుర్యోధనుడు

## అధ్యాయం - 22

# శకుని ఆగమనం

**రా**జసూయ యాగం అనంతరం రాజకుమారులు, బ్రాహ్మణులు, పెద్దలు, యజ్ఞాన్ని చూడటానికి వచ్చిన అందరూ సెలవు చెప్పి తమ ప్రాంతాలకు వెళ్లిపోయారు. వ్యాసుడు కూడా వీడ్కోలు చెప్పడానికి వచ్చాడు. యుధిష్టరుడు లేచి నిలబడి ఆయనకు ఉచిత మర్యాద చేసి పక్కనే కూర్చున్నాడు. యుధిష్టరుణ్ణి ఉద్దేశించి.. "ఓ కుంతీ కుమారా! నీకు చక్రవర్తి బిరుదు వచ్చింది. అది నీకు తగినదే. నీ ద్వారా ఈ కురువంశం ఇంకా గొప్ప ఖ్యాతి చెందుతుంది. నేను నా ఆశ్రమానికి పోవడానికి అనుమతి ఇవ్వండి" అన్నాడు. యుధిష్టరుడు.. కుటుంబ పెద్ద, గురువు అయిన వ్యాసుడి పాదాలు స్పృశించి, "ఓ మహనీయా! నాకున్న భయాన్నీ, వేదననూ, నీవే నివారింపగలవు. శకునాల వల్ల ముందు జరిగే కొన్ని గొప్ప అంశాలను బుద్ధిమంతులు చెప్తారు. ఈ సందర్భంగా శిశుపాలుడి మరణంతో జరగబోయే కార్యాలన్నీ జరిగాయా?, లేక

ఇంకా ఏమైనా ఉన్నాయా?" అన్నాడు. దీనికి వ్యాసుడు, "కుమారా రాగల 13 సంవత్సరాలు అనేక కష్టాలూ, విచారాలతో నిండి ఉంది. శకునాన్ని, ప్రశ్ననూ చూడగా క్షత్రియ వంశ నాశనం కనపడుతోంది. ఇది శిశుపాలుడి మరణంతోనే ఆగేది కాదు. వందల మంది రాజులు మరణిస్తారు. పురాతన రాజ్య క్రమం, నీతి, అన్నీ పోతాయి. ఈ ఘోర విపత్తు దశలో పాండవులైన మీకూ, నీ జాతి అన్నదమ్ములైన ధృతరాష్ట్రులకు నడుమ శతృత్వం ఏర్పడగలదు. ఈ శతృత్వం క్షత్రియ వంశ నాశనంతో అంతరిస్తుంది. జరగబోయేది ఎవరూ అడ్డుకోలేరు. కనుక నీవు ధర్మ మార్గాన్ని అనుసరించు. బహు జాగరూకతతో రాజ్య పాలన చేయి. అంటూ వ్యాసుడు యుధిష్టరుణ్ణి ఆశీర్వదించి వెళ్లాడు.

వ్యాసుడి మాటలు యుధిష్టరుణ్ణి దు:ఖంలో ముంచాయి. ఈ ప్రాపంచిక ఆశలు, వైభవాలపై అసహ్యతా ఏర్పడింది. ఎవరూ నివారింప శక్యంగాని క్షత్రియ వంశ నాశనం గురించి వ్యాసుడు చెప్పిన విషయాన్ని తన అన్నదమ్ములతో చెప్పాడు యుధిష్టరుడు. జీవించి ఉండటమే ఒక క్లిష్టమైన సమస్య అని, తనకు రాగల స్థితిగతులన్నీ క్రూరమైనవనీ, సహింపరానివనీ భావిస్తున్నాడు. అర్జునుడు కల్పించుకొని.. "నీవు రాజువు. ఆందోళన చెందడం సరికాదు. రాబోయే పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొంటూ మనం చేయాల్సిన కార్యాలను మనం చేద్దాం" అన్నాడు. దానికి యుధిష్టరుడు.. "తమ్ములారా, దైవం మనల్ని రక్షించి మనకు జ్ఞానం ఇచ్చుగాక. నేను రాబోయే పదమూడేళ్లలో నా అన్నదమ్ములతోగాని, బంధువులతోగాని కఠినంగా మాట్లాడనని శపథం చేస్తున్నాను. ఏ విధమైన వివాదాంశాల జోలికీ పోను. శతృత్వానికి మూలమైన కోపానికి, తగవులకు తావివ్వను. ఇందుకు నేను సర్వదా ప్రయత్నిస్తాను. వ్యాస భగవానుడు సూచనలను ఈ విధంగా మనం ఉపయోగిద్దాం" అన్నాడు యుధిష్టరుడు. ఆయన తమ్ముళ్లు కూడా ఇందుకు ఒప్పుకొన్నారు.

దుర్యోధనుడి చెడుకు కారకుడైన శకుని దురాలోచనతో.. యుధిష్టరుడు జూదానికి తీసుకురాబడ్డాడు. అతడితో ఆడిన మాయా జూదమే రక్తసిక్త కురుక్షేత్ర యుద్ధ భూమిపై జరిగిన ఘోర మారణకాండకు, చెడుకు మూల కారణమైంది. ఈ జూదం ద్వారా చెడు వస్తుందని తెలిసినా, ఆ పని చేయడానికి బుద్ధిమంతుడైన యుధిష్టరుడు తాను అందులో దిగుబడటానికి ఎలాంటి అవకాశమిచ్చాడు?. దీనికి ముఖ్య కారణం తన అన్నదమ్ములైన ధార్తరాష్ట్రులతో వారి మాటలకు ఎదురుచెప్పి, జగడం రాకుండా చేయడానికే. ఈ ప్రకారం చేయడానికి ఇదివరకే యుధిష్టరుడు నిశ్చయించాడు. అదీగాక.. స్నేహపూర్వక జూదానికి ఆహ్వానం నిరాకరించకూడదు. అప్పటికి ఆ రాజ్య మర్యాదలను అనుసరించి ఉభయ పక్షాల వారికి సమాన లాభాలు

కలిగే ఆటను ఆడటానికి ఒప్పుకోవడం ఒక మర్యాదగా ఉండేది. అందరి మంచీ సంపాదించాలనే ఆశతో యుధిష్టిరుడు దేనివల్లనైతే శతృత్వం, మరణం కాగలదో అలాంటి విషబీజాలు నాటడానికి అవకాశమిచ్చాడు.

ఎంత మంచి కార్యమైనా చేయడానికి మనం చేసే ప్రయత్నాలు దైవ సహాయం లేనిదే వృధా అవుతాయని పైదాని వల్ల తెలుసుకోగలగుతాము. మన బుద్ధి ఎంత గొప్పదైనా దురదృష్టానికి ఎదురు తిరగలేదు. మన అదృష్టమే బాగుంటే బుద్ధితక్కువైనా మనకు మేలే జరుగుతుంది.

యుధిష్టిరుడు ఎలాగైనా తగవు రాకుండా ప్రయత్నిస్తుండగా.. రాజసూయ యాగ సమయంలో ఇంద్రప్రస్థపురంలో తాను చూసిన వైభవం, వారి సంపద తలచుకొని దుర్యోధనుడు ఈర్ష్య, ద్వేషాన్ని నింపుకున్నాడు. యుధిష్టిరుని కార్యాలయంలో గొప్ప చేతి పనితనం, అలంకారాలు, అద్దాలతో నిర్మాణమైన తలుపులు, ద్వారాలు, ఇతర అందమైన పరికరాలు చూశాడు. అదీగాక.. పాండవులతో సఖ్యత కోసం వచ్చిన రాజులందరూ కూతూహలంలో ఉండటం దుర్యోధనుడు గమనించాడు. తీవ్ర విచారగ్రస్తుడయ్యాడు. తన పక్కనే ఉండి తనతో మాట్లాడుతున్న శకుని మామనే గమనించలేనంత విచారంలో మునిగిపోయాడు. దీన్ని గమనించిన శకుని "ఓయీ దుర్యోధనా.. నీవెందుకు నిట్టూర్చుతున్నావు. విచారంతో ఎందుకు చికాకు పడుతున్నావు" అన్నాడు. దుర్యోధనుడు అందుకొని.. "తన అన్నదమ్ములతో ఉన్న యుధిష్టిరుడు, దైవరాజు అయిన ఇంద్రుడులా ఉన్నాడు. రాజసూయానికి వచ్చిన సభికులందరి మధ్య శిశుపాలుడు హతుడయ్యాడు. వచ్చిన రాజుల్లో ఒక్కడూ ముందుకొచ్చి ఆ అన్యాయానికి ప్రతిఘటన చేయకపోయారు. వర్తకం వల్ల జీవించే వైద్యుల మాదిరి అ యాగానికి వచ్చిన వారంతా యుధిష్టిరుడి దయ సంపాదించడం కోసం వారి మానమర్యాదలను, ధనాన్ని, రత్న సరుకులను కూడా అతడికి ఇచ్చేశారు. ఇవన్నీ కళ్లారా చూసిన నేను, విచారించక ఎలా ఉంటాను?. ఇంకా జీవించడం వల్ల ఏం ప్రయోజనం?.

శకుని అందుకుని, "ఓ దుర్యోధనా, పాండవులు నీ అన్నదమ్ములు. వారి సంపదను చూసి నీవు అసూయ పడటం మంచిది కాదు. వారు తమకు వంశపారంపర్యంగా వచ్చిన వస్తున్న ఐశ్వరాలను అనుభవిస్తున్నారు. వారి బలాన్ని, సౌఖ్యాన్ని.. నీ బలం, సౌఖ్యం తగ్గించలేవు. నీ అన్నదమ్ములు, బంధువులు నీ అండన ఉన్నారు. వారు నీ ఆజ్ఞను పాటిస్తున్నారు. ద్రోణుడు, అశ్వద్థామ, కుర్ణుడు నీ పక్షాన ఉన్నారు. భీష్ముడు, కృపుడు, జయద్రధుడు, సోమదత్త, నేను నీ వెనుక ఉన్నాం. నీకెందుకు విచారం?. ఈ ప్రపంచాన్నంతటినీ నీవు జయిస్తావు. విచారపడకు" అన్నాడు.

దుర్యోధనుడు శకున్ని ఉద్దేశించి.. "ఓ శకునీ, నాకు అండగా నిలిచినవారు చాలా మంది ఉన్నారని నాకు తెలుసు. మనం పాండవులపై యుద్ధానికి వెళ్లి వారినెందుకు తరిమివేయలేం?" అన్నాడు. "అలా కాదు. అది అంత తేలికైన కార్యక్రమం కాదు. కానీ యుధిష్టరుణ్ణి ఇంద్రప్రస్థపురం నుంచి తరిమివేసే మార్గం నాకు తెలుసు" అన్నాడు శకుని. దీంతో దుర్యోధనుడి కళ్లు ఒక్కసారిగా మెరిశాయి. "శకుని మామా, పాండవులను జయించగలమా? ఏమిటీ నీ వ్యూహం" అన్నాడు దుర్యోధనుడు. శకుని అందుకుని "యుధిష్టరుడు ద్యూత ప్రియుడు. కానీ అందులో సులువులు, ఎత్తులు, మోసాలు తెలిసినవాడు కాదు. అందువల్ల తనకంటే తెలివైన వాళ్లకు అందులో జయం కలుగుతుందని కూడా ఎరుగడు. మనం అతణ్ణి ఆటకు పిలిస్తే.. క్షత్రియ మర్యాదననుసరించి ఒప్పుకోక తప్పదు. నేను జూద ఆటలో సులువులు, మోసాలు బాగా తెలిసినవాణ్ణి. నేను నీకు ప్రతినిధిగా ఉంటాను. నాకెదురుగా యుధిష్టిరుడు ఒక చిన్న పిల్లాడిలా ఆడుతూ నిస్సహాయుడవుతాడు. అతని రాజ్యం, ధనం, నీకోసం రక్తపాతం లేకుండా రాబడతాను" అన్నాడు శకుని.

◈



పాచికలు ఆడుతున్న శకుని

## అధ్యాయం - 23

# జూదానికి ఆహ్వానం

**దు**ర్యోధనుడు, శకుని, ధృతరాష్ట్రుని వద్దకు వెళ్లారు. శకుని సంభాషణలోకి దిగాడు. "ఓ రాజా, దుర్యోధనుడు విచారంలోనూ, ఆందోళనలోనూ, పాలిపోయి ఉన్నాడు. అతడు అంత విచారంలో మునిగి ఉంటే మీరేమీ పట్టించుకోవడం లేదు. మీకు ఎందుకీ విరక్తి?" అడిగాడు శకుని. ధృతరాష్ట్రుడికి దుర్యోధనుడంటే వెర్రి ప్రేమ. దుర్యోధనుణ్ణి కౌగలించుకొన్నాడు. "కుమారా, నీ వెందుకు నిరాశతో బాధపడతావు. నీవు అనుభవించని సౌఖ్యం ఏముంది?. ఈ ప్రపంచమంతా నీ పాదాలవద్దే ఉంది. దేవతల మాదిరి నీ చుట్టూ అన్నీ ఆనందాలే ఉన్నాయి. మరి నువ్వెందుకు విచారంతో కుంగిపోవాలి. నీవు, వేదాలు, ధనుర్వేదం మొదలైన విద్యలన్నీ గొప్ప గురువుల వద్ద నేర్చుకున్నావు. నాకు పెద్ద కుమారుడవు అయినందువల్ల నీవు రాజ్యాధికారివి అయ్యావు. ఇంకా నీవు కోరేదేమిటి?. నాకు చెప్పు?" అడిగాడు ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి. "తండ్రీ! గొప్పా, బీదా అయినా ఇతరుల మాదిరే నేనూ

తింటున్నాను. మానాన్ని కప్పుకుంటున్నాను. కానీ నాకీ జీవితం దుస్సహంగా ఉంది. అలాంటి జీవితం వల్ల లాభమేంటి?" అంటూ తనను మింగేస్తున్న అసహనం, పగ ఎలా జీవితంలో నిరాశకు పురికొల్పుతోందో దానికి కారణాలు తండ్రికి విశదపరిచాడు దుర్యోధనుడు. పాండవుల పట్టణమైన ఇంద్రప్రస్థపురంలో తాను చూసిన సకల ఐశ్వర్యాల గురించి చెప్పాడు. పాండవుల ప్రతిభే తన సర్వస్వం పోయినదాని కంటే ఎక్కువగా విచారాన్ని కలిగిస్తోందని చెప్పాడు. "క్షత్రియుడు తనకు ఉన్నదానితోనే తృప్తి చెందడం తగని గుణం. భయం, కనికరం రాజుల గౌరవాన్ని తగ్గిస్తుంది. నా సంపద, ఆనందం నాకేమీ తృప్తినివ్వలేదు. యుధిష్ఠరుడి సిరి సంపద, ఆనందం నాకున్నదానికంటే హెచ్చుగా ఉంది. ఓ రాజా పాండవులు బాగా వృద్ధి చెందారు. మనం కుంగిపోయాము" అన్నాడు దుర్యోధనుడు.

ధృతరాష్ట్రుడు అందుకుంటూ.. "ప్రియ కుమారా, నీవు నాకూ, నా పెద్ద భార్యకు పెద్ద కుమారుడివి. ఈ రాజ్యానికి, మన గొప్ప వంశకీర్తికి కూడా నీవే వారసుడవు. పాండవులపై నీవు పగ పెట్టుకోవద్దు. దగ్గర బంధువుల పట్ల, అందులోనూ నిరపరాధులైనవారి పట్ల వైరం వల్ల విచారం, మరణం కలుగుతాయి. అమాయకుడైన యుధిష్ఠిరుణ్ణి ఎందుకు ద్వేషిస్తావు?. నాకు చెప్పు?. అతడి ప్రతిభ మనది కాదా?. మన స్నేహితులే వారి స్నేహితులు. మనపట్ల అతడికి ఎంతమాత్రమూ అసూయ లేదు. వీరత్వంలోనూ, వంశ ఘనతలోనూ అతనికి నీవూ సమానుడవే. నీ సోదరుడిపై ఎందుకు ఓర్వలేనితనం?. అలా వద్దు. నువ్వు అసహనాన్ని వీడాలి" అని ధృతరాష్ట్రుడు చెప్పాడు.

తండ్రి చెప్పిన మాటలు దుర్యోధనుడికి రుచించలేదు. "ప్రపంచ జ్ఞానంలేని మనిషి ఎంత విద్య నేర్చినా ప్రయోజనం ఉండదు. మంచి రుచికరమైన పదార్థాల్లో ఉండే గరిటెకు దాని రుచి తెలియదు. ఆ పదార్థం వల్ల గరిటెకు ఏమీ ఉపయోగం లేదు. మీరు రాజకీయం, రాజ్యపాలన, శాస్త్రాలే నేర్చుకొన్నారుగానీ రాజకీయ బుద్ధి విశేషాలు మీకు ఉన్నట్లు కనిపించదు. ప్రపంచ మార్గం ఓ తీరుగా.. రాజ్య పాలన మరో తీరుగా ఉంటాయి. శమము, సంతుష్టి ఈ రెండూ సామాన్య మానవుడి గుణాలే. కానీ రాజులకు సుగుణాలు కావు. క్షత్రియుడి కర్తవ్యం ఎల్లప్పుడూ ఇతరులపై విజయం సాధించడమే అయి ఉండాలి. నీతికరమైనదైనా, అవినీతికరమైనదైనా రాజు విజయాన్నే కోరుకోవాలి అని బృహస్పతులు వారు చెప్పలేదా" అంటూ శాస్త్రోక్తంగా కొన్ని నీతులు, ఉదాహరణలు చెపుతూ నీచపని గొప్ప పని అన్నట్లు ఉటంకించాడు దుర్యోధనుడు.

శకుని అందుకుని తాను తయారుచేసిన జూద ప్రక్రియ గురించి, యుధిష్ఠరుణ్ణి

ఎలా పిలిచి, అందులో అతణ్ణి పూర్తిగా ఓడించి, రక్తపాతం లేకుండా అతని సర్వస్వాన్ని ఎలా సంపాదించవచ్చో వర్ణించి చెప్పాడు. "కుంతీ కుమారుణ్ణి జూద మాడటానికి పిలిస్తే చాలు. మిగిలిందంతా నేను చూసుకుంటాను" అని శకుని ధృతరాష్ట్రుడికి చెప్పాడు. దుర్యోధనుడు అందుకొని.. "శకుని యుద్ధం లేకుండా పాండవుల సర్వ ఐశ్వర్యాన్ని నాకోసం జయిస్తాడు. మీరు మాత్రం యుధిష్ఠరుణ్ణి ద్యూతానికి రావలసిందిగా పిలువు" అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఆందోళన చెందుతూ.. "మీ ఆలోచన సక్రమంగా లేదు. దీన్ని గురించి మన విదురుణ్ణి అడుగుదాము. అతడు సరైన సలహా ఇస్తాడు" అన్నాడు. కానీ దుర్యోధనుడు విదురుడి సలహా తీసుకోవడానికి ఒప్పుకోలేదు. "విదురుడు అర్థంలేని సామాన్య నీతులు చెపుతాడు. అది మన కార్యానికి ఉపయోగపడదు. రాజుల లక్ష్యం గ్రంథాల్లో ఉన్న ఉపదేశాలు, మంచి సూత్రాల్లా ఉండకూడదు. రాజుల లక్ష్యం కొంచెం కఠోరంగా ఉంటే కార్యాలు కొనసాగుతాయి. అదీగాక విదురుడికి నేనంటే ఇష్టంలేదు. పాండవ పక్షపాతి అతడు. ఈ సంగతి మీకూ తెలుసు" అన్నాడు దుర్యోధనుడు.

ధృతరాష్ట్రుడు ఇలా అన్నాడు. "పాండవులు బలవంతులు. వారితో శతృత్వం ఉత్తమం కాదు. ద్యూతమెప్పుడూ వైరానికి దారి తీస్తుంది. ఆ ఆట వల్ల కలిగే ఉద్రేకాలకు మితం ఉండదు. కనుక మనం ఆ పనిచేయకూడదు" ఇలా హితవు పలికాడు ధృతరాష్ట్రుడు. కానీ దుర్యోధనుడు పట్టు విడవలేదు. తండ్రిని తొందర చేస్తూనే ఉన్నాడు. భయం వదిలేసి తన ప్రయత్నంతో కార్యాన్ని సఫలం చేయడమే రాజ్యతంత్రం అంటే. ప్రస్తుతం మనం వారి కంటే ఎక్కువ బలం కలిగి ఉన్నప్పుడు కార్యానికి త్వరపడవొద్దా. అలా చేయడం భవిష్యత్తులో మనకు పనికివచ్చే మంచి ఆలోచన. గతించిన మంచి తరుణం మళ్లీ దొరకదు. అదీగాక.. పాండవులను జూదానికి పిలవడం వారిని హింసించడానికే ఏర్పాటు చేసింది అని ఎలా ఊహించడం?. ఈ జూద ప్రక్రియ పురాతనం నుంచీ రాజుల ఆనందం కోసం కాలక్షేపం కోసం అడబడుతూనే ఉంది. అలాంటిది మనకు రక్తపాతం లేకుండా ఐశ్వర్యం చేకూరేటప్పుడు అందులో చెడేముంది?. నీవు అనుసరించే మార్గమే నాకు నచ్చలేదు. ముమ్మందు నీవు పశ్చాత్తాపపడతావు. అది అనివార్యం" అన్నాడు శకుని.

చివరికి.. వారిని తన సంభాషణతో ఒప్పించలేక అలిసిపోయి, తన కుమారుడి పట్టుదలను మాన్పించలేక ధృతరాష్ట్రుడు దానికి సమ్మతించి తన సేవకులను ఆట స్థలం నిర్మించాలని పురమాయించాడు. ఇలా చేసినప్పటికీ ధృతరాష్ట్రుడు విదురుడితో రహస్య మంతనాలు చేయకుండా ఉండలేకపోయాడు. దానికి విదురుడు "ఓ రాజా..

ఈ వ్యవహారం నిస్సందేహంగా ఆర్పడానికి వీల్లేని వైరాన్ని ప్రబలం చేసి మానవ నాశనం కలుగజేస్తుంది" అన్నాడు. తన కుమారుడు మాటకు ఎదురు మాట్లాడలేని ధృతరాష్ట్రుడు.. "అదృష్టం మన పక్షాన ఉంటే, ఈ ఆట విషయమై నాకే మాత్రం భయంలేదు. ఆ అదృష్టమే మనను వ్యతిరేకిస్తే.. దానికి మనమేం చేయగలం? నీవు వెళ్లి నేను పిలిచానని యుధిష్టరుణ్ణి ద్యూతానికి పిలువు. దీంతో విదురుడు ఒక ఆహ్వాన పత్రంతో యుధిష్టరుడి వద్దకు వెళ్లాడు. బుద్ధిబలం చాలని ధృతరాష్ట్రుడు తన కుమారులకు లొంగిపోయాడు. ద్యూత ప్రక్రియ ద్వారా రాబోయే ప్రళయం తెలిసీ తన కుమారుడిపై అతి ప్రేమకు లొంగిపోయాడు.

◈

## అధ్యాయం - 24

# పందెం

**వి**దురుణ్ణి చూడటంతోనే యుధిష్ఠరుడు.. "హస్తినాపురంలో మన బంధువులందరూ కులాసాగా ఉన్నారా? రాజు, కుమారులు కుశలమే కదా? అవునూ ఏమిటీ నీవు విచారంగా ఉన్నావు" అన్నాడు. విదురుడు తన రాకకు కారణం చెప్పాడు. "హస్తినలో అందరూ కుశలమే. మీరెలా ఉన్నారు?. ధృతరాష్ట్రుని పక్షాన.. వారు కొత్తగా నిర్మించిన కేళీ మందిరాన్ని చూడటానికి నిన్ను ఆహ్వానించడానికి వచ్చాను. మీరు కట్టించినదాని మాదిరిగానే అక్కడ కూడా ఒక అందమైన గృహాన్ని కట్టించారు. నీవు నీ అన్నదమ్ములతో అక్కడికి వచ్చి అన్నీ చూసి ద్యూతంలో కొంతసేపు ఆనందించి మరలా మీరు ఇంద్రప్రస్థపురానికి రావచ్చు. ఇది దృతరాష్ట్రుడి కోరిక" అని చెప్పాడు విదురుడు.

"కేళీ మందిరాన్ని చూస్తాము. కానీ.. పందెం ఒడ్డి ఆడే ఆటలు క్షత్రియుల్లో జగడాలు పుట్టిస్తాయి. బుద్ధిమంతుడైనవాడు వీలైనంతవరకూ ఇలాంటి ఆటల్లో పాల్గొనడు. నీవేమి చెపితే అదే చేస్తాను. నీ సలహా ఏమిటి?" అనడిగాడు యుధిష్ఠిరుడు.. విదురుణ్ణి.

"ద్యూత మాడటం అన్ని చెడులకూ మూలమని అందరికీ తెలిసిందే. అక్కడ ఈ ఊహను వారితో మాన్పించడానికి నేను చాలా ప్రయత్నించాను. అయినా రాజు నిన్ను పిలవాల్సిందిగా ఆజ్ఞ జారీ చేశాడు. అందువల్లనే నేను వచ్చాను. నీ ఇష్టం వచ్చినట్లు చేయి" అన్నాడు విదురుడు.

విదురుడు చెప్పిన ప్రకారం.. అపాయం సూచిస్తున్నా, యుధిష్టరుడు తన తమ్ములతోనూ, పరివారంతోనూ హస్తినాపురానికి వెళ్లాడు. బుద్ధిమంతుడైన యుధిష్టరుడు ఎందుకు వారి ఆహ్వానాన్ని అంగీకరించాల్సి వచ్చిందని ప్రశ్నించొచ్చు. దీనికి మూడు కారణాలున్నాయి. భోగ వాంఛ, జూదం, తాగుడు వీటితో ప్రేరేపించిన వారికి ఈ విషయం తెలిసినా తమ నాశనం కోసం వెళ్తారు. క్షత్రియుల ధర్మం ఒకటుంది. ద్యూతానికి పిలిస్తే అంగీకరించడమే మంచి నడవడికని, గౌరవప్రదమైనదనే భావన ఉంది. అలాగే వంశ నాశనాన్ని కలగజేసే తగవులు వస్తాయని ముందుగానే వ్యాసుడు హెచ్చరిక చేశాడు. అయినా యుధిష్టరుడు తాను చేసిన ప్రతిజ్ఞ ప్రకారం నడవదలిచాడు. ధృతరాష్ట్రుడి ఆహ్వానాన్ని నిరాకరించి, వారి అసంతృప్తికి కారణం కాకూడదనుకున్నాడు. వీటితోపాటు స్వతసిద్ధమైన యుధిష్టరుడి తత్వం కూడా హస్తినాపురం వెళ్లడానికి కారణమైంది. పాండవులను, వారి పరివారాన్ని ఓ గొప్ప మందిరంలో ఉంచారు. ఆ రోజు యుధిష్టరుడు ప్రయాణ బడలిక తీర్చుకొన్నాడు. మరునాడు ఉదయం కాలకృత్యాలు తీర్చుకొని ఆటల మందిరానికి వెళ్లాడు. ఉభయుల మధ్య కుశల ప్రశ్నలయ్యాయి. తరువాత ద్యూతం ఆడటానికి అవసరమైన వస్త్రం తయారుగా పరిచి ఉందనీ, ఆడటానికి రావాలనీ శకుని యుధిష్టరుణ్ణి పిలిచాడు. తొలుత యుధిష్టరుడు.. "ఓ రాజా జూదమాడటం చెడు సంప్రదాయం. ఇందులో జయాపజయాలు ఎరుగలేము. పౌరుషం, పరాక్రమం గొప్పదనంతో ఈ ద్యూతంలో విజయం పొందలేము. అసితుడు, దేవలుడు, మొదలైన జ్ఞానులు, రుషులు ప్రపంచాన్ని బాగా ఎరిగినవారు. దగా చేయడానికి చాలా అవకాశం ఉంటుంది కనుక.. ద్యూతం ఆడకూడదన్నారు. క్షత్రియుడికి యుద్ధంలో గెలుపొందడమే సముచిత మార్గమని కూడా వారు చెప్పారు. ఈ సంగతి నీకు తెలియంది కాదు"అన్నాడు. ఇలా యుధిష్టరుడు ధర్మ సూత్రాలు చెప్పుతున్నప్పటికీ ద్యూతంలో కాస్త ఆసక్తి కలిగి ఉన్నాడు. అతడి హృదయాంతరాళం ధర్మాధర్మాలను తొక్కిపెట్టి ద్యూతానికే మొగ్గు చూపుతోంది.

సూక్ష్మగ్రాహి శకుని దీన్ని కనిపెట్టాడు. "ద్యూతంలో తప్పేముంది?. నిశ్చయంగా యుద్ధమైనా అంతే. వేదాధ్యయనాలు చేసిన వాళ్లు చేసే వాదప్రతివాదాలూ అంతే!. చదువుకున్నవాడు చదువులేని వాణ్ణి జయిస్తాడు. ప్రభావవంతమైనవాడు ఎప్పుడూ గెలుస్తాడు. మనం ఆడబోయే ఈ జూదం ఎవరి సామర్థ్యమెంతో తెలుసుకోవడానికి

ఏర్పాటు చేసిందేగాని, ఇందులో దోషమేమీ లేదే?. పర్యవసానం గురించా? ప్రతి కార్యంలోనూ సామర్థ్యం ఉన్నవాడు సామర్థ్యం లేనివాణ్ణి జయిస్తాడు. అలాగే ఈ జూదం కూడా. కానీ నీవు భయపడితే ఆడనవసరం లేదు. అంతేగాని పురాతనమైన న్యాయమూ, అన్యాయమూ, తప్పూ, ఒప్పూ అనే మాటలు అనకు" అన్నాడు శకుని.. యుధిష్టరుణ్ణి ముగ్గులోకి దించడానికి.

"సరే నాతో ఎవరు ఆడతారు" అడిగాడు యుధిష్టరుడు. దుర్యోధనుడు అందుకొని.. "ఈ ఆట ఆడటానికి కావలసిన ధనం, రత్నాలు మొదలైనవి ఇవ్వడం నావంతు. నా మామ శకుని నా పక్షాన పాచికలు వేస్తాడు" అన్నాడు. అయితే యుధిష్టరుడు.. నేరుగా దుర్యోధనుడుతో ఆడితే అతణ్ణి సులువుగా జయించేవాణ్ణి అనుకున్నాడు మనసులో. శకుని అయితే అది వేరుగా ఉంటుంది. ఈ ఆటలో శకునిది అందె వేసిన చెయ్యి. యుధిష్టరుడు కాస్త జంకాడు. "ఒకరి పక్షాన మరొకరు ఆడటం ఆచారం కాదని నా తలంపు" అని బయటకు అన్నాడు యుధిష్టిరుడు.

శకుని వెంటనే అందుకొని.. "జూదం ఆడకుండా ఉండటానికి మళ్లీ నీవు ఇంకో సాకు తెచ్చిపెడుతున్నట్లుంది" అన్నాడు. దీంతో యుధిష్టరుడికి పౌరుషం వచ్చింది. తన సహజగుణమైన ఓరిమిని వదిలి, "సరే నేను ఆడతాను" అన్నాడు. ద్యూతశాల అంతా ప్రేక్షకులతో కిక్కిరిసిపోయింది. ద్రోణుడు, కృపుడు, భీష్ముడు, విదురుడు, ధృతరాష్ట్రుడు అక్కడే ఆశీనులై ఉన్నారు. వారు, ఈ ఆట చివరికి విషమిస్తుందని తలుస్తూ.. నిలువరించలేకపోతున్నామే అనే నిరుత్సాహంతో చూస్తుండి పోయారు. వచ్చిన రాజులంతా ఈ ఆటను ఎంతో ఉత్సాహంతో తిలకిస్తున్నారు.

ప్రారంభంలో రత్నాలు, తరువాత బంగారం, వెండి, రథాలు, గుర్రాలు, పణంగా పెట్టారు. యుధిష్టరుడు వరుసగా ఓడిపోతున్నాడు. ఇవన్నీ ఓడిపోయాక యుధిష్టరుడు తన సేవకులను జూదంలో ఒడ్డాడు. అంతేకాదు, తన ఏనుగులనూ, సేనలను సైతం పందెంలో ఒడ్డాడు. వాటినీ ఓడిపోయాడు. శకుని చేతులతో వేసిన పాచికలు అతడు తలచినట్లే పడుతున్నాయా అనిపిస్తోంది చూపరులకు.

ఇక గోవులు, గొర్రెలు, పట్టణాలు, పల్లెలు, ప్రజలు, మిగిలిన ఇతరత్రా ఆస్తి అంతా ఒడ్డి యుధిష్టరుడు జూదంలో ఓడిపోయాడు. దీంతో అతడు మతి చలించినవాడిలా ఆటను మరింత రెచ్చిపోయి ఆడుతున్నాడు. తన, తమ్ముళ్ల, ఆభరణాలు, కట్టుకున్న బట్టలు కూడా ఓడిపోయాడు. దురదృష్టం అతణ్ణి వెన్నాడుతోంది. శకుని హస్త మాయాజాలంతో సాగుతున్న పాచికల ఆటలో యుధిష్టరుడు నిలవలేకపోయాడు.

శకుని జోక్యం చేసుకుంటూ.. "ఇంకా పందెంలో ఒడ్డటానికి ఏమైనా

ఉన్నాయా" అనడిగాడు. దీనికి యుధిష్ఠరుడు బదులిస్తూ.. "ఆకాశరంగుగల అందమైన నకులుడున్నాడు. అతన్ని ఒడ్డుతున్నాను" అన్నాడు. "అలాగా, అయితే నీ అందమైన యువకుణ్ణి మేం సంతోషంతో గెలుస్తాం" అని శకుని వెటకారం చేశాడు. పాచికలు వేయగానే శకుని అన్నట్లే జరిగింది. నకులుణ్ణి ఒడ్డి యుధిష్ఠరుడు ఓడిపోయాడు. ఈ పరిణామంతో సభంతా గజగజ వణికింది.

"నా మరో తమ్ముడు సహదేవుడున్నాడు. అతడు శాస్త్రాల్లో పరమజ్ఞాని అనే ప్రఖ్యాతిగడించాడు. అతణ్ణి ఒడ్డటం తప్పే అయినా ఒడ్డుతున్నాను. ఆడు" అన్నాడు యుధిష్ఠరుడు. శకుని పాచికలు వేస్తూ.. "ఇదిగో ఆడాను.. గెలిచాను.." అన్నాడు. యుధిష్ఠరుడు సహదేవుణ్ణి కూడా ఓడిపోయాడు. దీంతో యుధిష్ఠరుడు ఆట మానేస్తాడేమోనని భయపడ్డాడు దుర్మార్గుడైన శకుని.. "నీకు మాద్రి కొడుకులైన నకుల, సహదేవుల కన్నా.. భీముడు, అర్జునుడు సొంత సోదరులు కనుక.. వారంటేనే నీకు అభిమానం ఎక్కువ. అందువల్ల వారిని జూదంలో పణంగా ఒడ్డావు. నాకు తెలుసు" అని ఎత్తిపొడిచాడు శకుని. సవతి తమ్ముళ్లను తక్కువగా చూశావనే శకుని ఎత్తుపొడుపు మాటలకు నొచ్చుకున్నాడు యుధిష్టిరుడు. "అజ్ఞానుడా! మమ్మల్ని విడదీసే ప్రయత్నం చేస్తున్నావా? నీవు జీవిస్తున్న నీచపు జీవనంతో.. మేం అనుసరించే ఔదార్యపు జీవనాన్ని ఎలా తెలుసుకుంటావు? యుద్ధ సముద్రాల్లో అనేకసార్లు ప్రయాణం చేసిన, ఎన్నడూ అపజయం అంటూ ఎరగని అర్జునుణ్ణి పందెంలో ఒడ్డుతున్నాను. ఆడు" అన్నాడు. "ఇదిగో పాచికలు వేస్తున్నాను" అన్నాడు శకుని. పందెంలో యుధిష్ఠరుడు.. అర్జునుణ్ణి కూడా ఓడిపోయాడు.

ఓటమి పరంపరతో యుధిష్ఠరుడు మరింత మొండిదేరాడు. పిచ్చెత్తినవాడిలా ఇంకా జూదంలో మునిగిపోయాడు. కళ్లలో నీరు తిరుగుతుండగా.. యుధిష్ఠరుడు శకునితో.."ఓ రాజా! నా తమ్ముడైన భీముడు యుద్ధంలో ఎంతో ఆరితేరిన వాడు. అతడంటే రాక్షసులకు సైతం భయం. ఇంద్రునితో సమానుడు. స్వల్ప అమర్యాదను సైతం ఓర్వలేనివాడు. ఈ ప్రపంచంలో దేహబలంలో అతడికి సాటి మరెవ్వరూ లేరు.  అతన్ని పణంగా ఒడ్డాను" అన్నాడు. మాయా జూదంలో భీముణ్ణి కూడా ఓడిపోయాడు. . "పందెం ఒడ్డటానికి ఇంకేమైనా ఉందా" అనడిగాడు శకుని ఉబలాటంగా. "నేనున్నాను. నీవు గెలిస్తే నేను నీకు సేవకుణ్ణవుతాను." అన్నాడు యుధిష్ఠరుడు. "ఇదుగో చూడు" అంటూ శకుని పాచికలు వేసి గెలిచాడు. దీంతో శకుని.. సభలో లేచి నిలబడి.. పాండవుల ఐదుగురి పేర్లూ గట్టిగా ఉచ్ఛరిస్తూ.. వారంతా తనకు సేవకులయ్యారని గట్టిగా అరుస్తూ అన్నాడు.

సభా సదులంతా చలనంలేని వారిలా ఊరుకున్నారు. శకుని మరలా

యుధిష్ఠరుడితో.. నీవద్ద ఇంకో రత్న ముంది. ఆ రత్నాన్ని ఒడ్డితే నీవు స్వతంత్రుడివి అవుతావు. నీ భార్య ద్రౌపదిని పణంగా ఒడ్డి ఈ ఆట సాగించలేవా? అన్నాడు. యుధిష్ఠరుడు నిస్పృహతో మొండిదేరి ఉన్నాడు. శరీరం కంపిస్తుండగా.. "నేను ఆమెనూ పందెంలో ఒడ్డుతున్నాను" అన్నాడు. వృద్ధులు కూర్చున్న ఆ మందిరంలో విషాదాన్ని సూచించే కదలిక ఏర్పడింది. వెంటనే "ఛీ..ఛీ.." అనే పెద్ద కేకలు సభలో అన్ని మూలల నుంచీ వినవచ్చాయి. సభాసదులంతా దు:ఖాన్ని ఆపుకోలేక ఏడ్చారు. కొంతమంది ముచ్చెమటలతో తడిసిపోయారు. ప్రపంచ ప్రళయం ఏదో కలిగిందని తలిచారు.

దుర్యోధనుడు, అతని తమ్ముళ్లు, కర్ణుడు బ్రహ్మానందంతో అరిచారు. యుయుత్సుడు ఒక్కడే సిగ్గుతో, విచారంతో తలొంచుకొని పెద్ద నిట్టూర్పు విడిచాడు. శకుని పాచికలు వేశాడు. "గెలిచాను" అన్నాడు. తక్షణమే దుర్యోధనుడు.. విదురుడి వైపు తిరిగి.. "వెళ్లి పాండవుల ప్రియపత్ని ద్రౌపదిని ఇక్కడికి తీసుకొని రా. ఇప్పట్నించి ఆమె మా ఇళ్లు తుడవాలి. ఆలస్యం లేకుండా వెంటనే ఆమెను తీసుకొని రా" అన్నాడు. విదురుడు పెద్దగా అరిచాడు. "నీకు పిచ్చెత్తిందా దుర్యోధనా. నిశ్చయంగా నీవు అంత్యదశకు వస్తున్నావు. అడుగు భాగం కనిపించని అగాధంలో.. సన్నని తాడుపై నీవు వేలాడుతున్నావు. జూదంలో జయం కలగగానే గర్వం చెందావు. ఈ జయం నీకు తెలియకుండానే నిన్ను నిలువునా ముంచేస్తుంది" అని దుర్యోధనుణ్ణి తూలనాడాడు. సభాసదులను ఉద్దేశించి.. "యుధిష్ఠరుడు ఇదివరకే తనను ఓడిపోయాడు. ఓడిన వాడికి ఇంకా అధికారం ఎక్కడుంటుంది ఇతరులను పందెంలో ఒడ్డటానికి?. తాను ఓడి ఎవరిపైనా అధికారం లేని స్థితిలో.. పాంచాలిని పణంగా ఒడ్డటానికి యుధిష్ఠరుడికి అధికారం లేదు. కౌరవులకు అంత్య దశ వస్తోంది. తమ స్నేహితుల, మంచి కోరేవారి సలహాలను లెక్క చేయకుండా ధృతరాష్ట్రుని కుమారులు తప్పుడు మార్గంలో పయనిస్తున్నారు" అన్నాడు విదురుడు ఎంతో ఆవేదనగా. ఆ మాటలు విన్న దుర్యోధనుడికి ఆగ్రహం వచ్చింది. తన రథసారథి అయిన ప్రాతికామితో.. "విదురుడు మా విజయాన్ని సహించలేకపోతున్నాడు. పాండవులంటే అతడికి భయం. కానీ నీ సంగతి వేరు. నీవు తక్షణమే వెళ్లి ద్రౌపదిని ఇక్కడికి తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.



కురు సభలో ద్రౌపది

## అధ్యాయం - 25

# ద్రౌపది శోకం

**త**న యజమాని సెలవు ప్రకారం ప్రాతికామి.. ద్రౌపది వద్దకు వెళ్లాడు. "ఓ రాకుమారీ, యుధిష్టరుడు దూత్యం ఆటలో తమకంలో పడి మిమ్ముల్ని కూడా పణంగా ఒడ్డి ఓడిపోయాడు. ఇప్పుడు మీరు దుర్యోధనుడి సొత్తు అయ్యారు. దుర్యోధనుడి ఆజ్ఞ ప్రకారం మిమ్మల్ని వారి సేవకురాలిగా పనిచేయడానికి, దాసీగా ఉండటానికి వారి దగ్గరకు తీసుకువెళ్లడానికి వచ్చాను" అన్నాడు.

ఈ సందేశాన్ని రాజసూయ యాగం చేసిన చక్రవర్తి భార్య ద్రౌపది విని నోట మాట రాక మ్రాన్పడిపోయింది. కొంతసేపయిన తరువాత ద్రౌపది.. 'ఓ ప్రాతికామీ, నీవేమంటున్నావు?. ఏ రాజు తన భార్యను పణంగా పెట్టింది?. పణంగా పెట్టడానికి అతడికి మరేమీ లేకపోయిందా?" అన్నది. అందుకు ప్రాతికామి.. "యుధిష్టరుడు తనకు ఉన్న సర్వస్వాన్ని ఓడి మరేమీ లేనందునే మిమ్మల్ని పణం ఒడ్డి ఆట ఆడాడు" అన్నాడు. ద్యూతంలో జరిగిన అన్ని విషయాలు, అంటే యుధిష్టరుడు తన ధనాన్ని,

తమ్ముళ్ళలను, తననూ ఒడ్డి, ఓడి, చివరకు ద్రౌపదిని ఒడ్డే వరకూ చరిత్ర యావత్ వివరించింది. ఈ వార్త హృదయ విదారకమైనదైనా, హృదయ స్పందన ఆగిపోయేదిగా ఉన్నా.. ధైర్యం తెచ్చుకొని.. క్రోధంతో కళ్లు నుంచి నిప్పులు రాలుతున్నట్లుగా... "ఓయీ రథచోదకా, నీవు తిరిగి వెళ్లు. ఎవరైతే ఈ ఆటను ఆడాడో, అందులో తాను ముందు ఓడాడో, లేక భార్యను ముందు ఓడాడో అడుగు. ఈ ప్రశ్నను నిండు సభలోనే అడుగు. దీనికి జవాబు తెచ్చి నన్ను తీసుకువెళ్లొచ్చు అంది ద్రౌపది.

ప్రాతికామి సభలోకి వెళ్లి.. ద్రౌపది అడిగిన ప్రశ్నను యుధిష్టరుణ్ణి అడిగాడు. యుధిష్టరుడికి మాట పెగల్లేదు. మౌనముద్ర దాల్చాడు. "ఈ ప్రశ్నను తానే భర్తను అడుగుతుంది. కనుక ద్రౌపదిని ఇక్కడికి తీసుకొని రా" అని దుర్యోధనుడు మళ్లీ ప్రాతికామిని పంపాడు. ప్రాతికామి మళ్లీ ద్రౌపది వద్దకు వెళ్లి వినయపూర్వకంగా.. "రాజపుత్రీ, నీచ బుద్ధిగల దుర్యోధనుడు మీరే ఈ ప్రశ్నను సభలో అడగడానికి మిమ్మల్ని తీసుకొని రమ్మని నన్ను పంపాడు. "నేను రాను. సభలోకి నీవు వెళ్లి మళ్లీ యుధిష్టరుడికి ఈ ప్రశ్న వేసి జవాబు తప్పక ఇవ్వాలని కోరు" అన్నది ద్రౌపది. ప్రాతికామి అలాగే చేశాడు. దుర్యోధనుడికి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. తమ్ముడైన దుశ్శాసనుడితో.. "ఈ ప్రాతికామి మూఢుడు. భీముడంటే ఇతడికి భయం. నువ్వు వెళ్లి ద్రౌపదిని తీసుకొని రా. రాకుంటే బలవంతంగా ఈడ్చుకొని రా" అన్నాడు దుర్యోధనుడు. దుర్మార్గుడైన దుశ్శాసనుడు అమితానందంతో ద్రౌపది ఉన్న స్థలానికి వెళ్లాడు. పెద్దగా కేకలు పెడుతూ.. "ఎందుకు ఆలస్యం చేస్తున్నావు. రా. నీవిప్పుడు మా దానవు. ఓ అందాల రాశీ, సిగ్గుపడకు. మా దయ సంపాదించే ప్రయత్నం చెయ్యి. మేం నిన్ను గెలిచాము. సభకు రా" అంటూ తమకంతో ద్రౌపదిని పట్టికొని ఈడ్చుకు వెళ్లే ప్రయత్నం చేశాడు. ద్రౌపది వణికిపోతూ.. దృతరాష్ట్రుని రాణివాసపు అంత:పురంలో దాక్కోవడానికి పరుగుతీయ సాగింది. దుశ్శాసనుడు ఆమెను వెన్నంటి తరిమి ఆమె జుట్టు పట్టుకొని సభలోకి ఈడ్చుకువచ్చాడు.

ఇలాంటి అతిక్రూరమైన పనికి సిద్ధపడి దృతరాష్ట్రుడి కుమారులు నీతిబాహ్యులయ్యారు. ద్రౌపది ద్యూత మందిర సభలో ప్రవేశించిన వెంటనే.. తన దుఖా:న్ని అణచుకొని అక్కడ సమావేశంలో ఉన్న పెద్దలతో, "ద్యూతంలో ఆరితేరిన దుర్మార్గుల మాయలో యుధిష్టరుడు ఇరుక్కున్నాడు. నన్ను పణంగా ఒడ్డడానికి మీరెలా ఒప్పుకున్నారు?. యుధిష్టరుడు తాను స్వతంత్రుడుగాని అంశంలో నన్ను పణంగా ఎలా ఒడ్డుతాడు?" అంటూ ద్రౌపది చేతులు చాచి, కన్నీటితో పెద్దలందరినీ ప్రార్థిస్తూ వెక్కివెక్కి ఏడుస్తోంది. "మిమ్మల్ని కని, మీకు పాలిచ్చి పెంచిన తల్లులకు ఎప్పుడైనా

మీరు ప్రేమించి గౌరవించేవారయితే.. మీరు భగవంతుణ్ణీ, ధర్మాన్నీ నమ్మినవారయితే.. నా మరణం కన్నా ఎక్కువగా ఈ భయంకర పరిస్థితిలో జార విడవకండి" అని వేడుకుంది. హృదయ విదారకంగా ద్రౌపది రోదించడాన్ని చూసి పెద్దలంతా విచారంతో, సిగ్గుతో తలలు వంచుకున్నారు. ఆ స్థితిలో భీముడు ఆ విషాదాన్ని తనలో ఉంచుకోలేక.. ఆ భవనపు గోడలు ప్రకంపించినట్లు ఓ సింహనాదం చేశాడు. యుధిష్టరుడి వైపు తిరిగి ఇలా అన్నాడు. "అచ్చువేసి విడిచిన జూదగాళ్లు కూడా వారుంచుకున్న మహిళలను సైతం పణంగా పెట్టరు. నీవు వారి కంటే అధముడవై, ద్రుపదరాజు పుత్రిని ఈ రాక్షసుడి అధీనంలో వదిలావు. ఈ అన్యాయాన్ని నేను భరించలేను. ఈ దుర్మార్గ, క్రూర చర్యకు నీవే కారకుడవు. ఓయీ తమ్ముడా సహదేవా! అగ్నిని తీసుకురా. పాచికలాడిన ఇతడి చేతులను కాల్చుతాను" ఆగ్రహంతో అన్నాడు భీముడు. అర్జునుడు.. భీముణ్ణి అనునయిస్తూ.. నీవు ఏనాడూ ఇలా పలకలేదు. మన శత్రువుల ఈ కుతంత్రం మనల్ని కూడా చిక్కించుకొని మనలో మనకే చెడ్డ పనులు చేయడానికి పురికొల్పుతున్నది. మనం వారి ఎత్తులకు లొంగి మనలో మనం చెడకూడదు. జాగ్రత్త" హెచ్చరించాడు అర్జునుడు.

అర్జునుడి మహా ప్రయత్నంతో భీముడు సంభాళించుకున్నాడు. ధృతరాష్ట్రుడి కుమారుడైన వికర్ణుడు.. ద్రౌపది (పాంచాలి) దురవస్థను, మొరను చూసి భరించలేక సభలో ఇలా అన్నాడు. "ఓ క్షత్రియ వీరులారా! మీరంతా ఎందుకు ఊరుకున్నారు?. నేను చిన్నవాణ్ణయినా, మీ మౌన భావం చూసి నేను కలగజేసుకోవాల్సి వచ్చింది. మీరెన్ని కుతంత్రాలు, మాయోపాయాలు చేస్తే యుధిష్టరుడు ఇక్కడి ద్యూతానికి రావలసి వచ్చింది. ఈమె కేవలం యుధిష్టరుడి సొత్తు కాదు. అతడామెను ఒడ్డడానికి హక్కులేదు. ఈ పందెం న్యాయ సమ్మతం కాదు. చెల్లదు. యుధిష్టరుడు అదివరకే స్వాతంత్ర్యం కోల్పోయాడు. శకునే ఈ ప్రకారం పణం ఒడ్డమని సలహా ఇచ్చాడు. ఇలా చేయడం ద్యూత శాస్త్ర ధర్మం అనుసరించదు. ఆటలు ఆడే రెండు పక్షాల వారూ ఒడ్డబడిన పదార్థానికి హక్కు కలిగి ఉండరు. ఈ అంశాలన్నీ మనం ఆలోచిస్తే.. పాంచాలి మనచేతిలో న్యాయ సమ్మతంగా జయింప బడలేదని మనం ఒప్పుకొని తీరాలి. ఇది నా అభిప్రాయం" అని కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడాడు వికర్ణుడు. అతడు ధైర్యంగా మాట్లాడటంతో సభలోని వారందరికీ బుద్ధి వికసించింది. వికర్ణుణ్ణి మెచ్చుకుంటూ అందరూ చప్పట్లు కొట్టారు. వారంతా "ధర్మం నిలబెట్టారు.. ధర్మం నిలబెట్టారు" అని ముక్తకంఠంతో అన్నారు.

కర్ణుడు నిలబడ్డాడు. 'ఓయీ వికర్ణా! నీవు చిన్నవాడివి. పెద్దలిక్కడున్నారని

కూడా ఆలోచించక నీవు గొడవ చేస్తున్నావు. అగ్నిహోత్రం అరణియందే పుట్టి, తాను పుట్టిన అరణినే కాల్చినట్లు.. నీ తెలివితక్కువతనం, తొందరపాటు వల్ల, నీ జన్మస్థానమైన ఈ కుటుంబానికే హాని చేస్తున్నావు. తన గూటినే పాడు చేసుకునేది పక్షి. యుధిష్టరుడు ప్రారంభంలోనే, తాను స్వతంత్రుడైనప్పుడే తనకున్న సర్వస్వాన్ని ఓడాడు. కావున ద్రౌపది కూడా అందులోదే కనుక ఆమె ఇదివరకే శకుని సొత్తు అయింది. వాటి గురించి చెప్పాల్సిందేమీ లేదిక్కడ. ఓయీ దుశ్శాసనా, పాండవులు ధరించిన వస్త్రాలు లాగివేయి. అలాగే ద్రౌపది ధరించిన వస్త్రాలు కూడా. వాటిని శకునికి ఇచ్చేయి.

కర్ణుడి ఈ దారుణమైన మాటలు విన్నవెంటనే ధర్మం నిలపడానికి తమకెన్ని కష్టాలూ, దరవస్థలూ వచ్చినా ధైర్యంగా ఉండాలని తలచి పాండవులు తమ వస్త్రాలను విసిరివేశారు. తాము ఎలాంటి స్థితిలోనూ సత్యం, ధర్మం అనుసరిస్తామని ప్రజలకు తెలియజేశారు. ఇది చూసి దుశ్శాసనుడు ద్రౌపదిని సమీపించి బలవంతంగా ఆమె వస్త్రాలను తీసివేయడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆమెకు సహాయం చేసేవారెవరూ లేరు. దీంతో తన కష్టదశలో భగవంతుడి దయ, సహాయమే శరణ్యమని తలచింది. "ఈ ప్రపంచానికి ప్రభువా! దైవమా! నిన్నే నమ్ముకొంటున్నాను. ఈ కష్ట దశలో నన్ను విడవొద్దు. నీవే నాకు శరణ్యం. రక్షింపు" ఇలా అంటూ ద్రౌపది మూర్ఛపోయింది. అప్పుడు పరమ దుర్మార్గుడైన దుశ్శాసనుడు ఆమె వస్త్రాలను తొలగించడం మొదలుపెట్టాడు. ఆ సమావేశంలో అన్యాయం భరించలేని వారంతా ముఖాలు పక్కకు తిప్పుకున్నారు. ఆ క్షణంలో భగవంతుని కృపతో ఓ అద్భుతం జరిగింది. ద్రౌపది వస్త్రాలను తొలగిస్తుండగా, మరో వస్త్రం వచ్చి ఆమె శరీరాన్ని చుట్టుకుంటోంది. తొలగించిన వస్త్రాలతో పెద్ద కుప్ప పోగు పడింది. కొత్తగా చుట్టుకుంటున్న వస్త్రాలను తొలగించలేక దుశ్శాసనుడు అలసి కూర్చుండి పోయాడు. సభ యావత్తూ ఈ విచిత్రాన్ని చూసి కంపించిపోయి భగవంతుణ్ణి స్తుతిస్తూ ఆనంద భాష్పాలను వదిలారు. భీముడు అధరాలు అదురుతుండగా గంభీరమైన ప్రతిజ్ఞ చేశాడు. "దుర్మార్గుడూ, పాపిష్టీ, భరత కళంకుడైన దుశ్శాసనుడి గుండెను చీల్చి రక్తం తాగకపోతే నేను భీముణ్ణే కాదు" అని ప్రతిన చేశాడు. ఆ సమయంలో నక్కల, గాడిదల అరుపులు వినవచ్చాయి. అదే సమయంలో మాంసాహార పక్షుల అపశకునపు అరుపులు అరిచాయి. ఈ అరుపులు ముమ్ముందు ఏదో ఘోరం జరగబోతోందని సూచన చేశాయి.

సమావేశంలో జరిగిన దారుణాలు తన వంశ నిర్మూలనకు కారణమయ్యే అవకాశాలున్నాయని ధృతరాష్ట్రుడు గమనించాడు. బుద్ధి, ధైర్యం తెచ్చుకొని ధృతరాష్ట్రుడు

ద్రౌపదిని తన పక్కకు రప్పించి అభిమానంతో, కరుణాపూరిత మాటలతో ఆమెను అనునయించాడు. యుధిష్టరుడు వైపు చూస్తూ.. "నీవు నిరపరాధివి. నీకెక్కడా శత్రువులుండరు. నీ విశాల బుద్ధితో దుర్యోధనుడు చేసిన ఈ చెడును క్షమించి మరిచిపో. నీ రాజ్యాన్ని, నీ ధనాన్ని నువ్వు తిరిగి తీసుకో. నీవు స్వతంత్రంగా ఉండి వృద్ధి పొందు. ఇంద్రప్రస్థపురానికి వెళ్లండి" అన్నాడు ధృతరాష్ట్రుడు. ధృతరాష్ట్రుడి మాటలకు పాండవులు సంభ్రమాశ్చర్యాలు వ్యక్తం చేశారు. ఆ ఘోర విపత్తు నుంచి విడుదల కావడం వారికి ఇంద్రజాలం అనిపించింది. పాండవులు ఆ ద్యూత గృహం నుంచి బయటకు వచ్చారు.

యుధిష్టరుడు, అన్నదమ్ములు వెళ్లిన తరువాత కౌరవ ఆస్థానంలో సుదీర్ఘ సంప్రదింపులు, కోప పూరిత సంభాషణలు జరిగాయి. దుశ్శాసనుడు, శకుని ప్రేరేపణతో ఈ చర్యకు ఒడిగడితే.. తన తండ్రి ధృతరాష్ట్రుడు వాటిని నిష్ఫలం చేశాడని దుర్యోధనుడు నిందించాడు. "బలశాలులైన శతృవులను సంహరించడానికి ఏ విధంగా తంత్రాన్ని ఉపయోగించినా తప్పుకాదు" అని బృహస్పతి నీతిని ఈ సందర్భంగా దుర్యోధనుడు ఉదహరించాడు. పాండవుల ప్రజ్ఞా విశేషాల గురించి తండ్రికి వివరించాడు. అలాంటి సందర్భంలో పాండవులను జయించడం కేవలం కుతంత్రం వల్లనే నెరవేరగలదన్నాడు. పాండవులు పౌరుషవంతులు. మర్యాదగా ప్రవర్తిస్తారు. అలాంటి వారితోనే కుతంత్రాలు పనిచేస్తాయి. ఆత్మాభిమాని అయిన ఏ క్షత్రియుడైనా ద్యూతానికి ఆహ్వానించిన తరువాత రానని చెప్పలేడు అని ధృతరాష్ట్రుడి దృష్టికి తెచ్చాడు. ధృతరాష్ట్రుడు వృద్ధుడు. దుర్యోధనుడంటే ఎనలేని ప్రేమ. ద్యూతం మనకు మంచిదికాదు అన్నప్పటికీ యుధిష్టరుణ్ణి మళ్లీ ద్యూతానికి ఆహ్వానించడానికి ధృతరాష్ట్రుడు సమ్మతం తెలిపాడు.

ఆ మేరకు.. ఒక దూత ద్వారా ఆహ్వాన పత్రికను యుధిష్టరుడికి పంపారు. యుధిష్టరుడు ఇంకా ఇంద్రప్రస్థపురం చేరక ముందే ఆ దూత అతణ్ణి కలిసి ధృతరాష్ట్రుడి లేఖ అందజేశాడు. యుధిష్టరుడు తిరిగి వచ్చి మళ్లీ ద్యూతం ఆడాలని ఆ లేఖలో ఉంది. ఆ ఆహ్వానానికి యుధిష్టరుడు ఇలా అన్నాడు. "మంచీ చెడూ పూర్వజన్మ ఫలాన్ని బట్టే జరుగుతాయి. దాన్ని ఎవరూ అడ్డుకోలేరు. మనం తప్పక ఆడవలసిందే అని కోరితే ఆడవలసిందే. అంతే. ద్యూతానికి పిలవబడినవాడు దానికి నిరాకరించకూడదు. నేను ఒప్పుకొని తీరాల్సిందే. నిశ్చయంగా వ్యాస భగవానుడు చెప్పినట్లు.. బంగారు లేడి ఇదివరకు సృష్టిలో లేనిది. రాముడు బంగారు లేడి అని వెంటబడి వృధా ప్రయాస చెందలేదా నిశ్చయంగా కష్టదశ సమీపించుకాలానికి బుద్ధి నశించిపోతుంది." అన్నాడు యుధిష్టరుడు.

యుధిష్ఠరుడు మళ్లీ హస్తినాపురం వచ్చి సభలోని వారందరూ వద్దని చెపుతున్నా.. శకునితో ద్యూత మాడటానికి కూర్చున్నాడు.  ఈ సారి ద్యూతంలో.. ఓడిపోయినవాడు తన తమ్ములతో కూడా పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం, పదమూడో సంవత్సరం అజ్ఞాతవాసం చేయాలన్నది పణంగా పెట్టుకున్నారు. యుధిష్ఠరుడు ఈసారి కూడా ఓడిపోయాడు. పాండవులు అరణ్యవాసం చేస్తామని ప్రతిజ్ఞ చేశారు. సభలోని వారంతా సిగ్గుతో తలదించుకున్నారు.

◈



ధృతరాష్ట్రునితో మాట్లాడుతున్న గాంధారి

అధ్యాయం - 26

# ధృతరాష్ట్రుడి ఆందోళన

**పాం**డవులు అరణ్యానికి బయలుదేరినప్పుడు పురజనులంతా వీధుల్లో గుమిగూడి, ఇళ్లపైకెక్కి, పెద్ద స్తంభాలు, చెట్లపైకి ఎక్కి పాండవులను చూస్తూ, ఏడుస్తూ, కేకలు పెడుతూ పెద్ద గందరగోళం చేశారు. పురాతన అలవాటును అనుసరించి రత్నఖచితమైన రథాల్లోనూ, భారీ ఏనుగులపై కూర్చొని మంగళవాద్యాలు సాగుతుండగా ప్రయాణించే రాజపుత్రులు (పాండవులు) ఇప్పుడు వారి జన్మభూమి నుంచి పాదచారులై అడవులకు వెళ్లారు. ప్రజలు ఏడుస్తూ గుంపులు గుంపులుగా పాండవులను వెంబడించారు. అన్ని వైపుల నుంచీ కౌరవులను 'ఛీ' కొట్టడం, పాండవులను 'అయ్యయ్యో' అని సానుభూతిని, బాధను వ్యక్తం చేయడం అక్కడ కనిపించిన దృశ్యం. ఈ పరిస్థితిని స్వర్గం నుంచి దేవుడు తప్పక చూస్తాడని జనం నుంచి కేకలు వినబడ్డాయి.

అంధ ధృతరాష్ట్రుడు విదురుణ్ణి రప్పించి, పాండవులు పట్టణాన్ని వదిలి అరణ్యానికి ఎలా వెళ్లిందీ వర్ణించి చెప్పాలని కోరాడు. "ఓ రాజా! కుంతి కుమారుడైన

యుధిష్టరుడు ముఖంపై వస్త్రం కప్పుకొని వెళ్లాడు. అతని వెనుక భీముడు కళ్లు దించుకొని తన చేతులపైపు చూస్తూ వెళ్లాడు. దారి అంతా ఇసుక జల్లుతూ అర్జునుడు వెళ్లాడు. నకుల, సహదేవులు తమ శరీరాల నిండా ధూళి పూసుకొని యుధిష్టరుడి వెంట నడిచారు. తన జుట్టు విరబోసుకుని దానిలో తన ముఖాన్ని కప్పుకొని కళ్ల వెంట నీరు కారుతుండగా ద్రౌపది యుధిష్టరుణ్ణి అనుసరించింది. పాండవుల పురోహితుడైన ధౌమ్యుడు వారితో కలిసి వెళ్తూ మరణ కారకుడైన యముణ్ణి ఉద్దేశించి సామగానం చేశాడు" అని విదురుడు చెప్పాడు.

ఈ మాటలు విన్న దృతరాష్ట్రుడిలో ఇది వరకున్న భయం, ఆందోళన కంటే ఎక్కువగా కనిపించింది. "పుర జనులు ఏమన్నారు" అని అడిగాడు. దీనికి విదురుడు "ఓ రాజోత్తమా, అన్ని వర్ణాల పురజనులు ఏమన్నదీ వారి మాటలు మీకు చెపుతాను. ఇలాంటి ఘోరాలు జరగనిచ్చిన కురు వృద్ధులు, ఛీ..ఛీ.. ఏమి కురువృద్ధులు? ఆశపోతు అయిన ధృతరాష్ట్రుడు, వాడి కొడుకులు, పాండవులను అరణ్యాలకు తరిమేశారు అని చెప్పుకున్నారు" అని చెప్పాడు విదురుడు.

ధృతరాష్ట్రుడూ విదురుడు ఇలా సంభాషించుకుంటూ ఉండగా.. నారదుడు ప్రత్యక్షమయ్యాడు. "నేటి నుంచి పదమూడేళ్లు దుర్యోధనుడు చేసిన ఈ ఘోర కృత్యం వల్ల కౌరవాన్వయమంతా అంతరిస్తుంది" అని నారదుడు అంతర్ధానమయ్యాడు. దుర్యోధనుడు, అతని అనుచరులు భయం చెందారు. వారంతా ద్రోణుడి వద్దకు వెళ్లి ఏ పరిస్థితుల్లోనూ తమను విడిచిపెట్టాల్సిందని ప్రార్థించారు. దీంతో ద్రోణుడు విచారాన్ని, నిస్పృహను వెల్లడించాడు. "పాండవులు దైవాంశ సంభూతులు. అజేయులు అని పెద్దలు చెప్పే వాక్యాల్లో నాకు నమ్మకముంది. కానీ కౌరవులు నాపై ఆధారపడి ఉన్నందున, నేను వారి అన్నం తింటున్నందున దృతరాష్ట్ర కుమారులకోసం ఎవరితోనైనా జగడమాడతాను. కౌరవుల కోసం నేను హృదయపూర్వకంగా కష్టపడతాను. కానీ ఏది అవుతుందో అది దైవాధీనం. పాండవులు అరణ్యవాసం నుంచి ఆగ్రహంతో తిరిగి వస్తారు. కోపం సంగతి నాకు బాగా తెలుసు. దృపదుడి పట్ల నాకున్న కోపంతో అతడిని రాజ్య భ్రష్టుణ్ణి చేసి అవమానపరిచాను. పట్టు విడవని ఆగ్రహంతో దృపదుడొక యజ్ఞం చేసి నన్ను చంప శక్తిగల ఒక కుమారుణ్ణి అగ్ని సముఖాన పొందాడు. అతడే దృష్టద్యుమ్నుడని విన్నాను. ప్రారబ్ద వశాన ఈ దృష్టద్యుమ్నుడు పాండవులకు బావమరిది, స్నేహితుడు అయి ఉన్నాడు. రాబోయే కార్యాలు సోది చెప్పిన ప్రకారం జరుగుతున్నాయి. మీరు చేసే పనులు కూడా ఆ చెడు మార్గానికే దారి చూపుతున్నాయి. మీ జీవిత కాల పరిమితి సమీపిస్తోంది. కనుక మీరు చేయదగిన ముఖ్య కార్యక్రమమేదైనా ఉంటే త్వరగా చేయండి. గొప్ప

యజ్ఞం చేయండి. దుర్యోధనా! యుధిష్టరుడితో రాజీ పడు. ఇదే నేను చెప్పే సలహా. నీకు ఇష్టమైనవి నువు చెయ్యి" అన్నాడు. ద్రోణుడి ఈ మాటలు దుర్యోధనుడికి రుచించలేదు.

సంజయుడు ధృతరాష్ట్రుణ్ణి అడుగుతున్నాడు. "నువ్వేమిటి ఆందోళనతో, బెంగతో ఉన్నావు". "ఓయీ సంజయా, పాండవులను హింసించిన నాకు శాంతి ఎక్కడిది?. సంజయుడు ఇలా అన్నాడు. "నీవు చెప్పింది నిజం. మున్ముందు ఎవరికైతే ఆపదలు రాగలవో, అతడి హృదయమూ, బుద్ధి బలమూ వక్రించి మంచిచెడ్డల తారతమ్యం కూడా ఎరగడు. తన బుద్ధిని తానే పాడుచేసుకొని, తన చెడుకు తానే ప్రయత్నిస్తాడు. నీ కుమారులు పాంచాలని హింసించి చాలా అగౌరవంగా ప్రవర్తించారు. దాని ఫలాన్ని వారిక అనుభవిస్తారు.

దీనికి ధృతరాష్ట్రుడు.. "ధర్మాన్ని, రాజనీతిని అనుసరించి నేను నడవక, మూఢుడైన నా కుమారుడి ద్వారా చెడు మార్గానికి వెళ్లి, నీవు చెప్పినట్లు శీఘ్రంగా అంతానికి చేరుతున్నాము" అన్నాడు.

విదురుడు.. ధృతరాష్ట్రునికి హృదయపూర్వకంగా మంచి సలహాలను ఇచ్చేవాడు. ఆయన తరచూ ధృతరాష్ట్రుడితో ఇలా అనేవాడు. "నీ కుమారుడు గొప్ప తప్పు చేశాడు. యుధిష్టరుణ్ణి వంచించాడు. నీ కుమారులను చెడు మార్గాల నుంచి తప్పించి మంచి మార్గాన పెట్టడం నీ కర్తవ్యం కాదా?. ఇప్పుడైనా సరే, నీవు పాండవులకు ఇచ్చిన రాజ్యాన్ని, వారు తిరిగి పొందేలా ఆజ్ఞ ఇవ్వు. యుధిష్టరుణ్ణి అడవుల నుంచి రప్పించి అతడితో రాజీ పడు. న్యాయ సూత్రాల ప్రకారం చేయనప్పుడు నీవు దుర్యోధనుణ్ణి బలవంతంగా అడ్డుకోవాలి".

ప్రారంభంలో ధృతరాష్ట్రుడీ వాక్యాలను మౌనంగా, విచారంగా వినేవాడు. విదురుడు తనకంటే బుద్ధిమంతుడని తెలుసు. అతడెల్లప్పుడూ తన మంచి కోసమే ప్రయత్నించేవాడనీ తెలుసు. కానీ విదురుడు తరచుగా యదార్థాలు చెపుతుండటంతో ధృతరాష్ట్రుడు ఓర్పు వహించలేకపోతున్నాడు. ఒకనాడు సహించలేక తొందరపాటుతో.. "ఓ విదురా, నీవు ఎల్లప్పుడూ పాండవ పక్షపాతివి. నా కొడుకులంటే నీకు గిట్టదు. మా మంచినీ, మా అభివృద్ధినీ నీవు కోరవు. దుర్యోధనుడు నా రక్తంతో జన్మించినవాడు. అతన్ని నేనెలా విడుస్తాను?. ఇలాంటి సంభవంకాని సలహాలు ఇవ్వడం వల్ల ఏమి ప్రయోజనం?. నీపై నాకు నమ్మకం పోయింది. నీవు నాకు మరి అవసరంలేదు. నీ కిష్టమైతే పాండవుల వద్దకు వెళ్లవచ్చు. నీవిప్పుడు స్వతంత్రుడవు" అంటూ తన అభ్యంతర గృహంలోకి వెళ్లాడు ధృతరాష్ట్రుడు.

విదురుడు విచారగ్రస్తుడై.. కౌరవాన్వయం నశింపు నిశ్చయం అని తలచి, ధృతరాష్ట్రుడు అన్న మాటలు నిశ్చయముగా నమ్మి, జవాశ్వయుత రథం ఎక్కి పాండవులు నివసిస్తున్న అరణ్యానికి వెళ్లాడు. ధృతరాష్ట్రుడు పశ్చాత్తాపపడ్డాడు. తనలో తాను ఇలా అనుకున్నాడు. "నేనేమి పనిచేశాను. బుద్ధిమంతుడైన విదురుణ్ణి పాండవుల వద్దకు పంపి ఇంకా పాండవులకు బలము చేకూర్చాను" – ఈ ప్రకారం ఆలోచించుకొని సంజయుని రప్పించి.. విదురుని వద్దకు తన పశ్చాతాపం తెలియజేసే వార్తను పంపుతూ, తానొక నిర్భాగ్య జనుణ్ణని, తానన్న అనాలోచిత మాటలను క్షమించి తిరిగి రావలసిందిగా బతిమిలాడినట్లు చెప్పాలని అన్నాడు.

సంజయుడు పాండవులు అరణ్యంలో నివసించే ప్రాంతానికి త్వరగానే వెళ్లాడు. అక్కడ పాండవులందరూ జింక చర్మం ధరించి ఉన్నారు. రుషీశ్వరులతో పరివేష్టించి ఉన్నారు. విదురుణ్ణి కూడా అక్కడ చూశాడు. ధృతరాష్ట్రుడు చెప్పి పంపిన సందేశాన్ని విదురుడికి తెలియపరిచాడు సంజయుడు. "నీవు హస్తినాపురానికి తిరిగి రాకపోతే అంధ రాజు ధృతరాష్ట్రుడు భగ్న హృదయుడై చనిపోగలడు" అని చెప్పాడు.

మృదుల స్వభావుడైన విదురుడి హృదయం ద్రవించిపోయింది. సంజయుని వెంట హస్తినాపురానికి తిరిగి వెళ్లాడు. ధృతరాష్ట్రుడు అతన్ని కౌగలించుకున్నాడు. ఉభయులూ కన్నీరు కార్చారు. అప్పటివరకూ విదురుడిపై ద్వేషాన్ని వెళ్లగక్కిన ధృతరాష్ట్రుడు అన్యోన్య ప్రేమానురాగాలు వ్యక్తం చేశాడు.

ఒకరోజు మైత్రేయి మహాముని ధృతరాష్ట్రుని మందిరానికి రాగా, గౌరవించి ఉచితాసనంపై కూర్చోపెట్టారు. ధృతరాష్ట్రుడు ఆయన ఆశీర్వచనం పొందాడు. "మీరు పాండవులను కలిసే ఉంటారు. మా కుటుంబంలో అన్యోన్య ప్రేమ ఏమాత్రమైనా తగ్గకుండా ఉంటుందా?" అన్నాడు ధృతరాష్ట్రుడు. మైత్రేయి బదులిస్తూ.. "నేను కావ్యక వనంలో హఠాత్తుగా యుధిష్టరుణ్ణి కలిశాను. ఆయన్ను చూడటానికి అక్కడున్న రుషులు వచ్చారు. హస్తినాపురంలో జరిగిన సమాచారాన్ని విన్నాను. నీవూ, భీష్ముడూ జీవించి ఉండగా అలాంటి పనులు జరగడం నాకు వింతగా అనిపించింది. తరువాత మైత్రేయుడు అక్కడే ఉన్న దుర్యోధనుణ్ణి చూశాడు. కృష్ణుడు, ద్రుపదుడు పాండవులకు బంధువులనీ, పాండవులే పరాక్రమశాలురనీ, అలాంటి పాండవులకు హాని చేయడం తగదనీ, వెంటనే దుర్యోధనుడు పాండవులతో

రాజీ పడాలనీ, ఇదంతా దుర్యోధనుడి శ్రేయస్సు కోరి చెపుతున్నాననీ మైత్రేయుడు దుర్యోధనుడుతో అన్నాడు.

మూఢుడూ, మొండివాడూ అయిన దుర్యోధనుడు మైత్రేయుడి మాటలు విని, వికటంగా నవ్వుతూ, తొడలు చరుస్తూ, నేలను పాదాలతో రాస్తూ, అతడికి జవాబు చెప్పకుండా నిరాదరంగా చూసి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు. మైత్రేయుడికి ఆగ్రహం వచ్చింది. దుర్యోధనుణ్ణి చూస్తూ.. "నీకంత కండ కావరమా?. నీ మేలు కోరిన నాపట్ల ఇంత నిరాదరణా? యుద్ధభూమిలో నీ తొడలు భీముడి గదతో విరగ్గొట్టబడి చస్తావు" అని శపించాడు. ఈ కఠోర శాపం విని ధృతరాష్ట్రుడు తుళ్లిపడ్డాడు. మైత్రేయ రుషి కాళ్లపై పడి క్షమించాలని వేడుకున్నాడు. "నీ కొడుకు పాండవులతో సఖ్యత చేసుకుంటే నా ఈ శాపం పనిచేయదు. లేకపోతే ఈ శాపం పనిచేసి తీరుతుంది" అని ఆగ్రహంతో అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

మహాభారతం పురాతన కథ. మానుషతత్వం ఎప్పుడూ మార్పు చెందదు. ఏ కాలంలోనైనా కోపం, పగ అనేవి చిన్నాపెద్దా, ఆడామగా, బీదాగొప్పా అనక, మనిషి జన్మమెత్తిన ప్రతివారినీ విచారంలో ముంచి భయభ్రాంతులను చేసి ధ్వంసం చేయగలవు.

◈



ద్రౌపదిని ఓదారుస్తున్న శ్రీకృష్ణుడు

## అధ్యాయం - 27

# కృష్ణుని ప్రతిజ్ఞ

**శ్రీ**కృష్ణుడి చేతిలో శిశుపాలుడు చనిపోయాడన్న వార్త.. శిశుపాలుడి స్నేహితుడైన సాల్వుడికి తెలిసింది. వెంటనే అతడు అగ్రహోదగ్రుడయ్యాడు. గొప్ప సైన్యంతో ద్వారకను ముట్టడించాడు. ఇంకా శ్రీకృష్ణుడు ద్వారకకు రాలేదు. ముసలివాడైన ఉగ్రసేనుడు ద్వారకను రక్షించే పనిలో ఉన్నాడు. ద్వారక గొప్ప కోట. అది బలమైన సైన్య రక్షణలో ఉంది. ఒక ద్వీపంలో ఈ కోట నిర్మితమైంది. శత్రు సైనిక దుర్భేద్యంగా ఉంది. సైన్యానికి విశాలమైన స్థలం, వివిధ అస్త్రాలు, అందరికీ చాలాకాలం వరకూ సరిపోయే ఆహార పదార్థాలు ఉన్నాయి. కోటను గొప్పగొప్ప వీరులు రక్షిస్తున్నారు. కోటను శత్రువులు ఆక్రమించిన కాలంలో మద్యపానం సేవించరాదనీ, ఆటపాటలు కూడదనీ ఉగ్రసేనుడు చాటించాడు. వంతెనలన్నీ ధ్వంసం చేశారు. రాజ్యంలోని ఏ రేవుకీ ఏ పడవా రాకుండా ఏర్పాటు చేశారు. కోట చుట్టూ ఉన్న కందకానికి ఉన్న ఇనుప చువ్వలు పాతబడ్డాయి. పట్టణం చుట్టూ ఉన్న గోడలు

బలవత్తరం చేశారు. కోట ముఖద్వారాన్ని ఇనుప ముళ్లతీగెతో రక్షణ కల్పించారు. కోట నుంచి బయటకు వెళ్లడానికి, లోనికి రావడానికి సంజ్ఞాక్షరాలతో నియమాలు పెట్టారు. నైసర్గికంగా ఆ ద్వీపం సురక్షితమైనది. ఇంకా దాన్ని బలవత్తరం చేయడానికి అన్ని ఏర్పాట్లూ చేశారు. యోధుల వేతనాలను వృద్ధి చేశారు. సైనిక దళంలోకి చేరిన యువకులను జాగరూకతతో, కఠినంగా పరీక్షిస్తున్నారు.

ఇంత రక్షణ వ్యవస్థ ఉన్న ద్వారక ముట్టడికి సాల్వుడు తన సైన్యాన్ని బహు జాగ్రత్తగా ముందుకు నడుపుతున్నాడు. ద్వారక సైన్యాలు చాలా కష్టనష్టాలు ఎదుర్కొంటున్నాయి. శ్రీకృష్ణుడు తిరిగి వచ్చేసరికి ద్వారక పరిస్థితి అంత బాగోక పోవడంతో విచారపడ్డాడు. తక్షణం సాల్వుడిని ఎదురించి యుద్ధంలో అతణ్ణి ఓడించాడు. ద్యూతం ఆట, పాండవులు ఇంద్రప్రస్థపురం విడిచి అరణ్యాలకు వెళ్లడం తదితర హస్తినాపుర వింతలు శ్రీకృష్ణుడికి తెలిశాయి. శ్రీకృష్ణుడు తక్షణమే పాండవులు ఉండే అడవికి వెళ్లాడు.

శ్రీకృష్ణుడితోపాటు చాలా మంది పాండవుల వద్దకు వెళ్లారు. ఇంకా వృష్ణి, భోజ కుటుంబాలకు చెందిన ముఖ్య వీరులను, చేది దేశపు రాజయిన దృష్టకేతువు, కేకయులు కూడా వెళ్లారు. వీరందరూ దుర్యోధనుడి దుర్మార్గాలు విని ఆగ్రహోదగ్రులయ్యారు. దుర్యోధనుడి వంటి క్రూరుల రక్తం భూదేవి తాగుతుందని అరిచారు. ద్రౌపది.. శ్రీకృష్ణుణ్ణి సమీపించి గద్గద స్వరంతో తాను పడిన భంగపాట్లను ఆయనకు చెప్పింది. “నేను ఏక వస్త్రంతో ఉన్నప్పుడు సభలోకి ఈడ్చుకొచ్చారు. ధృతరాష్ట్రుడి కుమారులు అనరాని మాటలతో, అసహ్యకర చేష్టలతో నన్ను అవమానించారు. నా బాధను చూసి వారు ఆనందించారు. నేను వారికి దాసిని అయ్యానంటూ అలాగే పిలిచారు. భీష్ముడు, ధృతరాష్ట్రుడు కూడా నాతో వారికున్న బాంధవ్యాన్ని మరిచిపోయారు. ఓ జనార్ధనా! నా భర్తలు కూడా ద్యూత గృహంలో క్రూరుల అపహాస్య, అవమానాలు ఎదుర్కొన్నారు. వారు నన్ను రక్షించలేకపోయారు. భీముని బలపరాక్రమం, అర్జునుడి గాండీవం ఎందుకూ పనికిరాలేదు. అలాంటి అవమానాలు పొందిన పరిస్థితుల్లో నిస్సారమై ఉన్నప్పటికీ బలం తెచ్చుకొని నన్ను హింసించిన క్రూరులను చంపి ఉండేవారు. పాండవులు ప్రఖ్యాతిగన్న వీరులు. అయినా దుర్యోధనుడు ఇంకా సజీవుడై ఉన్నాడు. పాండు చక్రవర్తి కోడలినైన నన్ను జుట్టు పట్టుకొని ఈడ్చారు. ఐదుగురు వీరులకు భార్యనైన నన్ను దారుణంగా అవమానించారు. ఓ మదుసూధనా! నువ్వు కూడా నన్ను వీడావు” అంటూ పూడుకుపోయిన గొంతుతో మాట పెగల్చలేకపోయింది.

శ్రీకృష్ణుడి హృదయం ద్రవించిపోయింది. ఏడుస్తున్న ద్రౌపదిని ఊరడించాడు.

"నిన్ను అవమాన పరిచిన వారందరూ, వారు ఓడిపోయిన యుద్ధభూమిలోనే మట్టితో కలిసిన రక్తంలో పొరలి చస్తారు. నీ కళ్లు తుడుచుకో. నీ భంగపాటుకు తగిన ప్రతీకారం తీర్చుకుందాం. పాండవులకు అన్ని విధాలా నేను సాయపడతాను. నీవు చక్రవర్తివి అవుతావు. ఆకాశం, హిమాలయాలు బద్ధలవుగాక. భూమి పొడి అయిపోవుగాక. సముద్రాలన్నీ ఇంకిపోవు గాక, ఇదే నా ప్రతిజ్ఞ" అన్నాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడి ప్రతిజ్ఞ, పురాణాల్లోనూ, శాస్త్రాల్లోనూ చెప్పిన రీతిలో అంటే "ధర్మాత్ములను రక్షించడానికి, క్రూరులను చంపి న్యాయాన్ని, ధర్మాన్ని నిలపడానికి నేను ప్రతియుగంలోనూ భూమిపై అవతరిస్తున్నాను" అన్న విషయం అతడే కార్యక్రమం సాధించడానికి అవతారం ఎత్తుతున్నాడో ఆ కార్యాన్నే సూచిస్తోంది.

దృష్టద్యుమ్నుడు కూడా తన చెల్లెలును ఓదార్చి కౌరవులు ఎలా నాశనమవుతారో చెప్పాడు. "నేను ద్రోణుణ్ణి చంపుతాను. శిఖండి, భీష్ముడి పతనమూ తప్పదు. క్రూరులైన దుర్యోధనుణ్ణి, వారి అన్నదమ్ములను భీముడు చంపుతాడు. రథ చోదకుడి కుమారుడైన కర్ణుణ్ణి.. అర్జునుడు చంపుతాడు" అని ప్రద్యుమ్నుడు అన్నాడు.

శ్రీకృష్ణుడు జోక్యం చేసుకుంటూ.. "మీ కష్టకాలంలో నేను ద్వారకలో లేను. నేను అక్కడే ఉండి ఉంటే ఈ మోసపు ద్యూతాన్ని జరగనివ్వకుండా అడ్డుకునేవాడిని. వారు నన్ను ఆహ్వానించకపోయినా నేనే వెళ్లి, ద్రోణుణ్ణి, కృపుణ్ణి, ఇంకా ఇతర పెద్దలను ప్రోత్సహించి, వారిని కార్యక్రమంలోకి దింపేవాణ్ణి. ఎంత కష్టంలోనైనా అందరినీ పాడు చేసే ద్యూతాన్ని ఆపేసి ఉండేవాణ్ణి. మిమ్మల్ని శకుని వంచించే సమయానికి సాల్వుడు ద్వారకను ముట్టడించాడు. అతడితో యుద్ధంలో ఉన్నాను. అతణ్ణి జయించాక ఈ ద్యూతం గురించీ, తర్వాత జరిగిన విషాదాంశాల గురించీ నాకు తెలిశాయి. ఆ క్షణమే నేను మీ ఇబ్బందులను తప్పించలేకపోయినందుకు తీవ్రంగా విచారిస్తున్నాను. కానీ పోయిన చెలియలికట్టు మళ్లీ బాగుచేసే లోపు కొంత నీరు పోతుంది" అన్నాడు.

అర్జునుడి భార్య అయిన సుభద్రతోనూ, వారి కుమారుడైన అభిమన్యుడితోనూ కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడు. దృష్టద్యుమ్నుణ్ణి, ద్రౌపది పుత్రులను తీసుకొని పాంచాలకు వెళ్లాడు.

◈



అర్జునునికి పాశుపతాస్త్రం
ఇస్తున్న శివుడు

## అధ్యాయం – 28

# పాశుపతం

**పా**ండవుల అరణ్యవాస ప్రారంభంలో భీముడు, ద్రౌపది ఇద్దరూ యుధిష్టరుడుతోనూ వాగ్వివాదం చేశారు. క్షత్రియుడికి కోపం ఉండాల్సినచోట ఉండాలనీ, అన్యాయంగా అవమానపరిస్తే నిరసన తెలియజేస్తూనే, ఉన్న స్థితిలో క్షమ, శాంతి అని ఊరుకోవడం తగదని భీముడూ, ద్రౌపదీ అన్నారు. సకల శాస్త్రాల్లోనూ తమ వాదనల్లోని అంశాలను యుధిష్టరుడికి చెప్పారు. యుధిష్టరుడు ఎప్పుడూ ఒక్కటే స్థిరమైన జవాబు ఇచ్చేవాడు. “మనమిచ్చిన వాగ్దానం మేరకు కచ్చితంగా నడిచి తీరాలి” క్షమ అన్నిటికన్నా గొప్ప గుణం” అని చెప్పేవాడు. భీముడు తనకున్న తమకంతో ఎప్పుడు దుర్యోధనుణ్ణి చంపుతానా, ఎప్పుడు రాజ్యాన్ని గెలుచుకుంటానా అని తనలోనే క్రోధావేశంతో ఊగిపోయేవాడు. వీరులైనవారు అడవిలో నమ్రతగల జంతువుల్లా పడి ఉండటం తగదనేవాడు. ఓ మారు భీముడు, యుధిష్టరుడితో.. “వేద మంత్రాలు వల్లె వేస్తూ.. అతడి స్వరాన్ని, ధ్వనిని విని ఆనందిస్తూ.. అర్థం ఏమీ తెలియనివాడిలా

ఉన్నావు. నీ విజ్ఞానం కలవరమైనది. క్షత్రియుడై పుట్టావుగానీ, క్షత్రియుడి ఆచరణ లేదు. కాఠిన్యం, వీరయత్నం క్షత్రియుడికి ఉండాల్సిన సుగుణాలని శాస్త్రాలు చెప్పడం నీకు తెలుసు. ధృతరాష్ట్ర కుమారులైన ఆ దుష్టులను విచ్చలవిడిగా వదిలేయకూడదు. తనను మోసం చేసిన శత్రువును జయించని రాజు జన్మ జన్మే కాదు. అది నా మతం. మోసం చేసిన శత్రువును చంపినందువల్ల నాకు నరకం వచ్చినా అది నాకు స్వర్గతుల్యంగా ఉంటుంది. నీ 'క్షమ' మమ్మల్ని అగ్ని కంటే తీవ్రంగా దహిస్తోంది. ఆ తుచ్ఛులు మనలను వంచించి మన రాజ్యాన్ని తీసుకొని అనుభవిస్తున్నారు. మరి నువ్వు కడుపునిండా తిని యజగరము వలె స్తబ్దంగా పడి ఉన్నావు. మన వాగ్దానం ప్రకారం మనం పడి ఉండాలని అంటావు. ప్రపంచమంతా కీర్తి సంపాదించిన అర్జునుడు తన ఉనికి ఎలా ఇతరులకు తెలియజేయకుండా ఉండగలడు?. హిమాలయ పర్వతాలు పిడికెడు తృణాలతో మూయబడతాయా?, సింహ సదృశ్యులైన అర్జునుడు, నకులుడు, సహదేవుడు ఎలా దాక్కొని ఉంటారు. వినుతికెక్కిన ద్రౌపది ఎవరికీ కనబడకుండా ఎలా సంచరిస్తుంది?. ఈ చేయలేని పని మనం ఎలా చేసినా దుర్యోధనుడు తన వేగుల ద్వారా మన ఉనికి తెలుసుకుంటాడు. కాబట్టి మనం ఇచ్చిన వాగ్దానం అనుసరించడానికి వీల్లేనిది. మళ్లీ మనల్ని పదమూడేళ్లు గెంటి వేయడానికి ఏర్పాటు చేశారు. బలవంతంగా పుచ్చుకున్న వాగ్దానం, వాగ్దానమని అనిపించుకోదని నేనన్నదీ శాస్త్ర సమ్మతమే అవుతుంది. అలసిపోయిన ఎద్దుకు ఒక గుప్పెడు గడ్డి వేసినంత మాత్రాన నీవా వాగ్దానోల్లంఘునకు ప్రాయశ్చితంగా సరిపోతుంది. మన శత్రువుల్ని వెంటనే చంపుతానని నిశ్చయానికి రావాలి. క్షత్రియుడకి అంతకుమించిన ఖర్మే లేదు" అని వాదించాడు భీముడు.

తన అభిప్రాయం చెప్పడంలో భీముడు ఎప్పుడూ వెనుకాడడు. ద్రౌపది కూడా దుర్యోధన, కర్ణ, దుశ్శాసనుడితో తాను పడిన భంగపాటును మళ్లీ గుర్తు చేసింది. శాస్త్ర, పురాణాల్లోని అంశాలు చదువుతూ.. యుధిష్టరుడి ఆలోచనల్లోకి నెట్టి ఆందోళన కల్గిస్తోంది. ఒక్కొక్కప్పుడు యుధిష్టరుడు పాతబడిన రాజకీయ సూత్రాలను ఉదహరిస్తూ.. కౌరవ పాండవ బలాబలాలను వర్ణిస్తుండేవాడు. "మన శత్రువుల పక్షాన భూరిశ్రీవసుడు, భీష్ముడు, ద్రోణుడు, అశ్వద్ధామ, దుర్యోధనుడు, అతని అన్నదమ్ములు యుద్ధంలో ఆరితేరినవారు. చిన్న వలస రాజ్యాల రాజులు, పెద్ద రాజ్యాధిపతులు కూడా కౌరవుల పక్షాన ఉన్నారు. భీష్మ, ద్రోణులకు దుర్యోధనుడి గుణాలు ఇష్టం లేకపోయినా అతణ్ణి విడువరు. యుద్ధభూమిలో కౌరవుల కోసం ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా ఉన్నారు. కర్ణుడు ధైర్యవంతుడేకాదు. యుద్ధంలో మంచి నిపుణుడు కూడా. అన్ని

ఆయుధాల ఉపయోగం తెలిసినవాడు. యుద్ధం జరిగితే ఎలా పరిణమిస్తుందో చెప్పలేము. మనకే జయం లభిస్తుందని నిశ్చయంగా చెప్పలేము. తొందరపడటం వల్ల ప్రయోజనం లేదు" అంటూ యుధిష్టరుడు తన తమ్ముళ్ల పౌరుషాన్ని, ఉద్వేగాన్ని అణగదొక్కుతున్నాడు.

మరికొంతకాలమైన తరువాత వ్యాసుడి సెలవు ప్రకారం అర్జునుడు దేవతల నుంచి దివ్యాస్త్ర సంపాదనకు హిమాలయాలకు ఘోర తపస్సు చేయడానికి ప్రయాణమయ్యాడు. అర్జునుడు తన అన్నదమ్ముల వద్ద అనుమతి తీసుకొని పాంచాలికి వీడ్కోలు ఇవ్వడానికి ఆమె వద్దకు వెళ్లాడు. "ఓ ధనుంజయా, నీవు చేసే ప్రయత్నాల్లో తప్పక జయిస్తావు. నీవు జన్మించినప్పుడు కుంతీదేవి నిన్ను గురించి కోరిన కోరికలు, ఆశలు అన్నీ సఫలం అవుతాయి. మా అందరి సౌఖ్యం, జీవితం, గౌరవం, ఘనత అన్నీ నీపై ఆధారపడి ఉన్నాయి. కొత్త అస్త్ర, శస్త్రాలు పొంది తిరిగి రా" అంటూ ద్రౌపది మంగళవాక్యాలు పలికి అర్జునుడికి వీడ్కోలు పలికింది. ఈ వాక్యాలు తన భార్య ద్రౌపదివి అయినా.. ఆశీర్వచనాలు కుంతీదేవివే అని భావించాడు అర్జునుడు.

అర్జునుడు ఘోరారణ్యాలు దాటి ఇంద్రాలిక పర్వతాన్ని చేరాడు. అక్కడ ఓ బ్రాహ్మణుణ్ణి కలిశాడు. ఆ ముని నవ్వి అర్జునుడితో ప్రేమగా మాట్లాడాడు. "బిడ్డా నీవు కవచం ధరించి ఆయుధాలతో ఉన్నావు. ఎవరు నీవు?. ఇక్కడ ఆయుధాలు ఉపయోగపడవు. ఈ క్షత్రియోచిత పరికరాల్ని, కోపాన్ని, ఆశల్ని వదిలేసిన తపోధనులతో నిండిన ఈ అడవిలో నువ్వేమి చేస్తావు?." అని బ్రాహ్మణ ముని రూపంలోని ఇంద్రుడు.. అర్జునుణ్ణి ప్రశ్నించాడు. ఇంద్రుడు తన కుమారుడైన అర్జునుణ్ణి చూసి ఆనందించడానికి వచ్చాడు. అర్జునుడు తండ్రికి నమస్కరించి ఇలా పలికాడు. "ఓ దేవరాజా, నాకు ఆయుధాలు కావాలి. వాటిని ప్రసాదించండి" అన్నాడు. "ఆయుధాల వల్ల ప్రయోజనమేంటి?. ఆనందకరమైనవాటిని కోరుకో" అన్నాడు ముని రూపంలోని ఇంద్రుడు. "ఓ దేవరాజా, నాకు ఊర్ధ్వలోక సౌఖ్యానందాలు అక్కరలేదు. పాంచాలిని, నా అన్నదమ్ములను అడవుల్లో వదిలి ఇక్కడికి వచ్చాను. నాకు ఆయుధాలే కావాలి" అన్నాడు అర్జునుడు. "నీవు త్రినేత్రుడైన శివుని సాన్నిధ్యాన్ని పొంది ఆయన దయకు పాత్రుడవైతే, నీకు దివ్యాస్త్రాలు చేరతాయి. కనుక శివుణ్ణి గురించి తపస్సు చెయ్యి" అని చెప్పి ముని రూపంలోని ఇంద్రుడు అదృశ్యమయ్యాడు. అర్జునుడు హిమాలయానికి వెళ్లి శివుని కరుణ కోసం తపస్సు చేశాడు. శివుడు ఒక బోయవాడి వేషం, పార్వతి అతడి భార్య వేషంలో ఓ జంతువును వేటాడుతూ అడవిలో ప్రవేశించారు. వేట తీవ్ర రూపం దాల్చింది. ఆ సమయంలోనే అర్జునుడితో ఒక

అడవి పంది తలపడింది. అర్జునుడు తన గాండీవంతో ఒక బాణాన్ని పందికి వేశాడు. ఆ క్షణంలోనే వేటగాని రూపంలో ఉన్న శివుడు విడిచిన బాణం పందికి గుచ్చుకొంది. అర్జునుడు పెద్ద గొంతుతో "ఎవరు నీవు. ఈ అడవిలో భార్యతోకూడా ఎందుకు సంచరిస్తున్నావు?. నేను గురిచూసిన జంతువుకు నీవు బాణం వేయడానికి ఎలా సాహసించావు" అని అర్జునుడు ప్రశ్నించాడు. వేటగాడి రూపంలో ఉన్న శివుడు.. "వేటకు ఉపయోగపడే జంతువులతో నిండి ఉన్న ఈ అడవి మాది. మేము ఇక్కడే నివసించేవాళ్లం. నిన్ను చూడగా నీవు ఆరితేరిన వేటగాడిలా కనపడవు. నీ అవయవ సౌష్టం, నీ గమనం చూస్తే సౌఖ్య జీవనం గడిపేవాడి వలే కనిపిస్తున్నావు. నీవీ అరణ్యంలో ఏమి చేస్తున్నావు అనే ప్రశ్న నేను అడగాలి" అన్నాడు ముని రూపంలోని పరమ శివుడు. "తాను వేసిన బాణమే పందిని చంపిందని, దీనికి వ్యతిరేకంగా అర్జునుడు తలిస్తే, ఆ విషయంలో పోరాడటానికి తనకు అభ్యంతరం లేదని వేటగాడు అన్నాడు. ఇంతకంటే ఆనందమైన కోరిక అర్జునుడికి ఇంకేమి ఉంటుంది?. వెంటనే అర్జునుడు గెంతుతూ శివునిపై పాముల వంటి బాణ వర్షం కురిపించాడు. కానీ ఆ బాణాలు వేటగాడి (శివుడి)పై పనిచేయలేదు. దీనికి అర్జునుడు ఆశ్చర్యపోయాడు. అర్జునుడి అమ్ముల పొదిలో మరో బాణం లేదు. దీంతో తన చాపంతో వేటగాణ్ణి కొట్టాడు. వేటగాడు ఈ దెబ్బలు లక్ష్య పెట్టలేదు. సునాయాసంగా అర్జునుడి చేతిలోని చాపాన్ని లాక్కొని బిగ్గరగా నవ్వసాగాడు వేటగాడు. అర్జునుడు ఒక సామాన్య వేటగాడి చేతిలో సునాయాసంగా నిరాయుధుడు కావడంతో సిగ్గుపడి, ఆశ్యర్యం, అనుమానం చెందుతూ, తన ధైర్యాన్ని వీడక కత్తి చేతబట్టి యుద్ధం చేస్తూనే ఉన్నాడు. కత్తి ఆ వేటగాడి ఉక్కు వంటి శరీరానికి తగిలి అది ముక్కలైంది. చేసేదేమీ లేక అర్జునుడు వేటగాడి (శివుడి)తో బాహాబాహి కుస్తీ పట్టాడు. ఇందులోనూ అర్జునుడు ఓడిపోయాడు. వేటగాడి బాహువుల్లో చిక్కి శక్తిలేనివాడయ్యాడు.

వేటగాడి చేతిలో ఓడిపోయి అర్జునుడు భగవంతుని సాయం కోరుతున్నాడు. శివుణ్ణి ప్రార్థిస్తున్నాడు. ఆ సమయంలో ఒక ఊహ ఆయన మదిలో మెదిలింది. కచ్చితంగా ఈ వేటగాడు శివుడే అవుతాడని గ్రహించాడు. అర్జునుడు.. శివుని పాదాలపై పడి, పశ్చాతప్తుడై, గద్గద స్వరంతో తనను క్షమించాలని ప్రార్థించాడు. శివుడు నవ్వుతూ.. 'రక్షించాను' అని అర్జునుడి గాండీవాన్ని, అమ్ముల పొది నుంచి మాయమైన బాణాలను ఇచ్చాడు. గొప్ప ప్రభావంగల పాశుపతాస్త్రాన్ని కూడా ఇచ్చాడు. శివుడి వంటి భగవంతుడితో జగడం సందర్భంగా అయిన గాయాలు శివుడి స్పర్శతో మళ్లీ స్వస్థత చెందాయి. ఇదివరకటి కంటే అర్జునుడు ఇప్పుడు నూరు రెట్లు హెచ్చు బలంతోనూ,

తేజస్సుతోనూ కనిపిస్తున్నాడు. "స్వర్గానికి వెళ్లి నీ తండ్రి ఇంద్రుణ్ణి పూజించు" అని చెప్పి ఈశ్వరుడు సూర్యాస్తమయమైనట్లు అదృశ్యమయ్యాడు. అర్జునుడు ఆనందాతిశయంతో ఇలా అన్నాడు. "నేను నిశ్చయంగా శివుణ్ణి ముఖాముఖి చూశానా?. ఆ మహనీయుడితో స్పృశించబడ్డానా?. నాకింకేమి కావాలి" అనుకున్నాడు అర్జునుడు.

ఆ సమయంలో ఇంద్ర రథ సారధి మాతలి రథంలో వచ్చి అర్జునుణ్ణి దేవలోకం తీసుకువెళ్లాడు.



సింహాసనంపై మహారాజు
యుధిష్టరుడు, ద్రౌపది
చుట్టూ పాండవులు

## అధ్యాయం - 29

# కష్టాలూ, దుఃఖమూ కొత్తకాదు

**బ**లరాముడూ, కృష్ణుడూ తమ పరివారంతో అరణ్యంలో ఉన్న పాండవుల పర్ణశాలకు వెళ్లారు. అక్కడి పరిస్థితులు చూశాక బలరాముడికి విచారం కలిగింది. "ఈ ప్రపంచంలో సన్మార్గానికి వ్యతిరేక ఫలితం కనపడుతోంది. దుర్మార్గుడైన దుర్యోధనుడు సకల ఐశ్వర్యాలతో పట్టు వస్త్రాలను, బంగారు ఆభరణాలను ధరించి రాజ్యమేలుతుంటే.. సన్మార్గుడైన యుధిష్టరుడు చెట్ల బెరళ్లు వస్త్రాలుగా ధరించి అడవుల్లో నివసిస్తున్నాడు. ఇలాంటి పరిస్థితిని చూసే ప్రజలు భగవంతునిపై భక్తిని పోగొట్టుకున్నారు. వాస్తవంగా చూస్తే సన్మార్గాన్ని శాస్త్రంగా శ్లాఘించడం ఉత్త వేళాకోళంగా ఉంది. ధృతరాష్ట్రుడు యమునికి ఎదురైనప్పుడు తాను చేసిన ఘాతుకం న్యాయమైందని ఎలా తనను కాపాడుకుంటాడు. యజ్ఞాగ్నిహోత్రంలో జన్మించిన ద్రౌపది సహా ఏ దోషమూ ఎరుగని పాండవులు ఇలా అరణ్యంలో నివసించడం చూసి కొండలూ, భూమీ కూడా దుఃఖిస్తున్నాయి." అన్నాడు కృష్ణుడుతో బలరాముడు.

వీరివద్దనే ఉన్న సాత్యకి అందుకొని.. "ఓ బలరామా! ఇది విచారపడే సమయం కాదు. పాండవులకు మనమేదైనా చేయగలమేమో ఆలోచించండి. నీవు, కృష్ణుడు, ఇతర బంధువులు బతికి ఉండగా.. పాండవులు ఇలా అరణ్యాల్లో కాలం వృథా చేయాలా?. మన సైన్యాలను ఆయుత్తపరిచి దుర్యోధనుణ్ణి ఎదుర్కోవాలి. కౌరవులను రూపుమాపగలిగిన శక్తి మనకుంది. కృష్ణుడు ఈ పని తేలికగా చేయగల సమర్థుడు. గొప్ప విలుకాణ్ణని డంబాలు పలికే కర్ణుణ్ణి జయించి అతణ్ణి చంపాలని నాకు కోరికగా ఉంది. యుద్ధంలో దుర్యోధనుణ్ణి, వారి పరివారాన్ని చంపి రాజ్యాన్ని వశ పరుచుకోవాలి. ప్రతిజ్ఞ చేసి మాట నిలుపుకుందాం. అడవుల్లోనే ఉంటామని పాండవులు అంటే అభిమన్యుణ్ణి ఇచ్చివేద్దాం. ఈ ప్రకారం చేయడం వారికి మంచిది. మన పౌరుషానికీ తగినట్లు ఉంటుంది.

సాత్యకి మాటలు జాగ్రత్తగా విన్న కృష్ణుడు.. "నీవు చెప్పింది వాస్తవం. కానీ పాండవులు ఇతరుల ద్వారా జయించిన రాజ్యాన్ని తీసుకోరు. వారు స్వయంగా జయిస్తేనే తీసుకుంటారు. అదీగాక.. పౌరుష వంశ జాతి మణి ద్రౌపది ఈ సలహాను ఏమాత్రం అంగీకరించదు. యుధిష్టరుడికి ప్రేమతో చెప్పినా, భయపెట్టినా తన ధర్మాన్ని వీడడు. పాండవులు అరణ్య, అజ్ఞాతవాస జీవితాలు పూర్తయిన తరువాత పాంచాల, కేకయి, బేది రాజులను, మనం, మన సైన్యాన్ని ఏకం చేసి శత్రువులను జయించి పాండవులకు సాయం చేద్దాం" అన్నాడు. ఈ మాటలు విన్న యుధిష్టరుడు ఎంతో సంతోషించాడు. "శ్రీకృష్ణుడికి నా మనసు తెలుసు. సత్యం, అధికారం, సంపద కంటే గొప్పది. కనుక రాజ్యం కంటే వాటినే ఎన్ని కష్టాలైనా ఎదుర్కొని కాపాడాలి. అతడెప్పుడు యుద్ధం చేయమంటే అప్పుడే అందుకు సిద్ధంగా ఉంటాము. సకాలంలో మనందరం తప్పకుండా కలుద్దాము. వృష్ణి వీరలంతా వారి స్థానాలకు వెళ్లొచ్చు" అన్నాడు యుధిష్టరుడు. అలా అందరికీ వీడ్కోలు పలికాడు.

అర్జునుడింకా హిమాలయ ప్రాంతాల్లోనే ఉండటం వల్ల భీముడు ఎంతో ఆందోళన చెందుతున్నాడు. తొందరపాటును భరించలేకపోతున్నాడు.

భీముడు.. యుధిష్టరుడితో.. "మనందరి ప్రాణాలు అర్జునుడిపై ఆధారపడి ఉన్నాయనే విషయం నీకు తెలుసు. అతడు హిమాలయాలకు వెళ్లి చాలా కాలం అయింది. అతడి విషయమై వార్తలేమీ మనకు తెలియదు. అతడు లేకపోతే పాంచాల రాజుగాని, సాత్యకిగానీ, కృష్ణుడుగానీ ఎవరూ మనల్ని రక్షించలేరు. ముఖ్యంగా అర్జునుడు లేకపోతే నేను జీవించలేను. ఇదంతా ఆ పిచ్చి ద్యూతపు ఆట వల్లే కలిగింది. మన విషాదం, కష్టాలు, శత్రు వృద్ధి అన్నీ ఆ కారణం వల్లనే. అడవుల్లో నివసించాలని క్షత్రియుడి కర్తవ్యమని ఎక్కడా చెప్పలేదు. మనం వెంటనే అర్జునుణ్ణి పిలిపించి కృష్ణుడి

సహాయంతో ధృతరాష్ట్ర కుమారులతో యుద్ధం చేయాలి. దుర్మార్గులైన శకుని, కర్ణుడు, దుర్యోధనుడు చస్తే నాకు సంతోషం కలుగుతుంది. ఈ పరిశుద్ధమైన కృత్యం జరిపాక, నీకు ఇష్టమైతే, మళ్లీ అడవులకు వచ్చి తపస్సు చెయ్యి. మనలను మాయ చేసి వంచించిన శత్రువును మనం కూడా మాయ చేసి చంపితే ఏ పాపమూ ఉండదు. అధర్వణ వేదంలో కాల పరిమితిని తగ్గించి సూక్ష్మీకరించగల మహామంత్రాలున్నాయని నేను విన్నాను. అలాంటి మంత్ర సహాయంతో పదమూడు సంవత్సరాలను పదమూడు రోజులకు తగిస్తే అది న్యాయమే. అప్పుడు పధ్నాలుగో రోజున దుర్యోధనుణ్ణి చంపడానికి నాకు నీ అనుజ్ఞ ఇవ్వు" అన్నాడు. యుధిష్ఠరుడు ఈ మాటలు విని భీముణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. భీముడి తొందరపాటును తగ్గించే ప్రయత్నం చేశాడు. "ప్రియ సోదరా, పదమూడేళ్ల కాలం పూర్తయిన వెంటనే గాంఢీవం ధరించి వీరార్జునుడూ, నీవూ దుర్యోధనుడుతో కయ్యానికి దిగి అతణ్ణి చంపుతారు. అంతవరకూ ఓపిక పట్టు. పాపపంకిలంలో దిగిన దుర్యోధనుడు అతని పరివారం ఎక్కడికీ పారిపోలేరు. ఇది నిజం. నమ్ము" అన్నాడు యుధిష్ఠరుడు.

విచారగ్రస్తులైన పాండవులు ఈ విధంగా వాదప్రతివాదాలు చేసుకుంటూ ఉండగా.. మహర్షి బృహదశ్వుడు పాండవాశ్రమానికి వచ్చాడు. ఆ రుషీశ్వరుణ్ణి యధావిధిగా ఆహ్వానించి పూజించారు. కొంతసేపయిన తరువాత రుషితో యుధిష్ఠరుడు.. "రుషోత్తమా! దగాకోరులైన మా శత్రువులు ద్యూతంలోకి మమ్మల్ని లాగి మా రాజ్యాన్ని, సంపత్తిని, దగా చేసి తీసుకొని, వీరులైన నా తమ్ముళ్లను పాంచాలిని, నన్ను కూడా అడవులకు తరిమారు. అర్జునుడు దివ్యాస్త్ర సంపాదనకు వెళ్లి చాలా కాలమైంది. ఇంకా రాలేదు. అతడు మాతో లేకపోవడంతో మాకు చాలా విచారంగా ఉంది. అతడు దివ్యాస్త్రం పొంది వస్తాడా?, ఎప్పుడొస్తాడు?, నిశ్చయంగా నేను అనుభవిస్తున్న విషాదాన్ని మీరెవరూ అనుభవించకూడదు" అన్నాడు.

దానికి రుషి బృహదశ్వుడు సమాధానమిస్తూ .. "యుధిష్ఠరా.. నీవు ఎప్పుడూ విచారంలో మునిగిపోవద్దు. అర్జునుడు దివ్యాస్త్రాన్ని సంపాదించి వస్తాడు. తరుణం వచ్చినప్పుడు నీవు శత్రువులను తప్పక జయించగలవు. నీ మాదిరిగా విషాదంలో ఉన్నవారు ఈ ప్రపంచంలోనే లేరు అంటున్నావు. అదలా కాదు. కంటితో చూసి, చెవితో విన్నదానికంటే మనసును తాకితే దాని తీవ్రత అధికంగా ఉంటుంది. దుఃఖంతో నీరసించిన ప్రతివాడూ విషాదంలో మునిగానని అంటాడు. నిషాధాధిపతి అయిన నలచక్రవర్తి గురించి విన్నావా?. అతడు అడవిలో ఉండి నీకంటే ఎక్కువగా విషాదాన్ని అనుభవించాడు. ద్యూతంలో అతణ్ణి పుష్కరుడు వంచించాడు. తన రాజ్యాన్ని, ఐశ్వర్యాన్ని కోల్పోయి అడవులకు పోవలసి వచ్చింది. నీకంటే అతడు దురదృష్టవంతుడు. అతడు

నీలా అన్నదమ్ములతోనూ, బ్రాహ్మణులతోనూ కలిసి అడవిలో ఉండలేదు. "కలి" పురుషుడు (కలియుగ కాలానికి అధిపతి) ప్రాబల్యంతో నలుడి బుద్ధి, మంచి చెడ్డల తారతమ్యాన్ని పోగొట్టుకున్నాడు. తానేమి చేస్తున్నాడో తెలియక తనను అనుసరించిన భార్యను అడవుల్లో విడిచిపెట్టి తానొక్కడూ పిచ్చెక్కినవాడిలా అడవుల్లో తిరుగుతున్నాడు. ఇప్పటి నీ అవస్థకూ, అప్పటి నలుడి అవస్థకూ తారతమ్యం చూడు. వీరులైన తమ్ములు, ప్రేయసి అయిన భార్య సమక్షంలో నీవున్నావు. అదీగాక నీ కష్టదశలో, జ్ఞానులైన బ్రాహ్మణుల ఉపదేశాలతో కష్టాలను ఓర్చుకునే శక్తివంతుడవుతున్నావు. నీ విజ్ఞానం చెదరలేదు. తాను బాధపడుతున్నానని అనుకోవడం సహజం. కానీ నిజంగా నీఅంత విషాదంలో లేవు. ఓ పాండవులారా, మీరనుభవించే దుఃఖానికంటే చాలా హృదయ విదారకమైన దుఃఖంతో రాచి రంపాన పెట్టినా, వాటిన్నిటినీ భరించి చివరికి వాటిని జయించి నలుడు జీవితాంతం వరకూ సౌఖ్యంగా ఉన్నాడు. మీ అందరికీ నిష్కలంకమైన జ్ఞానముంది. మీకు ప్రేమాస్పదులైన వారి సహవాసం ఉంది. చాలా కాలం మీరు ధర్మశాస్త్ర చర్చల్లోనూ, వేదవేదాంగ పారంగతులైన బ్రాహ్మణులతోనూ, పవిత్ర సంభాషణలతోనూ కాలాన్ని గడుపుతుంటారు. కనుక మీకు సంభవించిన కష్టాలు ధైర్యంతో స్వీకరించండి. కష్టాలనేవి మనుషులకు రాక తప్పదు. అందుకే మీకు వచ్చినవి వింతకాదు" ఈ ప్రకారం బృహదశ్వుడు నలోపాఖ్యానాన్ని తాప ఉపశమనంగా చెప్పాడు. నలోపాఖ్యానం మహాభారతంలో ఇరవై అధ్యాయాలు కలిగి ఉంది.

◈



సముద్రాన్ని తాగుతున్న
మహర్షి అగస్త్యుడు

## అధ్యాయం - 30

# అగస్త్యుడు

**ఇం**ద్రప్రస్థపురంలో యుధిష్ఠరుడితో ఉండే బ్రాహ్మణులు ఆయనతో అడవుల వెంటపడ్డారు. అడవుల్లో అంతమందిని పోషించడం కష్టంగా ఉంది. అర్జునుడు పాశుపతాస్త్రం కోసం వెళ్ళిన కొన్నాళ్ళకు లోమశుడను ఒక బ్రహ్మర్షి అడవుల్లో పాండవుల ఆశ్రమానికి వచ్చాడు. ఆయన ఓ రోజు యుధిష్ఠరుడితో ఇలా అన్నాడు. "నీవు తీర్థయాత్రలకు వెళ్లకముందు నీ పరివారాన్ని కొంత తగ్గించుకో. ఇంతమందిని వెంటపెట్టుకొని ప్రతి స్థలానికీ వెళ్లడం కష్టమవుతుంది. యుధిష్ఠరుడు కూడా ఈ కష్టంపై ఇదివరకటి నుంచే ఆలోచనలో ఉన్నాడు. ఇప్పుడతడు తన పరివారంలో కష్టాలు భరించలేనివారూ, వేళ తప్పిన ఆహారానికి అలవాటు పడనివారూ, పాండవుల పట్ల ఉన్న ప్రేమా గౌరవంతో వాళ్ల వెంట వచ్చినవారూ, ధృతరాష్ట్రుడి వద్దకుగానీ, పాంచాల రాజైన ద్రుపదుడి వద్దకుగాని, వారి ఇష్టాలను అనుసరించి వెళ్లిపోవచ్చని ప్రార్థించాడు. తర్వాత బాగా తగ్గిన పరివారంతో పుణ్యతీర్థాలు సేవిస్తూ తీర్థయాత్రలు

చేస్తూ ఒక్కో క్షేత్రం గురించి కథలు వింటూ వెళ్తున్నారు. అలా విన్న కథల్లో అగస్త్యుడి కథ ఒకటి.

అగస్త్యుడు ఒకనాడు తలకిందకు, కాళ్లుపైకి ఉండి వేలాడుతున్న మునులను చూసి, వారెవరో, ఎందుకు అలాంటి స్థితిలో ఉన్నారో వారిని ప్రశ్నించాడు. అందుకు వారు ఇలా అన్నారు. "బిడ్డా మేము నీ తండ్రులం. నీవు వివాహమాడి సంతానాన్ని కని, మీ పితృ రుణం తీర్చనప్పుడు నీ తరువాత ఉదకాలుండవు. కావున నిన్ను ఎలాగైనా ప్రోత్సహించి, మాకు ఉదక ప్రదానం ఉండేటట్లు చేయడానికి ఈ ప్రకారం తపస్సు చేస్తున్నాం" అన్నారు. అగస్త్యుడీ వాక్యాలు విని.. వివాహం చేసుకునేందుకు నిశ్చయించాడు. విదర్భ దేశ రాజుకు సంతానం లేక విచారంతో కుంగిపోతూ అగస్త్యుని ఆశీర్వచనాన్ని కోరడానికి ఆయన వద్దకు వెళ్లాడు. అగస్త్యుడు రాజును ఆశీర్వదిస్తూ రాజుకు ఒక కుమార్తె కలుగుతుందని, ఆమెను తనకు ఇచ్చి వివాహం చేయాలని నిర్ణయం చేశాడు. కొద్దికాలంలోనే విదర్భ రాణి ఒక ఆడ శిశువును కన్నది. ఆ పిల్లకు 'లోపాముద్ర' అని పేరు పెట్టారు. పాప వయసు పెరుగుతోంది. రోజురోజుకూ అందం ఇనుమడిస్తోంది. కొద్దికాలంలోనే జగదేక సుందరి అని క్షత్రియుల్లో పేరు పొందింది. ఆమెను ప్రేమిస్తే అగస్త్యుని ఆగ్రహానికి గురవుతామని ఆమెను ప్రేమించేందుకు ఎవరూ జోక్యం చేసుకోలేదు.

కొంతకాలానికి అగస్త్యరుషి విదర్భకు వచ్చి తనకు భార్య కావాలని రాజ కుమార్తెను కోరాడు. అతి గారాబంతో పెంచిన రాజకుమారిని ఈ పురాతనుడైన, అడవుల్లో నివసిస్తున్న రుషికి ఇచ్చి వివాహం చేయడానికి ఇష్టపడలేదు. పిల్లను ఇవ్వబోనని చెపితే రుషి ఆగ్రహానికి గురవుతానని భయపడుతూ రాజు దుఃఖంలో మునిగాడు. లోపాముద్ర కూడా తన తండ్రి విచారానికి కారణాన్ని గ్రహించి.. తాను రుషిని వివాహమాడటానికి సిద్ధంగా ఉన్నానని చెప్పింది. రాజుకు విచార భారం పోయింది. తరువాత అగస్త్యుడికీ, లోపాముద్రకూ వివాహం జరిగింది. తనతో వచ్చేటప్పుడు విలువైన దుస్తులు, అలంకారాలను విడిచిపెట్టాలని రుషి కోరాడు. తన విలువైన దుస్తులను, అలంకారాలను తన పరిచారికలకు ఇచ్చి చెట్టు బెరడే వస్త్రంగా ధరించి ఎంతో ఆనందంతో భర్త వెంట వెళ్లింది రాకుమారి.

అగస్త్యుడు, లోపాముద్ర గంగా ద్వారంలో తపస్సులో ఉన్నప్పుడు.. వారి ఇద్దరి నడుమ గాఢ ప్రేమ అంకురించింది. భార్యాభర్తల్లా మెలుగుతూ, ఆనందించడానికి అడవిలోని ఆ పర్ణశాలలో ప్రత్యేక సదుపాయం లేదు. ఆమెకు ఉత్సాహం చాలక, సిగ్గు దొంతరలతో నెమ్మదిగా భర్తతో తన మనసులో ఉన్న విషయం చెప్పింది. "రాజోచితమైన తల్పం, తాను తండ్రి ఇంట ఉన్నప్పుడు ధరించిన వస్త్రాలు,

అలంకారాలు వినియోగించినప్పుడే మన ఇష్టానుసారంగా, హృదయానందంగా కాలం గడుపుతాము" అని అంది లోపాముద్ర. దీంతో అగస్త్యుడు.. "నీవు కోరినవి ఏర్పాటు చేయడానికి నా వద్ద అంత ధనము లేదు. అవసరమైన పరికరాలు, సదుపాయాలు లేవు. మనం అడవిలో నివసించే భిక్షకులం కదా" అన్నాడు. లోపాముద్రకు తన భర్త తపశ్శక్తి ఎలాంటిదో తెలుసు. ఆమె.. "ప్రభూ, తపశ్శక్తిలో నీవు అసమాన్య ప్రభావం కలవాడివి. నీవు కోరితే ప్రపంచంలోని ఐశ్వర్యమంతా పొందగల శక్తి సంపన్నుడవు." అన్నది. ఆమె చెప్పింది యదార్థమేనని అగస్త్యుడు ఒప్పుకొన్నాడు. తన తపశ్శక్తి ఇలాంటి ధనమనే స్వల్ప అంశానికి వినియోగిస్తే. తన శక్తి అంతా త్వరలో నశించిపోతుందని భార్యతో అన్నాడు. "అలా అయితే నేను వాటి గురించి మిమ్మల్ని కోరను. కానీ సామాన్య మార్గంలోనే మనం ఆనందంగా జీవించడానికి సరిపడా ధనార్జన చేయండి మరి" అన్నది లోపాముద్ర. దీనికి అగస్త్యుడు అంగీకరించాడు. బ్రాహ్మణ వేషంలో అనేకమంది రాజుల వద్దకు యాచనకు వెళ్లాడు. మంచి ధనవంతుడనే పేరున్న ఓ రాజు వద్దకు వెళ్లాడు. ఆ రాజుతో.. నేను ధనం కోసం వచ్చాను. నేను కోరే ద్రవ్యం ఇతరులకు నష్టం, హాని కలగకుండా ఇవ్వు" అని కోరాడు అగస్త్యుడు. ఆ రాజు తన రాజ్యపు ఆదాయ, వ్యయాలను రుషికి విపులంగా చెప్పాడు. అందులో నీకు ఏది తగినదో అది తీసుకోవచ్చని అగస్త్యుడికి చెప్పాడు. ఆ లెక్కల్నిబట్టి ద్రవ్యం ఏదీ మిగల్లేదని తెలుసుకున్నాడు అగస్త్యుడు. రాజ్యం ఖర్చు దాదాపు ఆదాయానికి సమానంగా ఉంటుంది. ఈ ప్రకారమే పురాతన కాలంలో కూడా ఉండేదని అర్థమవుతోంది. "మీ వద్ద ఏమి తీసుకున్నా అది రాజ్య ప్రజలకు కష్టమవుతుంది కనుక మరోచోటకు వెళ్తాను" అని సెలవు తీసుకోబోయాడు అగస్త్యుడు. ఆ రాజు కూడా అగస్త్యుడితో వస్తానని చెప్పాడు. ఆ ఇద్దరూ కలిసి మరో రాజు వద్దకు వెళ్లారు. వారికి అక్కడ కూడా అదే పరిస్థితి ఎదురైంది.

అగస్త్యుడు.. దుర్మార్గుడైన రాక్షసుడు ఇల్వలుడి వద్దకు వెళ్లి ధనం కోసం ప్రయత్నించబోయాడు. అతడి తమ్ముడి వాతాపి బ్రాహ్మణులను మిక్కిలి అసహ్యించుకునేవాడు. ఇల్వలుడు, వాతాపి మధ్య బ్రాహ్మణులను చంపడానికి ఒక వింత ఏర్పాటు చేసుకున్నారు. ఇల్వలుడు బహు నమ్రతతో, భక్తితో ఒక బ్రాహ్మణుణ్ణి భోజనానికి ఆహ్వానిస్తాడు. తన ఇంద్రజాలం వల్ల తమ్ముడు వాతాపిని ఒక మేకగా మార్చి దాన్ని ఆహారంగా వండి మాంసాన్ని అతిథి బ్రాహ్మణుడికి పెట్టేవాడు. భోజనం అయిన వెంటనే తన తమ్ముడైన వాతాపిని బయటకు రమ్మని ఇల్వలుడు పిలిచేవాడు. చనిపోయినవారిని బతికించగల విద్య ఇల్వలుడి వద్ద ఉంది. అలా పిలవగానే భోజనం చేసిన బ్రాహ్మణుడి పొట్ట చీల్చుకొని నవ్వుతూ బయటకు వచ్చేవాడు. దీంతో

ఆ బ్రాహ్మణుడు మరణించేవాడు. ఇలా ఇల్వలుడి మాయా జాలానికి ఎందరో బ్రాహ్మణులు చనిపోయారు.

అగస్త్యుడు తన పరిసరాల్లో ఉన్నాడని, అలాంటి పవిత్ర బ్రాహ్మణుడు తన చేతిలో చచ్చి తీరతాడని ఇల్వలుడు పరమానందం చెందాడు. ఆయన్ని ఆహ్వానించి యధావిధిగా విందు ఏర్పాటు చేశాడు. అగస్త్యుడు కడుపారా భోజనం చేశాడు. ఇక ఇల్వలుడు మేక మాంసం ఆహారంగా మారిన వాతాపిని బయటకు రమ్మని పిలవడమే మిగిలిఉంది. యధావిధిగా ఇల్వలుడు తన ఇంద్రజాల మంత్రంతో వాతాపిని బయటకు రమ్మని పిలిచాడు. అగస్త్యుడు నవ్వుతూ తన కడుపు తడుముముతూ "ఓ వాతాపీ, లోక సంరక్షణార్థం నీవు నా ఉదరంలోనే జీర్ణమైపోవుగాక" అని అన్నాడు. ఇది విన్న ఇల్వలుడు భయంతో వాతాపిని పిలిచాడు. కానీ అగస్త్యుడి పొట్టను చీల్చుకొని వాతాపి బయటకు రావడం లేదు. "వాతాపి జీర్ణమయ్యాడు. ఈ ఇంద్రజాలం సర్వదా ఉపయోగించరానిది. ఇప్పటితో దాని పని సరి" అన్నాడు అగస్త్యుడు. రాక్షసుడైన ఇల్వలుడు అగస్త్యుడి పాదాలపై పడి, ఆయన కోరినంత ధనమిచ్చి పంపాడు.

అగస్త్యుడిలా తన భార్య లోపాముద్ర కోరికను నెరవేర్చాడు. అగస్త్యుడు లోపాముద్రను ఓ కోరిక కోరమన్నాడు. పదిమంది సాధారణమైన మంచి కుమారులు కావాలా, అసమాన మేధాశక్తి ఉన్న ధర్మాత్ముడైన ఒకే ఒక కుమారుడు కావాలా" అని అడిగాడు. ఆమె ఒకే ఒక కుమారుణ్ణి కోరుకుంది. అలాంటి కుమారుణ్ణే ఆమెకు జన్మించాడు.

మేరు పర్వతంతో పంతగించి, వింధ్య పర్వతం కూడా బాగా ఎత్తుకు పెరిగి సూర్య చంద్ర గ్రహణాలకు చాలా ఆటంకమైంది. ఈ ప్రమాదాన్ని నివారించలేక దేవతలంతా అగస్త్యుణ్ణి సాయం కోరారు. అగస్త్యుడు వింధ్య పర్వతానికి వెళ్లి "ఓ పర్వత రాజమా, నేను ఉత్తరం నుంచి దక్షిణానికి వెళ్తున్నాను. మరలా దక్షిణం నుంచి ఉత్తరం రావాలి కనుక నీ పెరుగుదల ఆపు. మళ్లీ నేను తిరిగి వచ్చిన తరువాత నీ ఇష్టం వచ్చినట్లు పెరగవచ్చు. అంతవరకూ ఆగు" అన్నాడు.

వింధ్య పర్వతాలు అగస్త్యుడి మాటపై గౌరవముంచి అలాగే చేశాయి. కానీ అగస్త్యుడు దక్షిణం వైపుకు వెళ్లి ఉత్తరం వైపు రాలేదు. అందువల్ల వింధ్య పర్వతాలు ఎదగకుండా అలాగే ఉండిపోయాయి. మహాభారంతో అగస్త్యుడి గురించి చెప్పిన కథ ఇది.

◈

రుష్యశృంగుణ్ణి అంగదేశానికి
ఆకర్షిస్తున్న నాట్యకత్తెలు



**అధ్యాయం - 31**

# రుష్యశృంగుడు

ఇంద్రియ ఆనందంలో ఏమీ ఎరగకుండా ఎవరైనా బాల్యం నుంచి పెరిగితే అతడు నిరంతర బ్రహ్మచర్య వ్రతుడు అవుతాడని అనుకోవడం పొరబాటు. సన్మార్గం కలవాడైనా ఆ సన్మానార్హత ఎల్లకాలం నిలబడదు. దీనికి ఉదాహరణగా ఈ దిగువ కథ రామాయణంలో ఉంది. కానీ కథలో కొన్ని మార్పులున్నాయి.

సృష్టికర్త బ్రహ్మలా ప్రకాశించే 'విభాండకుడు' అనే మహాముని తన కుమారుడగు రుష్యశృంగుడితో అడవుల్లో నివసిస్తున్నాడు. రుష్యశృంగుడు తన తండ్రిని తప్ప ఓ పురుషుణ్ణిగాని, ఓ స్త్రీనిగాని చూసి ఎరుగడు. అసలు ప్రజలనే చూడలేదు. అంగ దేశంలో ఒకసారి భయంకరమైన కరువు వచ్చింది. వర్షాల్లేక పంటలు ఎండిపోయాయి. ఆహారం దొరక్క ఎంతోమంది ప్రజలు మరణించారు. సజీవ జంతుజాలం ఎంతో కష్టదశలో ఉంది. ఆ దేశ రాజు రోమపాదుడు బ్రాహ్మణుల వద్దకు వెళ్లి, తన దేశాన్ని కరువు నుంచి రక్షించే మార్గాన్ని ఉపదేశించాలని వేడుకున్నాడు. దానికి బ్రాహ్మణులు..

"ఓ రాజోత్తమా, రుణ్యశృంగుడనే ఒక రుషి బాలుడున్నాడు. అతడు నిష్కలంక బ్రహ్మచారి. అతన్ని మన రాజ్యానికి ఆహ్వానించండి. తానెక్కడికి వెళ్లినా అతడు తన తపశ్శక్తితో వర్షం, సంపద తన వెంట వచ్చేటట్లు గొప్ప వరం సంపాదించాడు" అని చెప్పారు. విభాండకుని ఆశ్రమం నుంచి రుష్యశృంగుణ్ణి తన రాజ్యానికి తీసుకొచ్చే విధం గురించి రాజు తన మంత్రులతో చర్చించాడు. మంత్రుల ఆలోచన ప్రకారం, రాజు తన పట్టణంలో ఉన్న అందచందాలు, చతరతగల యువతులకు రుష్యశృంగుణ్ణి తీసుకొచ్చే బాధ్యత అప్పగించాడు.

ఆ సుందరీమణులకు ఏమీ తోచలేదు. రాజాజ్ఞ ఉల్లంఘన భయంకరమైంది. అటు రుషి ఆగ్రహానికి గురికాగలమేమోననే భయం. భగవంతుడిపై భారం వేసి తాము చేసే కార్యం దేశంలోని కరువును పోగొట్టి మంచి మార్గానికి తెచ్చే ఘనకార్యమని ఊహించి ఆ వనితలు తమ పనిపై వెళ్లడానికి నిశ్చయించారు. విభాండకుడి ఆశ్రమానికి బయలుదేరే లోపు తమ కార్యసాధనకు కావలసిన ఉపకరణాలన్నీ సిద్ధం చేసుకున్నారు.

ఆ వనితల నాయకురాలు ఓ పెద్ద పడవను అలంకరించింది. పడవనంతా ఫలవృక్షాలు, తీగెలు, పువ్వులు ఉండేలా ఏర్పాటు చేసింది. ఆ తోట మధ్య ఓ కృత్రిమ ఆశ్రమాన్ని కూడా తయారు చేయించింది. నంది చెంత ఉన్న విభాండకుడి ఆశ్రమానికి సమీపంగా పడవను నిలిపారు. వనితలు అందరూ భయంతో, ఆందోళనతో రుష్యాశ్రమం దర్శించారు. వారి అదృష్టం కొద్దీ విభాండకుడు ఆ సమయంలో ఆశ్రమంలో లేడు. ఇదే మంచి తరుణం అని భావించి, ఒక సుందరి రుష్యశృంగుడి వద్దకు వెళ్లింది. ఆమె రుష్యశృంగుడితో.. రుషోత్తమా, నీవు క్షేమమా?. కావలసినన్ని దుంపలు, పండ్లు మీకు దొరుకుతున్నాయా?, ఈ అడవిలో రుషుల తపస్సులు సక్రమంగా నెరవేరుతున్నాయా?. నీ తండ్రి కీర్తి ఇంకా వృద్ధి అవుతోందా?. నీవు వేద పఠనం చేస్తున్నావా?" అని అడిగింది.

పూర్వం ఈ విధంగానే యోగక్షేమాలు అడిగేవారు. మంచి యవ్వనంలో ఉన్న ఆ మునీశ్వరుడు ఆమె అంత మాటల మాధుర్యం ఇదివరకెన్నడూ వినలేదు. ఇలాంటి సుందర స్వరూప మనుష్య రూపమే చూడలేదు. "నీవు ఎంతో ప్రకాశవంతంగా, బ్రహ్మచారిణిలా ఉన్నావు. నీవెవరు? నీకు వందనం. నీ ఆశ్రమం ఎక్కడుంది?. మీరు అనుసరించే తపస్సేమిటి? అని ప్రశ్నించాడు రుష్యశృంగుడు.

"ఇక్కణ్ణుంచి మూడు యోజనాల దూరంలో మా ఆశ్రమం ఉంది. నీ కోసం పండ్లు తెచ్చాను. మీ వందనాలను అందుకోవడానికి నేను తగను. కానీ నీవు చూపిన మర్యాదలకు, సపర్యలకు తిరిగి నేను చేస్తున్నాను" అంటూ ఆమె రుష్యశృంగుణ్ణి కౌగిలించుకుంది. తాను తెచ్చిన మధుర పదార్థాలను అతనికి తినిపించింది. మంచి

సువాసనగల పూలమాలలతో అతణ్ణి అలంకరించింది. అతనికి పానీయాలు ఇచ్చింది. మరలా అతణ్ణి కౌగలించుకొంది. ఇలా చేయడం తాము అనుసరించే మర్యాద అని తెలిపింది. ఆ అభివాద ప్రక్రియ చాలా బావుంది అనిపించింది రుష్యశృంగుడికి.

కొంతసేపయిన తరువాత విభాండకుడు వస్తాడనే భయంతో తనకు నిత్యాగ్నిహోత్రకాలం మించిపోతుందని చెప్పి అతణ్ణి వదిలి మెల్లమెల్లగా బయటకు వచ్చింది.

విభాండకుడు తన ఆశ్రమానికి వచ్చాడు. ఆశ్రమమంతా మాలిన్యంతో, మధుర పదార్థ ముక్కలతో నిండి ఉండటం చూశాడు. ఆశ్రమాన్ని శుభ్రం చేయలేదు. తుప్పలు, డొంకలు, తీగెలు చిందరవందరగా ఉండి అసహ్యంగా ఉంది. తన కుమారుని మొహంలో పూర్వపు తేజస్సు కానరాకపోవడం గమనించాడు. అతడు ఆందోళనతో కలత చెందినట్లు కనిపించాడు. ఆశ్రమంలో చేయాల్సిన మామూలు పనులు చేయలేదు. విభాండకుడు కొంచెం చికాకు చెంది కుమారుణ్ణి ఇలా అడిగాడు. "కుమారా.. అగ్నిహోత్రానికి కావలసిన పవిత్ర సమిధలను తీసుకురాలేదు. అందంగా ఉన్న ఈ మొక్కలను, తుప్పలను ఎవరు విరిచారు?. ఆవు పాలు పితికావా?. నీకు ఉపచారం చేయడానికి ఎవరైనా వచ్చారా?. నీకీ వింత పూలమాల ఎవరిచ్చారు. నీవేమిటి చికాకు చెందినట్లున్నావు" అన్నాడు.

యదార్థవాది, అమాయకుడూ అయిన రుష్యశృంగుడు.. "వింత రూపంగల బ్రహ్మచారి ఇక్కడికి వచ్చాడు. అతని తేజం, అందం, అతడి వాక్ మాధుర్యం నేను వర్ణించలేను. నా మనసంతా అతడి మాటలు వినడం వల్ల, అతని కళ్ల వైపు చూడటం వల్ల వర్ణింపరాని ఆనందం కలిగింది. తన ఆచారం ప్రకారం వందనం చేస్తున్నానని నన్ను కౌగలించుకున్నప్పుడు ఇదివరకెన్నడూ అనుభవించని ఆనందాన్ని అనుభవించాను. అంత ఆనందాన్ని నేను మధురమైన పండ్లను తిన్నప్పుడు కూడా అనుభవించలేదు" అంటూ ఆ బ్రహ్మచారి రూపు రేఖలు, లావణ్యం, చర్యలను వర్ణించి చెప్పాడు. రుష్యశృంగుడు ఇంకా.."ఆ బ్రహ్మచారి సాహవాసం కోసం నా శరీరం తపిస్తోంది. నేను వెళ్లి అతన్ని ఎలాగైనా ఇక్కడికి తీసుకు రావాలనిపిస్తోంది. వానిని చూడటానికి నా హృదయం తల్లడిల్లుతోంది" అన్నాడు. ఏమి జరిగిందో విభాండకుడికి అర్థమైంది. "బాలకా, నీవు చూసింది బ్రహ్మచారిని కాదు. అది ఒక రాక్షసి. సాధారణంగా రాక్షసులు మనలను ఎలాగైనా వంచించి మన తపహోమాదులకు భంగం కలిగించడమే వారి ఉద్దేశం. అందుకోసం వారు ఈ విధమైన ఉపాయాలతో ఎలాగైనా వంచించడానికి ప్రయత్నిస్తారు. కనుక వారిని నీ వద్దకు రానీయకు" అన్నాడు. ఆ తరువాత విభాండకుడు మూడు రోజులు అడవిలో వెదికి తన కుమారులకు

హాని కలగజేయడానికి ప్రయత్నించిన వారిని గుర్తించలేక తిరిగి ఆశ్రమానికి చేరుకున్నాడు.

మరోమారు విభాండకుడు దుంపలు, పండ్లు తేవడానికి ఆశ్రమాన్ని వదిలి అడవిలోకి వెళ్లినప్పుడు.. గతంలో వచ్చిన వనిత మెల్లగా రుష్యశృంగుడు కూర్చున్న స్థలానికి వచ్చింది. ఆమెను చూసిన రుష్యశృంగుడు తుళ్లి లేచి పరిగెత్తి ఆమెను సమీపించాడు. కుశల ప్రశ్నలు, వందనాలు అయిన తరువాత ఆమెతో ఇలా అన్నాడు. "ఓ తేజశ్శాలి అయిన బ్రహ్మచారీ, నా తండ్రి వచ్చేలోగా మీ ఆశ్రమానికి పోదాం పద" అన్నాడు. వారిద్దరూ సమీపంలోనే ఏర్పాటు చేసిన పడవపై ఏర్పాటు చేసిన కృత్రిమ ఆశ్రమంలోకి ప్రవేశించారు. రుష్యశృంగుడు పడవపైకి ఎక్కగానే పడవ కట్లు తెంపబడ్డాయి. పడవ సునాయాసంగా అంగదేశానికి చేరుకుంది. మార్గంలో రుష్యశృంగుడు అన్నివిధాలా అనందపరవశుడయ్యాడు. తాను అంగదేశానికి చేరుకునే సరికి.. అడవిలో తానున్న అవస్థగాక ప్రపంచ పోకడలన్నీ తెలుసుకున్నాడు.

రుష్యశృంగుడు రాక.. రోమపాదునకు ఆనందం కలగజేసింది. తన శరీరానికి ఉపయోగకారి అయిన ఆ ముని కుమారుణ్ణి అన్ని విధాలా గౌరవించి ఆతన్ని తన కోటలో బాగా అలంకరించిన అభ్యంతర గృహంలో ఉంచాడు. బ్రాహ్మణులు చెప్పిన ప్రకారం రుష్యశృంగుడు కాలు పెట్టింది మొదలు వర్షాలు కురుస్తున్నాయి. నదులు, జలాశయాలు నిండాయి. ప్రజలందరూ ఆనందోత్సాహాలతో ఉన్నారు. రోమపాదుడు తన కుమార్తె శాంతను రుష్యంశృంగుడికి ఇచ్చి వివాహం చేశాడు.

రుష్యశృంగుడిని తీసుకురావడంతో తాననుకున్నట్లు జరిగినా.. విభాండకుడు తన కుమారుణ్ణి వెదుకుతూ వచ్చి తనను శపిస్తాడేమోనని రోమపాదుడు భయపడుతున్నాడు. కనుక రోమపాదుడు.. విభాండకుడి ఆగ్రహాన్ని తగ్గించడానికి ఓ ఏర్పాటు చేశాడు. విభాండకుడు తన రాజధాని నగరానికి వచ్చే మార్గంలో ఇరువైపులా పాడి పశువులు, ఇతర సామానులు బారులు తీర్చి ఉండేలా ఏర్పాటు చేసి, గోపాలకులతో.. వారెవ్వరు అంటే రుష్యశృంగుడి నౌకర్లమనీ, వారి జనకులు విచ్చేస్తున్నారు కావున వారిని గౌరవించడానికి, అవసరమైన సపర్యలు చేయడానికి వచ్చామని చెప్పే ఏర్పాటు చేశాడు.

ఆశ్రమ ప్రాంతంలో తన కుమారుడు కనిపించకపోవడంతో మహా కోపం చెందిన విభాండకుడు.. ఇదంతా అంగదేశపు రాజు రోమపాదుడి పని అని గ్రహించాడు. వెంటనే బయలుదేరి కొన్ని నదులను, గ్రామాలను దాటి రోమపాదుడు పట్టణానికి వస్తున్నాడు. అతణ్ణి భస్మం చేయాలన్నంత ఆగ్రహంలో ఉన్నాడు. తాను వచ్చే మార్గంలో, తాను బస చేసే ప్రతిచోటా తన కుమారుని గొప్ప గొప్ప పశు

వులతో నౌకర్లు ఆయనకు సపర్యలు చేశారు. తాను రాజధాని వచ్చేసరికి తన కోపమంతా దిగిపోయింది. తాను పట్టణంలో ప్రవేశించిన వెంటనే గొప్ప మర్యాదతో స్వాగతం పలికారు. ఆయనను రాజమందిరానికి తోడ్కొని వెళ్లారు. ఆ మందిరంలో అతడికి తన కుమారుడు రుష్యశృంగుడు సభ తీర్చి ఉండటం దేవరాజైన ఇంద్రుడిలా కనిపించాడు. కుమారుని పక్క భార్య శాంత ఉన్నది. ఆమె సౌందర్యం విభాండకుడికి ఆనందం కలిగించింది. విభాండకుడు ఆమెను ఆశీర్వదించాడు. కుమారుడితో ఇలా అన్నాడు. "రాజుకు కావలసింది చేస్తుండు. నీకు పుత్రోదయమైన వెంటనే వచ్చి నన్ను అడవిలో కలువు".

రుష్యశృంగుడు తండ్రి ఆజ్ఞ ప్రకారమే చేశాడు.

యుధిష్ఠరుడికి లోమనుడు ఈ కథను చెపుతూ ఇలా అన్నాడు. "దమయంతి – నలుడు; సీతా – రాముడు, అరుంధతి – వశిస్టుడు; లోపాముద్ర – అగస్త్యుడు; ద్రౌపది – నీవు మాదిరిగా శాంత – రుష్యశృంగుడు యోగ్యకాలంలో అడవులకు వెళ్లి శేషజీవితాన్ని అన్యోన్య ప్రేమతోనూ, భగవంతుని పూజలోనూ గడిపారు. మనం ఉన్న ఈ ప్రదేశం రుష్యశృంగ మహాముని ఉండేది. ఈ గంగలో మునిగి పవిత్రులు కండి. పాండవులు స్నానమాడి అర్ఘ్యాదులు ఇచ్చారు.

◈



భరద్వాజ మహాముని

## అధ్యాయం - 32

# ఫలమివ్వని తపస్సు యవక్రీదుని చరిత్ర

**పాం**డవులు తీర్థయాత్రా పరంపరలో గంగానది ఒడ్డునున్న రైభ్యుని ఆశ్రమానికి వచ్చారు. లోమశుడు ఆ స్థలం కథను చెప్పడం ఇలా ప్రారంభించాడు.

'ఈ ఘట్టంలో దశరథ కుమారుడైన భరతుడు స్నానం చేశాడు. ఈ గంగా స్నానం వల్ల ఇంద్రునికి అక్రమంగా వృత్తుని చంపిన పాపం నశించింది. ఇక్కడే స్కనత్కుమారుడు సిద్ధి పొంది బ్రహ్మైక్యం పొందాడు. దేవతలకు తల్లి అయిన అతిథి ఈ పర్వతాలపైన అర్ఘ్యాలు, హోమాలు చేసినప్పుడు పుత్రుణ్ణి ప్రసాదించాలని కోరుకుంది. ఓ యుధిష్టరా, ఈ పర్వతాన్ని అధిష్టించు. నిన్ను కమ్ముకున్న విషాదం అంతరించిపోతుంది. ఈ నది ప్రవాహోదకమున నీవు స్నానం చేస్తే కోపం, ఇంద్రియ పరితాపం నశిస్తాయి. ఆ స్థలం ప్రాముఖ్యత గురించి లోమశుడు ఇంకా పొగుడుతున్నాడు.

భరద్వాజ రుషీ, రైభ్య రుషీ స్నేహంగా ఉండి, వారి వారి ఆశ్రమాల్లో ఉన్నారు. రైభ్యుడి కుమారులైన పరవసువు, అర్వవసువు, వేదవేదాంగాలు చదివి పండితులుగా ప్రసిద్ధి చెందారు. భరద్వాజుడు సర్వకాలాల్లోనూ దైవారాధనలోనే నిమగ్నుడై ఉన్నాడు. అతడికి యవక్రీడుడు అనే కుమారుడు ఉన్నాడు. బ్రాహ్మణ కుమారులైన పరవసువు, అర్వవసువు, వారి తండ్రీ రైభ్యుణ్ణి గౌరవించినట్లు తన తండ్రి భరద్వాజను గౌరవించలేదని వారిపై అసూయ చెంది.. యవక్రీడుడు వారిపై అసూయ చెంది ఆ బ్రాహ్మణ కుమారుల కంటే విద్య ఎక్కువగా నేర్చుకోవాలని ఈర్ష్యతో ఇంద్రుని గురించి తపస్సు చేశాడు. తన శరీరాన్ని కృశింపచేసి ఘోర తపస్సు చేయడంతో ఇంద్రుడు వారిపై దయదలిచి.. ఎందుకు ఈ శరీరాన్ని కృశింపచేస్తూ తపిస్తున్నావు అని అడిగాడు. అందుకు యవక్రీడుడు.. "వేదాల్లో ఎవ్వరూ నేర్వనంత విద్యను నేను నేర్చుకోవాలని ఉంది. గొప్ప పండితుణ్ణి కావాలని ఉంది. ఈ నా కోరికను నెరవేర్చుకోవడానికే తపస్సు చేస్తున్నాను. వేదాలను గురువు వద్ద నేర్చుకోవడానికే చాలా కాయక్లేశాలు పడవలసి ఉంటుంది. కనుక ఆ విద్యను వరం మూలంగా ఒకే పర్యాయం పొందేటట్లు నన్ను ఆశీర్వదించు" అన్నాడు. ఇంద్రుడు నవ్వి.. "ఓ బ్రాహ్మణుడా.. నీవు తప్పు మార్గాన ఉన్నావు. నీవు ఇంటికి వెళ్లు. ఒక గురువు వద్ద వేదాలు అభ్యసించు. తపస్సుతో విద్యను సంపాదించలేవు. దానికి చదువుకోవడమే మార్గం" అని అదృశ్యమయ్యాడు. కానీ భరద్వాజుని కుమారుడు అలా ఊరుకోలేదు. అతడింకా మరింత తీవ్రతతో ఘోర తపస్సు చేయడంతో దేవతలంతా భయపడ్డారు. ఇంద్రుడు మరలా అతడి దగ్గరకు వచ్చాడు. "జ్ఞానాన్ని సంపాదించడానికి తప్పు మార్గం పట్టావు. జ్ఞానం పఠనం వల్లే కలుగుతుంది. మీ తండ్రి పఠించి విద్యను, జ్ఞానాన్ని సంపాదించాడు. అలాగే నీవు పొందుతావు. వెళ్లి వేదాలను చదువు. ఇలా శరీరాన్ని శుష్కింప చేసుకోవడం మాను. రెండో మారు ఇంద్రుడు చెప్పిన వాక్యాలను కూడా లక్ష్య పెట్టక తాను కోరింది ఇవ్వనప్పుడు తన ఒక్కొక్క అవయవాన్ని ఖండించుకొని హోమం చేసైనా సాధిస్తానని నిర్లక్ష్యంగా తపస్సును కొనసాగిస్తూనే ఉన్నాడు. తపశ్చర్య కాలంలో ఒకమారు గంగానదిలో స్నానం చేయడానికి యవక్రీడుడు వెళ్లగా, గంగ ఒడ్డున ఉన్న ఇసుకను పిడికిళ్లతో కష్టపడి గంగలో వేస్తున్న ఓ ముసలి బ్రాహ్మణుణ్ణి చూశాడు. అతనితో యవక్రీడుడు "వృద్ధుడా.. నీవేమి చేస్తున్నావు?" అనడిగాడు. "ఈ నది ఒడ్డున ఓ ఆనకట్టను కడుతున్నాను. పిడికిలి తరువాత పిడికిలితో ఇసుక వేయగా.. వేయగా.. ఒక ఇసుక గోడ ఎప్పుడు తయారు చేయగలమో అప్పుడు ప్రజలందరూ ఈ నదిని సునాయాసంగా దాటగలరు. ఇప్పుడు దీన్ని దాటడానికి ఎంత కష్టంగా ఉందో చూడు. ఇది

ఉపయోగమైన పని కదా" అన్నాడు. యవక్రీడుడు నవ్వి.. "నీవెంత మూఢుడివి. ఈ మహాప్రవాహానికి అడ్డుగా నీవు పడవేసే ముష్టి ఇసుక ఒక ఆనకట్టగా మారుతుందని తలస్తున్నావా?. లే. ఇంతకంటే ఉపయోగకరమైన పనిని చేయి" అన్నాడు.

ఆ వృద్ధ బ్రాహ్మణుడు అందుకొని.. "వేదాలు నేర్చుకోవడం గురువు వద్ద కాకుండా తపస్సుతో సాధించాలని నీవు అనుకోవడం కంటే నా తెలివితక్కువతనం ఎక్కువా?" అని అన్నాడు. ఈ ముసలివాడు ఇంద్రుడని యవక్రీడుడు గుర్తించాడు. ఈ సారి ఇంద్రుణ్ణి బతిమాలుకొని తనకు ఎలాగైనా విద్య వచ్చే వరకూ ప్రత్యేకంగా దయ చేయమని వేడుకున్నాడు. ఇంద్రుడు యవక్రీడును ఆశీర్వదించి అతణ్ణి శాంతింప చేయడానికి ఇలా అన్నాడు. "సరే, నీవు కోరుకునే వరమిచ్చాను. వెళ్లి వేదాలు చదువు. నీవు విద్యాంసుడవు అవుతావు" అని ఇంద్రుడు అంతర్ధానమయ్యాడు.

◈

## అధ్యాయం - 33

# యవక్రీడుని అంత్యదశ

**య**వక్రీడుడు వేదాలు చదివి విద్యావంతుడయ్యాడు. ఇంద్రుడి వరం వల్లనే తాను విద్యావంతుణ్ణి అయ్యానని, మనిషి యత్నం, గురుశుశ్రూష మార్గాన కాకుండా తాను విద్య నేర్చానని అహాన్ని, లేని గొప్పదనాన్ని ప్రదర్శించుకొంటున్నాడు. ఇదంతా భరద్వాజ మునికి భయంగా అనిపించింది. యవక్రీడుడు తన గర్వంతో రైభ్యుణ్ణి అవమానించడం జరిగితే.. తన కుమారుడికి ఆపద రాగలదని భావించాడు. కనుక తన కుమారుణ్ణి ముందుగానే జాగ్రత్తగా ఉండాలని చెప్పదలిచాడు. “మూఢులకు ఎవరైనా మత్తు పదార్థాలను ద్రవ్యానికి అమ్ముతారు. అలాగే మూర్ఖులైనవారు తరచూ ఘోర తపస్సులు చేస్తుంటే దేవతలు వరాలు ఇస్తున్నారు. ఈ వర గర్వంతో తమను తాము మర్చిపోతారు. అందువల్ల మనసు సంకుచితమై చివరికి వారే నశిస్తారు” ఇలా కుమారుడికి బుద్ధి చెప్తూ.. ఉదాహరణగా మరో కథను చెప్పాడు.

పూర్వకాలంలో బలాది అనే గొప్ప రుషి ఉన్నాడు. అతనికి ఒక కుమారుడు

పుట్టి పెరిగి పెద్దవాడై మరణించాడు. ఈ పుత్ర శోకం భరించలేక, పంతంపట్టి మరణంలేని కుమారుడి కోసం తపస్సు చేయడం మొదలు పెట్టాడు. దేవతలు.. "ఇది మానవుడికి కాని పని, మానవుడికి మృత్యువు ఉంటుంది. మరణం చెందవలసిందే" అని చెప్పారు. అందువల్ల తన ప్రార్థనను కొంచెం సంకుచితం చేసి కోరుకోమన్నారు. అప్పుడా రుషి.. "అలా అయితే.. అల్ల చెలకన పడుండే కొండ ఎంతకాలముంటుందో అంతకాలం జీవించగల పుత్రుణ్ణి ఇవ్వు" అని కోరాడు. వరమిచ్చారు. ఒక కుమారుడు కలిగాడు. అతని పేరు మేధావి. ఈ మేధావి పెరిగి పెద్దవాడై తనకు మృత్యువు వల్ల భయం ఎన్నడూ లేదని, కొండ ఎంతకాలం ఉంటుందో అంతకాలం తానూ ఉండగలనని గర్వించి అందరిపట్లా నిర్లక్ష్య భావంతో మెలుగుతున్నాడు. ఒకనాడు గర్విష్టి అయిన ఈ మేధావి ధనుషాక్షుడనే రుషి పుంగవుడి పట్ల అమర్యాదకరంగా ప్రవర్తించాడు. తక్షణమే ఆ రుషి.. "నీవు భస్మం అవుదువుగాక" అని మేధావిని శపించాడు. కానీ మేధావిపై శాపం పనిచేయలేదు. అతడు సంపూర్ణారోగ్యంతో ఉన్నాడు. ఆ రుషి కొంచెం ఆశ్చర్యపడి మేధావి పుట్టిన సమయంలో అతడికి ఇచ్చిన వరాన్ని స్ఫురణకు తెచ్చుకున్నాడు. ధనుషాక్షుడు ఒక అడవి ఎనుపోతు రూపం ధరించి తన తపశ్శక్తితో కొండను ఎదుర్కొని దాన్ని ముక్కలు ముక్కలుగా చేశాడు. దీంతో మేధావి పడిపోయి చనిపోయాడు"

భరద్వాజుడు తన కథను ముగిస్తూ కుమారుడికి ఇలాహితవు పలికాడు. "ఈ పురాణ గాథ నుంచి జ్ఞానం తెచ్చుకో. గర్వంతో చెడిపోకు. నిగ్రహం నేర్చుకో. మంచి నడవడికి పెట్టుకున్న నియమాలను మీరకు. మహనీయుడైన రైభ్యుడి పట్ల ఎప్పుడూ అమర్యాదగా ప్రవర్తించకు" అన్నాడు.

అది వసంత కాలం. వృక్షాలు, తీగెలు, పువ్వులతో అందంగా ఉంది. అరణ్యమంతా రంగు రంగులతోనూ, పక్షుల కలకలారావాలతోనూ నిండి ఉంది. భూమే మన్మథుని మంత్రశక్తికి లోబడినట్లు ఉంది.

పరవశుడి భార్య ఒంటరిగా రైభ్యుడి అశ్రమ ఉద్యావన వనంలో విహరిస్తోంది. అమె అందం, ధైర్యం, పవిత్రత కలిసి ఓ దైవాంశ సంభూతురాలి మాదిరిగా కనపడుతోంది. ఆ సమయంలో యవక్రీడుడు అక్కడికి వచ్చాడు. ఆమె సౌందర్యాన్ని చూసి తన శరీరాన్ని కూడా మరచి, కామాంధుడై, రక్తమాంసాలు తినే క్రూర మృగంగా వ్యవహరించే ఉద్దేశం ఏర్పడింది. ఆమెను పలకరించాడు. ఆమెకు సహజ సిగ్గు, భయం, తొట్రుపాటు కలిగాయి. దీంతో యవక్రీడుడు ఆమెను సునాయాసంగా ఒక రహస్య స్థలానికి ఈడ్చుకు వెళ్లి, ఆమెపై అత్యాచారం చేశాడు.

రైభ్యుడు ఇంటికి వచ్చాడు. ఏడుస్తూ.. ఎంత ఓదార్చినా దుఃఖాన్ని ఆపక పడి ఉన్న తన కోడలిని చూశాడు. ఆమెకు జరిగిన ఘోర అవమానం గురించి

తెలుసుకున్నాడు. పట్టరాని ఆగ్రహం చెందాడు. తన తల నుంచి ఒక వెంట్రుకను పీకి.. మంత్రోచ్ఛారణ చేసి దాన్ని అగ్నిలో వేశాడు. తక్షణమే తన కోడలితో సమానం సౌందర్యంగల యువతి అగ్నిహోత్రం నుంచి బయటకు వచ్చింది. ముని, మరో వెంట్రుకను పూర్వం వలేనే హోమంలో వేయగా ఘోర రాక్షసుడు అగ్ని నుంచి పుట్టాడు. రైభ్యుడు వారిద్దరితో యవక్రీదుణ్ణి చంపాలని ఆజ్ఞ ఇచ్చాడు. వారిరువురూ తలలు వంచి తమ కార్యంపై వెళ్లారు.

యవక్రీడుడు ప్రాత:కాల కర్మానుష్టానం చేస్తుండగా.. స్త్రీ రూపధారిణి అతని వద్దకు వెళ్లి నవ్వుతూ.. అపహాస్య క్రియలు చేస్తూ.. అతని వద్దనున్న గంగ కలశాన్ని చేజిక్కించుకొని పోయింది. వెంటనే రాక్షసుడు బల్లెంతో యవక్రీడునిపైకి ఉరికాడు. యవక్రీడుడు భయంతో లేచి నిలుచున్నాడు. నీటితో తాను పవిత్రుడు కాకపోతే తన మంత్రాలు పని చేయవని తెలుసుకొని గంగకలశం కోసం చూశాడు. అది పోయిందని తలిచి చేరువనే ఉన్న జలాశయం వద్దకు పరుగుపెట్టాడు. అదీ ఎండి ఉంది. ఓ చిన్న నీటి ప్రవాహం దగ్గరకు పరిగెత్తాడు. అతడు దాన్ని సమీపించబోయే సమయంలో అదీ ఎండిపోయింది. తనకెక్కడా నీరు దొరకలేదు. భయంకర రాక్షసుడు తనను శూలం పట్టుకొని వెన్నాడుతూనే ఉన్నాడు. తన తపస్సు ప్రభావమంతా తాను చేసిన పాప కృత్యంతో నశించింది. ప్రాణ రక్షణార్థం తుదకు తండ్రి అగ్నిహోత్రశాలలో దాక్కోవడానికి పరిగెత్తాడు. ఆశ్రమాన్ని కాపాడుతున్న సగం గుడ్డి అయిన కాపరి భయభ్రాంతుడై బహు తొందరతో పరుగెత్తి వస్తున్న యవక్రీడుణ్ణి గుర్తించలేక లోనికి చొరబడనీయలేదు. ఇంతలో రాక్షసుడు వచ్చి తన ఆయుధంతో యవక్రీడుణ్ణి చంపాడు.

భరద్వాజుడు తన ఆశ్రమానికి వచ్చి తన కుమారుడి మృత శరీరాన్ని చూసి, రైభ్యుణ్ణి అవమానించినందువల్లే కుమారుడికి చేటు కలిగిందని ఊహించాడు. "అయ్యో నా బిడ్డా.. నీవు గర్వం, అహం వల్ల చనిపోయావు. ఏ బ్రాహ్మణుడూ చేయని రీతిగా నీవు వేదాలు నేర్చుకోవడం తప్పుకాదా?. ఈ ప్రకారం శపించడానికి కారణమయ్యేలా ఎందుకు నడుచుకున్నావు?. నా ఏకైక పుత్రుణ్ణి చంపించిన రైభ్యుడు తన కుమారుల్లో ఒకడిచే చచ్చుగాక" అని మిక్కిలి ఆగ్రహంతో శపించాడు. మరలా తాను సంభాళించుకొని..విషాదంతో ఇలా అనుకున్నాడు. "అయ్యో పుత్రులులేని వారే అదృష్టవంతులు. నా కుమారుణ్ణి పోగొట్టుకోవడమేగాక.. నా వెర్రి కోపంతో మిత్రుడైన రైభ్యుణ్ణి కూడా శపించాను. నేనీ జీవిత శేషం గడిపినా ప్రయోజనమేమిటి" అనుకొని తన కుమారుడి అంత్యక్రియలు నిర్వహించి తానూ చితిపైపడి మరణించాడు భరద్వాజుడు.

◈

## అధ్యాయం - 34

# వివేకంలేని చదువు వ్యర్థం

**రై**భ్య మహాముని శిష్యుడు బృహద్యుమ్న మహారాజు. ఈ రాజు గొప్ప యజ్ఞం తలపెట్టి తన గురువుగారితో కుమారులు పరవసుణ్ణి, అర్వవసుణ్ణి యజ్ఞం నడపాల్సిందిగా కోరాడు. తండ్రి ఆజ్ఞపై కుమారులు ఇద్దరూ ఆ రాజు వద్దకు వెళ్లారు. యజ్ఞానికి కావలసిన పరికరాలు సిద్ధమవుతుండగా.. పెద్దవాడైన పరవసుడికి తన భార్యను చూడాలన్న బుద్ధి పుట్టింది. రాత్రంతా నడిచి తన ఆశ్రమానికి వచ్చే సరికి ఇంకా తెల్లవారుజామున చీకటిగానే ఉంది. తన ఆశ్రమంలో ఆ చీకటిలో ఒక క్రూర జంతువు దాగి ఉండి ఎవరిపైనైనా పడి చంపడానికి కూర్చుని ఉన్నట్లు అతనికి కనపడింది. తన ఆయుధాన్ని దానిపై విసిరి చంపాడు. తర్వాత ఆ చనిపోయింది క్రూరమృగం కాదని, చర్మవాసనలు ధరించి ఉన్న తన తండ్రి అని చూసి తెలుసుకొని ఘోర విచారగ్రస్తుడయ్యాడు. తన ఘోర పొరబాటు భరద్వాజుని శాపం వల్ల కలిగిందని ఊహించాడు. అతి శీఘ్రంగా తన తండ్రికి అంత్యక్రియలు నిర్వహించి తన తమ్ముడైన అర్వవసువు దగ్గరకు వెళ్లి, జరిగిన ఘోర కృత్యమంతా అతడితో చెప్పాడు. ఇంకా

తమ్ముడితో ఇలా అన్నాడు. "ఈ జరిగిన చెడ్డ పని మూలంగా రాజు యజ్ఞానికి అంతరాయం కాకూడదని చెప్పాడు. నేను తెలియక చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం కలదని చెపుతూ.. అర్వవసువును తన తరఫున ప్రాయశ్చిత్త కర్మలను చేయాలని కోరాడు. శాస్త్రాలు కూడా.. ఇటువంటి తెలియక చేసిన పాపాలకు ప్రాయశ్చితం ఉందని చెపుతున్నాయి. నేనీ పని స్వతంత్రించి చేయగలను. నీవింకా సహాయం లేక యజ్ఞాన్ని నడిపించలేవు. పవిత్రుడైన అర్వవసువు సమ్మతించి ఇలా అన్నాడు. "నీవు రాజు యజ్ఞాన్ని నడిపించవచ్చు. తండ్రిని అందులో బ్రాహ్మణుణ్ణి చంపిన నీ మహా పాతకం నశించడానికి గాను నేను ప్రాయశ్చిత్తం తప్పక చేస్తాను" అని అంటూ అర్వవసు తన అన్నకు ప్రతిగా తాను ప్రాయశ్చిత్త కర్మలను చేశాడు.

కర్మలు పూర్తికాగానే తన అన్నకు యజ్ఞ నిర్వహణలో సహాయం చేయడానికి వెళ్లాడు. పరవసు పాపాలు నశించలేదు. ప్రాయశ్చిత్త కర్మలు ఆ పాపం చేసినవారే చేయాలిగాని ఇతరులు చేసిన ఫలం ఇవ్వబోవు. ఈ పాపపుంజ బలంతో వరవసు హృదయమున దుర్మార్గపు పాప చింతలు పుట్టాయి. తన తమ్ముడి ముఖ తేజస్సు చూసి ఈర్ష్య చెందిన వరవసు.. తన తమ్ముణ్ణి అగౌరపరచాలని తలచాడు. ఒక అపవాదు అతడి మీద వేశాడు.

అర్వవసు యజ్ఞశాలను ప్రవేశిస్తుండగా పరవసు.. రాజు వినేటట్లు ఇలా అన్నాడు. "ఈ అర్వావసు ఒక బ్రాహ్మణుడిని చంపిన పాపి. అలాంటి పాపి ఈ యజ్ఞశాలలో ఎలా ప్రవేశించగలడు". అర్వవసు ఇది కేవలం అసత్యమని కోపంతో చెప్పినా, ఎవ్వరూ వాటిని వినక, రాజాజ్ఞపైన అతన్ని నీచుడిగా చూసి యజ్ఞశాల నుంచి బయటకు గెంటి వేశారు. అర్వవసు తనకేమీ తెలియదని పలుమార్లు వారందరితో మొరపెట్టుకున్నాడు. "నా అన్న పరవసుడే ఈ పాప కార్యాన్ని చేసినవాడు. అయినా అది గొప్ప పొరపాటే. అతడి నిమిత్తం నేను ప్రాయశ్చిత్త కర్మలు చేసి అతణ్ణి పాపం నుంచి రక్షించాను" అని చెప్పాడు. దీంతో వినేవారికి మరింత అనుమానం పెరిగింది. తాను చేసిన ప్రాయశ్చిత్త కర్మ తన నిమిత్తం కాదనేది ఎవరూ నమ్మక, తాను చేసిన ఇతర పాపాలకు తోడు ఆమాయకుడైన అన్నకు పాపం అంట కడుతున్నాడని నిందించారు. పవిత్రుడైన అర్వవసు ఈ ప్రకారం ఘోరమైన నేరం చేసినవాడని, దీనికితోడు అసత్యవాది అని జనులతో నిందించినందున ఈ ప్రపంచంలో న్యాయం దొరకదని నిశ్చయించి అడవులకు పోయి తపస్సు చేయడం ప్రారంభించాడు. దేవతలు దయచూపి ఆయనకు దర్శనమిచ్చి.. ఓయీ పవిత్రాత్ముడా.. నీవు కోరుకునే వరమేమిటి?. అని అడిగారు. దీర్ఘాలోచనా పరుడై ఉండి, గొప్ప తపస్సును కూడా చేసినందున, తన అన్న పాపాలు, క్రూరత్వం నశించిపోవాలని అర్వవసు మనసులోనే

కోరాడు. దేవతలు అలాగే వరమిచ్చారు.

ఈ కథలో మశుడు,.. ధర్మరాజుకు రైభ్యుడి ఆశ్రమ సమీప స్థలంలో ఇలా చెప్పాడు. "ఓ పాండవులారా, ఈ నదిలో స్నానమాచరించి, మీ పాపాలను, ఇంద్రియ దుర్గుణాలను పోగొట్టుకోండి".

అర్వవసువు, పరవసువు ఒక గొప్ప జ్ఞాని కుమారులు. తండ్రి పాదాల వద్దనే విద్యనభ్యసించి వారు విద్యాంసులయ్యారు. కానీ చదువుకోవడం వేరు. పవిత్రులు అవ్వడం వేరు. మంచి చేయడం, చెడును పారదోలడం చేయాలంటే మంచీ చెడూ తారతమ్యం ఎరగాల్సి ఉంటుంది. ఈ తారతమ్య జ్ఞానం అనేది ఒకరి హృదయంలో ఇంకిపోయి తాను చేసే ప్రతి కార్యంలోనూ ఉపయోగపడుతుండాలి. అలాంటి పరిస్థితిలోనే అది పవిత్రత అవుతుంది. చదివి నేర్చినదంతా మనసులో బాగా కుక్కి దాన్ని అర్థం చేసుకోనప్పుడు అది పవిత్రత ఇవ్వజాలదు. మనం ధరించే దుస్తులు మన శరీరభాగం ఎలా కావో, అలాగే వివేకం లేని చదువు కూడా దుస్తుల్లా డాంబికమే.

◈



అష్టావక్రునితో చర్చిస్తున్న జనకుడు

## అధ్యాయం - 35

# అష్టావక్రుడు

అడవిలో పాండవులు పవిత్ర స్థలాలు చూస్తూ తిరుగుతూ జరామరణం (ఉపనిషత్తుల్లో చెప్పినట్లుగా) మహర్షుల ఆశ్రమానికి వచ్చారు. లోమశుడు.. యుధిష్టరుడికి ఆ స్థలం చరిత్ర చెప్పాడు.

గొప్ప రుషీ, వేదాంత ఉపదేశికుడు ఉద్దాలకుడికి.. ఖగోళుడనే శిష్యుడున్నాడు. ఈ ఖగోళుడు పవిత్రుడు, గురుభక్తి కలిగినవాడేగాని బాగా చదివినవాడు మాత్రం కాదు. కనుక మిగిలిన శిష్యులందరూ ఖగోళుణ్ణి అపహాస్యం చేస్తున్నారు. ఉద్దాలకుడు మాత్రం ఖగోళుణ్ణి పవిత్రతతో చూశాడుగానీ, అతడి స్వల్ప చదువు పట్ల ఏమీ లక్ష్యం ఉంచలేదు. అతడి గొప్ప గుణాలు, భక్తి, మంచి నడవడిక చూసి తన కుమార్తె సుజాతనుఇచ్చి అతడికి వివాహం చేశాడు. వీరిద్దరికి ఒక కుమారుడు జన్మించాడు. బిడ్డ సాధారణంగా తల్లిదండ్రుల సహజగుణం కలిగి ఉంటాడు. అతడు.. తల్లి సుజాత గర్భంలో ఉన్నప్పుడే వేదాలన్నీ గ్రహించాడు. తండ్రి ఖగోళుడు వేద పఠనం చేస్తుంటే,

తరచూ తప్పు శబ్ద స్వరాలు వింటూ గర్భంలోనే ఆ తప్పులను సహించలేక చుట్టుకొని పోతున్నాడు. ఇటూ అటూ తిరగడం వల్ల అతడు పుట్టేసరికి శరీరం ఎనిమిది వంకర్లు తిరిగింది. ఈ వంకర్ల వల్ల అతడికి 'అష్టావకృడు' అనే పేరు వచ్చింది.

ఖగోళుడు ఒక చెడు దినాన మిథిలా నగరపు సభా పండితుడైన 'వండి'తో మత సంబంధమైన వాగ్వాదనలో దిగి 'వండి' చేతిలో పరాజితుడై వారిద్దరూ తొలి అంగీకారం ప్రకారం పరాజితుడైన ఖగోళుడు నీట మునికి చనిపోవాల్సి వచ్చింది.

అష్టావకృడు పెరుగుతూ చిన్నతనంలోనే అసమాన్య పాండిత్యాన్ని సంపాదిస్తూ, పన్నెండేళ్ల బాలుడయ్యే సరికి వేద వేదాంగాలు పూర్తిగా అభ్యసించాడు. మిథిలాధిపతి జనకుడు ఓ గొప్ప యాగం చేస్తున్నాడని, ఆ యాగ కాలంలో సభికులైన విద్యాంసులందరూ శాస్త్ర చర్చ చేస్తారని.. ఓ రోజు అష్టావకృడు విన్నాడు. తన బంధువైన శ్వేతకేతుతో కలిసి మిథిలా నగరానికి బయలు దేరాడు. యజ్ఞ వాటికకు వెళ్లే మార్గంలో జనకరాజు తన పరివారంతో ఆ మార్గానే వస్తున్నాడు. రాజుగారి నౌకరులు ముందుగా వచ్చి, "పక్కకు తప్పుకోండి. రాజుగారికి మార్గం ఇవ్వండి" అని అరుస్తున్నారు. అష్టావకృడు పక్కకు తప్పుకోకుండా రాజ నౌకరులతో.. "ఓ రాజోద్యోగులారా, రాజైనా, ధర్మాత్ముడైనా తానే పక్కకు తప్పుకొని గుడ్డివారికి, అంగవైకల్యంగల వారికి, స్త్రీలకు, భారీ కాయులకు, వేద విదులైన బ్రాహ్మణులకు దారి ఇవ్వాలని శాస్త్రం చెప్పింది" అని అన్నాడు. ఈ బ్రాహ్మణ కుర్రవాడి మాటలను జనకుడు విని ఆశ్చర్యం చెందాడు. కుర్రవాడు అన్న మాటలు న్యాయ సమ్మతమని భావించి, తానే పక్కకు తప్పుకొన్నాడు. "ఆ బ్రాహ్మణ బాలుడు చెప్పింది నిజం. అగ్నిహొత్రం అగ్నిహొత్రమే. కొంచెమే ఉన్నా, అధికంగా ఉన్నా దానికి దహించే శక్తి ఉంది" అని సేవకులతో చెప్పాడు.

అష్టావక్రుడు, శ్వేతకేతువు యాగశాలలో ప్రవేశించారు. ద్వారపాలకుడు వీరిని ఆటకం పరిచాడు. "పిల్లవాళ్లు లోనికి వెళ్లకూడదు. వయోవృద్ధులైనా వేదాధ్యయన సంపన్నులే లోనికి వెళ్లాలి" అని ద్వారపాలకులు అన్నారు. దీంతో అష్టావకృడు.. "మేం చిన్నపిల్లలం కాము. అనుసరించాల్సిన వ్రతాలను, అనుష్టానాలను అన్నీ చేశాము. వేదాలు కూడా చదివాము. వేదాంత సత్యాలు బాగా తెలిసినవారు ఒకరిని వయసుతోగాని, స్వరూపంతోగాని ఎంచజాలరు" అన్నాడు.

దౌవారికుడు జోక్యం చేసుకుంటూ.. "ఆగు. నీ పనికిమాలిన ప్రేలాపన కట్టిపెట్టు. బాలుడవు. నీవెలా వేదాలు చదివావు? వేదాంతాన్ని ఎలా గ్రహించగలిగావు?" అన్నాడు. దీంతో అష్టావకృడు.. "లోపల గుల్ల అయినా, పైకి పెద్దదిగా కనిపించొచ్చు. బాగా పెరిగిన గుమ్మడి పండులా మేము కనబడలేదనా మీ

అభిప్రాయం. కేవలం పాక్షికత్వం, విశాలత్వం జ్ఞానాన్ని, అర్హతనూ, వయసునూ సూచించవు. మిక్కిలి పొడవైన ముదుసలి మూఢుడుగా రావచ్చు. నన్ను లోనికి పోనివ్వు" అన్నాడు. "నీవు పురాతన రుషీశ్వరుడిలా మాట్లాడుతున్నావు. కానీ పొడవుగా లేవు. వయసు మీరినవాడవూ కావు. బయటకు పో" అన్నాడు దౌవారికుడు. అష్టావక్రుడు అందుకొని.. "ఓయీ దౌవారికా, హృదయం గొప్పదనానికి పండు వెంట్రుకలు గుర్తుకాదు. నిశ్చయంగా పెద్దవాడు ఎవరంటే, వేద వేదాంగాలు తెలిసినవాడూ, వాటి తాత్పర్యాలు గ్రహించి సారం పొందినవాడే. సభా పండితుడైన 'వంది'ని చూడటానికి వచ్చాను. ఈ నా కోరికను జనక రాజుకు తెలియజేయి" అన్నాడు. ఆ సమయంలోనే జనక రాజు అక్కడికి వచ్చాడు. ఇదివరకు తాను చూసిన వయసుకు తగని అసమాన తెలివి తేటలుగల అష్టావక్రుణ్ణి గుర్తించాడు. "ఇదివరకు నా ఆస్థాన పండితుడైన 'వంది' చాలా మంది పండితులను ఓడించి, అలా ఓడిపోయినవారిని సముద్రంలో తోయించేవాడని నీకు తెలియదా?. ఈ అంశాలు తెలిసిన తరువాత కూడా ఆయనతో వాదన అనే భయంకరమైన వ్యాపకాన్ని కోరుతానా?" అని జనకరాజు అన్నాడు.

అష్టావక్రుడు జోక్యం చేసుకుంటూ.. తమ గొప్ప విద్యాంసుడు ఇదివరకెన్నడూ నా మాదిరిగా వేదవేదాంగాల్లో పేరు మోసిన వారిని ఎదురించి ఉండలేదు. నిజమైన విద్వాంసులు కాని వారితోనూ, సుహృదయులైన వారితోనూ వాదించి తాను గెలుపొందాననే అతిశయం, గర్వంతో 'వంది' ఉన్నాడు. నా తండ్రి ఈ వంది చేతిలో ఓడిపోయి నీటిలో పడి చనిపోయాడని నా తల్లి చెప్పగా విన్నాను. మా తండ్రి రుణం తీర్చడానికి నేను ఇక్కడికి వచ్చాను. నేను 'వంది'ని నిశ్చయంగా జయించి తీరతాను. చక్రం విరిగిన బండిలా మీ 'వంది' కుంగిపోతాడు. ఆయనను పిలిపించండి" అన్నాడు.

అష్టావక్రుడు.. 'వంది'ని కలిశాడు. వాదనకు యుక్తమైన ఒక అంశాన్ని వారు ఏర్పరుచుకొని వాదనకు ఉపక్రమించారు. ఒకరికున్న జ్ఞానమంతా రెండోవాణ్ణి ఓడించడానికి పూర్తిగా ఉపయోగిస్తున్నారు. చివరికి సభవారంతా ఏకగ్రీవంగా అష్టావక్రుడు విజయాన్ని, 'వంది' ఓటమిని స్థిరపరిచారు. మిథిలా నగరపు సభా పండితుడైన 'వంది' నమ్రతతో తల వంచి తన ఓటమిని అంగీకరించాడు. నిబంధన ప్రకారంలో సముద్రంలో పడి మరణించాడు. తర్వాత అతడు వరుణ లోకం వెళ్లాడు. అప్పుడు అష్టావక్రుని తండ్రి అయిన ఖగోళుని ఆత్మ సంతోషించింది, శాంతించింది. తన కుమారుడి కీర్తిని ప్రశంసించింది.

భారత గ్రంథకర్త ఖగోళుడు చెప్పినట్లు.. ఈ దిగువ వాక్యాలను చెప్పి మనకందరికీ తద్వారా ఉపదేశం ఇస్తున్నాడు. "కుమారుడు తండ్రిలా ఉండాల్సిన

అవసరం లేదు. శారీరకంగా బలహీనుడైన తండ్రి.. బలవంతుడైన కుమారుణ్ణి కలిగి ఉండొచ్చు. అజ్ఞాని అయిన తండ్రి విద్వాంసుడైన కుమారుణ్ణి కలిగి ఉండొచ్చు. ఒకని రూపాన్ని బట్టి, వయసును బట్టి అతని గొప్పదనాన్ని చెప్పడం పొరపాటు. బయటకు కనిపించేవి మనల్ని వంచన చేస్తాయి" అన్నాడు.

దీనివల్ల గొప్ప విద్యాంసుడు కాకపోయినా.. ఖగోళుడు సామాన్య ప్రపంచ జ్ఞానం కలవాడని చెప్పవచ్చు.

◈



హనుమంతుని తోక ఎత్తడానికి
ప్రయత్నిస్తున్న భీముడు

## అధ్యాయం - 36

# భీముడు - హనుమంతుడు

**"అ**ర్జునుడులేని ఈ కావ్య కవనం నాకు ఆనందాన్నివ్వదు. అతడు లేనందువల్ల నాకీ జీవితంలో ఏ ఆనందమూ లేదు" అన్నది ద్రౌపది. దివ్యాస్త్ర, శస్త్రాల సంపాదనకు హిమాలయ ప్రాంతానికి వెళ్లిన అర్జునుడి వియోగ బాధ, ద్రౌపది, మిగిలిన పాండవులు అనుభవిస్తున్నారు. "ఓ ఆయుష్మంతురాలా.. అర్జునుడి గురించి నీ మాదిరిగానే నాకూ వేదన ఉంది. నీవన్న మాటలు నా హృదయం ప్రేమతో.. కరుణతో స్పందిస్తోంది. అర్జునుడు లేని ఈ అందమైన అడవి పాడుపడినట్లుంది. అర్జునుణ్ణి చూసే వరకూ నా మనసుకు శాంతిలేదు. సహదేవా నీకు ఎలా ఉంది చెప్పు?" అన్నాడు భీముడు. "ఈ ఆశ్రమం అర్జునుడులేక శూన్యంగా కనబడుతోంది. ఈ పరిసరాలు విడిచిపోతే ఈ వియోగ బాధను మరిచిపోగలమేమో..చూద్దాం" అన్నాడు సహదేవుడు. యుధిష్టరుడు తన పురోహితులైన ధౌమ్యులతో ఇలా అన్నాడు. "నా చిన్న సోదరుడు అర్జునుణ్ణి ఇంద్రాదుల వల్ల దివ్యాస్త్ర సంపాదన కోసం పంపాను. ఆ ధైర్య సాహసోపేతుడైన వీరుడు ఇంకా తిరిగి రాలేదు. ఈ అస్త్ర సహాయంతో దుర్యోధన

పక్షాన నుంచి యుద్ధానికి వచ్చే భీష్మ, ద్రోణ, కృప, అశ్వద్థామలను గెలవాలని భావించాం. దివ్యాస్త్ర వేది కర్ణుడు. అతడి ముఖ్య కోరిక అర్జునుడితో పోరాడటమే. దివ్యాస్త్రాలతో కాకుండా ఇతరాలతో కౌరవ వీరులు జయింపరాని వారవుతారు. అందువల్ల ఇంద్రుని దయతో దివ్యాస్త్రాలను సంపాదించేందుకు అర్జునుణ్ణి పంపాము. కిష్టమైన కార్యసాధనకు అతన్ని పంపి వారం అయింది. మేమిక్కడ ఆనందంగా ఉండలేకపోతున్నాము. అతను విహరించే ప్రతి స్థలాన్ని, అతన్ని మాకు జ్ఞాపకం చేస్తూ వియోగ కష్టాన్ని కలిగిస్తోంది. మరో స్థలానికి వెళ్దామని అనిపిస్తోంది. అలా అయితే ఈ అర్జునుడి వియోగం తక్కువ కష్టంతో భరిస్తాము. మనం ఎక్కడికి వెళ్లగలమో సెలవిచ్చెదరా?"

ధౌమ్యుడు చాలా అరణ్యాలను, పవిత్ర స్థలాలను వర్ణించి చెప్పాడు. చెప్పిన ప్రతి స్థలమూ చూస్తూ కొంతవరకూ అర్జునుడి వియోగ వ్యధను తగ్గించుకున్నారు. ఈ ప్రకారం వారు చాలా సంవత్సరాలు తిరిగి తీర్థయాత్రలు చేసి ప్రతి పుణ్య స్థలం చరిత్రను వింటూ కాలం గడుపుతున్నారు. ద్రౌపది ఒక్కోసారి మెట్టపల్లాలు, కొండలుగల అడవుల్లో నడవడం వల్ల అలసిపోతోంది. భీముడు తన కుమారుడైన ఘటోద్ఘజుడి సాయంతో వారికి ధైర్యాన్ని నూరిపోస్తూ.. నడక కష్టాన్ని తగ్గిస్తున్నాడు. హిమాలయ ప్రాంతంలో వాళ్లు వెళ్తుండగా.. మార్గమంతా బహు కర్కశంగా, ఉన్నతంగా ఘోరారణ్యం మధ్య ఉంది. యుధిష్టరుడు కొంత కలతచెంది వారు వెళ్లే మార్గం బహు కష్టంగా ఉండటం వల్ల ద్రౌపదికి చాలా ఆయాసం వస్తుందేమోనని భయాందోళన చెందుతూనే, తాను మాత్రం నకులుడితోనూ, లోమశునితోనూ ఆ మార్గాన వెళ్తామని, భీముడూ, సహదేవుడూ గంగా ద్వారం వద్ద ద్రౌపదితో ఉండాలని అన్నాడు. భీముడు దీనికి ఒప్పుకోలేదు. సహదేవుణ్ణి, ద్రౌపదిని, భీముణ్ణి విడిచి ఉండటం యధిష్టరుడికి ఎంత కష్టమో తెలిసేలా చెప్పారు. అదీగాక వన్య, క్రూర మృగాలు, రాక్షసులు, భూతాలతో నిండిన ఈ అడవిలో యధిష్టరుణ్ణి ఒంటరిగా వదిలి భీముడు ఉండలేడు.

నడవడానికి మార్గం చాలా కష్టంగా ఉంది. "చాలా కష్టసాధ్యమైన ప్రదేశంలో ద్రౌపదిని నేనెత్తుకొని తీసుకెళ్లగలను. నకుల, సహదేవుణ్ణి కూడా అలాగే తీసుకువెళ్లగలను" అన్నాడు భీముడు. యధిష్టరుడు భీముణ్ణి కౌగలించుకున్నాడు. భీముడికింకా దేహ బలంకలగాలంటూ ఆశీర్వదించాడు. ద్రౌపది నవ్వి.. "నన్నెవరూ ఎత్తుకొని తీసుకు వెళ్లనక్కరలేదు. నేను నడవగలను. నా గురించి మీరు ఆందోళన చెందవద్దు" అని యధిష్టరుడితో అంది. అలా వారు హిమాలయ ప్రాంతంలో ఉండే సుభాహు రాజ్యమైన కురిందను ప్రవేశించారు. ఆ రాజు వారికి తగిన మర్యాదలు చేశాడు. అక్కడ కొంతసేపు ఉన్నారు. తరువాత అత్యంత ఆనందదాయకమైన

నారాయణాశ్రమానికి వెళ్లి అక్కడ ఆగారు.

ఒకనాడు ఈశాన్య పవనంతో కొట్టుకొచ్చిన అందమైన పుష్పం ద్రౌపది చెంతకు వచ్చి పడింది. ఆమె ఆ పువ్వును తన చేతిలోకి తీసుకుంది. దాని అందంతోనూ, సువాసనతోనూ తన్మయత్వం చెందింది. దాన్ని ప్రేమతో చూపుతూ.. "ఆహా ఏమీ సువాసన. ఏమి అందము. దీన్ని యధిష్టరునికి ఇస్తాను. ఇలాంటి పుష్పాలు మరికొన్ని తెచ్చిపెట్టు ఈ పూల మొక్కను మన కామ్య కవనంలో పెంచుదాము"అని పరుగెత్తి యధిష్టరుడికి అందజేసింది. తన ప్రియురాలైన ద్రౌపదికి ఆనందం చేకూర్చదలిచి భీముడు ఆ పూల మొక్క కోసం వెదుకుతూ అరణ్యంలోకి వెళ్లాడు. తన మార్గానికి అడ్డం వచ్చే క్రూరమృగాలను సైతం లెక్కచేయకుండా ఆ పుష్ప వాసన వచ్చిన మార్గాన్నే భీముడు ఒంటరిగా వెళ్తున్నాడు. తర్వాత కొండ లోయను, అందులోని కదళీ వనాన్ని చేరుకున్నాడు. తన మార్గానికి అడ్డుగా పడుకొని అగ్నిలా మెరుస్తున్న ఓ పెద్ద వానరాన్ని చూశాడు. దాన్ని భయపెట్టి మార్గం నుంచి వెళ్లగొట్టడానికి చప్పట్లు చరిచాడు. ఆ వానరం కొద్దిగా కళ్లు తెరిచి చాలా బద్ధకంగా గొణిగింది. "నాకు ఒంట్లో బాగోక ఇక్కడ పడి ఉన్నాను. నన్నెందుకు మేల్కొలిపావు. నీవు బుద్ధిగల మానవుడివి. జంతువులు తనకన్నా తక్కువ జాతివని వాటిపై దయ చూపడం న్యాయం. నీకు మంచి చెడ్డల విచక్షణ తెలిసినట్లు నాకు అనిపించడం లేదు. నీవెవడవు? ఎక్కడకు వెళ్తున్నావు?. ఇక్కణ్ణుంచి ఈ పర్వత మార్గాన వెళ్లడానికి వీలుపడదు. అది దేవతల మార్గం. ఈ హద్దు దాటి మానవులు వెళ్లలేరు. ఇక్కడ ఉన్న పండ్లను నీకిష్టమైన వాటిని తిని బుద్ధిమంతుడిగా తిరిగి నెమ్మదిగా వెళ్లు" అంది ఆ వానరం.

ఇతరులతో ఇంత చులకనగా మాటలు అనిపించుకోవడం భీముడికి ఆగ్రహం తెప్పించింది. "ఓయీ కోతీ, తలకు తగని ఇలాంటి పెద్ద కబుర్లు చెప్పే నీవు.. ముందు నువ్వెవరో చెప్పు?. నేనొక క్షత్రియ వీరుణ్ణి. కురు వంశం వాణ్ణి. కుంతీపుత్రుణ్ణి. నేను వాయుదేవుడి పుత్రుణ్ణని కూడా తెలుసుకో. ఇక దారికి అడ్డు తొలిగిపో. అలా చేయకుండా నన్ను ఆపితే నీకు అపాయం కలుగుతుంది" అన్నాడు భీమసేనుడు.

"నీవు అన్నట్లు నేను కోతినే. కానీ నీవు బలవంతంగా మార్గాన్ని చీల్చుకొని వెళ్లావా నీవు నశిస్తావు" అన్నది వానరం. "నీ సలహాను నేను కోరలేదు. నేను నశిస్తాననే మాట నీకు అనవసరం. లేచి పక్కకు తొలుగు. లేదా నేనే నిన్ను తొలిగిస్తాను". అన్నాడు భీముడు. "నేను ముసలి కోతిని. నేను నిలబడలేను. ఎంత ప్రమాదమైనా నీవు వెళ్లి తీరాల్సి వస్తే నాపైన లంఘించి వెళ్లు." అన్నది వానరం. "అంత సులువైన పని మరొకటి

లేదుగాని, అలా చేయడానికి శాస్త్రాలు ఒప్పువు. ఈ అడ్డు లేకపోతే హనుమంతుడు సముద్రాన్ని లఘించినట్లు నీపైనా, ఈ పర్వతం పైనా లంఘించేవాణ్ణి" అన్నాడు భీముడు. ఆ వానరం ఆశ్చర్యపడినట్లు నటించింది. "ఓయీ పురుష శ్రేష్ఠుడా!, సముద్రాన్ని లంఘించిన ఆ హనుమంతుడెవ్వడు?. నీకు అతని చరిత్ర తెలిసి ఉంటే నాకు చెప్పు?" అన్నది కోతి. "రాముడి భార్య సీతను వెదకడానికి వంద యోజనాలు వెడల్పయిన సముద్రాన్ని దాటిన నాపెద్ద సోదరుడైన హనుమంతుడి గురించి నీవు వినలేదా?. వీరత్వంలోనూ, బలంలోనూ నేను అతనికి సమానుణ్ణి. సరే. ఇంతవరకూ జరిగిన సంభాషణ చాలు. ఇంతకూ నీవు లేచి నాకు మార్గం ఇవ్వు. నాకు కోపం తెప్పించి నీకు హాని జరగకుండా చూసుకో" అన్నాడు భీముడు.

"ఓ మహావీరా, శాంతించు. నీవు వృద్ధుల పట్ల బలహీనుల పట్ల దయతలుచు. నేను వయో వృద్ధుణ్ణి అవడం వల్ల లేవలేను. నాపైనుంచి దూకి నీవు వెళ్లలేనప్పుడు నా తోకను తొలిగించి మార్గం చేసుకో" అన్నది వానరం.

బాహుబలుడైన భీముడు కోతి తోకను బట్టి పక్కకు ఈడ్చివేయ దలిచాడు. తోకను పట్టుకొని పక్కకు తప్పించడానికి ప్రయత్నించాడు. ససేమిరా కదల్లేదు. భీముడు నిర్ఘాంతపోయాడు. తన దౌడలను జత చేసి, కండరాలను బిగబట్టి తోకను పక్కకు జరిపేందుకు ప్రయత్నించాడు. సూది మొనంత కూడా కదల్లేదు. ఏ వైపునకు కదిలించినా ఈషణ్మాత్రం కదల్లేదు. భీముడు సిగ్గుతో తల వొంచుకున్నాడు. శాంత స్వభావుడై వానరంతో.. "నీవెవరవు?, నా అపచారాన్ని క్షమించు. నీవు సిద్ధుడవో, దేవుడవో, గంధర్వుడవో నాకు చెప్పు" భీముడు కూడా తనకన్నా ఎక్కువ బలవంతుల పట్ల భక్తి గౌరవాన్ని చూపగలవాడుగా, గురువుతో శిష్యుడు పలికినట్లుగా కోతిని (హనుమంతుణ్ణి) అడిగాడు. హనుమంతుడు ఇలా చెప్పాడు. "మహా బలుడవైన ఓ పాండవా?, ఇప్పుడే నీవు చెప్పిన వాయు దేవుని కుమారుడనైన హనుమంతుణ్ణి నేనే. నీ సోదరుణ్ణి. నీవీ మార్గంలో వెళ్తే ఇది యక్షులు, రాక్షసులు మొదలైన వారి ప్రపంచానికి చేరుతుంది. నీకు అపాయం వాటిల్లుతుందని నేను నిన్ను ఆపాను. ఈ స్థలం దాటి వెళ్లే ఏ మానవమాత్రుడూ బతకడు. కానీ ఈ సమీపంలోనే నీవు వెదుకుతున్న సౌగంధిక పుష్పాలు కల నది ఉంది. ఆచట నీకు కావలసినవి దొరకుతాయి" అన్నాడు.

భీముడు ఆనంద పరవశుడయ్యాడు. నా అన్నను దర్శించే భాగ్యం నాకు కలిగింది. కనుక నేను మానవుల్లో అదృష్టవంతుణ్ణి. మీరు సముద్రాలపై ఎగిరేటప్పుడు ఉండే శరీరాన్ని ధరించి నాకు చూపండి" అంటూ భీముడు.. హనుమంతుడికి సాష్టాంగ దండ ప్రమాణం చేశాడు. హనుమంతుడు నవ్వుతూ తన శరీరాన్ని పెంచాడు. ప్రపంచం నాలుగు దిక్కులకు కమ్ముకొని ఒక మహాపర్వతంలా పెరుగుతూ, కంటికి కనపడే అవకాశం ఉన్నంతా శరీరంతో కప్పి వేశాడు. భీముడు తన అన్న అయిన హనుమంతుడు విశ్వరూపం గురించి విని, ఇదివరకే ఆశ్చర్యపడుతుండేవాడు. ఇప్పుడు తాను కళ్లతో చూశాడు. అతడి శరీరం జలదరించింది. హనుమంతుడి నుంచి బయలుదేరిన దివ్య తేజస్సును చూడలేక కళ్లు మూసుకున్నాడు. భీముణ్ణి ఉద్దేశించి హనుమంతుడు.. "భీమా, నా శత్రువుల ఎదుట నా శరీరం ఇంతకంటే కూడా పెరుగుతుంది" అంటూ చిన్నదైన తన అసలు కోతి రూపుకు కుంచించుకుపోయాడు. ప్రేమతో భీముణ్ణి కౌగలించుకున్నాడు. హనుమంతుని కౌగిలి నుంచి వీడిన తరువాత భీముడికి ఆనందం కలిగి పూర్వం కంటే ఎక్కువ బలం కలవాడు అయ్యాడని వ్యాసుడు చెప్పాడు.

హనుమంతుడు.. "ఓ వీరుడా.. నీవు బసకు వెళ్లు. నీకు అవసరమైనప్పుడు నన్ను గుర్తుకు తెచ్చుకో. నేను నిన్ను కౌగలించుకున్నప్పుడు పూర్వయుగంలో నా పుణ్య వశమున శ్రీరాముని దివ్య దేహం తాకినప్పుడు ఎలాంటి ఆనందం అనుభవించానో, అలాంటి ఆనందాన్నే ఇప్పుడూ అనుభవించాను. నీకు కావలసిన వరం కోరుకో. అందుకు భీముడు.. "నా అదృష్టం కొద్దీ నిన్ను దర్శించగలిగాను. దీనివల్ల పాండవులు ధన్యులయ్యారు. నీ బల సత్వాల చింతన వల్లే మా శత్రువులను జయింపగలం" అన్నాడు. తమ్ముడైన భీముణ్ణి ఆశీర్వదించి వీడ్కోలు పలికాడు హనుమంతుడు. "యుద్ధరంగంలో నీవు సింహంలా గర్జించినప్పుడు నా గర్జన కూడా దానికి కలిపి నీ శత్రువుల హృదయాలను భగ్నం చేయగలం. నీ తమ్ముడు అర్జునుడి రథంపై ఉండే జెండాలో నేను ఉంటాను. మీరు జయిస్తారు" అన్నాడు హనుమంతుడు. భీముడు వెదుకుతూ వచ్చిన సౌగంధిక పుష్పాలు కల నదిని హనుమంతుడు చూపాడు. ఈ పుష్పాలు గుర్తుకు రాగా, ద్రౌపది వీటికోసం వేచి ఉంటుందని తలచి పువ్వులను కోసుకొని ఆమె వద్దకు తిరిగి వచ్చాడు.

◈

అధ్యాయం - 37

# ధర్మ సూక్ష్మం తెలుసుకున్న సద్బ్రాహ్మణుడు

**ఒ**కసారి మార్కండేయ రుషి పాండవులను చూడటానికి వచ్చాడు. ఆ సమయంలో స్త్రీ ప్రాతివత్యం గురించి యధిష్ఠరుడు మాట్లాడుతున్నాడు. "స్త్రీ ఓరిమి, ప్రాతివ్రత్యం కంటే అద్భుతమైంది ఈ ప్రపంచంలో ఉందా?. శిశువును చాలా కాలం గర్భాన ధరించి, తన ప్రాణం కన్నా అధికంగా చూస్తూ ప్రసవిస్తుంది. ఎంతో కష్టాన్ని, ఆందోళనను అనుభవించి ప్రసవం అయిన దగ్గర్నుంచి ఆ శిశువు ఆరోగ్యం, సౌఖ్యం గురించే నిరంతరం ఆలోచిస్తుంది. విశాల హృదయం, క్షమా గుణం కలిగి, తనను తాను లక్ష్య పెట్టక, సకల బాధలను పెట్టి అసహ్యించుకొనే క్రూరమైన భర్తను క్షమిస్తూ, అతన్ని ప్రేమిస్తూనే ఉంటుంది? ఏమిటీ వింత?" అని అంటున్నాడు.

ఆ మాటలు విన్న మార్కండేయుడు ఒక కథ చెప్పాడు. "కౌశికుడు" అని ఒకడుండేవాడు. అతడు ఎంతో శ్రద్ధతో బ్రహ్మచర్య వ్రతాన్ని ఆచరిస్తున్నాడు.

అతడొకనాడు ఓ వృక్షం కింద వేదాధ్యయనం చేస్తున్నాడు. ఆ చెట్టుపై నుంచి ఒక కొక్కెర రెట్ట వేయగా అది కౌశికుడి తలపై పడి మలినమైంది. అతడు తల పైకెత్తి చూశాడు. కోపంతో చూసిన ఆ చూపుకు కొక్కెర చచ్చి కింద పడింది. ఆ పక్షి చచ్చి పడిపోవడం చూసి బ్రాహ్మణుడు చాలా విచారించాడు. మన తలంపులన్నీ ఫలించనప్పుడు, తొందరపాటు, కోపం కలిగినప్పుడు పుట్టిన కోరిక తక్షణం ఫలం ఇస్తే ఎంత భయంకర దృశ్యం అవుతుంది? తరువాత పశ్చాతాపానికి, జాలికి ఎంత అవకాశం ఉంటుంది?. కానీ మన కోరికలు ఫలించడానికి ఇతర అంశాలు, పరిస్థితులు కూడా సహాయ పడాల్సి రావడం వల్ల మనం పాపం నుంచీ, విచారం నుంచీ రక్షితులం అవుతున్నాం. తన హృదయంలో తాత్కాలికంగా కలిగిన కోపపు దురాలోచన అమాయకమైన ఓ పక్షిని బలి తీసుకోవడంతో కౌశికుడు ఎంతో విచారించాడు. కొంత సేపయిన తరువాత అతడు తన మామూలు భిక్షకు బయలుదేరి వెళ్లాడు. భిక్ష కోసం ఓ ఇంటి ముందు నిలబడ్డాడు. ఆ సమయంలో ఆ ఇంటి యజమానురాలు పాత్రలను శుభ్రం చేస్తోంది. ఆ పని అయ్యాక ఆమె తనకు భిక్ష వేస్తుందని కౌశికుడు అలాగే నిలబడ్డాడు. ఈ లోగా ఇంటి యజమాని అలసిపోయి ఆకలితో ఇంటికి వచ్చాడు. భార్య ఆయనకు సపర్యలు చేసి కాళ్లు కడిగి, తడి తుడిచి, ఆహారం పెట్టింది. ఈ పనుల్లో నిమగ్నమై బయట నిలిచి ఉన్న భిక్షకుణ్ణి ఆమె మరిచిపోయింది. తన భర్తకు సపర్యలు పూర్తయి, ఆయన భోజనం చేసిన తరువాత భిక్ష తీసుకొని బయటకు వచ్చింది. "తమరిని చాలా సేపు నిలబెట్టినందుకు విచారిస్తున్నాను. నన్ను క్షమించండి" అన్నది. కౌశికుడు కోపంతో.. "ఓ వనితా, నన్ను చాలా సేపు నిలబెట్టావు. ఇలాంటి నిర్లక్ష్యం మంచిది కాదు" అన్నాడు. "బ్రాహ్మణోత్తమా, దయవుంచి నన్ను క్షమించు. నేను నా భర్తకు సపర్యలు చేస్తున్నాను. అందుచేత ఆలస్యమైంది'' అని ఆ స్త్రీ అంది. "భర్తకు సపర్యలు చేయడం మంచిదే. కానీ బ్రాహ్మణుణ్ణి నిరాదరించకూడదే. నీవు గర్విష్టిలా కన్పిస్తున్నావు" అన్నాడు కౌశికుడు. "నన్ను కోపగించుకోకు. నేను నా భర్తకు యుక్తమైన సేవలు చేసేందుకే మిమ్మల్ని నిలబెట్టాల్సి వచ్చిందని తమరు ఆలోచించాలి. ఒక ఉద్రేకపు ఆలోచన మీకు కలిగిన తక్షణం చనిపోవడానికి నేను కొక్కెరను కాను. మీ కోపం పతివ్రతను ఏ విధంగానూ హాని చేయలేదు'' అన్నది ఆ మహిళ. బ్రాహ్మణుడు నిర్ఘాంతపోయాడు. ఆమెకు కొక్కెర సంగతి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపడ్డాడు. ఆమె ఇంకా ఇలా అంది. "మహానుభావా, నీకు నీ కర్మ రహస్యం తెలియదు. ఒకని కోపమే తన శత్రువై శరీరంలో ఉంటుందని కూడా నీకు తెలియదు. మీకు సేవ చేయడం ఆలస్యమైనందుకు క్షమించండి. మీరు మిథిలా పట్టణానికి వెళ్లి మంచిగా జీవించడానికి గల రహస్యాన్ని అక్కడ ధర్మ వ్యాధుడి ద్వారా తెలుసుకోండి"

అన్నది. బ్రాహ్మణుడు మరింత ఆశ్చర్యపోయాడు. "నీ శిక్షణ వాక్యాలకు నేను తగియే ఉన్నాను. ఆ మాటలు నాకు మంచే చేశాయి. నీకు సర్వవిధాలా శుభం కలుగుగాక" అని దీవించి అతడు మిథిలా నగరానికి వెళ్లాడు.

కౌశికుడు మిథిలా నగరం వెళ్లి ధర్మవ్యాధుని గృహం కోసం వెదుకుతున్నాడు. ఈ ధర్మవ్యాధుని ఇల్లు ఓ ఆశ్రమం మాదిరిగా పట్టణం బయట ప్రత్యేకంగా ఉంటుందని కౌశికుడు భావించాడు. ఆ నగర రాచబాటల మీదుగా వెళ్తూ గొప్ప భవనాలు, ఉద్యానవనాలు చూస్తూ చివరికి ఒక మాంసపు దుకాణానికి వెళ్లాడు. అక్కడ యజమాని మాంసాన్ని అమ్ముతున్నాడు. ఆ మాంసం అమ్మకందారుడే ధర్మవ్యాధుడ(కటికవాడు)ని తెలుసుకొని కౌశికుడు విస్మయం చెందాడు. బ్రాహ్మణుడు చీకాకు పడుతూ మాంసం దుకాణానికి దూరంగా నిలబడ్డాడు. ఆ కటికవాడు లేచి బ్రాహ్మణుడి వద్దకు వచ్చాడు. "మహాత్మా, తమరు క్షేమమా?. ఆ మహా పతివ్రత అయిన బ్రాహ్మణ స్త్రీ నా వద్దకు పంపిందా?" అన్నాడు.

ఈ మాటలతో కౌశికుడు నిర్ఘాంతపోయాడు. "మహాత్మా, తాము ఎందుకు ఇక్కడికి వచ్చారో నాకు తెలుసు. మా ఇంటికి రండి" అంటూ ధర్మవ్యాధుడు.. కౌశికుణ్ణి తన ఇంటికి తీసుకువెళ్లాడు. అక్కడ ఆనందంగా ఉండే ఒక కుటుంబాన్ని చూశాడు కౌశికుడు. ధర్మవ్యాధుడికి తల్లిదండ్రులపై ఉన్న భక్తి కౌశికుణ్ణి ఎంతో ఆకట్టుకుంది. ఆ ధర్మవ్యాధుడు దగ్గర కౌశికుడు ధర్మం గురించి, మనిషి మంచి పనుల గురించి నేర్చుకొని తిరిగి తన ఇంటికి వచ్చాడు. కౌశికుడు అంతకు పూర్వంలా కాకుండా ఇప్పుడు తల్లిదండ్రులకు అత్యంత భక్తితో సేవ చేస్తున్నాడు.

వ్యాసుడు ఈ ఉపాఖ్యానాన్ని మహాభారత గ్రంథంలో అద్భుతంగా ఇమిడ్చాడు. ఇందులో నీతి భగవద్గీతను అనుసరిస్తుంది. "జీవితంలో తనకు జన్మరీత్యా సంభవించే మంచి పనులను, వృత్తిని శ్రద్ధాసక్తులతో చేయడమే అంతటా నిండివున్నదే భగవంతుడి సేవ". ఈ వృత్తి అనేది మూడు విధాలు కలది. 'తన పుట్టుకవల్ల వచ్చేది', 'కొన్ని పరిస్థితుల ఒత్తిడితో చేయక తప్పనిది', 'తాను కోరుకుని చేసేది'. ఇందులో ఏదైనా సరే, శ్రద్ధాసక్తులతో చేయడమే మూలమని అర్థం.

పైన ఉదహరించిన అంశాన్ని వ్యాసుడు ప్రపంచానికి అద్భుతంగా తెలియజేశాడు. మాంసం అమ్ముకొని జీవించే ఒక నీచ వృత్తిగల కటికవాడి వద్ద, సకల శాస్త్రాలూ చదివిన, ధర్మసూక్ష్మం తెలియని ఒక సద్బ్రాహ్మణుడు దాన్ని నేర్చుకోవడం గురించి తెలియజేశాడు.

◈

## అధ్యాయం - 38

# నిలువునా కాల్చే ద్వేషాగ్ని

**పా**ండవులు అరణ్యవాసంలో ఉన్నప్పుడు చాలా మంది బ్రాహ్మణులు వారిని దర్శించడానికి వెళ్లేవారు. అందులో ఒకరు హస్తినాపురానికి తిరిగి వచ్చి, ధృతరాష్ట్రుణ్ణి చూడటానికి వెళ్లాడు. ధృతరాష్ట్రుడాయనను మర్యాదగా ఆహ్వానించాడు. పాండవులు పుట్టుకతోనే రాజపుత్రులని, దురదృష్టంతో అరణ్యాల్లో బాధలు పడుతున్నారని ఆ బ్రాహ్మణుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడు. బహుశా ఇది ధృతరాష్ట్రుడికి విచారం కలిగించి ఉండొచ్చు. కానీ ఇలా పాండవులు బాధ పడిన తరువాత తన కుమారులకు ఏమి అపాయం వస్తుందో అని ఆలోచించేవాడు. భీముడి ఆగ్రహాన్ని యుధిష్ఠరుడు ఆపగలడా? అని ఆలోచించేవాడు. పాండవులు కోపాన్ని దిగమింగుకొంటున్నా.. ఏదో ఒకనాడు హద్దు మీరి ఎలాంటి ప్రమాదం కలగచేస్తారో అని ధృతరాష్ట్రుడు భయపడుతున్నాడు. అర్జునుడు, భీముడు నిశ్చయంగా మమ్మల్ని శిక్షించి తీరతారు. శకుని, కర్ణుడు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు తేనె పట్టు కోసం చెట్టు పైకెక్కి ఆశతో

ఉండొచ్చు. కానీ చెట్టు కింద ఉన్న భీముడి కోపం అనే అగాధం వారిని ముంచడానికి సిద్ధంగా ఉందని వారు ఎరుగరు అనుకున్నాడు ధృతరాష్ట్రుడు. "అయినా మేము ఆశ పోతులం ఎందుకయ్యాం. మమ్మల్ని దరిద్రమా, అలాంటి ఆశకు పురికొల్పలేదు. అన్యాయ మార్గం ఎందుకు తొక్కాం. మాకున్న మితిమీరిన ఐశ్వర్యాన్ని సంతోషంతో అనుభవించక ప్రతిభ కోసం, సంపదల కోసం ఆశ చెంది మాది కానిదానికి ఆశించాము. దుర్మార్గం తగిన ఫలితం ఇచ్చి తీరుతుంది. అర్జునుడు స్వర్గం నుంచి దివ్యాస్త్రం సంపాదించి తిరిగి వచ్చాడు. స్వర్గానికి వెళ్లిన అతడు మాపైన కక్ష సాధించడానికి గాకపోతే మళ్లీ భూమికి ఎందుకు తిరిగి వచ్చాడు?. ఇదంతా మేము చేతులారా సంపాదించిందే" అని మనసులో అనుకున్నాడు దృతరాష్ట్రుడు. ఆయన తీవ్ర విచారంలో మునిగి పోయాడు.

ఇలా దృతరాష్ట్రుడు చికాకు పడుతున్నప్పటికీ శకుని, కర్ణుడు, దుర్యోధనుడు మితిమీరిన ఉన్మతానందులయ్యారు. వారు చేసిన పనులు ఒకరినొకరు మెచ్చుకుంటున్నారు. కర్ణ, శకునులు.. దుర్యోధనుడితో, "యుధిష్టరుడి హస్తగతమైన రాజ్యమిప్పుడు మనకు వచ్చింది. కనుక మనకిప్పుడు ఈర్ష్య అవసరం" అన్నారు. అందుకు దుర్యోధనుడు.. "ఓయీ కర్ణా, నీవు చెప్పింది నిజమే. కానీ నా కళ్లతో వారి కష్టాలు చూసి వారి ఎదుటే మన గొప్పదనాన్ని ప్రదర్శించి వారికింకా బాధను కలుగజేస్తే నాకు మరింత బ్రహ్మానందం కలుగుతుంది. మనం అడవులకు పోయి స్వయంగా పాండవుల కష్టాలను చూడటం వల్లనే ఈ బ్రహ్మానందాన్ని పొందగలం. కానీ నా తండ్రి దానికి అంగీకరించడు" అంటూ కంట నీరు పెట్టుకున్నాడు. "తండ్రికి పాండవులన్న భయం. వారంతా తపశ్శాలురని, గొప్ప ప్రభావంగలవారని, వారుండే అడవులవైపు వెళ్లొద్దని, అలా వెళ్తే మనకు అపాయం కలుగుతుందని ఆయన అభిప్రాయం. ద్రౌపది, భీముడు, అర్జునుడు పడే బాధలు చూడందే ఇంతవరకూ మనం చేసినదంతా, పడిన కష్టాలన్నీ వృధా అవుతాయి. అలాంటి మహదానందం పొందని ఈ సోమరి జీవితం నాకు చికాకు కల్గిస్తున్నది. మనం అడవులకు వెళ్లి పాండవులు పడుతున్న దరిద్ర, క్లిష్ట దశలను చూడటానికిగాను శకుని, నీవు, ఏదో ఒక మార్గాన్ని కనిపెట్టి ధృతరాష్ట్రుడి అనుమతి పొంది రండి" అన్నాడు.

మరునాడు ఉదయం కర్ణుడు.. దుర్యోధనుడి వద్దకు సంతోషంతో వెళ్లి, తానొక మంచి ఉపాయం కనిపెట్టినట్లు చెప్పాడు. "ద్వైత వనంలో మన ఆలమందల లెక్కలను చూడటానికి వెళ్తున్నట్లు రాజుకు (ధృతరాష్ట్రుడికి) చెపుదాం. ఆయన తప్పక ఒప్పుకుంటారు" అన్నాడు కర్ణుడు. అతడి ఆ ఊహను శకుని, దుర్యోధనుడు మెచ్చుకున్నారు. ఆలమందల అధికారి అయిన పెద్ద పాలకుణ్ణి రాజాజ్ఞ కోసం పంపారు.

కానీ ధృతరాష్ట్రుడు అందుకు ఒప్పుకోలేదు. "ఆలమందల లెక్కలు చూడటం మంచిదే. కానీ పాండవులు ఆ అరణ్య ప్రాంతంలోనే ఉన్నారని విన్నాను. కావున మీరు అక్కడికి వెళ్లడం సమంజసం కాదు. కోపతాపాలు, జగడాలు ఉన్నంత కాలం మిమ్మల్ని భీమార్జునులు ఉన్న చోటుకు పంపడానికి నేనిష్టపడను" అన్నాడు ధృతరాష్ట్రుడు. దీంతో దుర్యోధనుడు.. "వారి వద్దకు మేం వెళ్లం. అదీగాక వారికి కనపడకుండా ఉండటానికే మేము ప్రయత్నిస్తాం" అన్నాడు. "మీరెంత జాగ్రత్తగా ఉన్నా.. దగ్గర్లోనే ఉన్నందున అపాయం ఉంటుంది. అదీగాక, పాండవుల వనవాస కష్టదశలో మనం అటువైపు వెళ్లకూడదు. నీ సైనికుల్లో ఎవడైనా హద్దు మీరి ప్రవర్తించినా అదే జగడానికి కారణమౌతుంది. మీ తరఫున ఎవరినైనా ఆలమందల లెక్కలు చూడటానికి పంపండి" అన్నాడు ధృతరాష్ట్రుడు. శకుని అందుకుంటూ.."ఓ రాజా, యుధిష్టరుడు తెలిసినవాడు. ధర్మమార్గం వీడడు. బహిరంగ సభలో అతడు మాట కూడా ఇచ్చాడు. పాండవులంతా అతని ఆజ్ఞ మీరరు. కుంతీకుమారులు మా పట్ల ఏమాత్రం శత్రుత్వం చూపరు. కనుక వేటలో కుతూహలమున్న దుర్యోధనుడు కోరికకు ఎదురురాకు. ఆలమందులు లెక్కలు చూసుకొని తక్షణమే తిరిగిరావాలని చెప్పు. నేను కూడా వాళ్లతోనే వెళ్లి మాలో ఎవరూ  కూడా పాండవులకు చేరువుగా వెళ్లకుండా చూస్తాను" అన్నాడు.

ధృతరాష్ట్రుణ్ణి మిక్కిలి ప్రాధేయపడటంతో వాళ్లను కరుణించి సరే అన్నాడు. ద్వైతవనానికి వెళ్లేందుకు అంగీకారం తెలిపాడు.

ద్వేషపూరిత హృదయానికి సంతుష్టి అనేది ఉండదు. ద్వేషమనేది ఓ అగ్ని. తాను జీవించి వృద్ధి పొందడానికి కారణమైన ఇంధనం ఉంచి రావలసినంత రాబట్టి కాల్చి వేస్తుంది.

◈

అధ్యాయం - 39

# దుర్యోధనుడికి అవమానం

**కౌ**రవులు గొప్ప సేనతోనూ, పెద్ద పరివారంతోనూ ద్వైత వనానికి వచ్చారు. దుర్యోధనుడు, కర్ణుడు ద్వైత వనంలో పాండవులను చూసి అవమానించడానికి మంచి సమయమిదే అని ఉప్పొంగిపోతున్నారు. వారిరువురూ పాండవుల ఆశ్రమాలకు నాలుగు మైళ్ల దూరంలో రమ్యమైన వసతిగృహాలను నిర్మించి అక్కడ బస చేశారు. ఆలమందల లెక్కలన్నిటిని సరిచూసుకున్నారు. తర్వాత నాట్యాల్లో పాల్గొని ఆనందించారు. వేటాడే సమయంలో పాండవుల ఆశ్రమ సమీపాన ఒక రమ్యమైన సరస్సును చూసి దాని తీరాన తమ గుడారాలను వేయించారు. తమ పరివారమంతా అక్కడే ఉండేటట్లు దుర్యోధనుడు ఏర్పాటు చేయించాడు. గంధర్వ రాజైన చిత్రసేనుడు ఇదివరకే తమ పరివారంతో బస చేసి ఉన్నాడు. సరిగ్గా అక్కడే దుర్యోధనుడి పరివారం గుడారాలు వేస్తుంటే చిత్రసేనుడి పరివారం అడ్డుకున్నది. దీంతో దుర్యోధనుడి సేవకులు అతడి వద్దకు వెళ్లి, ఎవడో రాజు కొడుకులు ఆ చెరువు ఒడ్డున బసచేసి ఉన్నారని, తమను

గుడారాలు వేయకుండా అడ్డుకుంటున్నారని చెవిన వేశారు. దుర్యోధనుడు ఆగ్రహంతో.. “అక్కడ గుడారాలు వేయించే రాజ కుమారుణ్ణి తరిమేసి మన గుడారాలు వేయండి” అని తమ సేవకులకు ఆజ్ఞ జారీ చేశాడు. దుర్యోధనుడి సేవకులు సరస్సు వద్దకు వచ్చి తమ రాజాజ్ఞను అమలు చేసే ప్రయత్నం చేశారు. కానీ చిత్రసేనుడి పరివారాన్ని దుర్యోధనుడి సేన ఎదుర్కోలేక పోయింది. సేన వెనుదిరిగి దుర్యోధనుడి వద్దకు వచ్చి చెవిన వేసింది. దుర్యోధనుడికి మరింత ఆగ్రహం పెల్లుబికింది. తన పెద్ద సైన్యంతో వెళ్లి గంధర్వ రాజైన చిత్ర సేనుడి పరివారంతో పోరాడాడు. ఇరు సేనల మధ్య సంకుల సమరం జరిగింది. సమరం ప్రారంభంలో కౌరవులే ముందజ వేసినా చిత్రసేనుడు అద్భుతమైన అస్త్రశస్త్ర ప్రయోగాలను చేయనారంభించాడు. దీంతో కౌరవుల సేన వెనుకబడటం ప్రారంభించింది. కర్ణుడు, ఇతర వీరులను నిరాయుధులను చేశారు. రథాలను వదిలేలా చేశారు. దీంతో దుర్యోధనుడి సైనికులు సిగ్గుతో మొహం చెల్లక పారిపోయారు. ఒక్క దుర్యోధనుడే యుద్ధ భూమిలో ఉన్నాడు. కానీ చిత్రసేనుడు.. దుర్యోధనుణ్ణి తన రథంపైకి ఈడ్చుకు వెళ్లి, కాళ్లూ చేతులూ కట్టేసి విజయ సూచికగా తన శంఖాన్ని పూరించాడు. గంధర్వులు చాలా మంది కౌరవ ముఖ్యులను ఖైదీలుగా పట్టుకున్నారు. కౌరవ సేన అంతా చెల్లాచెదురైంది. కొందరు భయభ్రాంతులై పాండవుల శరణు కోరారు.

దుర్యోధనుడి ఓటమి, కౌరవ ముఖ్యులు ఖైదీలుగా బంధింపబడటంతో భీముడు అమితానందం చెందాడు. “మనం చేయాల్సిన పని గంధర్వులు నెరవేర్చారు. బహుశా మనల్ని అవమానించడానికి ఇక్కడకు వచ్చిన దుర్యోధనుడికి తగిన శాస్తే జరిగింది. మనం ఈ గంధర్వ సోదరునికి వందనాలు అర్పించాలి” అన్నాడు భీమసేనుడు యుధిష్టరుడితో.

యుధిష్టరుడు అందుకొని.. “తమ్ముడా, నీవు ఆనందించే సమయం ఇది కాదు. కౌరవులు మన దగ్గరి బంధువులు. ఇతరుల చేతిలో వారు అగౌరవాన్ని, శిక్షనూ పొందడమంటే అవి మనకు జరిగినట్లే. మనం ఇలా మౌనం వహించడం తగదు. మనం కౌరవులను విడిపించి రక్షించాలి” అన్నాడు. ఈ మాటలు భీముడికి సమంజసంగా తోచలేదు. “లక్క ఇంటిలో మనల్నందరినీ కాల్చివేయడానికి ప్రయత్నించిన ఈ పాపిని మనమెందుకు రక్షించాలి. అన్నంలో విషం పెట్టి నా చేతులూ, కాళ్లూ బంధించి నదిలో పారవేసిన నీచుడి పట్ల నీకెందుకింత విచారం?. ద్రౌపదిని జుట్టు పట్టుకొని సభలోకి ఈడ్చి తెచ్చి అవమానించిన ఇలాంటి నీచుల పట్ల మనకు సోదర ప్రేమా?” అని ప్రశ్నించాడు భీమసేనుడు. సరిగ్గా ఆ సమయంలోనే దూరం నుంచి దుర్యోధనుడు బాధతో పెట్టిన ఆర్తనాదం వారికి వినిపించింది.

యుధిష్ఠరుడికి హృదయం చలించింది. భీముడి సహా తన తమ్ముళ్లందిరినీ వెళ్లి కౌరవులను రక్షించాలని ఆజ్ఞ ఇచ్చాడు. ఈ ఆజ్ఞను శిరసావహించిన భీమార్జునులు చెదిరిన కౌరవ సేనను కుదుట పరిచి గంధర్వులతో యుద్ధం చేశారు. కానీ గంధర్వరాజు చిత్రసేనుడికి పాండవులతో యుద్ధం చేయడం ఏమాత్రం ఇష్టం లేదు. వారు తన దగ్గరకు రావడం సమీపిస్తున్న సమయంలో దుర్యోధనుణ్ణి, ఇతర కౌరవ ముఖ్యులను విడిచిపెట్టాడు. తాను వారిని ఖైదు చేయడంలో ఉద్దేశం వారి గర్వమణచడమే అన్నాడు చిత్రసేనుడు. ఇలా పరాభవానికి గురైన కౌరవులు త్వరగా హస్తినాపురానికి వెళ్లిపోయారు. యుద్ధరంగం నుంచి పారిపోయిన కర్ణుడు, కౌరవులు మార్గమధ్యంలో అందరూ కలుసుకున్నారు. దుర్యోధనుడు అవమానభారంతో కుంగిపోయాడు. నిస్పృహ చెందాడు. పాండవుల ద్వారా విడిపించబడటం కన్నా గంధర్వుల చేతిలో చనిపోయినా బాగుండు అని భావించాడు. తాను నిరాహార వ్రతాన్ని చేసి చస్తానని అన్నాడు దుర్యోధనుడు. "నీవు రాజువై రాజ్యం ఏలు. నా శత్రువుల ఎదుట నాకు తీవ్ర అవమానం జరిగింది. నాకు జీవితంపై కోరిక లేదు" అన్నాడు" తమ్ముడైన దుశ్శాసనుడితో దుర్యోధనుడు.

దుశ్శాసనుడు తాను రాజ్యం చేయబోనని అన్న పాదాలను పట్టుకొని ఏడుస్తూ చెప్పాడు. ఆ అన్నదమ్ముల విచార దృశ్యాలను కర్ణుడు చూడలేకపోయాడు. "ఇది కురు వీరులకు తగని పని. విచారంతో చనిపోవడం ఏమిటి?. ఇలా చేయడమంటే నీ శత్రువుకి ఆనందం కలిగించడమే అవుతుంది. పాండవులను చూడు. వారెంత అవమానం చెందుతూ కష్టాలు పడుతున్నా వారు నిరశన వ్రతాన్ని చేపట్టారా?" అన్నాడు కర్ణుడు దుర్యోధనుడితో. శకుని అందుకుని.. "కర్ణుడి మాటలు విను. పాండవుల వద్ద నీవు సంపాదించిన రాజ్యాన్ని పాలించకుండా ప్రాణాలను విడవడమేంటి?. ఉపవాసం వల్ల ప్రయోజనమేంటి?. నిశ్చయంగా నీకు పశ్చాతాపం కలిగితే పాండవుల మైత్రి సంపాదించి వారి రాజ్యాన్ని వారికి తిరిగి ఇవ్వు" అన్నాడు

శకుని మాటలు విన్న దుర్యోధనుడికి వెంటనే తనలో దుర్మార్గ బుద్ధి పొడసూపింది. పాండవులకు వారి రాజ్యం తిరిగి ఇచ్చివేయడం.. తన భంగపాటు, అవమానం కన్నా నూరు రెట్లు ఎక్కువగా బాధను కలిగించింది. అతడు.."నేను పాండవులను జయిస్తాను" అని బిగ్గరగా అన్నాడు. "ఇదే రాజులు అనాల్సిన మాట. జీవించి ఉంటేనే ఏదైనా ఘనకార్యం చేయగలుగుతావు. పాండవుల పదమూడేళ్ల వనవాస, అజ్ఞాతవాసాలు పూర్తయిన వెంటనే నేను అర్జునుణ్ణి చంపుతాను" అని దైవసాక్షిగా ప్రమాణం చేస్తూ తన ఉడుపునూ, కత్తినీ ముట్టాడు కర్ణుడు.

◈



నిండుకున్న కుండను శ్రీకృష్ణునికి
చూపుతున్న ద్రౌపది

## అధ్యాయం - 40

# శ్రీకృష్ణుడి ఆకలి

**పాం**డవులు అరణ్యంలో ఉన్నప్పుడు దుర్యోధనుడు ఒక యజ్ఞాన్ని ఎంతో గొప్పగా నిర్వహించాడు. రాజసూయ యాగమే చేయాలని అతడి ఉద్దేశం. కానీ.. ధృతరాష్ట్రుడు, యుధిష్టరుడు జీవించి ఉండగా తానా యజ్ఞాన్ని చేయరాదని బ్రాహ్మణులు చెప్పడంతో ఆ ప్రయత్నాన్ని విరమించాడు. దానికి ప్రతిగా వైష్ణవమనే యాగాన్ని చేయాలని వారు చెప్పడంతో వైష్ణవ యాగం చాలా గొప్పగా నిర్వహించాడు. కానీ ధర్మరాజు నిర్వహించిన రాజసూయ యాగంతో పోలిస్తే.. పదహారో వంతయినా లేదని ప్రజలు భావించారు. కానీ దుర్యోధనుడి స్నేహితులు మాత్రం అతడు చేసిన యాగం గొప్పదని కీర్తించారు. యయాతి, మాంధాత, భరతుడు మొదలగు చక్రవర్తులు చేసిన యాగాలతో తులతూగుతుందని అన్నారు. రాజసూయయాగం ఇప్పుడు చేయలేకపోయినా పాండవులను యుద్ధంలో జయించిన తరువాత తప్పక చేస్తావని, ఆ యుద్ధంలో అర్జునుణ్ణి చంపుతానని మరోమారు కర్ణుడు.. దుర్యోధనుడికి చెప్పాడు.

"అర్జునుణ్ణి చంపందే నేను మాంసాన్ని, మద్యాన్ని ముట్టను. ఎవరేమి అడిగినా ఇచ్చివేస్తా" అని కర్ణుడు సభలో ఘోర ప్రతిజ్ఞ చేశాడు. కర్ణుడి ప్రతిజ్ఞను దుర్యోధనుడు మొదలగువారు వేయి విధాలా పొగిడారు. ఆనంద పరవశులై చప్పట్లు చరుస్తూ పాండవులను వారు చంపినట్లే భావించారు.

అడవుల్లో ఉన్న పాండవులకు కర్ణ ప్రతిజ్ఞ విషయం గూఢచారుల ద్వారా తెలిసింది. యుధిష్టరుడికి ఇది హృదయ కలతే. కర్ణుడు ప్రతాపంపై అతడికి గొప్ప అభిప్రాయం ఉంది. కర్ణుడు సహజ కవచంతో పుట్టినవాడు అయినందున అతడు మహావీరుడే.

ఒకనాడు ఉదయం తాను మేల్కొనముందు ధర్మరాజుకు ఒక కల వచ్చింది. సాధారణంగా కలలు నిద్రకు ముందుగాని, నిద్రావస్థ తరువాతగాని వస్తుంటాయి. ఆ అడవిలో ఉన్న మృగాలన్నీ ధర్మరాజు వద్దకు వచ్చి తమను ఇక చంపొద్దని, పాండవులు మరొక అడవికి వెళ్లాలని మిక్కిలి వేడుకున్నట్లుగా కల వచ్చింది. కలలో ఆ జంతువులు ప్రాధేయ పడుతున్నట్లు ఏడుస్తున్నాయి. ఆ కలల వల్ల మనసు కరిగి యుధిష్టరుడు తన తమ్ములతో మరో అడవికి వెళ్లాడు.

మన పూర్వులకు కూడా వన్యమృగ సంప్రదాయం నిలబెట్టాలని ఒక నియమంగా ఉండేది.

ఒకనాడు దుర్వాస మహాముని తన పదివేల మంది శిష్యులతో దుర్యోధనుడి వద్దకు వెళ్లాడు. ఆ రుషి తీవ్ర కోప గుణం తెలిసిన దుర్యోధనుడు.. రుషిని, ఇతర అతిథులను మర్యాద చేసి ఘనంగా సత్కరించాడు. దుర్యోధనుడు స్వయంగా చేసిన ఆతిథ్యం, సదుపాయాల కల్పనకు దుర్వాసుడు ముగ్ధుడై ఏదైనా వరం కోరుకోమని అన్నాడు. దీంతో దుర్యోధనుడు ఇక తాను సురక్షితుడనయ్యానని సంతోషించాడు. "ఓ మహర్షీ, తమరు మమ్ములను కృతార్థులను చేశారు. మా అతిథ్యాన్ని దయతో స్వీకరించారు" అన్నాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడికి ఒక ఊహ కలిగింది. ఈ మహా కోపిష్టి దుర్వాసుణ్ణి పాండవులపైకి పురికొల్పితే బాగుంటుందని భావించాడు. "ఓ మహర్షీ.. నా అన్నదమ్ములు అడవుల్లో ఉన్నారు. వారికి కూడా తమ దర్శనభాగ్యం ఇప్పించి వారిని కూడా కృతార్థులను చేయాలని కోరుకుంటున్నాను" అన్నాడు దుర్యోధనుడు. అంతేగాక పాండవులకు ఆహార పదార్థాలన్నీ అయిపోయి అనుకోని అతిథులు ఎవరైనా వస్తే ఏమి మిగలని పరిస్థితిఉన్నందువల్ల రుషీశ్వరుడిణ్ణి అక్కడికి పంపాడు. దుర్వాసుడికి ప్రజలను పరీక్ష చేయడంలో ఆసక్తి ఎక్కువ. దుర్యోధనుడు కోరిన ప్రకారమే చేయడానికి ఇష్టపడ్డాడు. ఈ ముని తన గొప్ప పరివారంతో ఆకస్మాత్తుగా పాండవుల వద్దకు వెళ్తే

బహు దరిద్రంతో కష్టపడి జీవించే వారు, ఈ అతిథులను సత్కరించలేరని, భోజనం పెట్టలేరని, ఆ కారణంగా ఈ తొందరపాటుగల కోపిష్టి ముని దుర్వాసుడి ఆగ్రహానికి, ఘోర శాపానికి పాండవులు గురవక తప్పదని దుర్యోధనుడు పూర్తిగా నమ్మాడు. మునిని తన స్వంతం ఏదైనా కోరుకోవడం కంటే పాండవులను క్లిష్ట స్థితిలోకినెట్టడమే దుర్యోధనుడికి ఆనందం.

దుర్యోధనుడి కోరిక మేరకు దుర్వాస ముని తన సపరివారంతో పాండవుల వద్దకు వెళ్లాడు. ఆయన వెళ్లేసరికి పాండవులు మధ్యాహ్న భోజనం చేసి భుక్తాయాసం తీర్చుకుంటున్నారు. పాండవులు మునిని ఆహ్వానించి గౌరవించారు. "మేమిప్పుడే తిరిగి వస్తాము. మేము వచ్చే సరికి ఆహారం సిద్ధం చేసి ఉంచండి. మాకు చాలా ఆకలిగా ఉంది" అంటూ త్వరగా శిష్యులతో కలిసి నదికి వెళ్లాడు.

పాండవులు అరణ్యవాస ప్రారంభంలో ధర్మరాజు తపోనిష్టకు మెచ్చి సూర్యుడు ఒక అక్షయపాత్రను ఇచ్చాడు. ఈ పాత్ర ఎప్పటికీ అంతులేకుండా ఆహారం ఇస్తుంది. సూర్యుడే అక్షయ పాత్ర ఇస్తూ.. "మీకు పన్నెండు సంవత్సరాల్లో ప్రతి రోజూ సరిపోయే ఆహారాన్ని ఇస్తున్నాను. అందరూ భోజనం చేశాక, ద్రౌపది కూడా చేశాక ఈ పాత్ర ఆ రోజుకు మరి ఆహారం ఇవ్వదు. కావున ప్రతి దినమూ బ్రాహ్మణులు, ఇతర అతిథులు ప్రథమంలో భోజనం చేసేవారు. తర్వాతే పాండవులు తినేవారు. చివరన ద్రౌపది తినేది. దుర్వాసుడు వారి వద్దకు వచ్చేసరికే బ్రాహ్మణులు, పాండవులు, ద్రౌపది భోజనం చేశారు. కనుక అక్షయ పాత్ర ప్రభావం ఆ రోజుకు ఉండదు. అంటే ఆహారం అందించదు. దుర్వాస ముని తన శిష్యులతో తిరిగి వచ్చేటప్పటికి భోజనం ఎలా సిద్ధపరచగలనా అని ద్రౌపది ఖిన్నురాలైంది. వంట ఇంటిలో శ్రీకృష్ణుణ్ణి ధ్యానించింది. ఈ కష్ట తరుణంలో తనకు సహాయం చేయాలని, తద్వారా రుషి ఆగ్రహం నుంచి తనను రక్షించాలని నిశ్చల భక్తితో వేడుకుంది. తక్షణమే శ్రీకృష్ణుడామెకు దర్శనమిచ్చాడు. "నాకూ చాలా ఆకలిగా ఉంది. ఆలస్యం చేయకుండా తినడానికి ఏమైనా తీసుకురా. ఆ తర్వాత ఇతర అంశాలు మాట్లాడుకుందాం" అన్నాడు శ్రీకృష్ణుడు. ఇక్కడో బహువిచిత్రమైన సంఘటన చోటుచేసుకుంది. ఏ మిత్రుని సహాయంతో తాను కష్టం నుంచి బయటపడదలిచిందో.. ఆ మిత్రుడే శత్రు పక్షాన చేరినట్లుంది. ద్రౌపది ఆందోళనతో.. "అయ్యో నన్నెందుకు ఇలా పరీక్షిస్తావు కృష్ణా!. సూర్యుడిచ్చిన అక్షయపాత్ర ప్రభావం ఈ రోజుకు సరి. దుర్వాస ముని వచ్చాడు. ఆయన తన శిష్యులతో బయటకు వెళ్తూ తాను వచ్చే సరికి భోజనాలు సిద్ధం చేసి ఉంచాలన్నాడు. నేనేమి చేయాలి?. వారు కాసేపట్లో రావచ్చు. నీవు కూడా ఇప్పుడే వచ్చావు. నీకూ ఆకలిగా ఉందని చెపుతున్నావు?" అన్నది. దీనికి కృష్ణుడు.. "నాకు బాగా అకలి

అవుతోంది. నాకు ఆహారం కావాలి కానీ, క్షమాపణలు కాదు. ఆ పాత్రను ఇలా తీసుకురా. నేను స్వయంగా చూసుకుంటాను" అన్నాడు. ద్రౌపది ఆ పాత్రను తీసుకొని శ్రీకృష్ణుడికి అందిస్తుంది. ఆ పాత్రలో ఒక కూర ముక్క, ఒక అన్నపు మెతుకు అంటుకొన్నాయి. ఆ రెండింటిని బహు ఆనందంతో కృష్ణుడు ఆరగించాడు. తాను అశ్రద్ధతో పాత్రలో ఏమీ అంటుకొనకుండా శుభ్రం చేయనందుకు ద్రౌపది సిగ్గు పడింది. పాత్రలో ఓ పిసరు ఉండిపోతే అది వాసుదేవుడు తిన్నాడు. ఆ మెతుకును తిన్న శ్రీకృష్ణుడు ఆకలిపోయి బ్రహ్మానందం పొందినట్లు కనిపించాడు. భీముణ్ణి పిలిచి.. నదికి వెళ్లి దుర్వాసుడితో ఆహారం సిద్ధమైందని, మీ కోసమే వేచి ఉన్నామని చెప్పిరా అన్నాడు కృష్ణుడు.

భీముడు ఆందోళన చెందాడు. కానీ కృష్ణుడి పట్ల ఉన్న భక్తి వల్ల వెంటనే దుర్వాసుడు, శిష్యులు నదిలో స్నానం చేస్తున్న స్థలానికి వెళ్లాడు. స్నానం చేస్తున్న అతిథులకు వారికి ఇదివరకున్న ఆకలి తీరిపోయింది. పుష్టి కలిగి ఆనందంగా ఉన్నారు. ఇప్పటి వరకూ ఆకలిగొన్న మనకు అమాంతంగా ఆకలి తీరిపోవడం, తుష్టిగా, పుష్టిగా ఉండటం వారికే ఆశ్చర్యం కలిగించింది. భోజనానంతరం కలిగే సౌఖ్యం, ఆనందం వారికీ కలిగాయి. శిష్యులు దుర్వాస మునితో.. "ఆహారం సిద్ధం చేయండని మనమంతా యుధిష్టరుడికి చెప్పి ఇక్కడికి వచ్చాం. కానీ మాకు భోజనం కడుపారా చేసినట్లు హాయిగా ఉంది. మేము ఇంకా ఏమీ తినలేం" అన్నారు. ఈ విచిత్ర పరిస్థితి కారణం మునికి తెలుసు. ముని భీముడితో..."మేమందరం ఆహారం తిన్నాం. మమ్మల్ని క్షమించాలని యుధిష్టరుడికి చెప్పు" అనంటూ మునీ, వారి శిష్య బృందం తమ దారిన తాము వెళ్లిపోయారు. శ్రీకృష్ణుడు ఒక్క మెతుకు తిన్న తరువాత అనుభవించిన సంపూర్ణత్వాన్ని, ఆనందాన్ని.. అప్పటికి రుషీశ్వరుడితోకూడా అందరికి సంతష్టిని, పరిపూర్ణత్వాన్ని ఇచ్చింది.

◈



కొంగ రూపంలో ఉన్న యక్షుని
ప్రశ్నలకు సమాధానం ఇస్తున్న
యుధిష్ఠరుడు

## అధ్యాయం - 41

# యక్షిణీయుక్త సరోవరం

**పాం**డవుల నిర్బంధ అరణ్యవాసం పన్నెండేళ్లు పూర్తి కావస్తోంది. ఒకనాడు ఓ బ్రాహ్మణుడు నిత్యాగ్నిహోత్రం తయారు చేసుకొనే ఆరణికి ఒక లేడి తల రుద్దుతూ తన దురద పోగొట్టుకునే ప్రయత్నం చేస్తోంది. ఇంతలో అలికిడికి లేడి పారిపోబోగా ఆ ఆరణి లేడి కొమ్ముల్లో చిక్కుకుంది. దీంతో లేడి భయం చెంది అడవిలో పరుగు పెట్టనారంభించింది.

ఆ రోజుల్లో అగ్ని ప్రత్యేకంగా తయారు కాలేదు. రెండు రాళ్లో, చెట్ల కొమ్మలో బలమైన రాపిడి జరిగినప్పుడు అగ్ని పుట్టేది. బ్రాహ్మణుడు పాండవుల వద్దకు వచ్చి "అయ్యో లేడి ఒకటి నా ఆరణిని కొమ్ములకు తగిలించుకొని పోతోంది. ఇంక నా నిత్యాగ్నిహోత్ర కర్మలు ఎలా జరుగుతాయి?" అంటూ.. అవి తేవడానికి పాండవుల సాయం కోరాడు. పాండవులు లేడి వెంట పడ్డారు. క్షణంలో దూకుతూ అందకుండా

పాండవులను ముప్పతిప్పలు పెడుతోంది. అలా పరిగెత్తి పరిగెత్తి పాండవులను అడివంతా తిప్పి ఓ చోట అదృశ్యమైంది. అదో మాయలేడి. పాండవుల ప్రయత్నం వృధా అయ్యింది. వారంతా అలసిపోయి సేద తీరడానికి ఓ చెట్టుకింద కూర్చున్నారు. నిట్టూర్చుతూ నకులుడు.. "బ్రాహ్మణుడికి స్వల్ప సాయం చేయలేకపోయాం" అని అర్జునుడివైపు విచారంతో చూశాడు. దానికి అర్జునుడు.. "నేనేమీ చేయలేకపోయాను. ఆ రథచోదకుని కుమారుడి నిందా వాక్యాలు తలుస్తూ భరిస్తున్నాను. కావున మన ఈ పరిస్థితి మనకు తగినట్లే ఉంది" అన్నాడు. తన తమ్ముళ్లందరూ ఉత్సాహాన్ని, ధైర్యాన్ని వీడారని యుధిష్టరుడు తలిచాడు. ఏదైనా పని కల్పిస్తే ఉత్సాహం కొంత వస్తుందని తలచాడు. తనకు మిక్కిలి దాహంగా ఉందని అంటూ నకులుడుతో.. "తమ్ముడా.. ఈ చెట్టు ఎక్కి సమీపంలో ఏమైనా చెరువుగానీ, నదిగానీ ఉందేమో చూడు" అన్నాడు. నకులుడు చెట్టెక్కి దిక్కులు కలయజూశాడు. "కొద్ది దూరంలో నీటి మొక్కలు, కొంగలు కనపడుతున్నాయి. కనుక అక్కడ తప్పక నీరు ఉండే అవకాశం ఉంది" అన్నాడు. తాగడానికి కొంత నీరు తీసుకు రమ్మని నకులుణ్ణి పంపాడు యుధిష్టరుడు. నకులుడు ఆ స్థలానికి వెళ్లాడు. అక్కడ నీటి సరోవరాన్ని చూసి సంతోషించాడు. తనకు కూడా దాహం అవుతుండటంతో ముందు తాను నీరు తాగి, తర్వాత అన్నకు తీసుకువెళ్లేందుకు ఉద్యుక్తుడయ్యాడు. ఇంతలో.. సరోవరం నుంచి ఒక వాక్కు వినబడింది. "తొందరపడకు. ఈ సరోవరం నాది. ఓ మాద్రి కుమారుడా.. నా ప్రశ్నకు సమాధానం చెప్పు. ఆ తరువాతే.. నీరు తాగు" అన్నదే ఆ వాక్కు. ఆ వాక్కుకు నకులుడు ఆశ్చర్యపోయి నాలుగువైపులా చూశాడు. ఏమీ కనిపించలేదు. దీనితో ఆ వాక్కును ఖాతరు చేయకుండా నీరు తాగాడు. తక్షణమే అతడికి భయంకరమైన ఆయాసం కలిగింది. చనిపోయినవాడిలా నేలపై పడ్డాడు. నకులుడు ఎంత వరకూ రాకపోయేసరికి.. విషయం తెలుసుకోవాలని యుధిష్టరుడు.. సహదేవుణ్ణి కోరాడు. అతడు సరోవరానికి వెళ్లాడు. అక్కడ తన అన్న నేలపై పడి ఉండటాన్ని చూశాడు. అతడికేమైనా అపాయం వాటిల్లిందేమోనని అనుకున్నాడు. ఇంకా అతణ్ణి పరిశీలించలేదు. తనకూ దాహం ఎక్కువవడంతో ముందు నీరు తాగేందుకు సరోవరంలో చేతులు పెట్టాడు. మరలా ఓ అదృశ్య వాణి వినిపించింది. "ఓయీ సహదేవా.. ఇది నా సరోవరం. ముందు నా ప్రశ్నకు సమాధానమిచ్చాక నీరు తాగు" అని వినిపించింది. నకులుడు మాదిరే సహదేవుడు కూడా ఆ అదృశ్య పలుకులను పట్టించుకోలేదు. అతడు కూడా నీరు తాగి నకులుడు మాదిరిగానే నేలపై పడిపోయాడు. సహదేవుడు కూడా ఎంతకూ తిరిగి రాకపోవడంతో ధర్మరాజు ఆశ్యర్యం, ఆందోళన

చెందాడు. తముళ్లకు ఏమైనా అపాయం వాటిల్లిందేమో చూడాలని అర్జునుణ్ణి పురమాయించాడు. తనకు చాలా దాహం వేస్తున్నందున త్వరగా రావాలని చెప్పాడు. అర్జునుడు సరోవరం దగ్గరకు త్వరగా వెళ్లాడు. అక్కడ తమ్ములిద్దరూ చనిపోయి పడివున్నట్లుగా కనిపించారు. ఆ దృశ్యాన్ని చూసి అర్జునుడు విషణ్ణ వదనుడు అయ్యాడు. ఇక్కడెవరో శత్రువు తెలియకుండా పొంచి ఉండి దొంగ దెబ్బ తీసి వారిని చంపి ఉంటారని భావించాడు. ఆ అజ్ఞాత శత్రువుపై పగ తీర్చుకోవాలని ఉన్నా.. తమ్ముళ్లు ఆ విధంగా కనిపించేసరికి.. తీవ్ర విషాదం అలముకుంది. ఈ పరిస్థితిలో అతడికి దాహం అయ్యింది. నీళ్లు తాగడానికి తానూ సరోవరంలోకి దిగాడు. మరలా నకుల, సహదేవులకు వినిపించిన మాదిరిగానే అదృశ్యవాణి పలుకులు అర్జునుడికి కూడా వినిపించాయి. "నీవు నీరు తాగడానికి ముందు నా ప్రశ్నకు సమాధానం ఇవ్వు. ఈ సరోవరం నాది. నా మాటలను నిర్లక్ష్యం చేశావో నీ తమ్ముళ్ల మాదిరే నీకూ జరుగుతుంది" అని వినిపించాయి. దీంతో అర్జునుడు.. "నువ్వెవరు? రా. నా ఎదుటికొచ్చి నిలబడు. నిన్ను చంపేస్తాను" అంటూ శబ్దభేధి అనే సునిశితాస్త్రాన్ని సంధించాడు. మళ్లీ అదృశ్యవాణి నవ్వుతూ.. "నీ బాణాలు గాలిని మాత్రమే గాయపరచగలవు. ఇప్పటికైనా నా ప్రశ్నకు జవాబు చెప్పు. ఆ తరువాతే నీళ్లు తాగు. అలా చేయకపోతే నీవు చస్తావు" అని పలికింది. ఎలాగైనా శత్రువును పట్టి మట్టుబెట్టాలని భావించాడు అర్జునుడు. అయితే దాహం మరింత ఎక్కువవుతుండటంతో తానూ మంచినీళ్లు తాగాడు. మరుక్షణం నేలపై పడిపోయాడు అర్జునుడు. అప్పటికే ఎంతో ఆందోళన చెందివున్న యుధిష్టరుడు.. అర్జునుడు కూడా రాకపోవడంతో మరింత ఆందోళన చెంది.."ప్రియ సోదరుడా.. భీమా! మంచినీరు తెస్తానని వెళ్లిన అర్జునుడు కూడా ఇంకా రాలేదు. నకుల, సహదేవులు, అర్జునుడికి ఏదో విపత్తు సంభవించి ఉంటుంది. కనుక వెళ్లి వెదుకు. నాకు కూడా మంచినీళ్లు తీసుకురా" అన్నాడు ధర్మరాజు. భీముడు తీవ్ర ఆందోళన చెందాడు. త్వరత్వరగా సరోవరానికి చేరుకున్నాడు. అక్కడ చనిపోయి పడివున్న స్థితిలో ముగ్గురు తమ్ముళ్లనూ చూశాడు. "ఇది ముమ్మాటికీ యక్షుల దుర్మార్గమే. నేను వారిని వేటాడి చంపి తీరాలి. అయ్యో ఏమిటి నాకీ దాహం. నీళ్లు తాగి వచ్చి వారి పని పట్టాలి" అనుకున్నాడు భీముడు. ఇంతలో అదృశ్య వాణి పలుకులు భీముడికీ వినిపించాయి. "భీమ సేనా.. జాగ్రత్త. నా ప్రశ్నకు సమాధానమిచ్చి తరువాతే నీళ్లు తాగు. నా మాటలు లక్ష్య పెట్టకపోతే నీవు చస్తావు" అని వినిపించాయి. భీముడికి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. "నీవెవరు? నన్ను ఆజ్ఞాపించడానికి" అంటూ నిర్లక్ష్యంగా వెళ్లి సరోవరంలోని నీళ్లు తాగాడు.

అంతే తన ముగ్గురు తమ్ముళ్ల మాదిరే భీమ సేనుడూ నేలపై పడి చనిపోయాడు.

భీముడు ఎంతసేపటికీ రాకపోవడంతో ధర్మరాజు మరింత భయాందోళన చెందాడు. తన తమ్ముళ్లు ఎవరి శాపానికయినా గురయ్యారా?. నీళ్ల కోసం అరణ్యమంతా వెదుకుతున్నారా?. లేక దాహంతో చనిపోయారా?. మూర్ఛపోయారా?" అని అయోమయం చెందాడు. ఓవైపు దాహం భరించలేక, మరోవైపు తమ్ముళ్లు కనిపించక పోయేసరికి.. వెదకడానికి ధర్మరాజు ఆ జలాశయం వద్దకు వెళ్లాడు. అక్కడ తమ్ముళ్లు చనిపోయి కనిపించారు. దు:ఖాన్ని ఆపుకోలేకపోయాడు. బిగ్గరగా ఏడ్చాడు. "మన ప్రతిజ్ఞలు, పవిత్ర జీవితాల తుది ఇదేనా? మన అరణ్యవాసం పన్నెండేళ్లు పూర్తవుతున్న తరుణంలో మిమ్మల్ని మృత్యువు పొట్టనబెట్టుకుందా అంటూ ఏడ్చాడు. 'దైవాలు సైతం నన్నీ కష్టకాలంలో విడిచిపెట్టేశాయి కదా. ఎవడు నా తమ్ముళ్లను చంపగల బలవంతుడు?. తమ్ముళ్లులేని జీవితం ఇంకా ఎందుకు' అనుకున్నాడు ధర్మరాజు. ఇందులో ఏదో మాయోపాయం ఉందని తోచింది. 'అయినా వీరు చనిపోయినవారు మాదిరిగా లేరు. వారి శరీరాలపై ఎక్కడా గాయాలు లేవు. వారి ముఖాలు నిద్రిస్తున్నట్లుగా ఉన్నాయి. ఇందులో ఏదైనా ఇంద్రజాలం ఉన్నదా?. దుర్యోధనుడు ఏదైనా మాయ కర్మ చేయించాడా?. ఈ నీటిలో ఏమైనా విషం కలిపించాడా?" అని సందేహిస్తూనే అంతకంతకూ తట్టుకోలేని దాహం వేస్తుండటంతో యుధిష్టిరుడు కూడా సరోవరంలోకి దిగాడు. ఇంతకు ముందు మాదిరిగానే అదృశ్యవాణి పలుకులు వినిపించసాగాయి. "నీ తమ్ముళ్లు నా మాటలను లక్ష్య పెట్టక మంచి నీళ్లు తాగి చనిపోయారు. నీవు వారిని అనుసరించొద్దు. నా ప్రశ్నకు ముందు సమాధానం ఇవ్వు. తరువాతే నీళ్లు తాగి నీ దాహం తీర్చుకో. ఈ జలాశయం నాది" అనే మాటలు వినిపించాయి. ఈ మాటలు కచ్చితంగా యక్షలవేనని, ఇతరులవి కాదని, తమ్ముళ్లు ఎందుకు అలా చనిపోయినట్లు పడి ఉన్నారో స్పష్టంగా గుర్తించాడు యుధిష్టిరుడు. అదృశ్య వాణిని ఉద్దేశించి.. "దయవుంచి నీ ప్రశ్నలేవో అడుగు" అన్నాడు యుధిష్టరుడు

ప్రశ్న : ప్రతిదినమూ సూర్యుణ్ణి ప్రకాశించేలా ప్రేరేపించేదెవరు?

యుధిష్టరుడు : బ్రహ్మము, శక్తి

ప్రశ్న : మనిషిని అపాయ దశ నుంచి ఏది కాపాడుతుంది?

యుధిష్టరుడు : అపాయ దశలో ధైర్యమే రక్షిస్తుంది

ప్రశ్న : ఏ శాస్త్రం చదివితే మనిషి బుద్ధిమంతుడవుతాడు?.

యుధిష్టరుడు : శాస్త్రం చదివినంత మాత్రాన ఎవడూ బుద్ధిమంతుడు కాలేడు.

అనుభవజ్ఞులైన బుద్ధి విశేషాలుగలవారి సాంగత్యం వల్లే బుద్ధిని, జ్ఞానాన్ని పొందుతారు.

ప్రశ్న : భూమి కన్నా మిక్కిలి క్షమ కలిగింది ఏమిటి?

యుధిష్ఠరుడు : పిల్లలను పెంచే తల్లి. భూమి కంటే ఔదార్యాన్ని, క్షమనూ కలిగి ఉంటుంది.

ప్రశ్న : గాలికంటే వేగమైనది ఏమిటి?

యుధిష్ఠరుడు : మనసు

ప్రశ్న : ఎండిపోయిన గడ్డికన్నా పనికిరానిదేమిటి?.

యుధిష్ఠరుడు : విచారంతో నిండిన హృదయం.

ప్రశ్న : బాటసారికి స్నేహితుడెవరు?

యుధిష్ఠరుడు : విజ్ఞానం

ప్రశ్న : ఇంటివద్ద ఉండేవాడికి స్నేహితుడెవరు?.

యుధిష్ఠరుడు : భార్య

ప్రశ్న : మరణిస్తే మనిషిని ఎవరు అనుసరిస్తారు?

యుధిష్ఠరుడు : ధర్మం. ఇదొక్కటే చనిపోయిన తర్వాత ఏకాకి అయిన ఆత్మను వెన్నంటి వెళ్తుంది.

ప్రశ్న : ఏది గొప్ప పాత్ర?

యుధిష్ఠరుడు : అన్నీ తనలోనే నిక్షిప్తం చేసుకున్న భూమే గొప్ప పాత్రం.

ప్రశ్న : సౌఖ్యం అంటే ఏమిటి?

యుధిష్ఠరుడు : మంచి నడవడి ఫలితమే సౌఖ్యం.

ప్రశ్న : ఏది విడిస్తే మనిషి అందరికీ ప్రేమ పాత్రుడవుతాడు?

యుధిష్ఠరుడు : గర్వం. ఇది విడిస్తే.. ఆ మనిషిని అందరూ ప్రేమిస్తారు.

ప్రశ్న : ఏది నశిస్తే విచారం లేకుండా పోతుంది?

యుధిష్ఠరుడు : కోపం. ఇది విడిస్తే ఎన్నడూ విచారం కలగదు.

ప్రశ్న : దేన్ని విడిస్తే మనిషి గొప్పవాడవుతాడు?

యుధిష్ఠరుడు : కోరిక. దాన్ని విడిచిపెడితే మనిషి సంపద కలిగిన వాడవుతాడు.

ప్రశ్న : నిజమైన బ్రాహ్మణుణ్ణిగా ఏది చేయగలదు? పుట్టుక వల్లనా?, మంచి నడవడిక వల్లనా?,విద్య వల్లనా? నిశ్చయంగా చెప్పు?

యుధిష్ఠరుడు : పుట్టుక, విద్య ఒకణ్ణి బ్రాహ్మణుడిగా చేయలేవు. మంచి నడవడి మాత్రమే చేయగలదు. ఒకడు చతుర్వేదాలు చదివినవాడైనా, చెడు

నడవడికగలవాడైతే అథమ తరగతికి పడిపోతాడు.

ప్రశ్న : ప్రపంచంలో గొప్ప విచిత్రమైనది?

యుధిష్ఠరుడు : ప్రతిరోజూ ప్రజలు, ప్రాణి సముదాయం యమలోకానికి వెళ్లడం చూస్తుంటాం. అయితే మిగిలినవారు చిరంజీవులుగా ఉండాలని ఆశిస్తారు. ఇది నిశ్చయంగా మిక్కిలి ఆశ్చర్యకరమైన అంశం.

ఈ ప్రకారంగా అదృశ్యవాణి (యక్షుడు) అనేక ప్రశ్నలు అడిగింది. యుధిష్ఠరుడు అన్నిటికీ సమాధానాలు చెప్పాడు. "ఓ రాజా, నీ తమ్ముళ్లలో ఒకరు మాత్రమే సజీవుడు అవుతాడు. ఎవరిని బతికించంటావు" అని అడిగింది అదృశ్యవాణి. యుధిష్ఠరుడు కొంచెం ఆలోచించాడు. "మేఘ రంగు కలిగినవాడు, పద్మ రేకుల కళ్లు కలిగినవాడు, దీర్ఘబాహుడు, ఇక్కడొక మహావృక్షం మాదిరిగా పడివున్న నకులుడు సజీవుడు గాక" అన్నాడు యుధిష్ఠరుడు. యక్షుడు దీనికి సంతోషించాడు. "పదహారు వేల ఏనుగుల బలంగల భీముణ్ణి విడిచి నకులుణ్ణి ఎందుకు ఎన్నుకున్నావు. అదీగాక అర్జునుణ్ణి ఎందుకు ఎన్నుకోలేదు?. అతని బాహుబలమేకదా నీకు రక్షణ. ఈ ఇద్దరినీ విడిచి నకులుడిని ఎందుకు ఎన్నుకున్నావో చెప్పు?" అడిగాడు యుధిష్ఠిరుణ్ణి.. యక్షుడు. "మనిషికి ధర్మమొక్కటే రక్షించే ఆయుధం. అంతేగాని భీమార్జునులు కారు. ధర్మం విడిచిన మనిషి నశిస్తాడు. కుంతీ, మాద్రి మా తండ్రికి భార్యలు. కుంతి కుమారుల్లో ఒకడైన నేను జీవించి ఉన్నాను. కనుక ఆమెకు పూర్తిగా పుత్రశోకం ఉండదు. ధర్మం అనే తులా యంత్రంలోని రెండు పాత్రలూ సమంగా ఉండటం కోసం మాద్రి కుమారుడైన నకులుడిని కోరుకున్నాను" బదులిచ్చాడు యుధిష్ఠరుడు.

యుధిష్ఠరుడు నిష్పాక్షిక బుద్ధికి యక్షుడు సంతోషించి అతని సోదరులందరూ సజీవులయ్యేలా చేశాడు. మృత్యు రాజైన యమ ధర్మరాజు (యముడు) లేడి రూపంలో యక్ష రూపం ధరించి తన కుమారుడైనట్టి యుధిష్ఠరుణ్ణి (ధర్మరాజును) చూసి.. అతడి ధర్మ సూక్ష్మాన్ని తెలుసుకోవడం కోసం ఇలా చేశాడు. యమ ధర్మరాజు ధర్మరాజును కౌగిలించుకొని ఆశీర్వదించాడు. యమ ధర్మరాజు.. "అడవిలో మీరు ఉండవలసిన కాలము కొద్ది రోజులే. పదమూడో సంవత్సరం కూడా గడుస్తుంది. మీ శత్రువులెవరూ మిమ్మల్ని కనుక్కోలేరు. మీరు మీ కర్తవ్యాన్ని జయప్రదంగా పూర్తి చేస్తారు" అంటూ అంతర్ధానమయ్యాడు.

పాండవులు అరణ్యవాస కాలాన అన్నివిధాలైన కష్టాలకూ లోనయ్యారు. అయినా వారికి మేలు కూడా జరిగింది. ఈ ప్రవాస కాలంలో కఠిన దీక్ష, క్రమమార్గానుసరణ, ఉచితానుచిత విచక్షణ తెలుసుకున్నారు. మునుపటి కంటే హెచ్చు

బలవంతులుగా, ప్రజ్ఞావంతులుగా, ఔదార్యవంతులుగా అయ్యారు. తన తపస్సు ముగించి దివ్యాస్త్రాలను సంపాదించి ఇంద్ర దర్శనంతో మిక్కిలి పుష్టికలవాడై అర్జునుడు తిరిగి వచ్చాడు. భీముడు కూడా సౌగంధిక పుష్పం కోసం వెళ్లినప్పుడు తన అన్న హనుమంతుణ్ణి కలిసి అతడి ఆలింగన ప్రభావంతో పదిరెట్లు ఎక్కువ బలశాలి అయ్యాడు. యక్షణీయుక్త సరోవరం చెంత తన తండ్రి ధర్మాధిపతి యమ ధర్మరాజును దర్శించి ధర్మరాజు పదిరెట్లు ఎక్కువ తేజశ్శాలి అయ్యాడు. ధర్మరాజు తన తండ్రి యమధర్మారాజును కలిసిన ఈ పవిత్ర కథను విన్నవారి మనస్సులు మనసులు ఎన్నడూ చెడువైపు వెళ్లవు. వారికి స్నేహితులతో కలహం రాదు. ఇతరుల సొత్తును ఆశించరు. బాధోద్రేకానికి లోనుకారు. అస్థిరమైన వస్తువుల పట్ల ఆశ కలిగి ఉండరు.

◈

విరాట సభలో పాండవులు



# అధ్యాయం - 42

# అన్యగృహ సేవకా వృత్తి

**పాం**డవుల అరణ్యవాస కాలంలో వారిని అనుసరించిన బ్రాహ్మణులను ఉద్దేశించి యుధిష్టరుడు గద్గద స్వరంతో.. "ఓ బ్రాహ్మణులారా, ధృతరాష్ట్ర కుమారులతో మేం దగా పడ్డాం. మా రాజ్యం దొంగిలించి, మమ్మల్ని దరిద్రంలో ముంచారు. పన్నెండేళ్ల అరణ్యవాసం ఆనందంగా చేశాం. పదమూడో సంవత్సరం వచ్చింది. ఇది అజ్ఞాతవాస సంవత్సరం. కనుక మిమ్మల్నందరినీ వీడాల్సి వస్తోంది. ఇంకా పన్నెండు నెలలపాటు ధుర్యోధనుడి వేగులవాళ్లకు తెలియకుండా మేం అజ్ఞాతవాసం చేయాల్సి ఉంది. భయం, దాపరికం లేక స్వేచ్ఛగా మనమంతా కలిసి ఉండే కాలం ఎప్పుడు వస్తుందో?. కనుక మేం వెళ్లడానికి ముందు మమ్మల్ని ఆశీర్వదించండి. భయంతోగాని, ధనాశతోగాని మా ఉనికి దుర్యోధనాదులకు తెలియకుండా ఉండుగాక" అన్నాడు యుధిష్టరుడు.

ధౌమ్యుడు.. యుధిష్టరుడును ఓదార్చాడు. "ఎడబాపు కష్టమైనదే. అపాయం

కూడా చాలా ఉంది. కానీ ధర్మరాజా నీవు బుద్ధిమంతుడవు. జ్ఞానివి. అపాయాలతో భయపడవు. వాటిని శౌర్యంతో ఎదుర్కొంటావు. మీరంతా మారువేషాలు ధరించాల్సి ఉంది. దేవరాజైన ఇంద్రుడు రాక్షసులతో బాధింపబడి బ్రాహ్మణ వేషం వేసుకొని నిషధ రాజ్యంలో ఎవరికీ తెలియకుండా ఉన్నాడు. ఇలా సురక్షితుడై, తెలియకుండా ఉన్నవాడై తన శత్రువులను ఎలా హతమార్చగలిగాడు. నీవునూ అలాగే చేయాలి. విశ్వమంతటికీ అధిపతి శ్రీమహావిష్ణువు ప్రపంచ ఉపయోగార్థం బలి చక్రవర్తి రాజ్యాన్ని హరించడానికి అనువైన రూపాన్ని పొందడానికి అదితి గర్భంలో బహుకష్టంతో ఉండి జనక్లేశం అనుభవించలేదా?. శ్రీమన్నారాయణమూర్తి వృత్తాసరుణ్ణి చంపడానికి ఇంద్రుని ఆయుధంతో ప్రవేశించలేదా?. దేవతల ఉపయోగార్థం అగ్ని దేవత ఉదకంలో దాక్కొనలేదా?. ప్రతిదినమూ సూర్యనారాయణమూర్తి అస్తమించడం మనం చూస్తూనే ఉన్నాం కదా. రావణుణ్ణి సంహరించేందుకు శ్రీమహావిష్ణువు ప్రపంచ కర్త అయిన ప్రభువు.. దశరధుని పుత్రుడై భూమిని అవతరించి చాలా సంవత్సరాలు కష్టజీవిగా విచారాలను అనుభవించలేదా. గతించిన కాలంలో మహనీయులందరూ ప్రపంచ క్షేమం కోసం మారు వేషం వేసుకొని వాటిని పవిత్ర పరచలేదా? నీవూ నీ శత్రువులను జయించి ఐశ్వర్యాలను అనుభవించగలవు" అన్నాడు ధౌమ్యుడు.

యుధిష్టరుడు బ్రాహ్మణులందరి వద్ద సెలవు తీసుకున్నాడు. తన పరివారాన్ని వారి గృహాలకు వెళ్లడానికి ఆజ్ఞ ఇచ్చాడు. అడవిలో ఒక మారుమూలన పాండవులు చేరి ముమ్మందు వారనుసరించే మార్గాలను గురించి మాట్లాడుకొన్నారు. యుధిష్టరుడు విచారంగా అర్జునుణ్ణి ఇలా అడిగాడు. "ప్రపంచ మార్గాలు నీకు బాగా తెలుసు. ఈ పదమూడో సంవత్సరం మనం ఎక్కడ గడిపితే శ్రేయస్సుగా ఉంటుంది?''

"ఓ రాజోత్తమా, మృత్యు ప్రభువైన యముడు మనల్ని ఆశీర్వదించాడు. ఎవరికీ మన ఉనికి తెలియకుండా ఈ పన్నెండు నెలలు సులువుగా గడుపుతాము. మన ఉనికిని నిర్ణయించుకోవడానికి మంచి రాజ్యాలు చాలా ఉన్నాయి. పాంచాలం, మత్స్య, సాల్వ, విదేహ, బాహ్లక, దాశార్హ, శూరసేన, కళింగ, మగధ వీటిలో మీరే ఎన్నుకోండి. మన్నించి నా అభిప్రాయం వింటే విరాట్ రాజు మత్స్య రాజ్యం అన్నింటిలో ఉత్కృష్టమైంది. సిరిసంపదలతో ఉంది. దేశమూ చాలా ఆనందదాయకంగా ఉంటుంది" అన్నాడు అర్జునుడు.

మత్స్యదేశ రాజు విరాటుడు మిగుల బలవంతుడు. మన పట్ల ఆయనకు ఆసక్తి ఎక్కువ. సుగుణ సంపత్తి కలవాడు. దుర్యోధనుడి ఘోరాలకు లొంగేవాడు కాదు. భయపడడు. విరటుడు రాజ్యంలో మనం అజ్ఞాతవాసం గడపడానికి నాకు అభ్యంతరం లేదు" అన్నాడు యుధిష్టరుడు. "సరే, ఓ రాజా.. మీరు విరాటరాజు

వద్ద ఏ పని చేస్తారు?" అర్జునుడు అడిగాడు అన్నను. మహామహుడైన, సత్యవ్రతుడైన, రాజసూయయాగం చేసిన యుధిష్టర చక్రవర్తి మారువేషంలో సేవకావృత్తి చేస్తానని అన్నాడు. "నా అనుచరులు కూడా ఉండేలా నన్ను నియమించాలని విరాటుని అడగాలని నాకున్నది. నా సంభాషణతో, పాచికలు ఆడటంలో నాకున్న ప్రావీణ్యంతో అతన్ని ఆనందింప చేస్తుంటాను. నేనొక సన్యాసి వేషంలో ఉంటాను. శకుని ఫలితాలు చెప్పడంలో, జ్యోతిష్యంలో, వేద వేదాంగాల్లో, నీతి శాస్త్రంలో, రాజ్యతంత్రాల్లో, ఇంకా ఇతర శాస్త్రాల్లో ఆయన్ను నా సంభాషణలతో కాలక్షేపం, ఆనందంగా ఉండేలా చేస్తాను. నేను జాగ్రత్తగా ఉండవలసిందే. దాన్ని గురించి నీవు అందోళన చెందొద్దు. విరాటరాజు ఆంతరంగిక స్నేహితుడనై, అతని చేరువలో చనువుగా మసలేటప్పుడు ఇవన్నీ నేర్చానని చెపుతాను. ఓ భీమా.. బకాసురుణ్ణి, హిడింబాసురుణ్ణి, చంపిన నీవు విరాటుని వద్ద ఏ పని చేస్తావు? జఠాసురుణ్ణి చంపి మమ్మల్ని రక్షించావు. ధైర్య సాహసాలు, బాహుబలం నీలో ఉన్నాయి. ఏ మారువేషం నీ రూపాన్ని కప్పివేసి నిన్నెవరూ ఎరగకుండా ఉంచుతుంది" అని భీముణ్ణి అడుగుతూ కంట తడిపెట్టాడు యుధిష్టరుడు. "ఓ రాజా, విరాట రాజు పాకశాలలో వంటవాడిగా ఉంటాను. నాకు గొప్ప ఆకలి అనీ, వంటల్లో ఆరితేరినవాడనీ నీకు తెలిసిందే. విరాట రాజు ఇంతకుముందెప్పుడూ రుచి చూడని కొత్త రుచులగల వంటకాలతో ఆయన్ని సంతోషపెడతాను. అడవిలో చెట్లను విరిచి తెచ్చి కుప్పలుగా వంట చెరకును నిల్వ చేస్తాను. ఆయన రాజ్యానికి వచ్చే మల్లులతో యుద్ధం చేసి వారిని ఓడించి రాజుకు ఉల్లాసం కలిగిస్తాను" అన్నాడు భీముడు. ఈ మాటలు యుధిష్టరుడుకు ఆందోళన కలిగించాయి. భీముడు ఇలాంటి మల్లయుద్ధాల్లో పాల్గొంటే అపాయం కలుగుతుందని యుధిష్టరుడి భావన. "నేనెవ్వరినీ చంపను. అవసరమైన మల్లుడికి అప్పుడప్పుడు గుణపాఠం చెప్పడానికి అతణ్ణి కుదిపివేస్తానుగానీ, ఎన్నడూ ఎవర్నీ చంపను. అడవి ఎడ్లను, పోతులను, ఇతర క్రూర మృగాలను అడ్డుకొని, వాటి వల్ల ప్రజలు బాధపడకుండా చేసి రాజుకు ఉల్లాసం కలిగిస్తాను" అన్నాడు భీముడు. తరువాత ధర్మరాజు.. అర్జునుణ్ణి ఉద్దేశించి, "నువ్వు ఏ వృత్తి చేసి విరాట రాజును మెప్పించగలవు. నీ విఖ్యాత పరాక్రమాన్ని ఎలా మరుగు పరచగలవు" అన్నాడు. "అన్నగారూ.. నేనొక షండ రూపాన్ని (నపుంసక రూపాన్ని) ధరించి రాజ అంత:పుర కాంతల వద్ద సేవ చేస్తాను. నా భుజాలు, చేతులపై ఉన్న వింటి నారి మచ్చలను ఒక అంగీ తొడిగి కప్పు కుంటాను. స్వర్గంలో నేనుండగా, ఊర్వశి నన్ను మోహించి కోరింది. నీవు నాకు తల్లివంటిదానవని ఆమెను నిరాకరించాను. ఆమెకు ఆగ్రహం కలిగి నన్ను షండునిగా ఉండమని శపించింది. ఇది భరించలేక నేను ఇంద్రుణ్ణి వేడుకోగా, ఈ

శాపం ఒక్క సంవత్సరమే పనిచేస్తుందని, ఆ సంవత్సర కాలమూ నీవే నిర్ణయించుకోవచ్చునీ ఇంద్రుడు అనుగ్రహించాడు. ఆ నపుంసకత్వంతోనే నేను ఈ సంవత్సరం సేవకా వృత్తిలో గడుపుతాను. తెల్లని శంఖు గాజులను తొడుక్కొని, స్త్రీ మాదిరిగా శిరోజాలను ముడివేసుకొని, వస్త్రధారణా స్త్రీ వలేనే చేసుకొని విరాటుని రాణి అంతఃపురంలో చిన్న చిన్న పనులు చేస్తుంటాను. స్త్రీలకు ఆటపాటలూ నేర్పుతాను. యుధిష్టరుడు అంత:పురంలో ద్రౌపది వద్ద సేవ చేశానని చెపుతాను. అలా విరటుని వద్ద సేవకుడిగా చేరతాను" అన్నాడు అర్జునుడు. యుధిష్టరుడు ఎంతో బాధ పడ్డాడు. "అయ్యో, కీర్తిలో, పరాక్రమంలో శ్రీకృష్ణుడితో సమానమైనవాడివి. మేరు పర్వతౌన్నత్య పరాక్రమ వంతుడైన అర్జునుడు ఇలా విరటుని అంతఃపురంలో నపుంసకుని రూపంలో ఉండేలా విధి లిఖించిందా?" అన్నాడు యుధిష్టరుడు. నకులుణ్ణి చూసి.. "నీవేమి చేయగలవు" అని అడుగుతూ నకులుడు తల్లి మాద్రిని గుర్తు చేసుకుని కంట తడిపెట్టాడు. "విరటుని అశ్వశాలలో పనిచేస్తాను. గుర్రాలను పెంచడంలోనూ, వాటికి క్రమశిక్షణ ఇవ్వడంలోనూ నాకు ఎంతో ఇష్టం. నాకు అశ్వ హృదయం తెలుసు. వాటికొచ్చే జాడ్యాలు, వాటిని పోగొట్టే పద్ధతులూ నాకు తెలుసు. నేను గుర్రాలను స్వారీ చేయడమే కాకుండా, వెదికి గుర్రాలను శిక్షించి క్రమ మార్గంలో పెట్టగలను. అదీగాక గుర్రాలను రథానికి అమర్చి, దాన్ని కూడా నడపగలను. పాండవుల అశ్వాలను నేనే చూసేవాణ్ణని కూడా చెప్తాను. విరటుడు నన్ను తప్పక సేవకుడుగా తీసుకోగలడు" అన్నాడు నకులుడు. యుధిష్టరుడు.. సహదేవుడు వైపు చూశాడు నీవు ఏమి చేస్తావనే భావనతో. "దేవ గురువైన బృహస్పతి బుద్ధితో సమానమైన బుద్ధిగలవాడవూ, రాక్షస గురువైన శుక్రుని జ్ఞానంతో సమానమైన జ్ఞానం కలవాడవూ అయిన నీవేమి పనిచేస్తావు" అనడిగాడు యుధిష్టిరుడు. "నకులుడు అశ్వాలు చూస్తానన్నాడుగా. నేను ఆవులను చూస్తాను. విరటుని ఆల సంపదను జాగ్రత్తగా పెంచి అడవి జంతువుల వల్ల వాటికి అపాయం రాకుండా చూసుకుంటాను" అన్నాడు సహదేవుడు.

"ద్రౌపదీ" అని ఆగిపోయి ఆమె విరటుని కొలువులో ఏ పనిచేయగలదో అర్థంగాక ఆగిపోయాడు. తన ప్రాణాల కంటే ఆమె ఎక్కువగా ప్రియమైనది. గౌరవాన్ని, రక్షణనూ పొందదగినది. సేవ చేయడమనే పదాన్ని ఉచ్చరించడమే ఆమె పట్ల తగదని యుధిష్టరుడి అభిప్రాయం. ఆమె ఒక గొప్ప రాజుకు కుమార్తె. ఆమెది పేరుగడించిన జననం. బహు సిరిసందలతో ఆమె మెలిగిందనే విషయం తలుచుకొని యుధిష్టరుడు ఆమెను విరటుని కొలువులో ఏమి పని చేస్తావని అడగలేకపోయాడు. ద్రౌపది.. యుధిష్టరుడి ఇబ్బందిని గమనించి, "ఓ రాజోత్తమా! నా గురించి నీవు ఆందోళన, బాధ

చెందవద్దు. విరటుని రాణి కొలువులో నేను సైరంధ్రినై, ఆమెకూ, రాణి వాస స్త్రీలకు పరిచారికగా ఉంటాను. నా స్వాతంత్ర్యాన్ని, పవిత్రతను నేను నిలబెట్టుకుంటాను. స్వల్ప పనులైన తలదువ్వి జడలు వేయడం, చిన్నచిన్న వాక్యాలతో స్త్రీలను ఆనందపరచడం వంటి పనులు చేస్తాను. ఈ సేవలే నేను యుధిష్టరుడి భార్య ద్రౌపది వద్ద రాణివాసంలో ఉండి చేశానని చెప్పి, విరటుని రాణి వద్ద సేవక వృత్తి ఇవ్వాలని కోరతాను. నేను ఎవరికీ కనపడకుండా ఉంటాను" అన్నది ద్రౌపది. యుధిష్టరుడు.. ద్రౌపది ధైర్యాన్ని ప్రశంసిస్తూ.. "ఓ పవిత్రురాలా, నీ వంశానికి అనుగుణమైన మాటలే పలికాను" అన్నాడు.

విరాటుని కొలువులో ఈ విధంగా ఉండాలనిపాండవులు నిశ్చయించుకున్న తరువాత.. ధౌమ్యుడు వారిని ఆశీర్వదించి.. "రాజు వద్ద పనిచేసేవారు ఎల్లవేళలా చురుగ్గా ఉండాలి. ఎక్కువగా మాట్లాడకుండా సేవ చేస్తుండాలి. సేవకులను ఏదైనా సలహా అడిగితే తప్ప కోరి సలహా ఇవ్వకూడదు. అసలు సలహానే ఇవ్వకూడదు. అనుకూల సమయాల్లో రాజును పొగుడుతూ ఉండాలి. రాజంటే అగ్నిహోత్రం వంటి వాడని గుర్తించి, ఏ పనైనా చిన్నదిగానీ, పెద్దదిగానీ రాజుకు మనవి చేయందేచేయొద్దు. రాజుకు మిక్కిలి సమీపంలో ఉండొద్దు. అలా అని ఆయన నుంచి తప్పుకుంటున్నట్లు దూరంగా కూడా ఉండొద్దు. ఒకణ్ణి రాజు ఎంత నమ్మినా, అతనికి ఎంత అధికారమున్నా ఉత్తర క్షణం తన ఉద్యోగం పోతుందని భావిస్తుండాలి. రాజు పట్ల అధిక నమ్మకం ఉంచడం తెలివితక్కువ తనమే. రాజు తనను మన్నిస్తున్నాడని తలచి, రాజు అధిరోహించే శకటంలోగాని, ఆసనంలోగాని, రథంలోగాని కూర్చోవద్దు. ఒక రాజు నౌఖరు ఎల్లప్పుడూ చాలా చురుకుదనం కలిగి ఉండి తాను తన కట్టుబాటుతో ఉండాలి. రాజుతో గౌరవం పొందినప్పుడు ఎక్కువగా ఉబ్బి పొంగిపోకూడదు. ఆయన వద్ద అగౌరవం పొందినప్పుడు మిక్కిలి కుంగి పోకూడదు. తనతో రాజుగారు మాట్లాడిన మాటలను రహస్యంగా ఉంచాలి. బయటకు రానీయకూడదు. పురజనులు ఇచ్చే ఏ మాదిరి బహుమానాలు తీసుకోకూడదు. ఇతర సేవకుల పట్ల ఈర్ష్య కలిగి ఉండరాదు. ఒకప్పుడు రాజు ప్రతిష్టగల పెద్ద ఉద్యోగంలో బుద్ధిమంతులను వదిలి మూఢులను ఉంచవచ్చును. అటువంటి పరిస్థితుల్లో మనకేమిటి సంబంధం అనేటట్లు ఉండాలి. రాజాంత:పుర స్త్రీలతో మిక్కిలి జాగ్రత్తగా,

అణకువుగా ఉండాలి. స్త్రీల పట్ల వ్యవహరించేటప్పుడు లేశమాత్రమైన అపచారాన్ని సూచించగల పని ఏమీ చేయొద్దు. విరటుని కొలువులో ఒక సంవత్సరం పాటు మీరు శాంతియుతంగా ఉంటారుగాక. అటు తర్వాత కాలమంతా పోయిన రాజ్యాన్ని పొంది ఆనంద సౌఖ్యాలతో ఉంటారుగాక" అన్నాడు ధౌమ్యుడు.

◈

అధ్యాయం - 43

# పవిత్రత

**వి**రాట రాజు కొలువులో యుధిష్ఠరుడు సన్యాసి వేషం ధరించాడు. అర్జునుడు నపుంసకుని రూపం దాల్చాడు. మిగిలినవారు కూడా వారి వారి వేషాలను ధరించారు. వారెంత జాగ్రత్తగా వేషాలు వేసుకున్నప్పటికీ, వారి సహజ అందం విచిత్రంగా దాచలేకపోయింది. వారు విరాటరాజు వద్దకు వెళ్లి తమను సేవకులుగా నియమించాల్సిందిగా కోరారు. వారి రూపాలను చూసి .. వీరు పరిపాలన చేసేవారిలా ఉన్నారుగానీ, సేవకులుగా ఉంటారని అనుకోలేదు. కానీ వారు తమకు ఉద్యోగాలివ్వాలని రాజును మిక్కిలి వేడుకున్నారు. దీంతో రాజు వారు కోరిన పనుల్లో సేవకులుగా నియమించాడు.

యుధిష్ఠరుడు.. విరాట్ రాజుకు అనుచరుడై ఆయనతో పాచికలాడుతున్నాడు. భీముడు పాకశాల అధిపతి అయ్యాడు. విరటుని ఆస్థానానికి వచ్చిన గొప్ప మల్ల వీరులతో కుస్తీ పడి, క్రూర మృగాలను సాధించి రాజుకు ఆనందం కలిగిస్తున్నాడు. అర్జునుడు.. బృహన్నల అనే పేరుతో రాజకుమార్తె ఉత్తరకూ, ఇతర రాజ స్త్రీలకూ

ఆటపాటలు, వీణాది పరికరాల సహాయంతో నేర్పుతున్నాడు. నకులుడు అశ్వశాల అధిపతి అయ్యాడు. సహదేవుడు రాజు గో సంపదకు అధిపతి అయ్యాడు. రాజకుమార్తె అయిన ద్రౌపది.. సైరంధ్రి పేరుతో విరటుని రాణి సుధేష్ణకు దాసి అయ్యింది. ఆమె అంత:పురంలోనే ఉండి దాసి మాదిరిగా, రాణికి అనుచరురాలిగా ఉన్నది.

సుధేష్ణ సోదరుడైన కీచకుడు విరటుని సైన్యాధిపతి. కీచకుడి బలం, ప్రతిభ పైనే విరటుని రాజ్యాధికారం, గౌరవం ఆధారపడి ఉన్నాయి. అతనిదే సర్వాధికారం. వృద్ధ విరటుడు నామమాత్రపు రాజుగాని, మత్స్య రాజ్యమంతా కీచకుడే నడుపుతున్నాడని ప్రజలు అనేవారు. కీచకుడు తన బల ప్రతాపాలను చూసుకొని, విరటునిపై తన ప్రభావాన్ని తలచుకొని గర్వించేవాడు. కీచకుడు.. సైరంధ్రి (ద్రౌపది) రూపలావణ్యం చూసి మోహించి ఆమెను పొందాలనే దురాలోచన కలిగి ఉన్నాడు. ఆమె ఒక దాసీ అని, దాసీలకు కూడా ఎదురుతిరిగే సమర్థత ఉంటుందని తలవక తన బల పరాక్రమాలను, అందాన్ని చూసి ఆమె తప్పక తనను ప్రేమించగలదని నిశ్చయంగా నమ్మాడు. వీలు కుదిరినప్పుడల్లా ఆమెతో సరసాలాడటానికి ప్రయత్నించేవాడు. కానీ అవన్నీ ఆమెకు కష్టంగా తోస్తున్నాయి. కీచకుడి మోహ విషయం రాణితోగాని, ఇతరులతోగాని చెప్పడానికి ఆమెకు సిగ్గుగా ఉంది. కానీ అన్యాపదేశంగా తన భర్తలు గంధర్వులని, తన పట్ల నీచంగా, అమర్యాదకరంగా ప్రవర్తిస్తే  అలాంటి క్రూరులను చంపుతారని కీచకుడికి తెలియజేస్తూనే ఉంది. ఆమె పవిత్ర నడవడిక, తేజస్సును చూసి ఆమె చెప్పే గంధర్వ భర్తల అంశం నిజమని అందరూ భావించారు. కానీ అంత సులువుగా భయపడి ఆమెను విడిచేవాడు కాదు. అతడు ఆమెను బలాత్కరించేందుకు ప్రయత్నించాడు. సైరంధ్రి ఈ సంగతి రాణి సుధేష్ణకు చెప్పి ఆమెను శరణు కోరింది. కీచకుడికి తన సోదరి సుధేష్ణ వద్ద ఎక్కువ చనువు, అధికారం ఉన్నాయి.  సైరంధ్రిపై మోహం తట్టుకోలేకపోతున్నానని,  ఆమెపై మిక్కిలి మరులుగొని ఉన్నానని, ఎలాగైనా ఆమె పొందు తనకు కలిగేటట్లుగా చేయాలని సుధేష్ణను కీచకుడు వేడుకున్నాడు. “ఈ మోహం నన్ను చాలా చికాకు పెడుతున్నది. సైరంధ్రిని చూసిన దగ్గర్నుంచి నాకు నిద్రా, విశాంత్రీ లేనేలేవు. ఎలాగైనా నీవామెను నన్ను ప్రేమించేలా చేయకపోతే నేను చచ్చిపోతాను” అని కీచకుడు సోదరిని బెదిరించాడు.

సైరంధ్రి.. కీచకుడి దుర్నీతిని మాన్పడానికి చాలా ప్రయత్నించింది. కానీ కీచకుడు వినలేదు. సుధేష్ణ ససేమిరా ఒప్పుకోలేదు. సుధేష్ణ, కీచకుడు.. సైరంధ్రిని ఒక దురవస్థలోకి తేడానికి ఒక పన్నాగం పన్నారు. ఒకనాటి రాత్రి కీచకుడి ఇంటిలో మధుర పదార్థాలను, మత్తును కలగజేసే పానీయాలను తయారు చేసి విందు చేశారు.

సుధేష్ణ.. సైరంధ్రిని పిలిచి, ఆమె చేతికొక బంగారు కలశమిచ్చి, దానితో కీచకుడి ఇంటి నుంచి పానీయాలు తీసుకు రమ్మని ఆజ్ఞాపించింది. తనపై మిక్కిలి మోహావేశంతో ఉన్న కీచకుడి ఇంటికి వెళ్లడానికి సైరంధ్రి ఆ రాత్రి సమయంలో.. ఇష్టపడలేదు. ఇతరులను ఎవరినైనా పంపమని రాణిని కోరింది. కానీ సుధేష్ణ ఆమె మాటలు వినలేదు. సుధేష్ణ కోపంతో.. "నీవు వెళ్లి తీరాలి. ఇతరులను నేను పంపను" అంది. సైరంధ్రి ఇక రాణి ఆజ్ఞ పాటించాలి.

సైరంధ్రి కీచకుడి ఇంటికి వెళ్లేసరికి ఆ దుర్మార్గుడు తప్పతాగి మైమరచి, తనను బతిమిలాడుతూ, తన ఒడిలోకి రమ్మని నిర్బంధం చేయసాగాడు. అతడి మాటలు లక్ష్య పెట్టక సైరంధ్రి.. "గొప్ప రాజవంశాన పుట్టిన నీవు నీచపు పుట్టుకవాడి మాదిరి వాంఛిస్తున్నావేమిటి?. ఇలాంటి దుర్మార్గం నీవు ఎందుకు ఒడిగడుతున్నావు?. నేను వివాహితను. నీవు చస్తావు. నన్ను రక్షించడానికి గంధర్వులు వచ్చి నిన్ను చంపేస్తారు" అన్నది సైరంధ్రి వేషంలో ఉన్న ద్రౌపది.

కీచకుడు సైరంధ్రి చేయి పట్టుకున్నాడు. సైరంధ్రి తన చేతిలోని పాత్రను అక్కడే పడేసి అతడి పట్టు నుంచి విడిపించుకొని బిగ్గరగా ఏడుస్తూ విరటుని కొలువుకూటానికి పరిగెత్తుకొచ్చింది. ఆమెను వెంబడిస్తూ కీచకుడు కూడా పిచ్చెత్తినవాడిలా పరిగెత్తుకొచ్చాడు. తాను తాగిన మత్తు పానీయాల వల్లేగాక, రాజుపై తనకున్న అధికార గర్వంతోనూ సైరంధ్రిని తిడుతూ..సభలోనే చేయి చేసుకున్నాడు. అక్కడున్న ప్రతివారూ అసాధారణ సేనా నాయకుడైన కీచకుడికి అడ్డుపడే సాహసం చేయలేకపోయారు. తనకు జరిగిన అవమాన సమయంలో సహాయం చేసేవారెవరూ లేరని, సైరంధ్రి తన కోపాన్ని విచారాన్ని వ్యక్తం చేసింది. తనకొచ్చిన ఈ పరిస్థితి వల్ల పాండవుల అజ్ఞాతవాస చర్యకు భంగకరమని కూడా ఆమె ఆలోచించలేకపోయింది.

ద్రౌపది ఆ రాత్రి భీముడి వద్దకు వెళ్లి లేపింది. తనపై కీచకుడు అఘాయిత్యానికి ప్రయత్నించి తరువాత సభలో తనను తిట్టి ఎలా కొట్టిందీ ఏడుస్తూ భీముడికి వివరించి చెప్పింది. "నేనిక భరించలేను. తక్షణమే నీవు ఆ నీచుణ్ణి చంపు. మీ కోసం, మీ ప్రతిజ్ఞ నిలపడానికి నీచపు సైరంధ్రి వృత్తి చేస్తున్నాను. విరటునికి చందనం కూడా తయారు చేస్తున్నాను. ఇవేవీ నేను లక్ష్య పెట్టలేదు. ఇప్పటివరకూ మిమ్ములను, గౌరవనీయులైన కుంతిని తప్ప ఇతరులను సేవించలేదు. కానీ ఇప్పుడు ఈ నీచులకు ఏ క్షణమైనా నన్నవమాన పరచగలరనే భయంతో కుంగుతూ.. సేవ చేయాల్సి వచ్చింది. కష్టమైన పనులు నేను చేయలేనని కాదు. ఇవిగో నా చేతులు చూడు'' అంది. కష్టమైన పనులు చేయడం వల్ల కాయలు కాసి బీటలువారి ఉన్న తన చేతులను భీముడికి చూపింది. భీముడు ఆ చేతులను గౌరవ పూర్వకంగా తన ముఖానికి,

కళ్లకు అద్దుకున్నాడు. భీముడు కూడా విచారం, కనికరం, ప్రేమ వీటి కలయికతో మాట్లాడలేక ఆమె కంటి బాష్పాలను తుడిచాడు. చివరికి ద్రౌపదితో.. ''యుధిష్ఠరుడి వాగ్దానాన్ని గాని, అర్జునుడి సలహాను గాని నేను లక్ష్య పెట్టను. ఏమి జరుగుతుందో కూడా దాన్నీ నేను లక్ష్య పెట్టను. నీవు చెప్పినట్లే కీచకుణ్ణి చంపేస్తాను" అని నిలబడ్డాడు భీముడు. ద్రౌపది అతణ్ణి బతిమాలి తొందరపడరాదని ఆపింది. ఈ విషయమై వారిద్దరూ ఒక ఆలోచన చేసి దానికి కార్యరూపం ఇవ్వాలనుకున్నారు. కీచకుణ్ణి ఎలాగైనా వంచించి అతణ్ణి ఎలాగైనా రాత్రిపూట ఒంటరిగా నాట్యశాలలోని ఒక మూల భాగానికి వచ్చేలా చేస్తే.. అక్కడ ద్రౌపది స్థానంలో స్త్రీ వేషం ధరించిన భీముడే కీచకుడి కోసం వేచి ఉన్నట్లు ఏర్పాటు చేశారు.

మరునాడు ఉదయం కీచకుడు మరలా గర్వం, దర్పంతో పేలుతూ సైరంధ్రి వెంట పడ్డాడు. "సైరంధ్రీ రాజు సమక్షంలోనే నిన్ను తిట్టి పడదోసితన్నాను. నీకు సహాయం చేయడానికి ఎవరైనా వచ్చారా?. ఈ మత్స్య రాజ్యానికి విరటుడు పేరుకు రాజు. సేనాధిపతి అయిన నేనే అసలు రాజును. ఇప్పుడు నీవు తెలివితక్కువగా ఆలోచించకు. వచ్చి నాతో జీవితాన్ని ఆనందించు. రాజ లాంఛనాలన్నీ నీవే. నేను నీకు అత్యంత భృత్యుడను అవుతాను" అంటూ కీచకుడు ద్రౌపదిని వేడుకొన్నాడు. ఇలా ఆమె చేరువకు వెళ్లి తన మన్మథాగ్నితో చూడసాగాడు. అయితే ద్రౌపది.. కీచకుడికి స్వల్పంగా వశమైనట్లుగా నటించింది. "కీచకా.. నీ ప్రార్థనను ఇక తోసిరాజనలేను. కానీ నీ స్నేహితులకుగాని, ఇతర అనుచరులకుగాని, మన మోహ సంబంధం తెలియకూడదు. నీవు ఈ రహస్యాన్ని ఎవ్వరికీ తెలియనివ్వబోనని ఒట్టుపెట్టు. అప్పుడు నేను నీకు వశమవుతాను. నీ కోరిక తీర్చుతాను" అన్నది ద్రౌపది. దీంతో కీచకుడు బ్రహ్మానందభరితడయ్యాడు. ద్రౌపది కోరినట్లుగా ఎవ్వరికీ తెలియనివ్వబోనని.. ఒట్టు అన్నాడు. "ఈ రాత్రికే నీవు ఎక్కడికి రమ్మంటే అక్కడే వస్తా" అన్నాడు. "నాట్యశాలలో పగలు రాజ స్త్రీలు ఆటపాటలు నేర్చుకొని రాత్రి అవడంతోనే ఎవరి గదులకు వారు వెళ్తారు. రాత్రివేళ ఎవ్వరూ నాట్యశాలలో ఉండరు. ఈ రాత్రికి అక్కడికి రా. నీ కోసం నేనక్కడ వేచి ఉంటా. అప్పుడు నీవు నీకు ఇష్టం వచ్చినట్లు నన్ను ఉపయోగించుకోవచ్చు" అని ద్రౌపది అన్నంతనే కీచకుడు ఆనందంలో ఓలలాడాడు.

ఆ రాత్రి కీచకుడు జలకమాడి, సుగంధాలను పూసుకొని అలంకరించుకొని నాట్యశాలకు వెళ్లాడు. తలుపులు తెరిచి ఉండటాన్ని గమనించాడు. సంతోషంతో లోనికి వెళ్లాడు. లోపల మిణుకు మిణుకు వెలుగులో ఎవరో పాన్పుపైన పడుకున్నట్లు కీచకుడు చూశాడు. ఇక్కడెవరు పడుకుంటారు. సైరంధ్రియే అనుకున్నాడు. ఆ మిణుకు

వెలుతురులో తడుముకుంటూ పాన్పు వద్దకు వెళ్లాడు. మెల్లగా తన చేతులను పడుకున్నవారిపై వేశాడు. "అయ్యో.. ఇదేమిటి ఇది మృదువైన ద్రౌపది శరీరం కాదే" అనుకుంటూ ఉండగా.. భీముడు లేచి కీచకుడిపై పడ్డాడు. అతణ్ణి నేలమీద పడేశాడు. ఆశ్చర్య పడ్డాడు కీచకుడు. వారిద్దరూ ఘోరమైన మల్లయుద్ధం చేశారు. ద్రౌపది ఒకానొక గంధర్వ భర్తతో యుద్ధం చేస్తున్నానని అనుకొన్నాడు కీచకుడు. అయితే భీముడూ, కీచకుడూ మధ్య యుద్ధం సామాన్యమైన విషయం కాదు. భీముడు, బలరాముడు, కీచకుడు ముగ్గురూ బాహుబలంలోనూ, మల్ల యుద్ధంలోనూ సమానమైనవారని ఖ్యాతి చెందారు. భీమ, కీచకుల యుద్ధం పూర్వం వాలి, సుగ్రీవుల యుద్ధం మాదిరిగా ఉంది. చివరికి భీముడు.. కీచకుడి శరీరాన్ని పొడిచి పొడిచి, కుక్కి ఒక రూపంలేని మాంసం ముద్దలా చేసి చంపాడు. ఈ సంతోష వార్త ద్రౌపదికి తెలిపాడు భీముడు. తన పానశాలకు వెళ్లి భీముడు స్నానమాడి, మంచి గంధం శరీరానికి పూసుకొని కమ్మగా నిద్రపోయాడు. ద్రౌపది ద్వారపాలకులను లేపింది. "కీచకుడు నన్ను పొందడానికి రాత్రి వచ్చాడు. నేనిదివరకు అతడితో చెప్పిన ప్రకారం నా గంధర్వ భర్తలు అతన్ని చంపారు. కనుక మీ సేనా నాయకుడు మోహ జాడ్యానికి లోనై చావుకు తెచ్చుకున్నాడు. అదిగో కీచకుడి శవాన్ని చూడండి" అని ద్రౌపది ద్వారపాలకులకు చూపింది. కీచకుడి శవం ఆకారంలేని ఒక ముద్దలా పడిఉంది.



విరాట సభలో సైరంధ్రి (ద్రౌపది)కి అవమానం

## అధ్యాయం - 44

# మత్స్య ప్రతిఘటన

**కీ**చకుని హత్య గురించి తెలిసిన తరువాత విరటు ప్రజలకు ద్రౌపది అంటే భయం ఏర్పడింది. ఆమె అందరి హృదయాలు ఆకర్షించే అందమైనది. అయితే ఆమె ఎంత అందమైనదో అంత ప్రమాదకరమైనదని, గంధర్వులు ఆమెను రక్షిస్తారని, ఆమె వల్ల పట్టణ ప్రజలకు, రాజ బంధువులకు అపాయం వస్తుందని, కనుక ఆమెను పట్టణం నుంచి వెళ్లగొట్టాలని కొంతమంది ప్రజలు సుధేష్ణ వద్దకు వెళ్లి కోరారు. అప్పుడు సుధేష్ణ.. "నీవు నిస్సంశయంగా పవిత్రమైనదానివి. దయవుంచి మా పట్టణం నుంచి వెళ్లిపో. నీ వల్ల నాకు చాలా నష్టం జరిగింది" అన్నది ద్రౌపదితో.

ఇది జరిగే సమయానికి వారి అజ్ఞాతవాస కాలం కేవలం ఒక్క నెల మాత్రమే ఉంది. ద్రౌపది.. సుధేష్ణను వేడుకొంది. మరో నెల మాత్రమే తనను పనిలో ఉంచాలని కోరింది. ఆ నెల పూర్తయితే గంధర్వులైన తన భర్తలు వారి కార్యాలు పూర్తి చేసుకొని తనను తీసుకు వెళ్తారని బతిమిలాడుకుంది. అయితే గంధర్వులకు

కోపం తెప్పిస్తే.. ప్రమాదం వస్తుందని ద్రౌపది కోరికను నిరాకరించడానికి సుధీష్ణ భయపడింది.

పదమూడో సంవత్సరం ప్రారంభం నుంచి దుర్యోధనుడు ద్వారా పంపిన వేగులు అజ్ఞాతవాసంలో ఉన్న పాండవులను కనిపెట్టడానికి వెతుకుతూనే ఉన్నారు. వీరు కొన్ని నెలలపాటు తిరిగి వచ్చి తమకు పాండవుల గురించి ఏమీ తెలియలేదని, బహుశా దుర్భర దారిద్ర్యంతో కృశించి చనిపోయి ఉంటారని దుర్యోధనుడికి తెలిపారు. కీచకుణ్ణి చంపగలవారు ప్రపంచంలో ఇద్దరే ఉన్నారు. అందులో భీముడొకడు. దీని వల్ల వారికి అనుమానం కలిగి కీచకుణ్ణి చంపగల బలశాలి అయిన గంధర్వుడు భీముడే అనుకున్నారు. ఏ స్త్రీ విషయమై గొడవ జరిగిందో ఆమె ద్రౌపది కావచ్చని దుర్యోధనుడు తలిచాడు. నిండు సభలో అతడీ అనుమానాలను చెప్పాడు. “పాండవులు విరాట పట్టణంలో ఉన్నారని నా అనుమానం. ఈ విరట రాజు మనతో సఖ్యతగా ఉండటానికి ఇష్టపడని గర్విష్ఠి రాజుల్లో ఒకడు. కనుక విరట దేశంపై దండెత్తి, రాజు ఆల సంపదను మనం తెచ్చుకోవడం మంచిదని నాకు తోస్తోంది. పాండవులు నిజంగా అక్కడుంటే మనపైకి యుద్ధానికి వస్తారు. ఆ విధంగా మనం పాండవులను తేలిగ్గా గుర్తించొచ్చు. అలా గుర్తిస్తే, పాండవులను మరో పన్నెండేళ్లపాటు అరణ్యవాసం చేయించొచ్చు. విరటుని రాజ్యంలో పాండవులు లేకపోతే మనకు పోయేదేమీ లేదు. త్రిగర్తరాజు సుశర్మ దీనికి సమ్మతించాడు” అన్నాడు దుర్యోధనుడు. “మత్స్యరాజు మనకు శత్రువు. కీచకుడు నాకెన్ని కష్టాలు తెచ్చిపెట్టాడు. కీచకుడి మరణంతో విరటుని బలం తగ్గిపోయింది. ఇప్పుడే విరటునిపై దండెత్తడానికి అనుమతి ఇవ్వండి'' కర్ణుడు ఈ అభిప్రాయాన్ని అంగీకరించాడు. సుశర్మ దక్షిణ దిశకు సైన్యంతో వెళ్లాలని, విరటుని సైన్యమంతా అటువైపు తిప్పుకోవాలని, దుర్యోధనుడు తన కౌరవసేనతో ఉత్తర దిశ నుంచి అకస్మాత్తుగా యుద్ధానికి వెళ్తే ఆ దిశలో కౌరవులను ఎదుర్కొని ప్రతిఘటించడానికి ఎవరూ ఉండరు అని అందరూ నిశ్చయించుకున్నారు.

సుశర్మ మత్స్య దేశాన్ని దక్షిణం నుంచి తన సైన్యంతో చుట్టుముట్టాడు. గో సంపదను పట్టుకున్నాడు. మార్గంమధ్యలో తోటలను ధ్వంసం చేశాడు. పశుపాలకులు పరిగెత్తుకొచ్చి విరటునికి సమాచారం అందించారు. ఖిన్నుడైన విరాటుడు.. ఈ సమయంలో కీచకుడుంటే ఎంత బాగుండు. ఒక్క క్షణంలో ఈ సుశర్మ సైన్యాన్ని తుత్తునియలు చేసేవాడు అనుకున్నాడు. విరాటుని కొలువులో యుధిష్ఠరుడు కంకుభట్టు అనే పేరుతో కొనసాగుతున్నాడు. విరటుడు కంకుభట్టుతో శత్రువుల ఆక్రమణ గురించి చెప్పాడు. దానికి కంకుడు.. “ఓ రాజా, నీవు ఆందోళన చెందొద్దు. నేను సన్యాసిని అయినా యుద్ధ నైపుణ్యం కలవాడినే. నేను కవచం ధరించి రథంపై వెళ్లి శత్రువులను

రూపుమాపుతాను. నీ వంటల వాడైన వలలుణ్ణి, అశ్వరక్షకుడైన దామగ్రంధిని, గోరక్షకుడైన తంత్రీపాలుణ్ణి కూడా మనకు సహాయంగా రథాలపై రావలసిందని ఆజ్ఞ ఇవ్వండి. వారు గొప్ప యుద్ధ నిపుణులని విన్నాను. కావలసిన రథాలను, ఆయుధాలను ఏర్పాటు చేయాలని ఆజ్ఞ ఇవ్వండి" అన్నాడు. విరటుడు ఆనందించాడు. కంకుడు చెప్పినట్లే చేశాడు. రథాలు సిద్ధమయ్యాయి. అర్జునుడు తప్ప మిగతా పాండవులు విరటుని సైన్యంతో సుశర్మను, అతడి సైన్యాన్ని ఎదుర్కోవడానికి వెళ్లాడు. సుశర్మ – విరటుడి సైన్యాలకు మధ్య గొప్ప యుద్ధం జరిగింది. రెండు పక్షాల్లోనూ ప్రాణ నష్టం సంభవించింది. సుశర్మ.. విరటుని రథాన్ని చుట్టుముట్టి భూమిపైకి దిగి యుద్ధం చేసేలా చేశాడు. అతణ్ణి ఖైదు చేసి తన రథంలో పడవేశాడు. విరటుణ్ణి బంధించిన వెంటనే విరటుని సైన్యమంతా ధైర్యం కోల్పోయి అన్ని దిక్కులకూ పలాయనం చిత్తగించడం ప్రారంభించింది. దీంతో ధర్మరాజు.. భీముణ్ణి (వలలుణ్ణి) రంగంలోకి దించి సుశర్మను ఎదిరించి, మత్స్య రాజు సైన్యాన్ని కూడదీయాలని చెప్పాడు. ఈ మాటలు విన్న భీముడు ఒక చెట్టును పెరకబోగా.. ధర్మరాజు వారించాడు. "ఈ ఉపాయాలు వద్దు. సింహనాదము వద్దు. అలా చేస్తే నీవు భీముడివని తెలుసుకుంటారు. ఇతరుల్లాగా నీవు రథంపై నుంచి బాణాలతో యుద్ధం చెయ్యి. భీముడా ఆవిధంగానే చేశాడు. శత్రువులను ఎదుర్కొన్నాడు. విరటుడిని విడిపించి సుశర్మను బంధించాడు. చెదిరిపోయిన మత్స్య సైన్యాన్ని కొత్త వ్యూహంతో నిర్మించాడు. ఆ సైన్యంతో సుశర్మ సైన్యాన్ని ఓడించాడు.

సుశర్మ ఓటమి వార్త తెలిసిన వెంటనే ప్రజలు ఆనందోత్సాహాలు వ్యక్తం చేశారు. పట్టణాన్ని అలంకరించి, విజయంతో వచ్చే విరాట రాజును గౌరవ ప్రపత్తులతో ఎదురేగి పట్టణానికి తీసుకురావడానికి సిద్ధమయ్యారు. ఈ సన్నాహాల్లో ఉండగా.. ఉత్తర దిశ నుంచి దుర్యోధనుడి సైన్యం దేశంపై పడింది. గోశాలలను పాడుచేసి ఆవులను బెదరగొడ్తూ పట్టణానికి దగ్గరగా వస్తున్నారు. కౌరవ సేనంతా కదిలివచ్చి లెక్కకుమిక్కిలి ఆలమందలను చుట్టుముట్టారు. గోవుల పెద్ద పట్టణానికి పరుగెత్తుకు వచ్చి రాకుమారుడు ఉత్తరుడికి చెప్పాడు. "ఓ రాజకుమారా, కౌరవులు మనమీదకు వస్తున్నారు. మన ఆవులను తోలుకొని పోతున్నారు. విరాట మహారాజుగారు దక్షిణ దిశలో యుద్ధానికి వెళ్లారు. మమ్మల్ని రక్షించడానికి ఎవరూ లేనందువల్ల చాలా భయంగా ఉంది. మీరు రాజపుత్రులు. కనుక మమ్ములను మీరే రక్షించగలరని ఆశిస్తున్నాను. దయచేసి వెంటనే వచ్చి మన ఆవుల మందలను రక్షించి మన కుటుంబ గౌరవం నిలబెట్టండి" అన్నాడు గోవుల పెద్ద.

గోపాలకుడు ఈ విధంగా ప్రజలందరి మధ్య, ముఖ్యంగా రాణివాస స్త్రీల

మధ్య ఉత్తరుడికి మొరపెట్టుకున్నాడు. దీంతో ఉత్తరుడు ప్రతాపం ఉట్టిపడేలా గర్వంగా.. "నా రథాన్ని నడపడానికి ఎవరైనా దొరికితే నేనొక్కడినే ఆవులను మరలించుకు వచ్చేవాణ్ణి. నా బాహుబల శక్తి ఈ సమయంలోనే చూడాలి. అప్పుడుగాని ప్రజలు నాకూ అర్జునుడికీ బలప్రతాపంలో హెచ్చుతగ్గులేమీ లేవని అనుకొంటారు.

ఉత్తరుడీ మాటలు చెప్పేటప్పుడు లోపలున్న ద్రౌపది విన్నది. ఉత్తర కుమారుడి మాటలకు తనలో తనే నవ్వుకొంది. ద్రౌపది వెంటనే రాజకుమార్తె అయిన ఉత్తర కుమార్తె వద్దకు వెళ్లి.. "ఓ రాజకుమారీ, దేశానికి గొప్ప విపత్తు సంభవించింది. కౌరవ సైన్యం మన పట్టణంపై దండెత్తడానికి ఉత్తర దిశ నుంచి వస్తోంది. చుట్టుపక్కల ఉన్న మన గోశాలలోని గోవులను పట్టుకున్నారని ఇప్పుడే మన గోపాలుడు ఉత్తర రాకుమారుడితో మొరపెట్టుకోవడం విన్నాను. ఉత్తర రాకుమారుడికి కౌరవులతో యుద్ధం చేయాలని ఉందిగానీ, అతడికి రథ సారథి లేడట. జయించి కీర్తి సంపాదించడానికి రథ సారధి లేకపోవడమే కారణమైతే బృహన్నల.. అర్జునుడి వద్ద రథ సారధిగా ఉన్నాడు. పాండవ మహిషి ద్రౌపది వద్ద నేను ఉన్నప్పుడు ఈ విషయం తెలుసుకున్నాను. బృహన్నల అర్జునుడి వద్ద విలు విద్య నేర్చుకున్నాడని కూడా విన్నాను. నీవు వెంటనే వెళ్లి బృహన్నల వద్దకు వెళ్లి ఉత్తర రాకుమారుడి రథం నడపాలని ఆజ్ఞ ఇవ్వు" అని సైరంధ్రి (ద్రౌపది) ఉత్తర కుమార్తెకు చెప్పింది. దీంతో ఉత్తర రాకుమార్తె తన అన్న వద్దకు పరిగెత్తుకొని వెళ్లింది. "బృహన్నల గొప్ప రథ సారధి అని, పాండవ వీరుడైన అర్జునుడికి సారధ్యం చేశాడని సైరంధ్రి చెప్తోంది. ఆమె పాండవుల అంత:పురంలో సేవకురాలిగా ఉన్నప్పుడు ఈ సంగతి తెలుసుకున్నదట. బృహన్నలను తీసుకొని నీవు యుద్ధ రంగానికి వెళ్లి దేశానికి కీర్తి సంపాదించుకొని రా" అన్నది ఉత్తర రాకుమార్తె. దానికి ఉత్తరుడు అంగీకరించాడు. వెంటనే రాకుమారి నాట్యశాలకు పరుగున వెళ్లి బృహన్నలతో.. "కౌరవులు మా గో సంపదను తోలుకొని పోతున్నారు. విరాట్ రాజు లేని సమయంలో ఆ దుర్మార్గులు వచ్చారు. నీవు అర్జునుడి రథం నడపావని, యుద్ధంలో కూడా నేర్పరివని సైరంధ్రి చెప్పింది. వెళ్లి మా అన్న అయిన రాకుమారుడికి రథ సారధ్యం చేయి. భయపడకు. రాకుమారుడు నిన్ను తప్పక రక్షిస్తాడు" అని అడిగింది.

బృహన్నల తనకొచ్చిన నవ్వును ఆపుకున్నాడు. సిగ్గును అభినయిస్తూ.. రథ సారధ్యానికి అంగీకరించాడు. అక్కడున్న స్త్రీలంతా బృహన్నల భయాన్ని చూసి నవ్వారు. భయం చెందాల్సిన పనిలేదని, ఉత్తరుడు ఎల్లవేళలా కాపాడతాడని అన్నారు. దీంతో బృహన్నల తనలో తనే నవ్వుకున్నాడు. చివరికి అశ్వశాలకు వెళ్లి ఆశ్వాలను తీసుకొచ్చి రథానికి కట్టాడు. బృహన్నల ఈ పని చేస్తున్నప్పుడు అక్కడున్నవారంతా ఇతడీ పనిలో

ఆరితేరినవాడని అర్థం చేసుకున్నారు. కళ్లేలు పట్టుకోగానే గుర్రాలు కూడా బృహన్నలను ప్రేమించాయి. ఆయన ఆజ్ఞలను అనుసరిస్తున్నట్లు ప్రవర్తించాయి. తన రథంలో రాకుమారుణ్ణి కూర్చోపెట్టుకొని పట్టణం వెలుపలికి వెళ్తూ.. బృహన్నల ఇలా అన్నాడు. “రాకుమారుడు తప్పక జయిస్తాడు. రంగు రంగులు, నగిషీలుగల శత్రువుల తలపాగాలను తీసుకొని విజయ సూచికంగా వాటిని మీ అందరికి బహుమతిగా ఇస్తాము”.

◈



జమ్మిచెట్టుపై ఆయుధాలు గ్రహించిన అర్జునుడు, ఉత్తర రాకుమారుడు

## అధ్యాయం 45

# ఉత్తర రాకుమారుడు

విరట రాజు కుమారుడైన ఉత్తరుడు ఎంతో ఉత్సాహంతో రథాన్ని ఎక్కి పట్టణం నుంచి బయలుదేరాడు. అతని రథానికి బృహన్నల సారథ్యం వహిస్తున్నాడు. ఆయనతో.. "కౌరవులు మన ఆల మందలను ఎక్కడికి మరలిస్తున్నారో అక్కడికి మన రథాన్ని వేగంగా పోనివ్వు" అని ఆజ్ఞాపించాడు. దీంతో బృహన్నల రథాన్ని ఆలమందల వైపు మళ్ళించాడు. కొంత దూరం వెళ్ళాక వారికి కౌరవ సైన్యం కనిపించింది. సేనకు చేరువుగా రథం చేరుకుంది. కౌరవుల సేన గొప్ప వ్యూహంతో ఉంది. భీష్ముడు, ద్రోణుడు, దుర్యోధనుడు, కర్ణుడు తదితరులంతా సేనకు ముందు భాగాన ఉన్నారు. వారిని ఉత్తర కుమారుడు చూశాడు. వెంటనే అతనిలో ధైర్యం తగ్గిపోయింది. అతని నాలుక భయంతో ఎండి పోయింది. అవయువాలన్నీ సడలిపోయినట్టు అయ్యాయి. కౌరవసేన చాలా భయంకరంగా కనిపించింది. తన రెండు చేతులతో కళ్ళను మూసుకున్నాడు. "నేను ఒక్కణ్ణి. ఇంత సైన్యాన్ని ఎలా

ఎదుర్కోగలను? నాకా సైన్యం లేదు. ఉన్న సైన్యం అంతా తన తండ్రి తనతో తీసుకు వెళ్ళాడు. ఈ సైన్యాన్ని తాను ఒక్కడే ఎదుర్కోవటం అసాధ్యం " అని తలచాడు. ఆ వెంటనే ఓయీ బృహన్నల .. రథాన్ని వెనక్కి మరలించు" అని భయంతో అన్నాడు. బృహన్నల నవ్వి .. "ఓ రాజకుమారా గొప్ప దైవ నిశ్చయబుద్ధితో నీవు పట్టణం నుంచి బయలుదేరావు. స్త్రీ జనమంతా నీ వీరత్వం, కీర్తిని గురించి ఆనందించారు. పురజనులు కూడా నీపై భారం ఉంచి.. నిన్నే నమ్ముకున్నారు. సైరంధ్రి నన్ను పొగిడినది. నీవు కోరగా నేను వచ్చాను. గోవులను తీసుకుని పట్టణానికి తిరిగి వెళ్ళకపోతే మనల్ని చూసి అందరూ అపహాస్యం చేస్తారు. నేను వెనక్కు రథాన్ని మరల్చను. మన సైన్యంతోనే యుద్ధం చేద్దాం. ఏమాత్రం భయం చెందవద్దు" అని బృహన్నల అన్నాడు. ఈ లోపు కౌరవ సేన, వారి దగ్గరగా వచ్చింది. ఉత్తరుని ముఖంలో విషాదం అలుముకుంది. గద్గద స్వరంతో .. "నేను యుద్ధం చేయలేనంటే చేయలేను అంతే. కౌరవులు ఆవులను తోలుకు పోనివ్వు! మహిళలు నవ్వినా నవ్వనివ్వు. నేను లక్ష్యపెట్టను. మనకంటే అనేక రెట్లు బలవంతులైన శత్రువులతో మనం యుద్ధం చేయలేము. ఓ బృహన్నలా..రథాన్ని వెనక్కు మరల్చు. లేకపోతే నేను రథం దిగి వెనుకకు లంఘిస్తాను" అని ఉత్తర కుమారుడు అన్నాడు. వెంటనే తన బాణాలను రథంలోనే వదిలేసి రథం నుంచి దూకి భయభ్రాంతుడై పట్టణంలోకి పరిగెత్తనారంభించాడు. పరుగెడుతున్న ఉత్తర రాకుమారుని వెంట పడ్డాడు బృహన్నల. ఆగు రాకుమారా అంటూ కేకలు వేశాడు. క్షత్రియుడిలా ప్రవర్తించు అంటూ కేక పెట్టాడు. కానీ, ఉత్తర కుమారుడు అర్జునుడికి దొరకకుండా పరిగెడుతూనే ఉన్నాడు. ఇది చూసిన కౌరవ సైన్యం పకపకా నవ్వుకుంది. బృహన్నలను చూసిన ద్రోణుడు తనలో.. ఈ వ్యక్తి వస్త్రధారణ విచిత్రంగా ఉన్నదే. అది స్త్రీ వేషమా ? ఆ వేషంలో ఉన్న అర్జునుడా? అని అనుమానపడ్డారు. ఇదే మాట పక్కన ఉన్న కర్ణుడుతో అన్నాడు. కర్ణుడు.. "ఈ వ్యక్తి అర్జునుడా! ఒకవేళ అర్జునుడైతేనేమి?. మనకెదురుగా ఒక్క అర్జునుడే తన సోదరుల సహాయం లేకుండా ఏమి చేయగలడు?. రాజు సుశర్మ పైకి సేననంతా యుద్ధానికి తీసుకు వెళ్ళినపుడు అతడి కుమారుడు ఏకాకిలా ఉన్నాడు. అతడు రాణివాసపు దాసీలలో ఒకదానిని తనకు సారధిగా తీసుకు వచ్చాడు అంతే ! అతడు అర్జునుడు కాదు" అన్నాడు.

ఉత్తరుడు బృహన్నలను తనను విడిచిపెట్టమని బతిమలాడుతున్నాడు. తనను విడిచి పెడితే చెప్పనలవి కాని భాగ్యాన్ని ఇస్తానని అన్నాడు. తాను తన తల్లికి ఒక్కడే కుమారుడినని, తల్లి పర్యవేక్షణలో పెరుగుతున్న చిన్నవాడినని, తనను వదిలివేయాలని ఉత్తర కుమారుడు కోరాడు. బృహన్నల అతని పట్ల దయ చూపుతూ భయం పోగొట్టే రీతిలో మృదువుగా.. "ఉత్తర కుమారా భయం చెందకు. నేను కౌరవ సైన్యంతో

పోరాడతాను. నువ్వు రథాన్ని తోలు. గుర్రాలను జాగ్రత్తగా చూసుకుంటూ ఉండు. మిగతా పని నేను చూస్తాను. నా మీద నమ్మకం ఉంచు. పారిపోయినందువల్ల ఏమీ రాదు. మనం శత్రువులను పారదోలి గోవులను తెచ్చుకుందాం. ఆ కీర్తి అంతా నీదే" అని చెప్పి ఉత్తర కుమారుడిని, బృహన్నల రథం ఎక్కించాడు. గుర్రపు కళ్ళేలను ఉత్తరుడి చేతికి ఇచ్చాడు. సమీపంలోని స్మశానానికి దగ్గరగా ఉన్న చెట్టు దగ్గరకు రథాన్ని పోనివ్వమని కోరాడు. ఈ దృశ్యాలను దూరం ఉండి నిశితంగా గ్రహిస్తున్నాడు ద్రోణుడు ! రథంలో ఉన్నది అర్జునుడని గుర్తించాడు. ఈ సంగతిని భీష్ముడి చెవిన వేశాడు. దుర్యోధనుడు, కర్ణుడితో .. "వాడెవ్వడైతే మనకేమిటి? అతను అర్జునుడైనా? మరెవరైనా? మనచేతికి చిక్కాల్సిందే! అతడే అర్జునుడు అయితే మళ్ళీ పాండవులంతా పన్నెండేళ్ళు అరణ్యవాసానికి వెళ్ళి తీరాల్సిందే" అని అన్నాడు. ఉత్తరుడు, బృహన్నల చెట్టు కిందకు వచ్చారు. చెట్టెక్కి దానిపై దాచి ఉంచిన ఆయుధాలను కిందకు తీసుకుని రమ్మని ఉత్తరుడితో బృహన్నల చెప్పాడు. ఉత్తరుడు భయంతో .. ''అక్కడో వృద్ధురాలి కళేబరం వేలాడుతూ ఉంటుందని ప్రజలు చెప్పుకుంటుండగా నేను విన్నాను. నేను ఆ మృత కళేబరాన్ని ఎలా తాకగలను? ఈ పని నీవు నాకు ఎలా చెబుతావు?'' అన్నాడు. దీనికి బృహన్నల .. "ఓ రాజకుమారా ! అది మృత మానవ కళేబరం కాదు. దానిలో పాండవుల ఆయుధాలు ఉన్నాయని నాకు తెలుసు. ధైర్యంతో చెట్టెక్కి వాటిని కిందకు తీసుకుని రా. ఆలస్యం చేయకు" అన్నాడు. దీంతో ఉత్తరుడు భయం భయంగానే బృహన్నల చెప్పిన ప్రకారం చెట్టెక్కి అక్కడ వేలాడగట్టి ఉన్న సంచిని తీసుకుని చెట్టు దిగి వచ్చాడు. మానవ కళేబరం తరహాలో ఉన్న తోలు సంచిని విప్పారు. అందులో సూర్యుడి వలే ప్రకాశిస్తున్న ఆయుధాలను చూసి ఉత్తరుడు ఆశ్చర్యపోయాడు. తన కళ్ళు మూసుకుని ధైర్యాన్ని తెచ్చుకుని ఆయుధాలను తాకాడు. వాటిని తాకగానే అతనిలో గొప్ప ధైర్యం ప్రవేశించినట్టు అనిపించింది. ఎంతో కుతూహలంతో .. "ఓ బృహన్నలా .. ఏమిటీ వింత? ఈ బాణములు, కత్తులు పాండవులవని నీవంటున్నావు ! వాళ్ళు రాజ్యాన్ని వదిలివేసి అడవులలో నివశించటానికి వెళ్ళిపోయారు. వాళ్ళను నీవు ఎరుగుదువా? వారెక్కడ ఉన్నారు? అని అడిగాడు. అప్పుడు బృహన్నల, ఉత్తరుడితో తామంతా విరట రాజు కొలువులోనే ఉన్నామని తెలిపాడు. రాజు దగ్గర సేవ చేస్తున్న కంకభట్టే యుధిష్టరుడు. మంచి మంచి రుచికరమైన వంటలతో మీ తండ్రిని తృప్తి పరుస్తున్న వంటల వాడు వలులుడే భీముడు ! ఏ స్త్రీని అయితే అవమానించినందుకు కీచకుడు చంపబడ్డాడో ఆ స్త్రీయే సైరంధ్రి అయిన ద్రౌపది. అశ్వశాల అధికారి దామ గ్రంధి నకులుడు. గోవుల అధికారి తంత్రీపాలుడు సహదేవుడు. బృహన్నలగా నీ ముందున్న నేను.. అర్జునుణ్ణి! ఓ రాకుమారా! భీష్మ,

ద్రోణ, అశ్వత్థామలు చూస్తుండగానే కౌరవులను ఓడించి మన ఆవుల్ని తీసుకు వచ్చి నీకిస్తాను. చూడు. నీవు కూడా కీర్తి సంపాదిస్తావు. నీకిది నేర్వ దగిన విద్య అవుతుంది" అన్నాడు.

ఉత్తరుడు తన చేతులను జోడించి.. "ఓ అర్జునా నా ఈ కళ్ళతో నిన్ను చూడటం నా అదృష్టం. మహానుభావుడు, జయప్రదుడు అయిన అర్జునుడి దర్శన స్పర్శతో నాకు జవసత్వం కలిగింది. అజ్ఞానంతో నేను చేసిన తప్పులను క్షమించు" అని వేడుకున్నాడు. కౌరవ సేన వారిద్దరినీ సమీపిస్తోంది. అర్జునుడు రథం దిగి దైవాన్ని ప్రార్థించి తన చేతికి ఉన్న గాజులను తీసివేసి చర్మంతో తయారు చేసిన హస్తాలను తొడిగాడు. గాలికి ఎగురుతున్న తన జుట్టుపై ఒక వస్త్రాన్ని చుట్టాడు. తూర్పు దిక్కుకు తిరిగి తన కవచాన్ని తలచుకుని రథం పైకి ఎక్కాడు. వెంటనే గాండీవం అతని దగ్గరకు చేరింది. గాండీవాన్ని నారికి బిగించి మూడు సార్లు నారిని మీటాడు. బృహన్నల వేషంలో ఉన్న అర్జునుడు మీటిన ధ్వని నాలుగు దిశలా ప్రతిధ్వనించింది. ఆ ధ్వని విన్న కౌరవసేన నిశ్చయంగా ఈ శబ్దం గాండీవానిదే! ఆ రథంపై ఉన్నది అర్జునుడే అనుకున్నారు. ఆ సమయంలో అర్జునుడు దేవదత్తం అనే శంఖాన్ని పూరించాడు. ఆ శంఖారావంతో కౌరవసేన ఉలిక్కిపడింది. వారంతా భయభ్రాంతులై పాండవులు వచ్చారని పెద్ద ధ్వని చేశారు.

◈

ఉత్తర గో(గ్రహణం: అర్జునుడి సహాయంతో
కౌరవసేనపై గెలుపొందిన
ఉత్తర రాకుమారుడు



## అధ్యాయం - 46

# నెరవేరిన వాగ్దానం

**భూ**మి కంపించేలా అర్జునుడు రథంలో నుంచి పిడుగుల వంటి శబ్దాలతో వెళ్తున్నాడు. గాండీవ ధ్వని వినగానే కౌరవుల గుండెలవిశాయి. ద్రోణాచార్యుడు ఆందోళనతో .."మన సైన్యాన్ని వ్యూహాత్మకంగా నడపండి. అర్జునుడొచ్చాడు. అతడే ఇపుడు మనతో యుద్ధం చేయబోతున్నాడు" అని అన్నాడు. దుర్యోధనుడు, కర్ణుడితో.."అతడే అర్జునుడైతే.. ఇక మళ్ళీ పాండవులు పన్నెండేళ్ళపాటు అరణ్యవాసం చేయవలసిందే" అంటూ యుద్ధానికి ముందుకు వెళ్ళాడు. కర్ణుడు.. అర్జునుణ్ణి చూసి అతడు అర్జునుడైనా, పరశురాముడైనా భయపడవలసిన అవసరం లేదు. నేను అర్జునుణ్ణి నిలువరించి అజ్ఞాతవాస వాగ్దానాన్ని గుర్తు చేస్తాను. యుద్ధాన్ని చేసి తీరతాను. మిగతా వారు తనకు సహాయం చేసినా, చేయకున్నా సరే. నేనిక్కడ ఒక్కడినే అర్జునుణ్ణి ఆపుతాను. ఈ లోగా మీరంతా మత్స్యరాజు గోవులను తోలుకువెళ్లండి" అన్నాడు. ఆ మాటలు విన్న కృపాచార్యుడు.. "ఇది కచ్చితంగా తెలివిలేని పరిహాస ప్రసంగం. మనమంతా కలిసే అర్జునుణ్ణి ఎదుర్కోవాలి. అప్పుడే విజయం మన సొంతమవుతుంది.

అందుకే నీవు తానొక్కడినే నిలవరించగలననే డంభాలు మాను" అన్నాడు. దీంతో కర్ణుడికి కోపం వచ్చింది. "కృపాచార్యుడికి ఎల్లప్పుడూ అర్జునుణ్ణి, అతని పరాక్రమాన్ని పొగడటం అంటే మిక్కిలి అనందం. వారలా అనడం భయం వల్లనో, లేక పాండవులంటే ఆయనకున్న ప్రీతి వల్లో నాకు తెలియదు. భయపడేవాళ్లు యుద్ధం చేయొద్దు. రాజు అన్నం తింటూ విశ్వాసంతో ఉన్నవారంతా అర్జునుడుతో యుద్ధం చేయకుండా చూస్తుండొచ్చు. నేను మాత్రం సామాన్య యోధుణ్ణి. నేను మిత్రుణ్ణి ప్రేమిస్తాను. శత్రువులను పగతో చూస్తాను. నేనిక్కడే ఉండి యుద్ధం చేస్తాను. వేదాలను చదివిన, శత్రువులను ప్రేమించి మెచ్చుకుంటున్న మనుషులకు ఇక్కడ పని ఏముంది?" అని కర్ణుడు అపహాస్యం చేశాడు.

ద్రోణుడి కుమారుడు, కృపుని మేనల్లుడూ అయిన అశ్వత్థామ మాత్రం కర్ణుడి నిందలనూ, వెక్కిరింతలనూ భరించలేకపోయాడు. "మనమింకా రాజును హస్తినాపురం చేర్చలేదు. యుద్ధంలో ఇంకా జయించాల్సి ఉంది. నీ గర్వపు ప్రేలాపనలు, ఢాంబికాలు అప్రస్తుతం. మేం క్షత్రియులం కాకపోవచ్చు. వేద శాస్త్రాలను చదివినవాళ్లం కావచ్చు. కానీ ఏ శాస్త్రంలోనూ రాజులను జూదం ద్వారా దగా చేసి పర రాజ్యాలను సంపాదించడం న్యాయసమ్మతం అని నేను కనీవినీ ఉండలేదు. యుద్ధం చేసి, కష్టపడి రాజ్యాలను జయించినవారు కూడా ఇలాంటి గర్వపు కూతలు గట్టిగా కూయరు. నీవేమి చేశావని గర్వపడుతున్నావో నాకు తెలియలేదు. అగ్నిహోత్రం నిశ్శబ్దం వహిస్తుంది. కానీ ఆహారాన్ని వండుతుంది. సూర్యుడు ప్రకాశిస్తాడు. కానీ తనపైన కాదు. అలాగే భూమాత చరాచర సృష్టి అంతా వహించి, శ్వాస కూడా విడవకుండా ఆ భారమంతా భరిస్తోంది. ఇతరుల రాజ్యాన్ని అక్రమంగా జూదంతో చేపట్టి గ్రహించిన క్షత్రియుడు ఎలా స్తోత్రార్హుడు అవుతాడు. పాండవులను దగా చేసి రాజ్యాన్ని సంపాదించామన్నది అమాయక పక్షులను పట్టడానికి వల పన్నడం వంటిదే. కనుక అది గొప్పదనం అనిపించదు. ఓ దుర్యోధనా, ఓ కర్ణా, ఏ యుద్ధంలో మీరు అర్జునుణ్ణి ఓడించారు?. మీరు ద్రౌపదిని సభకు ఈడ్చి తెచ్చారు. ఇది మీకు గర్వకారణమా?. చందనం సువాసనపై ప్రీతి కలిగి, చందన చెట్లను నరికిన పరమ మూఢునిలా మీరు కౌరవ వంశాన్ని ధ్వంసం చేశారు. అర్జునుడితో ఒకసారి యుద్ధం చేయడం అన్నది ఓ మారు పాచికలను విసరడం కాదని మీకు త్వరలో తెలుస్తుంది. గాండీవం నుంచి వాడిగల బాణాలు పడతాయి గానీ జూదంలో మాదిరి 'నాలుగు రెళ్లు' పడవు. డాబు, గర్వంగల తెలివి తక్కువవారైన ఓ కర్ణ దుర్యోధనులారా, జూదంలో దగా చేయగల నేర్పరి అయిన శకుని.. యుద్ధంలో మీకు జయాన్ని దొంగిలించి ఇవ్వగలడా?" అన్నాడు అశ్వత్థామ.

కౌరవ సేనాధిపతులందరూ మౌనాన్ని వీడి గొప్ప వాగ్వాదంలో మునిగారు. ఇది చూసి భీష్ముడు ఎంతో విచారగ్రస్తుడయ్యాడు. బుద్ధిమంతుడైనవాడు తన గురువులను నిందింపడు. కాలము, స్థలము, పరిస్థితులు ఇవన్నీ చక్కగా పరిశీలించి యుద్ధానికి దిగాలి. బుద్ధిమంతులు కూడా తమ కార్యాల పట్ల తమకున్న నిశ్చలత్వం, బుద్ధి కూడా తరచూ పోగొట్టుకుంటారు. కోపధారి అయినా సాధారణ నిదానంగల దుర్యోధనుడు కూడా మనకు ఎదురు నిలిచిన వీరుడు అర్జునుడని గుర్తించలేక పోతున్నాడు. దుర్యోధనుడి బుద్ధి కోపంతో కప్పివేయబడింది. ఓయీ అశ్వత్థామ! కర్ణుడి చెడు వాక్యాలు లక్ష్య పెట్టకు. గురువులను, వారి ప్రభావాలను గుర్తెరిగి కార్యరూపంలో పెట్టడానికన్నా వాక్యాలను తలుచుకో. శత్రుత్వాన్ని, జగడాన్ని పెంచుకోడానికి ఇది తరుణం కాదు. ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ తప్పులను మరిచి క్షమించాలి. ఈ ప్రపంచమంతా వెదికినా వేదవేత్తలను, క్షత్రియ శూరత్వాన్ని కలిగిన గురువు ద్రోణుడి వంటి, అతని కుమారుడైన అశ్వత్థామ వంటి మహావీరులను కౌరవులు అన్వేషించగలరా?. ద్రోణుడితో సమానమైన వీరుడు పరుశురాముడు తప్ప మరొకరు లేరని మనకు తెలిసిందే. మనమంతా కలిసి యుద్ధం చేస్తేనే అర్జునుణ్ణి జయిస్తాము. కనుక ఆ ప్రకారం మనం సిద్ధంగా ఉందాం. మనలో మనం తగవులాడుకుంటే అర్జునుణ్ణి గెలవలేం' అని భీష్ముడన్నాడు. ఆయన సాంత్వన మాటలతో అందరి కోపాలు తగ్గిపోయాయి. భీష్ముడు.. దుర్యోధనుడితో.. "ఓ రాజ శ్రేష్టుడా.. అర్జునుడే వచ్చాడు. నిన్నటితోనే వారి పదమూడేళ్ల వనవాసం, అజ్ఞాతవాసం పూర్తయ్యాయి. నీ లెక్క పొరబాటు. ఖగోళ శాస్త్రవేత్తలను అడిగితే ఈ విషయాన్ని చెప్తారు. అర్జునుడు దేవదత్తాన్ని ఎప్పుడు పూరించాడో అప్పుడే ప్రతిజ్ఞకాలం పూర్తయ్యిందని నేను గుర్తించాను. కనుక ఈ యుద్ధం గురించి నిశ్చయంగా కొంచెమైనా ఆలోచించు. నీవు పాండవులతో రాజీ పడదలిస్తే ఇదే సమయం. నీకేమి కావాలి?. న్యాయ సమ్మతమూ, ఘనతగల రాజీ మార్గము కోరతావా?, లేక ఉభయ పక్షాలనూ ధ్వంసం చేసే యుద్ధాన్ని కోరతావా? బాగా ఆలోచించి నీవొక నిశ్చయానికి రా" అన్నాడు. ఇందుకు దుర్యోధనుడు.. "గౌరవనీయా, నాకు రాజీ పడే కోరిక లేదు. ఒక్క ఊరయినా నేను పాండవులకు ఇవ్వనుగాక ఇవ్వను. మనమంతా యుద్ధానికి సిద్ధంగా ఉందాం" అన్నాడు. ద్రోణుడు అందుకొని.."దుర్యోధనుడు తన రక్షణార్థం తన సేనలో నాలుగోవంతు భాగంతో హస్తినాపురం వెళ్లాలి. మరో నాలుగోవంతు సేనతో గోవులను పట్టుకోవాలి. పశువులను పట్టుకోకుండా మనం వెనక్కి వెళ్లామా..అది ఓటమి అని అంగీకరించినట్లు అవుతుంది. మిగిలిన సైన్యంతో మేం అయిదుగురం యుద్ధం చేస్తాం" అన్నాడు.

ఆ విధంగానే కౌరవ సైన్యాన్ని ఏర్పాటు చేశారు.

అర్జునుడు.. "ఓయీ ఉత్తరా, దుర్యోధనుడి రథంగానీ, దుర్యోధనుడుగానీ కానీ నాకు కనిపించడం లేదు. భీష్ముడు కవచం ధరించి నిలబడి ఉండటం కనిపిస్తోంది. దుర్యోధనుడు మన ఆవులను మళ్లించి హస్తినాపురానికి తోలుకుపోతున్నట్లు ఉంది. ముందు వాటిని విడిపించి తీసుకొద్దాం" అంటూ కౌరవ సేనను వదిలి దుర్యోధనుడి వెంట, గోవుల వెంట పడ్డాడు. అలా వెళ్తూ తన గాండీవాన్ని ఎక్కుపెట్టి గురువులకు, భీష్ముడికి పాదాలపై పడేలా బాణాలను సంధించి వారికి నమస్కరించాడు. వారికి ప్రణామం చేశాక వారిని విడిచి దుర్యోధనుడి వెంట పడ్డాడు. గోవులన్నీ గుంపుగా ఉన్న చోటకు వెళ్లి అక్కడున్న సైన్యాన్ని కకావికలు చేశాడు. ఆవులను గోశాలకు తోలుకుపోవాలని కాపరులకు చెప్పాడు. వారా పనిని ఆనందంగా చేశారు. అర్జునుడు దుర్యోధనుడి వెంట పడటంతో అది చూసిన భీష్ముడు, ఇతర కౌరవ వీరులు రాజ రక్షణార్థం అర్జునుణ్ణి చుట్టుముట్టారు. బాణాలు వేశారు. అర్జునుడు అద్భుతమైన యుద్ధం చేశాడు. ముందు కర్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. అతణ్ణి యుద్ధభూమి నుంచి తరిమేశాడు. ఆ తరువాత ద్రోణుడిపైకి వెళ్లి ఆయననూ ఓడించాడు. ద్రోణుడు అలసిపోయి నిలబడిపోవడంతో అశ్వత్థామ రంగ ప్రవేశం చేశాడు. దీంతో ద్రోణుడు యుద్ధభూమిని వదిలి వెళ్లాడు. అర్జునుడికీ, అశ్వత్థామకూ సంకుల సమరం జరిగింది. అశ్వత్థామ డీలా పడిపోతున్న దశలో కృపుడు వచ్చి యుద్ధం చేయడం ప్రారంభించాడు. కృపుడూ ఓడిపోయాడు. ఇంతలో కౌరవ సైన్యం చెల్లాచెదురై పోయింది. పారిపోవడం మొదలుపెట్టింది. భీష్ముడు, ద్రోణుడు చెదిరిన సేనను మళ్లీ యుద్ధానికి ఆయుత్తం చేశారు. కానీ కౌరవ సేనలో యుద్ధ పటుత్వం నశించింది. దీంతో భీష్ముడు.. అర్జునుడిపై తలపడ్డాడు. వారి మధ్య జరుగుతున్న గొప్ప యుద్ధాన్ని తిలకించడానికి దేవతలు కూడా వచ్చారు. వారి మధ్య యుద్ధం చూసి కౌరవసేనలు పారిపోయాయి. దీంతో దుర్యోధనుడి వెంట పడిన అర్జునుణ్ణి నిరోధించడం కోసం యుద్ధం చేసినా ఆయన ప్రయత్నం వమ్ము అయింది. దీంతో అర్జునుడు.. దుర్యోధనుణ్ణి నిలువరించాడు. దుర్యోధనుడు ఓడిపోయి యుద్ధభూమి నుంచి పారిపోయాడు. అర్జునుడు.. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి 'పిరికిపంద' అని వ్యాఖ్యానించాడు. దీంతో దుర్యోధనుడికి రోషం వచ్చి మళ్లీ అర్జునుడితో తలపడ్డాడు. భీష్ముడు, కౌరవులు దుర్యోధనుడు చుట్టూ చేరి ఆయన్ను రక్షించారు. అప్పుడు అర్జునుడు.. ఓ దివ్యమైన సమ్మోహనాస్త్రాన్ని వారిపైకి సంధించాడు. దీంతో వారంతా తెలివితప్పి యుద్ధభూమిలో పడిపోయారు. ఈ స్థితిలో అర్జునుడు వారి ఉత్తరీయాలను కోశాడు. ఆ రోజుల్లో.. శత్రువుల వస్త్రాలను తీసుకొని వస్తే యుద్ధంలో గొప్ప విజయం లభించిందనే దానికి సూచనగా ఉండేది. సొమ్మసిల్లిపోయిన

దుర్యోధనుడు తెప్పరిల్లడంతో భీష్ముడు అతణ్ణి హస్తినాపురానికి పంపాడు. యుద్ధంలో ఎంతో అవమానకరమైన ఓటమి సంభవించడంతో మిగిలిన కొద్దిపాటి సైన్యంసహా హస్తినాపురానికి వెళ్లిపోయారు.

ఉత్తర కుమారుడితో అర్జునుడు.. "ఓయీ ఉత్తరా, గుర్రాలను వెనక్కి తిప్పు. మన పశువులు మనకు వచ్చాయి. శత్రువులు పారిపోయారు. రాకుమారా, నీ రాజ్యానికి వెళ్లి చందనం, పుష్పాలు మొదలైనవాటిని నీ శరీరానికి అలంకరించుకో.

తిరుగు ప్రయాణంలో అర్జునుడు ఆయుధాలను చెట్టుపైన దాచి మరలా బృహన్నల వేషం వేసుకొన్నాడు. యుద్ధంలో ఉత్తరుడు గొప్ప విజయం సాధించాడని పట్టణమంతా తెలియజేయాలని ముందుగా దూతలను పట్టణానికి పంపాడు.

◈

అధ్యాయం 47

# విరటుని దురభిప్రాయం

త్రిగర్త రాజయిన సుశర్మను ఓడించి పట్టణానికి తిరిగి వచ్చాడు విరటుడు. ప్రజలు వారిని ఆహ్వానించి ఎంతో సంతోషం వ్యక్తం చేశారు. విరటుడు తాను కోటకు వచ్చేసరికి ఉత్తర రాకుమారుడు కనిపించలేదు. కౌరవులను జయించడానికి అతడు వెళ్లాడని అంత:పురంలోని స్త్రీలు చెప్పారు. ఉత్తరుడు ప్రపంచాన్ని జయించగల ప్రజ్ఞగలవాడని వారి భావన. బహుగారాబంగా పెరిగిన ఉత్తరుడు కౌరవులతో యుద్ధం చేయడానికి ఒక నపుంసకుని (బృహన్నల) సహాయంతో తెగించి వెళ్లడం ఎంత ప్రమాదరకరమో విరటుడికి తెలుసు. విషాదభరితుడై.."ఈ పాటికి నా ప్రియమైన కుమారుడు కౌరవుల చేతిలో మరణించే ఉంటాడు" అన్నాడు. తన మంత్రులను పిలిపించి సైనికులను జతపరిచి ఉత్తరుని సహాయార్థం యుద్ధభూమికి పంపాడు. జీవించి ఉంటే ఉత్తరుణ్ణి విడిపించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. ఉత్తర కుమారుడి

సమాచారం కనుక్కొని రమ్మని బాలభటులను కూడా ప్రత్యేకంగా పంపాడు. సన్యాసి వేషంలో ఉన్న కంకుడు (ధర్మరాజు) విరటుణ్ణి ఓదార్చుతూ, బృహన్నల సారథ్యంలో రథంలో ఉన్న ఉత్తరుడికి ఏ విధమైన అపాయమూ సంభవించదని చెప్పాడు. “బృహన్నల విషయం తమకు తెలియదు. నాకు పూర్తిగా తెలుసు. ఎవరైతే బృహన్నల సారథ్యంలో రథికుడై ఉండి యుద్ధం చేస్తాడో..అక్కడ జయం నిశ్చయం. అదీగాక సుశర్మ ఓటమి కౌరవులకు ఇదివరకే తెలుసు. వారీపాటికి తిరిగి వెళ్లిపోయి ఉంటారు” అన్నాడు కంకుడు.

ఈ లోగా యుద్ధభూమి నుంచి వచ్చిన విరటుడి సేవకులు ఉత్తర కుమారుడు కౌరవ సేనను ఓడించి పశువులను స్వాధీనపరుచుకున్నాడనే వార్తను విరటుని చెవిన వేశారు. కుమారుడంటే ఎంతో ప్రేమ ఉన్నప్పటికీ ఈ విజయం నిజమేనా అనే అనుమానం ఆయనలో తలెత్తింది. కానీ ఆ విజయం నిశ్చయంగా నిజమే అవుతుందని కుంకుడు.. విరటునితో అన్నాడు. “ఓ రాజా, అనుమానించకు. ఈ వార్తాహరులు చెప్పింది తప్పక నిజం అవుతుంది. బృహన్నల సారథిగా వెళ్తే జయము తప్పదు. నీ కుమారుని విజయంలో అంత గొప్పదనమేముంది?. ఇంద్ర సారథి అయిన మాతలి, శ్రీకృష్ణుడి సారథి అయిన దొరకుడు.. బృహన్నల సాటిరారు”. అయినా విరటుడు కుమారుని విజయవార్త నమ్మలేకపోతున్నాడు. అలాగని వ్యతిరేకించడమూ లేదు. అప్పుడప్పుడు ఆనందమూ వ్యక్తం చేస్తున్నాడు. ఉత్తరుడు విజయం సాధించాడనే శుభవార్త తెచ్చినవారికి రత్నాలను, ఇతర ధన, ధాన్యాలను బహుమతిగా ఇచ్చాడు. పట్టణమంతా ఉత్సవాలు నిర్వహించాలని ఆజ్ఞ ఇచ్చాడు. అయితే ఆయన.. “సుశర్మపై నా విజయం చాలా స్వల్పమైన అంశం. నా కుమారుడిదే నిజమైన విజయం. అన్ని ఆలయాల్లోనూ ప్రత్యేక పూజలు, ప్రార్థనలు, జపతపాలు చేయండి. పట్టణ ప్రధాన వీధుల్లో విజయ సూచికగా పతాకాలు ఎత్తండి. ప్రజలందరూ ఉత్సాహంలో నిండి ఉండేలా మృందగ వాద్యాలు ఏర్పాటు చేయండి. ఉత్తర కుమారుడికి స్వాగతం పలికేందుకు తగిన ఏర్పాట్లు చేయండి” అని ఆజ్ఞ ఇచ్చాడు.

విజయంతో తిరిగి వస్తున్న ఉత్తర కుమారుణ్ణి ఆహ్వానించడానికి విరటుడు.. సైనికులను, మంత్రులను, కన్యలను పంపాడు. విరటుడు.. తన అభ్యంతరమందిరానికి చేరి, పాచికలు తీసుకురావలసిందిగా సైరంధ్రికి చెప్పాడు. కంకుడు(యుధిష్టిరుడి)తో .. “నా కుమారుని విజయంతో నేనిప్పుడు ఆనందాన్ని తట్టుకోలేకపోతున్నాను. రా, మనం పాచికలాడుకుందాం” అన్నాడు. ఇద్దరూ ద్యూతం ప్రారంభించారు. “చూడూ.. భూమింజయుడైన నా కుమారుడి కీర్తి సంపద!. పేరుగల వీరులనే యుద్ధభూమి నుంచి పరిగెత్తించాడు” అన్నాడు విరటుడు. కంకుడు నవ్వుతూ.. “అవును. నీ

కుమారుడు నిశ్చయంగా అదృష్టవంతుడే. ఎంత అదృష్టం లేకపోతే బృహన్నల రథసారథిగా ఉంటాడు" అన్నాడు. కంకుడు.. తన కుమారుణ్ణిగాక బృహన్నలను పొగడటంతో విరటునికి కోపం వచ్చింది.

"నేను నా కుమారుడి విజయం గురించి మాట్లాడుతుంటే, నీవు ఆ నపుంసకుణ్ణి ఎందుకు పొగుడుతావు" అన్నాడు విరటుడు. "నేను దేని గురించి పొగుడుతున్నానో నాకు తెలుసు. బృహన్నల సామాన్యమైన స్త్రీ కాదు. ఆమె ఎప్పుడూ అపజయం ఎరుగదు. ఏ పనిలో అయినా, రథికుడిగా ఉన్నా, ఎంత దుష్కర కార్యంలోనైనా జయించి తీరుతుంది" అన్నాడు కంకుడు. ఈ మాటలతో విరట రాజుకు కోపం మరింత ఎక్కువైంది. కంకుడు మాటిమాటికి ఉత్తరుణ్ణి తక్కువ చేసి మాట్లాడుతున్నాడనే భావనతో ఆయన ముఖంపైకి పాచికలు విసిరేసి చెంపదెబ్బ కొట్టాడు విరటుడు. కంకుడికి గాయమై రక్తం వచ్చింది. సమీపంలోనే ఉన్న సైరంధ్రి పరుగు పరుగున వచ్చి, కంకుడి రక్తాన్ని చీర కొంగుతో ఒత్తి, ఓ బంగారు పాత్రలోకి రక్తాన్ని పిండింది. మరింత కోపావేశుడైన విరటుడు సైరంధ్రిని ఉద్దేశించి.. "ఏమిటీ అనవసరమైన పని? ఎందుకు ఆ రక్తాన్ని పాత్రలోకి పిండుతున్నావు?'' అడిగాడు.

"ఓ రాజా, సన్యాసి రక్తం భూమిమీద పడకూడదు. ఈ తడి రక్తపు చుక్కలు ఎన్ని భూమి మీద పడతాయో అన్ని సంవత్సరాలపాటు నీ రాజ్యంలో వర్షాలు కురవవు. అందుకే నేనిలా రక్తాన్ని పాత్రలోకి పిండాను. తమకు కంకుని మహాత్మ్యం తెలియదు కాబోలు" అన్నది సైరంధ్రి. ఇంతలో దౌవారికుడు వచ్చి.. "ఉత్తర రాకుమారుడు, బృహన్నలా వచ్చారు. ఉత్తరుడు రాజదర్శనానికి వేచి ఉన్నాడు" అని తెలియజేశాడు. విరటుడు సంభ్రమాశ్చర్యంతో లేచి నిలబడి, లోనికి రమ్మనమను అని చెప్పాడు. ఈ సమయంలోనే కంకుడు ఆ దౌవారికుడితో.. "బృహన్నలను లోపలికి రానీయకు. బయటే నిలుపు" అన్నాడు. విరటుడు తనను కొట్టగా అయిన గాయంతో రక్తం కారినందున అది బృహన్నల (అర్జునుడు)కు తెలియకుండా ఉండేందుకు అలా అన్నాడు. తనను ఈ విధంగా చూస్తే అతడికి కోపం కట్టలు తెంచుకుంటుందని భావించాడు. ఒక్క ధర్మ యుద్ధంలో తప్ప మరే సందర్భంలోనూ తాను అలా గాయపడటం అర్జునుడు సహించడని భావించాడు.

ఉత్తరుడు ప్రవేశించి తండ్రికి వందనం చేశాడు. కంకుడికి కూడా వందనం చేయనుద్దేశించి అతడివైపు చూడగా చెంపపై రక్త గాయము కనిపించింది. దీంతో ఉత్తరుడు విభ్రాంతి చెందాడు. కంకుడే ధర్మరాజని ఉత్తర కుమారుడికి తెలుసు. "ఓ రాజా, ఈ మహనీయుణ్ణి ఇలా గాయపరిచిందెవరు? అనడిగాడు. విరటుడు కుమారుడితో.. "ఈ స్వల్పమైన దాన్ని గురించి ఎందుకిప్పుడు ఆందోళన. నీవు

కౌరవ సైన్యాన్ని వెంటాడి జయించి జయప్రదంగా తిరిగి వస్తున్న సందర్భంలో, ఈ విషయమై నేనెంతో ఆనందిస్తుండగా.. ఈతడు సమయాన్ని గుర్తించకుండా ఈర్ష్యతో మాట్లాడుతుంటే నేనే కొట్టాను. ఎన్నిసార్లు నీ పేరెత్తినా అన్నిసార్లూ ఈ దురదృష్టపు బ్రాహ్మణుడు ఆ నపుంసకుణ్ణి పొగుడుతున్నాడు. ఏమైనా నేను తప్పు చేశాను. అతన్ని కొట్టినందుకు విచారిస్తున్నాను. ఈ విషయం ఇక చర్చించనవసరం లేదు" అన్నాడు.

ఉత్తర రాజకుమారుడు భయభ్రాంతుడయ్యాడు. "అయ్యో మీరు తీరని నేరం చేశారు. ఈ క్షణమే ఆయన పాదాలపై పడు. క్షమాపణ కోరు. లేని పక్షంలో మనమంతా కూకటివేళ్లతో కూలిపోతాము" అన్నాడు తండ్రి విరటునితో. విరటుడికి ఇందతా అర్థం కాలేదు. ఏమి చేయాలో పాలుపోక అలాగే నిలబడిపోయాడు. కానీ, ఉత్తరుడు పదే పదే చెప్పడం, బతిమాలడం, నిర్బంధించడం వల్ల విరటుడు.. కంకుడికి క్షమాపణ చెప్పక తప్పలేదు. కంకుడు ముందు తలవొంచి నమ్రతతతో తన తప్పును క్షమించవలసిందిగా కోరాడు.తరువాత కుమారుణ్ణి కౌగలించుకున్నాడు. "కుమారా, నీవు నిశ్చయంగా వీరుడవు. నీ వృత్తాంతమంతా వినడానికి నేనెంతో ఆతృతతో ఉన్నాను. నీవెలా ఆ కౌరవ సైన్యాన్ని ఓడించావు?. ఎలా ఆవులను మరలించి తెచ్చావు?" అని ప్రశ్నించాడు.

ఉత్తరుడు తన తలను దించుకొని.. "నేను ఏ సేననూ జయించలేదు. ఏ ఆవులనూ మరలించి తేలేదు. ఆ పనంతా ఓ దేవ కుమారుడు చేశాడు. అతడు మన పని తనదిగానే భావించి నన్ను బతికించాడు. కౌరవ సైనికులను ఓడించి పరుగెత్తించాడు. మన ఆలమందలను మరలించి తెచ్చాడు. నేనేమీ చేయలేదు" అన్నాడు. వీటిని విరటుడు నమ్మలేకపోయాడు. ఆ దైవ కుమారుడు ఎక్కడున్నాడు?. ఆ మహావీరునికి నేను వందనం చేసి నా కుమారుని రక్షించినందుకు, కౌరవ సేనను ఓడించినందుకు నా కృతజ్ఞతను చూపించవలసి ఉంది. అతడికి నా కుమార్తె (ఉత్తర రాకుమార్తె)ను ఇచ్చి పెళ్లి చేస్తాను. వెళ్లి ఆ వీరుణ్ణి తీసుకొని రా" అన్నాడు విరటుడు. "ప్రస్తుతం అతడు అంతర్థానం అయ్యాడు. ఈ రోజుగానీ, రేపుగానీ మళ్లీ రాగలడు" అని ఉత్తర రాకుమారుడు నిజమే పలికాడు. అర్జునుడు నిజంగా దేవకుమారుడే. అప్పటికి బృహన్నలగా అంతర్థానమయ్యాడు.

విరట రాజు సభాంగణంలో పట్టణ ముఖ్యులందరూ కొలువుదీరి, ఉత్తర రాకుమారుడి విజయాలు కీర్తించి ఒక ఉత్సవం నిర్వహించాలని నిర్ణయించారు. కంకుడు (ధర్మరాజు) వంటవాడైన వలలడు (భీముడు), బృహన్నల (అర్జునుడు), తంత్రీపాలుడు (నకులుడు), ధర్మగ్రంధుడు(సహదేవుడు) వీరు కూడా ఎవరూ పిలవకుండానే ఆ సభకు వచ్చి రాజుల మధ్యలో కూర్చున్నారు. కొందరు ఆశ్చర్యపోగా,

మరికొందరు వారిని మనసులో సమర్థించారు. ఈ సేవకులు కష్ట సమయంలో రాజుకు, ప్రజలకు గొప్ప సాయం చేసినందున ఆ మాత్రం చనువు తీసుకోవడానికి తగినవారే అని అభిప్రాయపడ్డారు. విరట రాజు సభకు వచ్చాడు. రాజపుత్రులు, పట్టణ ప్రముఖులు కూర్చుండే స్థానాల్లో కంకుడు, వలలడు, బృహన్నల, తంత్రీపాలుడు, ధర్మగ్రంథుడు కూర్చొని ఉండటం చూశాడు. కోపావేశుడయ్యాడు. వారి పనికి తన అసమ్మతిని ప్రకటించాడు. దీంతో వారంతా లేచి సభా మధ్యమానికి వచ్చి విరట రాజు కొలువులో పనిచేస్తున్న తాము పాండవులమని ప్రకటించారు. కాసేపు మ్రాన్పడిపోయాడు విరటుడు. తెప్పరిల్లుకొని ఇన్నేళ్లుగా పాండవులు తనకు సేవ చేయడాన్ని తలుచుకొని ఆనందపారవశ్యుడయ్యాడు. విరటుడు.. యుధిష్ఠరుణ్ణి కౌగిలించుకొని తన కృతజ్ఞతను తెలిపాడు. తన రాజ్యాన్ని, తన సర్వస్వాన్ని యుధిష్టరుడికి ఇచ్చివేశాడు. యుధిష్టరుడు స్వీకరించి తిరిగి విరటుడికే సమర్పించాడు. విరటుడు తన కుమార్తె అయిన ఉత్తర రాకుమార్తెను అర్జునుడికి వివాహం చేయడానికి నిశ్చయించానని తెలిపాడు. కానీ, అర్జునుడు.. “వద్దు. అలా చేయడం పద్ధతి కాదు. ఉత్తర రాకుమార్తె నావద్ద ఆట, పాట నేర్చుకున్నది. నేనామెకు గురువును. కనుక ఆమెకు నేను తండ్రిలాంటి వాడినవుతాను” అన్నాడు. అయితే ఆమెను తన కుమారుడైన అభిమన్యుడికి భార్యగా చేసేందుకు సమ్మతించాడు.

ఇంతలో.. దుర్యోధనుడి వద్ద నుంచి వార్తాహరులు సభకు వచ్చారు. ధర్మరాజును ఉద్దేశించి.. “కుంతీ కుమారా, ధనుంజయుడు తాను తొందరపాటుతో చేసిన పని వల్ల మరలా మీరంతా అరణ్యవాసానికి వెళ్లవలసి ఉంటుందని చెప్పడానికి దుర్యోధనుడు చాలా విచారిస్తున్నాడు. అర్జునుడు పదమూడో సంవత్సరం అజ్ఞాతవాసం పూర్తికాకముందే తనను తాను బయటపెట్టుకున్నాడు. కావున, మొదట్లో చేసుకున్న వాగ్దానం మేరకు మీరంతా మళ్లీ పన్నెండేళ్ల వనవాసం చేయాల్సి ఉంటుంది” అని ప్రకటించాడు వార్తాహరుడు. ఈ మాటకు యుధిష్టరుడు నవ్వాడు. “ఓయీ వార్తాహరులారా, మీరు వెళ్లి దుర్యోధనుడితో ఈ విషయం చెప్పండి. గౌరవనీయులైన భీష్మాదులను, ఖగోళ శాస్త్రజ్ఞులను సంప్రదించి వనవాసం, అజ్ఞాతవాసం ముగింపు సక్రమంగా జరిగినదీ లేనిదీ తెలుసుకోమని చెప్పండి. నీ సైన్యంపైకి ధనుంజయుడి గాండీవారావం ప్రయోగించడానికి ముందే మా వనవాసం, అజ్ఞాతవాసం పూర్తయిందని చెప్పండి” అన్నాడు యుధిష్టరుడు.

## అధ్యాయం 48

# ఆలోచనలు, సలహాలు, సంప్రదింపులు

**పాం**డవులు పదమూడో సంవత్సరం అజ్ఞాతవాసం పూర్తయింది. ఇక రహస్యంగా ఉండాల్సిన పని లేదు. అందువల్ల వారు పాండవులుగా ప్రకటించుకున్నారు. విరటుని పట్టణాన్ని విడిచిపెట్టారు. విరట రాజ్య రాజధానిలో ఒక స్థలమైన ఉపప్లావ్యమనే చోట బహిరంగ నివాసం ఏర్పాటు చేసుకున్నారు. అక్కణ్ణుంచి తమ బంధువులకు, స్నేహితులకు.. దూతల ద్వారా కబురు పంపించి వారిని పిలవనంపారు. ద్వారక నుంచి బలరామకృష్ణులు, అర్జునుడి భార్య సుభద్ర, కుమారుడైన అభిమన్యుడు, అనేక మంది యాదవ వీరులూ ఉపప్లావ్యానికి వచ్చారు. కాశిరాజు, శైబ్యుడు వారి సేనలతో వచ్చారు. పాంచాల రాజు ద్రుపదుడు.. శిఖండిని, ద్రౌపదీ పుత్రులను, దృష్టద్యుమ్నుణ్ణి తోడ్కొని వచ్చాడు. ఇంకా అనేక మంది రాజులు, పాండవులకు చెందినవారందరూ ఉపప్లావ్యానికి చేరారు. ఇలా వచ్చిన స్నేహితులు, వీరుల సమక్షంలో అభిమన్యుడికి, ఉత్తర రాకుమార్తెకు వేదోక్తంగా వివాహం జరిపించారు.

వివాహ మహోత్సవం పూర్తయిన తర్వాత, వీరంతా విరటుని కొలువు కూటానికి రహస్యాలోచన నిమిత్తం వెళ్లారు. కృష్ణుడు, యుధిష్టరుడు.. విరటుని పక్కనే ఆశీనులయ్యారు. బలరాముడు, సాత్యకి ద్రుపదుని పక్కనే ఆశీనులయ్యారు. సభలో నిశ్శబ్దం ఆవరించింది. సభా సదులంతా శ్రీకృష్ణుడి వైపు చూడనారంభించారు. మాట్లాడటానికి లేచి నిలబడ్డాడు శ్రీకృష్ణుడు. పాండవులను చూపుతూ.. “మీ పట్ల జరిగిన వంచన అందరికీ తెలిసిందే. జూదంలో యుధిష్టరుడు రాజ్యాన్ని పోగొట్టుకుని అన్నదమ్ములతో, భార్య ద్రౌపదితో అరణ్యవాసానికి ఎలా వెళ్లగొట్టబడ్డారో ఇక్కడున్న వారందరికీ తెలుసు. బహు శాంతంతో, ఎంతో ఓర్పుతో, ఎన్నో బాధలు అనుభవించి.. పదమూడేళ్లపాటు ఈ పాండుపుత్రులు తమ ప్రతిజ్ఞను నిలబెట్టుకున్నారు. ఈ సభలోని వారంతా బాగా ఆలోచించి, పాండవుల, కౌరవుల కీర్తి, క్షేమాన్ని గుర్తిస్తూ, ధర్మమార్గంలో ఇప్పుడేమి చేయవచ్చో సూచనలివ్వండి. యుధిష్టరుడు న్యాయాన్ని కాదని తానేమీ కోరేవాడు కాదు. ఆయన తనను మోసగించి ఘోర విపత్తులను కలిగించిన ధృతరాష్ట్రుని కుమారులను గురించి కూడా మంచే కోరేవాడు. మీరిప్పుడు సలహా ఇచ్చే క్రమంలో.. కౌరవులు చేసిన మోసం, నయవంచన, దుర్మార్గం, నీచత్వాన్నీ.. పాండవుల మర్యాద, కీర్తి ప్రదమైన నడవడికనూ దృష్టిలో పెట్టుకోవాలి. న్యాయ సమ్మతమైన, గౌరవ యుక్తమైన ఒక స్థిరమైన పరిస్థితిని ఏర్పరచండి. దుర్యోధనుడి మనస్సులో ఏమున్నదో మనకు తెలియదు. దుర్యోధనుడి వద్దకు ఇక్కడున్న వారిలో ధైర్య, శౌర్యాలు కలిగి శక్తిమంతుడైన ఒకరిని పంపి, యుధిష్టరుడుకి తిరిగి తన అర్ధ రాజ్యం ఇచ్చేలా అంగీకరింపచేసేలా ఓ స్థిరమైన కార్య రూపానికి తేగలరు” అన్నాడు శ్రీకృష్ణుడు.

తరువాత బలరాముడు లేచి.. “మీరందరూ శ్రీకృష్ణుడి మాటలు విన్నారు. ఆయన సూచించిన అభిప్రాయం యుక్తంగా, సమ్మతంగా ఉంది. దుర్యోధనుడికి, యుధిష్టరుడుకి కూడా అది సమానమైన మంచి మార్గం. కుంతి కుమారులు తమ రాజ్యాన్ని తిరిగి స్నేహభావంతోనూ, రాజీ మార్గంతోనూ తెచ్చుకుంటే వారికది ఉత్తమమైనదే. కౌరవులకు, ఇతరులకు కూడా అది మంచిగానే ఉంటుంది. అలాంటి సందర్భాల్లోనే ప్రపంచంలో శాంతిభద్రతలుంటాయి. యుధిష్టరుడు శాంతియుతమైన రాజీ మార్గపు సమాచారాన్ని దుర్యోధనుడికి తెలియజేయడానికి ఎవరైనా ఒకరు వెళ్లి అతన్నుంచి జవాబు తేవాల్సి ఉంటుంది. అలా వెళ్లేవాడు ప్రతిభావంతుడూ, ఔదార్యం కలవాడూ, ఉభయులకూ శాంతి సమకూరేటట్లు చేయగల సామర్థ్యం ఉన్నావాడై ఉండాలి. ఆ రాయభారి భీష్ముడు, ధృతరాష్ట్రుడు, ద్రోణుడు, విదుర, కృప, అశ్వత్థామ, వీలైతే కర్ణ, శకునిల సహాయం కూడా సంపాదించి కుంతీ కుమారులకు న్యాయం జరిగేలా చూడాలి. అలా వెళ్లే దూత ఎలాంటి సందర్భంలోనూ ఆగ్రహం చెందని మహానుభావుడై

ఉండాలి. యుధిష్ఠరుడు రాబోయే కష్టనష్టాలు పూర్తిగా తెలిసినా, జూదం సందర్భంగా తన మంచి కోరేవారందరూ బతిమిలాడినా, మొండితనంతో వాటిని లక్ష్యపెట్టకుండా తన రాజ్యాన్ని పణంగా ఒడ్డి ఓడిపోయాడు. జూదంలో ఆరితేరిన శకునితో తాను ఆడటానికి అసమర్థుడని తెలిసినా జూదం ఆడాడు. కనుక ప్రస్తుతం తన రాజ్యం కోసం నిర్బంధం చేయలేడుగానీ, రాజ్యమివ్వమని వేడుకోవచ్చు. ఇలాంటి కార్యంలో పంపే రాయబారి కయ్యానికి కాలుదువ్వేవాడై ఉండకూడదు. అక్కడ ఎన్ని కష్టాలు వచ్చినా శాంతియుత కార్యనిర్వహణే తన కర్తవ్యమన్న పట్టుదలగల వాడై ఉండాలి. ఓ రాకుమారులారా, మీరు దుర్యోధనుడితో చేసే సంప్రదింపులు బహు నేర్పరితనంతో చేయాలి. వారితో రాజీ పడాలి. వీలున్నంతవరకూ మనం యుద్ధం కోరకూడదు. యుద్ధం వల్ల చెడు తప్ప మరేమీ రాదు" అని వివరించాడు.

బలరాముడి మనస్థితి ఇలా ఉంది. 'యుధిష్ఠరుడు తన రాజ్యానంతటినీ ఏమి చేసేవాడో జూదమాడేటప్పుడు అలోచించలేదు. కనుక ఇప్పుడు మళ్లీ రాజ్యంపై హక్కుగలవాడిగా నిర్బంధం చేయజాలడు. జూద షరతులను అనుసరించి, వారి ప్రతిజ్ఞను అనుసరించి, ఆ ప్రకారమే అరణ్యవాసం మొదలైంది. దీన్ని పాండవులు సక్రమంగానే నిర్వర్తించారు. అయితే అజ్ఞాతవాసానంతరం వారికి శారీరక స్వేచ్ఛ మాత్రమే వచ్చిందిగానీ, రాజ్యం పొందడానికి హక్కు రాలేదే?. యుధిష్ఠరుడు ఇప్పుడు తాను ఓడిపోయిన రాజ్యాన్ని ఇవ్వమని వేడుకోవాలేగానీ, తనకు హక్కు కలిగి ఉన్నట్లు నిర్బంధించలేడు. బలరాముడికి సాయుధ యుద్ధమంటే అందులో ఒకే కుటుంబం వాళ్లతో ఎప్పుడూ ఇష్టం లేదు. యుద్ధం వల్ల కీడు కలుగుతుందని ఆయన అభిప్రాయం.

యాదవ వీరుడైన సాత్యకి.. బలరాముడి మాటలు విని ఆపుకోలేని కోపంతో నిలబడి, రోషంతో ఇలా అన్నాడు. "బలరాముడి మాటలు ఏమాత్రం న్యాయంగా ఉన్నట్లు నాకు తోచడం లేదు. ఏ అంశం గురించి అయినా చతురుడైనవాడు తన అంశంలో ఎలా సమర్థించగలడు. కానీ ప్రపంచంలో ఇమిడి ఉన్న చతురతంతా కలిసినా చెడును మంచిగానూ, అన్యాయాన్ని న్యాయంగానూ మార్చలేరు. బలరాముడు స్థిరపరిచిన దానికి నేను సమ్మతించలేను. ఒకే వృక్షంలోని ఒకే శాఖ ఫలభరితమై వంగి ఉండటాన్ని, మరొక శాఖ ఎండిపోయి పనికిరాకుండా వేలాడటాన్ని మనం చూస్తూనే ఉన్నాం. అలాగే ఈ అన్నదమ్ముల్లో శ్రీకృష్ణుడు ధర్మయుక్తంగా మాట్లాడుతున్నాడు. బలరాముడి తత్వం ఆయనకు తగినదిగా లేదు. కౌరవులు.. యుధిష్ఠరుడు నుంచి రాజ్యభాగాన్ని వంచనతో కాజేశారనే విషయం నిస్సంశయం. మీరంతా ఒప్పుకొని తీరాల్సినది. ఇలాంటి సందర్భంలో ఆ రాజ్య భాగాన్ని కౌరవులు వారు స్వంతంగా నిలుపుకోదగినదే అని పలకడం.. ఒక దొంగ తాను

దొంగిలించినదాన్ని సొంతంగా ఖాయంగా నిలుపుకుంటాడని చెప్పే అన్యాయమైన మాటగా ఉంది. యుధిష్ఠరుడు తప్పు చేశాడని చెప్పడం ఏదైనా న్యాయ కారణం ఉండటం వల్ల కాదు. దుర్యోధనుడికి భయపడి పిరికితనం వల్లనే. ఓ రసపుత్రులారా, నేను చెప్పే కఠోర మాటలను క్షమించండి. యుధిష్ఠరుడు తనంతట తాను జూదమాడటానికి వెళ్లలేదు. కౌరవులు అతడికి పదేపదే చెప్పడంతోనూ, ఆహ్వానించడంతో, బలవంతం చేయడంతో తనకిష్టం లేకపోయినా ఘోర ఉపద్రవం కలిగించే జూదానికి ఈడ్చబడి, హస్తలాఘవం తెలిసిన ఓ వంచకుడితో జూదామాడాల్సి వచ్చింది. యుధిష్ఠరుడు తన ప్రతిజ్ఞను నిర్వర్తించాడు.. అతడు దుర్యోధనుడికి ఒంగి మనవి చేసుకోవాల్సిన ఆగత్యం లేదు. యుధిష్ఠరుడు ఒకరిని వేడుకోవాల్సిన అవసరం లేదు. అతడు తన మాటలకు కట్టుబడ్డాడు. తన తమ్ముళ్లు కూడా వనవాసం, అజ్ఞాతవాసం చేయాల్సివచ్చింది. ఈ విధంగా పాండవులు వ్యవహరించినా దుర్యోధనాదులు సిగ్గును, మర్యాదను విడిచి వారి అజ్ఞాతవాస చర్య గురించి ప్రశ్నిస్తున్నారు. తుచ్ఛులు, క్రూరులు అయిన కౌరవులను యుద్ధంలోనే ఓడిస్తాను. అప్పుడు వారు ధర్మరాజు వద్దకు వచ్చి తమను రక్షించమని వేడుకుంటారు. లేదా చస్తారు. ఏది ఎలా అయినా న్యాయ కారణంపై చేసే యుద్ధం ఎన్నటికీ పొరపాటు కాదు. ఆయుధాలు ధరించి యుద్ధం చేసే శత్రువులను చంపడం పాపం కాదు. శత్రువు వద్ద తలదించి వేడుకోవడం అవమానం చెందడమే. దుర్యోధనుడికి యుద్ధం ఇష్టమైతే అలాగే అవుతుంది. మేము కూడా సిద్ధంగానే ఉన్నాము. ఇక ఎంత మాత్రమూ జాగు చేయక యుద్ధ సన్నద్ధులు కండి. యుద్ధం జరగనిదే దుర్యోధనుడు ఏ మాత్రం రాజ్యభాగం ఇవ్వడు. కనుక కాలాన్ని వ్యర్థ పరచడం సమంజసం కాదు" అన్నాడు సాత్యకి.

సాత్యకి పలికిన ఆ మాటలకు ద్రుపదుడు సంతృప్తి చెందాడు. అతడు లేచి.. "సాత్యకి మాటలు నాకు సమ్మతమే. మెత్తని పలుకులు దుర్యోధనుణ్ణి క్రమ మార్గంలోకి తేవు. యుద్ధానికి మనం చేసే ప్రయత్నాలు సాగించాల్సిందే. ఇక్కడ మన స్నేహితులందరిని జాగు చేయకుండా తమ సైన్యాలను తోడ్కొని రావాలని హెచ్చరించండి. తక్షణం శల్య, దృష్టకేతు, జయత్సేన, కేకయులకు వర్తమానాన్ని పంపండి. ధృతరాష్ట్రుని వద్దకు తగిన వారిని దూతగా పంపవచ్చు. మత, దైవిక కార్యాలను నా వద్ద నెరవేర్చుతున్న నా పవిత్ర బ్రాహ్మణుణ్ణి హస్తినాపురానికి నమ్మకంగా పంపవచ్చు. దుర్యోధనుడికి ఏమి చెప్పాలో భీష్మ, ధృతరాష్ట్ర, ద్రోణాచార్యులకు ఎలాంటి వార్త చెప్పాలో ఈ బ్రాహ్మణులకు బాగా తెలియజేయండి" అన్నాడు. ద్రుపదుడు చెప్పింది పూర్తయిన తరువాత వాసుదేవుడు నిలిచి ఇలా అన్నాడు. "మీరు చెప్పింది చేయడానికి వీలైనదిగా, క్షత్రియ ధర్మాన్ని అనుసరించేదిగా ఉంది. బలరాముడూ,

నేనూ పాండవులకు ఎంతో ప్రేమాస్పదులం. మేమిక్కడికి ఉత్తర రాకుమార్తె వివాహానికి వచ్చాము. మేమిప్పుడే పట్టణానికి వెళ్తున్నాము. ఈ రాజ్యాలను ఏలే రాజులందరిలోను, మీరు.. వయస్సు చేతనైతేనేమి, బుద్ధి చేతనైతేనేమి పెద్దలు. మా అందరికి ఆలోచనలు చెప్పడానికి మీకు అన్నివిధాలా అర్హత ఉంది. ధృతరాష్ట్రుడు కూడా మీ కన్నా హెచ్చు గౌరవం కలవాడే. ద్రోణుడు, కృపుడు మీ బాల్య స్నేహితులు. శాంతి భద్రతలను నిలపడానికి ఎలా చెప్పాలో అలా చెప్పడానికి మీరు అన్ని విధాలా అర్హులు. కనుక అంశాలన్నీ ఈ బ్రాహ్మణునికి చెప్పి పంపండి. ఈ దూతకు.. దుర్యోధనుణ్ణి తాను చేసే పొరబాటు నుంచి మంచి మార్గంలోకి తీసుకు రావడానికి వీలు కానప్పుడు, యుద్ధం తప్పదని భావించి తమకు వర్తమానం పంపాలి" అని అన్నాడు. సమావేశం ముగిసింది. కృష్ణుడు తనవారితో ద్వారకకు వెళ్లాడు. పాండవులూ, వారి మిత్రులూ యుద్ధ సన్నాహాలు ప్రారంభించారు. తమ స్నేహితులకు వర్తమానాలు పంపి యుద్ధానికి సిద్ధం కావలసిందిగా కోరారు. ఉభయ పక్షాలూ యుద్ధానికి సిద్ధమవుతున్నాయని దేశమంతా ప్రచారం జరుగుతోంది. నిరంతరం రాజులు దేశానికి రావడం, వెళ్లడం వల్ల దేశంలో ఒకరకమైన అలజడి ప్రారంభమైంది.

ద్రుపదుడు తన బ్రాహ్మణోత్తములను పిలిచాడు. దుర్యోధనుడి మనస్తత్వం, పాండవుల గుణగణాలు మీ అందరికీ బాగా తెలుసు. పాండవుల దూతల మాదిరి మీరు అక్కడికి వెళ్లండి. విదురుని మంచి ఉపదేశం వినక, ధృతరాష్ట్రుడు, అతని పరివారమైన కౌరవులు పాండవులను మోసం చేశారు. వృద్ధుడూ, మనోదారుఢ్యమూ లేనివాడూ, కుమారుడి వల్ల చెడు మార్గం పట్టినవాడూ అయిన ధృతరాష్ట్రుడికి ధర్మమార్గాన్ని, న్యాయాన్ని వివరించండి. మీ ప్రయత్నానికి విదురుడు సాయపడతాడు. మీరు వెళ్లి చేసే ప్రయత్నం వల్ల.. కౌరవ పక్షంలోని భీష్మ, ద్రోణ, కృపులకు, యుద్ధం కోరే ప్రభువులకూ అభిప్రాయభేదాలు వస్తాయి. అవే గనుక వస్తే వాటిని సరిచేసి సరైన మార్గానికి వచ్చే కాలంలో పాండవులు యుద్ధ సన్నాహాలు చేసుకోవడానికి అవసరమైన సమయం లభిస్తుంది. మీరు శాంతిని కోరుతూ, దుర్యోధనుడు పట్టణంలో ఉన్నంతకాలమూ వారి యుద్ధ ప్రయత్నాలకు ఆటకం కలుగుతుంది. ఇలా కూడా పాండవులకు మేలు జరుగుతుంది. ఒక వేళ మీరు వెళ్లిన కార్యం శాంతియుతంగా నెరవేరితే అది మరీ మంచిది. దుర్యోధనుడు శాంతియుత మార్గానికి వస్తాడని నేనూహించలేను. అయినా ఒకరిని శాంతి దూతగా పంపితే మనకే ఉపయోగపడుతుంది.



శ్రీకృష్ణుని సహాయం కోసం వెళ్లిన
అర్జునుడు, దుర్యోధనుడు

## అధ్యాయం 49

# అర్జునుడి రథసారధ్యం

**దృ**పదుని కొలువులో ఉండే బ్రాహ్మణోత్తముణ్ణి శాంతి దూతగా హస్తినాపురానికి పంపారు. అప్పుడే పాండవులు తమకు సహాయం చేయగల స్నేహితులైన రాజులందరికీ వార్తలు పంపి, సైన్యాన్ని సమాయత్తం చేసుకొని యుద్ధానికి సిద్ధంగా ఉండాలని కోరారు. ద్వారకకు అర్జునుడు స్వయంగా వెళ్లాడు. దుర్యోధనుడు కూడా అన్ని ప్రయత్నాలు చేసుకోవడం వేగుల ద్వారా తెలుసుకున్నాడు. శ్రీకృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడని తెలుసుకొని దుర్యోధనుడు తన రథానికి జవాశ్వాలను కట్టి త్వరగా ద్వారకకు వెళ్లాడు. అలా అర్జునుడు, దుర్యోధనుడు ఇద్దరూ ఒకే రోజున ద్వారక వెళ్లారు.

ఆ సమయంలో శ్రీకృష్ణుడు గాఢ నిద్రలో ఉన్నాడు. అర్జునుడు, దుర్యోధనుడు ఇద్దరూ శ్రీకృష్ణుడికి దగ్గర బంధువులే. అందువల్ల వారు శ్రీకృష్ణుడి శయన మందిరంలోకి వెళ్లారు. ఆ మందిరంలోకి దుర్యోధనుడు మొదటిగా వెళ్లాడు. అతడు శ్రీకృష్ణుడి తల

వైపు ఉన్న రత్న ఖచిత సింహాసనంపై కూర్చున్నాడు. తర్వాత వెళ్లిన అర్జునుడు శ్రీకృష్ణుడి పాదాలవైపు చేతులు జోడించి నిలబడ్డాడు. శ్రీకృష్ణుడు మేల్కొన్న వెంటనే అతని దృష్టి తనకు ఎదురుగా ఉన్న అర్జునుడిపై పడింది. తక్షణమే అతన్ని కౌగలించుకొన్నాడు. తరువాత దుర్యోధనుణ్ణి చూశాడు. అతన్ని అలాగే చేశాడు. వారిద్దరినీ ద్వారకకు వచ్చిన కారణం అడిగాడు. దుర్యోధనుడు ముందుగా మాట్లాడాడు. "కౌరవ పాండవుల మధ్య శీఘ్రంగా యుద్ధం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. యుద్ధమే వస్తే నీవు మాకు సహాయపడాలి. నేనూ, అర్జునుడూ నీ దయకు సమాన పాత్రులమై ఉన్నాం. నీతో బంధుత్వం కూడా ఇద్దరకూ సమానమే. మా ఇద్దరిలో నీకు ప్రేమాధికుడనని ఎవరినీ అనలేవు. నేను అర్జునుడి కంటే ముందువచ్చాను. ఎవరైతే ముందు వచ్చారో వారిని అనుగ్రహించాలని పూర్వాచారం చెపుతున్నది. జనార్ధనా, నీవు శ్రేష్టుల్లో శ్రేషుడివి. ఇతరులకు నీతి నేర్పగలవాడివి. ఇలాంటి సదాచారాన్ని నీ చర్యతో నిలబెట్టు. నేను ముందు వచ్చానన్న అంశాన్ని మరవొద్దు" అన్నాడు దుర్యోధనుడు.

దీనికి శ్రీకృష్ణుడు ఇలా సమాధానమిచ్చాడు. "ధృతరాష్ట్ర కుమారా, ఇక్కడకు నీవు ముందుగానే వచ్చి ఉండొచ్చు. కానీ నేను నిద్ర లేచిన వెంటనే కుంతీ పుత్రుణ్ణి చూశాను. నీవు ముందుగా వచ్చినవాడివైతే, అర్జునుడు ముందుగా దృష్టిని పడ్డాడు. కానీ ఈ అంశంలో కూడా నాయందు నీకున్న హక్కులు సమానమే. అందువల్ల ఇరుపక్కల వారికీ నేను సహాయం చేయకతప్పదు. ఎవరయినా బహుమానం ఇస్తే.. పూర్వాచారం ప్రకారం బహుమతి అందుకొన్నవారిలో చిన్నవారితోనే కార్యం ప్రారంభం కావాలి. కనుక ఎన్నుకోవడానికి ముందుగా అర్జునుడికే స్వతంత్రం ఇస్తున్నాను. నా తెగవారయిన నారాయణులు, నాతో సమాన బలం గలవాళ్లు, అజేయులయ్యేవాళ్లు అసంఖ్యాకులున్నారు. నేను సహాయాన్ని మీ ఇద్దరికీ పంచడంలో వీరంతా ఒక్కపక్క, నేను రెండో పక్క ఉంటాము. పైగా నేను ఆయుధం చేపట్టను. యుద్ధమూ చేయను" అన్నాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు అర్జునుడివైపు చూస్తూ.. "పార్థా, బాగా ఆలోచించుకో. ఆయుధం లేనివాడిని నన్ను కోరతావా, లేక నారాయణుల ప్రతిభను కోరతావా?. ఆచారం ప్రకారం వయసులో చిన్నవాడవు అయినందువల్ల ముందుగా నువ్వే ఎన్నుకో" అన్నాడు.

శ్రీకృష్ణుడి నుంచి ఈ మాటలు విన్నవెంటనే వెనుకా ముందూ చూడక అర్జునుడు ఎంతో నమ్రతతో.."నీవు అస్త్రం ధరించకపోయినా మాతో ఉంటే అదే మాకు మిక్కిలి ఆనందం" అన్నాడు. ఈ మాటలకు దుర్యోధనుడు పరమానందం చెందాడు. అర్జునుడు కోరింది తెలివిమాలినది అని భావించాడు. తాను నారాయణుల సేనలను కోరాడు.

శ్రీకృష్ణుడు అలాగే ఇచ్చాడు. గొప్ప సంఖ్యగల బలమైన సైన్యాన్ని పొందాననే ఆనందం చెందాడు దుర్యోధనుడు. బలరాముడి వద్దకు వెళ్లి కథంతా చెప్పాడు. మహాశక్తి సంపన్నుడైన బలరాముడు..“దుర్యోధనా, విరటుని కుమార్తె వివాహ సమయంలో నేను అన్నమాటలన్నీ నీకు గుర్తుండే ఉంటాయి. నీ మంచి కోసమే నేను వాదించాను. ఎంతవరకు నీకు ఉపకారం జరుగుతుందో అంతవరకే చెప్పాను. కృష్ణుడితో నేను తరచూ కౌరవ పాండవులకు, మాకు మధ్య సమాన బంధుత్వాన్ని తెలియజేశాను. కానీ నా మాటలను అతడు విశ్వసించినట్లు లేదు. నేను ఏమీ చేయలేని వాణ్ణయ్యాను. శ్రీకృష్ణుడికి ఎదురుగా ఉన్న పక్షంలో నేను చేరను. నేను అర్జునుడికి సహాయం చేయలేను. కృష్ణుడికి ఎదురుగా ఉండి నీకు సహాయం చేయలేను. ఓ దుర్యోధనా, నీవు ప్రఖ్యాతి చెందిన క్షత్రియుడవు. ప్రపంచంలోని రాజుల మన్ననలకు పాత్రుడవు. సరే, అలాంటప్పుడు యుద్ధమే తప్పకపోతే క్షత్రియ ధర్మాన్ని అనుసరిస్తుండు” అన్నాడు.

దుర్యోధనుడు హస్తినాపురం తిరిగి వస్తూ ‘అర్జునుడు శుద్ధ మూర్ఖుడయ్యాడు. ద్వారక సైన్యమంతా నా పక్షాన ఉంది. ఇందుకు సహాయంగా బలరాముడి ఆశీర్వచనమూ ఉంది. శ్రీకృష్ణుడికి సైన్యమనేదే లేదు’ అనుకున్నాడు అంతరంగంలో.

కృష్ణార్జునులిద్దరూ ఏకాంతంలో ఉండగా, కృష్ణుడు నవ్వుతూ.. “అసంఖ్యాకులను, మహావీరులను, అన్ని ఆయుధాలతో ఉన్న నా సైన్యాన్ని విడిచి ఆయుధమైనా ధరించని నన్నేల తెలివితక్కువగా కోరితివి” అన్నాడు. అర్జునుడు సమాధానమిస్తూ.. “నీ ఆశ మాదిరిగా నా ఆశ కూడా కీర్తి కోసమే. ప్రపంచంలోని రాజులందరినీ, వారి సేనలంతటినీ నువ్వొక్కడివే ఎదుర్కోగల శక్తీ, బలమూ కలవాడివి. నేను కూడా ఆలాగే చేయగలనని నాకూ ఉన్నది. నేను శస్త్రాలు పట్టకుండా యుద్ధంలో నా సారథివై ఉంటే, యుద్ధంలో విజయం సాధించాలని ఉంది. ఈ కోరిక నాకు చాలా కాలం నుంచి ఉంది. నేటికి అది నువ్వు తీర్చావు” అన్నాడు. శ్రీకృష్ణుడు నవ్వి.. “నాతో సమానమైన వాడివి అవ్వడానికి ప్రయత్నిస్తున్నావా?. అలాగే అగుగాక” అని ఆశీర్వదించాడు. అర్జునుడి నిశ్చితమైన చర్యకు సంతోషించాడు.



కౌరవ సేనకు సర్వసైన్యాధిపతిగా
నియమించబడిన శల్యుడు

## అధ్యాయం 50

# శల్యుడు - మేనల్లుళ్లకు ఎదురు

**మ**ద్ర దేశ రాజయిన శల్యుడు.. నకుల, సహదేవుల తల్లి అయిన మాద్రికి సోదరుడు. ఉపప్లావ్యంలో పాండవులు ఉన్నారని, యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నారని విన్నాడు. గొప్ప సైన్యాన్ని జతపరిచి సైన్యంతో ఉపప్లావ్యానికి బయలుదేరాడు. శల్యుడి సేన పెద్దది. దాన్ని విడిచిపెట్టాలంటే సుమారు 15 మైళ్ల స్థలం కావాలి. శల్యుడు గొప్ప సేనతో బయలుదేరాడని దుర్యోధనుడు విని, ఏదైనా ఉపాయంతో శల్యుణ్ణి తన పక్షానికి తిప్పుకోవాలని తన ఉద్యోగులను పంపాడు. శల్యుడి గొప్ప సేనకు కావలసిన మార్గ సౌకర్యాలు, మర్యాదలు బాగా జరిగేటట్లు ఏర్పాటు చేశాడు. దుర్యోధనుడి ఆజ్ఞ ప్రకారం శల్యుడి సేన బస చేయడానికి మార్గమధ్యంలో అక్కడక్కడ ఎంతో సుందరంగా అలంకరించిన వసతి గృహాలను ఏర్పాటు చేశారు. శల్యుణ్ణి, ఆయన పరివారాన్ని ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించారు. వారికి ఆహార పానీయాలు కొరత లేకుండా చేశారు. ఈ గొప్ప సదుపాయాలకు, గౌరవాలకు శల్యుడు అమితానందం చెందాడు. తన మేనల్లుడు ధర్మరాజే ఈ ఏర్పాట్లు చేయించాడని

అనుకున్నాడు. సదుపాయాల కల్పనకు సంతోషిస్తూ, తన చుట్టూ ఉండి, తన ఆజ్ఞల కోసం ఎదురుచూస్తున్న ఉద్యోగులను చూసి.."నన్నూ, నా సేనను ఇంత గౌరవంతో ఆదరిస్తున్న మీకు నేను బహూకరించాల్సి ఉంది. నేనిలా అన్నానని కుంతీ కుమారుడికి చెప్పి అతని అంగీకారం పొందండి" అన్నాడు శల్యుడు. ఉద్యోగులు తమ యజమాని అయిన దుర్యోధనుడి వద్దకు వెళ్లి శల్యుడి మాటలు చెప్పారు. దుర్యోధనుడు ఇంతకాలమూ తన ఉద్యోగులతో ప్రచ్ఛనంగా ఉన్నందున ఇదే తరుణమని భావించి శల్యుని ఎదుటపడి.. తన సపర్యలనూ, ఆదరణనూ స్వీకరించినందుకు తాము అదృష్టవంతులమని శల్యుడితో అన్నాడు. దీంతో శల్యుడు ఆశ్చర్యపోయాడు. ఈ మర్యాదలు యుధిష్ఠరుడు చేస్తున్నాడని ఇప్పటివరకూ భావించాడాయన. పాండవుల బంధువూ, వారి పక్షానికి చెందినవాడూ అయిన తన గురించి దుర్యోధనుడికి తెలిసినా, గౌరవ మర్యాదలు చేసినందుకు అతడి ధీరత్వానికీ, బుద్ధికీ సంతోషించాడు. "నీవు నిజంగా గౌరవనీయుడవు. దయగలవాడివి. నేనెలా నీకు సాయం చేయగలను?" అన్నాడు శల్యుడు. దీనికి దుర్యోధనుడు.."నీవు, నీ సేన నా పక్షాన ఉండి యుద్ధం చేయాలి. ఇదే నేను నిన్ను కోరే బహుమానం" అన్నాడు. శల్యుడు నిర్ఘాంతపోయాడు.

"మా ఉభయులకూ నీవు సమానుడవు. నీకు పాండవులు ఎలాగో నేనూ అంతే. నాకు సహాయంగా రావడానికి నీవు అంగీకరించాలి" అన్నాడు దుర్యోధనుడు. శల్యుడు అలాగే అంగీకరించాడు. దుర్యోధనుడి ఘనమైన ఆహ్వానానికి ఉప్పొంగి, తాను ఎంతో ప్రేమించే, గౌరవించే పాండవులను వదిలిపెట్టి దుర్యోధనుడి పక్షాన యుద్ధం చేస్తానని మాట ఇచ్చాడు. యుధిష్ఠరుణ్ణి కలవకుండా తాను తిరిగి వెళ్లడం భావ్యం కాదని తలచిన శల్యుడు.. దుర్యోధనుడుతో, "దుర్యోధనా, నన్ను నమ్ము. నా మానస సమానమైన బాసను నీకు చేశాను. ఎలాగైనా యుధిష్ఠరుణ్ణి కలిసి నేను చేసిందంతా అతనికి చెప్పక తప్పదు" అన్నాడు. దానికి దుర్యోధనుడు.."వెళ్లు. వారిని చూసిన వెంటనే రండి. నాకిచ్చిన వాగ్దానాన్ని మరువకు" అన్నాడు. "నీకు శుభం కలుగుగాక. నీ కోటకు నీవు వెళ్లు. నేను నిన్ను ఎప్పుడూ వంచించను" అని శల్యుడు యుధిష్ఠరుణ్ణి కలిసేందుకు ఉపప్లావ్యానికి వెళ్లాడు.

పాండవులు మద్ర దేశాధిపతిని గొప్ప గౌరవంతో ఎదురేగి గౌరవించారు. నకుల, సహదేవులు తమ మేనమామను చూసినందుకు ఎంతో సంతోషించారు. పాండవులు తాము పడిన బాధలు, కష్టాలు శల్యునికి వివరించారు. జరగబోయే యుద్ధంలో తన సహాయాన్ని పాండవులు అడుగుతారేమోనని తాను దుర్యోధనుడికి ఇచ్చిన వాగ్దానం గురించి తెలియజేశాడు. శల్యుడు నిశ్చయంగా తమ పక్షం వాడేనని, పాండవులను నమ్మి, తూష్ణీభావంగా ఉన్నందునే దుర్యోధనుడు తమ కంటే ముందు

తన బుద్ధికుశలతతో శల్యుణ్ణి తన పక్షానికి తిప్పుకున్నాడని ధర్మరాజు భావించాడు. ధర్మరాజు వీలైనంతగా తన ఆశాభంగాన్ని అణచుకొన్నాడు. “మహావీరుడా.. నీవు దుర్యోధనుడికి ఇచ్చిన వాగ్దానం తప్పక నిలబెట్టుకోవలసిందే. యుద్ధంలో నీవు వాసుదేవుడితో సమానుడవు. యుద్ధంలో అర్జునుణ్ణి చంపదలిచి నప్పుడు కర్ణుడు.. నీ రథసారధ్యాన్ని కోరగలడు. అప్పుడు అర్జునుడి మరణానికి నీవు కారణ భూతుడవుతావా? లేక అర్జునుణ్ణి రక్షిస్తావా? న్యాయంగా ఈ ప్రశ్న మిమ్మల్ని అడగకూడదు. అయిననూ అడుగుతున్నాను” అన్నాడు యుధిష్టరుడు. దీనికి శల్యుడు.. “బిడ్డా! నేను దుర్యోధనుడికి వాగ్దానమిచ్చి వంచించబడ్డాను. నీకు ఎదురుగా యుద్ధంలో ఉండవలసిన వాణ్ణి. అర్జునుణ్ణి చంపడానికి యుద్ధంలో కర్ణుడు బయలుదేరినప్పుడు.. అప్పుడు నేను సారధిగా ఉండే పరిస్థితి తటస్థించినప్పుడు కర్ణుడు ఉత్సాహ రహితుడై ఉంటాడు. అర్జునుడు రక్షించబడతాడు. భయపడకు. మీకూ, ద్రౌపదికి సంభవించిన విషాదం, నీచపు మాటలు, నీచ కార్యాలు, ఇవన్నీ పగతో సాధించబడతాయని గుర్తించు. ఇక నుంచి మీకు మంచే జరుగుతుంది. విధి ఆదేశించినదాన్ని ఎవరూ ఆపలేరు. అడ్డుపడలేరు. నేను తప్పు చేశాను. ఎలాగోలా నన్ను సహించు” అన్నాడు.

శుక్రాచార్యునితోపాటు వృత్రాశురునికి
బోధిస్తున్న శనకుడు, ఇతర రుషులు



## అధ్యాయం 51

# వృతృడు

**ము**ల్లోకాలకూ అధిపతి అయిన ఇంద్రుడు గర్వోన్మత్తుడై అదివరకు దేవతలు అనుసరిస్తూ వచ్చిన మర్యాదలను, సదాచారాలను మరిచాడు. దేవతలకు గురువు, సకల శాస్త్ర వేద దేవాసురలతో మన్ననలందుకుంటున్న బృహస్పతి ఇంద్రుని సభకు వచ్చాడు. ఆయనను ఆహ్వానించడానికి ఇంద్రుడు తన ఆసనం నుంచి లేచి నిలబడలేదు. ఆయనకు ఆసనమిచ్చి తగిన మర్యాదలు చేయలేదు. తాను రాజైన కారణంగా సింహాసనంపై కూర్చునే సభకు వచ్చే వారిని ఆదరించడానికి హక్కు కలిగినట్లుగా శాస్త్రాలన్నీ అంగీకరిస్తున్నాయని గర్వమత్తతతో అనుకున్నాడు ఇంద్రుడు.

ఇంద్రుని ఈ అపచారానికి బృహస్పతి నొచ్చుకున్నాడు. ఇది ఇంద్రుని గర్వాతిశయమని భావించాడు. నెమ్మదిగా సభ నుంచి వెళ్లిపోయాడు. దేవ గురువు లేని ఇంద్రసభ సౌందర్య రహితంగా, అపవిత్రంగా మారింది. తాను చేసిన బుద్ధి తక్కువ పని గురించి తరువాత తెలుసుకున్నాడు ఇంద్రుడు. బృహస్పతికి కోపం వస్తే

తనకు ఏమైనా ఆపద కలుగుతుందేమో అని భావించిన ఇంద్రుడు.. ఆచార్యుని పాదాలపై పడి తాను చేసిన అపచారాన్ని మన్నించాలని, క్షమించాలని బృహస్పతిని కోరడానికి సిద్ధమయ్యాడు గానీ తాను అనుకున్నట్లు చేయడానికి మాత్రం వీలుకాలేదు. బృహస్పతి అన ఆశ్రమంలో లేకపోవడమే ఇందుకు కారణం. బృహస్పతిని అగౌరవపరిచాననే అంశం ఇంద్రుణ్ణి పదేపదే బాధిస్తోంది. బృహస్పతి లేని ఇంద్రుని తేజో బలాలు క్షీణిస్తుండగా, రాక్షసుల బలాలు అధికమవుతున్నాయి. ఆ రాక్షసులు దేవతలపై యుద్ధానికి వచ్చారు. రాక్షసుల ముట్టడిలోని దేవతలను చూసి కనికరించిన బ్రహ్మ, మరో ఆచార్యుణ్ణి చూసుకోవలసిందిగా సలహా ఇచ్చాడు. "మీరు ఇంద్రుడి తెలివితక్కువతనం వల్ల బృహస్పతిని పోగొట్టుకున్నారు. మీరంతా ఇప్పుడు త్వష్ట కుమారుడైన విశ్వరూపుని వద్దకు వెళ్లి, ఆ మహనీయుణ్ణి గురువుగా ఉండాలని వేడుకోండి. ఆ తరువాత మీకు అంతా సక్రమంగా ఉంటుంది" అన్నాడు బ్రహ్మ. ఈ మాటలతో ధైర్యం తెచ్చుకున్న దేవతలు, యవ్వనుడైన విశ్వరూపుణ్ణి దర్శించుకున్నాడు. "మీరు వయస్సులో చిన్నవాడైనా, వేదాలను బాగా అవపోసన పట్టారు. మమ్మల్ని కరుణించి, మాకు గురువులై, మమ్మల్ని గౌరవనీయులుగా చేయండి" అని మొరపెట్టుకున్నారు. ఇందుకు విశ్వరూపుడు అంగీకరించాడు. విశ్వరూపుడి సలహాల వల్ల దేవతలకు రాక్షసుల బాధలు తగ్గాయి. అయితే విశ్వరూపుని తల్లి దైత్య వంశంలోని అసుర కుటుంబానికి చెందినది. దీనితో విశ్వరూపుణ్ణి ఇంద్రుడు అనుమానించాడు. విశ్వరూపుడు తన తల్లి అసుర అంశ వల్ల దేవతల పట్ల పూర్తి విశ్వాసం కలిగి ఉండడని అతనిపై క్రమంగా అనుమానం పెరిగింది. అసురాంశుడైన ఈ విశ్వరూపుడి వల్ల ఏ విధంగానైనా తనకు ప్రమాదం వాటిల్లగలదని భావించాడు ఇంద్రుడు. ఏదైనా అక్రమ మార్గంలో గురుత్వ పీఠం నుంచి విశ్వరూపుణ్ణి దింపి, అతడి తపశ్శక్తిని పోగొట్టేందుకు సంసిద్ధుడైన ఇంద్రుడు.. విశ్వరూపుణ్ణి వలలో వేసుకోవాల్సిందిగా తన అప్సరసల్లో ఇద్దరిని పంపాడు. కానీ విశ్వరూపుడు అప్సరసలకు లొంగలేదు. ఆ దేవ వేశ్యలు తమ చతురతనంతా ఉపయోగించినా ఆ యువక తపస్వి అయిన విశ్వరూపుడు ఏ మాత్రం చలించలేదు. విశ్వరూపుడు తన బ్రహ్మచర్య వ్రతాన్ని నిష్టగా కాపాడుకుంటున్నాడు. తమ ఈ నీచ చర్య వల్ల కూడా విశ్వరూపుడు లొంగలేదని తలచిన ఇంద్రుడు.. అతణ్ణి తన వజ్రాయుధంతో చంపాడు.

ఇంద్రుడు తన కుమారుణ్ణి ఘోరంగా హత్య చేయడంపై త్వష్ట అగ్రహోదగ్రుడయ్యాడు. ఇంద్రునిపై పగ సాధించడానికి గొప్ప యాగం చేశాడు. యాగ అగ్నిహోత్ర జ్వాలల్లో ఇంద్రునికి మహాశత్రువైన వృత్రుణ్ణి సృష్టించాడు. త్వష్ట.. వృత్రుణ్ణి దేవేంద్రునిపైకి వదిలాడు. "ఇంద్రుని శత్రువా!.. నీవు బలవంతుడవు అగుగాక.

ఇంద్రుణ్ణి చంపుదువుగాక!" అని పలికాడు త్వష్ట. ఇంద్ర-వృత్రుల మధ్య గొప్ప యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో వృత్రుడిదే పైచేయి అవుతోంది. ఈ భీకర యుద్ధంతో భయభ్రాంతులైన రుషులు, దేవతలు మహావిష్ణువును శరణు జొచ్చారు. శ్రీమహావిష్ణువు వారిని ఓదార్చి రక్షించాడు. "భయం వద్దు. నేను ఇంద్రుని వజ్రాయుధంలో ప్రవేశించి చివరికి ఇంద్రుడే విజయం సాధించేలా చేస్తాను" అన్నాడు. అప్పుడు వారంతా తిరిగి వచ్చారు. వారంతా వృత్రుడి వద్దకు వెళ్లి.. "దయచేసి ఇంద్రునితో సఖ్యత కుదుర్చుకో. మీరిరువురూ బల శౌర్యాల్లో సమానులు'' అన్నారు. వృత్రుడు నమ్రతగా, మృదుమధురంగా "ఓ పాప రహితులారా!, ఇంద్రుడూ, నేనూ స్నేహితులం ఎలా కాగలం?. నన్ను క్షమించండి. ఔన్నత్యం కోసం పోరాడే ఉభయుల్లోనూ మైత్రి కుదిరేది కాదు. రెండు మహాశక్తులు ఎన్నడూ కలిసి ఉండవు. ఈ సంగతి మీకు తెలిసిందే" అన్నాడు. దానికి రుషులు.. "అలాంటి సందేహం చెందకు. ఇద్దరు మహనీయులు తప్పక స్నేహంతో ఉంటారు. అలాంటి వారి స్నేహం దృఢమై కలకాలం ఉంటుంది" అన్నారు. దీనికి వృత్రుడు.. "సరే. నేను యుద్ధం మానేస్తాను. కానీ ఇంద్రుని వద్ద నాకు నమ్మకం చాలదు. నేను ఏమరుపాటుగా ఉన్నప్పుడు అతడు నాకు హాని చేస్తాడు. కనుక ఈ వరం మిమ్మల్ని కోరతాను. పగలుగానీ, రాత్రి గానీ, శుష్కాయుధాలతోగానీ, ఆర్ద్రాయుధాలతోగానీ, రాయి, కర్ర, లోహం, బాణం దేనితోనైనా ఇంద్రుడు చేత నేను చనిపోకుండా వరం ప్రసాదించు" అని కోరాడు. దేవతులూ, రుషులూ ఆ వరం ఆయనకు ప్రసాదించారు. అప్పటికి జగడాలు ఆగిపోయాయి. కానీ వృత్రుడి భయం నిజమతున్నట్లే కనిపించింది. వృత్రుడి పట్ల ఇంద్రుడు స్నేహం నటిస్తున్నప్పటికీ, అతణ్ణి చంపడానికి తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాడు. ఓ సాయంకాల సమయాన, సంధ్యాకాలంలో, ఓ సముద్రపు ఒడ్డున ఇంద్రుడు.. వృత్రుణ్ణి ఎదురించాడు. ఈ యుద్ధం చాలా కాలం కొనసాగింది. వృత్రుడు.. శ్రీమహావిష్ణువును స్తోత్రం చేస్తూ.. "ఓయీ, నీచుల్లో నీచుడా.. అజేయమైన వజ్రాయుధాన్ని ఎలా ఉపయోగిస్తావు?. ఆ ఆయుధం విష్ణువంశ కలది. అది నాపై ప్రయోగిస్తే, విష్ణువు కరుణతో నాకు మోక్షం సిద్ధిస్తుంది కదా" అన్నాడు. ఇంద్రుడు.. వృత్రుడి కుడి చేయిని నరికేశాడు. వృత్రుడు చలించలేదు. తన రెండో చేతితో ఇంద్రుడిపైకి ఇనుప గదను విసిరాడు. వృత్రుడి రెండో చేయిని కూడా ఇంద్రుడు నరికేశాడు. దీంతో వృత్రుడు తన నోరు తెరిచి ఇంద్రుణ్ణి కబళించాడు. దేవతలంతా హాహాకారాలు చేశారు. కానీ ఇంద్రుడు చనిపోలేదు. వృత్రుడి కడుపు చించుకొని బయటకు వచ్చాడు. సముద్రపు ఒడ్డుకు వెళ్లాడు. తన వజ్రాయుధాన్ని నీటిపైకి విసిరాడు. ఆ విసిరే క్రమంలో సముద్రపు నీటి నురగ వృత్రుణ్ణి తాకేలా చేశాడు. ఆ

నురగలో విష్ణువు ప్రవేశించి ఉన్నాడు. కనుక ఆ నురగ మహాస్త్రమై వృత్రుణ్ణి చంపింది. చాలా కాలం జరిగిన యుద్ధం ముగిసిపోవడంతో విషాదంతో నిండిన ప్రపంచమంతా ఆనందంలో మునిగింది. కానీ యుద్ధం ముగిసినా ఇంద్రునికి అపనిందే మిగిలింది. ఎందుకంటే ఈ విజయం పాప కార్యాచరణ వల్ల, దగా వల్ల సాధించబడింది. దాంతో ఇంద్రుడు సిగ్గుతో ఎక్కడో దాక్కొన్నాడు. ఇంద్రుడు కనపడక పోవడంతో దేవతలు, రుషులు చాలా చిక్కుల్లో పడ్డారు. రాజుతోగానీ, ప్రజాప్రాతినిధ్యంగల సభికులతోగానీ ఒక రాజ్యాన్ని పాలించకపోతే ఆ రాజ్యం వృద్ధి పొందదు. కనుక వారంతా మంచి గుణవంతుడూ, వీరుడూ అయిన నహుష చక్రవర్తి వద్దకు వెళ్లి అతనికి ఇంద్రుడి కిరీటాన్ని అందజేశారు. నహుషుడు.. "నన్ను క్షమించండి. నేను మీ రాజును కాను. ఇంద్రుని సింహాసనం ఎక్కడానికి నేనెంత వాణ్ణి. నేను మిమ్మల్ని ఎలా రక్షించగలను?. అది జరగదు" అని సవినయంగా దేవతలకు మొరపెట్టుకున్నాడు. కానీ వారు.. "సంకోచించకండి. మాకు రాజుగా, రాజ్య చిహ్నంగా రూపు దాల్చండి. మా అందరి తపశ్శక్తిని నీకిస్తాము. ఇది నీ మహాశక్తికన్నా గొప్పది అవుతుంది. నీవు ఎవరిపై దృష్టి పెట్టావో అలాంటివారి శక్తి కూడా నీకు చేరుతుంది. కనుక నీవు అజేయుడవు అవుతావు" అన్నాడు. ఇలా బలవంతంగా నహుషుడు ఇంద్ర పదవిని స్వీకరించాడు.

◈



రథం మీదనుండి పడిపోయిన
నహుషుడు

## అధ్యాయం - 52

# నహుషుడు

**వృ**త్రుణ్ణి అధర్మ మార్గంలో చంపిన పాపం ఇంద్రుణ్ణి తన ఔన్నత్యం నుంచి దించేసింది. అతణ్ణి ఒక ఖైదీలా మార్చేసింది. నహుషుడు రాజ్య పాలనను.. తాను భూలోకంలో రాజ్యం చేసిన కీర్తి వల్ల, దేవతలు, రుషులు ఇచ్చిన శక్తుల వల్ల ప్రారంభంలో రాజ్యం బాగానే చేశాడు. ఆ తరువాత అతడు చెడు మార్గం పట్టాడు. దైవ రాజ్యాన్ని చేస్తున్నాననే గర్వం అతని మది నిండా ఉంది. ఔదార్యం, నమ్రత పోయి చెడు కోరికలకు లోనయ్యాడు. ఇంద్రలోకపు ఆనందాలన్నీ నహుషుడు అనుభవిస్తూ కఠోరమైన స్త్రీ మోహంలో కూరుకుపోయాడు.

ఓరోజు ఇంద్రుడి భార్యను చూసి మోహించాడు. దుర్మార్గపు ఆలోచనతో సభలో ఉన్న దేవతలను ఉద్దేశించి.."దేవతలకు రాజ భార్య అయిన శచీదేవి ఎందుకు నా వద్దకు రాలేదు. నేనిప్పుడు దేవరాజును కాదా. త్వరలో ఆమెను మా గృహానికి పంపండి" అని ఆదేశించాడు. ఈ మాటలు శచీదేవికి తెలిసి రౌద్రమూర్తి అయ్యింది.

భయంతోనూ, శోకంతోనూ ఆమె బృహస్పతి వద్దకు వెళ్లింది. ఆయనను శరణుజొచ్చింది. శచీదేవి ఆయన వద్ద ఉందని తెలిసి నహుషుడు తెలుసుకొని ఆగ్రహోదగ్రుడయ్యాడు. తమ రాజు ఆగ్రహానికి దేవతలు విస్మయం వ్యక్తం చేశారు. "ఓ రాజా ఆగ్రహించకు. మీ కోపం ప్రపంచానికి విచారం తెస్తుంది. శచీదేవి మరొకరి భార్య. ఆమెను మీరు ఆశించకూడదు. ధర్మమార్గాన్ని వీడి వ్యవహరించొద్దు" అని నచ్చచెప్పే ప్రయత్నం చేశారు. కానీ మోహపరవశుడైన నహుషుడు వారి మాటలు లక్ష్యపెట్టక భయపెట్టే ప్రయత్నం చేశాడు. "ఇంద్రుడు.. అహల్యను వలచినప్పుడు మీ ధర్మపన్నాలు, సదాచారాలు ఏమయ్యాయి. అప్పుడు అతణ్ణి మీరెందుకు ఆపలేకపోయారు?. ఇప్పుడు నన్నెందుకు ఆపుతున్నారు?. ఇంద్రుడు ఏ మాత్రమూ సిగ్గులేక సమాధియోగంలో ఉన్న విశ్వరూపుణ్ణి చంపినప్పుడు మీరేమి చేశారు?. దగా చేసి వృత్రుణ్ణి చంపినప్పుడు మీ ధర్మాలేమయ్యాయి?. ఇప్పుడు శచీదేవి నా వద్దకు వచ్చి నాతో ఉండటమే ఆమె చేయదగ్గ ముఖ్యమైన పని. మీరు మా మంచి కోరేవారయితే, ఆమెకు వివరించి నా కోరికను సమ్మతింపచేసి నా వద్దకు పంపండి. ఈ కార్యాన్ని వెంటనే ప్రారంభించండి!" అని నహుషుడు కఠినమైన ఆజ్ఞ ఇచ్చాడు. భయ విహ్వలులైన దేవతలు బృహస్పతికి తెలియజేయడానికి నిశ్చయించారు. ఎలాగైనా శచీదేవిని నహుషుడి వద్దకు పంపాలని అనుకున్నారు. వారంతా బృహస్పతి వద్దకు వెళ్లి నహుషుడు అన్న మాటలు ఆయన చెవిన వేశారు. ఎలాగైనా శచీదేవి నహుషుడి కోరికకు లోబడి ఉండాలని చెప్పారు. ఈ మాటలు విన్న శచీదేవి.. "ఓ దైవమా, నేను అలా చేయలేను. నేను నిన్ను శరణు కోరుతున్నాను. నన్ను రక్షించు" అని దు:ఖితురాలైంది. బృహస్పతి ఆమెను ఓదార్చాడు. "శరణు కోరినవాడిని శత్రువుకు అప్పగించేవాడు నశిస్తాడు. వాడు భూమి మీద నాటిన విత్తును భూదేవి మొలక రాకుండా చేస్తుంది. నేను నిన్ను విడువను. నహుషుడికి పోయేకాలం సమీపించింది. భయపడకు" అని శచీదేవిని అనునయించాడు.

ఈ దురవస్థ నుంచి ఆమె తప్పించుకునే మార్గాన్ని బృహస్పతి ఆమెకు సూచించి, కాల వ్యవధిని కోరమని చెప్పాడు. తెలివిగల శచీదేవి బృహస్పతి అభిప్రాయాన్ని గ్రహించి ధైర్యంతో నహుషుడి గృహానికి వెళ్లింది. నహుషుడు ఆమెను చూసిన వెంటనే, గర్వ మోహాలతో తన విజ్ఞతను కోల్పోయి ఆనందంతో మైమరిచిపోయాడు. "ఓ సుందరీ భయపడకు. నేను ముల్లోకాలకూ రాజును. నీవు నా భార్య అవ్వడంలో ఎలాంటి పాపమూలేదు" అన్నాడు నహుషుడు. మహాపతివ్రత అయిన శచీదేవి ఈ మాటలు విని భయకంపితురాలైంది. కాసేపటికి తెప్పరిల్లి.. "ఓ దేవ రాజా, నేను నీ దానిని అవ్వడానికి ముందు నేనొక కోరిక కోరతాను. ఇంద్రుడు బతికి ఉన్నాడా?

చనిపోయాడా? బతికి ఉంటే ఎక్కడున్నాడు?. ఇంద్రుని గురించి సమాచారం తెలుసుకొని ఆయన కోసం వెదకి, అతడు లేకపోతే నాకు ఎలాంటి పాపమూ అంటదు. అప్పుడు నిర్మలమైన మనస్సుతో నీ భార్యను కాగలను" అన్నది. "అవును. నీవు చెప్పేది నిజం. వెళ్లి ఇంద్రుడు కోసం వెదుకు. కానీ నీవు తప్పక తిరిగి రావాలి. నీవు చేసిన వాగ్దానాన్ని మరచిపోవద్దు" అని శచీదేవిని మళ్లీ బృహస్పతి ఇంటికి పంపాడు. దేవతలు శ్రీమహావిష్ణువు వద్దకు వెళ్లి నహుషుడి కోరిక గురించి మొరపెట్టుకున్నారు. "ప్రభూ, నీ శక్తితో మహావృత్రుణ్ణి సంహరించారు. ఇంద్రుడు ఆ పాపాన్ని అనుభవిస్తున్నాడు. సిగ్గుపడి, భయపడి తానెక్కడో దాక్కున్నాడు. దయ ఉంచి అతడికేదైనా తరుణోపాయం ఆలోచించండి" అన్నారు. "నన్ను పూజించమని చెప్పండి. అతడికి పాప విముక్తి లభిస్తుంది. దుర్మార్గ చింతనగల నహుషుడు నిదానిస్తాడు" అన్నాడు శ్రీమహావిష్ణువు. శచీదేవి పాతివ్రత్య  దేవతను ఆరాధించి, ఆ దేవతానుగ్రహంతో ఇంద్రుడు దాక్కొన్న స్థలానికి చేరింది. అక్కడ దేవేంద్రుడు తపస్సు చేస్తూ తనకు మంచి రోజులు ఎప్పుడొస్తాయా అని ఎదురు చూస్తున్నాడు. శచీదేవి తన భర్త స్థితి చూసి ఆగలేక ఏడ్చింది. తన విషాద చరిత్రను ఇంద్రుడికి వివరించింది. ఇంద్రుడు ఆమెకు ధైర్య వచనాలు పలికాడు. "నహుషుడికి తుది కాలం సమీపించింది. నీవు నహుషుడి వద్దకు వెళ్లి నీ కోరికను తీర్చడానికి ఇష్టపడ్డానని చెప్పు. అతణ్ణి రుషులతో మోసే పల్లకీని ఎక్కి నీ గృహానికి రమ్మని చెప్పు. అప్పుడు నహుషుడు నిదానంగా వ్యవహరిస్తాడు" అని చెప్పాడు. శచీదేవి నహుషుడి వద్దకు వెళ్లి, ఇంద్రుడు చెప్పిన ప్రకారంగా అతడి కోరికను తీర్చడానికి సమ్మతించినట్లు నటించింది. శచీదేవి తిరిగి రావడం, తన కోరికను సమ్మతించడంతో నహుషుడు.. "నీకు గొప్ప మేలు జరుగుగాక. నేను నీకు సేవకుణ్ణి అయ్యాను. నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. నీవు నీ మాటను నిలబెట్టుకున్నావు" అన్నాడు.  శచి.. "అవును. నేను తిరిగి వచ్చాను.  నీవు నా భర్తవు కాగలవు. నాకు చాలా ఇష్టమైన ఓ కోరిక ఉంది. అది నీవు తీర్చాలి. నీవు ప్రపంచానికి అధిపతివి కావా, విష్ణువు, రుద్రుడు, రాక్షసుడు ఎవరైనాగానీ వ్యాహ్యాళికి వెళ్లే యానం కంటే, ఎక్కువ ఘనమూ, కీర్తి గల యానాన్ని ఎక్కి సాటిలేని వైభవంతో నీవు నా గృహానికి రా. నీవు సప్త రుషులు మోస్తుండగా పల్లకిని ఎక్కి నా వద్దకు రా. అప్పుడు నేను చాలా ఆనందిస్తాను. నిన్ను ఆహ్వానించి అన్ని మర్యాదలూ చేస్తాను" అన్నది శచీదేవి.

నహుషుడు అలా ఆమెకు చిక్కాడు.  "ఎంత అద్భుత ఆలోచన. నీ ఊహ చాలా ఆశ్చర్యంగా ఉంది. సప్త రుషులు నన్ను పల్లకిలో మోయడానికి తగినవారే. ఎందువల్లనంటే నేను ఎవరివైపు చూస్తే వారి సత్వాన్ని పొందగలననే వరముంది

నాకు. నీవు కోరిన ప్రకారమే చేస్తాను" అని ఆమెను ఇంటికి పంపేశాడు. మోహాంధుడైన నహుషుడు సప్త రుషులను పిలిపించి తాను ఎక్కిన పల్లకీ మోయాలని ఆజ్ఞాపించాడు.

ఈ ఘోర, అపవిత్ర తప్పిదానికి ముల్లోకాలూ కంపించిపోయాయి. చిన్నబోయాయి. రుషులు పల్లకీ మోస్తుండగా, మరింత ఘోరమైన అపవిత్ర కార్యం జరిగింది. శచీదేవి తన కోసం వేచి చూస్తూ ఉంటుందని ఆలోచిస్తూ.. మోహ పరవశంతో ఆమె దగ్గరకు వెళ్లడానికి ఆరాటపడుతున్నాడు. దీంతో పల్లకీ మోస్తున్న రుషులను పొడుస్తూ తొందర పెట్టసాగాడు. ఇది చాలక రుషుల్లో ఒకరైన అగస్త్య మహామునిని కాలితో తన్నుతూ కదల్లేని పాము అన్నాడు. నహుషుని స్త్రీ మోహ పారవశ్యం, గర్వం పతాక స్థాయికి చేరింది. ఆగ్రహోదగ్రుడైన అగస్త్య మహాముని కోపంతో.. "నీచుల్లో బహు నీచుడా! స్వర్గం నుంచి పడి నీవు భూమిపై సర్పం అగుదువు గాక" అని  నహుషుణ్ణి శపించాడు.

తక్షణమే నహుషుడు తల కిందులుగా స్వర్గం నుంచి పడి ఒక అజగరమై అడవుల్లో పడి ఉన్నాడు. ఇలా ఎన్నో వేల సంవత్సరాలు ఉన్నాడు. తరువాత అతడికి విమోచన కలిగింది. ఇంద్రుడు తన రాజ్యానికి చేరి దేవ రాజయ్యాడు. శచీదేవికి దు:ఖం పోయింది.

శల్యుడీ కథ చెప్తూ.. ఇంద్రుడు, శచీ దేవి పడిన కష్టాలను వివరించి ఉపప్లావ్య పట్టణంలో యుధిష్టరుణ్ణీ, ద్రౌపదినీ ఊరడించాడు. "శాంతంగా ఉండేవారికి విజయం కలుగుతుంది. ఐశ్వర్యం ఎవరినైతే గర్విష్టులుగా చేస్తుందో వారు నశిస్తారు. నీవు, నీ తమ్ముళ్లు, ద్రౌపది.. ఇంద్ర శచీదేవిలా నికృష్టం అనుభవించారు. మీ కష్ట పరీక్షా దినాలు త్వరలో పోతాయి. మీరు మీ రాజ్యాన్ని తిరిగి పొందుతారు. దుర్బుద్ధులైన కర్ణ, దుర్యోధనులు నహుషుడి మాదిరిగా అథములై నశిస్తారు" అన్నాడు.

వ్యాసుని వల్ల దివ్యశక్తి
పొందిన సంజయుడు
దృతరాష్ట్రునికి భవిష్యత్తు
గురించి వివరిస్తున్నాడు



## అధ్యాయం - 53

# సంజయ రాయబారం

**పాం**డవులు విరటుని రాజ్యంలోని ఉపప్లావ్య పట్టణంలో నివసిస్తున్నారు. అక్కణ్ణుంచే వారి స్నేహితులందరి వద్దకూ దూతలను పంపారు. దేశం నాలుగు దిక్కుల నుంచి సేనలు పట్టణానికి వస్తున్నాయి. అతి త్వరలోనే పాండవుల సైన్యం ఏడు "అక్షౌహిణులు"కు చేరుకుంది. కౌరవులు కూడా సైన్యాన్ని బాగా కూడ గట్టారు. వారు పదకొండు "అక్షౌహిణిలు"ను సమీకరించారు. యుద్ధం ఆనాడు కూడా ఈనాటి మాదిరిగా కొన్ని సూత్రాలను అనుసరించి జరిగేది. ఆనాడు ఒక అక్షౌహిణిలో 21870 రథాలు, అంతే సంఖ్యలో ఏనుగులు, దీనికి మూడు రెట్లు గుర్రాలు, అంతకు ఐదు రెట్లు పదాతి దళాలు ఉండేవి. వీటన్నిటికీ సరిపడా అన్ని రకాల ఆయుధాలూ, ఇతర యుద్ధ సామాగ్రీ ఉండేది.

దృపదుని బ్రాహ్మణ రాయభారి.. దృతరాష్ట్రుడి సభా మందిరానికి వెళ్లాడు. ఒకరినొకరు పరిచయం చేసుకున్నారు. ఆహ్వాన గౌరవాలు, కుశల ప్రశ్నలు అయ్యాక

రాయభారి, సభ నుద్దేశించి పాండవుల పక్షాన మాట్లాడటం మొదలు పెట్టాడు. "న్యాయం నిత్యమైనది. అలాంటి న్యాయంలోనే బలమూ ఉంటుంది. మీ అందరికీ ఇది తెలిసిన విషయమే. నేను మరలా చెప్పనక్కరలేదు. ధృతరాష్ట్రుడు, పాండు ఇద్దరూ విచిత్రవీర్యుని కుమారులు. ఆచారం ప్రకారం, వారిద్దరికీ తండ్రి ధనంపై సమాన హక్కులున్నాయి. దీన్నిలా ఉంచితే ధృతరాష్ట్రుని కుమారులు రాజ్యం అంతటినీ తమ వశం చేసుకున్నారు. పాండు కుమారులకు వారికి రావలసిన పితృ రాజ్య భాగం వారికి లేకుండా పోయింది. ఇలాంటి పరిస్థితిని న్యాయ సూత్రాలు సమ్మతింపవు. ఓ కురువంశ జాతులారా, పాండవులు శాంతిని కోరుతున్నారు. జరిగినవేవో జరిగిపోయాయి. వారనుభవించిన కష్టాలు మరిచిపోవడానికి సిద్ధంగా ఉన్నారు. యుద్ధం చేయడం వారికి ఇష్టం లేదు. యుద్ధం వల్ల మంచి కన్నా సర్వ నాశనమే ఎక్కువ జరుగుతుందని వారికి తెలుసు. కనుక వారికి రావలసినవన్నీ వారికి ఇవ్వండి. ఇలా చేయడం న్యాయ సమ్మతం. ఇదివరలో అనుకున్న ఒప్పుదల ప్రకారం ఉంటుంది. కనుక ఈ విషయంలో ఎలాంటి జాగూ చేయవద్దు" అని రాయభారి చెప్పాడు. ఈ మాటలు విని, బుద్ధిమంతుడూ, ధైర్యవంతుడూ అయిన భీష్ముడు అందుకుని.. "దైవ కృప వల్ల పాండవులు బాగున్నారు. చాలా మంది రాజుల దన్ను కలిగి ఉన్నప్పటికీ, యుద్ధం చేయడానికి బలవంతులైనప్పటకీ, వారు యుద్ధోన్ముఖులై లేరు. ఇప్పటికీ వారు శాంతినే కోరుతున్నారు. వారి ఆస్తి వారికి అప్పగించడమే ఇప్పుడు చేయాల్సిన పని.." అంటూ ఏదో చెప్పబోతుండగా కోపంతో కర్ణుడు లేచి, రాయభారితో ఇలా అన్నాడు. "నీవు చెప్పేదానిలో ఏదైనా కొత్త అంశమున్నదా. పాత కథే చెప్పడం వల్ల ప్రయోజనమేముంది? జూదంలో తాను పోగొట్టుకున్న ఆస్తిని మళ్లీ అది నాదే అని ఇప్పుడెలా అనగలరు?. మత్స్య, పాంచాల రాజుల దన్ను చూసుకొని యుధిష్టరుడు ఇలా ధర్మోక్తులు పలుకుతూ నాది నాది అంటూ కోరరానిది కోరుతున్నాడు. దుర్యోధనుడి నుంచి ఏదీ భయపెట్టి తీసుకోలేరు. ఈ సంగతి నేను నీకు చెపుతున్నాను. పదమూడేళ్ల కాలంలో వారంతా ప్రచ్ఛనంగా ఉండటానికి బాస చేసి పాండవులు అలా చేయలేదు. తిరిగి వారు మళ్లీ పదమూడేళ్ల కాలం ప్రచ్ఛన్న జీవితం గడిపి రావలసిందే" అన్నాడు. దీనికి భీష్ముడు అడ్డు వస్తూ.. "ఓ రాధేయా, నీవు బుద్ధి లేకుండా మాట్లాడుతున్నావు. ఈ దూత చెప్పన ప్రకారం మనం చేయనప్పుడు మన పైన యుద్ధం వచ్చి పడుతుంది. అలా జరిగితే మనకు పరాజయం తప్పదు. దుర్యోధనుడు సహా మనమందరమూ చావ వలసిన వాళ్లమే" అన్నాడు. దీంతో సభలో కలకలం రేగింది. ధృతరాష్ట్రుడు కలగజేసుకున్నాడు. రాయభారి నుద్దేశించి.. "ప్రపంచ ఉపకారాన్ని, పాండవుల క్షేమాన్ని నేను దృష్టిలో ఉంచుకొని సంజయుణ్ణి

వారి వద్దకు పంపాలని నిశ్చయించాను. తమరు వెళ్లి యుధిష్టరుడితో ఈ విషయం చెప్పండి" అన్నాడు.

తరువాత దృతరాష్ట్రుడు సంజయుణ్ణి పిలిచి.. ప్రత్యేకంగా తన ఆజ్ఞలను తెలియజేశాడు. "సంజయా, నీవు పాండవుల వద్దకు వెళ్లు. వారికి నా ప్రేమ వాంఛలను తెలుపు. కృష్ణ, సాత్యకి, విరటుణ్ణి అడిగినట్లు చెప్పు. అక్కడున్న రాజులందరికీ నా గౌరవ మర్యాదలను అందజేయి. నా పక్షాన నీవు పాండవుల వద్దకు వెళ్లి సౌమ్య వాక్యాలతో వారు యుద్ధం మానేటట్లుగా చేయి" అన్నాడు. సంజయుడు శాంతి దౌత్యానికి యుధిష్టరుడి వద్దకు వెళ్లాడు. ప్రారంభ అభివాదాలు, ఆలింగనాలు, కుశలాలు తరువాత యుధిష్టరుడి కొలువులో తన దౌత్యం గురించి చెప్పడం ప్రారంభించాడు.

"ఓ ధర్మ పుత్రా, నిన్ను నా కనులారా చూసే భాగ్యం లభించినందుకు నేను చాలా అదృష్టవంతుణ్ణి. రాజులు పరివేష్టించి ఉండ, నీవు ఇంద్రునిలా దర్శనమిస్తున్నావు. ఈ దృశ్యం నాకు ఆనందదాయకమైనది. రాజు దృతరాష్ట్రుడు మీకు తన ఆశీర్వచనాలు తెలియజేయమన్నారు. మీరంతా ఆనందంగా, ఆరోగ్యంగా ఉండాలని తెలుపమన్నారు. ఆంబికేయుడు యుద్ధ ప్రసంగాన్ని అసహ్యించుకొంటున్నాడు. నీ స్నేహాన్ని కోరుతూ శాంతి కోసం మిక్కిలి కోరికతో ఉన్నాడు" అని చెప్పాడు. సంజయుడు చెప్పింది విని యుధిష్టరుడు సంతోషించాడు. "దృతరాష్ట్రుడి పుత్రులు క్షేమంగా ఉన్నారని భావిస్తున్నాను. మనమంతా ఒక సంఘాత మరణం నుంచి రక్షించబడ్డాము. నేను కూడా యుద్ధాన్ని కోరుకోవడం లేదు. శాంతినే అభిలషిస్తున్నాను. మా రాజ్యాన్ని మాకు ఇచ్చేస్తే, మేం పడ్డ కడగండ్ల స్మృతులన్నీ తుడిచివేసుకుంటాము" అన్నాడు. సంజయుడు.. "దృతరాష్ట్రుని కుమారులు పెడదోవబట్టి మూర్ఖతతో ఉన్నారు. వారి తండ్రి సలహాలను, తాత బుద్ధి వాక్యాలను లక్ష్య పెట్టక వారు మునుపటి మాదిరిగానే క్రూర స్వభావంతో ఉన్నారు. నీవు మాత్రం శాంతాన్ని, ఓరిమిని విడిచిపెట్టొద్దు. యుధిష్టరా!, ఎల్లప్పుడూ నీవు ధర్మ మార్గానే నిలిచి ఉంటావు. యుద్ధమూ, దాని వల్ల వచ్చే చెడూ మనం విస్మరించొద్దు. యుద్ధం చేసి అందరినీ చంపి రాజ్యాన్ని సంపాదించి దాన్నుంచి మంచి ఏమి పొందగలం?. కనుక యుద్ధ యత్నాలను ప్రారంభించవద్దు" అన్నాడు. దానికి యుధిష్టరుడు.. "సంజయా, నీవు చెప్పేది నిజమే. ధర్మ మార్గంలో నిలబడటం గొప్ప విషయమే. కానీ మేం తప్పులు చేస్తున్నామా?. ధర్మం, న్యాయం, సూక్ష్మత శ్రీకృష్ణుడికి తెలుసు. ఇరు పక్షాల క్షేమం కోరేవాడు. వాసుదేవుడు ఎలా చెప్తే అలాగే చేస్తాను" అన్నాడు. శ్రీకృష్ణుడు అందుకొని.. "నేను పాండవుల క్షేమాన్నే కోరతాను. దృతరాష్ట్రుడు, అతని కుమారులు కూడా సౌఖ్యంగా ఉండాలనే కోరుకుంటాను. ప్రస్తుత అంశాలు చాలా కష్ట, క్లిష్టతరమైనవి. నేనే స్వయంగా

హస్తినాపురం వెళ్తే ఈ వ్యవహారాన్ని పరిష్కరించగలనని నాకు తోస్తున్నది. పాండవుల క్షేమానికి అడ్డు రాకుండా కౌరవుల నుంచి నాకు శాంతి మార్గం దొరికితే, అంతకన్నా గొప్ప ఆనందం నాకు లేదు. అలా చేయడంలో నేను జయం పొందితే, కౌరవులు మృత్యుముఖం నుంచి బయటపడినట్లే. శాంతి మార్గంలో పాండవులు వారికి రావలసింది వారు పొందినా, దృతరాష్ట్రుణ్ణి భక్తితోనే సేవిస్తూ ఉంటారు. వారు మరేమీ కోరరు. కానీ అవసరమైతే యుద్ధానికి వారు సిద్ధంగానే ఉన్నారు. శాంతి-యుద్ధం ఈ రెండింటిలో దృతరాష్ట్రుడికి ఏది కావాలో అదే ఎన్నుకుంటాడు" అన్నాడు. యుధిష్టరుడు.. సంజయుడినుద్దేశించి, "సంజయా, నీవు కౌరవ సభకు తిరిగి వెళ్లి అంబికేయుడితో నామాటగా ఇలా చెప్పు. "మేము చిన్నవాళ్లుగా ఉన్నప్పుడు, నీ ఔదార్యం వల్లనే కదా మాకు రాజ్య భాగం వచ్చింది. ఒకమారు నన్ను రాజుగా చేసిన నీవు, ఇప్పుడు మా భాగం మాకు లేదని, మమ్మల్ని ముష్టి బతుకు బతకమని, ఇతరుల దాతృత్వంతో జీవించమని ఎలా చేయగలవు? ప్రియమైన నా పెదతండ్రీ, ఈ ప్రపంచంలో ఉండటానికి మాకూ, కౌరవులకూ చాలా దేశాలున్నాయి. కనుక మన ఇరువురి మధ్య శత్రుత్వం వద్దు. ఈ ప్రకారంగా మా పక్షాన నీవు దృతరాష్ట్రుడికి వివరించాలి. పితామహునికి నా ప్రేమ, వందనాలను తెలియజేయి. తన మనుమలు అందరినీ సౌఖ్యంగా, తగవులు లేకుండా ఉండగలిగే మార్గాన్ని చూడమని చెప్పు. ఈ కోరికనే విదురునికీ చెప్పు. మా అందరికీ ఏది మంచి మార్గమో ఆయనకే బాగా తెలుస్తుంది. కనుక అతడేదైనా సలహా ఇస్తాడు. దుర్యోధనుడికి ఈ పరిస్థితి అంతా చెప్పు. నా మాటగా ఇలా చెప్పు. ప్రియమైన తమ్ముడా.. రాజ్యాన్ని పాలించే రాజకుమారులమైన మమ్మల్ని, మృగ చర్మాలను ధరింపచేసి అడవుల్లో నివసించేటట్లు చేశావు. గొప్ప రాజ్య సభా మధ్యలో మా భార్యకు అపచారం చేసి బాధ పెట్టావు. వీటన్నిటినీ మేం శాంతింతో భరించాం. ఇప్పుడు న్యాయ సమ్మతంగా మాకేది వస్తుందో దానిని ఇవ్వు. ఇతరుల సొత్తు కోరబోకు. మేం ఐదుగురం. అథమం ఐదూళ్లిచ్చి శాంతిని నెలకొల్పు. మేం సంతృప్తి చెందుతాం. సౌఖ్య మార్గమైనా, యుద్ధమైనా మేం సిద్ధంగానే ఉన్నామని చెప్పు" అని కురు రాజ్య సభలో చెప్పాల్సిన విషయాలన్నిటినీ సంజయుడికి కూలంకషంగా వివరించాడు యుధిష్టరుడు. సంజయుడు శ్రీకృష్ణుడి వద్ద, పాండవుల వద్ద సెలవు తీసుకొని హస్తినాపురం తిరిగి బయలుదేరాడు.



పాండవులకు సూదిమొన నేల కూడా
ఇవ్వబోనని చెబుతున్న దుర్యోధనుడు

## అధ్యాయం - 54

# సూదిమొన భూ భాగమూ ఇవ్వబోం

**పాం**డవుల వద్దకు సంజయుణ్ణి రాయభారిగా పంపిన తరువాత దృతరాష్ట్రుడు ఆందోళనకూ, భయానికీ లోనై రాత్రంతా నిద్రలేకుండా గడిపాడు. విదురుడికి వార్త పంపి రాత్రంతా అతడితో మాట్లాడుతూనే ఉన్నాడు. "పాండవుల రాజ్య భాగం వారికి ఇవ్వడమే సరైనది. ఇది చేస్తేనే ఉభయులకూ శ్రేయస్కరం. పాండవులనూ, నీ కుమారులనూ ఒకే రీతిగా చూడు. ఈ సమయంలో సరైన మార్గం ఇదే" ఈ ప్రకారంగా చాలా సేపు విదురుడు.. దృతరాష్ట్రునికి వివరించాడు.

మరునాటి ఉదయానికి సంజయుడు హస్తినాపురానికి చేరాడు. యుధిష్టరుడు సభలో చెప్పిన విషయాలన్నిటినీ దృతరాష్ట్రుడికి వివరించాడు. "ముఖ్యంగా అర్జునుడు ఏమన్నాడో దుర్యోధనుడు తెలుసుకోవాలి. శ్రీకృష్ణుడు, నేనూ.. దుర్యోధనుణ్ణి సపరివారంగా దుంప నాశనం చేస్తాం. దీనిపై ఎలాంటి పొరబాటు పడకు. గాండీవం

యుద్ధం కోసం పరితపిస్తోంది. నా అమ్ముల పొదిలోని బాణాలు కూడా తొంగి చూస్తూ తొందర చేస్తున్నాయి. యుద్ధం ఎప్పుడు ఎప్పుడా అని అడుగుతున్నాయి. దుష్ట నక్షత్రాలు మూఢుడైన దుర్యోధనుణ్ణి.. నాతోనూ, శ్రీకృష్ణుడితోనూ యుద్ధానికి ప్రేరేపిస్తున్నాయి. ఇంద్రుడు, దేవతలు కూడా మమ్ములను జయించలేరు" అని అర్జునుడు చెప్పినట్లుగా సంజయుడు సభలో తెలియజేశాడు. శ్రీకృష్ణార్జుల ఐక్య బలాన్ని ఎదురించొద్దని దృతరాష్ట్రుడికి భీష్ముడు హితవు పలికాడు. పాండవులందరినీ చంపుతానని నీ కుమారుడితో ధంబాలు పలికే కర్ణుడు.. పాండవులతో చిన్నమెత్తు సరితూగలేడు. కర్ణుడి మాటలు విని నీ కుమారులు నాశనమయ్యే మార్గం పడుతున్నారు. విరట రాజు పట్టణంపై నీ కుమారుడు దండయాత్ర చేసినప్పుడు అర్జునుడితో తరమబడి గర్వభంగం పొందాడు. అప్పుడు కర్ణుడేమి చేయగలిగాడు? గంధర్వులు నీ కొడుకుని ఎత్తుకొనిపోయి ఖైదీని చేయగా ఈ మహా ప్రతాపుడైన కర్ణుడు ఎక్కడ దాక్కున్నాడు?. అప్పుడు అర్జునుడు కదా గంధర్వులను పారదోలినది" అని భీష్ముడు.. కర్ణుడిని నిందించి కౌరవులను జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించాడు. దృతరాష్ట్రుడు అందుకుని.. "కుటుంబ వృద్ధ పితామహుడు చెప్పినదే మనం అనుసరించదగినది. బుద్ధిమంతులంతా సౌఖ్య మార్గంలో రాజీ పడటమే ఉత్తమమని చెపుతారు. నేను కూడా అలాగే తలుస్తాను. కానీ నేనేమి చేయగలను?. ఈ బుద్ధిహీనులు నేనెంత నొక్కి చెప్పినా వినక, వారి మార్గాన్నే నడుస్తున్నారు" అన్నాడు. ఈ సంభాషణంతా విన్న దుర్యోధనుడు లేచి, "తండ్రీ మా క్షేమం గురించి నీవు ఆందోళన చెంది కంపించనక్కర లేదు. మేమెంత బలం కలవాళ్లమో మాకు తెలుసు. యుద్ధంలో మా విజయం నిశ్చయం. ఈ విషయం యుధిష్టరుడికి కూడా తెలుసు. ఎందుకంటే.. రాజ్యం గురించి ఆశ వదిలి కేవలం ఐదూళ్లు ఇస్తే చాలని వేడుకొంటున్నాడు. దీనిబట్టి చూస్తే అతడు.. మన పదకొండు అక్షౌహిణుల సైన్య బలం గురించి భయపడినట్లు రూఢి అవుతున్నది. పాండవులు మన పదకొండు అక్షౌహిణుల సైన్యాన్ని ఎలా ఎదుర్కొంటారు?. నీ వెందుకు మా జయాన్ని శంకిస్తున్నావు?" అని తండ్రిని ప్రశ్నించాడు. "రాకుమారా, మనకు యుద్ధం వద్దు. అర్ధ రాజ్యంతో సంతృప్తి చెందుదాము. ఆ రాజ్యాన్ని మనం సక్రమంగా పరిపాలిస్తే చాలు" అని దృతరాష్ట్రుడు అనడంతోనే దుర్యోధనుడు లేచి, "సూది మొన మోపినంత భూ భాగాన్ని కూడా పాండవులకు ఇచ్చేది లేదు" అని గట్టిగా ప్రకటించి సభ నుంచి వెళ్లిపోయాడు. తరువాత సభ నుంచి అందరూ వెళ్లిపోయారు.

సంజయుడు హస్తినకు తిరిగి వెళ్లాక పాండవులు సమాలోచనలో పడ్డారు. "వాసుదేవా.. సంజయుడు దృతరాష్ట్రుడి వంటి స్వరూపం వంటివాడు. అతడు మన

సభలో చెప్పిన మాటల వల్ల ధృతరాష్ట్రుడి మనసు గ్రహించాను. మనకే భాగమూ ఇవ్వకుండా శాంతి చేకూరితే చాలని తలస్తున్నాడు. సంజయుడు ప్రారంభించిన సంభాషణనుబట్టి అమాయకత్వంతో నేను కొంత సంతోషం చెందాను. రానురానూ అతడి మాటల వల్ల నేను ఆనందించడానికి కారణం లేదని గ్రహించాను. తరువాత సంజయుడు ఒక మధ్యే మార్గాన్ని సూచించి శాంతి అవసరమని అన్నాడు. మనకు న్యాయంగా హక్కుగల రాజ్య భాగాన్ని వారివ్వకపోయినా, మనం శాంతంగా ఉండటమే మంచిదని మన శాంత స్వభావాన్ని పొగిడాడు. ధృతరాష్ట్రుడు మన పట్ల సవ్యంగా వ్యవహరించడం లేదు. ఉపద్రవం దగ్గర పడుతోంది. మమ్మల్ని రక్షించడానికి నీవు తప్ప మాకెవ్వరూ లేరు. ఐదు గ్రామాలు ఇచ్చినా మేం సంతోషిస్తామని కూడా చెప్పి పంపాను. ఆ దుర్మార్గ కౌరవులు అది కూడా నిరాకరిస్తారు. ఆ నిరాకరణను మేమెలా సహిస్తాం?. ఈ సందర్భంలో నీవే మాకు ఉపదేశం చేయాలి. ఇప్పుడు మేం చేయదగిన పని ఏదో, ధర్మయుక్తంగా, రాజకీయ యుక్తంగా మాకు మార్గాన్ని చూపడం నీకు తప్ప ఇతరులకు తెలియదు." దానికి శ్రీకృష్ణుడు అందుకుని.. "మీ ఇరు పక్షాల వారికి శుభం కలిగేలా చేయడానికి నేనే హస్తినాపురం వెళ్లడానికి నిశ్చయించాను. నా సందేశం జయప్రదమైతే సర్వ ప్రపంచానికి శ్రేయస్సు కలుగుతుంది" అన్నాడు. ఇందుకు యుధిష్టరుడు.. "కృష్ణా, దయచేసి నీవు వెళ్లకు. ఇప్పుడు నీవు శత్రు స్థానానికి వెళ్లడం వల్ల మాకేమి మంచి చేకూరుతుంది?. పెడబుద్ధి గల దుర్యోధనుడు తన చెడు బుద్ధిని వీడకున్నాడు. ఇటువంటి నీచుల మధ్యకు నీవు వెళ్లడానికి నాకు ఇష్టం లేదు. నీ ఆత్మ రక్షణను శంకింపగల పరిస్థితిలోకి నిన్ను వెళ్లనివ్వము. కౌరవులు ఏ పని చేయడానికైనా జంకరు" అన్నాడు. శ్రీకృష్ణుడు.. "ధర్మపుత్రా దుర్యోధనుడెంత దుర్మార్గుడో నాకు తెలుసు. అయినా శాంతి చేకూర్చడానికి చేయదగిన అన్ని ప్రయత్నాలూ చేయాలి. అలా చేయడం వల్ల, యుద్ధం తప్పించే మార్గం కోసం మనం ఏ ప్రయత్నమూ చేయలేదన్న అపవాదు తప్పుతుంది. మన ప్రయత్నం సఫలం కాదని మనం ఎంత తలచినా, చేయాల్సిన ప్రయత్నమేదీ మానకూడదు. నా శరీర రక్షణ విషయమై నీవు భయపడవొద్దు. శాంతి దూతనైన నా పట్ల కౌరవులు దౌర్జన్యకరంగా ప్రవర్తిస్తే భస్మం చేస్తాను" అన్నాడు. "నీవు సర్వ జ్ఞానివి. మా హృదయాలు, కౌరవుల హృదయాలూ తెలిసినవాడివి. వ్యవహారాన్ని వ్యక్త పరచడంలోనూ, ప్రోత్సహించడంలోనూ నిన్ను మించినవారు మరొకరు లేరు" అన్నాడు యుధిష్టరుడు. "అవును. మీ ఇరువురూ నాకు తెలుసు. నీ మనసు ధర్మ మార్గమే పడుతుంది. వారి మనసు పగ, ఓర్వలేనితనం, శతృత్వంలో మునిగి

ఉంటుంది. నీకు ప్రియమైన మార్గంలోనే నేను కార్యాన్ని సాధించడానికి ప్రయత్నిస్తాను. పర్యవసానం నీకేమీ గొప్ప ఫలితం లేకపోయినా, యుద్ధం రాకుండా ప్రయత్నిస్తాను. మంచి శకునాలు తోచడం లేదు. యుద్ధాన్నే సూచిస్తున్నాయి. అయినా శాంతి నెలకొల్పే ప్రయత్నం చేయడం మన కర్తవ్యం కనుక చేయక తప్పదు" అన్నాడు శ్రీకృష్ణుడు.

ఇలా పలికిన శ్రీకృష్ణుడు పాండవుల వద్ద సెలవు తీసుకొని రథంపై హస్తినాపురానికి బయలుదేరాడు.

శ్రీకృష్ణ రాయబారం



## అధ్యాయం - 55

# శ్రీకృష్ణ రాయబారం

**శ్రీ**కృష్ణుడి వెంట సాత్యకి కూడా హస్తినాపురం వెళ్లాడు. తన ప్రయాణానికి ముందు శ్రీకృష్ణుడు పాండవులతో చాలా సేపు చర్చించాడు. మహాబలుడైన భీముడు కూడా శాంతియుత సంప్రదింపులకు మొగ్గు చూపడం ఆశ్చర్యకరమైన అంశం. "వంశ నిర్మూలన కాకూడదు. కనుక శాంతినే కోరాలి" అని భీముడు చెప్పి వెళ్లాడు. దీన్ని వ్యాసుడు ఇలా సమర్థించాడు. "వాస్తవంగా గొప్ప వీరులు కూడా శాంతినే కోరేవారు. అలా కోరడం వారి భయం వల్ల కాదు" అని సమర్థించాడు. కానీ ద్రౌపది తనకు జరిగిన భంగపాటును మరువలేదు. ఆమె విరబోసుకున్న తన కురులను చేతితో పట్టుకొని శ్రీకృష్ణుడికి ఎదురుగా నిలబడి దు:ఖంతో.. "మధుసూదనా, నా శిరోజాలు చూడు. ఆ తరువాత గౌరవం నిలుపుకోవడానికి ఏమి చేయాలో అది చేయి. అర్జునుడు, భీముడు యుద్ధాన్ని వ్యతిరేకించినా, నా తండ్రి వృద్ధుడైనా నా కుమారుల సాయంతో యుద్ధానికి వెళ్తాడు. నా తండ్రి కూడా వెళ్లాల్సిన పనిలేదు.

సుభద్ర కుమారుడు అభిమన్యుణ్ణి ముందుపెట్టి నా కుమారులు కౌరవులతో యుద్ధం చేస్తారు. ధర్మ పుత్రుని కోసం ఈ పదమూడు సంవత్సరాలు నా క్రోధ జ్వాలలను నాలోనే ఇముడ్చుకున్నాను. ఇంక నేను ఆగలేను" అంటూ ద్రౌపది తనకు జరిగిన అవమానాన్ని తలుచుకొని ఏడ్చింది. శ్రీకృష్ణుడు చాలా కనికరంతో.."ఏడవకు. నేను సంప్రదించే శాంతి ప్రకటనకు దృతరాష్ట్రుడి కుమారులు ఇష్టపడరు. వారంతా మృత్యుముఖాన పడుతున్నారు. వారి మృత కళేబరాలు వెర్రి కుక్కలకు, నక్కలకు ఆహారం అవుతాయి. నీవు పాండవుల విజయాన్ని చూస్తావు. నీకు జరిగిన అవమానానికి తగిన ప్రాయశ్చిత్తం అతి స్వల్పకాలంలోనే జరుగుతుంది" అన్నాడు. దీంతో ద్రౌపది ఎంతో సంతోషించింది.

ఆ రాత్రి శ్రీకృష్ణుడు కుశస్థలిలో బస చేశాడు. శ్రీకృష్ణుడు హస్తినాపురం వస్తున్నాడనే వార్త తెలిసి పట్టణంలో అలజడి ప్రారంభమైంది. శ్రీకృష్ణుణ్ణి బాగా ఆహ్వానించే ఏర్పాట్లును, పట్టణమంతా అలంకరించే ఏర్పాట్లను దృతరాష్ట్రుడు చేయించాడు. ఇవన్నీ బహువేగంతో జరిపించాడు. దుర్యోధనుడి మందిరం కంటే పెద్దదీ, అందమైనదీ అయిన దుశ్శాసనుడి మందిరాన్ని బాగా అలంకరింప చేయించాడు. అందులో శ్రీకృష్ణుడికీ, అతని పరివారానికీ విడిదిగా ఇవ్వదలిచాడు. పట్టణంలో శ్రీకృష్ణుడు రథం వచ్చే మార్గానికి అక్కడక్కడా షామియానాలు ఏర్పాటు చేయించాడు. దృతరాష్ట్రుడు విదురుని సంప్రదించాడు. "గోవిందునికి రథాలు, ఏనుగులు బహూకరించే ఏర్పాట్లు చూడు. ఇంకా ఇతర బహుమానాలు కూడా సిద్ధం చేయి" అన్నాడు. దానికి విదురుడు.. "నీవిచ్చే బహుమానాలకు శ్రీకృష్ణుడు అమ్ముడుపోడు. కురు రాజ్యానికి అతడెందుకు వస్తున్నాడో అది అతడికి ఇవ్వు. అతడు శాంతి సందేశం, సంప్రదింపులకు కదా వస్తున్నాడు. అది ఫలవంతం అయ్యేటట్లు చూడు. అంతేగాని బహుమతులేవీ అతణ్ణి సంతోషపెట్టవు" అన్నాడు.

శ్రీకృష్ణుడు హస్తినాపురానికి చేరుకున్నాడు. పట్టణ వీధులన్నీ అలంకరించబడి ఉన్నాయి. అతణ్ణి చూడటానికి వచ్చిన జనంతో రోడ్లన్నీ కిక్కిరిసిపోయాయి. దీంతో శ్రీకృష్ణుడు రథాన్ని మెల్లగా నడుపుకొని రావలసి వచ్చింది. కృష్ణుడు ముందు దృతరాష్ట్రుడి మందిరానికి, తరువాత విదురుడి మందిరానికి వెళ్లాడు. అక్కడ కుంతీ దేవి ఆయన్ను కలిసింది. తన కుమారుల కష్టాల గురించి ప్రస్తావించి దు:ఖితురాలైంది. శ్రీకృష్ణుడు ఆమెను ఓదార్చి అక్కణ్ణుంచి సెలవు తీసుకొని దుర్యోధనుడి మందిరానికి వెళ్లాడు. దుర్యోధనుడు.. శ్రీకృష్ణుడికి తగిన మర్యాదలు చేశాడు. భోజనానికి కూడా ఆహ్వానించాడు. కానీ శ్రీకృష్ణుడు.. "రాయభారం, పాండవుల సందేశం నెరవేరిన తరువాత నీ విందు చేయొచ్చు" అంటూ దుర్యోధనుడి ఆహ్వానాన్ని నిరాకరించి విదురుని

ఇంటికి వెళ్లాడు. అక్కడ తన మార్గాంతర విశ్రాంతిని తీసుకున్నాడు. ఆ సందర్భంగా వారిరువురూ సంప్రదింపులు జరిపారు. తన వద్ద ఉన్నారన్న కారణంగా భీష్ముడు, ద్రోణుడు తన పక్షం వాళ్లవుతారనీ, వారలా తన పక్షాన ఉంటే తనను ఎవరూ ఓడించలేరని దుర్యోధనుడికి బాగా నమ్మకం. ఇవే అతడి నిర్లక్ష్యానికి, గర్వానికి కారణం. ఆ దుర్మార్గుడి సభకు గోవిందుడు వెళ్లడం పొరబాటని విదురుడు చెప్పాడు.

"దుర్యోధనుణ్ణి, అతడి అనుచరులను తెలిసి ఉన్న వారందరూ ఏదైనా మయోపాయం పన్ని ఎలాగైనా శ్రీకృష్ణుడికి హాని చేయగలడని అనుకుంటున్నారు" అన్నాడు విదురుడు. దీనికి శ్రీకృష్ణుడు.. "దుర్యోధనుడి విషయంలో నీవు చెప్పిందంతా నిజమే. నేను శాంతియుత రాజీ మార్గంలో కార్యాన్ని సాధించగలనని తలంచి ఇక్కడకు రాలేదు. ప్రపంచం నాపై నిష్ఠురం వేయకుండా ఉండేందుకే ఇక్కడికి వచ్చాను. నా ప్రాణం గురించి మీరు ఎలాంటి భయమూ చెందనవసరం లేదు" అన్నాడు.

మరునాడు ఉదయం దుర్యోధనుడూ, శకునీ శ్రీకృష్ణుడి వద్దకు వచ్చారు. దృతరాష్ట్రుడు.. శ్రీకృష్ణుడి కోసం నిరీక్షిస్తున్నాడని చెప్పారు. శ్రీకృష్ణుడు విదురుడితో కలిసి సభకు వెళ్లాడు.

శ్రీకృష్ణుడు సభలోకి అడుగుపెడుతుండగా సభలోని వారు లేచి నిలుచున్నారు. మందహాసం చేస్తూ పెద్దలవైపు తిరిగి ముకుళిత హస్తాలతో నమస్కరిస్తూ, పక్కనే ఉన్నవారిని పలుకరిస్తూ వెళ్లి తనకోసం వేసిన ఆసనంపై కూర్చున్నాడు. ఉపోద్ఘాతాలయ్యాక శ్రీకృష్ణుడు తన ఆసనం నుంచి లేచి.. దృతరాష్ట్రుడి వైపు తిరిగి తాను వచ్చిన పని గురించి వివరించాడు. పాండవులు కోరిక గురించి వివరంగా చెప్పాడు. "దృతరాష్ట్రా, నీ జనులకు నాశనం తేకు. నీవు.. మంచి కలుగజేసేది చెడ్డగానూ, చెడ్డ కలుగజేసేది మంచిగానూ ఆలోచిస్తున్నావు. నీవు, నీ కుమారులను అణగదొక్కాలి. అది నీ కర్తవ్యం. పాండవులు యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు. అయినా వారికి శాంతి అంటేనే ఇష్టం. వారు సుఖంగా ఉండాలనుకుంటున్నారు. వారిని కూడా నీ కుమారుల మాదిరిగా చూసి న్యాయమైన ఒక మార్గాన్ని చూపించు. ప్రపంచమంతా నిన్ను ప్రశంసిస్తుంది" అన్నాడు శ్రీకృష్ణుడు. "నన్ను నిందింపనవసరం లేదని నా స్నేహితులకు తెలుసు. మాధవుడు ఏమి చెప్పాడో అలా చేయడమే నా కోరిక. కానీ నేను అశక్తుడను. నా దుర్మార్గ కుమారులు నేను చెప్పేది వినరు. కృష్ణా, నీవు దుర్యోధనుడికి సలహా ఇచ్చి బోధపరుచు" అన్నాడు దృతరాష్ట్రుడు. శ్రీకృష్ణుడు దుర్యోధనుడివైపు తిరిగి.. "నీవు గొప్ప వంశంలో జన్మించావు. ధర్మ మార్గాన్ని అనుసరించు. నీ ప్రస్తుతాలోచనలు తగనివి. అవి నీచ జనులకు మాత్రమే తగినవి. నీ మూలంగానే నీ వంశమంతా ధ్వంసం కాబోతున్నది. నీవు యదార్థ వాక్యాలను,

న్యాయాన్ని వింటే, ఆ పాండవులే ధృతరాష్ట్రుణ్ణి రాజుగానూ, నిన్ను యువరాజుగానూ చేసేవాళ్లు. పాండవులకు అర్ధ రాజ్యమిచ్చి వారితో సఖ్యత పడి శాంతిని నెలకొల్పు" అన్నాడు శ్రీకృష్ణుడు. భీష్ముడు, ద్రోణుడు కూడా వాసుదేవుని సలహాను అనుసరించాలని దుర్యోధనుడికి నొక్కి చెప్పారు. కానీ దుర్యోధనుడి హృదయం మెత్తబడలేదు. దీంతో విదురుడు.. "ఈ దుర్యోధనుడు తన దుర్మార్గపు చర్యల పర్యవసానంగా.. పుత్ర శోకం అనుభవించగల ధృతరాష్ట్రుని, గాంధారిని గురించి నేను జాలి పడుతున్నాను" అన్నాడు. ధృతరాష్ట్రుడు తన కుమారుడైన దుర్యోధనుణ్ణి ఉద్దేశించి.. "నీవు గోవిందుని సలహా అనుసరించనప్పుడు మన వంశ మంతా నాశనమవుతుంది" అన్నాడు. ద్రోణ, భీష్ములు కూడా అనేకసార్లు దుర్యోధనుణ్ణి ఒప్పించేందుకు తీవ్రంగా ప్రయత్నించారు.

ఈ అంశంలో ప్రతివారూ తనను శాంతియుత రాజీ మార్గాన్ని అవలంబించాలని నిర్బంధించడంతో దుర్యోధనుడుకి తీవ్ర ఆగ్రహం వచ్చి లేచి నిలబడ్డాడు. "మధుసూదనా! పాండవుల పట్ల నీకున్న ప్రేమతో నన్ను తప్పు చేసిన వాడిగా పరిగణిస్తున్నావు. ఇక్కడ నన్ను ఇతరులు కూడా నిందిస్తున్నారు. కానీ ఈ అంశంలో అణుమాత్రమైనా నేను నిందాపాత్రుణ్ణి కాదు. పాండవులు వారంతవారే స్వేచ్ఛగా జూదంలో రాజ్యాన్ని పణంగా పెట్టి ఓడిపోయినందువల్లే ఆ రాజ్యాన్ని పోగొట్టుకున్నారు. దానికి నేనెలా జవాబుదారీ కాగలను?. వారు ఓటమితో మర్యాదను అనుసరించి అడవికి పోయారు. నేను చేసిన ఏ తప్పుకు వారు యుద్ధం చేస్తామనీ, మమ్మల్ని చంపుతామని అంటారు?. నేనిలాంటి మాటలకు భయపడేవాణ్ణి కాదు. నేను చిన్నవాడిగా ఉన్నప్పుడు... లేశమాత్ర హక్కు కూడా లేని పాండవులకు ఎందుకిచ్చారో కొంత రాజ్యాన్ని పెద్దలు ఇచ్చి మమ్మల్ని అన్యాయం చేశారు. నేనప్పుడు ఊరుకున్నాను. కానీ వారా రాజ్యాన్ని ఆటలో పోగొట్టుకున్నారు. ఆ రాజ్యాన్ని వారికిచ్చేది లేదు. నాలో ఏ తప్పులేదు. నేను పాండవులకు అంగుళం మేర భూమినైనా ఇవ్వను. సూది మొన మోపినంత పాటి స్థలం కూడా ఇవ్వను" అని తెగేసి చెప్పాడు దుర్యోధనుడు.

తానేమీ తప్పు చేయలేదని దుర్యోధనుడు అనడంతో శ్రీకృష్ణుడు నవ్వాడు. "శకునితో నీవు కుట్ర పన్ని వంచించి, పాండవులను జూదానికి పిలిచావు. ఆ తరువాత నీవు రాజసభలో ద్రౌపదిని అవమానించావు. మరి నేనేమీ తప్పు చేయలేదని అనడం సిగ్గుమాలిన మాట" అంటూ దుర్యోధనుడు పాండవులకు వరుసబెట్టి చేసిన ద్రోహాలన్నీ శ్రీకృష్ణుడు సభకు వివరించాడు. భీష్ముడు వంటివారు శ్రీకృష్ణుడు సభకు వివరించే అంశాలన్నిటినీ అంగీకరించడం చూసి దుశ్శాసనుడు తన ఆసనం నుంచి లేచాడు. "సోదరా, ఈ సభలోని వారంతా కుట్ర పన్ని నిన్ను తాళ్లతో బంధించి పాండవులకు అప్పగించేలా ఉన్నారు. మనం ఇక్కణ్ణుంచి వెళ్లిపోదాం" అనడంతో దుర్యోధనుడు

అతనితోపాటు ఆయన తమ్ముళ్లు సభ నుంచి బయటకు వెళ్లిపోయారు. శ్రీకృష్ణుడు సభ వారి నుద్దేశించి.. "అయ్యా, యాదవులు, వృష్ణులు ఇప్పుడు సౌఖ్యంగా జీవిస్తున్నారు. కంసుడు, శిశుపాలుడు చనిపోయారు. సంఘంలో ప్రజలందరినీ అపాయం నుంచి రక్షించడానికి ఒక్కొక్క సమయంలో ఒక్కొక్కరిని చంపడం అవసరమవుతుంది. దేశాన్ని రక్షించుకోవడానికి ఒక్కో గ్రామాన్ని విడిచి వేయడం తరచూ జరుగుతూనే ఉంది కదా. మీరు మీ వంశాన్ని రక్షించుకోవడానికి దుర్యోధనుణ్ణి బలి ఇవ్వాల్సి ఉంటుందని నేను భయపడుతున్నాను. అదొక్కటే మార్గం" అన్నాడు. అంతలో దృతరాష్ట్రుడు.. విదురుణ్ణి ఉద్దేశించి.."దూరదృష్టి ఉన్న గాంధారిని ఈ సభకు తీసుకొని రా. దుర్యోధనుడు ఆమె మాటలు వింటాడు" అన్నాడు. ఆమెకు వర్తమానం వెళ్లింది. సభకు వచ్చింది. సభకు రావలసిందిగా దుర్యోధనుడికి కబురు పంపారు. కోపంతో కళ్లెర్రబడ్డ దుర్యోధనుడు గాంధారి వద్దకు వచ్చాడు. దుర్యోధనుణ్ణి సవ్యమార్గంలోకి తీసుకురావడానికి గాంధారి కూడా శతథా ప్రయత్నించింది. దుర్యోధనుడు లేదంటూ సభ నుంచి మరోసారి వెళ్లిపోయాడు.

దుర్యోధనుడు, ఆయన స్నేహితులు.. శ్రీకృష్ణుణ్ణి బంధించాలని కుట్ర పన్నారు. ఈ వార్త సభకు చేరింది. ఇలా జరగుతుందని తెలిసిన శ్రీకృష్ణుడు నవ్వి తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. శ్రీకృష్ణుడి అనుగ్రహంతో దృతరాష్ట్రునికి తాత్కాలికంగా చూపు వచ్చింది. శ్రీకృష్ణుడి విశ్వరూపాన్ని దేవుడుగా భావించి దర్శించాడు. "పుండరీకాక్షా!. తమ విశ్వరూపాన్ని దర్శించాను. ఇక మరేదీ చూడను. వెంటనే నా అంధత్వం నాకు ఇవ్వు" అని వేడుకున్నాడు. దృతరాష్ట్రునికి పూర్వ స్థితి వచ్చింది. శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి దృతరాష్ట్రుడు.. "మా అందరి ప్రయత్నం వమ్మయింది. దుర్యోధనుడు మొండి పట్టుపట్టాడు" అన్నాడు. శ్రీకృష్ణుడు తన ఆసనం నుంచి లేచి, సాత్యకి, విదురుడు ఇరు పక్కలా ఉండగా సభ నుంచి నిష్క్రమించాడు. తిన్నగా కుంతి వద్దకు వెళ్లి జరిగినదంతా చెప్పాడు. ఆమె శ్రీకృష్ణుడి ద్వారా తన కుమారులకు ఆశీస్సులను పంపింది. ఆమె, "ఏ పనికోసం ఓ క్షత్రియ కాంత బిడ్డలను కంటుందో ఆ పని జరిగే కాలం వచ్చింది. నీవు నా పుత్రులను తప్పక రక్షిస్తావు" అన్నది. శ్రీకృష్ణుడు రథమెక్కి ఉపప్లావ్య పట్టణానికి బయలుదేరాడు. యుద్ధమే నిశ్చయమైంది.

◈

కుంతితో మాట్లాడుతున్న
కర్ణుడు



## అధ్యాయం - 56

# కర్తవ్యం

**శ్రీ**కృష్ణుడు హస్తినాపురం వెళ్లాక, శాంతియుత రాజీ జరుగుతుందేమో అని సంశయించాడు. తిరిగి వచ్చాక అలాంటి సంశయానికి అవకాశం లేదని తేల్చుకున్నాడు. కురు సభలో జరిగినదంతా పాండవులకు చెప్పాడు. ఇక కుంతి కూడా.. మరణంతోనే అంతమయ్యే యుద్ధం నిశ్చమైనదే అని విచారంలో మునిగింది. ఆమెలో అంతర్మథనం మొదలైంది. "నా ఈ ఆలోచనను నా కుమారులకు ఎలా చెప్పగలను? నిందలూ, అపచారాలు భరించండి. మనం ఏ రాజ్యభాగాన్ని అడగొద్దు. యుద్ధం రాకుండా తప్పించుకోండి అని నేను అంటే, క్షత్రియ వీరత్వానికి ఎదురయ్యే ఇలాంటి వాక్యాలను నా కుమారులు ఎలా మన్నిస్తారు?. అదీగాక యుద్ధంలో ఒకొర్నొకరు చంపుకుంటారు. యుద్ధం జయించినా వంశం అంతరించాక సౌఖ్యమేమి ఉంటుంది?. నేనీ దుస్థితిని ఎలా ఎదుర్కోగలను?" అని మనసులో అనుకున్నది. ఒక పక్క వంశ నాశనం, మరోపక్క క్షాత్ర ధర్మం.. ఈ రెంటినీ సాధించలేని పరిస్థితిపై

కుంతి చాలా బాధ పడింది. "భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు వీరు ముగ్గురూ కలిసి ఉంటే నా కుమారులు వారిని ఎలా జయించగలరు?. వారు ఇప్పటికీ పరాజయం ఎరుగని మహావీరులు. వారిని తలుచుకుంటే నాకు వణుకు వస్తుంది. మిగిలిన వారి గురించి అంత భయపడాల్సిన అవసరం లేదు. పాండవులతో యుద్ధం చేసి వారిని చంపగల ఆశ ఉన్నవాళ్లు వారు ముగ్గురే కౌరవ సైన్యంలో ఉన్నారు. వీరిలో ద్రోణుడు ప్రేమ వల్ల, తన శిష్యులను యుద్ధంలో ఎదుర్కోవడానికి, చంపడానికి ఇష్టపడడు. పితామహుడు (భీష్ముడు) వారిని చంపేందుకు ఏ విధంగానూ ఇష్టపడడు. ఇక కర్ణుడే పాండవులకు ముఖ్యమైన శత్రువు. నా కుమారులను చంపి దుర్యోధనుడికి అనందం కలిగించాలనుకుంటున్నాడు. కర్ణుడు మహావీరుడు. అస్త్ర శస్త్ర నిపుణుడు. అతను తన కుమారులకు ఎదురుగా నిలుచొని యుద్ధంలో తలపడటం నన్ను దహించి వేస్తోంది. కర్ణుడికి తన జన్మ గురించి నిజం తెలియజేసే నిమిత్తం అతని వద్దకు వెళ్లడానికి ఇదే తరుణం. తన జన్మ రహస్యాన్ని తెలుసుకున్న కర్ణుడు.. దుర్యోధనుడి పక్షం వీడతాడు" అని కుంతి రకరకాలుగా ఆలోచించింది.

కర్ణుడు ప్రతి రోజూ ప్రార్థన చేసే గంగా తీరానికి కుంతి వెళ్లింది. అక్కడ కర్ణుడు ప్రార్థనలో ఉన్నాడు. తూర్పు దిశగా చేతులు చాచి ఎత్తి అతడు ప్రార్థనలో లీనమై ఉన్నాడు. కుంతి అతని వెనుకే నిశ్శబ్దంగా నిలుచొని వేచి ఉంది. కర్ణుడు ధ్యాన పరవశంలో ఉన్నాడు. సూర్యుని వేడి కిరణాలు తన శరీరానికి తగలగా, అప్పుడు మామూలు స్థితికి వచ్చాడు. తన ప్రార్థన ముగించుకొని వెనుకకు తిరిగి చూశాడు. కర్ణుడి ఉత్తరీయం చివరి భాగాన్ని ఎండ వేడిమి నుంచి రక్షణగా తలపై కప్పుకొని నిలబడి ఉన్న కుంతిని చూశాడు. పాండు రాజు రాణి, పాండవ రాజపుత్రులకు తల్లి అయిన కుంతి అక్కడ తన ప్రార్థన పూర్తయ్యేవరకూ వేచి ఉండటంతో కర్ణుడు తత్తరపాటు చెందాడు, ఆశ్చర్యపోయాడు.

గొప్పవారితో ఎలా సంభాషించాలో తెలిసిన కర్ణుడు, కుంతీ దేవి నుద్దేశించి.. "రాధకు, రథసారధి అయిన అతిరధునకు కుమారుడనైన నేను మీకు వంగి నమస్కరిస్తున్నాను. తమ ఆజ్ఞకోసం వేచి ఉన్నాను. తమకు నేనేమి చేయాలి ఓ మహారాజ్ఞీ?" అన్నాడు. "కర్ణా నీవు రాధ కుమారుడవు కావు. ఆ రథ సారధీ నీ తండ్రి కాడు. నీవు రథ చోదకుని కుటుంబంలో పుట్టినవాడనని తలచొద్దు. నీవు సూర్య కుమారుడవు. పృథ లేక కుంతి అనే రాజకాంత గర్భాన పుట్టినవాడివి. నీకు సకల ఐశ్వర్యాలూ చేరుగాక" అన్నది. తరువాత కుంతి.. కర్ణుడి జన్మ వృత్తాంతాన్ని అతడితో చెప్పింది. "నీవు సహజంగా నిండు కవచంతోనూ, సహజ స్వర్ణ కుండలాలతోనూ జన్మించావు. పాండవులు నీ తమ్ముళ్లు అని తెలియక, దుర్యోధనుడి

పక్షాన చేరి పాండవుల పట్ల పగ పెంచుకొని ద్వేషిస్తున్నావు. దృతరాష్ట్రుడి కుమారులపై ఆధారపడి జీవించడం నీకు తగదు. అర్జునుడితో కలువు. ప్రపంచంలో ఒక రాజువు అనిపించుకో. నీవూ, అర్జునుడూ దుర్మార్గులను శిక్షించండి. ప్రపంచమంతా వచ్చి మీ పాదాల వద్ద ఉంటుంది. బలరామకృష్ణుల కీర్తి వ్యాపించిన మాదిరిగానే మీ ఇద్దరి కీర్తీ దశదిశలా వ్యాపిస్తుంది. నీ అయిదుగురు తమ్ముళ్ల మధ్య నీవుంటే దేవతల మధ్య బ్రహ్మ ఉన్నట్లు ఉంటుంది" అన్నది కుంతీదేవి. తాను సూర్యారాధన చేసిన తరువాత తన తల్లి ఇలా చెప్పడం వల్ల ఆమె మాటలను సూర్యుడు కూడా సమ్మతించినట్లు కర్ణుడు భావించాడు. కొంచెం ఆలోచించాడు. సూర్యుడు తన స్వామి భక్తిని, హృదయ స్థయిర్యాన్ని పరీక్ష చేస్తున్నట్లు భావించాడు. తానేమాత్రం ఈ సుగుణాన్ని వీడకూడదని నిశ్చయించాడు. మనోధైర్యంతో తన స్వలాభాన్ని, తల్లి ప్రేమనూ తనలోనే అణచుకున్నాడు. కుంతీ దేవి నుద్దేశించి.."ప్రేమమూర్తి అయిన తల్లీ, నీవు చెప్పేది ధర్మ విరుద్ధం. నా విద్యుక్తకర్మను మానితే యుద్ధభూమిలో శత్రువు నన్ను గాయపర్చితే, నేను పడే బాధకంటే ఎక్కువగా నన్ను నేను బాధ పెట్టుకున్న వాణ్ణవుతాను. నీవు ఎప్పుడైతే పసికందుగా ఉన్న నన్ను గంగలో తోశావో అప్పుడే నాకు ఉండాల్సిన క్షత్రియోచితమైన హక్కులను కూడా లేకుండా చేశావు. ఇప్పుడు నీవు నాకు క్షత్రియోచిత కర్మల గురించి చెపుతున్నావు. ఏ ప్రేమైతే జీవిత పర్యంతం నాకు శుభం ఇస్తుందో అట్టి మాతృప్రేమ నీవు నాకు ఇవ్వలేదు. ఇప్పుడు నీ ఇతర పిల్లల క్షేమం కోసం ఈ కథంతా నాకు చెప్పావు. ఇప్పుడు నేను పాండవుల్లో కలిస్తే నేను భయపడి అలా చేశానని ప్రపంచమంతా భావించే అవకాశం ఉంది. నేను దృతరాష్ట్ర కుమారుల అన్నం తిన్నాను. వారి కష్టాలను ఎదుర్కొనే వాణ్ణి. వారి నమ్మకాన్ని పొందాను. ఇంకా వారి ఔదార్యానికి, దయకు వేయి విధాల పాత్రుణ్ణయ్యాను. యుద్ధం ప్రారంభ తరుణమైన ఇప్పుడు నేను వారిని వీడితే ఎవరి అన్నం తిన్నానో వారి పట్ల కృతఘ్నుణ్ణి అవుతాను. పాండవుల్లో కలవాలని నీవు కోరుతున్నావు. దృతరాష్ట్ర కుమారులు యుద్ధమనే ఈ ప్రళయం నుంచి ఒడ్డుకు చేర్చగల నావను నేనని చూస్తున్నారు. నేనే వాళ్లను ఈ యుద్ధానికి పురికొల్పాను. ఇప్పుడు నేను ఎలా వారిని వీడి, వారి పట్ల నమ్మకద్రోహం చేయగలను. ఇంతకంటే ఎక్కువగా దుర్నీతి, నీచం, కృతఘ్నత ఉన్నదా?. జీవితంలోనూ, లోకంలోనూ ఇలాంటి నీచానికి మించింది ఉంటుందా?. ప్రియమైన తల్లీ.. నేను వారి రుణాన్ని తీర్చుకోవాలి. అవసరమైతే నా ప్రాణమిచ్చి అయినా సరే వారి రుణాన్ని తీర్చుకుంటాను. అలా చేయకపోతే ఇన్ని సంవత్సరాల నుంచి వారి అన్నాన్ని దొంగిలించిన సామాన్య దొంగను అవుతాను. రాబోయే యుద్ధంలో నాశక్తినంతా నీ కుమారులపైనే నిశ్చయంగా ఉపయోగిస్తాను. నన్ను

నేను దగా చేసుకోలేను. దయచేసి నన్ను క్షమించండి. కానీ నా తల్లి వాదనను పూర్తిగా వృథా పరచలేను. నా కోసం అర్జునుణ్ణి విడిచిపెట్టు. ఈ యుద్ధంలో అతడో నేను చావక తప్పదు. నీ మిగిలిన కుమారులు నన్నేమి చేసినా వారిని చంపను. ఓ వీరమాతా, ఈ యుద్ధంలో నేనో, అర్జునుడో సజీవులమై ఉంటాము. దీంతో నీకు ఐదుగురు కుమారులు ఉన్నట్లవుతుంది" అన్నాడు.

తన ప్రథమ సంతానమైన కర్ణుడు క్షత్రియ ధర్మానుసారంగా ఎంతో దృఢంగా పలికిన మాటలను విన్న కుంతి హృదయంలో కల్లోలం రేగింది. మరో మాట మాట్లాడక తన కుమారుణ్ణి కౌగలించుకొని నిశ్శబ్దంగా అక్కణ్ణుంచి వెళ్లిపోయింది. "ఏది కావాలని భగవంతుడు నిశ్చయించాడో దానికి ఎవరు ఎదురు రాగలరు. నా నలుగురు కుమారులను హింసించనని మాత్రమైనా అతడు మాట ఇచ్చాడు. అదే చాలు. భగవంతుడు అతడికి తప్పక శ్రేయస్సును ఇస్తాడు" అనుకొన్నది కుంతీ దేవి.

◈



పాండవ సైన్యం

అధ్యాయం – 57

# పాండవ సేనా నాయకుడు

**శ్రీ**కృష్ణుడు ఉపప్లావ్య పట్టణాన్ని చేరి పాండవులకు హస్తినాపురంలో జరిగినదంతా వివరించాడు. “ఏదైతే మంచి మార్గమో, ఏదైతే వారికి ఉపయోగకరమో దాన్నే నేను కౌరవులకు నొక్కి చెప్పాను. కానీ అదంతా వృధా అయ్యింది. యుద్ధం తప్ప మరో మార్గాంతరం కనపడటం లేదు. సభలో పెద్దలిచ్చిన సలహాలను మూఢుడైన దుర్యోధనుడు వినలేదు. ఆలస్యం లేకుండా మనం యుద్ధానికి సిద్ధం కావాలి. అందరినీ మింగేయడానికే కురుక్షేత్రం చూస్తోంది. శాంతి మార్గానికి ఇక తావు లేదు. సైన్యాన్ని యుద్ధ సన్నద్ధం చేయండి” అని శ్రీకృష్ణుడు పాండవులకు తెలిపాడు. వారు ఏడు అక్షౌహిణుల సైన్యాన్ని ఆయుత్తం చేశారు. ద్రుపదుడు, విరటుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకి, చేకితానుడు, భీమసేనుడు ఒక్కో ఔక్షహిణికి నాయకత్వం వహించడానికి సిద్ధపడ్డారు. ముఖ్య సేనా నాయకత్వం ఎవరికివ్వాలన్న అంశం చర్చనీయాంశమైంది. చిన్నవాడైన సహదేవుణ్ణి ఉద్దేశించి యుధిష్టరుడు.. “ఈ ఏడుగురిలో ఒకరిని సేనా నాయకుడుగా ఎన్నుకోవాల్సి ఉంది. అతడు ఎలాంటివాడై

ఉండాలంటే, శత్రువును భస్మం చేయగల, భీష్ముణ్ణి ఎదురించి నిలవగలిగేవాడై ఉండాలి. సందర్భానుసారంగా సైన్యాన్ని మళ్లించడానికి అవసరమైన దారులన్నీ తెలిసి ఉండాలి. ఈ ఏడుగురు మహనీయుల్లో ఉత్తమమైనవాడెవరో నీవు సూచించు" అని అడిగాడు. సహదేవుడు అందుకొని.. "ఎవరి సహాయంతో అయితే మనం మారువేషాలతో జీవించామో, ఎవరి ఆధారంతో మనం ఇప్పుడు రాజ్య భాగాన్ని కోరుతున్నామో అలాంటి విరట రాజును ముఖ్య సేనా నాయకుడుగా చెయ్యి" అన్నాడు. నకులుడు అందుకొని, "వయసు, బుద్ధిబలం, వంశ ఘనత, బలాల్లో ద్రుపదుడు అందరినీ మించినవాడు. కనుక ఆయన్ను ముఖ్య సేనా నాయకుడిగా చెయ్యి" అన్నాడు. "ద్రౌపది తండ్రి అయిన ద్రుపదుడు.. భరద్వాజుడి వద్ద విలువిద్య నేర్చాడు. అతడెప్పుడూ ద్రోణుడికి ఎదురుగా యుద్ధం చేయాలని అభిలషిస్తుండేవాడు. రాజులందరి చేతా మన్ననలు పొందినవాడు. తన కుమారుల మాదిరిగా మనకు ఉత్సాహమిస్తున్నాడు. కనుక ఆ ద్రుపదుడే ద్రోణ, భీష్ములకెదురుగా మన సైన్యాన్ని నడపగలడు" అన్నాడు.

యుధిష్టరుడు.. అర్జునుడి అభిప్రాయం అడిగాడు. "యుద్ధ రంగంలో ధృష్టద్యుమ్నుడు ముఖ్య సేనా నాయకుడుగా ఉంటే బాగుంటుందని నా సూచన. అతడు తన ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకోగలడు. ద్రోణుణ్ణి చంపడానికే పుట్టిన మహావీరుడు. పరుశురాముణ్ణి సైతం వెనకకు మరలించిన శక్తియుతుడు. భీష్ముడి బాణాలను ఎదుర్కొని యుద్ధం చేయగలవాడు ధృష్టద్యుమ్నుడొక్కడే. కనుక అతడినే సేనా నాయకుణ్ణి చేయడం సబబు" అన్నాడు. దీన్ని సమర్థించాడు భీమసేనుడు. "ఓ రాజా, అర్జునుడు చెప్పింది నిజం. కానీ శిఖండి జన్మించింది కేవలం భీష్ముణ్ణి చంపడానికే. ఆ శిఖండి ముఖ తేజస్సు పరుశురాముడి ముఖ తేజస్సు మాదిరిగా ఉన్నది. మనలో ఎవరూ కూడా భీష్ముణ్ణి ఓడించలేరు. కనుక శిఖండిని ముఖ్య సేనా నాయకుడుగా ఎన్నుకుంటే బాగుంటుందని నా ఉద్దేశం" అన్నాడు భీముడు. చివరికి యుధిష్టరుడు శ్రీకృష్ణుడి అభిప్రాయం అడిగాడు. "ఇప్పుడు ప్రస్తావించిన యోధులందరూ ముఖ్య సేనా నాయకుడుగా ఎంపిక చేయడానికి తగినవారే. వారిలో ఎవరైనా కౌరవులు భయపడతారు. అన్ని విధాలా ఆలోచిస్తే అర్జునుడి ఎంపిక బాగుందని నాకు అనిపిస్తోంది. కనుక మీ సేనకు ముఖ్య నాయకుడుగా ధృష్టద్యుమ్నుణ్ణి నియమించండి" అని చెప్పాడు శ్రీకృష్ణుడు. ద్రుపదుడి కుమారుడుగా, ద్రౌపదీ స్వయంవరంలో ఆమె కోరుకున్నట్లుగా అర్జునుడికిచ్చి పెళ్లి చేసినవాడు, దుర్యోధనుడి సభలో ద్రౌపది అనుభవించిన అవమానాన్ని, విషాదాన్ని ఆలోచిస్తూ.. అందుకు ప్రతీకార సమయం కోసం నిరీక్షిస్తున్న ధృష్టద్యుమ్నుణ్ణే పాండవులు ముఖ్య సేనా నాయకుడిగా

అభిషేకించారు. వీరుల సింహగర్జనలు, శంఖారావాలు, ఏనుగుల ఘీంకారావాలు అన్ని దిశల నుంచీ మోగాయి. యథోచితంగా చప్పట్లు, ఆకాశాన్ని ధ్వనింప చేసే శబ్దాలతో, యుద్ధ పరికరాలు ధరించి పాండవ సేనలు కురుక్షేత్రంలో ప్రవేశించాయి.



యుద్ధభూమిలో భీష్ముడు

## అధ్యాయం - 58

# కౌరవ ముఖ్య సేనాని

**కౌ**రవ సేనకు ముఖ్య సేనానిగా భీష్ముడు నిలిచాడు. దుర్యోధనుడాయనకు మర్యాదపూర్వకంగా నమస్కరించి శిరస్సు వంచి.. "కార్తికేయుడు దేవతల సేనను యుద్ధంలో నడిపించి విజయం సాధించిన రీతిగా మీరు కూడా మమ్ములను నడిపి విజయాన్ని, కీర్తిని చేకూర్చి పెట్టగలరని మిక్కిలి విశ్వసిస్తున్నాము. ఆబోతు వెనుక నడిచే పశువుల మాదిరిగా మేము మీ వెనుక నడుస్తాము" అన్నాడు. "అలాగే కానివ్వండి" అన్నాడు భీష్ముడు. ఈ సమయంలో నేను చెప్పబోతున్నది జాగ్రత్తగా వినండి. ఏమైనా  ధృతరాష్ట్ర కుమారులైన మీ వలెనే పాండు కుమారులు కూడా సమానమే. నేను నీకిచ్చిన వాగ్దానం మేరకు సేనను నడిపించి నా కర్తవ్యాన్ని పూర్తి చేస్తాను. యుద్ధ రంగంలో ప్రతి రోజూ నా బాణాల వల్ల పదివేల మంది శత్రువులు చస్తారు. కానీ పాండు కుమారులను మాత్రం నేను చంపలేను. ఈ యుద్ధం నా

సమ్మతిపై వచ్చింది కాదు. పాండవులను చంపే విషయం మినహాయించి నేను యుద్ధ భూమిలో చేయగలినదంతా చేస్తాను. ఇంకో విషయం. మిక్కిలి ప్రేమాస్పదుడైన సూర్య పుత్రుడైన కర్ణుడికి.. నేను సేనా నాయకుడుగా ఉండటం ఇష్టముండదు. అతడు నా ఉద్దేశాలనూ ఇష్టపడడు. మీకుగాని ఆ అభిప్రాయం ఉంటే అతణ్ణే ముఖ్య సేనానిగా నియమించండి. ప్రారంభం నుంచే యుద్ధం నడిపించమని కోరండి. నేను దానికి అడ్డు రాను" అని చెప్పి భీష్ముడు మౌనం దాల్చాడు. భీష్ముడికి కూడా కర్ణుడి నడవడిక, మార్గం ఏమాత్రం ఇష్టంలేదు. కర్ణుడు అందుకొని.."భీష్ముడు బతికి ఉన్నంతకాలం నేను బయటే ఉంటాను. ఆయన పోయిన తరువాతే నేను వస్తాను. అప్పుడు అర్జునుడికి ఎదురై అతణ్ణి చంపుతాను" అన్నాడు. భీష్ముడి షరతులు అంగీకరించి ఆయనను ముఖ్య సేనానిగా అభిషేకించారు. వీరి సేన గొప్ప ప్రవాహం మాదిరిగా కురుక్షేత్రం చేరింది.

◈



అక్రూర, ప్రద్యుమ్నులతో కలిసి
యుధిష్ఠరునితో మాట్లాడి అరణ్యావాసం
వెళ్లిన బలరాముడు

## అధ్యాయం - 59

# బలరాముడు

శ్రీకృష్ణుని అన్న కీర్తిమంతుడైన బలరాముడు పాండవులను వారి శిబిరంలోనే కలుసుకున్నాడు. నీలి వస్త్రాలు ధరించి, సింహ గంభీరంతో వస్తున్న హాలాయుధుణ్ణి చూసి.. యుధిష్ఠరుడు, శ్రీకృష్ణుడు, ఇతరులు స్వాగతం పలికారు. బలరాముడు.. దృపదుడికి, విరట రాజుకు నమస్కరించి వచ్చి, యుధిష్ఠరుడి వద్ద కూర్చున్నాడు. "ఆశ, క్రోధం, పగ, వీటితో ఆదరింపబడి, భరత వంశీయులంతా శాంతి సంప్రదింపులు పొసగక యుద్ధానికి దిగారని తెలిసి నేనిక్కడికి వచ్చాను. ధర్మపుత్రా, గొప్ప నాశనం ముందుంది. తెగిపడుతున్న కళేబరాలతో, రక్త ప్రవాహాలతో ఈ భూమి గడ్డ కడుతుంది. క్షత్రియ కులం వారందరినీ పిచ్చెక్కించి అక్కడ చావడానికి ప్రారబ్ధమే ఇక్కడ వారందరినీ కూడబెట్టింది. నేను చాలా పర్యాయాలు కృష్ణుడితో చెప్పాను. మనకు పాండవులు ఎలాగో, దుర్యోధనుడూ అలాగే. మనం వీరి తెలివితక్కువ మూర్ఖపు జగడాల్లో ఏ పక్షానా ఉండొద్దని. కానీ అతడు నా మాట వినలేదు. అర్జునుడి పట్ల అతనికున్న

ప్రేమ, అతన్ని పక్క మార్గం పెట్టినందు వల్ల తాను మీ పక్షాన చేరడమూ, ఈ యుద్ధానికి అతడు అంగీకరించడమూ జరిగింది. నేనూ, కృష్ణుడూ ఎదురెదురుగా ఎలా యుద్ధం చేస్తాము?. భీముడూ, దుర్యోధనుడూ నా శిష్యులు. వారిద్దరి పట్లా నాకు సమాన ప్రేమాభిమానాలున్నాయి. అలాంటి సందర్భంలో నేను ఈ కక్షల్లోకి ఎలా రాగలను? అదీగాక కౌరవులు నశించడం నేను భరించలేను. అన్నిటినీ నశింపచేసే యుద్ధ కాలాగ్నితో నేనెలాంటి సంబంధమూ కలిగి ఉండను. ఈ యుద్ధ మహమ్మారి కారణంగా నాకు ప్రపంచం పట్ల ఏవిధమైన సంతృప్తి లేదు. అందువల్ల నేను తీర్థయాత్రలను సేవించుకోవడానికి వెళ్తాను" అని బలరాముడు హృదయ పరితాపంతో దైవాన్ని తలుస్తూ అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

మహాభారత యుద్ధం నుంచి బలరాముడు వేరవడం వంటి అంశం క్లిష్టమైన పరిస్థితులను సూచిస్తుంది.



రుక్మిణిని అపహరించుకు
పోతున్న శ్రీకృష్ణుడు

## అధ్యాయం - 60

# రుక్మిణి

విదర్భదేశ రాజు భీష్మకుడికి ఐదుగురు కుమారులు, ఒక కుమార్తె సంతానం. కుమార్తె పేరు రుక్మిణి. ఆమె సౌందర్యవతేగాక మంచి యువతి కూడా. శ్రీకృష్ణుడు గురించి విని అతణ్ణి వివాహమాడాలని భావించింది. బంధువులు ఆమె కోరికను అంగీకరించారు. ఆమె పెద్ద సోదరుడు అయిన యువరాజు 'రుక్మి'కి మాత్రం ఇది ఇష్టం లేదు. ఎందుకంటే, అతనికి కృష్ణుడంటే ద్వేషం. సోదరి రుక్మిణిని ద్వారాకా రాజు అయిన శ్రీకృష్ణుడికి ఇచ్చి వివాహం చేయొద్దని, బేది దేశపు రాజు శిశుపాలుడికి ఇచ్చి వివాహం చేయాలని పలుమార్లు తండ్రితో చెప్పాడు. భీష్మకుడు వృద్ధుడైనందువల్ల శిశుపాలుణ్ణి వివాహమాడాల్సిందిగా రుక్మిణిని నిర్బంధిస్తాడని భావించారు. రుక్మిణి అంటే లక్ష్మీదేవి అవతారమే. ఆమె తన హృదయాన్ని శ్రీకృష్ణుడికి అంకింతమిచ్చింది. కానీ అన్న వ్యతిరేకించడంతో భయపడింది. ఈ పరిస్థితి నుంచి బయట పడటానికి ఆమె ధైర్యంతో ఒక ఉపాయాన్ని ఆలోచించింది. సిగ్గు బిడియం

వదిలేసి తాను శ్రీకృష్ణుణ్ణే వివాహమాడటానికి నిశ్చయించానని, ఎలాగైనా శిశుపాలుడితో తన పెళ్లి జరక్కుండా చూడాలని, తనను రక్షించాలని ఒక జాబు రాసి ఓ బ్రాహ్మణుడికి ఇచ్చి శ్రీకృష్ణుడి వద్దకు పంపింది. అతడు ద్వారకకు వెళ్లి, శ్రీకృష్ణుణ్ణి కలిసి రుక్మిణి విచారకర పరిస్థితిని, ఆమె ప్రార్థనను విన్నవించాడు. రుక్మిణి పంపిన జాబులో ఇలా ఉంది. 'నా హృదయం ఇదివరకే మిమ్మల్ని ప్రభువుగా, నాథుడిగా అంగీకరించింది. శిశుపాలుడు నన్ను బలవంతంగా ఎత్తుకుపోకుండా మీరొచ్చి నాకు సహాయం చేయాలని ప్రార్థిస్తున్నాను. ఈ విషయంలో జాగు చేయొద్దు. కనుక మీరు రేపటికల్లా ఇక్కడ ఉండాలి. శిశుపాలుడి, జరాసంధుడి సేనలు మిమ్మల్ని ఎదుర్కొంటాయి. నన్ను రక్షించడానికి ఆ సైన్యాలను మీరు ఓడించాల్సి ఉంటుంది. ఈ కార్యంలో మీరే జయప్రదమవుతారని, నన్ను మీ వెంట తీసుకొని వెళ్తారని భావిస్తున్నాను. నా అన్న నన్ను శిశుపాలుడికిచ్చి పెళ్లి చేయడానికి నిశ్చయించాడు. ఈ వివాహ సందర్భంలో ఆచారంలో భాగంగా నేను నా పరిజనులతో పార్వతిని ఆరాధించడానికి ఆలయానికి వెళ్తాను. ఆ అదునులో మీరు వచ్చి నన్ను తీసుకువెళ్లి రక్షించండి. మీరు సకాలంలో రాకపోతే నేను ప్రాణాలు తీసుకుంటాను. రాబోయే జన్మలోనైనా తమరిని కలుసుకోగలను" అని రుక్మిణి కృష్ణుడికి జాబు రాసింది. దానిని చదవడంతోనే శ్రీకృష్ణుడు రథమెక్కాడు.

రాజాజ్ఞ ప్రకారం విదర్భ ముఖ్యపట్టణమైన కుండిన పురమంతటినీ శోభాయమానంగా అలంకరించారు. రాజకుమారి రుక్మిణిని శిశుపాలునికి ఇచ్చి వివాహం చేసే ప్రయత్నాలు సంపూర్ణంగా జరుగుతున్నాయి. శిశుపాలుడు శ్రీకృష్ణుడికి శత్రువు. శిశుపాలుడు తన పరివారంతో ఇంతకుముందే కుండిన పురానికి చేరుకున్నాడు. శ్రీకృష్ణుడొక్కడే హఠాత్తుగా ఎవరికీ తెలియకుండా కుండిన పట్టణానికి వెళ్లాడని బలరాముడికి తెలిసింది. విదర్భ దేశ రాజకుమారి విషయమై అతడు వెళ్లాడని, శత్రువుల ముట్టడిలో శ్రీకృష్ణుడు ఉండి ఉండొచ్చని బలరాముడు భావించి వెంటనే కుండిన పట్టణానికి వెళ్లాడు.

రుక్మిణి అంత:పురం వదిలి తన పరివారం వెంటరాగా, ఓ ఉత్సవంలో పూజ చేయడానికి దేవాలయానికి వెళ్లింది. "ఓ దేవీ, నీ పట్ల నాకున్న భక్తి విశేషం నీకు తెలిసిందే. నీకిదిగో ప్రమాణం చేస్తున్నాను. శ్రీకృష్ణుడు నాకు పతి అయ్యేటట్లు కరుణించు" అని వేడుకుంది. పూజ అనంతరం దేవాలయాన్ని దాటి వచ్చిన రుక్మిణి శ్రీకృష్ణుడి రథాన్ని చూసింది. నేరుగా శ్రీకృష్ణుడి వద్దకు వెళ్లి అతడి రథమెక్కింది. అందరూ చూస్తుండగా శ్రీకృష్ణుడు.. రుక్మిణిని రథం ఎక్కించుకొని వెళ్లిపోయాడు. సేవకులు యువరాజు అయిన 'రుక్మి' వద్దకు వెళ్లి విషయం తెలియజేశారు. "శ్రీకృష్ణుణ్ణి

చంపనిదే నేను తిరిగిరాను" అని శపథం చేసి గొప్ప సేనతో శ్రీకృష్ణుడి రథం వెంటపడ్డాడు. ఈ లోగా బలరాముడు తన సైన్యంతో.. రుక్మిని, అతడి సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. వారిని ఓడించాడు. బలరాముడు, శ్రీకృష్ణుడు జయప్రదంగా ద్వారకకు చేరుకున్నారు. అక్కడ వేదోక్తంగా, మహదానందంతో, ఉత్సవాలతో శ్రీకృష్ణ, రుక్మిణిల వివాహం జరిగింది.

పరాజితుడైన యువరాజు రుక్మి, కుండిన నగరం వెళ్లలేక సిగ్గుపడి తాను శ్రీకృష్ణుడితో యుద్ధం చేసిన స్థలంలోనే 'భోజకటకం' అనే నగరాన్ని నిర్మించుకొని రాజ్య పాలన చేయడం ప్రారంభించాడు. పాత కక్ష ఉన్న రుక్మి కురుక్షేత్ర యుద్ధం జరుగుతోందని తెలిసి తన సైన్యంతో వచ్చాడు. శ్రీకృష్ణుడితో సఖ్యత కుదురుతుందని ఊహించి యుద్ధంలో పాండవులకు సహాయం చేస్తానని వారికి చెప్పాడు. అర్జునుణ్ణి ఉద్దేశించి, "ఓ పాండవా, శత్రు సైన్యాలు చాలా ఉన్నాయి. నీకు సహాయం చేయడానికి వచ్చాను. నీవు నాకు మాట ఇచ్చిన వెంటనే శత్రు సైన్యాన్ని ఏ భాగంలోనైనా నీవు చెప్పినచోట ఎదురించి పోరాడతాను. ద్రోణుడు, కృపుడు, భీష్ముడు తదితరులను ఎదిరించి పోరాడగలను. నేను నీకు జయం సంపాదించగలను. నీ కోరికను తెలియజేయగలవు" అన్నాడు. అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి చూసి నవ్వాడు. "ఓయీ, భోజకటక రాజా!, శత్రు సైన్యం చాలా ఉందని మేము భయపడటం లేదు. నీ సహాయం మాకు అవసరం లేదు. నీ సహాయం కోరదల్చుకోలేదు. నీవు వెళ్లిపోయినా, ఉన్నా మాకు అభ్యంతరం లేదు. నీ ఇష్టం" అన్నాడు అర్జునుడు రుక్మిని ఉద్దేశించి. అర్జునుడి మాటలతో రుక్మికి కోపం, సిగ్గు ఆవరించాయి. తన సైన్యంతో దుర్యోధనుడి శిబిరానికి వెళ్లాడు. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి.."పాండవులకు నేను సహాయం చేస్తానన్నా వారు అవసరం లేదని చెప్పారు. కనుక నా సేనంతా నీ చెప్పు చేతల్లో ఉంటుంది. దుర్యోధనుడు అందుకొని.. "పాండవులు నీ సహాయం నిరాకరించిన తరువాత నీవు నా వద్దకు వచ్చావు. కనుక నీ సహాయం నాకు అవసరం లేదు" అన్నాడు. ఈ విధంగా రెండు పక్షాల వారి నుంచీ అవమానం ఎదురవడంతో యుద్ధంలో పాల్గొనకుండా శిశుపాలుడు సైన్యంతో తన రాజ్యానికి వెళ్లిపోయాడు.

◈



భీష్మునితో కలిసి
యుద్ధం చేయడానికి
నిరాకరిస్తున్న కర్ణుడు

## అధ్యాయం - 61

# సహాయ నిరాకరణ

**అ**ది కురుక్షేత్ర యుద్ధారంభానికి ముందురోజు. కౌరవ సేనా నాయకుడైన భీష్ముడు తన శక్తి సామర్థ్యాలను, సంతోషాన్ని ఉగ్గడించి దుర్యోధనుడికి ఉత్సాహం కలిగించడానికి ప్రయత్నించాడు. కౌరవ పక్షాన ఉన్న వీరుల బలం, ఉపాయం, సామర్థ్యం గురించి వివరించి చెప్పాడు. దుర్యోధనుడికెంతో ఆనందం కలిగింది. ఈ సందర్భంగా వారు కర్ణుడి గురించి మాట్లాడుకున్నారు. "కర్ణుడు నీ ప్రేమను సంపాదించాడు. నాకతడి గొప్పదనమేదీ కనిపించదు. పాండవులపై అతనికున్న అసహ్యం, ద్వేషం నాకు ఇష్టం లేదు. అదీగాక అతడు డంభాలు బాగా పలుకుతాడు. అతడి స్వాతిశయానికి అంతులేదు. ఇతరులను నీచ పరిచే చెడు గుణం కూడా అతడికుంది. ఈ భూమిపై ఉన్న వీరుల్లో అతడికి ఘనమైన స్థానం నేనివ్వలేను. అదీగాక సహజంగా తనతో పుట్టిన కవచాన్ని ఇచ్చివేశాడు. కాబట్టి ఈ యుద్ధంలో

నాకు అతడు ఎక్కువగా సహాయం చేయలేదని నా భావన. పరుశురాముడి శాపం కూడా అతడికుంది. దివ్యాస్త్ర ఉపయోగంలో, తనకు ముఖ్యమైన అవసరం ఏర్పడిన సందర్భంలో అతడు యుద్ధం సమర్థంగా చేయలేడు. ఎందువల్లనంటే ఆయా మంత్రాలు అతని స్మృతి పథానికి రావు. తనకూ, అర్జునుడికీ మధ్య జరిగే యుద్ధం కర్ణుడికే చేటు తెస్తుంది" అని భీష్ముడు వినమ్రంగా చెప్పాడు దుర్యోధనుడికి. అయితే ఈ మాటలు దుర్యోధనుడికి, కర్ణుడికి రుచించలేదు. ద్రోణుడు కూడా భీష్మణ్ణి సమర్థించి మాట్లాడాడు. "కర్ణుడు గర్వ పూరితుడు. తన సామర్థ్యాన్ని హెచ్చుగా నమ్ముతాడు. ఈ కారణాల వల్ల యుద్ధంలో ఎదురయ్యే సూక్ష్మ సందర్భాల్లో అతడు జాగ్రత్తగా ఉండలేడు. ఈ అజాగ్రత్త వల్ల అతడు ఓడిపోతాడు" అన్నాడు ద్రోణుడు. ఈ మాటలు విన్న కర్ణుడు.. భీష్ముడివైపు కళ్లెర్రజేసి.. "అయ్యా, నీవు కేవలం ఓర్వలేనితనం, అయిష్టతతో నన్నెప్పుడూ చిన్నబుచ్చుతూనే ఉన్నావు. నేను నీకెన్నడూ ఏ అపచారమూ చేయకపోయినా, నీకు సమయం దొరికేతేచాలు నన్ను నిందిస్తూనే ఉన్నావు. నీ బెదిరింపులు, పరుషపు, ఎత్తిపొడుపు మాటలు దుర్యోధనుడి కోసం సహించాను. ఈ జరగబోయే యుద్ధంలో నేను తగిన సహాయం చేయలేనని చెప్పావు. నా నిశ్చితాభిప్రాయాన్ని విను. నీవే కౌరవులను దగా చేస్తావు. నేనెంతమాత్రమూ ఆపని చేయను. వాస్తవంగా నీకు దుర్యోధనుడిపై ప్రేమ, విశ్వాసం లేవు. కానీ ఈ విషయం అతడికి తెలియదు. నన్నసహ్యించుకొని నాకూ దుర్యోధనుడికీ మధ్య వచ్చి, అతనికి నాపై చాడీలు చెప్పి, అతడి మనసుని విషపూరితమైన మాటలతో పాడుచేసి నాపై ప్రేమ లేకుండా చేస్తున్నావు. నా ప్రతాపాన్ని నీచపరిచి నన్ను అణగదొక్కుతున్నావు. క్షత్రియుడికి ఉండాల్సిన నడవడిని అనుసరించడానికి కూడా నీవు అంగీకరించడంలేదు. వయసు చెల్లినంత మాత్రాన మర్యాద, గౌరవం పొందే హక్కు వీరుడికి ఉండదు. అక్కడ ప్రభావం కూడా ఉండాలి. మాలో మాకు జగడం పెట్టకు" అని ద్రోణుడితో అన్నాడు కుర్ణుడు. దుర్యోధనుడి వైపు తిరిగి.. "ఓ కీర్తియుతుడైన వీరుడా, బాగా ఆలోచించు. నీ మంచే చూసుకో. ఈ పితామహునిపై అత్యాశ, నమ్మకం పెట్టుకోబోకు. మనలో మనకు జగడ బీజాలు నాటుతున్నాడు. నా విలువను అతడు తక్కువ చేసి చూడటం వల్ల నీ కార్యానికి ముప్పు వాటిల్లుతుంది. నన్ను తొక్కివేసి, చులకన చేసి, నా ఉత్సాహాన్ని తగ్గించడానికి చూస్తున్నాడు. అతడు వయసు రీత్యా దుర్బలుడవుతున్నాడు. అతని కాలం కూడా అయిపోయింది. తన ప్రతాప గర్వం ఇతరుల మంచిని గుర్తింప చేయనివ్వదు. వయసుకు గౌరవం ఇవ్వొచ్చు. అనుభవమూ ఉపకరిస్తుంది. కానీ దేనికైనా పరిమితి ఉంది. ఒకానొక కాలంలో వయసు వల్ల దుర్బలత్వం ఏర్పడుతుంది. నీవు.. ముఖ్య సేనా నాయకుడిగా భీష్మణ్ణి చేశావు. ఈ

యుద్ధంలో ఇతర వీరుల ప్రతాపం వల్ల నీకు కొంత కీర్తి రావచ్చుగానీ, అతడు నాయకత్వం వహించిన కాలంలో నేను ఆయుధాలను ముట్టను. యుద్ధంలో అతడు పడిపోయాకే నేను ఆయుధాలను పట్టుకుంటాను" అన్నాడు కర్ణుడు.

తన ఆగ్రహాన్ని అణుచుకొన్న భీష్ముడు.. "సూర్యపుత్రా! మనమొక క్లిష్ట పరిస్థితిలో ఉన్నాం. లేకపోతే నువ్వీ క్షణమే చచ్చిపోయేవాడివి. కౌరవులకు నీవు దుష్టగ్రహం అయ్యావు'' అన్నాడు. దుర్యోధనుడు చీకాకు పడి.. ''గంగపుత్రా, మీ ఉభయుల సహాయం నాకిప్పుడు అవసరమై ఉంది. నిస్సంశయంగా మీరిద్దరూ ఘనమైన కార్యాలను చేయగలరు. సూర్యోదయం అయ్యే సరికి యుద్ధం మొదలవుతుంది. శత్రువు నిండైన సేనతో సిద్ధమై ఎదురుగా ఉండగా, స్నేహితులమైన మన మధ్య తగవు తగదు" అన్నాడు.

కర్ణుడు పట్టుపట్టి తన మాట మీదే ఉన్నాడు. భీష్ముడు ముఖ్య సేనానిగా ఉన్నంత కాలమూ ఆయుధం పట్టడు. కర్ణుడి పట్టుదల తెలిసిన దుర్యోధనుడు అప్పటికి ఊరుకున్నాడు. మొదటి పదిరోజులు యుద్ధంలో కర్ణుడి సేన పాల్గొందిగానీ అతడు మాత్రం పాల్గొనలేదు. పదో రోజు సాయంత్రం మహావీరుడైన భీష్ముడి శరీరం బాణాలతో కప్పబడి యుద్ధ భూమిలో పడి ఉన్నాడు. కర్ణుడు.. భీష్మణుడికి తల వంచి నమస్కరించి తన తప్పిదాలను క్షమించాలని వేడుకుని ఆయన ఆశీర్వచనాలను అర్థించాడు. భీష్ముడు అలాగే చేశాడు. తరువాత కర్ణుడు యుద్ధంలో పాల్గొని భీష్ముడి తరువాత ద్రోణుణ్ణి ముఖ్య సేనానిగా తానే నియమింపచేశాడు. ద్రోణుడు కూడా పడిపోయిన తరువాత తాను ముఖ్య సేనానియై సేనలను నడిపించాడు.

◈



అర్జునునికి గీతోపదేశం
చేస్తున్న శ్రీకృష్ణుడు

## అధ్యాయం - 62

# శ్రీకృష్ణుడి ఉపదేశం

**యు**ద్ధానికంతా సిద్ధమైంది. ఇరుపక్షాలకు చెందిన వీరులు ఏ పక్షానికి ఆ పక్షంలోనే యుద్ధ ధర్మాలను అనుసరించి యుద్ధం చేస్తామని ప్రతిజ్ఞ చేశారు. కాలానుగుణంగా యుద్ధనీతి, యుద్ధ మార్గాలు మారుతూనే ఉన్నాయి. మహాభారత యుద్ధకాలంలో ఉన్న నీతి, అప్పటి మార్గాన్ని గుర్తు చేసుకోవాల్సిన అవసరం ఉంది. కురుక్షేత్ర యుద్ధంలో అనుసరించిన నీతుల్లో కొన్ని: ప్రతిరోజూ సాయంత్రం అయ్యేసరికి, ఆరోజుకు యుద్ధం ముగిసేది. అక్కణ్ణుంచి రెండు పక్షాల వారూ స్నేహితుల్లా కలిసి మెలిసి ఉండేవారు. సమాన ప్రతాపం కలవారే ద్వంద్వ యుద్ధం చేయడానికి అర్హులు. యుద్ధభూమిని విడిచిపెట్టిన వారిని, సేద తీరేవారిని ఎదురించరాదు. గుర్రపు రౌతు శత్రు గుర్రపు రౌతునే ఎదురించాలి. పదాతి దళాన్ని ఎదురించకూడదు. ఇలాగే రథారూఢులు, గజారూఢులు, పదాతి దళాలవారు శత్రుపక్షంలోనూ వారినే

ఎదుర్కోవాలి. శరణు కోరిన వారిని, ఆయుధాలు వదిలేసి శత్రువుకు లొంగిపోయి యుద్ధం చేయనివారిని చంపేవారు కాదు. ఒకానొక తరుణంలో ఎవరినీ ఎదుర్కోకుండా తీరిగ్గా ఉన్న ఒక యోధుడు ప్రత్యేకంగా జగడమాడి ఉన్నా, అతడు వెనుకకు మరలినా, అతడి కవచము భగ్నమైనా అలాంటి వారిని చంపకూడదు. యుద్ధంలో పాల్గొనకుండా ఉండే సేవకుల పైనా, శంఖా ధ్వనులు, భేరీ మృదంగ ధ్వనులు చేసేవారిపైనా ఎవరూ బాణాలు వేయకూడదు.

ఈ సూత్రాలను అనుసరించే కౌరవ పాండవులు యుద్ధం చేయగలమని ప్రతిజ్ఞ చేశారు. కాలగతిలో యుద్ధరీతికి సంబంధించి మంచీ చెడూ అని మనుషులకు అభిప్రాయాల్లో మార్పులు కనబడుతున్నాయి. ఇప్పటి యుద్ధాల్లో చేయకూడనిది ఒకటి కూడా వేరుగా లేదు. చిన్న, పెద్ద అనే విచక్షణ లేకపోవడం, యుద్ధ సామాగ్రి, మందులను ధ్వంసం చేయడం, నోరులేని జంతువులైన గుర్రాలు, ఒంటెలు, గాడిదలను చంపడం చేస్తున్నారు. ఒక్కొక్కప్పుడు గొప్ప యుద్ధ నీతులు కూడా భారత యుద్ధంలో పెడతోవ పట్టాయి. ఏదో ఒక కారణంతో ఉండి, ఉడిగి, యుద్ధ నీతిబాహ్యమైన పనులు జరిగాయని కథల వల్ల తెలుస్తోంది. మొత్తంగా యుద్ధ ధర్మం, నీతి, వీటిని అనుసరించే ఇరు పక్షాల వారు యుద్ధం చేశారనవచ్చు. అప్పుడప్పుడు జరిగిన అవినీతి పనుల విషయమై సిగ్గు చేటు అని, చేయరాదని మాత్రమే అనుకోవడం జరగుతున్నది.

భీష్ముడు తన నాయకత్వం కింద ఉన్న రాజులందరినీ ఉద్దేశించి.. "వీరులారా మీకు శ్లాఘ్యమైన తరుణం లభించింది. మీ ఎదురుగా స్వర్గ ధామాలు బాగా తెరిచి ఉన్నాయి. ఇంద్రునితోనూ, బ్రహ్మతోనూ కలిసి మెలిసి ఉండగల ఆనందం మీకు కలుగుతోంది. మీ పూర్వులు వెళ్లిన మార్గంలోనే మీరూ క్షత్రియ ధర్మాన్ని నిలపండి. ఆనందంతో యుద్ధం చేసి కీర్తి, గొప్పతనం సంపాందించండి. క్షత్రియుడనేవాడు శరీర రుగ్మత కారణంగానూ, వృద్ధాప్య కారణంగానూ మరణం కోరుకోడు. యుద్ధభూమిలోనే మరణం కోరుకుంటాడు" అన్నాడు. భీష్ముడి మాటలకు రాజులందరూ తూర్య నినాదాలు చేసి వారిని ఉత్సాహ పరుస్తూ 'కౌరవులకు జయం కలుగుగాక' అని గంభీరంగా అరచి, ధ్వనులు చేశారు.

భీష్ముడి పతాకంపై తాటిచెట్టు, ఐదు నక్షత్రాలు మెరుస్తున్నాయి. అశ్వత్థామ పతాకంపై సింహ చిహ్నం, ద్రోణుడి బంగారు రంగు పతాకంపై రుషి కమండలం, బాణం చిహ్నాలు మెరుస్తున్నాయి. దుర్యోధనుడి పతాకంపై పడగవిప్పిన తాచుపాము చిహ్నం, కృపాచార్యుడి జెండాలో వృషభం, జయభద్రుని జెండాలో అడవి పంది, అలాగే ఇతరుల జెండాలపైన రకరకాల చిహ్నాలు మెరుస్తున్నాయి. ఇలా యుద్ధభూమి అంతా గొప్ప పతాక ప్రదర్శనతో అలంకరించబడింది.

కౌరవ సైన్యమంతా యుద్ధ సన్నద్ధమై ఉండటం చూసి యుధిష్టరుడు.. అర్జునుడితో, "శత్రు సైన్యం చాలా పెద్దగా, మన సైన్యం చాలా తక్కువగా ఉంది. మన ప్రయత్నమంతా సైన్యాన్ని కూడదీయడంలోనే ఉండాలి. మన సైన్యాన్ని ఏ పరిస్థితుల్లోనూ చెదరగొట్ట వద్దు. మన సైన్యాన్ని చూసి వ్యూహ రచన చేయగలవు" అని అన్నాడు.

ఉభయ పక్షాలూ సైనికులను ఏర్పాటు చేసిన తరువాత.. ఒకరినొకరు చంపుకోవడానికి చేరిన వారందరినీ చూసి అర్జునుడు తన మనసులో ఆందోళన చెందాడు. ఈ మానసికాందోళనను పోగొట్టడానికి, శంకలను నివృత్తి చేయడానికి శ్రీకృష్ణుడు అర్జునుడితో మాట్లాడాడు. ఈ తరుణంలో శ్రీకృష్ణుడు ఆదేశించిన, వ్యక్తపరిచిన, ఉపదేశించిన వాక్యాలు భగవంతునిచే పలుకబడినవని భావించాడు. కోట్లాది ప్రజల హృదయాల్లో నాటుకొని పోయినదీ, మనుషుల పఠనానికి, ప్రపంచంలో అందరికీ గొప్ప నిధిగా పరిగణింపబడుతున్నది 'భగవద్గీత'.

◈



యుద్ధానికి ముందు
భీష్మ పితామహుని కలిసి
దీవెనలు కోరుతున్న పాండవులు

## అధ్యాయం - 63

# యుధిష్ఠరుని ఆశీస్సులు

**యు**ద్ధారంభానికి అన్నీ సిద్ధమయ్యాయి. అలాంటి సమయంలో ధైర్యస్థైర్యయుతుడు, పాండురాజు కుమారుడు అయిన యుధిష్టరుడు హఠాత్తుగా తన కవచాన్ని తీసివేసి, ఆయుధాలను విసర్జించి, తాను ఎక్కిన రథం నుంచి దిగి, కౌరవ ముఖ్య సేనా నాయకుడి వద్దకు నడిచి వెళ్లడం ఉభయ పక్షాల సైన్యమూ చూసి ఆశ్చర్యపడింది. "ఏమిటీ యుధిష్టరుడు చేస్తున్న పని" అని అయోమయానికి గురయ్యారు. నిర్ఘాంతపోయారు. అర్జునుడు కూడా ఏమీ తోచక రథం నుంచి దిగి వడివడిగా యుధిష్టరుడి వద్దకు వెళ్లాడు. మిగిలిన తమ్ముళ్లు, శ్రీకృష్ణుడు కూడా అలాగే యుధిష్టరుణ్ణి కలిశారు. బహుశా తన స్వభావ గుణానికి లోనై, ఏ విధంగానైనా శాంతిని నెలకొల్పగల రాజీ మార్గమే మంచిదని కౌరవులకు చెప్పడానికి వెళ్తుండి

ఉండొచ్చని భావించారు. అర్జునుడు.. యుధిష్టిరుణ్ణి ఉద్దేశించి, "ఓ రాజా! శత్రుసేన వైపు ఎందుకు వెళ్తున్నారు?. శత్రువు యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడు. వారి సేనంతా కవచాలు ధరించి ఆయుధాలను ఉపయోగించడానికి సిద్ధంగా ఉన్నారు. కానీ నీవు కవచాన్ని విడిచిపెట్టావు. ఆయుధాలను కూడా పక్కన పడేశావు. నీ వెనుక ఎవరూ బాసట లేకుండా వెళ్లడానికి కారణం ఏమిటి? నీవేమి చేయదలిచావు?. ఎందుకిలా ప్రవర్తిస్తున్నావు? అని అడిగాడు. కానీ యుధిష్టరుడు దీర్ఘాలోచనలో ఉండి ముందుకు వెళ్తూనే ఉన్నాడు. మనుషుల మనస్తత్వం బాగా తెలిసిన శ్రీకృష్ణుడు నవ్వుతూ.. "ఈ ఘోర యుద్ధం ప్రారంభించడానికి ముందు, పెద్దల ఆశీర్వచనం పొందడానికి అతడు వెళ్తున్నాడు. అలాంటి ఆశీర్వచనాన్ని, పెద్దల నుంచి ఆజ్ఞ పొందనిదే యుద్ధం ప్రారంభించడం యుక్తం కాదని యుధిష్టరుడి ఆలోచన. తాను పితామహుని వద్దకు, ద్రోణాచార్యుని వద్దకు వారి ఆశీస్సులను పొందేందుకు వెళ్తున్నాడు. అందుచేతే అతడు నిరాయుధుడుగా ఉన్నాడు. అలా చేయడం మంచిదే. ఆయనకు ఉచితానుచితాలు తెలుసు. అలా చేయడం వల్ల మనం ఈ యుద్ధంలో జయం పొందే ఉపాయం ఉంది. దుర్యోధనుడి సైన్యం చేతులు జోడించి ఎంతో నమ్రతతో తమ వైపు వస్తున్న యుధిష్టరుణ్ణి చూసి పరిపరివిధాలుగా భావిస్తున్నారు. 'మన బలాన్ని చూసి భయపడి ఈ పాండవుడు రాజీ కోరడానికి వస్తున్నాడని, క్షత్రియ కులానికే ఇతడు అవమానం తెస్తున్నాడని, మనలో ఇలాంటి పిరికిపంద ఎందుకు పుట్టాడని అనుకోసాగారు. యుధిష్టరుడు పూర్తిగా ఆయుధాలు ధరించిన సైన్యం మధ్య నుంచి తిన్నగా భీష్మిడి వద్దకు వెళ్లాడు. శరీరమంతా వంచి ప్రణామం చేశాడు. పాదాలను తాకాడు.

"పితామహా, యుద్ధం ప్రారంభించడానికి మాకు నీవు ఆజ్ఞ ఇవ్వు. అజేయుడవూ, అనన్య సామాన్యుడవూ అయిన మా పితామహుడైన మిమ్మలను ఎదురించి యుద్ధం చేయడానికి మేం సాహసించాం. కనుక యుద్ధ ప్రారంభానికి ముందు తమ ఆశీర్వచనాలను వేడుతున్నాను" అన్నాడు యుధిష్టరుడు. భీష్ముడు సమాధానంగా, "కుమారా, భరతాన్వయాన్నిబట్టి, దానికి తగిన విధంగా మన ఆచార ప్రకారం నీవు నడిచావు. నీవిలా చేయడం నాకు ఆనందం కలిగించింది. యుద్ధం చెయ్యి. నీకు జయం కలుగుతుంది. నేను స్వతంత్రుణ్ణి కాదు. రాజుకు కృతజ్ఞత కలిగి ఉండాల్సిన పరిస్థితి నాది. కనుక నేను కౌరవ పక్షాన యుద్ధం చేయక తప్పదు. కానీ మీరు ఎట్టి పరిస్థితుల్లోనూ పరాజితులు కారు" అని ఆశీస్సులు అందించాడు. యుధిష్టరుడు.. ద్రోణుడి వద్దకు వెళ్లి ఆయనకు ప్రదక్షిణ చేసి సాష్టాంగ ప్రణామం చేశాడు. ద్రోణుడు ఆశీర్వదించాడు. "కౌరవుల వల్ల నేను పొందిన మేలుకు అనివార్యంగా వారి పక్షానికి సహాయం చేయవలసి ఉంది. ఓయీ ధర్మపుత్రా! మనం

పొందిన స్వలాభం అన్నది బానిసలుగా చేసింది. అదిప్పుడు యాజమాన్యమే వహించింది. దీని ప్రకారం నేను కౌరవులకు బద్ధుణ్ణి. వారి పక్షాన యుద్ధం చేస్తాను. కానీ విజయం మీదే అవుతుంది" అన్నాడు. అలాగే యుధిష్ఠరుడు కృపాచార్యుడి వద్దకూ, మేనమామ శల్యుని వద్దకు వెళ్లి వారి ఆశీర్వచనం పొంది తిరిగి తన సేన వద్దకు వచ్చాడు.

యుద్ధం ప్రారంభమైంది. ప్రథమంగా నాయకులైన గొప్పవీరుల ద్వంద్వ యుద్ధం, సమానాయుధాలతో ప్రారంభమైంది. భీష్ముడు-పార్థుడు, సాత్యకి-కృతవర్మ, అభిమన్యుడు-బృహద్యలుడు, దుర్యోధనుడు-భీముడు, యుధిష్ఠరుడు-శల్యుడు, దృష్టద్యుమ్నుడు-ద్రోణుడు గొప్ప ద్వంద్వ యుద్ధం చేశారు. మరోవైపు సాధారణ సైనికులు సంకుల సమరం (విచక్షణ, నీతిలేని యుద్ధం) చేశారు. ఇలాంటి సంకుల సమరాలు కురుక్షేత్ర యుద్ధభూమిలో చాలా జరిగాయి. యుద్ధమంటే లెక్కలేని సైనికులు యుద్ధమనే పిచ్చిలోపడి విచక్షణా రహితంగా వ్యవహరించడం వల్ల యుద్ధభూమి అంతా శవాలతో, ఏనుగులు, గుర్రాలు, కళేబరాలతో కుప్పతెప్పలుగా నిండిపోయేది. రథాలు ఒరిగిపోయి, విరిగిపోయి నడపటానికి వీలుకాని స్థితి ఏర్పడేది. ఇప్పటికాలంలో అన్నీ సంకుల సమరాలేగాని, ద్వంద్వ యుద్ధాలు లేవు.

భీష్ముడి నాయకత్వంలో కౌరవులు పదిరోజులు యుద్ధం చేశారు. ఆయన తరువాత ద్రోణుడు ముఖ్య సేనాధిపతిగా వ్యవహరించాడు. ఆయన చనిపోయిన తరువాత కర్ణుడు ఆ బాధ్యతను తీసుకున్నాడు. కర్ణుడు పదిహేడో రోజు సాయంకాలం యుద్ధంలో పడిపోయాడు. తర్వాత కౌరవ సేనకు శల్యుడు నాయకత్వం వహించాడు. చివరి రోజు (పద్దెనిమిదో రోజు) వరకూ యుద్ధం చేశాడు. యుద్ధ చివరి దశలో క్రూరమైన, అధర్మయుక్తమైన, వీరులకు తగని పనులు చాలా జరిగాయి.

◈



పరాక్రమంతో
కౌరవ సేనను
చెండాడుతున్న అభిమన్యుడు

## అధ్యాయం - 64

# మొదటి రోజు యుద్ధం

**కౌ**రవ సేనను దుశ్శాసనుడు నడుపుతున్నాడు. పాండవ సేనను భీముడు నడుపుతున్నాడు. యుద్ధ ధ్వని ఆకాశాన్నంటుతోంది. భేరీ మృదంగాలు, బాకాలు, కొమ్ములు, శంఖాలు ఊదిన ధ్వనులు భూమ్యాకాశాలు నింపేశాయి. గుర్రాలు సకిలిస్తున్నాయి. ముందుకు తోసుకొని వెళ్లే ఏనుగులు ఘీంకారాలు చేస్తున్నాయి. యోధులు సింహనాదాలు చేస్తున్నారు. ఆకాశాన బాణాలు, గాలిలో పడిపోయిన చుక్కల్లా ప్రకాశిస్తున్నాయి. తండ్రులు, కుమారులు, పిన తండ్రులు, కుమారులు, మేనమామలు, మేనల్లుళ్లు ఒకరినొకరు వారి వారి ప్రేమలను, రక్త బంధాలను మరచిపోయి చంపుకుంటున్నారు. అదొక భయంకరమైన ఉన్మాదులతో చేస్తున్న మారణయజ్ఞంలా ఉంది. మొదటి రోజు యుద్ధంలో పాండవ సైన్యం చెల్లాచెదురైంది. భీష్ముడు ఎక్కడికి వెళ్లినా అక్కడ మారణహోమం జరుగుతోంది. ఈ పరిస్థితిని

సహించలేక అభిమన్యుడు.. భీష్ముణ్ణి ఎదుర్కొన్నాడు. వయో వృద్ధుడు, పిన్న వయస్కుడు చేసే ఈ యుద్ధాన్ని చూడటానికి దేవతలు వచ్చి అంబర వీధుల్లో ఉన్నారు. సువర్ణకర్ణికా వృక్షం చిహ్నంగల పతాకం అభిమన్యుడి రథంపై ప్రకాశిస్తూ ఎగురుతోంది. అభిమన్యుడు వేసిన ఒక బాణానికి కృతవర్మ, ఐదు బాణాలకు శల్యుడు పడిపోయారు. భీష్ముడిపై తొమ్మిది బాణాలను ప్రయోగించాడు. అభిమన్యుడు కత్తిపదునుగల బాణం వేయగా దుర్ముఖుని సారధి తల తెగి నేలపై పడింది. మరో బాణం కృపుని ధనస్సును విరిచింది. అభిమన్యుడి యుద్ధ చమత్కృతిని చూస్తున్న దేవతలు వారిపైపు పుష్ప వృష్టి కురిపించారు. భీష్ముడూ, ఆయనకు తోడుగా నిలిచిన యోధులూ అర్జునుడి కుమారుడైన అభిమన్యుణ్ణి అర్జునుడికి తగినవాడే అని ప్రశంసించారు. కౌరవులంతా ఒక్క ఉదుటున అభిమన్యుణ్ణి ఎదుర్కొన్నారు. అయితే వారందరినీ అభిమన్యుడు నిలువరించాడు. భీష్ముడు తనపై వదులుతున్న అగ్ని బాణాలను తన బాణాలతో ధ్వంసం చేస్తున్నాడు. బాగా గురిపెట్టి వదిలిన అభిమన్యుడి ఒక బాణం భీష్ముడి తాళధ్వజాన్ని పడగొట్టింది. ఇది చూసి భీముడు ఆనందంతో సింహనాదం చేశాడు. దీంతో అభిమన్యుడి ఉత్సాహం రెట్టింపు అయ్యింది. అభిమన్యుడి పరాక్రమం చూసిన భీష్ముడు అత్యంతానంద భరితుడయ్యాడు. తనకు ఇష్టం లేకపోయినా తన పూర్తి బలమంతా అభిమన్యుడిపై ఉపయోగించాల్సి వచ్చింది. విరటుడు, అతని కుమారుడు ఉత్తరుడు, ద్రుపదుడి కుమారుడు ధృష్టద్యుమ్నుడు, భీముడు.. అభిమన్యుడి చెంత చేరి అతనికి సేద తీరే అవకాశం ఇచ్చారు. వీరందరూ భీష్ముణ్ణి తాకగా, ఆయన వీరులతో తలపడ్డాడు. విరటుడి కుమారుడు ఉత్తరుడు ఏనుగు ఎక్కి దాన్ని శల్యుడిపైకి ప్రోత్సహించాడు. శల్యుడు ఆగ్రహంతో ఉత్తరుడిపై బల్లెం విసిరాడు. అది తిన్నగా వెళ్లి ఉత్తరుడి హృదయంలో గుచ్చుకుంది. దీంతో ఉత్తరుడి చేతిలో ఉన్న బాణం జారి కింద పడింది. ఉత్తరుడు నేలకొరిగి మరణించాడు. దీంతో ఉత్తరుడి ఏనుగు శల్యుడిపైకి లంఘించింది. శల్యుడు ఆ ఏనుగు తొండాన్ని నరికి గాయపరచడంతో అది పెద్దగా అరచి చనిపోయింది. అప్పుడు శల్యుడు.. కృతవర్మ రథం ఎక్కాడు. విరటుని కుమారుడగు శ్వేతుడు తన తమ్ముణ్ణి.. శల్యుడు చంపడం చూశాడు. అతడి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. తన రథాన్ని శల్యుడిపైకి పంపాడు. ఇంతలో ఏడుగురు రథారూఢులైన వీరులు శల్యుడికి బాసటగా నిలిచి అతన్ని అన్ని దిశలకూ రప్పించారు. శ్వేతుడుపై కురిసే బాణ వర్షాలు మెరుపు తీగెల్లా ప్రకాశిస్తున్నాయి. శ్వేతుడు బహు చాకచక్యంగా వారిని నిలురించాడు. తన బాణాలతో శత్రువుల బాణాలను ఎదుర్కొంటూ వారి చేతుల్లోని బల్లేలను పడగొట్టాడు. శ్వేతుడి యుద్ధ పరాక్రమం చూసి ఉభయ పక్షాలకు చెందిన వీరులు మెచ్చుకున్నారు. దుర్యోధనుడు.. శల్యుడికి

సహాయంగా సైన్యాన్ని పంపి శల్యుడు సేద తీరేవిధంగా అవకాశం కల్పించాడు. తర్వాత గొప్ప యుద్ధం జరిగింది. కౌరవ యోధులు వేలాది మంది చనిపోయారు. రథాలు అసంఖ్యాకంగా ధ్వంసమయ్యాయి. గుర్రాలూ, ఏనుగులూ చనిపోయాయి. శ్వేతుడు...దుర్యోధనుడు పంపిన వారిని పలాయనం చిత్తగించేలా చేసి తిన్నగా భీష్మణ్ణి ఎదిరించాడు. భీష్ముడి రథ పతాకం నేలపై పడింది. దీంతో భీష్ముడు.. శ్వేతుని రథాలను కుంగదీసి సారథిని నేలకూల్చాడు. తర్వాత భీష్ముడూ, శ్వేతుడూ తలపడి బల్లేలతో యుద్ధం చేశారు.  శ్వేతుడు ఒక గదను భీష్ముడి రథంపై వేయగా అది తుక్కుతుక్కయింది. భీష్ముడు దీన్ని ముందుగానే గమనించి అధాటున కిందకి దూకాడు. తన వింటి నారిని చివరిదాకా లాగి శ్వేతుడిపైకి సంధించాడు. దీంతో శ్వేతుడు అక్కడికక్కడే చనిపోయాడు. దుశ్శాసనుడు శంఖమూది మిక్కిలి ఆనందంతో నాట్యం చేశాడు. తర్వాత భీష్ముడు పాండవుల సైన్యంపైకి తన సైన్యాన్ని నడిపించాడు. మొదటి రోజు యుద్ధంలో పాండవ సేన చాలా నష్టపోయింది. యుధిష్టరుడు భయపడ్డాడు. దుర్యోధనుడి ఆనందానికి అవధుల్లేవు. పాండవ సోదరులంతా శ్రీకృష్ణుణ్ణి చేరి ఆతృతగా సమాలోచనలు చేశారు. శ్రీకృష్ణుడు, యుధిష్టరుణ్ణి ఉద్దేశించి.. "ఓ భరత ముఖ్యా! భయపడకు. భగవంతుడు నీకు శూరులు, వీరులైన తమ్ముళ్లను ఇచ్చాడు. నువ్వెందుకు సందేహిస్తున్నావు. సాత్యకి, విరటుడు, ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు ఉన్నారు. నేను లేనా?. నీవెందుకు నిస్పృహ చెందుతావు. ఇదివరకే వరం పొందినటువంటి, శిఖండి తను కబళించగల భీష్ముని పడగొట్టడం ఎప్పుడా అని వేచి ఉన్నాడు. నువ్వెరుగవా" అంటూ భీముణ్ణి సముదాయించాడు.

భీష్మునితో
తలపడుతున్న
అర్జునుడు



## అధ్యాయం -65

# రెండో రోజు యుద్ధం

**యు**ద్ధం మొదటి రోజు పాండవ సేన బాగా దెబ్బతినడంతో రెండో రోజు అలా జరక్కుండా పాండవ సేనా నాయకుడు ధృష్టద్యుమ్నుడు అనేక విధాల జాగ్రత్తలు తీసుకున్నాడు. రెండో రోజు సైన్యానికి ఉత్సాహం కలిగించాడు. ఎంతో వ్యూహాత్మకంగా నడిపాడు. మొదటి రోజు యుద్ధంలో తమకు జయం కలిగిందని దుర్యోధనుడిలో అతిశయం ఏర్పడింది. "కవచాలు ధరించిన యోధులారా, మనకు జయం కలగడం నిశ్చయమైంది. ప్రాణాలపై ఆశ ఉంచుకోకుండా యుద్ధం చేయండి" అని దుర్యోధనుడు కౌరవ సేనకు అరిచి చెప్పాడు.

భీష్ముడి నేతృత్వంలో నడుస్తున్న కురు సైన్యం మరలా పాండవ సైన్యాన్ని బాగా ఎదురించింది. చాలా మంది సైనికులను చంపింది. తన రథసారధి అయిన శ్రీకృష్ణుడితో అర్జునుడు, "యుద్ధంలో మనం ఇప్పటిమాదిరిగా ఇకముందు కూడా వ్యవహరిస్తే భీష్ముని చేతిలో మన సేన నశించిపోతుంది. మనం భీష్మణ్ణి చంపితేనే

మన సేనను కాపాడుకోగలం" అన్నాడు. శ్రీకృష్ణుడు.. భీష్ముడి రథానికి చేరువగా వారి రథాన్ని పోనిచ్చాడు. భీష్ముడు.. అర్జునుణ్ణి ఎదురించేందుకు సంతోషించి బాణాలు వదిలాడు. భీష్ముణ్ణి జాగ్రత్తగా రక్షిస్తూ ఏ అపాయమూ జరగకుండా చూడాలని తన బలగాలకు ఆజ్ఞ ఇచ్చాడు దుర్యోధనుడు. దీంతో కౌరవపక్ష యోధులంతా భీష్ముడికి బాసటగా నిలిచారు. అర్జునుణ్ణి ఎదుర్కొన్నారు. అర్జునుడు ఆ సైన్యాన్ని లెక్కచేయకుండా యుద్ధం చేస్తున్నాడు. యుద్ధంలో అర్జునుణ్ణి ఎదురించగల శక్తి కౌరవ పక్షంలో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడికి మాత్రమే ఉందన్న విషయం అందరికీ తెలిసిందే. భీష్ముడికి సహాయంగా వచ్చిన ప్రతి సైనికుడినీ అర్జునుడు శీఘ్రంగా రూపుమాపాడు. ఆ సమయంలో అర్జునుడు గాండీవాన్ని ధరించిఉన్న రీతిని చూసి కురు సైన్యంలోని వీరులు, నాయకులు ఆశ్చర్య చకితులయ్యారు. అర్జునుడి రథం ఇటూ అటూ మెరుస్తోంది. శత్రు సేనలను చీల్చుకొని విద్యుత్తు మాదిరిగా ప్రకాశిస్తూ, మిరుమిట్లు గొలుపుతోంది. ఇది అర్జునుడి రథం అని గుర్తించేలోపే మెరుపు వేగంగా కదిలిపోయేది. అర్జునుడి యుద్ధ బీభత్సాని చూసిన దుర్యోధనుడు, "ఓయీ గంగపుత్రా! నీవూ, ద్రోణుడూ సజీవులై ఉండగానే కృష్ణార్జునుల ద్వయం మన సైన్యాన్ని పూర్తిగా కబళిస్తుంది. నాపట్ల నిజమైన భక్తి విశ్వాసం ఉంటే పక్కకు తప్పుకొని నా కోసం యుద్ధం చేయాలి. ఇదంతా నీవల్లే జరిగింది. నీవు అర్జునుణ్ణి అతి త్వరలో చంపడానికి ప్రయత్నించకపోతే నేను దగాపడ్డాను అని అనుకుంటాను" అన్నాడు. భీష్మార్జునుల యుద్ధాన్ని దేవతలు ఆకాశం నుంచి చూస్తున్నారు. భీష్ముడు, అర్జునుడు ఇద్దరూ భూమి మీదున్న గొప్ప పరాక్రమవంతులు. ఉభయుల రథాలకూ శ్వేత అశ్వాలు ఉన్నాయి. రెండు పక్షాల నుంచి అసంఖ్యాక బాణాలు విడవ బడుతున్నాయి. బాణాన్ని మరో బాణం గాలిలో తాకుతోంది. భీష్ముడు ప్రయోగించిన బాణం అర్జునుడు, శ్రీకృష్ణుల వక్ష స్థలాలకు తగిలింది. శ్రీకృష్ణుడు శరీరం నుంచి రక్తం స్రవించింది. తన ప్రేమపాత్రుడైన రథసారధి శ్రీకృష్ణుడికి దెబ్బలు తగలడంతో అర్జునుడు తీవ్ర విచారగ్రస్తుడై, భీష్ముడికి గురిపెట్టి బాణాన్ని సంధించాడు. భీష్ముడూ, అర్జునుడూ ఇద్దరూ సమాన ప్రతిభకలవారే. వారిద్దరి మధ్య యుద్ధం చాలా సమయం జరిగింది. వారిరువురి మధ్య యుద్ధం హెూరాహెూరీగా సాగుతుండగా, యుద్ధభూమిలోనే మరోచోట ద్రోణుడికీ, అతడి జన్మశత్రువైన ద్రుపద కుమారుడూ, ద్రౌపది అన్న అయిన ధృష్టద్యుమ్నుడికి మధ్య గొప్ప యుద్ధం జరుగుతోంది. ద్రోణుడి పరాక్రమంతో ధృష్టద్యుమ్నుడికి గాయాలయ్యాయి. అయినప్పటికీ అతడు ద్రోణుడిపై వీరోచితంగా పోరాడుతూనే ఉన్నాడు. తన పైకి వచ్చిపడే గదలను, బాణాలను, ఇతర ఆయుధాలను తన బాణాలతో ద్రోణుడు నిలువరిస్తున్నాడు. వీరిద్దరి యుద్ధంలో ధృష్టద్యుమ్నుడే ఎక్కువగా బాణాలను నష్టపోయాడు. ద్రోణుడు వేసిన

బాణంతో ధృష్టద్యుమ్నుడి రథ సారధి మరణించాడు. దీంతో అతడు రథం దిగి ఓ గదను తీసుకొని ముందుకు వెళ్లాడు. ధృష్టద్యుమ్నుడు తన కరవాలం బయటకు తీసి లంఘించే ప్రయత్నం చేయగా, ద్రోణుడు ఆ ప్రయత్నాన్ని నిలువరించాడు. అప్పుడు భీముడు.. ధృష్టద్యుమ్నుడి అవస్థ చూసి అతన్ని ద్రోణుడి బాణ వర్షం నుంచి తప్పిస్తూ తన రథం మీదుకు లాగి తీసుకువెళ్లాడు. ఆ సమయంలో భీముణ్ణి చూసిన దుర్యోధనుడు కళింగ సేనను అతడిపైకి పంపాడు. తనపైకి వచ్చిన ఎంతో మంది కళింగ యోధులను భీముడు చంపాడు. మృత్యువే శత్రువు మధ్య ఉన్నట్లు.. శత్రువులను చీల్చిచండాడుతున్నాడు. ఇదంతా గమనించిన భీష్ముడు.. కళింగ సైనిక దళాన్ని ద్రోణుడికి సహాయంగా పంపాడు. సాత్యకి, అభిమన్యుడు, మరికొంత మంది యోధులు భీముడికి సహాయంగా వచ్చారు. సాత్యకి వదిలిన ఒక బాణం భీష్ముడి రథ సారధిని కుప్పకూల్చింది. సారధి లేకపోవడంతో గుర్రాలు రథాన్ని తమ ఇష్టం వచ్చినట్లు తిప్పుతున్నాయి. గుర్రాలు భీష్ముడి రథాన్ని యుద్ధ భూమి వెలుపలకు తీసుకువచ్చాయి. ఈ విధంగా భీష్ముడి రథం బయటకు వెళ్లిపోవడంతో పాండవులు సంతసించారు. ఆ అదునులోనే పాండవులు కౌరవ సేనపై గొప్ప యుద్ధం చేశారు. ఆ రోజు కౌరవులకు విశేష నష్టం జరిగింది. ఇదంతా అర్జునుడి పరాక్రమం వల్లనే జరిగింది. కౌరవ సేనలోని నాయకులు తత్తరపాటుతో కిందటి రోజు తాము పొందిన జయాన్ని మరిచిపోయారు. ఎంత తొందరగా సూర్యాస్తమయమై ఎంత త్వరగా ఆ రోజు యుద్ధం ముగిసిపోతుందా అని కౌరవులు ఎదురుతెన్నులు చూశారు. సూర్యుడు అస్తమించడంతోనే, భీష్ముడు ద్రోణుణ్ణి ఉద్దేశించి, “ఇప్పటికి యుద్ధం ఆపడం మంచిది. మన సైన్యం అధైర్యపడింది. అలసిపోయింది” అన్నాడు. ఇక పాండవుల పక్షాన అర్జునుణ్ణి చూసి ఉత్సాహంతో సేన తమ విడిదికి వచ్చింది. రెండో రోజు యుద్ధంలో పాండవులదే పైచేయి అయ్యింది.

◈



పాండవుల పట్ల పక్షపాతం
చూపుతున్నాడని
భీష్ముని నిందిస్తున్న దుర్యోధనుడు

అధ్యాయం - 66

# మూడో రోజు యుద్ధం

**యు**ద్ధం మూడో రోజున భీష్ముడు తన సేనతో గరుడ వ్యూహాన్ని పన్నాడు. తాను ముందు వెళ్తుండగా, దుర్యోధనుడు తన సైన్యంతో వెనుక భాగాన వస్తున్నాడు. ఆ రోజు సైన్యాన్ని సమాయుత్త పరచడంలోనూ, ఇతర విషయాల్లోనూ చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. ఈ రోజు తమకు ఎలాంటి చెడూ జరగదని కౌరవులు విశ్వసించారు. ఇటు పాండవులు కూడా తమ సైన్యాలను చక్కటి నైపుణ్యంతో ఏర్పాటు చేసుకున్నారు. అర్జునుడు, ధృష్టద్యుమ్నుడు శత్రు సైన్య గరుడ వ్యూహాన్ని ఛేధించడానికి వీలుగా, తమ సైన్యాన్ని నూతన చంద్రాకారంగా ఏర్పాటు చేశారు. ఆ ఆకారానికి కుడి కొసన భీముడు, ఎడమ కొసన అర్జునుడు నిలిచి తమ సైన్యాన్ని ముందుకు నడుపుతున్నారు. యుద్ధం ప్రారంభమైంది. సైన్యంలోని అన్ని తరగతులూ తలపడ్డాయి. రక్త ధారలు ప్రవహిస్తున్నాయి. రథాలు, గుర్రాలు, ఏనుగుల పరుగులతో లేచిన ధూళి సూర్యుణ్ణి కప్పి వేసింది. అర్జునుడి యుద్ధతంత్రం చాలా గొప్పగా ఉండటంతో శత్రువులు

దూకుడు ప్రదర్శించలేకపోతున్నారు. ఒక దశలో కౌరవులు పాండవ సేనను ఎదిరించి.. అర్జునుడిపై కేంద్రీకరించారు. అతడిపై బల్లేలు, ఈటెలు, ఇతర ఆయుధాలు విడుస్తున్నారు. అవన్నీ వర్షపు పిడుగు మెరుపు తీగల్లా ప్రకాశిస్తున్నాయి. మిడతల దండు మేఘంలా శత్రువుల ఆయుధాలు అర్జునుడి రథాన్ని కప్పివేస్తున్నాయి. ఆ దశలో అర్జునుడు తన బాణాలతో శత్రువుల బాణాలు వచ్చి పడకుండా అన్ని వైపులా పెట్టని కోట గోడ మాదిరిగా నిర్మించాడు. మరో చోట శకుని తన గొప్ప సైన్యంతో సాత్యకిని, అభిమన్యుణ్ణి ఎదుర్కొన్నాడు. సాత్యకి రథం భగ్నంకాగా, అతడు అభిమన్యుడి రథం ఎక్కాడు. వారిద్దరూ ఒకే రథంపై నుంచి శకుని సైన్యాన్ని నిర్మూలించారు. ధర్మపుత్రుని సేనను ద్రోణుడు, భీష్ముడు ఎదురించారు. నకుల, సహదేవులు ద్రోణుడికి ఎదురుగా తలపడుతూ, ధర్మపుత్రుణ్ణి చేరారు. భీముడు, అతడి కుమారుడైన ఘటోద్ఘజుడు దుర్యోధనుడి సేనా భాగంతో తలపడ్డారు. ఆ రోజు యుద్ధంలో ఘటోద్ఘజుడు తన తండ్రిని మించిన ప్రతాపాన్ని కనపబరిచాడు. భీముడి బాణాలు దుర్యోధనుడికి తగిలాయి. అతడు రథంలోనే మూర్చపోయాడు. పరిస్థితి గమనించిన దుర్యోధనుడి రథ సారథి రథాన్ని వేగంగా అక్కణ్ణుంచి తిప్పుకొని వెళ్లిపోయాడు. దుర్యోధనుడి రథాన్ని మళ్లించడంతో కౌరవ సేనలో కలకలం మొదలైంది. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని భీముడు కౌరవ సైన్యాన్ని చాలా వరకు నష్టపరిచాడు. కౌరవ సైన్యం చెదరడాన్ని భీష్ముడు, ద్రోణుడు గమనించారు. తక్షణమే వాళ్లు అక్కడికి చేరి చెదిరిన సేనకు ధైర్యాన్ని నూరి పోశారు. కూడగట్టారు. ఈలోగా దుర్యోధనుడు మూర్చ నుంచి తేరుకొని తన సైన్యాన్ని నడపడం మొదలు పెట్టాడు. దుర్యోధనుడు.. భీష్ముణి ఉద్దేశించి, “ఇలా సైన్యమంతా దైన్యస్థితికి చేరి, చెదిరిపోయి, అవమానకరంగా పారిపోవడాన్ని చూస్తూ మీరెలా నిలబడ్డారు?. నీవు పాండవుల పట్ల మిక్కిలి దయ చూపుతున్నట్లు కనిపిస్తోంది. నేను పాండవులను ప్రేమిస్తున్నాను. ధృష్టద్యుమ్నుడు, సాత్యకి నా స్నేహితులు, నేను వాళ్లను ఎదిరించలేను అని నాకు చెప్పి ఉండాల్సింది. నిశ్చయంగా వారందరూ నీకు సమానులు కారే. నీకిష్టం లేని వీరులను అతి సులువుగా తుదముట్టిస్తున్నావు. ఇప్పుడైనా మీరూ, ద్రోణుడూ మీ హృదయాలను విప్పి చెప్పండి” అని చీకాకుతో అన్నాడు.

భీష్ముడు నవ్వుతూ.. “నేను ఎంతో విపులంగా సలహా ఇచ్చాను. నా సలహాను తోసిపుచ్చి యుద్ధం చేయడానికే నిశ్చయించావు. నేను యుద్ధం జరగకుండా ప్రయత్నించాను. కానీ యుద్ధం అనివార్యం అయ్యింది. నిన్ను అన్యాయం చేయకుండా నా శక్తికొద్దీ విద్యుక్త కార్యాన్ని నిర్వహిస్తున్నాను. నేను ముసలివాడను. అయినప్పటికీ నేను ఎక్కువగానే యుద్ధం చేస్తున్నాను. ఇంతకన్నా ఎక్కువగా యుద్ధం నాకు సాధ్యం

కాదు" అన్నాడు. మళ్లీ తన విద్యుక్త కార్యంలో నిమగ్నమయ్యాడు భీష్ముడు. ఆ రోజు మధ్యాహ్ననికి ముందే పాండవులకు యుద్ధంలో జయం కలిగింది. దీంతో వారంతా ఆనందిస్తున్నారు. అయితే భీష్ముడు చెదిరిపోయిన సేనలను మరలా కూడగట్టి యుద్ధం చేయాల్సి వస్తుందని తలవలేదు. దుర్యోధనుడి కఠినమైన మాటలతో భీష్ముడు ఉత్తేజితుడై అందరినీ చంపే ప్రళయాగ్నిలా వీరవిహారం చేశాడు. తన సేనను జాగ్రత్తగా కూడదీసి ఇప్పటివరకూ జరగని విధంగా పాండవుల సేనపై విరుచుకుపడ్డాడు. అరివీర భయంకరంగా యుద్ధం చేస్తున్నాడు. ఆయనను ఎదుర్కోబోయిన సైనికులందరూ పురుగుల మాదిరిగా చనిపోతున్నారు. పాండవ సైన్యం చెల్లాచెదురైంది. శ్రీకృష్ణుడు, అర్జునుడు, శిఖండి సైన్యానికి ధైర్యం కలిగించడానికి ప్రయత్నం చేశారు. కానీ అది వృథా అయ్యింది.

శ్రీకృష్ణుడు.. అర్జునుణ్ణి ఉద్దేశించి, "ధనుంజయా! ఇప్పుడు నిజంగా మనకు క్లిష్ట పరిస్థితి వచ్చింది. యుద్ధంలో భీష్ముణ్ణి, ద్రోణుణ్ణి, ఇంకా పెద్దవాళ్లను, బంధువులను ఏమాత్రం వెనుదీయక చంపుతానని నీవు ఇదివరకు అన్నావు. ఇప్పుడు ఆ ప్రకారం చేయాల్సిన తరుణం ఆసన్నమైంది. అప్పటి ప్రమాణాన్ని మళ్లీ ఇప్పుడు చెయ్యి. నువ్వలా చేయని పక్షంలో మన సైన్యమంతా సరయిన మార్గం వీడి నశించిపోతుంది. నీవు భీష్ముడితో తలపడు" అన్నాడు. "సరే రథాన్ని పోనివ్వు" అన్నాడు అర్జునుడు. రథం భీష్ముడి వైపు కదిలింది. భీష్ముడి బాణాలు అర్జునుడి రథాన్ని కప్పివేశాయి. అర్జునుడు గాంఢీవాన్ని ఎక్కుపెట్టి మూడు బాణాలు సంధించాడు. భీష్ముడి ధనుస్సు విరిగిపోయింది. మరో ధనుస్సు అందుకున్నా దాన్ని కూడా అర్జునుడు విరగ్గొట్టాడు. అర్జునుడి ప్రావీణ్యాన్ని చూసి భీష్ముడు చాలా ఆనందించాడు. "ఓయీ ధీరుడా. నీకు ఆరోగ్యరస్తు" అని దీవించాడు. ఆ వెంటనే ఒక బాణం తీసుకొని సంధించి అర్జునుడి రథాన్ని కప్పేశాడు. భీష్ముడి బాణాలను నిలువరించడంలో అర్జునుడి చర్య శ్రీకృష్ణుడికి సంతృప్తిని ఇవ్వలేదు. భీష్ముడి ధనుస్సు అద్భుతంగా పనిచేస్తోంది. కానీ అర్జునుడి చేతులు బాగా పనిచేయడం లేదు. అర్జునుడి మనస్సు యుద్ధంలో నిమగ్నమైనట్లు లేదు. అర్జునుడికి భీష్ముడిపై చెప్పలేని ప్రేమానురాగం ఉంది. అర్జునుడు ఇలా ప్రవర్తిస్తే, ఇదివరకే ధైర్యాన్ని వీడి చెదిరి పాడైన సైన్యం పూర్తిగా నశించి, పాండవులకు అపజయం కలిగి, యుద్ధమే అంతమంతుందేమోనని సందేహించాడు శ్రీకృష్ణుడు. తాను రథాన్ని ఎంతో చాతుర్యంగా నడిపినా అర్జునుడు భీష్ముడి బాణాలను ఎదుర్కోవడంలో సఫలం కాలేకపోతున్నాడు. దీంతో శ్రీకృష్ణుడికి అర్జునుడిపై ఆగ్రహం కలిగింది.

అర్జునుణ్ణి ఉద్దేశించి.. "ఈ పరిస్థితిని నేనిక సహించలేను. ఓ అర్జునా, నీవు భీష్ముణ్ణి చంపలేకపోతే నేనే చంపుతాను" అంటూ అశ్వ పగ్గాలను వదిలి, రథం

నుంచి దిగాడు. తన చక్రాన్ని చేతబట్టి భీష్ముడివైపు పరుగుపెట్టాడు. ఈ దృశ్యాన్ని చూసిన భీష్ముడు ఎంతమాత్రమూ చలించలేదు. పైగా అతడి మొహం బ్రహ్మానందంతో వికసించింది. "రమ్ము, రమ్ము, ఓ పద్మలోచనుడా, నేను నీకు నమస్కరిస్తున్నాను. ఓ మాధవా, ప్రపంచాధీశా, నీవు రథం నుంచి దిగి నాకోసం వచ్చావా?. ఇదిగో నా ప్రాణాన్ని ఇస్తున్నాను. నేను నీ చేతిలో మృతి చెందితే ముల్లోకాల్లోనూ కీర్తివంతుణ్ణవుతాను. ఆ ఆదరణ నాకు దక్కేటట్లు చెయ్యి. నీ చేతులు నా ప్రాణాన్ని హరించి నాకు మోక్షం ప్రసాదించుగాక" అంటూ భీష్ముడు శ్రీకృష్ణుణ్ణి ఆహ్వానిస్తున్నాడు. అర్జునుడు ఖేదంతో తానూ రథం దిగి కృష్ణుడి వెంట పరిగెత్తాడు. బహుకష్టంతో శ్రీకృష్ణుణ్ణి చేరి తిరిగి రథంలోనికి రమ్మని బతిమాలాడు. "నా పట్ల నీవు శాంతం వహించాలి. నీవు ఆగు. యుద్ధంలో నేను వెనుదీయనని వాగ్దానం చేస్తున్నాను" అంటూ శ్రీకృష్ణుణ్ణి ఎలాగో వెనక్కి రప్పించగలిగాడు. శ్రీకృష్ణుడు మళ్లీ రథ పగ్గాలు అందుకున్నాడు. అర్జునుడు కౌరవ సైన్యాన్ని అరివీర భయంకరంగా ఎదుర్కొన్నాడు. వేలకొలది యోధులను చంపాడు. మూడో రోజు యుద్ధంలో మధ్యాహ్నానికి కౌరవులు చాలా నష్టపోయారు. వారు తమ గుడారాలకు దివిటీల వెలుగులో వెళ్తున్నారు. వారిలో వారు.. "అర్జునుడికి సమానులు ఎవరు?. అతడు జయం పొందడంలో వింతేమీ లేదు" అనుకున్నారు. ఆ రోజు అర్జునుడు ఎంతో పరాక్రమవంతంగా యుద్ధం చేశాడు.

◈



భీమునిపై యుద్ధం చేస్తున్న
అశ్వత్థామ

## అధ్యాయం - 67

# నాలుగో రోజు యుద్ధం

**యు**ద్ధం నాలుగో రోజు సూర్యోదయమైన వెంటనే భీష్ముడు తన సేనలను మరలా వ్యూహాత్మకంగా నడుపుతున్నాడు. ద్రోణుడు, దుర్యోధనుడు, ఇతర వీరుల మధ్య ఉన్న భీష్ముడు.. దేవతల మధ్య ఉన్న ఇంద్రుడిలా ప్రకాశిస్తున్నాడు. రథాలు, ఏనుగులు, గుర్రాలతో యుద్ధానికి సిద్ధమై ఉన్నాడు. పిడుగుల వర్షం పడే ఆకాశంలా ఉంది అక్కడ పరిస్థితి. భీష్ముడు యుద్ధాన్ని ప్రారంభించదలచి తన సైన్య విభాగం ముందుగా నడిచేందుకు ఆజ్ఞ ఇచ్చాడు.

అర్జునుడి రథ పతాక చిహ్నం హనుమంతుడు. ఆ పతాకం గాలిలో ఎగురుతుండగా, అర్జునుడు తన రథాన్నుంచి శత్రుసేన కదలికలను చూస్తున్నాడు. తాను కూడా తన సేనను తగిన రీతిలో ఏర్పాటు చేశాడు. యుద్ధం మొదలైంది. అశ్వత్థామ, భూరిశ్రవణుడు, శల్యుడు, చిత్రసేనుడు, చేలుడి కుమారుడు తదితరులు.. అభిమన్యుణ్ణి ముట్టడించారు. ఐదు ఏనుగులను ఎదుర్కొనే సింహంలా అభిమన్యుడు

వారితో పోరాడుతున్నాడు. అర్జునుడు తన కుమారుడిపై ఐదుగురు యోధులు కలబడటం చూసి, అభిమన్యుణ్ణి కలిశాడు. తరువాత పోరు తీవ్రరూపం దాల్చింది. ధృష్టద్యుమ్నుడు తన పెద్ద సేనతో అక్కడికి వెళ్లాడు. పోరులో చేలుడి కుమారుడు మరణించాడు. కుమారుడి చావు చూసిన చేలుడు తడబడ్డాడు. చేలుడు, శల్యుడు.. ధృష్టద్యుమ్నుణ్ణి ఎదిరించారు. శల్యుడు విడిచిన బాణంతో ధృష్టద్యుమ్నుడి విల్లు విరిగిపోయింది. అది అభిమన్యుడు చూసి శల్యుడిపై బాణాలు సంధించి అతడిని కష్టదశలోకి నెట్టాడు. శల్యుడి దుస్థితిని చూసిన దుర్యోధనుడు, కౌరవులు అతని వద్దకు చేరుకున్నారు. సమయానికి భీముడు కూడా అక్కడికి వచ్చాడు. భీముడు గద పైకెత్తి దుర్యోధనుడి తమ్ముళ్లను చూశాడు. దీంతో వారంతా భయభ్రాంతులకు గురయ్యారు. ఆగ్రహావేశంతో దుర్యోధనుడు ఏనుగుల దండుతో భీముణ్ణి ఎదుర్కొన్నాడు. ఏనుగులు రావడాన్ని చూసిన భీముడు రథం దిగాడు. గదతో భయంకరంగా ఏనుగులను ఎదరించాడు, దాంతో అవి భయపడి బెదిరి కౌరవ సైన్యాన్ని చెదరగొట్టాయి. భీముడు ఏనుగులపై చేస్తున్న దాడి కొండలపై చేస్తున్నట్లుగా ఉంది. యుద్ధ భూమిలో చనిపోయి పడి ఉన్న ఏనుగులు చిన్న చిన్న కొండల్లా దర్శనమిస్తున్నాయి. చనిపోయిన ఏనుగులను చూసిన తోటి ఏనుగులు భయంతో అటూ ఇటూ పరిగెత్తుతూ, కురు సైన్యం మీదుగా లంఘించి అసంఖ్యాక సైనికులను కాళ్లకింద మట్టగించి తొక్కి చంపాయి. దుర్యోధనుడు మిగతా వీరులతో కలిసి భీముడిపై పడ్డాడు. కానీ భీముడు పర్వతం మాదిరిగా ధీరత్వంతో వారినందరినీ తేలికగా ఎదుర్కొన్నాడు. ఇంతలో పాండవ సైన్య వీరులు భీముడి సహాయం కోసం వచ్చారు. ఆ సమయంలో దుర్యోధనుడి బాణాలు భీముడి వక్షస్థలాన్ని తాకాయి. వెంటనే భీముడు రథం ఎక్కి తన సారధి విశోకుణ్ణి ఉద్దేశించి.. “ఓయీ విశోకా, ఈ సమయం నాకు సంతోషకరమైనది. నా ఎదుట దృతరాష్ట్రుని కుమారులు గుమికూడి కనపడుతున్నారు. చెట్టు నుంచి పండ్లను విదిల్చినట్లు వీరిని కూడా విదిలించడానికి తగి ఉన్నారు. నీవు గట్టిగా పగ్గాలు పట్టుకొని రథాన్ని అటు తోలు. ఆ దుర్మార్గులను యమపురికి పంపుతాను. భీముడికి దుర్యోధనుణ్ణి చంపగలిగిన శక్తి ఉన్నా.. అతడు కవచం ధరించి ఉండటం వల్ల ఇంకా చనిపోకుండా మిగిలాడు. ఆ రోజు యుద్ధంలో భీముడి చేతిలో దుర్యోధనుడి ఎనిమిది మంది సోదరులు మరణించారు. దుర్యోధనుడు కూడా తీవ్రంగానే యుద్ధం చేశాడు. ఒక బాణం భీముడి విల్లుని ధ్వంసం చేసింది. భీముడు మరొక విల్లు తీసుకొని వాడిగల బాణంతో దుర్యోధనుడి చాపాన్ని నరికాడు. దుర్యోధనుడు మరొక విల్లు తీసుకొని గురిపెట్టి ఓ బాణాన్ని భీముడి వక్ష స్థలంలో దిగేలా వేశాడు. ఈ బాణపు దెబ్బతో భీముడు స్పృహ కోల్పోయి రథంలో కూలబడ్డాడు.

పాండవ వీరులు దుర్యోధనుడిపై బాణాల వర్షం కురిపించారు. రథంలో భీముడు బాణం దెబ్బతో కూర్చొని ఉండటం చూసి ఘటోద్ఘజుడు కోపావేశంతో కౌరవ సేనపై పడ్డాడు. కౌరవ సేన అతడి ధాటికి తట్టుకోలేకపోయింది. ద్రోణుడు.. భీష్మణ్ణి ఉద్దేశించి, "నేడు ఈ రాక్షసుడితో యుద్ధం చేయలేము. మన సైనికులు అలసిపోయి ఉన్నారు. సాయంకాలం అవుతోంది. రాక్షసుల ప్రభావం చీకటి పడుతున్న కొద్దీ ఎక్కువ అవుతుంది. కనుక ఘటోద్ఘజుడి పని రేపు పడదాం" అన్నాడు. తన సైన్యాన్ని విడిదికి తీసుకువెళ్లవలసిందిగా అజ్ఞాపించాడు భీష్ముడు. ఇలా ఉండగా.. దుర్యోధనుడు తన గుడారంలో కంట నీరు పెట్టుకొని, తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఈ రోజు యుద్ధంలో ఎనిమిది మంది తమ్ముళ్లు మరణించారు. దృతరాష్ట్రుడు.. సంజయుణ్ణి ఉద్దేశించి, "ఓయీ సంజయా! నీ ద్వారా నేను ప్రతి రోజూ చెడు వార్తలను వింటున్నాను. నీ కథంతా విచారపూరితమే. యుద్ధంలో పాండవుల ఓటమిని ప్రేమించాల్సినవారు చనిపోవడాన్ని నేను భరించలేను. ఏ ఉపాయం మన వాళ్లను రక్షిస్తుంది?. ఆ యుద్ధంలో మనం ఎలా జయించగలం?. నాకయితే చాలా భయంగా ఉంది" అన్నాడు.

"ఓ రాజా, ఇదంతా నీ తప్పిదం వల్లే జరిగింది. ఇప్పుడు విచారించినందువల్ల ఏ ప్రయోజనమూ లేదు. నీ కోసం నేను శుభవార్తను ఎలా సృష్టించగలను. కావున జరిగింది ధైర్యంతో వినవలసిందే" అని సంజయుడు అన్నాడు. "విదురుడి మాటలు యధార్థమవుతున్నట్లున్నది" అని విచారంతో అన్నాడు దృతరాష్ట్రుడు.

◈



కౌరవ సైన్యంలో ప్రవేశించి
యుద్ధం చేస్తున్న సాత్యకి

**అధ్యాయం - 68**

# ఐదో రోజు యుద్ధం

**యు**ద్ధ భూమిలో జరిగే విషయాలన్నిటినీ సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పినప్పుడల్లా ఆయన విలపిస్తుండేవాడు. "తుపానులో.. నడి సముద్రంలో ఓడ బద్ధలై, నీళ్ల పాలై, ప్రాణాన్ని నిలబెట్టుకోవడానికి ఈదే ప్రయత్నం చేసే మనిషి మాదిరిగా ఉంది నా పరిస్థితి. భీముడు నా కుమారులందరినీ చంపగలడు. నా కుమారులను మరణం నుంచి తప్పించగల వీరుడెవ్వడూ మన సైన్యంలో లేడని అనుకుంటున్నాను. మన సైన్యం భయంతో పలాయనం చిత్తగిస్తున్నది. భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వద్ధామలు ఈ ఆపద తమకు కాదు కదా అని చూస్తున్నారా?. వారి ఉద్దేశమేమిటి?. ఎప్పుడు, ఏ ప్రకారం వాళ్లు దుర్యోధనుడికి సహాయం చేస్తున్నారు. నా కుమారులు చావు నుంచి ఎలా తప్పించుకోగలరు?" అంటూ తీవ్రంగా విలపిస్తున్నాడు ధృతరాష్ట్రుడు.

సంజయుడు దృతరాష్ట్రుణ్ణి అనునయిస్తూ.. "శాంతించు రాజా, పాండవులు దేనికోసం యుద్ధం చేస్తున్నారో, అది ధర్మ సమ్మతం కనుక.. వారా ధర్మంపైనే నిలబడ్డారు. కనుకనే వారు గెలుపొందుతున్నారు. నీ కుమారులు ధైర్యవంతులేగానీ, వారి మనసు క్రూరమైనది. కాబట్టి వారికి అదృష్టం పట్టలేదు. వారు పాండవులకు తీరని అన్యాయం చేశారు. పాండవులు మాయతోనో, హస్తలాఘవంతోనో, మంత్రోచ్ఛారణతోనో జయించడం లేదు. వారు క్షత్రియోచితంగా యుద్ధం చేస్తున్నారు. వారి కోరిక ధర్మ సమ్మతమైనందున వారికి బలముంది. స్నేహితులు నీకు ఎంతగా సలహా ఇచ్చినా దాన్ని పెడ చెవిని పెట్టావు. విదురుడు, భీష్ముడు, ద్రోణుడు, నేనూ.. నీవు అనుసరిస్తున్న అనాలోచిత మార్గం నుంచి తప్పించడానికి ప్రయత్నాలు చేశాము. నీవు వినలేదు. నీ చెడు మార్గాన నీవు వెళ్లావు. మూఢుడైన రోగి చేదు మందు తాగడానికి ఇష్టపడనట్లే, నీవూ మా సలహాలను ఆచరించడానికి ఒప్పుకోలేదు. మేం చెప్పిన ప్రకారం నీవు చేసి ఉంటే, నీ ప్రజలను రక్షించుకోగలిగి ఉండేవాడివి. కానీ మా సలహాలను వదిలి నీ మూర్ఖ కుమారుల సలహాలనే అనుసరించావు. ఇప్పుడు నీవు విచారిస్తున్నావు. ఇప్పుడు నీవు నన్ను అడిగినట్లే రాత్రి దుర్యోధనుడు, భీష్ముణ్ణి అడిగాడు. భీష్ముడు కూడా నేను నీకు చెప్పిన సమాధానాన్నే దుర్యోధనుడికి చెప్పాడు.

నాలుగో రోజు సాయంత్రం యుద్ధం నిలుపుదల చేసిన తరువాత దుర్యోధనుడొక్కడే భీష్ముడి వద్దకు వెళ్లి.. "పితామహా, నీవు భయంలేని మహావీరుడవని ప్రపంచంలో ప్రతీతి. అలాగే ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ, సుదక్షిణుడు, భూరిశ్రవసుడు, వికర్ణ, భగదత్తుడు భయమెరుగని వీరులు. వీరికి మృత్యువన్న భయమే లేదు. నీ వలెనే వీరందరూ నిస్సంశయంగా ప్రతిభావంతులు. పాండవులందరూ కలిసి మీలో ఒక్కరితో పోరాడి జయించలేరు. ఇలాంటి పరిస్థితిలో కుంతీ కుమారుల చేతిలో ప్రతిరోజూ ఓడిపోవడానికి కారణమేంటి" అని అడిగాడు. దానికి భీష్ముడు సమాధానంగా.. "రాజా! విను. ప్రతి సమయంలోనూ నీకు సలహా ఇస్తూ నీకేది మంచి అనిపిస్తుందో అది చెపుతూనే ఉన్నాను. పెద్దలు నీకు ఇచ్చే సలహాను నిర్లక్ష్య పెట్టావు. పాండు కుమారులతో శాంతియుతమైన రాజీ చేసుకోవాలని మళ్లీ చెపుతున్నాను. నీ మంచి కోసం, ప్రపంచమందరి మంచి కోసం అనుసరించదగినది సంధి మాత్రమే. మీరంతా ఒకే రాజవంశస్థులై ఉన్నందున, ఈ విశాలమైన దేశాన్ని సొంతం చేసుకొని ఆనందించండి. ఈ సలహాను ఇదివరకే ఇచ్చాను. కానీ నీవు లక్ష్య పెట్టలేదు. నీవు పాండవులకు ఘోరమైన అన్యాయం చేశావు. దాని ఫలితమే ఇప్పుడు అనుభవిస్తున్నావు. స్వయంగా శ్రీకృష్ణుడి వల్ల పాండవులు రక్షించ బడుతున్నారు. అలాంటప్పుడు నీవు విజయాన్ని ఎలా ఆశించగలవు?. ఇప్పటికీ

పాండవులతో సంధి చేసుకోవడానికి కాలం మించిపోలేదు. బలవంతులూ, నీ సోదరులూ అయిన పాండవులను నీ శత్రువులుగా గాక మిత్రులుగా చేసుకొని, నీ రాజ్యాన్ని సౌఖ్యంగా పాలించుకో. అదే మార్గం. అర్జునుణ్ణి, కృష్ణుణ్ణి నిందిస్తే నీవు నశిస్తావు. ఎందువల్లనంటే వారు నర,నారాయణులు" అని వివరించి చెప్పాడు.

దుర్యోధనుడు.. భీష్ముడి వద్ద సెలవు తీసుకొని తన గుడారానికి వెళ్లాడు. కానీ ఆ రాత్రి నిద్రపోలేదు. మరునాడు ఉదయం తిరిగి యుద్ధం ప్రారంభమైంది. భీష్ముడు తన సేనను పటిష్టంగా ఏర్పాటు చేశాడు. పాండవ సేనను ధృష్టద్యుమ్నుడు పర్యవేక్షించాడు. ముందు వెళ్లే సైన్య వరుసకు తలమానికంగా యథాప్రకారం భీముడు ఉన్నాడు. శిఖండి, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, వెనుక నుంచి సైన్యమంతటినీ, ఇతర వీరులనూ రక్షిస్తున్నారు. ధర్మపుత్రుడు, నకుల సహదేవులు ఇంకా వెనుక ఉన్నారు. భీష్ముడు ధనుస్సు ఎక్కుపెట్టి బాణాలను వదిలాడు. పాండవుల సైన్యం చాలా నష్టపోయింది.

అర్జునుడు.. భీష్ముడిపై బాణాలను ప్రయోగించాడు. దుర్యోధనుడు ద్రోణుడి వద్దకు వెళ్లి తన ఇష్టమొచ్చినట్లు దెప్పిపొడిచాడు. ద్రోణుడు కూడా అతణ్ణి కఠినమైన మాటలే మాట్లాడాడు. "మొండి రాజా, నీవు తెలియకుండా మాట్లాడుతున్నావు. పాండవుల బలమేమిటో నీకు తెలియదు. మేము మాకు చేతనైనవి చేస్తూనే ఉన్నాం" అన్నాడు. ద్రోణుడు పాండవ సైన్యాన్ని, సాత్యకిని ఎదుర్కొన్నాడు. ఇంతలో భీముడు వచ్చి ద్రోణుడితో తలపడ్డాడు. యుద్ధం తీవ్ర రూపం దాల్చింది. ద్రోణుడు, భీష్ముడు, శల్యుడు ముగ్గురూ కలిసి భీముడితో తలపడ్డారు. భీముడికి బాసటగా శిఖండి ఉన్నాడు. శిఖండి భీష్ముడిపై బాణాల వర్షం కురిపించాడు. శిఖండి వచ్చిన వెంటనే భీష్ముడు అక్కడ నుంచి వెళ్లిపోయాడు. ఎందువల్లనంటే, శిఖండి మొదట్లో కన్యగా పుట్టింది. భీష్ముడి ధర్మసూక్ష్మం ప్రకారం ఆయన స్త్రీకి ఎదురుగా యుద్ధం చేయడు. చివరికి ఈ అంశమే భీష్ముడి మరణానికి కారణమైంది. భీష్ముడు వెళ్లడాన్ని గమనించిన ద్రోణుడు శిఖండిని ఎదురించి అతడు పారిపోయేలా చేశాడు. ఐదో రోజు సంకుల సమరమే జరిగింది. నరకడం, చావడం మితిమీరిపోయింది. మధ్యాహ్నానికి దుర్యోధనుడు పెద్ద సేనను సాత్యకి పైకి పంపాడు. ఆ సేనను సాత్యకి త్వరగానే నిర్మూలించి భూరిశ్రవసుణ్ణి ఎదుర్కోవడానికి వెళ్తున్నాడు. భూరిశ్రవసుడు గొప్ప పరాక్రమశాలి. అతడు సాత్యకి సైన్యాన్ని పారదోలి, సాత్యకిని ముప్పతిప్పలు పెడుతున్నాడు. సాత్యకి పదిమంది కుమారులూ తన తండ్రికి సహాయంగా వచ్చి భూరిశ్రవసుణ్ణి ఎదుర్కొన్నారు. భూరిశ్రవసుడు ఏ మాత్రం వెనుకంజ వేయకుండా వీరందరితో యుద్ధం చేస్తూనే ఉన్నాడు. భూరిశ్రవసుడి పదునైన బాణం సాత్యకి

కుమారుల ఆయుధాలను ధ్వంసం చేసింది. పిడుగుపాటుతో క్షణాల్లో చెట్లు పడిపోయినట్లు సాత్యకి కుమారులందరినీ చంపాడు. తన కుమారుల మరణంతో సాత్యకి ఎంతో విచారించాడు. క్రోధంతో అతని కళ్లు ఎరుపెక్కాయి. భూరిశ్రవసుణ్ణి చంపడానికి అతడిపైకి వెళ్లాడు. ఆ ఇద్దరి వీరులు రథాలు ఢీకొని బద్ధలయ్యాయి. ఇద్దరూ నేలపైనే కత్తి, డాలుతో యుద్ధం చేశారు. ఇంతలో భీముడు వచ్చి సాత్యకిని తన రథంపైన ఎక్కించుకొని వెళ్లిపోయాడు. భూరిశ్రవసుడు అసమాన కృపాణ యుద్ధ నిపుణుడు. అందువల్ల సాత్యకి అతడి చేతిలో చనిపోతాడేమోనని అతణ్ణి రథంపై ఎక్కించుకొని వెళ్లాడు భీముడు. ఆ సాయంత్రం వరకూ అర్జునుడు సహస్ర సంఖ్యగల కౌరవులను చంపాడు. దుర్యోధనుడు అర్జునుడిపై పురికొల్పిన సైనికులు మంటలో పడిన శలభాల్లా చనిపోయారు. సూర్యాస్తమయం కావడంతో భీష్ముడు యుద్ధాన్ని నిలుపుదల చేశాడు. అర్జునుడి పరాక్రమానికి మెచ్చుకుంటూ పాండవ సైన్యం జయజయధ్వానాలు చేసి ఆనందించింది. ఇరుపక్షాల సైనికులు వారి వారి గుడారాలకు చేరారు.

◈

పాండవుల సర్వసైన్యాధిపతిగా
నియమించబడిన దృష్టద్యుమ్నుడు



అధ్యాయం - 69

# ఆరో రోజు యుద్ధం

**యు**ధిష్టరుడి ఆజ్ఞ ప్రకారం యుద్ధం ఆరో రోజున ధృష్టద్యుమ్నుడు సైన్యంతో మకర వ్యూహం పన్నాడు. ఇక కౌరవ సేన కూడా తన వ్యూహంతో తాను ఉంది. యుద్ధం మొదలైనది లగాయతూ విపరీతంగా చంపుకోవడాలు జరిగాయి. ద్రోణుడి రథ సారథి కన్నుమూశాడు. ద్రోణుడే పగ్గాలు చేతబట్టి రథ సారథ్యం చేస్తూ బాణాలను సంధిస్తున్నాడు. దూదికుప్పల మధ్య అగ్ని మాదిరిగా అతడు శత్రు సేనలను హతమార్చుతున్నాడు. ఇరు పక్షాల వ్యూహాలు చెదిరిపోయి సంకుల సమరం జరిగింది. నెత్తురు వరదగట్టింది. నేలంతా మనుషుల, గుర్రాల, ఏనుగుల కళేబరాలతో, విరిగిపడిన రథాలతో భీతావహంగా ఉంది.

భీముడు.. దుర్యోధనుడి తమ్ముళ్లందరినీ చంపాలనే ఉద్దేశంతో వ్యూహాత్మకంగా కదిలాడు. దుర్యోధనుడి తమ్ముళ్ళందరూ త్వరలోనే గుమికూడి భీముణ్ణి అన్ని పక్కల నుంచీ ఎదురించారు. దుశ్శాసనుడు, దుర్విషహుడు, దుర్మతుడు, జయుడు,

జయత్సేనుడు, వికర్ణుడు, చిత్రసేనుడు, సుదర్శనుడు, చారుచిత్రుడు, సువర్మ, దుష్కర్ణ మొదలైన వారంతా భీముణ్ణి చుట్టుముట్టి తలపడ్డారు. భయం ఎరుగని భీముడు నిలబడి వారందరినీ నిలువరించి యుద్ధం చేశాడు. వారందరూ భీముణ్ణి పట్టుకొని ఖైదు చేయాలని ఉద్దేశంలో ఉన్నారు. అయితే భీముడికి మాత్రం వాళ్లందరినీ చంపాలని తలంపు. క్షణంలో భీముడి శాంతం నశించి క్రోధం అలముకొంది. గద చేతబట్టి పాదచారిగా నేలపైకి ఉరికి దృతరాష్ట్రుని కుమారులపైబడి త్వరగా చంపాలని భావించాడు. భీముని రథం సైన్యం మధ్యలో కనిపించకపోవడంతో ధృష్టద్యుమ్నుడు భయం చెంది పరుగెత్తి ఒక చోటకు వెళ్లాడు. అక్కడ భీముడి రథం కనిపించింది. దానిపై సారథి మాత్రమే ఉన్నాడు. భీముడు కనిపించలేదు. తన కళ్ల వెంట బాష్పాలు కారుతుండగా, రథ సారథి విశోకుడితో.. "నాకు ప్రాణప్రదమైన భీముడెక్కడ?" అని అడిగాడు. భీముడు మరణించాడేమోనని అతడి అనుమానం. విశోకుడు ధృష్టద్యుమ్నుడికి నమస్కరించి.. "భీముడు నన్ను ఇక్కడే ఉండమని చెప్పి, నేను చెపుతున్నది కూడా వినకుండా గద చేతబట్టి శత్రుసేనల మధ్యకు వెళ్లాడు" అని చెప్పాడు. భీముడి శత్రువులు బహు సంఖ్యాకులుగా ఉండటంతో అతణ్ణి చంపే అవకాశం ఉందని భయపడిన ధృష్టద్యుమ్నుడు తన రథాన్ని శత్రు సేనల మధ్యకు తోలుకొని వెళ్లి భీముడి కోసం వెదుకుతున్నాడు.

ఎక్కడ చూసినా ఏనుగుల కళేబరాలే దర్శనమిస్తున్నాయి. వాటిని దాటి పోతుండగా.. కౌరవ వీరులు తమ రథాలపై నుంచి యుద్ధం చేస్తుండగా వాటి మధ్య నేల మీద నిలబడి భీముడు పోరాడుతున్న దృశ్యాన్ని చూశాడు. భీముడికి అక్కడక్కడా శరీరంపై గాయాలయ్యాయి. ధృష్టద్యుమ్నుడు భీముణ్ణి కౌగలించుకొని తన రథంపైకి ఎక్కించుకొన్నాడు. అతడి శరీరంలోకి దిగిబడిన కొన్ని బాణాలను లాగి పడేశాడు. ఈ పరిస్థితిలో దుర్యోధనుడు తన వీరులను భీముడు, ధృష్టద్యుమ్నుడుపైకి పంపి వారు యుద్ధం ప్రారంభించకముందే వారిని ఎదుర్కోవాలని ఆజ్ఞ ఇచ్చాడు. ఆ మేరకు కౌరవ సైన్యం వారిద్దరినీ చుట్టుముట్టింది. గతంలో ద్రోణుడి వద్ద ఒక రహస్య అస్త్రాన్ని ధృష్టద్యుమ్నుడు పొంది ఉన్నాడు. ఆ అస్త్రాన్ని అతడు ప్రయోగించిన వెంటనే శత్రువులు మూర్ఛపోయారు.

ఇంతలో దుర్యోధనుడు అక్కడకు వచ్చి ధృష్టద్యుమ్నుడి అస్త్రాన్ని విరిచి వేసేందుకు ప్రత్యాస్త్రాన్ని ప్రయోగించాడు. తన వారినందరినీ మూర్ఛనుంచి తెప్పరిల్ల చేశాడు. ఆ సమయానికి యుదిష్టరుడి సైన్యం భీముడి, ధృష్టద్యుమ్నుడి సేనలకు సహాయంగా వచ్చింది. ఇందులో పన్నెండు రథాలున్నాయి. ఆ సైన్యానికి అభిమన్యుడు మార్గదర్శిగా ఉన్నాడు. ఇలా తమకు మద్దతుగా సైన్యం వచ్చి చేరడంతో ధృష్టద్యుమ్నుడు

కొంత ఊపిరి పీల్చుకున్నాడు. భీముడు కూడా బాణాల దెబ్బల బాధ నుంచి తేరుకున్నాడు. మరలా యుద్ధానికి సిద్ధమయ్యాడు. తాను కేకయుని రథమెక్కి అందరితో కలిసి పోరాడుతున్నాడు. ఆ రోజున ద్రోణుడు దుర్నిరీక్షుడై గొప్ప పరాక్రమం చూపాడు. ధృష్టద్యుమ్నుడి రథ సారథిని, గుర్రాలనూ చంపి, రథాన్ని కూల్చివేశాడు. దీంతో ధృష్టద్యుమ్నుడు అభిమన్యుడి రథం ఎక్కాడు. ద్రోణుడి ధాటికి పాండవ సైన్యం ఓర్చుకోలేకపోతోంది. దీంతో కౌరవ సైన్యం ద్రోణుణ్ణి విశేషంగా పొగిడింది.

సంకుల సమరాలు, సంఘాత మరణాలు ఈ రోజు ఎక్కువయ్యాయి. భీమ దుర్యోధనులు ఒకచోట ముఖాముఖి కలిశారు. పరుషమైన మాటల ఈటెలు విసురుకున్నారు. తరువాత పరస్పరం బాణాల ప్రయోగం చేసుకున్నారు. దుర్యోధనుడికి బాగా దెబ్బలు తగలడంతో తెలివి తప్పి పడిపోయాడు. బహు నైపుణ్యంతో కృపుడు దుర్యోధనుణ్ణి తన రథంపైకి ఎక్కించుకొని తీసుకుని వెళ్ళిపోయాడు. అక్కడికి భీష్ముడు వచ్చి పాండవులను ఎదిరించి చెల్లాచెదురు చేశాడు. సూర్యుడు పశ్చిమానికి కుంగుతున్నాడు. కానీ యుద్ధం మరో గంటపాటు కొనసాగుతూనే ఉంది. ఆ పోరు ఘోరంగా రూపుదిద్దుకొని సహస్రాల కొద్దీ సైనికులు మరణించారు. ఆ రోజుకు యుద్ధం ఆపారు. ధృష్టద్యుమ్నుడు, భీముడు క్షేమంగా గుడారానికి రావడంతో యుధిష్ఠరుడు ఎంతో సంతోషించాడు.

◈



నారాయణాస్త్రం ప్రయోగిస్తున్న
అశ్వత్థామ

## అధ్యాయం - 70

# ఏడో రోజు యుద్ధం

**దు**ర్యోధనుడు శరీరం నిండా గాయాలతో బాధపడుతూ భీష్ముడి వద్దకు వెళ్లాడు. "ప్రతి రోజూ యుద్ధంలో మనకు పరాజయమే ఎదురవుతోంది. మన వ్యూహాలు నిష్ఫలమవుతున్నాయి. మన యోధులు అసంఖ్యాకంగా చనిపోతున్నారు. నీవేమీ చేయకుండా చూస్తున్నావు" అని దుర్యోధనుడు అన్నాడు. భీష్ముడు.. దుర్యోధనుణ్ణి సౌమ్యమైన మాటలతో అనునయించాడు. "నీవెందుకు హృదయ దౌర్బల్యానికి తావిస్తున్నావు. ఇక్కడ మేమంతా ఉన్నాం. ద్రోణుడు, శల్యుడు, కృతవర్మ, అశ్వత్థామ, వికర్ణుడు, భగదత్తుడు, శకుని, అవంతి సోదరులిరువురూ, త్రిగర్త నాయకుడు, మగధ రాజు, అలాగే కృపాచార్యుడు వంటి గొప్ప వీరులు నీకోసం ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉంటే, నీవెందుకు అధైర్యపడతావు?. ఈ మాదిరి నిస్పృహను విడిచిపెట్టు" అని హితవు పలికి ఆరోజు యుద్ధానికి ఆజ్ఞ ఇచ్చాడు.

భీష్ముడు.. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి.. “వేలకొలది రథాలు, గుర్రాలు, రౌతులు, గొప్ప యుద్ధపుటేనుగులు, పూర్తిగా ఆయుధాలతో సిద్ధంగా ఉన్న దేశవిదేశాల నుంచి చేరిన పదాతి దళాలు.. యుద్ధంలో నీకోసం పాలుపంచుకుంటున్నాయి. ఈ చక్కని సేనతో నీవు దేవతలనైనా ఓడిస్తావు. భయపడొద్దు. నిస్పృహ చెందొద్దు” అని దుర్యోధనుణ్ణి హెచ్చరించాడు. దుర్యోధనుడి గాయాలు త్వరగా మానడానికి ఔషధాన్ని ఇచ్చాడు. దుర్యోధనుడు ఆ ఔషధాన్ని గాయాలకు రాసి ఉపశమనం పొందాడు. భీష్ముడి ధైర్య వచనాలతో తాను ధైర్యం చెంది యుద్ధభూమికి వెళ్లాడు.

ఆ రోజు సైన్యాన్ని వృత్తాకారంగా నిర్మించారు. ఒక్కో యుద్ధపు టేనుగును అమర్చిన ఏడు రథాలు, వాటికి బాసటగా ప్రతి రథానికి ఏడుగురు అశ్వికులు, ప్రతి అశ్వికుడికీ రక్షణ నిమిత్తం పదిమంది విలుకాళ్లు, ప్రతి విలుకాడినీ కాపాడేందుకు పదిమంది డాలును ధరించిన వారు ఉన్నారు. ప్రతివారూ కవచాలు ధరించారు. పూర్తిగా యుద్ధ పరికరాలతో నిండివున్న సైన్యం మధ్య దుర్యోధనుడు ఇంద్రుడిలా ప్రకాశిస్తున్నాడు.

యుధిష్టరుడు తన సైన్యాన్ని వజ్ర వ్యూహంలో అమర్చాడు. ఆ రోజు యుద్ధం వివిధచోట్ల ఒకే సారి తీక్షణంగా జరుగుతోంది. భీష్ముడు స్వయంగా అర్జునుడికి ఎదురుగా నిలిచాడు. మరోచోట ద్రోణుడు.. విరటుడికీ, ఇంకోచోట అశ్వత్థామ.. శిఖండికీ, మరో ప్రదేశంలో దుర్యోధనుడు.. ధృష్టద్యుమ్నుడికీ ఇలా ఇరు పక్షాల యోధులు ఎదురెదురుగా నిలిచారు. మరోచోట భీమసేనుడు.. కృతవర్మ, చిత్రసేనుడు, వికర్ణుడు, దుర్ముఖులను ఎదిరించాడు. భగదత్తుడు – ఘటోత్కచుడికీ, అలంబసుడు– సాత్యకికీ, భూరిశ్రవసుడు– దుష్టకేతునికీ, యుధిష్టరుడు – శృతాయువునకూ, చేకితానుడు– కృపునికీ ఇలా ప్రత్యేక స్థలాల్లో సంకుల సమరం జరిగింది. ద్రోణుడికీ విరటుడికీ మధ్య జరిగిన సమరంలో విరటుని రథం, గుర్రాలు భగ్నమయ్యాయి. సారథి కూడా గాయపడ్డాడు. దీంతో అతడు తన కుమారుడైన సంగుని రథం ఎక్కాడు. విరటుడి కుమారులైన ఉత్తరుడు, స్వేతుడు మొదటిరోజు యుద్ధంలోనే మరణించారు. ఈ రోజు విరటుడు తన రథం ఎక్కే సరికే సంగుడు కూడా మరణించాడు. ఇక ద్రుపదుడి కుమారుడు శిఖండి.. అశ్వత్థామ చేతిలో ఓడిపోయాడు. అతడి రథం ధ్వంసమైంది. దీంతో నేలపైనే కత్తీడాలుతో యుద్ధం చేశాడు. అశ్వత్థామ తన బాణాలతో శిఖండి కత్తిని ఖండించేశాడు. అయినా విరిగిన కత్తినే మెరుపు వేగంతో తిప్పి అశ్వత్థామపైకి విసిరాడు. దాంతో అశ్వత్థామ తన బాణంతో ఆ విరిగిన కత్తిని ఎగిరిపోయేలా చేశాడు. శిఖండికి బాగా దెబ్బలు తగిలాయి. దీంతో అతడు సాత్యకి రథం ఎక్కి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

సాత్యకి-అలంబసుల మధ్య పోరులో మొదట సాత్యకి భంగపడినా, తరువాత అలంబసును పలాయనం చిత్తగించేలా చేశాడు. దృష్టద్యుమ్నుడు-దుర్యోధనుడి మధ్య సమరంలో దుర్యోధనుడి గుర్రాలు చనిపోవడంతో అతడు రథం నుంచి దిగాల్సి వచ్చింది. అయినా కత్తి చేతబట్టి యుద్ధం చేశాడు. అప్పుడు శకుని వచ్చి తన రథంలోకి ఎక్కించుకున్నాడు. కృతవర్మ.. భీముడిపై అద్భుతంగా తలపడ్డాడు. కానీ చివరికి ఓడిపోయాడు. అతని రథం ధ్వంసమై, గుర్రాలు చనిపోవడంతో తన ఓటమిని అంగీకరించి శకుని రథం వద్దకు పరిగెడుతున్నాడు. ఆ సమయంలో భీముడి బాణ పరంపరకు కృతవర్మ బలహీనుడైపోయాడు. అవంతి రాజులైన విందానువిందులు ధామన్యుడి చేతిలో ఓడిపోయారు. వారి సైన్యానికి కూడా నష్టం జరిగింది. భగదత్తుడు.. ఘటోద్ఘజుణ్ణి ఎదిరించి అతడి అనుచరులను పారదోలాడు. కానీ ఘటోద్ఘజుడు ఒక్కడే నిలిచి ధైర్యంగా పోరాడాడు. చివరికి అతడు కూడా పరుగెత్తుకొని వెళ్లి తనను రక్షించుకున్నాడు. ఈ దృశ్యం కౌరవులకు ఆనందం కలిగించింది. ఇక శల్యుడు మేనల్లుళ్లను ఎదుర్కొన్నాడు. నకులుడి గుర్రాలు చనిపోవడంతో అతడు సహదేవుడి రథంపైకి ఎక్కాడు. ఇద్దరూ అదే రథం పైనుంచి యుద్ధం చేశారు. సహదేవుడు విడిచిన బాణంతో శల్యుడు మూర్ఛపోయాడు. అతని సారథి జాగ్రత్తగా రథాన్ని తప్పించి శల్యుణ్ణి రక్షించాడు. శల్యుడు వెనక్కి మరలడం చూసి దుర్యోధనుడి సైన్యం ధైర్యాన్ని కోల్పోయింది.

నకుల సహదేవులు ఉత్సాహంతో శంఖాలను పూరించారు. శల్యుని సేనను దునుమాడారు. మధ్యాహ్నం యుధిష్ఠరుడు - శ్రుతాయువుకు మధ్య పోరు జరిగింది. ఇరువురూ ఒకదాని తరువాత ఒకటిగా విడిచిన బాణాలన్నీ ఒకదానికొకటి రాసుకొని నిరుపయోగం అయ్యాయి. ఒకదశలో శృతాయుడు విడిచిన బాణంతో యుధిష్ఠరుడి కవచం తొలిగిపోయింది. దీంతో ఆగ్రహించిన యుధిష్ఠరుడు, బాణంతో.. శృతాయుడి వక్షస్థలాన్ని కప్పిన కవచాన్ని ఛేధించాడు. ఆరోజు యుధిష్ఠరుడు ఎప్పటిమాదిరిగా గాక తీవ్ర ఆగ్రహావేశుడై ఉన్నాడు. శృతాయుడి రథం ధ్వంసం అయ్యింది. గుర్రాలు చనిపోయాయి. దాంతో శృతాయుడు యుద్ధభూమి నుంచి పలాయనం చిత్తగించాడు. ఈ సంఘటనతో దుర్యోధనుడి సైన్యం భీతి చెందింది.

కృపాచార్యుడు చేకితానుడి మధ్య యుద్ధంలో రథం భగ్నమై సారథి మరణించడంతో చేకితానుడు గద తీసుకొని కృపుని సారథిని, గుర్రాలను చంపేశాడు. కృపుడు కూడా నేలమీద చేకితానుడుపై బాణాలు ప్రయోగించాడు. దీంతో చేకితానుడు బాగా గాయపడ్డాడు. శక్తి కూడదీసుకుని తన గదను వేగంగా తిప్పి కృపుడిపై విసిరాడు. కృపుడు దాన్ని తన బాణంతో పక్కకు మలిపాడు. ఇద్దరూ కత్తులు తీసుకొని ద్వంద్వ

యుద్ధానికి తలపడ్డారు. ఇద్దరికీ పెద్ద గాయాలయ్యాయి. అప్పుడు చేకితానుణ్ణి భీముడు తన రథంపైకి ఎక్కించుకొని తీసుకుపోయాడు. ఆ విధంగానే శత్రుశిబిరంలో శకుని.. కృపాచార్యుణ్ణి తన రథంపై తీసుకువెళ్లాడు. ధృష్టకేతుడు విడిచిన తొంభై ఆరు బాణాలు భూరిశ్రవసుడికి తగిలాయి. బాణాలన్నీ వక్షస్థలం వద్ద కవచానికి గుచ్చుకున్నాయి. అయినప్పటికీ అతడు అన్నిదిశలకూ ప్రసరించే సూర్యకాంతిలా కనపడ్డాడు. అంతబాధలోనూ పోరుసల్పి ధృష్టకేతుణ్ణి పరిగెత్తించాడు. దుష్టకేతు తన ఓటమిని అంగీకరించి పారిపోయాడు. దుర్యోధనుడి ముగ్గురు తమ్ముళ్లూ అభిమన్యుడిపై తలపడ్డారు. వారిని అభిమన్యుడు ఓడించి చంపకుండా విడిచిపెట్టాడు. ఎందువల్లనంటే వారిని తానే చంపుతానని భీముడు ప్రతిజ్ఞ చేశాడు. తరువాత భీష్ముడు.. అభిమన్యుణ్ణి ఎదురించాడు. ఇది అర్జునుడు చూశాడు. మహామహుడైన తన సారధి (శ్రీకృష్ణుడి)ని తన రథాన్ని భీష్ముడి వైపు పోనివ్వమని కోరాడు. ఆ సమయంలో మిగతా సోదరులు కూడా అర్జునుణ్ణి చేరుకున్నారు. కానీ వీరు ఐదుగురునీ సాయంత్రం అయ్యే వరకూ నిలువరించి దుర్యోధనుడు యుద్ధం చేశాడు.

సాయంకాలం కావడంతో ఆ రోజు యుద్ధాన్ని నిలుపుదల చేశారు. ఇరు పక్షాల యోధులూ అలసిపోయారు. గాయపడ్డారు. గుడారాలకు వెళ్లి గాయాలకు చికిత్స చేయించుకున్నారు. తరువాత ఒక గంట సమయం చల్లని సంగీతం వారి వీనులకు ఆనందం కలిగించేలా వినవచ్చింది. వాళ్లంతా అలా సేద తీర్చుకున్నారు. ఈ గంట కాలం యుద్ధం గురించిగానీ, శత్రుత్వం గురించి గానీ ఆలోచన రానీయక సుమృదు మధుర గానాలను వింటూ మహదానందం చెందారు. యుద్ధ విరామాల్లో ఇలాంటివి కూడా చేయదగినవే అని వ్యాసుడు చెప్పాడు.

◈



కురుక్షేత్ర యుద్ధంలో
ఘటోత్కచుడు

అధ్యాయం - 71

# ఎనిమిదోరోజు యుద్ధం

ఎనిమిదో రోజు ఉదయాన్నే భీష్ముడు తన సైన్యాన్ని కూర్మ వ్యూహంగా అమర్చాడు. అది చూసిన యుధిష్ఠరుడు.. ధృష్టద్యుమ్నుడితో, "అటు చూడు. శత్రువులు కూర్మ వ్యూహం పన్నారు. ఆ వ్యూహాన్ని ఛేధించేవిధంగా మన సైన్యాన్ని నీవూ ఏర్పాటు చేయాలి" అన్నాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు ఆ పనిలో నిమగ్నమయ్యాడు. పాండవ సైన్యాన్ని త్రిశూలాకారంగా అమర్చాడు. ఒక చివర భీముడు, మరో చివర సాత్యకి మధ్యభాగపు చివరిలో యుధిష్ఠరుడు ఉన్నారు.

యుద్ధం మొదలైంది. భీముడు.. దృతరాష్ట్రుని ఎనిమిదిమంది కుమారులను చంపాడు. ఈ దృశ్యం చూసిన దుర్యోధనుడు భయంతో కంపించిపోయాడు. కురు సభలో ద్రౌపదికి చేసిన పరాభవానికి ప్రతిగా భీముడు చేసిన ప్రతిజ్ఞను ఈ రోజు నెరవేర్చాడని అందరూ అనుకున్నారు. ఈ రోజు యుద్ధంలో తన కుమారుడు ఇరావస్తుడు చనిపోవడంతో అర్జునుడూ విషాదంలో మునిగిపోయాడు. ఈ ఇరావస్తుడు

అర్జునుడి నాగ భార్యకు జన్మించినవాడు. ఇతడు కురుక్షేత్రంలో పాండవుల పక్షాన యుద్ధంలో పాల్గొన్నాడు. ఇతణ్ణి ఎదుర్కోవడానికి దుర్యోధనుడు తన స్నేహితుడూ, రాక్షసుడూ అయిన అలంబసును పంపాడు. ఈ ఇద్దరి యుద్ధంలో ఇరావస్తుడు చనిపోయాడు. ఆ వార్త విని అర్జునుడు తీవ్ర విచారగ్రస్తుడయ్యాడు. అర్జునుడు.. శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి, "భరింపరాని విషాదాన్ని ఉభయ పక్షాల వారూ పొందుతున్నారు. ఆనాడు విదురుడు స్పష్టంగానే చెప్పాడు. మనమంతా ఈ దుర్మార్గమైన మారణకాండను ఒకరిపై ఒకరు ఎందుకు చేస్తున్నాము?. ఇంకా సంపద కొని తెచ్చుకోవడానికేనా?. ఈ చంపుకోవడం అయిన తరువాత వారుగానీ, మనంగానీ చివరికి ఏమి కనుక్కొంటాము?. యుధిష్ఠరుడు.. దుర్యోధనుడికి శాంతి సందేశం పంపినప్పుడు తనకు ఐదూళ్లు మాత్రమే ఇచ్చి మిగతా రాజ్యమంతా నీవే అనుభవించమని, అలా చేస్తే యుద్ధమే ఉండదని ఎందుకు అలా చెప్పాడో నాకు ఇప్పుడు తెలుస్తున్నది. దుర్యోధనుడు తన మూర్ఖపు బుద్ధితో ఆ ఐదు గ్రామాలనూ ఇవ్వనన్నందువల్లే ఈ పాపాలన్నీ చేయవలసి వస్తోంది. ప్రజలంతా నన్ను పిరికివాడిగా, నెమ్మదిగా ఊరకుండేవాడిగా తలచి నిందిస్తారనే నేను ఈ యుద్ధంలో పాల్గొంటున్నాను. మరణించిన యోధులను యుద్ధభూమిలో చూసినప్పుడల్లా భరించలేని బాధ కలుగుతోంది. ఈ నీచమైన పాపకార్యం చేయడానికి మనం ఎంత క్రూరలం అవుతున్నాం" అని వ్యథ చెందాడు అర్జునుడు.

ఇరావస్తుడు చనిపోవడం చూసిన ఘటోత్కచుడు పెద్దగా అరిచాడు యుద్ధభూమి దద్దరిల్లేలా. దీంతో అందరూ వణికిపోయారు ఏం జరిగిందోనని. ఘటోత్కచుడు తన సైన్యంతో కౌరవ సైన్యంపైకి ఉరికాడు. కౌరవ సైన్యం చెదిరిపోతోంది. ఇది చూసిన దుర్యోధనుడు.. ఘటోత్కచుణ్ణి ఎదిరించాడు. వంగదేశపు రాజు దుర్యోధనుడికి సహాయంగా తన ఏనుగుల బలంతో వచ్చాడు. దుర్యోధనుడు ఘనమైన పోరాటాన్నే చేశాడు. ఘటోత్కచుడి సైన్యంలోని అనేకమంది వీరులను చంపాడు. ఘటోత్కచుడు దుర్యోధనుడి మీదకు ఓ బల్లెం విసిరాడు. అది దుర్యోధనుణ్ణి చంపేదేగానీ, సరిగా అదే సమయానికి దుర్యోధనుడికీ, బల్లేనికి మధ్యకు ఓ ఏనుగు వచ్చింది. ఏనుగు మరణించింది. దుర్యోధనుడు బతికాడు. దుర్యోధనుడి విషయమై ద్రోణుడు ఆతృత చెంది తోడుగా అతడు తన గొప్ప సేనను పంపాడు. ఈ సేనలోని మహావీరులు ఘటోత్కచుణ్ణి ఎదురించారు. సమరం భీకరంగా సాగుతోంది. ఘటోత్కచుడి రక్షణార్థం యుధిష్ఠరుడు భీముణ్ణి సమరానికి పంపాడు. యుద్ధం అరివీర భయంకరంగా సాగింది. దుర్యోధనుడి పదిమంది సోదరులు మరణించారు.

భీకర యుద్ధం



## అధ్యాయం - 72

# తొమ్మిదో రోజు యుద్ధం

**తొ**మ్మిదో రోజు యుద్ధం ప్రారంభం కాకముందే, భీష్ముడితో దుర్యోధనుడు మంతనాలు జరిపాడు. యుద్ధ క్రమం బాగా లేదని విచారం తెలిపారు. తాను అనుకొన్నట్లు జరగడం లేదని ఆందోళన వ్యక్తం చేశాడు. భీష్ముడి హృదయానికి ఈటె గుచ్చిన చందంగా దుర్యోధనుడు నిందారోపణలు చేశాడు. అయినప్పటికీ భీష్ముడు శాంతయుతంగానే.. "యజ్ఞ అగ్నిహోత్రంలో ఘృతము హోమం చేసినట్లుగా నా శక్తిని, ప్రాణాన్ని కూడా నీకోసం వెచ్చిస్తున్నాను. నీకోసం నేను చేయగలిగినంతా చేస్తున్నాను. నీవెందుకు నన్ను చిన్నబుచ్చుతావు. నీకు యుక్తాయుక్త విచక్షణ, సామాన్య జ్ఞానం లేనట్లు కనబడుతోంది. ఒకడికి మృత్యువాసన్నమైన సమయంలో వృక్షాలు బంగారు చెట్లుగా కనపడ్డాయి అంటాడు. ఆ విధంగానే నీవు ప్రస్తుతం యధార్థస్థితిని గ్రహించడం లేదు. నీ దృష్టి మేఘావృత్తమైనట్లుంది. నీవు బుద్ధిపూర్వకంగా, ఆనందంతో, నాటిన 'పగ' అనే విత్తనాలు చెట్లయి ఇప్పుడు నీకు ఫలితం ఇస్తున్నది. కనుక

చేయవలసిన ఉత్తమ కార్యమేమంటే.. నీవు ఎంతవరకు యుద్ధం చేయగలవో అంతవరకు చేయడమే. కర్మ శుద్ధ సత్యం కూడా ఇదే. శిఖండితో నేను యుద్ధం చేయను. ఎందువల్లనంటే మహిళపై నేను చెయ్యెత్తను. పాండవులను చంపడం నాకు ఇష్టం లేదు. నేను చంపను. ఈ రెండూ వేరుచేసి మిగిలిన నీ శత్రువులందరితో నేను ఎంతసేపైనా యుద్ధం చేయగలను. కనుక క్షత్రియుడు చేయదగిన రీతిలో యుద్ధం చెయ్యి. పర్యవసానం ఎలా ఉన్నా నీకు కీర్తి లభిస్తుంది" అని ప్రేమ వాక్కులతో దుర్యోధనుడికి హితవు పలికాడు. ఆ రోజు యుద్ధంలో సైన్యాలను ఎలా నడింపిచాలో ఆజ్ఞలను జారీ చేశాడు. దుర్యోధనుడు ధైర్యం చెంది దుశ్శాసనుడితో.. "తమ్ముడా.. మన ప్రతాపమంతా ఈ రోజు యుద్ధంలో ఉపయోగించు. పితామహుడు (భీష్ముడు) తన పూర్తి శక్తినంతా ఉపయోగించి యుద్ధం చేస్తున్నాడని నాకు పూర్తిగా నమ్మకం కలిగింది. ఒక్క శిఖండిపై యుద్ధం చేయనని అంటున్నాడు. కావున శిఖండిని భీష్ముడికి ఎదురు రాకుండా మనం కనిపెట్టి చూడాలి. లేకుంటే అపాయం చేయగల సింహాన్నయినా అడవి కుక్క చంపుతుంది" అన్నాడు.

అభిమన్యుడికీ, అలంబసుకూ మధ్య పోరు జరిగింది. కీర్తియుతుడైన తన తండ్రి ప్రతాపానికి కొరత లేకుండా అభిమన్యుడు పోరాటం చేశాడు. అలంబసుడు రథం దిగి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు. సాత్యకి – అశ్వద్థామ, ద్రోణులకు మధ్య  గొప్ప యుద్ధం జరిగింది. అటు తరువాత పాండవులందరూ కలిసి భీష్ముడిపై తలపడ్డారు. దుర్యోధనుడు, దుశ్శాసనుడు భీష్ముడికి బాసటగా నిలబడ్డారు. భీష్ముడు వీరోచితంగా పోరాడి పాండవులను వెనుదిరిగేలా చేశాడు. పాండవ సైన్యమంతా భయభ్రాంతమై, చెల్లాచెదురై, అడవిలో మార్గం తెలియని రీతిలో పరిగెట్టే ఆలమందల మాదిరిగా తయారైంది. కృష్ణుడు రథాన్ని ఆపి, అర్జునుడిని ఉద్దేశించి.."పార్థా, పదమూడు సంవత్సరాలైన తరువాత ఈ రోజు కోసమే నీవూ, నీ అన్నదమ్ములు ఎదురు చూశారు. పితామహుణ్ణి చంపడానికి వెనుదీయకు. యోధుని కర్తవ్యమేమిటో గుర్తు పెట్టుకో" అన్నాడు. అర్జునుడు తన తలను వంచి పైకి చూడకుండా.. "ప్రేమ పాత్రుడైన పితామహుణ్ణి, గురువులను చంపడంకంటే నేను అడవుల్లో నివసించి ఉంటే బాగుండేది. అయినా నీ ఆజ్ఞ ప్రకారమే చేస్తాను. రథాన్ని ముందుకు నడిపించు." అన్నాడు. అర్జునుడి మనస్సు యుద్ధం చేయడంలో నిమగ్నమై లేదు. తనకు ఇష్టం లేకపోయినా, విచారగ్రస్తుడై ఉండి కూడా యుద్ధానికి వెళ్లాడు. అక్కడ భీష్ముడు మధ్యాహ్న సూర్యుడివలే పరాక్రమం చూపుతూ ప్రకాశిస్తున్నాడు. అర్జునుడి రథం భీష్ముడి వైపునకు వెళ్లడం చూసి అతడి సైన్యం ధైర్యం పొంది మరలా క్రమపద్ధతికి వచ్చింది. భీష్ముడి బాణాలు పరంపరగా వచ్చిపడి అర్జునుడి రథాన్ని, గుర్రాలను వేరుపరిచినట్లుగా

కప్పివేశాయి. కానీ శ్రీకృష్ణుడు బహు సున్నితంగా రథాన్ని నడుపుతున్నాడు. అర్జునుడు పలుసార్లు భీష్ముడి ధనస్సులను ధ్వంసం చేశాడు. భీష్ముడు మళ్లీ కొత్త ధనుస్సులతో వీరోచితంగా యుద్ధం చేస్తున్నాడు. శ్రీకృష్ణుడు అందుకొని, "ఓ అర్జునా! నీవు ఎలా పోరు సల్పాల్సి ఉందో అలా చేయలేదు" అని కోపగించి తాను రథం నుంచి దిగి చక్రధారియై భీష్ముడిపైకి పరిగెత్తాడు. శ్రీకృష్ణుడు తన వద్దకు రావడం చూసిన భీష్ముడు.. "వాసుదేవా! దయచేయండి. నా శరీరాన్ని ఆత్మ నుంచి వేరు చేయడానికి. నేను అదృష్టవంతుణ్ణి. రండి.. రండి.." అన్నాడు. అర్జునుడు తక్షణమే రథం దిగి ముందుకు పరిగెత్తి తన రెండు బాహువులతో బంధించి, "కృష్ణా! ఆగు. నీ ప్రతిజ్ఞ వీడకు. ఈ యుద్ధంలో ఆయుధం ఉపయోగించనని నీవు శపథం చేశావు. ఈ కృత్యం చేయాల్సింది నేను. నేను క్రమం తప్పను. నేనే బాణాలు వేసి ప్రేమాస్పదుడైన పితామహుణ్ణి చంపుతాను. దయ ఉంచి రథమెక్కి పగ్గాలు స్వీకరించు" అంటూ అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి వెనుకకు తీసుకువచ్చాడు. మరలా యుద్ధం జరిగింది. ఆ రోజు పాండవ సైన్యం చాలా నొచ్చుకున్నది. సూర్యాస్తమయం కావడంతో యుద్ధాన్ని నిలుపుదల చేశారు.



గాయపడి బాణాల పరుపుపై పడుకున్న భీష్ముడు

## అధ్యాయం - 73

# భీష్ముని పాటు

**అ**ది పదో రోజు యుద్ధం. అర్జునుడు భీష్ముణ్ణి ఎదురించాడు. శిఖండి బాణాలు భీష్ముడి హృదయాన్ని తాకినప్పుడు ఆయన కళ్ల నుంచి నిప్పులు రాలుతున్నాయి. కొంతసేపు భీష్ముడి క్రోధం జ్వాలగా మండింది. అతడి కళ్లు శిఖండిని దహిస్తాయన్నంతగా నిప్పులు కక్కుతున్నాయి. కానీ వెంటనే తన క్రోధాన్ని తమాయించుకున్నాడు. వీరుడైనవాడు మహిళను ఆయుధాలతో బాధించడం యుక్తం కాదని తలచాడు. శిఖండి స్త్రీ గా జన్మించినందున ఆమెపై అస్త్రశస్త్రాలు వేయకుండా ఉండటానికి తన క్రోధం ప్రేరేపణ కాకుండా ప్రయత్నించాడు. కానీ తన అంత్యకాలం సమీపించిదని అతడికి తెలిసిందే. అందువల్ల భీష్ముడు శాంతుడయ్యాడు.

తన శత్రువైన భీష్ముని మనస్తత్వం, అతడి హృదయాందోళన తెలియక శిఖండి తన బాణాలను అతడిపై ప్రయోగిస్తూనే ఉన్నాడు. అర్జునుడు కూడా తన హృదయాన్ని ఉక్కులా దృఢపరుచుకున్నాడు. శిఖండి వెనుక నుంచి అర్జునుడు..

తమ ఎదుట ఉన్న వీరుడైన భీష్ముడు యుద్ధ ప్రయత్నం చేయకపోయినా తన బాణ పరంపరను అతడిపై ప్రయోగిస్తూనే ఉన్నాడు. అవి తన శరీరాన్ని ఛేదిస్తూనే ఉన్నా.. భీష్ముడు నవ్వుతూ దుశ్శాసనుడితో.."ఆహా ఇవి అర్జునుడి బాణాలు. శిఖండివి కావు" అంటూనే ఒక బల్లేన్ని అర్జునుడిపై విసిరాడు. దాన్ని గాల్లోనే అర్జునుడు తుత్తినియలు చేశాడు. భీష్ముడిక యుద్ధం మానడానికి నిశ్చయించి, రథం దిగి కత్తీ-డాలు పట్టి యుద్ధం చేయడానికి సిద్ధమయ్యాడు. రథం దిగుతున్నప్పుడు అర్జునుడి బాణం భీష్ముడి డాలును ధ్వంసం చేసింది. దీంతో అర్జునుడు వేసిన ప్రతి బాణమూ భీష్ముడి శరీరంలో దిగబడ్డాయి. ఆయన శరీరమంతా గుచ్చుకున్న బాణాలు వేలాడుతున్నాయి. ఆ స్థితిలో భీష్ముడు కింద పడిపోయాడు. అతడు అలా పడిపోవడంతో ఆకాశం నుంచి యుద్ధాన్ని వీక్షిస్తున్న దేవతలు భీష్ముడికి గౌరవపూర్వకంగా నమస్కరించారు. సువాసన యుక్తమైన చల్లని మలయమారుతం వీచింది. చల్లని వర్షబిందువులు భూమి మీద చిలకరించ బడ్డాయి.

ప్రాణికోటిని, భూమిని పవిత్రం చేయడానికి అవతరించిన గంగకు పుత్రుడైన మహామహుడు, సహృదయుడూ అయిన భీష్ముడు అలా యుద్ధభూమిపై పడ్డాడు. తన తండ్రి ఆనందం కోసం, తన తండ్రి కోరకుండానే సృష్టిలోని కామవాంఛను విడిచిపెట్టిన ప్రశంసనీయుడు, పరుశురాముడి గర్వమణచిన మహావీరుడు, ధర్మాన్ని ప్రతిష్టించడానికి తన యావచ్ఛక్తిని ధారపోసినవాడు అయిన భీష్ముడు... దుర్యోధనుడి రుణం తీర్చి, మరణానికి సిద్ధమైనట్లు గాయపడి యుద్ధభూమిని పవిత్రం చేస్తూ పడి ఉన్నాడు.

శరీరం నిండా బాణాలు గుచ్చుకొని ఉండటంతో భీష్ముని శరీరం భూమిని తాకలేదు. తన శరీరంపై గుచ్చుకున్న బాణాలపైనే శయనించి ఉన్నాడు. భీష్ముడి శరీరం మునుపటి కంటే మిక్కిలి శోభిస్తోంది. ఇరు పక్షాలూ యుద్ధాన్ని ఆపేశాయి. యుద్ధ వీరులంతా వచ్చి బాణ శయ్యపై పడి ఉన్న భీష్ముడి చుట్టూ గుమిగూడారు. అందరూ తలలు వంచి బ్రహ్మదేవుని చుట్టూ దేవతలున్నట్లు నిలబడి ఉన్నారు. భీష్ముడు నెమ్మదిగా.. "నా తల ఆదరువు లేక వేలాడుతోంది" అనడంతో అక్కడున్న రాజులు తలగడలు తెప్పించారు. పితామహుడు వాటిని నిరాకరించాడు.

నవ్వుతూ అర్జునుడి వంక చూసి.. "కుమారా పార్థా!, వీరోచితమైన తలగడ నాకు ఇవ్వు" అన్నాడు. ఎవరి బాణాలు భీష్ముణ్ణి బాధపెడుతున్నాయో, వాటిని సంధించిన అర్జునుడు ఈ మాటలు విని.. తన అమ్ముల పొది నుంచి మూడు బాణాలను తీశాడు. వాటిని భీష్ముడి తలగడ మాదిరిగా ఉపయోగపడేలా ఏర్పాటు చేసి తల కిందకి వేలాడకుండా చేశాడు. తన చుట్టూ ఉన్నవారిని ప్రశంసించిన

భీష్ముడు.. "రాకుమారులారా, నా తలను నిలుపుకోవడానికి అర్జునుడి బాణాలే నాకు కావలసివచ్చాయి. ఈ తలగడే నాకు సంతృప్తినిచ్చింది. నేనిప్పుడు ఉత్తరాయణం, అంటే సూర్యుడు ఉత్తర గమనం చేసేవరకూ ఇలా ఉండాలి. అప్పుడగాని నా ఆత్మ వెళ్లిపోదు. ఆనాటికి మీలో సజీవులైనవారు వచ్చి నన్ను చూడగలరు" అన్నాడు. భీష్ముడు మరలా అర్జునుడివైపు చూసి.."నేను దాహంతో బాధపడుతున్నాను. నీళ్లు తెప్పించు" అని అడిగాడు. అర్జునుడు బాణాలను తీసి విల్లు ఆకర్ణాంతమూ ఎక్కుపెట్టి లాగి భీష్ముడికి పక్కనే కుడివైపున భూమిని ఛేదించాడు. భూమికి పడిన రంధ్రం నుంచి స్వచ్ఛమైన, మధురమైన గంగ పైకి ఎగిసింది. గంగ భీష్ముడి పెదవులను తాకింది.

తల్లి అయిన గంగే తన కుమారుని దాహం తీర్చడానికి ఇలా వచ్చిందని వ్యాసుడు చెప్పాడు. గంగను తాగి భీష్ముడు సౌఖ్యంగా ఉన్నాడు. కౌరవ రాకుమారుడైన దుర్యోధనుణ్ణి ఉద్దేశించి.. "దుర్యోధనా, నీవు బుద్ధిగలవాడవు అగుగాక!. నా దాహాన్ని తీర్చడానికి అర్జునుడు ఎలా గంగను తెచ్చాడో చూశావా?. ఈ ప్రపంచంలో ఈ పని చేయగలవాడు ఎవడు?. ఆలస్యం చేయకుండా పాండవులతో సంధి చేసుకో. నేను తిరుగుముఖం పట్టాను కనుక యుద్ధం కూడా అలాగే జరుగుతుంది. కుమారా, నా మాట విను. పాండవులతో సంధి చేసుకొని శాంతిని చేకూర్చుకో" అన్నాడు. భీష్ముడి ఆ మాటలు దుర్యోధనుడికి రుచించలేదు. చస్తున్నా రోగి మందును ఇష్టపడడు. ఎందుకంటే అది చేదుగా ఉంటుందని నిరాకరిస్తాడు. రాజులంతా తమ తమ గుడారాలకు వెళ్లిపోయారు.

◈



భీష్మణ్ణి
నమస్కరిస్తున్న
కర్ణుడు

## అధ్యాయం - 74

# కర్ణుడు - భీష్ముడు

**భీ**ష్ముడు గాయపడి ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడని తెలుసుకొని కర్ణుడు పితామహుని వద్దకు వచ్చాడు. భీష్ముడి పాదాల వద్ద నిలబడి.. "వంశ పితా, ఏ తప్పూ లేకుండా మీ ఆగ్రహానికి గురైన నేను, రాధ కుమారుడను. తమ వద్ద నమ్రతతో ప్రణామం చేస్తున్నాడు" అంటూ సాష్టాంగ దండ ప్రణామం చేశాడు కర్ణుడు. తన ఎదుట నిలిచిన కర్ణుణ్ణి చూశాడు భీష్ముడు. తన హృదయం ద్రవిస్తుండగా, ప్రేమపూర్వకంగా కర్ణుడి తలపై చేయివేసి నిమురుతూ.."ఓయీ కుర్రవాడా, నీవు రాధ కుమారుడవు కాదు. నీవు కుంతిదేవికి ప్రథమ సంతానం. ప్రపంచ రహస్యాలన్నీ తెలిసిన నారదుడు నాకీ విషయాన్ని స్వయంగా చెప్పాడు. సూర్యపుత్రా, నిశ్చయంగా నీయందు నాకు అయిష్టత లేదు. పాండవులు నీకేమీ అపకారం చేయకపోయినా, రోజురోజుకూ వారి పట్ల నీవు చూపిన అసహ్యతకు, పగకు నేను చాలా బాధపడ్డాను. నీ ప్రతాపమూ, నిష్కపటమూ నాకు తెలుసు. అదీగాక, ప్రభావంలో అర్జునుడు,

శ్రీకృష్ణుడు తరగతివాడివని నాకు తెలుసు. నీవు పాండవులతో సఖ్యతగా ఉండటం సమంజసం. వాళ్ల అన్నవైన నీకు అదే మంచి మార్గం. ఈ యుద్ధంలో నా పాత్ర ఎలా పూర్తయిందో, పాండవులతో నీ శత్రుత్వం కూడా అంతమైపోతుంది. కర్ణా, ఇదే నా కోరిక" అన్నాడు. భీష్ముడు చెప్పింది కర్ణుడు మర్యాదగా విన్నాడు. "పితామహా.. నేను కుంతీ కుమారుణ్ణనీ, రథ సారథి కుమారుణ్ణి కాననీ నాకు తెలుసు. కానీ నేను దుర్యోధనుడి అన్నం తిన్నాను. అతనికి నేను కృతజ్ఞుడనై ఉండాలి. నా వంశ చరిత్ర కూడా నిలబెట్టుకోవాలి. ఇప్పుడు నేను పాండవులను చేరడం జరిగే పనికాదు. దుర్యోధనుడు నన్ను ప్రేమించి నమ్మినందువల్ల, అతడి రుణాన్ని, అవసరమైతే ప్రాణమిచ్చి అయినా తీర్చుకోవడానికి తమరు నాకు అనుమతి ఇవ్వాలి. నేను మాటల ద్వారా, చేతల ద్వారా చాలా తప్పులు చేశాను. వాటిని తమరు క్షమించి, నన్ను ఆశీర్వదించాలని కోరుతున్నాను" అన్నాడు. మహామహుడు, గురువు, యుక్తాయుక్త కార్య విచక్షణా దక్షుడయిన భీష్ముడు.. కర్ణుడు పలికిన మాటలపై కొంత ఆలోచించి.. "నీవు చెప్పినట్లే చెయ్యి. అదే మార్గం" అన్నాడు.

భీష్ముడు దెబ్బలు తగిలి పడిపోయినప్పటికీ, యుద్ధం ఆగలేదు. ఆయన పలికిన తుది శాంతి వాక్యాలను కూడా నిరాకరించి, కౌరవులు యుద్ధం చేయడానికే నిర్ణయించారు. ఇప్పుడు భీష్ముడి నాయకత్వం లేకపోవడంతో కౌరవ సైన్యం కాపరిలేని గొర్రెల మంద మాదిరిగా అయ్యింది. భీష్ముడు వారికి దారి చూపలేదు.

గాయాలు తగిలి భీష్ముడు పడిపోయిన తక్షణమే, సైన్యమంతా.. "ఓయీ కర్ణా, నీవొక్కడివే మమ్మల్ని నడింపించగలవు. రక్షించగలవు" అని అరిచారు. కర్ణుడు నాయకత్వం తీసుకుంటే తమకు 'జయం నిశ్చయం' అని కౌరవ యోధులందరూ అనుకున్నారు. యుద్ధంలో మొదటి పదిరోజులు భీష్ముడి నాయకత్వంలో ఉన్నప్పుడు కర్ణుడు యుద్ధం చేయలేదు. భీష్ముడి ఎత్తిపొడుపు మాటలతో నొచ్చుకున్న కర్ణుడు అప్పుడు.. "నీవు యుద్ధం చేసినంత కాలమూ నేను యుద్ధం చేయను. నీవు పాండవులను చంపి దుర్యోధనుడికి జయం కలిగించగలిగితే నేను సంతోషిస్తాను. అప్పుడు రాజు ఆజ్ఞ తీసుకొని అడవికి పోతాను. కానీ నీవు పరాజితుడవై వీర స్వర్గం అలంకరిస్తే.. నేను, అతిరథుణ్ణి కాదని నీవన్న నేను, నా రథమెక్కి నాకంటే గొప్ప పరాక్రవంతులని నీవు పొగిడినవారిని ఎదుర్కొని, వారిని ఓడించి దుర్యోధనుడికి జయం తెచ్చిపెడతాను" అని కర్ణుడు ప్రతిజ్ఞ చేశాడు. దరిమిలా దుర్యోధనుడి అనుమతితో మొదటి పదిరోజులు యుద్ధంలో పాల్గొనలేదు. ఇప్పుడు.. అంపశయ్యపై మృత్యువు కోసం వేచి ఉన్న భీష్ముడి వద్దకు నడిచి వెళ్లి నమస్కరించి.. "అనుభవజ్ఞుడవూ పెద్దవాడవూ అయిన ఓ పితామహా!, పరుశురాముణ్ణి జయించినవాడా!, శిఖండి

బాణాలతో గాయపడి ఇలా యుద్ధభూమిలో పడి ఉన్నావు. ధర్మపథం వీడకుండా జీవించి.. వృద్ధుడవై, నిర్మలమైన అంతస్సుగల వీవే ఇలా పడి ఉన్నప్పుడు, ఈ ప్రపంచంలో ఎవరైనా తమ ఆధిక్యంతో అర్థ్వమైనవి కూడా పొందలేరని తెలుస్తోంది. కౌరవ రాజులు వారి ఉపద్రవాలను, ప్రవాహాలను తరించడానికి నీవే నావ వలే ఉన్నావని నమ్మి ఆధారపడి ఉన్నారు. ఇకపైన కౌరవులకు పాండవులు చేసే కార్యాలు బహు ప్రమాదకరంగా ఉంటాయి. అందువల్ల కౌరవుల్లో విషాదం వృద్ధి అవుతుంది. అగ్ని, వాయువు కలిసి అడవిని కాల్చేసినట్లు కృష్ణుడు, అర్జునుడు కౌరవ సేనను రూపుమాపుతారు. ఇది నిశ్చయం. నీ దయామృతాన్ని విరజల్లు నయనాలతో నన్ను చూసి సేనా నాయకత్వానికి అంగీకరించి నన్ను ఆశీర్వదించు" అని వినమ్రపూర్వకంగా కోరాడు. భీష్ముడు తన ఆశీస్సులను కర్ణుడికి అందించాడు. "విత్తనాలకు భూమిలా, ప్రాణికోటికి వర్షమేఘంలా, నిన్ను నమ్మిన వాళ్లను ఉద్ధరించగల విశ్వాసం కలవాడివి. దుర్యోధనుణ్ణి సేవించి అతన్ని రక్షించు. అతడి కోసం కాంభోజ రాజులను జయించావు. అతడి కోసం హిమాలయ ప్రాంతపు కట్టడాల్లో ఉన్న కిరాతకులను చంపావు. ఇప్పుడు కౌరవ సైన్యాన్ని నీ సొంత ఆస్తిలా స్వీకరించి జాగ్రత్తగా కాపాడు. దుర్యోధనుడి సైన్యాన్ని జయప్రదంగా నడిపిస్తావుగాక. నీకు అన్ని సంపదలూ కలుగుగాక. నీవు శత్రువులతో యుద్ధం చేయి. వెళ్లు" అని పితామహుడు కర్ణుణ్ణి ఆశీర్వదించాడు. కర్ణుడు తన రథమెక్కి యుద్ధభూమికి వచ్చాడు. మహా పరాక్రమవంతుడైన కర్ణుడు తన యుద్ధోపయుక్త రథంపై యుద్ధభూమికి వచ్చిన వెంటనే దుర్యోధనుడి ఆనందానికి అవధుల్లేకపోయింది. భీష్ముడి పాటు వల్ల కలిగిన అతని విచారం దీంతో కొంత తగ్గింది.

◈



ద్రోణుడితో
తలపడుతున్న
భీముడు

## అధ్యాయం - 75

# ద్రోణుడి నాయకత్వం

**దు**ర్యోధనుడు, కర్ణుడు.. కౌరవ ముఖ్య సేనానిగా ఎవరిని చేయాలనే అనే అంశంపై ఆలోచించారు. "మన వైపున యుద్ధం చేస్తున్న వీరుల్లో ప్రతివారూ ముఖ్య సేనా నాయకులుగా ఉండదగినవారే. రాజులంతా సమాన ప్రతిభ, బలం, శక్తి, నేర్పు, ధైర్యం, శూరత్వం, వంశాధిక్యత ఉన్నవారే. వీరందనీ కలిపి నాయకులుగా నియమించలేము. ఎవరినైనా ఒకరినే ఎన్నుకోవాలి. కానీ మిగిలిన వారు దురభిమానంతో తమ పూర్తి బలాన్ని యుద్ధంలో ఉపయోగించకపోతే మనకు నష్టం కలుగుతుంది. కనుక, నా సలహా ఏమిటంటే.. ఈ వీరులకూ, రాజులకూ ఆచార్యుడైన ద్రోణాచార్యులవారిని ముఖ్య సేనానిగా నియమిస్తే బాగుంటుంది. ఆయుధాలు ధరించిన వీరులు, రాజులూ అందరిలోనూ నిశ్చయంగా ద్రోణుడు గొప్పవాడు. కౌరవ సేనకు ప్రధాన నాయకత్వం వహించడానికి తగు గుణాలు ఉన్నవారిలో ఎవరూ ద్రోణుడికి సమానులు లేరు. కనుక ఆయన్నే మనం ఆ స్థానంలో ఉంచుదాము"అన్నాడు

కర్ణుడు.. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి. ఇందుకు దుర్యోధనుడు అంగీకరించాడు. సముచిత నిర్ణయం అన్నాడు.

దుర్యోధనుడు.. ద్రోణుడి వద్దకు వెళ్లి అందరు రాజులూ, యోధుల సమక్షంలో ఆయనకు వందనం చేశాడు. "గౌరవప్రదమైన గురువర్యా!, ఇక్కడున్న మహా రాజులందరిలోనూ నీవు వర్ణం, వంశ గౌరవం, శాస్త్రజ్ఞానం, వయస్సు, బుద్ధి, ప్రతాపం, నేర్పు.. అన్నింటిలోనూ అధికుడవు. కనుక తమరు మన సైన్యానికి ముఖ్య నాయకత్వం వహించాల్సిందిగా వేడుకొంటున్నాను. మీ నాయకత్వంలో మన సేనకు జయం కలుగుగాక!" అని అభ్యర్థించాడు. చుట్టూ ఉన్న రాజులు, తమకు సమ్మతిగా కరతాళధ్వనులు చేశారు. దుర్యోధనుడు సంతోషించాడు. అందరి సమక్షంలో వైభవంగా ద్రోణుణ్ణి ముఖ్య సేనానిగా అభిషేకించాడు. వీరుల, ప్రధానోద్యోగుల కలకలం, సింహనాదాలు, తూర్యరావాలతో చెలరేగి.. కౌరవులందరూ యుద్ధాన్ని జయించినంత మహోత్సవంగా భావించారు. ద్రోణుడి నాయకత్వంలో అందరికీ అలాంటి ఉత్సాహం, విశ్వాసం ఉంది.

ముఖ్య నాయకత్వ బాధ్యతలు స్వీకరించిన ద్రోణుడు.. తన సేనను వృత్తాకారంగా నిలబెట్టాడు. ఇదివరకు యుద్ధానికి దూరంగా ఉన్న కర్ణుడు.. ఇప్పుడు తన రథంపై యుద్ధభూమి నంతా కలియదిరుగుతున్నాడు. దీంతో కౌరవ యోధులంతా ఆనందాన్ని, ధైర్యాన్ని వ్యక్తపరిచారు.

మహామహుడైన భీష్ముడు, పాండు కుమారులను చంపడానికి ఇష్టపడలేదని, ఆ కారణంగా తన శక్తి సామర్థ్యాలను యుద్ధంలో ఉపయోగించలేదనే వార్త సైన్యం మొత్తం ప్రచారమైంది. ఇప్పుడు కర్ణుడు యుద్ధభూమిలో ఉన్నందున పాండవులు అతని చేతిలో హతులు కాక తప్పదని వీరులు, కౌరవ సేనలు భావించాయి.

ద్రోణుడు యుద్ధంలో మొత్తం ఐదు రోజులు ముఖ్య సేనానిగా ఉన్నాడు. వయసులో పెద్దవాడయినా, యుద్ధభూమిలో ఎక్కడ చూసినా తానై, ఒక యువ వీరుడిలా వ్యవహరిస్తున్నాడు. ద్రోణుడు ఎక్కడ ఎదిరించినా.. అక్కడ పాండవ సేన, తుపాను ముందటి మేఘాల్లా పరిగెత్తుతోంది. పాండవ పక్షంలోని గొప్ప వీరులందరినీ స్వయంగా ఎదురించి యుద్ధం చేస్తున్నాడు ద్రోణుడు. సాత్యకి, భీముడు, అర్జునుడు, అభిమన్యుడు, ద్రుపదుడు, కాశీరాజు వీరందరినీ పెక్కుసార్లు ఎదుర్కొన్నాడు. ముప్పతిప్పలు పెట్టాడు. ఓడించాడు. తాను యుద్ధం చేసిన ఐదు రోజులూ పాండవ సేన చాలా నష్టపోయింది.

## అధ్యాయం – 76

# యుధిష్టరుణ్ణి నిర్బంధించేందుకు విఫలయత్నం

ద్రోణుడు కౌరవ సైన్యానికి నాయకత్వం వహించిన వెంటనే.. దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు సమాలోచనలు జరుపుతూ ఒక నిశ్చయానికి వచ్చి ద్రోణుడి వద్దకు వెళ్లారు. "ఆచార్యా, యుధిష్టరుణ్ణి మీరు సజీవంగా పట్టుకొని అతణ్ణి మాకు అప్పగించాలి. మాకు మరేమీ అక్కరలేదు. పూర్తిగా జయం కలగకపోయినా సరే. ఈ పని నీవు మాకోసం నెరవేర్చితే మేము మిక్కిలి సంతోషిస్తాము" అని చెప్పాడు దుర్యోధనుడు ద్రోణుడితో. ఇది విన్న ద్రోణుడు మిక్కిలి ఆనందించాడు. ఎందుకంటే పాండవులను చంపడానికి ఆయనకూ ఇష్టం లేదు. తాను కౌరవుల పక్షాన ఉండి వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నప్పటికీ, పాండవులను ఎదురిస్తున్నప్పటికీ, కుంతి కుమారులను మిక్కిలి ప్రేమించేవాడు. అందులోనూ నిర్మల హృదయుడైన యుధిష్టరుణ్ణి

బాగా ప్రేమించేవాడు. కనుక దుర్యోధనుడు.. యుధిష్ఠరుణ్ణి సజీవంగా పట్టుకొని అప్పగించాలని కోరడం వల్ల ద్రోణుడి హృదయం తేలికపడింది. ద్రోణుడు.. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి, "దుర్యోధనా, నీకు శుభం కలుగుగాక. నీవు కూడా యుధిష్ఠరుణ్ణి చంపకుండా ఉంటావా?. ఈ విషయం నాకెంతో ఆనందం కలిగిస్తున్నది. నిజంగా యుధిష్ఠరుడికి శత్రువు లేడు. అందువల్లనే జనులందరూ ఆయనను 'అజాతశత్రువు' అంటారు. ఇప్పుడు నీవు చేసిన నిశ్చయమే తగినది. నీవు కూడా అతణ్ణి చంపకూడదని, సజీవంగా పట్టుకోవాలని కోరావో ఆ యుధిష్ఠరుడి కీర్తి పదిరెట్లు పెరుగుతుంది. యుద్ధంలో పాండవులను జయించి, ఆ తరువాత వారికి రాజ్యాధికారం ఇచ్చి, వారితో సఖ్యతగా, శాంతిగా ఉండటానికి నీవు నిశ్చయించినట్లు అర్థమవుతున్నది. యుధిష్ఠరుణ్ణి సజీవంగా పట్టుకోవాలనే నీ కోరికను బట్టి నేను ఇలా అనుకుంటున్నాను. నిశ్చయంగా యుధిష్ఠరుడు భూమిపై ఉన్నవాళ్లలో మిక్కిలి అదృష్టవంతుడు. దేవతలు అతడిపైన వాత్సల్యాన్ని జల్లుతున్నారు. అందువల్ల అతడు శత్రువు హృదయాంతరాళాల్లోకి కూడా జొరబడ్డాడు" అన్నాడు ద్రోణుడు.

అయితే, యుధిష్ఠరుణ్ణి సజీవంగా పట్టుకోవడంలో దుర్యోధనుడి తలంపు ద్రోణుడి ఊహకు వ్యతిరేకంగా ఉంది. తన కోరికను చెల్లిస్తానని ద్రోణుడు వాగ్దానమిచ్చాడు. దీంతో దుర్యోధనుడు తన ఆంతరంగంలో మెదిలిన ఆలోచనను ఇలా వెల్లడించాడు. 'యుధిష్టిరుణ్ణి చంపితే తనకేమీ మేలు జరగదు. పాండవులకు తన మీద మరింత క్రోధం పెరుగుతుంది. మునుపటికంటే యుద్ధం మరింత ఘోరంగా జరుగుతుంది. ఇందులో తన సైన్యమంతా కూలిపోతుంది. యుద్ధం విడవకుండా రెండు పక్షాల వారూ పూర్తిగా చనిపోయే వరకూ జరిగినా శ్రీకృష్ణుడు జీవించి ఉండి ద్రౌపదికిగానీ, కుంతికిగానీ రాజ్యాధిపత్యం అప్పగించగలడు. అందుచేత యుధిష్ఠరుణ్ణి చంపితే ప్రయోజనమేముంటుంది?. ఇలాగాక యుధిష్ఠరుణ్ణి జీవించి ఉండగానే పట్టుకుంటే యుద్ధంలో కౌరవులు సునాయాసంగా విజయం సాధిస్తారు. ఆ తరువాత యుధిష్ఠరుడి మంచితనాన్ని, ధార్మికత్వాన్ని అనువుగా తీసుకొని.. అతడు క్షత్రియోచిత కార్యాలకు మర్యాద చూపడంలో వెనుదీయని వాడు కనుక, నిశ్చయంగా తాను మరలా అతన్ని జూదంలో ఇరికించి తిరిగి అడవులకు పంపొచ్చు. ఈ పదిరోజుల యుద్ధ ఫలితాన్ని చూస్తే.. ఇంకా పోరు సల్పడం కురు వంశ నాశనానికే అన్నది విదితమౌతోంది. మా కోరికలేమీ నెరవేరవు" తన అంతరంగాన్ని ఇలా ద్రోణుడి ముందుంచాడు దుర్యోధనుడు. ఈ మాటలకు ద్రోణుడు ఖిన్నుడయ్యాడు. దుర్యోధనుణ్ణి తన హృదయంలోనే శపించాడు.

ద్రోణుడు.. యుధిష్ఠరుణ్ణి పట్టి ఇస్తానని దుర్యోధనుడికి వాగ్దానం చేశాడన్న

వార్త వేగుల ద్వారా పాండవ సైన్యానికి చేరింది. పాండవులు దీన్ని తీవ్రమైన అంశంగా భావించారు. ద్రోణుడు తానెలా చేస్తానని వాగ్దానం చేశాడో దాన్ని అతని యుద్ధ నైపుణ్య గొప్పదనం వల్లగానీ, శౌర్యం వల్లగానీ సాధించగలడని భావించిన పాండవులు దీన్ని తీవ్రమైన అంశంగా ఎంచారు. దీంతో పాండవులందరూ చురుగ్గా వ్యవహరించి, యుధిష్ఠరుణ్ణి సర్వదా రక్షించేలా తమ సైన్యాన్ని అప్రమత్తం చేశారు. యుద్ధ రీతులు, గమనాలు, ఎలా మారుతున్నా.. యుధిష్ఠరుడిపై శత్రువులు అకస్మాత్తుగా దాడి చేయడం గురించి కూడా ఆలోచించి జాగ్రత్త పడ్డారు.

కురు సైన్య ముఖ్య నాయకుడిగా నియుక్తుడైన మొదటిరోజు యుద్ధంలో ద్రోణుడు ఘనమైన ప్రావీణ్యాన్ని, బలాన్ని కనబరిచాడు. పాండవ సైన్యంలో తాను విహరిస్తూ.. ఎండు కట్టెల్ని అగ్ని దహించిన రీతిగా వారి సైన్యాన్ని చంపేస్తున్నాడు. ద్రోణుడి యుద్ధ చాతుర్యాన్ని చూసి యుద్ధభూమిని మృత్యుదేవత రంగస్థలంగా మార్చాడని అందరూ అనుకున్నారు. ధృష్టద్యుమ్నుడున్న దిశలోని సైన్యాన్ని రెండు భాగాలు చేశాడు. పాండవ సైన్యంలోని ఘనులైన వీరులతో ద్వంద్వ యుద్ధం జరిగింది. సహదేవుడికీ, శకునికీ మధ్య మాయ యుద్ధం జరిగింది. వారి రథాలు ధ్వంసం కావడంతో నేలపైన రెండు పర్వతాలు యుద్ధం చేస్తున్నాయా అన్నట్లు గదలతో ఒకర్నొకరు కొట్టుకొంటున్నారు. భీముడికీ, వివింశతికి గొప్ప యుద్ధం జరిగింది. ఇద్దరి రథాలు విరిగిపోయాయి. నకులుడు.. శల్యుడితో పోరు సల్పాడు. శల్యుడు నకులుణ్ణి దెప్పి పొడిచినా, ఎగతాళి చేసినా అతడు చేతిలో శల్యుని రథం ధ్వంసం అయ్యింది. శల్యుడు ఓటమితో అక్కణ్ణుంచి పారిపోయాడు. కృపాచార్యుడికీ, ధృష్టకేతుడికీ మధ్య పోరు జరిగింది. ధృష్టకేతుడు ఓడిపోయాడు. సాత్యకి– కృతవర్మ, విరాట కర్ణుల మధ్య ద్వంద్వ యుద్ధం జరిగింది. అయితే అభిమన్యుడు ఒక్కడే.. పైరవుణ్ణి, కృతవర్మను, జయద్రధుణ్ణి, శల్యుణ్ణి పరాజితుల్ని చేశాడు. అభిమన్యుడు తన కీర్తిని నిలబెట్టుకున్నాడు. శల్యుడు–భీముడి మధ్య యుద్ధంలో శల్యుడు ఓడిపోయి యుద్ధభూమి నుంచి తిరిగి వెళ్లిపోయాడు. కౌరవ సైన్యం ధైర్యం సడలింది. మరోవైపు పాండవ సైన్యం మరింత బలంతో కౌరవులను ఎదిరించి బెదరగొట్టింది.

ఇది చూసిన ద్రోణుడు.. యుధిష్ఠరుణ్ణి ఎదురిస్తే, తన సైన్యానికి కొంత ధైర్యం కలుగుతుందని నిశ్చయించాడు. తన బంగారు వర్ణ రథాన్ని నాలుగు గుర్రాలు లాగుతుండగా, ద్రోణుడు యుధిష్ఠరుడున్న దిక్కుకు వెళ్తున్నాడు. యుధిష్ఠరుడు.. ద్రోణుడిపై నిశితంగా బాణాలను ప్రయోగించాడు. ద్రోణుడు దీన్ని లెక్కచేయకుండా యుధిష్ఠరుడి సమీపానికి వచ్చాడు. ద్రోణుడి బాణ పరంపరకు యుధిష్ఠరుడి ధనుస్సు విరిగింది. ద్రోణుడు యుధిష్ఠరుణ్ణి సమీపిస్తుండగా, ధృష్టద్యుమ్నుడు ద్రోణుడికి

అడ్డుపడ్డాడు. కానీ ద్రోణుణ్ణి నిలువరించలేకపోయాడు. ద్రోణుడు.. యుధిష్టరుడికి మరింత దగ్గరగా వచ్చాడు. ఆ క్షణంలో అర్జునుడు.. కుప్పలుగా పడిఉన్న ఏనుగుల కళేబరాల మీదుగా, పడిపోయిన సైన్య రక్తపు ప్రవాహంలోంచి, భూమి కంపించే రీతిలో రథంపై యుద్ధభూమిలో ద్రోణుడు ఉన్న ప్రదేశానికి వచ్చాడు. అర్జునుడి గాండీవం నుంచి బాణాల పరంపర వెలువడుతున్నట్లు, ఆకాశమంతా బాణాలతో కప్పబడి చీకటి ఏర్పడినట్లు కనిపించింది. దీంతో ద్రోణుడు వెనక్కి తగ్గాడు. యుధిష్టరుడు ద్రోణుడికి పట్టుబడలేదు. ఆ రోజుకు యుద్ధం నిలుపుదల చేశారు. కౌరవ సైన్యం తమ బసలకు నిరుత్సాహంగా వెళ్లింది. పాండవ సైన్యంలో ఆనందోత్సాహం వెల్లివిరిసింది. ఈ విధంగా పదకొండో రోజు యుద్ధం ముగిసింది.

పన్నెండోరోజు
యుద్ధం



# అధ్యాయం - 77

# పన్నెండో రోజు యుద్ధం

**యు**ధిష్టరుణ్ణి సజీవుడుగా పట్టుకోవడం ద్రోణుడికి సాధ్యం కాలేదు. ఈ విషయమై ద్రోణుడు.. దుర్యోధనుడితో మాట్లాడాడు. "అర్జునుడు యుధిష్టరుడి వద్ద ఉన్నంతకాలం అతణ్ణి పట్టుకోవడం వీలుకాదు. నాకు ఆ పనిలో ఉత్సాహం లేకకాదు. ఏదైనా యుక్తితో.. అర్జునుణ్ణి యుద్ధభూమిలో మరోచోటకు వెళ్లేలా చేయగలిగితే, పాండవ వ్యూహాన్ని ఛేదించి యుధిష్టరుణ్ణి పట్టుకోగలుగుతాను. యుధిష్టరుడు మర్యాద విడిచి, యుద్ధభూమి నుంచి పరిగెత్తిపోకుండా ఉంటే నేను తప్పక అతణ్ణి పట్టి నీకు అప్పగిస్తాను. ఒకవేళ అతడు పారిపోయినా మనం గెలిచినట్లే కదా" అన్నాడు ద్రోణుడు. త్రిగర్త దేశ నాయకుడు ద్రోణుడి మాటలు విన్నాడు. ఇతడు తన సోదరులతో మాట్లాడి ఒక యుక్తిని పన్నాడు. అర్జునుణ్ణి తమతో యుద్ధానికి రమ్మని పిలిచి, అతణ్ణి వేరే స్థలానికి తీసుకుపోతామని సంశప్తకుడు శపథం చేసి చెప్పాడు. త్రిగర్త సైన్యమంతా గుమిగూడి అగ్నిగుండం చుట్టూ కూర్చొని ఉంది. సైనికులు శరీరాలను గడ్డితో

చుట్టుకొన్నారు. మనిషి చనిపోయిన తరువాత నిర్వహించే వంటి క్రియలు, హెూమాలు చేసి సైనికులు ఇలా శపథం చేశారు. "అర్జునుణ్ణి చంపందే మేం వెనక్కి మరలం. భయంతో మేము పారిపోతే.. మహాపాతకాన్ని చేసినవారిలా మేం శిక్షించబడతాంగాక" అంటూ పవిత్రాగ్ని సమక్షంలో శపథం చేసి వారు దక్షిణ దిశకు వెళ్లారు. దక్షిణ దిక్కు మృత్యువు దిశ అని ప్రతీతి. ఆ దిశకు వెళ్లి "ఓ అర్జునా" అంటూ అ యుద్ధానికి పిలిచారు. వీరు 'ఆత్మహత్యాదళంగా' గుమికూడి అర్జునుణ్ణి యుద్ధభూమిలో వేరొక దిశకు పిలుచుకుపోయే యత్నం చేశారు.

అర్జునుడు.. యుధిష్టరుణ్ణి ఉద్దేశించి, "రాజా సంశప్తకులు నన్ను యుద్ధానికి పిలుస్తున్నారు. ఇలా ఎవరైనా పిలిస్తే నేను వెళ్తానని ప్రమాణం చేశాను. సుశర్మ, అతని మనుషులు నన్ను యుద్ధానికి పిలుస్తున్నారు. నేను వారందరినీ చంపి తిరిగి వస్తాను. నేను వెళ్లడానికి సెలవివ్వు" అన్నాడు. సమాధానంగా యుధిష్టరుడు.."ప్రియ సోదరా, ద్రోణుడి ఉద్దేశం నీకు తెలుసు. అది నీ మనస్సులో ఉంచుకొని నీకేమి చేయడం ఉత్తమమో అదే చెయ్యి. నన్ను సజీవంగా పట్టి ఇస్తానని ద్రోణుడు దుర్యోధనుడికి బాస చేశాడు. ద్రోణుడు సాటిలేని వీరుడు. ధీరుడు. బలవంతుడు. శరవిద్య బాగా ఎరిగినవాడు. అతడికి అలసటే ఉండదు. ఏ అంశమూ అతని దృష్టి నుంచి పోదు" అన్నాడు. అర్జునుడు.."రాజా ఈ సత్యజిత్తు నీకు బాసటగా ఉంటాడు. అతడు సజీవిగా ఉన్నంతవరకూ నీకు ఎలాంటి అపాయమూ రాదు" అంటూ.. పాంచాల రాజకుమారుడగు సత్యజిత్తును యుధిష్టరుడికి బాసటగా ఉంచాడు. అర్జునుడు తాను ఆకలిగొన్న సింహంలా సంశప్తకులపైకి వెళ్లాడు.

అర్జునుడు.. శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి, "కృష్ణా! అటుచూడు. త్రిగర్తలు తాము తీసుకొన్న ప్రతిజ్ఞతో, గర్వోపేతులై, ఎలా నిలబడి ఉన్నారో చూడు. తాము తప్పక చస్తామని తెలిసీ ఆనందంతో ఉన్నారు. తాము స్వర్గానికి వెళ్లగలమనే ఉత్సాహంతో ఉన్నారు" అంటూ.. గొప్పవైన సంశప్తక దళాల వద్దకు వెళ్లాడు. అర్జునుడు వారితో గొప్ప యుద్ధం చేశాడు. కొంతసమయం గడిచాక సంశప్తక సైనికులు యుద్ధంలో తట్టుకోలేక గుట్టలు గుట్టలుగా పడి చనిపోతున్నారు. ఈదశలో సుశర్మ.. తాము చేసిన శపథాన్ని గుర్తుచేస్తూ సైనికులను హెచ్చరిస్తున్నాడు. "ఓ వీరులారా, మనం మనస్సాక్షిగా ఒట్టుపెట్టుకొన్నాం. ఇందుకు మహావీరులు సాక్షులుగా ఉన్నారు. భయంకర ప్రతిజ్ఞ చేసి మనం వెనక్కి తగ్గడం సిగ్గుచేటు. నలుగురూ మనల్ని చూసి నవ్వకుండా మనం నిలబడాలి. సంశప్తకులు తమ ఉత్సాహాన్ని సుశర్మకు తెలియజేస్తూ.. అర్జునుణ్ణి ఎదురించారు. తాము చనిపోయేవరకూ దెబ్బలాడగలమన్నదే వారి ధైర్యం. అర్జునుడు.. కృష్ణుణ్ణి ఉద్దేశించి.."హృషికేశా, వారు అంతమయ్యే వరకూ జగడం ఆడదలిచారు.

రథాన్ని అటు పోనివ్వు" అన్నాడు. శ్రీకృష్ణుని రథ సారథ్యంలో అర్జునుడి రథం.. దేవాసుర యుద్ధంలో ఇంద్రుని రథంలా బహువిధంగా పరిగెడుతూ. వెళ్లినచోటల్లా త్రిగర్త సైన్యాన్ని పీనుగుల పెంట చేసింది. రథం తిరిగిన ప్రతిచోటా అర్జునుడు శత్రువుపై తన గాండీవంతో రుద్రుని ప్రళయ తాండవంలా బాణ పరంపరను కురిపించి సైనికులను మట్టుబెట్టాడు. ఆ ప్రదేశాలన్నీ తెగిన అవయవాలతో, తలలు తెగిన మొండేలతో ఘోరంగా తయారయ్యాయి. ఇలా ఉండగా.. ద్రోణుడు తన సైన్యాన్ని తీసుకొని పాండవులపైకి వెళ్లాడు. యుధిష్టరుడు ఉన్న ప్రదేశానికి వచ్చాడు.

ద్రోణుడి తీరు గమనించిన యుధిష్టరుడు.. పాంచాల రాజ కుమారుడైన ధృష్టద్యుమ్నుణ్ణి ఉద్దేశించి.. "ఈ బ్రాహ్మణుడు నన్ను పట్టుకోవడానికి వస్తున్నాడు. సైన్యాలను అప్రమత్తంగా ఉంచు" అని హెచ్చరించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి రాకకోసం ఆగక.. తానే అతడికి ఎదురుగా వెళ్లాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుణ్ణి తప్పించుకొని మరో దిశకు వెళ్లాడు. తన మృత్యువు ధృష్టద్యుమ్నుడు చేతిలోనే ఉందని, ఆ మృత్యువు ఇంకా సమీపించలేదని తలిచాడు. దాంతో ద్రుపదుడి సైన్యంతో యుద్ధం చేసేందుకు ద్రోణుడు అక్కడికి వెళ్లాడు. ద్రోణుడి చేతిలో ద్రుపదుడి సైన్యం చాలా నష్టపోయింది. యుద్ధభూమిలో రక్తం ఏరులై పారింది. ద్రోణుడు తన దృష్టిని మరల్చాడు. యుధిష్టరుడి వైపు కదిలాడు. పాండవులు ధైర్యంగా నిలబడి ద్రోణుడి బాణ పరంపరకు ధీటైన జవాబు ఇచ్చారు. సత్యజిత్తు ద్రోణుడి రథంపై దృష్టి పెట్టి దాన్ని ధ్వంసం చేస్తున్నాడు. ఆ సమయంలో సంకుల సమరం జరిగింది. ద్రోణుడి విగ్రహం ప్రళయ భయంకరంగా ఉంది. చాలా మంది పాండవ సైన్య వీరులు వరుసగా మరణించారు. వృకుడనే పాంచాల రాజు కుమారుడు, సత్యజిత్తు కూడా మరణించాడు. ఇది చూసి విరటుని కుమారుడగు శతానీకుడు ద్రోణుడిపైకి వెళ్లాడు. రెప్పపాటు కాలంలోనే అతడి శరీరం నిర్జీవంగా మారింది. కేతముడు కూడా ద్రోణుడికి ఎదురు నిలబడి అలాగే చనిపోయాడు. ఆ పైన వసుధానుడు ద్రోణుడి రాకకు అడ్డుపడి ఎదిరించి మృతి చెందాడు. యుధామన్యుడు, సాత్యకి, శిఖండి మొదలగువారు ద్రోణుడిపైకి వెళ్లి అతణ్ణి వెనక్కి తరిమే ప్రయత్నం చేశారు. కానీ ద్రోణుడు వారినందరినీ పారదోలి యుధిష్టరుడున్న చోటుకు రాసాగాడు. ఆ సమయంలో ద్రుపదుడి మరో కుమారుడు పాంచాల్యుడు.. ద్రోణుడికి తీవ్రంగా అడ్డం పడి అతడితో గొప్ప యుద్ధం చేశాడు. కానీ ఇతడూ బాగా గాయపడటంతో నింగిలోని నక్షత్రంలా రథం నుంచి నేల కూలాడు.

అప్పుడు దుర్యోధనుడు ఆనంద పరవశుడై కర్ణుణ్ణి ఉద్దేశించి.. ''రాధేయా, మన సేనాని అయిన మహామహుని ప్రతాపం చూస్తున్నావా?. ఇక పాండవులు

యుద్ధం చేయడానికే ఇష్టపడరు. ద్రోణుడి ఒత్తిడి వల్ల వారి సేన ఎటు తిరుగుతున్నదో చూడు” అన్నాడు. కర్ణుడు తల ఊపి.. “నీవు అంత దృఢ నమ్మకంతో ఉండొద్దు. పాండవులు అంత త్వరగా ఓడిపోరు. వీరు మనలా పొంగిపోయి ఓటమిని ఒప్పుకోరు. వారు పడ్డ ఘోర కష్టాల వల్ల వారెప్పుడూ భయపడరు. నీవు వారిని విషం పెట్టి చంపాలని ప్రయత్నించావు. వారిని.. బతికుండగానే అగ్నికి ఆహుతి చేయడానికి సిద్ధపడ్డావు. జూదంలో వారికి మిక్కిలి విచారం కలిగించి వారిని నీచపరిచావు. వారు అడవులకు పోయేటట్లు చేశావు. సంవత్సరాల తరబడి వారిని అడవులు పట్టి తిరిగేలా చేశావు. వారెంత మాత్రమూ మనకు లోబడరు. అటు చూడు వారి సేన మరలా కుదుటపడి అన్ని భాగాలూ కలిసి ద్రోణుడిపైకి వెళ్తున్నాయి. అక్కడ చూడు, భీముడు, సాత్యకి, యుధామన్యుడు, క్షత్రధర్మ, నకులుడు, ఉత్తమౌజసుడు, దృపదుడు, విరటుడు, శిఖండి, ధృష్టకేతు ఇంకా అనేక మంది వీరులు యుధిష్ఠరుణ్ణి రక్షించడానికి వచ్చారు. ద్రోణుడికి చాలా ఒత్తిడి కలిగిస్తున్నారు. ఆచార్యుడిపై ఇంత బరువుంచి మనం ఇక్కడ చూస్తూ నిలబడ కూడదు. అతడెంత గొప్పవాడైనా, అతడు భరించగల భారానికి ఒక పరిమితి ఉంది. తోడేళ్ల గుంపు కలిసి గొప్ప ఏనుగును చీకాకు పెట్టి చంపగలవు. వెళ్దాం పద. ఇకపై ఎంతమాత్రం రక్షణ లేకుండా ద్రోణుణ్ణి విడిచిపెట్టడం సరికాదు” అన్నాడు కర్ణుడు.



భగదత్తునిపై బాణాలు
సంధించిన అర్జునుడు

## అధ్యాయం - 78

# ధైర్యశాలి భగదత్తుడు

**యు**ధిష్ఠరుణ్ణి ఖైదు చేయడానికి ద్రోణుడు ఎన్ని ప్రయత్నాలు చేసినా సాధ్యం కాలేదు. దుర్యోధనుడు ఒక గొప్ప ఏనుగు దళాన్ని భీముడిపైకి లఘింపజేశాడు. భీముడు తన రథం పైనుంచే కాచుకుంటూ, బాణ వర్షం కురిపించాడు. అతడు చంద్రవంక బాణాన్ని దుర్యోధనుడిపై విడిచాడు. అతడి రథంపైన పతాకం ఊడి పడింది. చేతిలోని ధనుస్సు విరిగి పడింది. దుర్యోధనుడీ విధంగా చిక్కులు ఎదుర్కనే సమయంలో మ్లేచ్ఛ దేశ రాజు అంగుడు తన గొప్ప ఏనుగుపై కూర్చొని భీముణ్ణి ఎదురించాడు. కానీ భీముడు వేసిన పదునైన బాణాలు ఏనుగును నేల కూల్చాయి. మ్లేచ్ఛ రాజు కూడా హతమయ్యాడు. ఈ సంఘటనలు జరిగిన వెంటనే ఆ భాగంలో ఉన్న కౌరవ సైనికులు భయంతో అన్నివైపులకూ పారిపోయారు. ఏనుగులు ఎప్పుడైతే చెదిరాయో, గుర్రాలు కూడా భయపడి పారిపోయాయి. దిశలు తెలియకుండా ఏనుగులు, గుర్రాలు పరిగెడుతుంటే పదాతి దళాలకు చెందిన అనేకమంది వాటికింద పడి మరణించారు.

ఈ సమరంలో కౌరవ సైన్యం భయభ్రాంతమైంది. ప్రాగ్జోతిష రాజు, ధైర్యశాలి అయిన భగదత్తుడు ఆగ్రహం చెందాడు. అతడు ప్రఖ్యాతి చెందిన, తన ప్రతీక చెందిన ఏనుగును (సుప్రతీకం) ఎక్కి భీముణ్ణి ఎదుర్కొన్నాడు. ఆ సుప్రతీకం చెవులు బాగా తెరుచుకొని, తొండాన్ని తిప్పుతూ, భీముడి రథంలోకి చొరబడింది. తక్షణమే రథం కూలిపోయింది. దాని గుర్రాలూ నేలపై కరుచుకున్నాయి. సకాలంలో భీముడు రథం దిగి తనను తాను రక్షించుకున్నాడు. అతడికి ఏనుగు తత్వం తెలుసు. భగదత్తుడు ఎక్కిన సుప్రతీకం కిందకు దూరి దాని ఆయువుపట్టు అయిన ప్రదేశంలో ముష్టిఘాతాలు కురిపించాడు. ఆ గొప్ప ఏనుగు పిచ్చెత్తినట్లు వ్యవహరిస్తూ.. భీముడి కాలును పట్టుకొని గాయపరచడం ప్రారంభించింది. భీముడు ఆ ఏనుగును విసిరి వేయడానికి ప్రయత్నించాడు. కానీ ఏనుగు తన తొండంతో ఎత్తి మోకాలుతో నలిపివేయడానికి ఉద్యుక్తమవుతుండగా, భీముడు పెనుగులాడి అతి కష్టం మీద తప్పించుకున్నాడు. మళ్లీ ఏనుగు కిందకు దూరి దాని కింది భాగంలో ముష్టిఘాతాలు విసిరాడు. భీముడు ఏనుగు కింద దూరి ఉన్నందున ఎవరికీ కనపడకపోవడంతో అతడు మరణించాడని కౌరవ సైన్యం భావించింది. “భీముడు చచ్చాడు” అంటూ కురుక్షేత్రం అంతా వినబడేలా కురు సైన్యం అరిచి కేకలు పెట్టింది. యుధిష్టరుడికి ఆ కేక వినపడింది. భీముడు చనిపోయాడని తలచి భగదత్తుణ్ణి చంపడానికి సైన్యాన్ని పంపాడు.

భగదత్తుణ్ణి దశార్ణ రాజు ఎదురించాడు. దశార్ణుడి ఏనుగు కూడా భయంకరమైనదే. భగదత్తుడు ఏనుగు సుప్రతీకం, దశార్ణుడి ఏనుగు మధ్య గొప్ప యుద్ధం జరిగింది. భగదత్తుని సుప్రతీకం ఒక దంతం దశార్ణుడి ఏనుగు పక్కన దిగబడింది. ఆ రెండింటి మధ్య గొప్ప యుద్ధం జరిగింది. దశార్ణుడి ఏనుగు చనిపోయింది. ఆ సమయంలో భీముడు సుప్రతీకం కింద నుంచి బయటకు వచ్చాడు. భీముణ్ణి చూసిన పాండవ సైన్యం ఎంతో ఆనందించింది. భగదత్తుడు అన్ని వైపుల నుంచీ వచ్చిన సైనికుల మధ్య చిక్కుకుపోయాడు. కానీ అతడు అధైర్యపడలేదు. తన సుప్రతీకంపై ఎక్కి కొండపై కార్చిచ్చులా ప్రకాశిస్తున్నాడు. ఎంతోమంది శత్రువులు చుట్టుముట్టి ఉన్నప్పటకీ వారిని లక్ష్యం చేసుకోకుండా అతడు తన ఏనుగును సాత్యకి రథం మీదకు తోలాడు. ఏనుగు తొండంతో రథాన్ని చుట్టి గాల్లోకి ఎత్తి పడేసింది. ఈ లోగా సాత్యకి రథం నుంచి కిందకి లంఘించి తన ప్రాణాన్ని కాపాడుకున్నాడు. సాత్యకి రథ సారథి బహు నేర్పుతో రథం పాడు కాకుండా గుర్రాలు చావకుండా చతురతతో అక్కణ్ణుంచి తప్పించుకున్నాడు. రథాన్ని తిరిగి సాత్యకి వద్దకు తీసుకువెళ్లాడు. భగదత్తుడి సుప్రతీకం పాండవ సైన్యానికి చాలా నష్టమే కలిగించింది.

అసురులతో యుద్ధం చేసే ఇంద్రుడు, ఐరావతంపై ఉన్నట్లు భగదత్తుడు

తన ఏనుగు సుప్రతీకంపై ఉన్నాడు. సుప్రతీకం చెవులు విప్పార్చి, తొండాన్ని ఎత్తి పరిగెడుతూ, లెక్కలేనన్ని గుర్రాలను, రథాలను ధ్వంసం చేసింది. పాండవ సైన్యాన్ని బీభత్సానికి గురిచేసింది. సుప్రతీకంపై పడిన బాణాలతో అది బాధ చెంది కోపంతో స్వైర విహారం చేసింది. ఆ విధంగా భగదత్తుడు పాండవ సైన్యాన్ని పశువులను పరిగెత్తించినట్లు పరిగెత్తించాడు.

ఈలోగా భీమసేనుడు మరో రథాన్ని, ఆయుధాలను సమకూర్చుకొని మళ్లీ భగదత్తుడుపై పడ్డాడు. సుప్రతీకం ఘీంకరిస్తూ తన తొండం నుంచి జిగటగల తుంపరలను భీముని రథాశ్వాలపై చిమ్మింది. ఆ గుర్రాలు బెదిరి సారథిని లక్ష్య పెట్టకుండా పారిపోయాయి. ఎక్కడైతే సుప్రతీకం బీభత్సం చేస్తోందో ఆ యుద్ధభూమి అంతా ధూళి రేగి మేఘాల వలే కనపడుతోంది.

సంశప్తకులతో యుద్ధం చేస్తున్న అర్జునుడు.. భగదత్తుని ఏనుగు చేస్తున్న కోలాహలం గురించి విన్నాడు. అక్కడి పరిస్థితి ప్రమాదకరంగా ఉందని తలచి అర్జునుడు శ్రీకృష్ణుడిని ఉద్దేశించి..“మధుసూదనా, భగదత్తుని ఏనుగు సుప్రతీకం ఘీకారం అదిగో. ఏనుగుపై నుంచి భగదత్తుడు చేసే యుద్ధం ఎవరికీ రాదు. దాన్ని ఎవరూ ఎదుర్కోలేరు. భగదత్తుడు మన వారిని ఓడించి భగ్న పరిచి ఉండేఉంటాడు. మనం తక్షణమే అక్కడికి వెళ్లి పరిస్థితిని చక్కబరచాలి. ఈ సంశప్తకులను చాలా మందిని చంపాం. ద్రోణుడు.. యుధిష్ఠరుణ్ణి ఎదురించే ప్రదేశానికి రథాన్ని తీసుకువెళ్లు.” అన్నాడు. ఆ ప్రకారమే శ్రీకృష్ణుడు రథాన్ని తీసుకువెళ్తున్నాడు. ఆ సమయంలో సుశర్మ, అతడి సోదరులు వెనుక నుంచి ‘ఆగు ఆగు’ అని అర్జునుణ్ణి పిలుస్తూ అతడిపై బాణాలను ప్రయోగిస్తున్నారు. అర్జునుడు ఇలా అనుకున్నాడు. ‘ఇక్కడ సుశర్మ నన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు. పిలిచినప్పుడు నేను వెళ్లకపోతే సరికాదు. అక్కడ ఉత్తర దిశలో మా సేనంతా చెదిరి పాడైనట్లు కనిపిస్తోంది. వారికి వెంటనే సహాయం అవసరం’ అని తర్కించుకుంటుండగా.. ఒక బల్లెం అర్జునుడి పైకి, మరోటి కృష్ణుడిపైకి విడిచారు. అర్జునుడికి ఆగ్రహం పెల్లుబికింది. మూడు నిశిత బాణాలు సుశర్మపై వదిలాడు. దీంతో సుశర్మ తిరుగుముఖం పట్టాడు. ఇక ఏ మాత్రం ఆలస్యం చేయక కృష్ణార్జునులు.. భగదత్తుడు పాండవ సైన్యంపై యుద్ధం చేసే ప్రదేశానికి వెళ్లారు.

అర్జునుడి రథాన్ని చూసిన పాండవ సైనికులు మరలా ధైర్యాన్ని కూడదీసుకున్నాయి. అర్జునుడు భగదత్తుణ్ణి చేరుకున్నాడు. భగదత్తుడు సుప్రతీకంపై నుంచి అర్జునుణ్ణి మృత్యుదేవతలా ఎదుర్కొన్నాడు. ఎన్నిసార్లు సుప్రతీకం తమపై పడబోయినా, అన్నిసార్లూ తన నిపుణతతో శ్రీకృష్ణుడు తప్పిస్తూనే ఉన్నాడు.

కృష్ణార్జునులపై భగదత్తుడు బాణాలు వేస్తూనే ఉన్నాడు. అర్జునుడి బాణం సుప్రతీకం కవచాన్ని ఛేదించి దానికి బాధ కలిగించింది. తన సుప్రతీకం చాలా సమయం యుద్ధం చేయలేదని గ్రహించి భగదత్తుడు శ్రీకృష్ణుడిపై ఒక బల్లేన్ని విసిరాడు. అర్జునుడు తన బాణంతో దాన్ని మధ్యలోనే ధ్వంసం చేశాడు. భగదత్తుడు విసిరిన మరో బల్లెం అర్జునుడి శిరస్త్రాణానికి తగిలింది. తన శిరస్త్రాణాన్ని సవరించుకొని అర్జునుడు తన ధనస్సును ఎక్కుపెట్టి "భగదత్తా, నీవు ప్రపంచాన్ని ఆఖరుసారిగా చూసుకో. మరణానికి సిద్ధంగా ఉండు" అన్నాడు. భగదత్తుడు వృద్ధుడు. ప్రపంచజ్ఞానంలో పండిపోయినవాడు. అతని తెలుపు-నలుపు వెంట్రుకలు, నిర్మలమైన ముఖంపై ముడతలు, ఇవన్నీ కలిసి ఒక సింహ వదనంలా కనపడుతున్నాయి. భగదత్తుడు ఎంత వృద్ధుడంటే, తన కళ్ల పైనున్న చర్మం జారి కళ్లపై పడుతోంది. తన దృష్టికి ఆటకం కలగకుండా ఒక పట్టు వస్త్రంతో ముఖ ముడతలను పైకి ఎగదోసి కట్టుకున్నాడు. భగదత్తుడు అంటే ఆ కాలం రాజుల్లో ప్రసిద్ధి చెందిన ధైర్యశాలి. ప్రతాపంలోనూ, నిర్మల గుణంలోనూ అతడికి సమానులు ఎవరూ లేరని ప్రతీతి. ప్రజలు అతన్ని ఇంద్రసఖుడని పిలిచేవారు. అతడి కీర్తి, ప్రభావాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ పేరున పిలిచేవారు.

"ఆఖరిసారిగా నీ చుట్టూ చూసుకో" అని అర్జునుడు భగదత్తుడిపై ఓ నిశిత బాణాన్ని సంధించాడు. భగదత్తుడు ధనుస్సు విరిగిపోయింది. భగదత్తుడు తన ఏనుగు సుప్రతీకాన్ని అదుపు చేసే అంకుశాన్ని అర్జునుడి మీదకు వదిలాడు. ఆ అంకుశాన్ని బాగా గురిపెట్టి, వైష్ణవ మంత్రయుక్తంగా విడిచిపెట్టాడు. అది అర్జునుణ్ణి చంపేదే గాని, శ్రీకృష్ణుడు మధ్యకు వచ్చి ఆ అంకుశాన్ని ఎదుర్కొన్నాడు. ఆ ఆయుధం అతని వక్షస్థలంపై కంఠాభరణమై మెరుస్తోంది. అంకుశం వైష్ణవ మంత్ర పూరితమై ఉండటంతో ఆ ఆయుధం శ్రీకృష్ణుడికి హాని కలిగించక, అతడికి కంఠాభరణమైంది. అప్పుడు అర్జునుడు.. శ్రీకృష్ణుడికి తన అసమ్మతిని తెలియజేశాడు. "జనార్ధనా, శత్రువు విడిచిన ఆయుధానికి నీవెందుకు అడ్డుపడ్డావు?" అనడిగాడు. శ్రీకృష్ణుడు నవ్వుతూ.. "ప్రియ అర్జునా, నీకు తెలియదు. ఈ ఆయుధం నీకు తగిలి ఉంటే, నిన్ను చంపి ఉండేది. ఆ ఆయుధం కేవలం నా వస్తువే అయి ఉన్నందున తిరిగి అది తన న్యాయమైన యజమానినే చేరింది" అన్నాడు. తరువాత అర్జునుడు ఒక బాణాన్ని సుప్రతీకంపైకి విడిచాడు. ఆ బాణం చీమలపుట్టలోకి పాము దూరిన చందాన ఏనుగు తలలోకి దూరింది. భగదత్తుడు తన సుప్రతీకాన్ని ముందుకు తరిమాడు. కానీ.. బాణం తలలోకి దిగి ఉండటంతో అది ఎటూ కదల్లేదు. కొండలా నిలబడి కదలకుండా ఉన్న సుప్రతీకం కొంతసేపటికి ఒక్కమారుగా భూమిలోకి తన దంతాలను గుచ్చుతూ, నేలకొరుగుతూ, మిక్కిలి బాధతో మూలుగుతూ చనిపోయింది. సుప్రతీకం

చనిపోవడంతో అర్జునుడు విచారపడ్డాడు. సుప్రతీకాన్ని చంపకుండా భగదత్తుణ్ణి చంపాలన్నది అర్జునుడి లక్ష్యం. అది విఫలమైంది. అర్జునుడి బాణాలు భగదత్తుడు ముఖంపై కట్టుకున్న వస్త్రాలను చించి, దానికింద వేలాడే ముఖ ముడతలు, కళ్లపై పడటంతో తానేమీ చూడలేని గుడ్డివాడయ్యాడు భగదత్తుడు. మరో బాణం విడిచాడు. అది భగదత్తుని వక్షాన్ని ఛేదించింది. అతడు తుపానులో చెట్లు కూలిపోయిన చందంగా యుద్ధభూమిలో కుప్ప కూలిపోయాడు.

కౌరవ సైన్యమంతా చిందరవందర అయ్యింది. శకుని తమ్ముళ్లయిన వృషుడు, అచీలుడు.. అర్జునుణ్ణి ఎదురించాలని చాలా ప్రయత్నించారు. అతణ్ణి వెనక నుంచీ ముందు నుంచీ ఎదురించారు. కానీ వారి రథాలు ధ్వంసమై వారు కూడా అర్జునుడి బాణాలతో తీవ్రంగా గాయపడి అక్కడే మృతి చెందారు. వీరిద్దరూ బహు అందగాళు ్లు. యుద్ధభూమిలో అందరూ పారిపోయినప్పటికీ ఈ ఇద్దరు తుదివరకూ నిలబడ్డారు. అసమాన ప్రతిభావంతులైన తన తమ్ముళ్లిద్దరూ చనిపోవడంతో శకుని తీవ్ర ఆగ్రహం చెందాడు. శకుని.. అర్జునుణ్ణి ఎదురించి భయంకరమైన యుద్ధం చేశాడు. యుద్ధంలో తన మాయలను ప్రదర్శిస్తూ ఆయుధాలను ప్రయోగించాడు. కానీ అర్జునుడి ప్రహరణాలు శకుని మాయలను ఛేదించి అతడి బాణ ప్రభావాన్ని నిర్వీర్యం చేశాయి. దీంతో శకుని తన గుర్రాలు ఎంత వేగంగా పరిగెత్తగలవో అంత వేగంగా పరిగెత్తించి యుద్ధభూమి నుంచి పారిపోయాడు. ఇక పాండవ సేనలు ద్రోణుడి సేనలను ఎదురించారు. కౌరవ సైన్యం చాలా నష్ట పోయింది. ఇలా పన్నెండో రోజు యుద్ధం పూర్తయింది. ద్రోణుడి ఆజ్ఞతో యుద్ధం ఆగింది. కౌరవ సైన్యం చాలా నష్టపోయింది. మిగతావారు తమ బసలకు చేరుకున్నారు. పాండవ సైన్యం ఆనందార్ణవమైంది. వారి సైన్యం తమ బసల వద్ద నెగడు ముందు జేరి ఆనందిస్తూ అర్జునుణ్ణి ప్రశంసించారు.

◈



యుద్ధ రంగంలో
అభిమన్యుడు

## అధ్యాయం - 79

# అభిమన్యుడు

మరునాడు ఉదయం దుర్యోధనుడు కోపంతోనూ, అసహనంతోనూ ద్రోణాచార్యుడి వద్దకు వెళ్లాడు. ఆయనకు దండ ప్రమాణం చేశాడు. చాలా మంది మహా యోధులుండగా.. "బ్రాహ్మణవర్యా, నిన్న యుధిష్ఠరుడు తమ చేతికి అందివచ్చాడు. నీవు నిశ్చయంగా ఆయన్ను పట్టుకోదలిస్తే మిమ్మల్ని అడ్డుకునేవారు ఎవరూ లేరు. కానీ మీరాయనను పట్టుకోలేదు. నిన్న జరిగిన అంశాలేమీ నాకు బోధపడటం లేదు. నాకు నీవిచ్చిన వాగ్దానం నెరవేరలేదు. అది నెరవేర్చడానికి మీకు ఎందుకు కష్టమయ్యిందో నాకు అర్థం కావడం లేదు. నిశ్చయంగా పెద్దల అభిమతాన్ని ఎవరూ బోధపర్చుకోలేము" అని నిందాపూర్వకంగా, పరుషంగా అన్నాడు దుర్యోధనుడు. ఈ మాటలు ద్రోణాచార్యులవారి హృదయాన్ని గాయపరిచాయి. "దుర్యోధనా.. నీకోసం నాకున్న సర్వ శక్తినీ ధారపోస్తున్నాను. నీవు ఒక రాజుకు

ఉండదలచిన ఆలోచనలతో ఉన్నావు. అర్జునుడు యుధిష్ఠరుణ్ణి రక్షిస్తూ అక్కడ ఉన్నంతకాలమూ అతణ్ణి పట్టుకోవడం మనకు శక్యం కాదు. ఈ సంగతి నీకు ఇదివరకే చెప్పాను. యుద్ధభూమిలో ఎలాగైనా అర్జునుడిపై మనం దృష్టి నిలిపితే, నీవు కోరిన ప్రకారం యుధిష్ఠరుణ్ణి పట్టుకోగలం. నేనూ దీని గురించే ఆలోచిస్తున్నాను" అంటూ తన కోపాన్ని అణచుకొని దుర్యోధనుణ్ణి అనునయించాడు ద్రోణుడు.

పదమూడో రోజున సంశప్తకులు ప్రధాన యుద్ధభూమి నుంచి దక్షిణ దిశలో కొంత దూరంలో సేనను వ్యూహ పరిచారు. సుశర్మ.. మళ్లీ అర్జునుణ్ణి యుద్ధానికి పిలిచాడు. సంశప్తులకు, అర్జునునికి ఆరోజు యుద్ధం ఎంతో గొప్పగా జరిగింది. దక్షిణాన సంశప్తకులను ఎదురించడానికి అర్జునుడు బయలుదేరే వేళకు ద్రోణుడు తన సైన్యాన్ని మరలా పద్మవ్యూహంగా ఏర్పరిచాడు. యుధిష్ఠరుడు బహుతీవ్రంగా ఎదురించాడు. భీముడు, సాత్యకి, చేకితానుడు, ధృష్టద్యుమ్నుడు, కుంతి భోజుడు, ధృపదుడు, ఘటోద్ఘజుడు, యధామన్యుడు, శిఖండి, ఉత్తమౌజసుడు, విరాటుడు, కేకయులు, సంజయులు ఇంకా మరికొందరు ద్రోణుణ్ణి ఎదురించారు. కానీ ద్రోణుడి ప్రతాప, పరాక్రమాల ఎదుట వీరిందరి బలాలూ చల్లబడిపోయాయి.

అర్జునుడు, సుభద్రల కుమారుడైన అభిమన్యుడు ఇంకా పెద్ద యువకుడు అనిపించుకోలేదు. వచ్చీరాని యవ్వనం. యుద్ధం చేయడంలో మహావీర శ్రేష్ఠుడనే కీర్తి గడించాడు. యుద్ధం చేయడంలో తనతండ్రికి, మేనమామకు సమానమని కూడా ప్రతీతి ఉంది. యుధిష్ఠరుడు అభిమన్యుణ్ణి పిలిచి.. "ప్రియకుమారా, ద్రోణాచార్యుడు మన సైన్యాన్ని చాలా తీవ్రంగా ఎదిరించి ధ్వంసం చేస్తున్నాడు. అర్జునుడు ఇక్కడ లేడు. అతడు లేనప్పుడు మనం ఓడిపోతే గొప్ప విచారానికి గురవుతాడు. మాలో ఎవరూ ద్రోణుడీ రోజు పన్నిన వ్యూహాన్ని ఛేదించడానికి చాలేవాళ్లం కాదు. ఆ వ్యూహాన్ని ఛేదించగల చొరవ నీకు ఉంది. మరెవరికీ తెలియదు. ఈ పని నీవు చేయాలని కోరుతున్నాను" అన్నాడు. అభిమన్యుడు సమాధానంగా.. "నేను చేయగలను. ఈ పద్యవ్యూహాన్ని ఛేదించి అందులోకి చొచ్చుకుపోయే మార్గాన్ని నా తండ్రి వల్ల నేర్చుకున్నాను. కాబట్టి నేను తప్పక చేస్తాను. పద్మవ్యూహంలోకి చొచ్చుకుపోయిన తరువాత ఏ కారణంతోనైనా తిరిగి రావాలంటే నాకు అదెలాగో తెలియదు. ఆ వ్యూహం నుంచి తిరిగి బయటకు వచ్చే విధం నేను నేర్చుకోలేదు" అన్నాడు. యుధిష్ఠరుడు అందుకొని.. "కుమారా, అభిమన్యా! ఈ వ్యూహాన్ని ఛేదించి లోపలికి వెళ్లాక.. మాకేదైనా తెలిసేలా చేస్తే.. నీ వెనువెంటే మేమంతా వస్తాము. ఏ ప్రమాదాన్ని ఎదురించడానికైనా మేము నీ వెంట ఉంటాము. అందువల్ల నీవు వ్యూహం నుంచి బయటపడే అవసరమేమీ ఉండదు". యుధిష్ఠరుడు అన్న ఈ మాటలను భీముడు

కూడా దృఢపరిచాడు. “నేను నీ వెంటనే ఉంటాను. పద్మవ్యూహాన్ని నీవు ఛేదించిన వెంటనే నీతోనే నేను వస్తాను. అలాగే ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, పాంచాలురు, కేకయులు, మత్స్యదేశ సైనికులు, అందరూ నీవెంటే వస్తారు. నీవొక్కడివే ఈ వ్యూహాన్ని ఛేదించడానికి శక్తిమంతమైన వాడివి కనుక ఆ పని నీవు చెయ్యి. మిగిలిన పని మేము చేసి కౌరవ సేనను హతమార్చుతాం” అన్నాడు భీమసేనుడు.

అభిమన్యుడు తన తండ్రినీ, శ్రీకృష్ణుణ్ణీ తలుచుకున్నాడు. భీమసేనుడు, యుధిష్టరుడు చెప్పిన మాటలతో మరింత ధైర్యాన్ని పొందాడు. అదీగాక.. అతడికి స్వాభావికమైన వీరపురుష లక్షణం కూడా ఉంది. దీంతో పద్మవ్యూహ ఛేదన సాహస కార్యానికి పూనుకున్నాడు. “మహామహుడైన తండ్రిని, నా మామ అయిన శ్రీకృష్ణుణ్ణి సంతోషపరుస్తాను” అన్నాడు అభిమన్యుడు. “నీ ప్రభావం వృద్ధి పొందుగాక” అని యుధిష్టరుడు ఆశీర్వదించాడు. అభిమన్యుడు తన సారధితో..“ఓయీ సుమిత్రా, అల్లదిగో, అక్కడ ద్రోణుడి పతాకం ఎగురుతోంది. అక్కడికి సూటిగా, త్వరగా రథాన్ని పోనివ్వు” అన్నాడు. రథం అటువైపు దారి తీసింది. “ఇంకా త్వరగా, వేగంగా పోనివ్వు” అంటూ సారధిని కోరాడు. రధసారధి..“దేవతలు నిన్ను రక్షించుగాక. నీ లేత భుజాలపై యుధిష్టరుడు పెద్దబరువును పెట్టాడు. నీవు ఈ వ్యూహాన్ని పన్నిన ద్రోణుడి గురించి ఆలోచించు. ద్రోణుడు ఉపాయంలోనూ, అనుభవంలోనూ గొప్పవాడని ప్రతీతి. అతడి ప్రతాపానికి నీవు సరైన వాడవైనా, అతడికున్న ఆయుర్వత్సరాలు నీకు బాసటగా లేవు” అన్నాడు. సమాధానంగా అభిమన్యుడు..“మిత్రుడా, నేను కృష్ణుడి మేనల్లుణ్ణి. అర్జునుడి కుమారుణ్ణి. అలాంటి సహాయ సంపద ఇంకెవరికి ఉంది?. భయం అన్నది నా వద్దకు చేరడానికి వీలులేదు. ఇక్కడున్న ఈ శత్రువులందరూ నా బలంలో పదహారో భాగమైనా లేరు. అతి త్వరగా ద్రోణుడి సేనా భాగంలోకి రథాన్ని తోలు. వెనుదీయకు” అనడంతో సారధి అలాగే చేశాడు.

అందమైన వయసులో.. గుర్రాలు కట్టిన బంగారుమయమైన రథం మీద అభిమన్యుడు వస్తుండగా, కౌరవ సేన కరతాళ ధ్వనులు చేసింది. “అభిమన్యు డొస్తున్నాడు. వచ్చాడు. పాండవులు అభిమన్యుడి వెనుకనే ఉన్నారు” అని అనుకున్నారు. అభిమన్యుడి రథం ద్రోణుడి సేనల వద్దకు వచ్చింది. దాని గమన వేగం పెరుగుతుండటంతో శత్రు సేన తత్తరపాటు చెందింది. “అర్జునుణ్ణి మించిన పరాక్రమశాలి ఇతడు” అని శత్రువులు అనుకుంటూ నిరుత్సాహం చెందారు. కొదమ సింహంలా అభిమన్యుడు ముందుకు వెళ్తున్నాడు. దీంతో శత్రు వ్యూహంలో చిన్న చలనం కలిగింది. ఈ చలనం ఇంకా పెద్దదై చిన్న వక్రత ఏర్పడింది. ఈ వక్రతే చిన్న ఛిద్రంగా ద్రోణుడి కంటి ముందు కనిపించింది. అతడలా చూస్తుండగానే

కౌరవ సేనలో స్వల్ప భేదం కలగడం, ఆ మార్గం ద్వారా అభిమన్యుడు వ్యూహంలోకి అతి త్వరగా రావడం ఒకేసారి జరిగాయి. కానీ ఆ సేనా మార్గం ఛిద్రం కావడం వల్ల మిగిలిన పాండవ వీరులు అనుకున్న ప్రకారం వ్యూహంలోకి చొరబడక పూర్వమే మళ్లీ రహదారి మూసుకుపోయింది. ఇది సింధు రాజు జయద్రధుని దైవబల ప్రేరిత శక్తితో జరిగింది. దీంతో అభిమన్యుడొక్కడే అయ్యాడు.

కౌరవ వీరులు అభిమన్యుణ్ణి ఎదురించారు. కానీ వారందరూ ఒకరి తరువాత ఒకరుగా మంటలో పడిన శలభాల మాదిరిగా మగ్గిపోయారు. అభిమన్యుడి బాణాలు శత్రువులు ధరించిన కవచాలను ధ్వంసం చేసి మరీ వారిని తీవ్రంగా గాయపరిచాయి. యుద్ధ భూమి పీనుగుల పెంటగా మారింది. ధనస్సులు, బాణాలు, కత్తులు, డాలులు, బల్లేలు, గుర్రపు జీనుముక్కలు, రథాల పైనుండే షామియానాలు, గొడ్డళ్లు, గదలు, ఈటెలు, కొరడాలు, శంఖాలు, చనిపోయిన వీరుల ఖండిత తలలు, అవయవ ఖండాలు మిశ్రమమై యుద్ధభూమి నిండిపోయి ఉంది.

అభిమన్యుడు చేసిన ఈ ఘోర నాశనాన్ని చూసిన దుర్యోధనుడు స్వయంగా రంగంలోకి దిగాడు. అభిమన్యుణ్ణి ఎదురించాడు. స్వయంగా దుర్యోధనుడే యుద్ధం చేస్తున్నాడని తెలుసుకొని మిక్కిలి ఆతృత చెందిన ద్రోణుడు.. గొప్ప పేరున్న వీరులను దుర్యోధనుడికి సహాయంగా పంపాడు. బాలవీరుడైన అభిమన్యుడి బారి నుంచి దుర్యోధనుణ్ణి అతికష్టం మీద తప్పించగలిగాడు. దుర్యోధనుడు తన నుంచి తప్పించుకున్నాడని ఆగ్రహించిన అభిమన్యుడు.. అతడికి సహాయంగా వచ్చినవారందరినీ వరుసగా ఎదుర్కొని అనేక చిక్కులు పెడుతున్నాడు. దీంతో అసంఖ్యాక కౌరవ మహావీరులు అభిమన్యుడి చుట్టూ చేరి సిగ్గునూ, యుద్ధనీతినీ, న్యాయాన్ని విడిచిపెట్టి అతణ్ణి ఎదురించడానికి పోరాడుతున్నారు.

అభిమన్యుడు ఒక్కడే అయ్యాడు. తన చుట్టూ ఉన్న శత్రువుల్లో మహా యోధులున్నారు. ఒక కొండగట్టు తన చుట్టూ ఉన్న సముద్రం ఆటు, పోటలను ఎలా నిలువరిస్తుందో అలాగే అభిమన్యుడు వీరులను, వారి బలాలను నిలువరించి యుద్ధం చేస్తున్నాడు. ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు, కర్ణుడు, శకుని, శల్యుడు ఇంకా ఇతర గొప్ప యోధులు తమ తమ రథాల పైనుంచి ఒక్కసారిగా తోసుకొనివెళ్లి అభిమన్యుణ్ణి ఎదురించారు. కానీ వారి గుంపును చెదరగొట్టి వీరులను ఆశ్చర్యపరిచాడు. అశ్మకుడు తన రథంతో అత్యంత వేగంగా అభిమన్యుడిపైకి ఉరికాడు. అభిమన్యుడు నవ్వుతూ బాణాలు వేసి అతణ్ణి క్షణాల్లో చంపాడు. కర్ణుడి కవచాన్ని ఛేదించాడు. శల్యుణ్ణి బాగా గాయపరచడంతో అతడు రథంలోనే కూలబడిపోయాడు. దీంతో శల్యుడి తమ్ముడు తీవ్ర కోపంతో ముందుకు వచ్చాడు. అభిమన్యుణ్ణి ఎదురించాడు.

అభిమన్యుడి బాణాల పరంపరకు నేలకూలి మరణించాడు. అతడి రథమూ ధ్వంసం అయ్యింది.

అభిమన్యుడు ఈ విధంగా ఒక్కొక్కరిని ఎవరి సహాయం లేకుండానే మేనమామ వాసుదేవుని వద్ద, తండ్రి అర్జునుడి వద్ద నేర్చుకున్న ఆయుధ యుద్ధ నైపుణ్యాలతో మహామహులను, అతిరథులను ఎదురించి నిలిచాడు. ఇదంతా చూసి ద్రోణుడు కన్నీరు పెట్టుకున్నాడు. ద్రోణుడు కృపుణ్ణి ఉద్దేశించి.."ఎక్కడైనా, ఎన్నడైనా అభిమన్యుడి వంటి బాలయోధుడున్నాడా?" అన్నాడు. ఈ మాటలు దుర్యోధనుడు విన్నాడు. తన కోపాన్ని ఆపుకోలేక పోయాడు. "ఆచార్యునికి అర్జునుడిపై ఉన్న పక్షపాతంతో అభిమన్యుణ్ణి ఇంకా చంపలేదు. అతడితో యుద్ధం చేయకుండా కీర్తిస్తున్నాడు. అభిమన్యుణ్ణి చంపాలని నిశ్చయంగా నిర్ణయించుకుంటే ఆ పని ఎంతసేపు పడుతుంది?" అని దుర్యోధనుడు అన్నాడు. దుర్యోధనుడు ద్రోణుణ్ణేగాక, తరచూ భీష్మణ్ణి కూడా తప్పులెంచి అవమానించాడు. అధర్మయుద్ధం చేయబూని పెద్దలను నిందిస్తున్నాడు. కానీ ద్రోణుడు దుర్యోధనుడి దుర్మార్గాన్ని లక్ష్య పెట్టక, తన యావశ్చక్తినీ వినియోగించి పాండవ సేనతో యుద్ధం చేస్తున్నాడు.

దుశ్శాసనుడు ఆగ్రహంతో.. "ఆ మొండి గుంటడు ఇప్పుడే చస్తాడు" అంటూ తన రథాన్ని అభిమన్యుడివైపు మలిపాడు. ఇరువురి మధ్యా యుద్ధం చాలా సేపు కొనసాగింది. అభిమన్యుడి బాణం దెబ్బకు దుశ్శాసనుడు తన రథంలోనే స్పృహతప్పి పడిపోయాడు. అతడి రథసారధి రథాన్ని ఎలాగో అక్కణ్ణుంచి తప్పించి దుశ్శాసనుణ్ణి రక్షించాడు. కర్ణుడు తన వాడి బాణాలతో అభిమన్యుణ్ణి చాలా ఇక్కట్లు పాలు చేశాడు. కానీ అభిమన్యుడి ఒక బాణం కర్ణుడి ధనస్సును పడగొట్టింది. అభిమన్యుడు మరింత పరాక్రమించి పోరాడటంతో కర్ణుడు, అతని సహాయకులు పలాయనం చిత్తగించారు. ఈ దృశ్యాన్ని చూసిన కౌరవ సేన పూర్తిగా అధైర్యం చెందింది. వారి సైన్యంలో కోలాహలం పెరిగింది. ద్రోణుడు ఆజ్ఞలను సైతం తోసిరాజని సైనికులు అన్నిదిశలకూ పరుగుపెట్టారు. మిగిలిన వారిని అభిమన్యుడు తేలికగానే చంపాడు.

◈

రథచక్రంతో
అభిమన్యుని
చివరి పోరాటం



## అధ్యాయం - 80

# అభిమన్యుని మరణం

**పా**ండవులు వారనుకున్న ప్రకారం.. అభిమన్యుడు కౌరవ వ్యూహాన్ని ఛేదించినప్పుడు అతడి వెనుకే ఉన్నారు. కానీ దృతరాష్ట్రుడి అల్లుడు, సింధుదేశపు రాజు, పరాక్రమవంతుడు అయిన జయదధ్రుడు తన సైన్యమంతంటితో పాండవులపైన హఠాత్తుగా విరుచుకుపడ్డాడు. అభిమన్యుడు ఛేదించిన వ్యూహాన్ని మరలా యథాప్రకారం స్థిరంగా ఉండేందుకు జయద్రధుడు అవకాశం ఇచ్చాడు. ఇందువల్ల పాండవులు వ్యూహంలోకి వెళ్లలేకపోయారు. యుధిష్టరుడు ఒక బల్లెంతో జయద్రధుడి ధనుస్సును విరగ్గొట్టాడు. తక్షణమే సైంధవుడు ఒక ధనస్సును ఎత్తి మంచి గురితో యుధిష్టరుడిపై బాణ పరంపర ప్రయోగించాడు.

భీమసేనుడి బాణాలు కూడా సైంధవుడికి చాలా నష్టం కలిగించాయి. జయదధ్రుని పతాకాన్ని, రథ చాందినీని విరగొట్టాడు. కానీ సైంధవుడు చాలా చురుకు కలిగి, ఎన్నిమార్లు తన పరికరాలు పోయినా, అన్నిమార్లూ మరలా వాటితో యుద్ధం

చేసేవాడు. సైంధవుడు.. భీముడి రథాశ్వాలను చంపాడు. దీంతో భీముడు సాత్యకి రథం ఎక్కాల్సి వచ్చింది. ఈ ప్రకారం జయద్రథుడు మొండి వీరత్వంతో పాండవులను అభిమన్యుడి వెంట వెళ్లడానికి అవకాశం ఇవ్వలేదు. దాంతో అభిమన్యుడు ఒక్కడై కౌరవ మహావీరుల పద్మవ్యూహంలో చిక్కుకున్నాడు. అయినప్పటికీ తనచుట్టూ ఉన్న వీరుల్లో చాలా మందిని చంపాడు. అభిమన్యుడి మహాయుద్ధ రీతివల్ల కౌరవ వ్యూహం ధ్వంసం అవుతోంది. దుర్యోధనుడి కుమారుడు, బాలవీరుడు అయిన లక్ష్మణుడు అభిమన్యుడిపైకి వెళ్లాడు. ఇది చూసి పారిపోయిన మహావీరులందరూ తిరిగి మరలా అభిమన్యుణ్ణి చుట్టుముట్టి లక్ష్మణుడికి బాసటగా నిలబడ్డారు. బాణాల వర్షం కురిపించారు. అభిమన్యుడు చలించక అప్పుడే కుబుసం విడిచిన మహా కాలసర్పం మాదిరిగా ఆగ్రహంతో బాణం విడవగా, అది లక్ష్మణుడి శరీరానికి గుచ్చుకుంది. అది నాసిక, భృకుటికి తగిలి లక్ష్మణుడు అక్కడికక్కడే మరణించాడు. కౌరవ సైన్యం తీవ్ర విచారంలో మునిగిపోయింది. "ఈ దుర్మార్గుడు అభిమన్యుణ్ణి నరకానికి పంపుదాం" అని దుర్యోధనుడు బిగ్గరగా అరిచాడు.

అతిరథులు, మహావీరులు అయిన ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, అశ్వత్థామ, బృహద్బలుడు, కృతవర్మ ఈ ఆరుగురూ కలిసి అభిమన్యుణ్ణి ఎదురించారు. ద్రోణుడు.. "ఈ యోధుడి కవచాన్ని మనం ఛేదించలేము. గురిచూసి బాణాలతో గుర్రపు పగ్గాలను తెగగొట్టండి. ఆ విధంగా అతణ్ణి నిలువరించి, అశక్తుణ్ణి చేసి అతడి వెనుక నుంచి మాత్రమే యుద్ధం చేయండి" అన్నాడు. ద్రోణుడు చెప్పిన విధంగా కర్ణుడు.. అభిమన్యుడి వెనక్కివెళ్లాడు. అక్కణ్ణుంచి బాణం విడిచి అభిమన్యుడి ధనుస్సు విరగొట్టాడు. ఆ విధంగానే అభిమన్యుడి రథ సారథిని, రథాశ్వాలను చంపాడు.

ఇలా అశక్తుడైన అభిమన్యుడు కత్తి, డాలును పట్టుకొని నేలపైకి లంఘించి తన శత్రువులను ఎదురించాడు. క్షత్రియ ధర్మం మూర్తీభవించినట్లు అభిమన్యుడు మహాధైర్యంతో నిలిచి చుట్టూ ఉన్న శత్రువీరులకు మహాశ్చర్యాన్ని కలిగించాడు. తన కరవాలాన్ని పైకి లాగి తన లాఘవంతో, నిపుణతతో ప్రయోగిస్తూ శత్రువులను తత్తరపాటుకు గురిచేశాడు. కకావికలం చేశాడు. ఇంతలో ద్రోణుడు ఒక బాణాన్ని సంధించి అభిమన్యుడి కరవాలాన్ని విరిచేశాడు. అతడి డాలును కర్ణుడు ముక్కలు చేశాడు.

దీంతో అభిమన్యుడు వంగి తన రథ చక్రాన్ని చేతబట్టుకొని చక్రంలా తిప్పుతూ శత్రువులను ఎదుర్కొన్నాడు. రథ చక్రాన్ని తిప్పుతున్నప్పుడు ధూళి లేచి అక్కడ కప్పేసింది. చక్రం చేబూనిన అతడు రెండో విష్ణుమూర్తి అనేలా యుద్ధం చేశాడు. కానీ తన చుట్టూ చేరి ఉన్న మహావీరులు అభిమన్యుడిపై ఒత్తిడి పెంచారు. ఒంటరిగా

అంతమంది వీరులను ఎదుర్కునే క్రమంలో అతడు బలహీనపడ్డాడు. అతడి రథచక్రాన్ని ముక్కలు ముక్కలు చేశారు. అదే సమయంలో దుశ్శాసనుడి కుమారుడు.. అభిమన్యుడితో ద్వంద్వ యుద్ధం చేయసాగాడు. ఇద్దరూ ఒకేసారి నేలమీద పడ్డారు. దుశ్శాసనుడి కుమారుడు లేచి.. అప్పుడే పైకి లేస్తున్న అభిమన్యుణ్ణి గదతో బలంగా మోది చంపేశాడు.

పద్మవ్యూహంలో అభిమన్యుణ్ణి చంపివేసిన విషయాన్ని సంజయుడు.. ధృతరాష్ట్రుని చెవిని వేశాడు. "అభిమన్యుడు ఒక్కడే మహా రణం చేశాడు. శత్రువుల పీచమణిచిన బాలవీరుడతడు. కానీ అసంఖ్యాక కౌరవ సేన అతణ్ణి ప్రతిఘటించి హతమార్చింది. అడవి జంతువును చంపి దాని చుట్టూ మూగి ఆనందించినట్లు, కౌరవ వీరులంతా ఆ బాలవీరుడి మృతదేహం చుట్టూ తిరిగి ఆనందిస్తూ నృత్యం చేశారు. అయితే సైన్యంలోని దయార్ద్ర హృదయులు ఏడ్చారు. మాంసభక్ష పక్షులు కూడా తమ జాతి పక్షి చనిపోతే దాని చుట్టూ తిరుగుతూ విచార శబ్దాలు చేస్తాయి. కానీ వీరు దారుణంగా వ్యవహరించారు" అని తెలిపాడు సంజయుడు.

కౌరవ సైన్యంలో శంఖా నాదాలు, జయజయ ధ్వానాలు వినిపిస్తుండగా.. ధృతరాష్ట్రుని కుమారుడు యుయుత్సుడు.. అభిమన్యుణ్ణి చంపడాన్ని నిరసించాడు. "ఇది బహునీచమైన పని. వీరలారా, మీరంతా యుద్ధనీతిని మరిచారు. నిజంగా మీరంతా సిగ్గుపడాలి. ఒక దుర్మార్గకృత్యం చేసి మీరంతా ఆనందంతో చెలరేగిపోతున్నారు. ముందు రాబోయే అపాయాన్ని కానక, మీరు అంధుల్లా ప్రవర్తిస్తున్నారు" అంటూ యుయుత్సుడు తన ఆయుధాన్ని విసిరేసి యుద్ధభూమి నుంచి వెళ్లిపోయాడు. యుయుత్సుడు పాపభీతి కలవాడు. అతడి మాటలు కౌరవులకు కర్ణ కఠోరంగా ఉన్నాయి. కానీ దయార్ద్ర హృదయుడైన యుయుత్సుడు తన మనసులో ఉన్న విషయాన్ని వెల్లడించాడు.



అభిమన్యుని
మరణంతో విలపిస్తున్న
అర్జునుడు

## అధ్యాయం -81

# ఓ తండ్రి విషాదం

**అ**భిమన్యుడి మరణంతో యుధిష్ఠరుడు శోకంలో మునిగిపోయాడు. “అభిమన్యుడు మెలుకువ రాని నిద్ర పోయాడు. యుద్ధంలో ద్రోణుడు, అశ్వత్థామ, దుర్యోధనుణ్ణి జయించాడు. ఓ వీరుడా, నీవు దుశ్శాసనుణ్ణి పరిగెత్తించావు. నీవు చనిపోయావా?. యుద్ధం చేయాలి, జయించాలి అనే కోరిక ఎందుకు నాకు? మాకు రాజ్య కోరిక ఎందుకు?. అర్జునుడికి నేను ఏమి ఉపశమన మాటలు చెప్పగలను?. తన దూడను పోగొట్టుకున్న ఆవు మాదిరిగా విలపిస్తున్న సుభద్రకు ఏమని చెపుతాను?. ఎందుకూ ఉపయోగపడని ఉపశమన మాటలు నేనెలా చెప్పగలను?. నిజంగా.. ఆశ అన్నది మనుషుల బుద్ధిని పాడు చేస్తుంది. తేనె కోసం వెదుకుతూ లోయలో పడి చనిపోయిన మూఢుని మాదిరిగా.. నాకు విజయం చేకూర్చడానికి ఎంతో జీవితమున్న ఈ బాలుణ్ణి యుద్ధభూమిలోకి తోశాను. ప్రపంచంలో నా వంటి మూఢుడు మరొకరు లేరు. తన తండ్రి దగ్గర లేనప్పుడు కంటికి పాపలా కాపాడుకోవాల్సిన ఆ

బాలుణ్ణి నేను నిలువునా చంపాను" అని యుధిష్టరుడు తన గుడారంలో విలపిస్తున్నాడు.

వారి సైన్యానికి చెందిన యోధులు మౌనం దాల్చి, చనిపోయిన బాల వీరుని ప్రతాపాన్ని, అతడి మరణాన్ని తలుచుకొని విచారగ్రస్తులై యుధిష్టరుడి చుట్టూ కూర్చున్నారు. పాండవులు ఎప్పుడు కష్టదశలో ఉన్నా, వ్యాసుడు వారి వద్దకు వచ్చి శోక ఉపశమనం చేసి వెళ్లడం ఆచారంగా ఉండేది. అతడు పాండవులకు గొప్ప గురువు, పితామహుడు. అతడు యుధిష్టరుడి దగ్గర ఆశీనుడై ఉన్నాడు. "మనశ్శాంతి కోసం చాలా ప్రయత్నాలు చేశాను. కానీ నాకది దొరకలేదు." అన్నాడు యుధిష్టరుడు. వ్యాసుడు సమాధానంగా.. "నీవు బుద్ధిజీవివి. అన్నీ తెలిసినవాడివి. నిన్నీవిధంగా విషాదంలో ఉంచడం తగదు. మృత్యు స్వభావం తెలిసి, తెలియని వాడి వలే నీవు విలపించడం తగదు. బ్రహ్మ.. భూత సృష్టి చేసినప్పుడు ఒక ఆందోళనలో పడ్డాడు. ఈ జీవులన్నీ త్వరలో అంతకంతకూ వృద్ధి చెందుతాయి. దీంతో భూమికే భరించలేని పరిస్థితి వస్తుంది. ఈ సమస్యను తొలిగించే విధానమేదీ లేనట్లు ఆయనకు తోచింది. ఈ ఆలోచనే ఓ అగ్ని జ్వాలై, క్షణక్షణం వృద్ధి చెంది, తాను చేసిన సృష్టినంతటినీ ధ్వంసం చేస్తుందేమో అనే భయాన్ని కలిగించింది. రుద్రుడు వచ్చి వృద్ధిని క్లుప్త పరచమని బ్రహ్మను అడిగాడు. బ్రహ్మ.. మనుషులు మృత్యువాత పడి సతతంగా ఉండేలా చేశాడు. సృష్టికర్త వృద్ధిని క్లుప్తపరచడానికి అనేక రూపాలను సృష్టించాడు. యుద్ధం, రోగం, ప్రమాదం అనేవే అవి. జనన మరణాలను హద్దుల్లో ఉంచగలిగేది మృత్యువు కాబట్టి అది నిత్యమైంది. కచ్చితంగా జరిగి తీరేదీ, ఎవరి చేతా తప్పించజాలనిది అని నిబంధన పెట్టాడు. అదీ ప్రపంచం మంచికోసమే పెట్టాడు. మృత్యువు విషయమై చికాకు పడటం, ఆగ్రహం వ్యక్తం చేయడం, తీరని విషాదాన్ని చెందడం అనేది నిజమైన జ్ఞానం కాదు. మరణించినవారి గురించి హద్దుమీరి విలపించడం తగదు. ఇలాంటి పరిస్థితుల్లో నిశ్చయంగా బతికి ఉన్నవారి గురించి విచారించడమే సమంజసం" అంటూ ఉపశమన వాక్యాలు పలికి వ్యాసుడు (కృష్ణద్వైపాయనుడు) అదృశ్యమయ్యాడు.

అర్జునుడు, శ్రీకృష్ణుడు.. సంశప్తకులను ఓడించి చంపిన తరువాత ఇద్దరూ తమ గుడారానికి వస్తున్నారు. అర్జునుడు.. కృష్ణుణ్ణి ఉద్దేశించి, "కృష్ణా, కారమేమిటోగానీ నా మనసు ఏమీ బాగోలేదు. నా నాలుక ఎండిపోతోంది. నా హృదయం ఏదో గొప్ప అపశ్రదను సూచిస్తోంది. యుధిష్టరుడికి ఏమైనా ప్రమాదం జరిగిందేమో అని ఆందోళనగా ఉంది. ఏదో నన్ను భయభ్రాంతుణ్ణి చేస్తోంది కృష్ణా" అన్నాడు. కృష్ణుడు సమాధానమిస్తూ.. "యుధిష్టరుడి గురించి నీవేమీ అందోళన చెందకు. అతడూ, నీ తమ్ముళ్లూ సురక్షితంగానే ఉన్నారు" అన్నాడు. ఆ మార్గంలో వారు ఆగి సాయంకాల

ప్రార్థనలు చేశారు. మరలా రథమెక్కి విడిదికి వెళ్లారు.

వారు గుడారాలకు సమీపిస్తుండగా.. తన వాళ్లకు ఏదో ఆపద కలిగిందేమో అన్న కీడును సూచించే మానసికాందోళన అర్జునుడికి ఏర్పడింది. "మాధవా, బసలలో ప్రతిదినమూ వినపడే మంగళ తూర్యనాదాలు వినపడం లేదు. యోధులు దూరం నుంచి నన్ను చూసి తలలను దించుకొని నన్ను చూడలేకపోతున్నారు. వారిలా చేయడం నాకు వింతగా ఉంది. మాధవా, నేను చాలా భయపడుతున్నాను. నా సోదరులంతా సురక్షితంగా ఉన్నారని నీవు తలుస్తావా?. అలవాటు ప్రకారం నా తమ్ముళ్లతోపాటు మనలను కలుసుకోవడానికి ముందుగా వచ్చే అభిమన్యుడు కూడా రాలేదే?." అన్నాడు అర్జునుడు.

వారు విడుదుల్లో ప్రవేశించారు. "ఎందుకు మీరంతా విచారంగా ఉన్నారు?. అభిమన్యుడు కనపడటం లేదే?. ఎక్కడా సంతోషం సూచించే మొహం కనిపించడం లేదే?. ద్రోణుడు ఈ రోజు తన సేనను పద్మవ్యూహంగా అమర్చాడని తెలిసింది. నాకు తెలిసినంతవరకూ మీలో ఎవరూ కూడా దాన్ని ఛేదించలేరు. అభిమన్యుడు చొరవ చేసి దానిలోకి ప్రవేశించాడా ఏమిటి?. అలా అయితే అతడు మరణించినట్లే. ఆ వ్యూహం నుంచి బయటకు వచ్చే విధం నేను అభిమన్యుడికి నేర్పలేదు. నిజంగా అతడు మరణించాడా?" అని ఆతృతగా అడిగాడు అర్జునుడు.

సోదరుల, యోధుల విచారకర మౌనాన్ని, వారు తలదించుకొని నేలను చూస్తుండటం, తన కళ్లవైపు వారు చూడలేకపోవడం అర్జునుడి భయకారణం మరింత ధృవపడింది. కుమారుణ్ణి కోల్పోయిన అర్జునుడు హృదయవిదారకంగా విలపించాడు. "అయ్యో, నాకుమారా! నీవు నిజంగా యుముడికి అతిథివి అయ్యావా?. యుధిష్టరుడు, భీముడు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి వంటి వీరులంతా నిన్ను శత్రువులు చంపడానికి వదిలివేశారా?. అయ్యో.. సుభద్రను ఎలా ఓదార్చను?. ద్రౌపదికి ఏమని చెప్పను?. ఉత్తరకు ఓదార్పు ఎవరు చేస్తారు?" అంటూ తీవ్ర విచారంలో మునిగిపోయాడు అర్జునుడు.

శ్రీకృష్ణుడు అందుకుని.. "ప్రియ అర్జునా, ఇలా విషాదానికి తావీయకు. క్షత్రియ వంశ సంజాతులు మీరు. ఆయుధాలతోనే జీవనం చేస్తూ.. ఆయుధాలతోనే చచ్చేవాళ్లం. ఆయుధాలు ధరించే వృత్తి కలిగి, యుద్ధానికి వెళ్లి తిరిగిరాబోము అనే దృఢ సంకల్పం కలవాళ్లకు, మృత్యువు ఎల్లప్పుడూ సహాయుడే. వీరుడు చిన్నవయసులో ఉన్నప్పటికీ మరణించడానికి సిద్ధంగా ఉండాలి. అభిమన్యుడు చిన్నవాడైనా, యుద్ధంలో ఆరితేరిన వయోవృద్ధులు ఆశించే స్వర్గ లోకాలను పొందినవాడు. అభిమన్యుడి మృతి నిశ్చయంగా క్షత్రియుందరికీ నియమించబడిందే. కోరదగిందే అయి ఉంది. నీవిలా

విషాదంలో మునిగిపోతే, నీ అన్నదమ్ములు, ఇతర రాజులు ధైర్యాన్ని కోల్పోతారు. విచారాన్ని ఆపు. ఇతరుల హృదయాల్లో ధైర్యాన్ని నింపు" అంటూ అనునయించాడు. ధైర్యవంతుడైన తన కుమారుని మరణం గురించిన వివరాలను తెలియజేయవలసిందిగా అర్జునుడు కోరాడు.

యుధిష్ఠరుడు, "శత్రు వ్యూహాన్ని ఛేదించమని నేనే ప్రోద్బలం చేశాను. మా అందరిలోనూ అతడే ఆ పని చేయగలడని నాకు తెలుసు. పద్మవ్యూహాన్ని ఛేదించు. నీ వెంటే మేము అందరమూ వస్తాము. ఈ గొప్ప కార్యం నీవు చేస్తే, నీ తండ్రీ, మేనమామ కూడా సంతోషించగలరని నేను అన్నాను. అలాగే అభిమన్యుడు ద్రోణుడి వ్యూహాన్ని ఛేదించి లోనికి వెళ్లాడు. మేం అనుకున్నట్లుగా అందరం అభిమన్యుడి వెనుకే ఉన్నాం. ఆ క్షణాన దుర్మార్గుడైన జయద్రధుడు వచ్చి, మమ్మల్ని వ్యూహంలోనికి వెళ్లనివ్వకుండా నిలువరించాడు. దీంతో మేం అభిమన్యుడి వెనుక వెళ్లలేకపోయాము. జయద్రధుడు మమ్మల్ని బయటే ఉంచగలిగాడు. ఆ తరువాత క్షత్రియులకు సిగ్గుచేటుగా.. అతిరథ, మహారథులైన వీరుల గుంపు అభిమన్యుణ్ణి చుట్టుముట్టి చంపారు" అని చెప్పాడు.

విన్న అర్జునుడు మరలా విచారగ్రస్తుడై తెలివితప్పి పడిపోయాడు. కొంత సమయం గడిచిన తరువాత, అతడో శపథం చేశాడు. "రేపు సూర్యాస్తమయం లోపు నా కుమారుడి మరణానికి కారణమైన జయద్రధుణ్ణి చంపుతాను. ద్రోణుడుగానీ, కృపుడుగానీ, అతడికీ, నాకూ మధ్యకు వస్తే వారిని కూడా చంపుతాను" అంటూ అర్జునుడు గాండీవ గుణధ్వని చేశాడు. కృష్ణుడు పాంచజన్యం ఊదాడు. భీముడు అందుకొని.. "ఈ గాండీవ ధ్వని, కృష్ణ శంఖారావం దృతరాష్ట్ర కుమారులకు మరణాహ్వానం అవుతుంది" అన్నాడు.

◈

## అధ్యాయం - 82

# సింధురాజు జయద్రధుడు (సైంధవుడు)

**అ**ర్జునుడి ఈ శపథ వృత్తాంతం శత్రువులకు తెలిసింది. జయద్రధుడే అభిమన్యుడి మరణానికి కారణమని తలచి అర్జునుడు, "మరునటి రోజు సూర్యాస్తమయం లోపుగా జయద్రధుణ్ణి చంపుతాను" అని శపథం చేసిన సంగతి చారులు దుర్యోధనుడి స్నేహితులకు చెప్పారు. ప్రసిద్ధి చెందిన సింధురాజు వృద్ధక్షత్రుడికి జయద్రధుడు అనే కుమారుడు జన్మించాడు. ఇతడి జన్మకాలంలో ఆకాశవాణి.. "ఈ రాకుమారుడు గొప్ప కీర్తి పొంది యుద్ధంలో మరణించి ఊర్ధ్వలోకంలో సౌఖ్యం అనుభవించగలడు. అన్ని యుగాల్లోనూ మహావీరుడు అవుతాడు. యుద్ధరంగంలో అతని తల నరికివేయబడుతుంది" అని పలికింది.

ప్రాణికోటి అంతా చనిపోవలసిందే. కానీ ఎంత ధైర్యంగలవాడైనా, జ్ఞానియైనా, మృత్యువును కోరడు. ఆకాశవాణి తన కుమారుడు ఇలా చనిపోతాడని చెప్పినవార్త విని విషాదం చెంది ఒక శాపాన్ని ఉచ్చరించాడు. అది ఏమంటే, "ఎవడైతే నా

కుమారుడి తలను భూమిపై పడేటట్లు చేస్తాడో, అతడి తలా బద్దలవుగాక" అనే శాపమే. జయద్రథుడు పెరిగి పెద్దవాడయ్యాడు. వృద్ధక్షత్రుడు రాజ్యాన్ని కుమారుడికి ఇచ్చి తాను అరణ్యంలో తపస్సు చేసుకోవడానికి వెళ్లిపోయాడు. అతడి ఆశ్రమం కురుక్షేత్ర యుద్ధభూమికి సమీపంలోనే ఉంది.

అర్జునుడి శపథం గురించి జయద్రథుడు విన్నాడు. తన మరణం గురించి ఆకాశవాణి పలుకులను స్మరించుకున్నాడు. తన మరణం సమీపించిందని భయపడసాగాడు. అతడు దుర్యోధనుడితో.. "ఈ యుద్ధంలో నేనిక నిలవలేను. నన్ను నా దేశానికి పోనివ్వు" అని చెప్పాడు. దీనికి దుర్యోధనుడు.." సైంధవా, భయపడకు. ఇక్కడ మహావీరులు, యుద్ధంలో ఆరితేరిన వాళ్లు, నిన్ను రక్షించి అపాయాన్ని అడ్డుకోవడానికి ఉన్నారు. కర్ణుడు, చిత్రసేనుడు, వివింశతి, భూరి శ్రవసుడు, శల్యుడు, వృషసేనుడు, పురుమిత్రుడు, జయుడు, భోజుడు, కాంభోజుడు, సుదక్షిణుడు, సత్యవ్రతుడు, వికర్ణుడు, దుర్ముఖుడు, దుశ్శాసనుడు, సబాహుడు, కళింగుడు, అవంతి దేశ రాజులు, ద్రోణుడు, అశ్వద్ధామ, శకుని, ఈ వీరులతోపాటు నేను ఇక్కడున్నాం. నీకు ఎలాంటి అపాయం ఉండదు. ఈ రోజు నా సైన్యానికి చేయదగిన కార్యం ఒక్కటే ఉంది. అది ఏమిటంటే, అర్జునుడి నుంచి నిన్ను కాపాడటం. ఇప్పుడు నీవు మమ్మల్ని విడవొద్దు" అని అభయమిచ్చాడు.

సైంధవుడు.. ద్రోణుడి వద్దకు వెళ్లి.. "గురువర్యా, నాకూ, అర్జునుడికీ నీవు విద్య నేర్పావు. మా గురించి మీకు బాగా తెలుసు. మా ఇద్దరికీ తారతమ్యం ఏమిటో మీ అభిప్రాయం చెప్పండి" అనడిగాడు. "కుమారా, ఆచార్యుడు నిర్వర్తించాల్సిన విధి ప్రకారమే నేను మీ అందరికీ పక్షపాతం లేకుండా విద్య నేర్పాను. నీకూ, అర్జునుడికీ నేర్పింది సమానమే. కానీ అర్జునుడు తన పరిశ్రమతో, స్వంత నిబంధనలతో నీకంటే హెచ్చు ప్రతిభకలవాడయ్యాడు. ఇందువల్ల నీవు అధైర్య పడాల్సిన అవసరం లేదు. అర్జునుడు ఎదుర్కోలేని మహాపరాక్రవంతులైన సైనికుల వెనుక నీవు ఉంటావు. నీ పూర్వుల మాదిరే నీవూ యుద్ధం చెయ్యి. మరణం మనకు అందరికీ వస్తుంది. ధైర్యవంతులకూ, కాని వారికీ కూడా వస్తుంది. యుద్ధభూమిలో చనిపోయినవాడు, ఇతరులు ఎంత కష్టపడినా పొందని ఊర్ధ్వ స్వర్గలోకాలను తేలిగ్గా పొందుతాడు. కనుక భయం వీడి యుద్ధం చెయ్యి" అన్నాడు ద్రోణుడు.

ద్రోణుడు ఇలా జయద్రథుడితో చెప్పి, మరునాటి యుద్ధానికి సైన్యాన్ని ఆయుత్త పర్చుతున్నాడు. ముఖ్య రణరంగానికి పన్నెండు మైళ్ల దూరంలో జయద్రథుణ్ణి కొంత సేనతో ఉంచారు. ఆ ప్రదేశానికి బలమైన రక్షణ కల్పించారు. భూరిశ్రవసుడు, కర్ణుడు, అశ్వద్ధామ, శల్యుడు, వృషసేనుడు, కృపుడు అక్కడ తమ తమ సైన్యాలతో

ఉన్నారు. వీరికీ, పాండవ సేనకూ మధ్య ద్రోణుడు తన సైన్యాన్ని వృత్తాకారంగా ఏర్పరిచాడు. చూడటానికి పద్మవ్యూహం మాదిరిగానే ఉంది. వ్యూహం తలభాగాన ద్రోణుడున్నాడు. మెరుస్తున్న తెల్లని కవచం, శిరస్త్రాణాన్ని కలిగి, అందమైన లక్కరంగు అశ్వాలతో కట్టిన రథంపై కూర్చున్నాడు. తన సైన్యాన్ని చూసి దుర్యోధనుడు మంచి నమ్మకంతో ఉన్నాడు. వెయ్యి సాయుధ రథాలు, నూరు ఏనుగులు, మూడు వేల గుర్రాలు, పదివేల మందితో పదాతి దళాలు తోడు రాగా, దుర్యోధనుడు ముఖ్య సైన్యం అగ్రభాగాన నడుస్తూ తన శంఖాన్ని ధ్వనింప చేసి యుద్ధానికి సై అన్నాడు. అతడు.. "అర్జునుడు ఎక్కడున్నాడు?. ఇతని క్రోధం, పరాక్రమం గురించి జనులు చెప్పుకుంటుంటారు. అతడు ముందుకు రావాలి. మా బలాన్ని ఎదిరిస్తే, రాతిపై పడిన కుండలా బద్ధలై ఈ వీరులందరి ఎదుటా ముక్కలవుతాడు" అంటూ దుర్యోధనుడు ప్రేలాపన చేశాడు.

అర్జునుడు తన రథాన్ని, బాణ పాతాన్ని దూరంగా నిలిపి శంఖాన్ని ఊది దుర్యోధనుడికి ప్రత్యుత్తరమిచ్చాడు. దీంతో కౌరవ సైనికులందరూ తమ తమ శంఖాలను ఊదారు. "కేశవా! దుర్మర్షుని వైపు రథాన్ని తోలు. మనం ఏనుగుల దళాన్ని చొచ్చుకొని పోదాం" అని అర్జునుడు అన్నాడు. దుర్మర్షుణుడి సైన్యమంతా ధ్వంసమైంది. గాలితో చెదిరిపోయిన మేఘాల మాదిరిగా కౌరవ సైన్యం చెదిరి అన్నిదిక్కులకూ పారిపోయింది. ఇది చూసిన దుశ్శాసనుడికి ఆగ్రహం కలిగింది. గజాయుధాలతో అర్జునుణ్ణి చుట్టుముట్టాడు. దుశ్శాసనుడు పరమ క్రూరుడు. అయినా గట్టి ధీరుడు. అర్జునుడితో అతడు ఘోరంగా యుద్ధం చేశాడు. యుద్ధభూమంతా మృత కళేబరాలతో నిండిపోయింది. తుదకు ఓడిపోయి ద్రోణుడి సైన్యంలో కలిశాడు.

కృష్ణుడు  రథాన్ని వేగంగా నడిపి ద్రోణుడి రథాన్ని సమంగా తెచ్చాడు. అర్జునుడు ద్రోణుణ్ణి ఉద్దేశించి.. "మహానుభావా, నా కుమారుని మరణానికి విచారిస్తూ, సింధురాజుపై పగ తీర్చుకోవడానికి వచ్చాను. నా ఈ ప్రతిజ్ఞ నెరవేర్చేందుకు మీ ఆశీర్వచనాలు కోరుతున్నాను." అన్నాడు. ద్రోణుడు నవ్వి.. "నాతో ముందు యుద్ధం చేసి నన్ను ఓడించిగాని నీవు జయద్రధుణ్ణి చేరలేవు" అంటూనే ద్రోణుడు అర్జునుడిపై బాణ వర్షం కురిపించాడు. అర్జునుడు అలాగే బదులిచ్చాడు. ద్రోణుడు వీటిని సునాయాసంగా తప్పించుకొని అగ్నికీలలుగల తీక్షణ బాణాలను కృష్ణార్జునులపై సారించాడు. ద్రోణుడి ధనస్సును పడగొట్టాలని అర్జునుడు తన గాండీవాన్ని వంచుతుండగా, ద్రోణుడి బాణం దాన్ని తుంచేసింది. ద్రోణుడు ఇంకా నవ్వుతూ, అర్జునుడి సారధి (శ్రీకృష్ణుడు)ని, రథాన్ని, గుర్రాలను బాణాలతో నింపేశాడు. అర్జునుడు తిరిగి బాణపరంపరను ప్రయోగించాడు. ద్రోణుడు ఈ సారి అర్జునుడు, సారధి,

రథం చీకట్లో ఉండేలా చేశాడు.

ద్రోణుడి యుద్ధరీతి ఏమాత్రం బాగోలేదంటూ.. శ్రీకృష్ణుడు,"పార్థా, ఆలస్యం వద్దు. మనం పోదాం. ఈ బ్రాహ్మణుడితో యుద్ధం చేయడం వల్ల మనకు ప్రయోజనం లేదు. అతడికి అలసటే లేదు" అంటూ అర్జునుడి రథాన్ని ద్రోణుడి రథం ఎడమపక్క నుంచి తోలుకొని వెళ్లాడు. "ఆగు, నీవు శత్రువుని ఓడించకుండా వెళ్తున్నావు" అని ద్రోణుడు అన్నాడు. "మీరు నా గురువులు. శత్రువులుకారు. ఓ ఆచార్యా, నేను నీ కుమారుడి వంటి వాణ్ణి. మిమ్మల్ని గెలిచేవారు ఈ విశాల ప్రపంచంలో లేనే లేరు" అంటూ అర్జునుడు ద్రోణుడి పక్క నుంచి తొందరగా ముందుకు సాగుతున్నాడు.

భోజ సైన్యం ఎదురైంది. అర్జునుడి మార్గాన్ని అడ్డుకున్న సుదక్షిణుడు, కృతవర్మ ఓడిపోయారు. శృతాయుధుడు కూడా అర్జునుడి గమనాన్ని నిలుపుదల చేసి గొప్ప యుద్ధం చేశాడు. శృతాయుధుడి గుర్రాలు చనిపోయాయి. శృతాయుధుడు తన గదను శ్రీకృష్ణుడిపై వేశాడు. శృతాయుధుడి తల్లి పూజలు, వ్రతాలు చేసి కుమారుడి కోసం ఆ గదను సంపాదించింది. కానీ ఆ గద ఆమె వరం పొందినప్పుడు పెట్టుకున్న నియమం ప్రకారమే పనిచేసి, తిరిగి శృతాయుధుణ్ణే తాకింది. దాంతో అతడు చనిపోయాడు.

ఆ గద చరిత్రను చూస్తే.. పర్ణశాయి అనే శృతాయుధుడి తల్లి పూజలు, ఉపవాసాలు, వ్రతాలు చేసి వరుణుని మెప్పించి.. తన కుమారుణ్ణి ఏ శత్రువూ చంపకుండా ఉండేలా వరాన్ని పొందింది. ఆ సందర్భంగా వరుణుడు.. "నీ కుమారుడికి ఒక దివ్యాస్త్రాన్ని ఇస్తాను. దీన్ని అతడు చేసే ప్రతి యుద్ధంలోనూ ఉపయోగిస్తాడు. ఏ శత్రువైనా ఇతన్ని ఓడించడం కానీ, చంపడం కానీ చేయలేరు. కానీ తనతో యుద్ధం చేయని వారిపై ఈ ఆయుధం ప్రయోగిస్తే అది తిరిగి వచ్చి నీ కుమారుణ్ణి చంపుతుంది" అని చెపుతూ వరుణదేవుడు ఒక గదను ఇచ్చాడు. శృతాయుధుడు అర్జునుడితో యుద్ధం చేస్తుండగా, తన గదను ఉపయోగించే క్రమానికి వ్యతిరేకంగా శ్రీకృష్ణుడిపై వేశాడు. శ్రీకృష్ణుడు అర్జునుడి రథాన్ని నడుపుతున్నాడేగానీ యుద్ధం చేయడం లేదు. ఈ గద కృష్ణుడి వక్షాన్ని తాకి ఆ వెంటనే గొప్పవేగంతో తిరిగొచ్చి శృతాయుధుణ్ణి చంపింది. తరువాత కాంభోజురాజు, శృతాయుధుడి సైన్యం అర్జునుడికి ఎదురొచ్చింది. కొంత సమయం వీరిమధ్య కూడా యుద్ధం జరిగింది. చివరికి కాంభోజ రాజూ చనిపోయాడు. ఇద్దరు ముఖ్య వీరులైన అన్నదమ్ములు చనిపోవడమేగాక వారి ఇరువురు కుమారులూ హతులయ్యారు. దీంతో కౌరవ సైన్యంలో కలకలం రేగింది. అర్జునుడు ఇలా సైనికులను చంపుతూ మార్గం చేసుకుంటూ జయద్రధుణ్ణి చేరాడు.



భీకరంగా తలపడుతున్న
కురుపాండవ సేనలు

## అధ్యాయం - 83

# ఎరువు తెచ్చిన కవచంతో యుద్ధంలో దుర్యోధనుడు

**అ**ర్జునుడి విజయ వార్తలను వింటున్న దృతరాష్ట్రుడు.. సంజయుణ్ణి ఉద్దేశించి, “ఓ సంజయా, శ్రీకృష్ణుడు సంధి చేసుకోవడం కోసం నాడు హస్తినాపురానికి వచ్చినప్పుడు.. ఇది సమయమనీ, సంధి చేసుకోవాలనీ నేను దుర్యోధనుడికి చెప్పాను. తన పినతండ్రి సంతానమైన పాండవులతో సంధి చేసుకోవాలని కోరాను. కృష్ణుడు మనకు మంచి చేయడానికే వచ్చాడు. అతడి సలహాని తోసిపుచ్చకు అన్నాను. కానీ దుర్యోధనుడు లక్ష్యపెట్టలేదు. కర్ణుడు, దుశ్శాసనుడు తనకు చెప్పిన మాటలను, సలహాలను పెడచెవిని పెట్టాడు. అలాగే భీష్ముడు, భూరి శ్రవసుడు, కృపుడు, ఇంకా ఇతరులు యుద్ధం వద్దని చెప్పారు. కానీ నా మూర్ఖపు కొడుకు విన లేదు. ఫలితం యుద్ధానికి దారితీసింది” అని దృతరాష్ట్రుడు విలపిస్తూ సంజయుడితో అన్నాడు.

"ఇప్పుడు నీ పశ్చాతాప వాక్యాల వల్ల ప్రయోజనం ఏమిటి?. ప్రాణప్రదమైన నీరంతా ఉపయోగపడకుండా ప్రవహించి పోయింది. నీవిప్పుడు ఆ నీరు వెళ్లిన ఛిద్రాలను పూడ్చదలిచావు. కుంతి కుమారుడు జూదం ఆడకుండా నీవెందుకు ఆపలేదు. అప్పుడే నీవు పద్ధతిగా వ్యవహరించి ఉంటే ఈ దారుణ విషాదానికి అవకాశం లేకుండా పోయేది. నీ స్వత:సిద్ధమైన అభిప్రాయాన్ని వ్యతిరేకించి, నీవే.. కర్ణ, శకునిలను అనుసరించావు. యుద్దిష్టరుడు, ద్రోణుడు ఇదివరకు నీ పట్ల ఉంచిన గౌరవంతో ఇప్పుడు లేరు. నీ ధర్మ ప్రవర్తనం, న్యాయం, నీతి అనేవి ఆంతరంగికంగా నీకు యథార్థంగా లేవని, పైకి అవి ఉన్నట్లు నటిస్తున్నావని శ్రీకృష్ణుడు భావిస్తున్నాడు. శూరులు, వీరులు చేయదగినదంతా కౌరవులు చేస్తున్నారుగానీ, అర్జునుడు, కృష్ణుడు, సాత్యకి, భీముడు వంటి వీరుల బాణాలు ఎదుర్కొనేందుకు వారికి శక్తి లేదు. దుర్యోధనుడూ తన శక్తి ఉన్నంతవరకూ యుద్ధం చేస్తూనే ఉన్నాడు. తనకున్న ప్రతాపాన్నంతా ఉపయోగిస్తూనే ఉన్నాడు. నీవిప్పుడు అతణ్ణి, అతనికి సహాయం చేస్తున్న విశ్వాసంగల సైనికులను నిందించడం తగదు" అన్నాడు. దృతరాష్ట్రుడు అందుకుంటూ.. "ప్రియమైన సంజయా! నేను చేయాల్సిన పనిని చేయలేదని ఒప్పుకుంటాను. నీవు చెప్పింది యధార్థమే. ఎవరైనా అదృష్ట మార్గాన్ని మార్చలేరు. ఏమి జరిగిందో చెప్పు. అంతా చెప్పు. ఈ చెప్పేది సహించరానిదైనా సరే చెప్పు" అంటూ దృతరాష్ట్రుడు తీవ్రంగా దు:ఖించడం మొదలుపెట్టాడు. దృతరాష్ట్రుడు కోరిన విధంగా సంజయుడు చెప్పసాగాడు.

సింధు రాజు సమీపానికి అర్జునుడి రథం నిరాటకంగా, జయప్రదంగా వెళ్లడం చూసి దుర్యోధనుడు ఎక్కువగా పరితపిస్తున్నాడు. అతడు ద్రోణుడి వైపుకు వేగంగా వెళ్లాడు. అప్పుడు దుర్యోధనుడు.. ద్రోణుణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు. "అర్జునుడు కౌరవ మహాసైన్యాన్ని ఛేదించి జయద్రధుడి స్థానాన్ని సమీపిస్తున్నాడు. మన తొట్రుపాటును, ఓటమిని చూసి సింధురాజుకు రక్షణ కల్పిస్తున్న మన యోధులు తప్పక అధైర్య పడేవారు. నిన్ను దాటి అర్జునుడు రావడం అర్జునుడికి చేతగాని పని అని వారందరూ నమ్ముతున్నారు. ఇప్పుడది అవాస్తవమైంది. నీ కళ్లముందు నుంచే ముందుకు వెళ్లాడు. అతన్ని ఆపడానికి ఏమీ చేయలేదు. నిశ్చయంగా నీవు పాండవులకు సహాయం చేయడానికి ఉన్నట్లే కనిపిస్తోంది. నా మనస్సును ఎంతో క్షోభకు గురి చేస్తున్నావు. నేను నీకు ఏమైనా అపచారం చేశానా?. మరి నన్నెందుకు నాశనం చేస్తున్నావు. నివ్విలా చేస్తున్నావని నాకు ముందే తెలిసి ఉంటే జయద్రధుణ్ణి అక్కడుండమని నేను కోరేవాడినే కాదు. తాను తన దేశం వెళ్లిపో తానని నాతో చెప్పినప్పుడు నేనాతన్ని ఆపడం చాలా పొరబాటు చేశాను. అర్జునుడు అతన్ని

ఎదిరించినప్పుడు, మృత్యువును తప్పించుకోగలడా?. నన్ను క్షమించు. బాధతో బుద్ధిలేని మాటలు మాట్లాడుతున్నాను. జయద్రధుణ్ణి రక్షించడానికి నీవే వెళ్లు" అని అన్నాడు దుర్యోధనుడు.

దీనికి ద్రోణుడు సమాధానమిస్తూ..“రాజా, నీవన్న మాటలు అనాలోచితమైనవి. వీటిని నేను మెచ్చుకోలేను. నీవు నా కుమారుడి వంటి వాడివి. నా కుమారుడైన అశ్వత్థామ నీకంటే నాకు ప్రేమాధికుడు కాదు. నేను చెప్పినట్లు చెయ్యి. ఈ కవచాన్ని తీసుకో. ఇది ధరించి వెళ్లి అర్జునుణ్ణి ఆపు. నేను అలా చేయలేను. నేను మన సేన ఈ భాగంలో ఉండటం చాలా అవసరం. అందువల్ల నీవు ఆ పనిచేయి. అటు చూడు. ఆ బాణ మేఘాలు చూడు. పాండవ సైన్యం మనల్ని తీవ్రంగా ఎదుర్కొంటోంది. యుధిష్ఠరుడు అక్కడ అర్జునుడి సహాయం లేకుండా ఉన్నాడు. ఇలాంటి సమయాన్నే కదా మనం కోరుకున్నాము?. మన ముఖ్యోద్దేశం ఫలించింది. నేనిపుడు యుధిష్ఠరుణ్ణి పట్టి నీకిస్తాను. కనుక ఈ అవకాశాన్ని జారవిడిచి నేను అర్జునుడి వెంట పడను. అర్జునుడి వెంటపడితే మన యుద్ధ వ్యూహాలు, సన్నాహాలు, అంతా ధ్వంసమై నిస్సహాయులం అవుతాం. నీకీ కవచాన్ని నన్ను తొడగనివ్వు. గొప్ప నమ్మకంతో వెళ్లు. భయపడకు. నీకు వీరత్వం ఉంది. సాహసం, నేర్పు, అనుభవం ఉంది. ఈ కవచం అన్ని ఆయుధాలకూ దుర్భేద్యం. ఎలాంటి ఆయుధాన్నయినా నీ శరీరానికి తాకకుండా చేస్తుంది. దుర్యోధనా.. యుద్ధానికి వెళ్లి మంచి నమ్మకంతో ఉండి బ్రహ్మ ఇచ్చిన కవచంతో ఇంద్రుడు రణం చేసిన రీతిలో యుద్ధం చెయ్యి. నీకు జయం కలుగుతుంది" అన్నాడు ద్రోణాచార్యుడు.

దుర్యోధనుడుకి ద్రోణుడి మాటలు ఎంతో ధైర్యానిచ్చాయి. నమ్మకమూ పెరిగింది. ద్రోణుడిచ్చిన కవచాన్ని ధరించి వెనుక గొప్ప సైన్యం వెంటరాగా, అర్జునుణ్ణి ఎదురించడానికి బయలుదేరాడు. అర్జునుడు కౌరవ సేనను దాటి చాలా దూరం వెళ్లాడు. జయద్రధుడు (సైంధవుడు) రక్షణ పొందుతున్న ప్రదేశాన్ని సమీపిస్తున్నాడు. తన గుర్రాలు కొంత అలసిపోయాయని శ్రీకృష్ణుడు రథాన్ని నిలువరించాడు. ఇక గుర్రాలను రథాన్నుంచి విప్పే తరుణంలో హఠాత్తుగా విందానువింద అన్నదమ్ములు వచ్చి అర్జునుణ్ణి ఎదురించారు. అర్జునుడు వారి సైన్యాన్ని ఎదుర్కొని ఓడించాడు. ఆ తరువాత కృష్ణుడు గుర్రాలను రథం నుంచి విప్పాడు. అవి సమీపంలో ఉన్న బురదలో పొర్లాయి. అలా గుర్రాలు కాసేపు సేద తీరాయి. తరువాత వారు అనుకున్నట్లుగా ముందుకు కదిలారు.

శ్రీకృష్ణుడు.. “అర్జునా, అలా వెనక్కి చూడు. తనకులేని ధైర్యం తెచ్చుకొని దుర్యోధనుడు వస్తున్నాడు. ఏమి అదృష్టం. చాలా కాలం నీవు క్రోధాన్ని అణుచుకున్నావు.

దాన్ని బయటకు కక్కాల్సిన సమయం ఇదే. ఇంత పెద్ద విషాదానికి కారణమైన ఆ మనిషి నీ చేతికి చిక్కబోతున్నాడు. అయితే అతడు గొప్ప విలుకాడనీ, ధనుర్విద్యలో ఆరితేరినవాడనీ, సూక్ష్మదృష్టి కలిగిన బలవంతుడైన యోధుడనీ జ్ఞాపకం ఉంచుకో” అని శ్రీకృష్ణుడు దుర్యోధనుడి గురించి అర్జునుడికి హితవు పలికాడు.

దుర్యోధనుడు నిర్భయుడై కృష్ణార్జునులను సమీపించాడు. వారి నుద్దేశించి దుర్యోధనుడు.. “అర్జునా, నీవు గొప్ప ప్రతిభగల కార్యాలు చేశావని అందరూ చెపుతుంటారు. కానీ నేనవి చూడలేదు. ఇప్పుడు నీ ధైర్యాన్ని, నేర్పును, కీర్తిని నన్ను చూడనివ్వు” అంటూ యుద్ధం ఆరంభించాడు. అర్జునుడు – దుర్యోధనుడి మధ్య పోరు భయంకరంగా సాగుతోంది. కృష్ణుడు ఒకింత ఆశ్చర్యచకితుడయ్యాడు. అర్జునుణ్ణి ఉద్దేశించి.. “పార్థా, నాకు ఆశ్చర్యం కలుగుతోంది. నీ బాణాలు ఏమాత్రం దుర్యోధనుడికి అపాయం కలిగించడం లేదు ఎందుకని?. గాండీవం నుంచి విడిచిన బాణాలు కూడా వృథా అవ్వడం మొదటిసారి చూస్తున్నాను. ఇదేదో వింతగా ఉంది. నీ ఆయుధాల శక్తి తగ్గిందా? నీ బాణాలు దుర్యోధనుణ్ణి తాకి అతడికి గుచ్చుకోకుండా కింద పడిపోతున్నాయేమిటి?. ఇదో గొప్ప వింతగా, ఊహించరానిదై ఉందే?” అన్నాడు.

అర్జునుడు నవ్వి.. “నాకు బోధపడింది. అతడు మంత్రపూతగల కవచం ధరించి వచ్చాడు. ద్రోణాచార్యులవారు ఈ కవచం గురించి గతంలో నాకు చెప్పారు. అదే ఇది. దాన్ని ధరించివచ్చాడు. నీవిప్పుడు కొంత ఆశ్చర్యాన్ని చూస్తావు.” అంటూ దుర్యోధనుడిపైకి బాణాలు విడవడం ప్రారంభించాడు. మొదటిగా దుర్యోధనుడి రథాన్ని, సారథిని, గుర్రాలను లేకుండా చేశాడు. తరువాత మరో బాణంతో దుర్యోధనుడి ధనస్సును ఎగరగొట్టాడు. ఆ విధంగా దుర్యోధనుడు పూర్తిగా నిరాయుధుడయ్యాడు. కవచం ధరించని చోట సూదుల వంటి బాణాలను విడిచాడు. అవి గుచ్చుకొని దుర్యోధనుడు బాధను భరించలేకపోయాడు. అంతే వెనుదిరిగి పారిపోయాడు.

ఇలా దుర్యోధనుడు ఓడిపోవడంతో శ్రీకృష్ణుడు తన పాంచజన్యాన్ని పూరించాడు. దీంతో జయద్రథుడి సైన్యంలో ఆందోళన కలిగింది. అతణ్ణి చుట్టు ఉన్న వీరులు ఆశ్చర్యపడ్డారు. తక్షణమే వారు రథాలపై సిద్ధంగా ఉన్నారు. భూరిశ్రవసుడు, చేలుడు, కర్ణుడు, వృషసేనుడు, కృపుడు, శల్యుడు, అశ్వజత్థామ, జయద్రథుడు ఈ ఎనిమిది మంది వారి వారి సేనలతో అర్జునుణ్ణి ఎదుర్కొన్నారు.

◈

అధ్యాయం - 84

# యుధిష్టరుని అపోహలు

**దు**ర్యోధనుడు.. అర్జునుడి వైపునకు వెళ్తుండగా చూసిన పాండవులు, కౌరవ సేనను పూర్తి బలంతో ఎదుర్కొన్నారు. జయద్రధుడికి ద్రోణుడు సహాయంగా వెళ్లకుండా చేయడానికి పాండవులు ఇలా చేశారు. దీంతో ధృష్టద్యుమ్నుడు తరచూ తన సైన్యాన్ని ద్రోణుడిపైకి పంపుతున్నాడు. ఇప్పుడు కౌరవులు మూడు వేర్వేరు ప్రదేశాల్లో వేర్వేరుగా యుద్ధం చేయాల్సిన పరిస్థితి వచ్చింది. దీంతో కౌరవుల బలం తగ్గినట్లయింది. ధృష్టద్యుమ్నుడు తన రథాన్ని నేరుగా ద్రోణుడి రథానికి అభిముఖంగా మరల్చి యుద్ధం చేయడం ప్రారంభించాడు. ఇద్దరి మధ్యా యుద్ధం అరివీర భయంకరంగా సాగింది. ద్రోణుడి లక్కరంగు రథాశ్వాలు, ధృష్టద్యుమ్నుడి పావురు పిట్ట రంగు రథ గుర్రాలు లంకెలు పడ్డాయి. ఆ దృశ్యం సాయంకాలం మేఘాల మాదిరిగా అందంగా కనిపించింది.

ధృష్టద్యుమ్నుడు తన ధనస్సును పడేసి, కృపాణాన్ని, డాలునూ తీసుకుని

ద్రోణుడి రథం వైపు ఉరికాడు. గుర్రాల పైనుంచి నెలగలపైకి వెళ్లి ద్రోణుడు ఆందోళన చెందేలా రక్త నయనాలతో, రూక్షవీక్షణాలతో భస్మం చేయ తలంచినట్లుగా తాకాడు. అలా యుద్ధం చాలా సేపు జరిగింది. కోపోద్రిక్తుడైన ద్రోణుడు.. ఒక తీక్షణ బాణాన్ని ధృష్టద్యుమ్నుడిపైకి వదిలాడు. ఆ బాణం ధృష్టద్యుమ్నుడి ప్రాణం తీయాల్సిందే. కానీ ఆ సమయంలో సాత్యకి తన బాణంతో ద్రోణుని బాణాన్ని పక్కకు కొట్టాడు. దీంతో ద్రోణుడు సాత్యకిని లక్ష్యం చేసుకున్నాడు. ఇదే మంచి సమయమని ధృష్టద్యుమ్నుడు తన వారిని అక్కణ్నుంచి మరలించాడు. ద్రోణుడు నల్లత్రాచులా బుసకొడుతూ, ఎర్రబడ్డ కళ్లతో పాండవ సేన ముందున్న సాత్యకిపైకి వెళ్తున్నాడు. సాత్యకి కూడా ద్రోణుడికి ఎదురుగా వెళ్లాడు. సాత్యకి తన సారథిని ఉద్దేశించి.. "ఈ మనిషి బ్రాహ్మణ వృత్తిని విడిచి, యుద్ధం చేసే ఉద్యోగం చేస్తున్నాడు. పాండవులను చాలా చికాకు పెడుతున్నాడు. ఇతడు తన పక్షాన ఉన్నాడనే దన్నే దుర్యోధనుడికి అతిశయం కలిగించింది. ఇతడు తానే గొప్ప యోధుణ్ణనే గర్వంతో ఉన్నాడు. ఇతడికి నేను గుణపాఠం చెప్పాల్సి ఉంది. త్వరగా అతడి వద్దకు రథాన్ని తీసుకొని వెళ్లు" అన్నాడు. రథం ద్రోణుణ్ణి చేరుకుంది. ద్రోణుడూ, సాత్యకీ ఇద్దరూ బాణ వర్షం కరిపించారు. వారు విడిచిన బాణాలతో ఆ ప్రదేశమంతా అలముకొని కాసేపు సూర్యబింబిం కనిపించకుండా పోయింది. చీకటి ఏర్పడింది. ఇరువురి రథాలపైన ఎగిరే పతాకాలు కింద పడిపోయాయి.

ద్రోణుడూ, సాత్యకీ ఇద్దరు రక్తసిక్త శరీరాలతో కనిపిస్తున్నారు. ఉభయ పక్షాల సైనికులూ ఎంతో దీక్షతో యుద్ధం చేస్తున్నారు. రెండు వైపులా శంఖనాదాలుగానీ, జయసూచికలుగానీ వినపడలేదు. దేవతలు, విద్యాధరులు, యక్షులు, గంధర్వులు ఆకాశం నుంచి వీరిరువురి యుద్ధాన్ని చూస్తున్నారు. సాత్యకి విడిచిన బాణంతో ద్రోణుడి ధనుస్సు విరిగిపోయింది. వెంటనే భరద్వాజుడు మరో ధనుస్సు ఎత్తినంతనే సాత్యకి దాన్ని కూడా పడగొట్టాడు. ఇలాగే ద్రోణుడు విడిచిన మరో బాణాన్ని కూడా పడగొట్టాడు. ఈ విధంగా నూటొక్కసార్లు ద్రోణుడి ధనస్సులను సాత్యకి భగ్నం చేశాడు. ద్రోణుడు మనసులో ఇలా అనుకున్నాడు. 'ఈ సాత్యకి.. శ్రీరాముడు, కార్తవీర్యుడు, అర్జునుడు, భీష్ముడు వంటి వీరుల తరగతికి చెందినవాడు. తనకు తగిన వీరుడు లభించాడని ద్రోణుడు సంతోషించాడు. ద్రోణుడు ఏ రకం బాణం విడిచాడో సాత్యకి కూడా అదే రకం బాణాన్ని విడిచి పెడుతున్నాడు. ఈ సమాన సమరం చాలా సేపు కొనసాగింది.

బాణ యుద్ధ నిపుణుడైన ద్రోణుడు ఇక సాత్యకిని చంపదలిచాడు. అతడిపైకి ఆగ్నేయాస్త్రాన్ని వదిలాడు. సాత్యకి తన వారుణాస్త్రంతో దాన్ని నిరోధించాడు. సాత్యకి

బలం క్షీణించసాగింది. ఇది చూసి కౌరవ సేనలు ఆనందంతో చిందులు వేశాయి. సాత్యకి పరిస్థితిని గమనించిన యుధిష్ఠరుడు తన వద్ద ఉన్న వారితో.. "మహావీరుడైన సాత్యకి ద్రోణుడి చేతిలో నీరసిస్తున్నాడు. మీరంతా అక్కడికి వెంటనే వెళ్లండి. ధృష్టద్యుమ్నా, మనం సాత్యకికి త్వరలో సాయం చేయకపోతే ఆ ద్రోణుడు అతణ్ణి చంపేస్తాడు. తక్షణమే వెళ్లు. వెనక్కి తగ్గొద్దు. పక్షితో పిల్లి చెలగాటం ఆడినట్లుగా సాత్యకితో ద్రోణుడు ఆడుతున్నాడు. నిశ్చయంగా సాత్యకి ఇప్పుడు మృత్యువు చేతిలో ఉన్నట్లే" అంటూ తన సేనను కూడా ద్రోణుడిపైకి వెళ్లాలని ఆజ్ఞాపించాడు. బహుకష్టం మీద సాత్యకి సురక్షితంగా తప్పించుకోగలిగాడు. సరిగ్గా ఆ సమయంలోనే అర్జునుడు యుద్ధం చేసే ప్రదేశం నుంచి పాంచజన్యారావం వినవచ్చింది. యుధిష్ఠరుడు.. "ఓ సాత్యకీ, పాంచజన్యారావం వినవస్తోంది. కానీ అర్జునుడి గాండీవ గుణధ్వని మాత్రం వినిపించడం లేదు. జయద్రథుడి స్నేహితులు అర్జునుణ్ణి చుట్టుముట్టి అపాయ పరిస్థితిలోకి నెట్టారేమో. అర్జునుడు ముందు నుంచీ, వెనుక నుంచీ తాకబడి ఉన్నాడు. ఉదయాన కౌరవ సేనను ఛేదించి వెళ్లిన అతడు ఇప్పటికింకా తిరిగి రాలేదు. పగటికాలం చాలా గడిచిపోయింది. ఒక్క కృష్ణుడి శంఖారావమే వినపడింది. అర్జునుడు మృతి చెందితే కృష్ణుడు యుద్ధానికి దిగాడా అని నాకు భయం వేస్తోంది. ఓ సాత్యకీ, యుద్ధంలో నీవు చేయనిది ఏదీ లేదు. నీ ప్రియ స్నేహితుడైన అర్జునుడు నీకు గురువే. అతడు ప్రాణాపాయ దశలో ఉన్నాడు. నీ ప్రతాపం, నైపుణ్యతా గొప్పదనం గురించి అర్జునుడు తరచూ నాతో చెప్పేవాడు. మేము అడవుల్లో ఉన్నప్పుడు సాత్యకిని పోలిన యోధుడే లేడన్నాడు. ఓయీ అటు చూడు. దుమ్ము, ధూళి ఎగిసి ఉంది. నిశ్చయంగా అర్జునుణ్ణి శత్రువు చుట్టుముట్టాడు. జయద్రథుడు గొప్ప యోధుడు. అతడి కోసం ప్రాణాలను సైతం ఇవ్వగల వీరులు అతడికి బాసటగా ఉన్నారు. తక్షణమే నీవు వెళ్లు" అని పురమాయించాడు.

ద్రోణుడితో యుద్ధం చేసి అలసిపోయి ఉన్న సాత్యకి.. "ఓయీ సత్యవ్రతుడా, నీ ఆజ్ఞను శిరసావహిస్తాను. అర్జునుడి కోసం నేను ఏమైనా చేస్తాను. నాకు ప్రాణం తృణప్రాయం. నీవు ఆజ్ఞ ఇస్తే దేవతలనైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నాను. వాసుదేవుడు, అర్జునుడు వెళ్లేటప్పుడు వారు నాతో అన్న మాటలు చెప్పనివ్వండి. 'మేం జయద్రథుణ్ణి చంపి తిరిగి వచ్చేవరకూ నీవు యుధిష్ఠరుడి పక్క నుంచి వెళ్లొద్దు. అతణ్ణి రక్షించడానికి చతురతగా అప్రమత్తంగా ఉండు. మేము నిన్ను నమ్మి ఈ పనిని నీకు అప్పగించి వెళ్తున్నాం. కౌరవ సేనలో ఒక్క వీరుడుకే మేం భయపడతాం. అతడే ద్రోణుడు. ద్రోణుడి ప్రతిజ్ఞ గురించి మీకు తెలుసు. ధర్మపుత్రుడి రక్షణ నీ చేతిలో పెట్టి మేం వెళ్తున్నాము' అన్నారు. నేనందుకు తగినవాణ్ణని ఎంచి మీ పూచీ

అర్జునుడు నాపై వదిలాడు. అతడి ఆజ్ఞను నేను ఎలా తిరస్కరిస్తాను?. అర్జునుడి స్వస్థత గురించి మీరు భయపడవద్దు. అతన్నెవరూ జయించలేరు. జయద్రధుడు, అతన్ని రక్షించేవారు కలిసి అర్జునుడి ప్రభావంలో పదహారో వంతుకు కూడా చాలరు. ఓయీ ధర్మపుత్రా! నేను వెళ్లక తప్పనప్పుడు నీ రక్షణ ఎవరికి విచిడి వెళ్లగలను?. నిన్ను పట్టుకోవడానికి ఆ ద్రోణుడు వస్తే అతణ్ణి ఎదురించి నిలబడేవారెవరు?. ఇక్కడెవరూ లేరే. కనుక నన్ను వెళ్లాలని నిర్బంధించొద్దు. నన్ను వెళ్లాలని ఆజ్ఞ ఇచ్చేముందు తీవ్రంగా ఆలోచించండి" అన్నాడు సాత్యకి.

యుధిష్టరుడు సమాధానమిస్తూ.. "ఓయీ సాత్యకి. నేనిదంతా ఆలోచించాను. అపాయాన్ని, అవసరాన్ని రెండింటినీ చూసి ఆలోచించాను. నిన్ను పంపించడానికే నిశ్చయించాను. నీవు నా పూర్తి అనుజ్ఞను పొందే వెళ్తున్నావు. నా రక్షణ చూడటానికి ఇక్కడ పరాక్రవంతుడైన భీముడున్నాడు. ధృష్టద్యుమ్నుడున్నాడు. వీరుగాక ఇంకా చాలా మంది ఉన్నారు. నా గురించి ఎలాంటి ఆందోళనా అవసరం లేదు" అంటూ యుధిష్టరుడు ఒక పెట్టె నిండా బాణాలను, ఇతర ఆయుధాలను సాత్యకి రథంలో ఉంచి, రథానికి కొత్త గుర్రాలు అమర్చి తన ఆశీర్వచనాలతో సాత్యకిని పంపాడు. సాత్యకి.. "భీమసేనా, నీవిప్పుడు యుధిష్టరుణ్ణి రక్షించాలి. బహుజాగ్రత్తగా ఉండు" అని చెప్పి వెళ్లిపోయాడు.

కౌరవ సేనను చీల్చుకొని సాత్యకి వెళ్తున్నప్పుడు అతణ్ణి అనేకమంది ఎదుర్కొన్నారు. వారందరినీ జయించి, అన్ని ఆటంకాలనూ దాటి సాత్యకి ముందుకు వెళ్తున్నాడు. కానీ శత్రుధాటి ఎక్కువగా ఉండటంతో సాత్యకి గమనం చాలా నిదానంగా సాగుతున్నది. సాత్యకి.. యుధిష్టరుణ్ణి వదిలి వెళ్లడం చూసిన ద్రోణుడు పాండవ వ్యూహంపై పడి విశ్రాంతిలేని నిరంతర యుద్ధం చేశాడు. పాండవ సైనికులను ఎదిరించి వెనక్కి మరలించాడు. యుధిష్టరుడు ఇది చూసి అసంతృప్తి చెందాడు.

◈

## అధ్యాయం - 85

# యుధిష్టరుని ప్రియ కోరిక

**యు**ధిష్టిరుడు భీముణ్ణి ఉద్దేశించి.. "అర్జునుడు ఇంకా తిరిగి రాలేదు. అతడి వెనుకే వెళ్లిన సాత్యకీ తిరిగి రాలేదు. భీమా, నాకు భయం కలుగుతున్నది. పాంచజన్యారావం వినిపిస్తోంది కానీ, గాండీవ గుణధ్వని వినిపించడం లేదు. సాత్యకి ఏ వార్తా తీసుకురాలేదు. నాకు ఆందోళన అంతకంతకూ హెచ్చవుతోంది" అని భీముడితో అన్నాడు. దీనికి భీముడు సమాధానమిస్తూ.. "ఇంత ఆందోళన నీవద్ద ఎప్పుడూ చూసి ఎరుగను. ధైర్యాన్ని కోల్పోవద్దు. మీ ఇష్టం వచ్చిన పని చెప్పండి. చేస్తాను. ఆందోళన అనే బురదలో మీ నిర్మల మనస్సు అనే చక్రాన్ని దిగబడనీయకు" అన్నాడు.

"ప్రియ భీమా, నీ సోదరుడైన అర్జునుడు చనిపోయి ఉంటాడని భయపడు తున్నాను. అందువల్ల మాధవుడే ఆయుధం ధరించి యుద్ధం చేస్తున్నట్లు నాకు అనిపిస్తోంది. మాధవుని శంఖధ్వనేగాని, ప్రతిధ్వని ఇచ్చే గాండీవ ధ్వని వినిపించడం

లేదు. ఎవరిపైనైతే మనం ఆశలు నిలుపుకున్నామో, ఆ అసమాన వీరుడు అర్జునుడు యుద్ధంలో చనిపోయాడని నాకు భయం వేస్తోంది. నా మనసు కలవరం చెందింది. నేను చెప్పినట్లు చేసేవాడివైతే నువ్వు అర్జునుడున్న ప్రదేశానికి వెళ్లు. అర్జునుణ్ణి, సాత్యకిని కలువు. అక్కడేమి చేయాల్సి ఉందో అది చేసి తిరిగిరా. నా అనుజ్ఞ మేరకు సాత్యకి కౌరవ సేనలను ఎదురిస్తూ అర్జునుడి వద్దకు వెళ్లాడు. నీవూ ఇప్పుడు అలాగే చెయ్యి. అక్కడ వారంతా క్షేమంగా ఉంటే నీవు చేసే సింహనాదం వల్ల నేనా విషయం తెలుసుకుంటాను" అన్నాడు యుధిష్టరుడు. దానికి భీముడు బదులిస్తూ.. "ప్రభూ, విచారించకు. నేను వెళ్లి వారి క్షేమ సమాచారాన్ని తెలియజేస్తాను" అన్నాడు. ఆ వెంటనే దృష్టద్యుమ్నుణ్ణి ఉద్దేశించి.. "ఓయీ పాంచాల! ద్రోణుడు ధర్మపుత్రుణ్ణి ఎలాగైనా సజీవంగా పట్టుకుంటానని శపథం చేసి ఉన్నాడు. ఆ విషయం నీకు తెలుసు. రాజును రక్షించడం మన ముఖ్య విధి. అయినా ఆయన అనుజ్ఞను నేను మన్నించాలి. కావున ఆయనను నీ రక్షణలో విడిచి వెళ్తున్నాను" అన్నాడు. ధృష్టద్యుమ్నుడు, భీముణ్ణి ఉద్దేశించి.. "భీమా, అలా మనస్సును పాడుచేసుకోకు. స్వచ్ఛమైన మనసుతో వెళ్లు. నన్ను చంపాక గానీ ద్రోణుడు యుధిష్టరుణ్ణి పట్టుకెళ్లలేడు" అన్నాడు.

అక్కణ్ణుంచి బయలుదేరిన భీముణ్ణి కౌరవులు చుట్టుముట్టారు. అర్జునుడికి సహాయంగా వెళ్లకుండా చేయడానికి గొప్పగా యుద్ధం చేశారు. స్వల్ప జీవుల్ని చెదరగొట్టినట్లు, తన శత్రువులను చెదరగొడుతూ, చంపుతూ, చెలరేగిపోతున్నాడు భీముడు. తనను ఎదిరించిన ధృతరాష్ట్రుని కుమారులు పదకొండు మందిని హతమార్చాడు. తరువాత భీముడు.. ద్రోణుణ్ణి చేరాడు. ద్రోణుడు, భీముణ్ణి ఉద్దేశించి.. "ఆగు. నీ శత్రువునైన నేను ఇక్కడ ఉన్నాను. నన్ను ఓడించనిదే నీవు ముందుకు వెళ్లలేవు. నీ తమ్ముడు అర్జునుడు నా అనుజ్ఞ మేరకే లోనికి వెళ్లాడు. కానీ నిన్ను వెళ్లనివ్వను" అన్నాడు. అర్జునుడితో తాను పొందిన విధి వినయయుక్త ప్రత్యుత్తరం ఈ భీముణ్ణుంచి కూడా వినవొచ్చని ద్రోణుడు అలా అన్నాడు.

ద్రోణుడి మాటలు భీముడికి కోపం తెప్పించాయి. "ఓ బ్రాహ్మణుడా, నీ అనుజ్ఞ పొంది అర్జునుడు వెళ్లలేదు. నిన్ను ఎదుర్కొని, మీ సేనను చీల్చుకొని, యుద్ధం చేస్తూ మార్గం చేసుకొని వెళ్లాడు. దయ ఉంచి నిన్ను గాయపరచకుండా విడిచి వెళ్లాడు. కానీ నేను అర్జునుడిలా నీపై దయ చూపను. నేను నీ శత్రువును. ఒకానొక కాలంలో మీరు మాకు గురువు, తండ్రి అంతటివారు. అప్పుడు మీ పట్ల మేం ఎంతో మన్నన కలిగి ఉన్నాము. ఇప్పుడు నీ అంతటికి నీవే మా శత్రువన్నావు. అలాగే కానివ్వండి" అంటూ తన గదను తిప్పి గురిచూసి ద్రోణుడి రథంపైకి విసిరాడు. దెబ్బకు ఆ రథం తునాతునకలైంది. ద్రోణుడు మరో రథం ఎక్కాడు. ఈ రథాన్నీ

భీముడు అలాగే చేశాడు.

భీముడు లోనికి చొచ్చుకువచ్చి ఎదురొచ్చిన అడ్డంకులను తప్పించుకొని బయటకు వెళ్లాడు. ఆ రోజు ద్రోణుడికి చెందిన ఎనిమిది రథాలు ధ్వంసం అయ్యాయి. తన మార్గాన్ని అడ్డుకున్న భోజుడి సైన్యాన్ని రూపుమాపాడు భీముడు. అక్కణ్ణుంచి జయద్రథుడి సేనతో పోరాడుతున్న అర్జునుడి వద్దకు వెళ్లాడు. అర్జునుణ్ణి చూసిన వెంటనే గొప్ప సింహనాదం చేశాడు. ఈ నాదం విని కృష్ణార్జునులు నవ్వుకున్నారు. ఈ సింహనాద ప్రతిధ్వనిని విన్న యుధిష్ఠరుడు తన అనుమానాలను, భయాలను వీడి అర్జునుణ్ణి బహువిధాల ఆశీర్వదించాడు. యుధిష్ఠరుడు ఇలా అనుకున్నాడు. 'ఈ రోజు సూర్యాస్తమయం లోపు అర్జునుడి శపథం పూర్తవుతుంది. అభిమన్యుడి మరణానికి మూలమైన వాడిని చంపి అర్జునుడు జయప్రదంగా తిరిగి వస్తాడు. జయద్రథుడు చనిపోయాక దుర్యోధనుడు సంధికి ప్రయత్నిస్తాడు. తన సోదరులు చాలా మంది చనిపోయిన తరువాత దుర్యోధనుడు సంధి చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. తన సోదరులు చనిపోయినందున ఈ తెలివిమాలిన దుర్యోధనుడికి జ్ఞానోదయం కావచ్చు. ఈ యుద్ధరంగంలో లెక్కలేనంత మంది రాజులు, వీరుల ప్రాణాలు పోయాయి. మొండి పట్టు పట్టిన, స్వల్ప బుద్ధిగల దుర్యోధనుడు ఇప్పుడు తన తప్పును తెలుసుకొని సంధికి రావచ్చు. ఇది నిజంగా జరుగుతుందా?. పితామహుడైన భీష్ముడు యజ్ఞపశువుగా ఆహుతయ్యాడు. ఈ దుర్మార్గ శత్రుత్వం దుర్యోధనుడి ఆహుతితో ఆగిపోతుందా?. ఇంకా క్రూరమైన సర్వ నాశనం కాకుండా మేమంతా రక్షించబడతామా?". ఇలా యుధిష్ఠరుడు సంధిని అతిప్రియంగా తలుచుకొన్నాడు. ఆది జరగుతుందని ఆశపడుతూ కలలు కన్నాడు. కానీ యుద్ధ రంగంలో శత్రువులను ఎదుర్కొంటూ భీముడు, సాత్యకి, అర్జునుడు యుద్ధం చేస్తూనే ఉన్నారు.

మృత దేహాలతో నిండిన యుద్ధరంగం



## అధ్యాయం - 86

# కర్ణుడు - భీముడు

ద్రోణుడి యుద్ధాన్ని ఎదుర్కోవడానికి యుధిష్ఠరుణ్ణి విడిచిపెట్టి, సూర్యాస్తమయంలోపు జయద్రధుణ్ణి యుద్ధభూమిలో చంపి తన ప్రతిజ్ఞను నిలుపుకునేందుకు అర్జునుడు వెళ్లిన విషయం ఇంతకు ముందే చదువుకున్నాం.

పద్నాలుగోరోజు యుద్ధమది. యుద్ధభూమిలో అనేకచోట్ల ఘోర యుద్ధాలు జరుగుతున్నాయి. ఒకచోట సాత్యకి-భూరిశ్రవసుడి మధ్య, మరోచోట భీముడు-కర్ణుడి మధ్య, ఇంకోచోట అర్జునుడు-జయద్రధుడి మధ్య యుద్ధాలు జరుగుతున్నాయి.

అసలు యుద్ధరంగంలో ద్రోణుడున్నాడు. పాంచాలులను, పాండవులను ఎదుర్కొంటూ వారితో గొప్ప యుద్ధం చేస్తున్నాడు. అర్జునుడు యుద్ధం చేస్తున్న చోటుకు దుర్యోధనుడు తన సైన్య బలంతో వచ్చాడు. అర్జునుణ్ణి ఎదురించించాడు. కానీ త్వరలో ఓడిపోయి తిరిగి వెళ్లిపోయాడు. ఇలా యుద్ధం ఒకే స్థలంలో కాకుండా అనేకచోట్ల జరుగుతోంది. ఈ కారణం వల్ల వెనుక నుంచి కూడా శత్రువులు ఎదురించడానికి వీలైనట్లు ఉభయ సేనలూ చెదిరిపోయాయి.

దుర్యోధనుడు ద్రోణుడితో సంభాషిస్తున్నాడు. అర్జునుడు, భీముడు, సాత్యకి మనల్ని నిర్లక్ష్యం చేసి జయద్రథుడు ఉన్న స్థలానికి వెళ్లి అతణ్ణి ఇరుకున పెట్టి హింసిస్తున్నారు. మీ నాయకత్వంలో మన సైన్య వ్యూహాలు ఛేదించబడి, అనుకున్న వ్యూహాలన్నీ పూర్తిగా పాడైపోయాయి. ఇది వింతగా ఉన్నది. తన పరిశ్రమ వల్ల యుద్ధ శాస్త్రం పూర్తిగా తెలిసిన ద్రోణుడే ఇలా పాండవ వీరులతో అతిక్రమింప బడ్డాడా అని ప్రతివారూ అడుగుతున్నారు. నేనేమి జవాబు చెప్పాలి?. నేను నీతో దగా పడ్డాను" అని దుర్యోధనుడు మళ్లీ ద్రోణుణ్ణి గాఢంగా నిందించాడు. దుర్యోధనుడి ఈ మాటలకు ద్రోణుడు తొణకలేదు. "దుర్యోధనా, నాపై మోపిన నిందలన్నీ నీవు అనడానికి తగనివి. అవన్నీ అసత్యాలు. జరిగిన వాటి గురించి, నివారించడానికి వీల్లేని వాటి గురించి ఇప్పుడు మాట్లాడినందువల్ల ప్రయోజనం ఏమీ లేదు. ఇప్పుడేమి చేయగలమో ఆలోచించు" అన్నాడు ద్రోణుడు. దుర్యోధనుడు బదులిస్తూ.. "అయ్యా, సలహా ఇచ్చేందుకు నువ్వే తగినవాడివి. ఇప్పుడేమి చేయాలో నాకు చెప్పండి. ప్రస్తుత పరిస్థితుల క్లిష్టతను దృష్టిలో పెట్టుకొని ఆలోచించి చెప్పండి. అది మనం చాలా త్వరగా చేయాలి" అన్నాడు.

దుర్యోధనుడు కలవరపాటుకు గురై, ఏమీ తోచనివాడిలా అతని ప్రవర్తన ఉన్నట్లు ద్రోణుడు గుర్తించాడు. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి ద్రోణుడు.. "కుమారా, పరిస్థితి చాలా కఠినంగానే ఉంది. ముగ్గురు అతిరథమహారథులు మనలను అతిక్రమించి ముందుకు నడిచారు. కానీ మనం ఎంత ఆందోళన చెందుతున్నామో అలాగే వారూ ఆందోళన చెందడానికి కారణాలున్నాయి. మన పిరుదు భాగం ఎలా శత్రువువాత పడటానికి వీలుగా ఉన్నదో, వారిది కూడా అలాగే ఉంది. వారికి ఇరుపక్కలా మనం ఉన్నాం. కనుక వారి సైన్య పరిస్థితి సురక్షితంగా లేదు. ధైర్యంగా ఉండు. జయద్రథుడి వద్దకు మళ్లీ వెళ్లు. నీకు శక్తి ఉన్నంతవరకూ అతడికి సహాయం చెయ్యి. గతించిన అపజయాలు, కష్టాలు తలుచుకొని హృదయ దౌర్బల్యం చెందడం వల్ల ప్రయోజనం లేదు. నేనిక్కడే ఉండి నీకు అవసరమైన సేనలను తోడుకావలసి వచ్చినప్పుడల్లా పంపుతుంటాను. పాంచాల సేననూ, పాండవ సేననూ చొరబడనీయకుండా నేనిక్కడ ఉండాలి. అలా కానిపక్షంలో మనం పూర్తిగా నాశనం అవుతాము" అని ద్రోణుడు ఎంతో ఓపిగ్గా చెప్పాడు. దీంతో దుర్యోధనుడు కొత్త సైన్యాన్ని తీసుకొని జయద్రథుడుపై యుద్ధం చేస్తున్న అర్జునుడు ఉన్న ప్రదేశానికి వెళ్లాడు.

ఆరోజే మరోచోట.. భీముడు, కర్ణుడి మధ్య జరిగిన యుద్ధం.. యుద్ధ చరిత్రలో ఒక అధ్యాయంగా పరిగణించవచ్చు. భీముడు.. కర్ణుడితో యుద్ధం చేయడానికి ఇష్టపడలేదు. అతనితో తగవు పెట్టుకోవడానికీ ఇష్ట పడలేదు. సరాసరి అర్జునుడు

ఉన్న చోటుకు వెళ్లడమే అతడి కోరిక. కానీ కర్ణుడు (రాధేయుడు) భీముణ్ణి విడిచిపెట్టలేదు. తన బాణాలను భీముడిపై వర్షింప చేశాడు. దీనివల్ల భీముడు నడవలేని స్థితి ఏర్పడింది. భీముణ్ణి ఎదురించేటప్పుడు కర్ణుడి పద్మం వంటి అందమైన మొహం నవ్వుతూ ఉండేది. కర్ణుడు.. భీముణ్ణి ఉద్దేశించి, "నీవు వెనక్కి తిరగకు. పిరికివాడి వలే పారిపోకు" అంటూ ఎత్తిపొడుపు మాటలు అన్నాడు. ఈ విధంగా తనను అపహాస్యం చేయడంతో భీముడు తీవ్ర అగ్రహోదగ్రుడయ్యాడు. కర్ణుడి నవ్వు భీముణ్ణి మరింత పిచ్చివాణ్ణి చేసింది. వారిరువురి మధ్య యుద్ధం భయంకరంగా జరిగింది. కర్ణుడు నవ్వుతూ సునాయాసంగా యుద్ధం చేస్తున్నట్లు కనిపిస్తుంటే, భీముడి ముఖం ఎర్రగా రౌద్రం గొలుపుతూ కనిపిస్తోంది. కర్ణుడు అల్లంత దూరం నుంచి గురిచూసి భీముడిపై బాణాలు వదులుతున్నాడు. కానీ భీముడు ఆ బాణాలను, బల్లేలను లక్ష్య పెట్టకుండా, కర్ణుడితో కలియబడటానికి ప్రయత్నిస్తున్నాడు. కర్ణుడు చేసిన ప్రతి పని నిదానంగా, సున్నితంగా, పనితనంతో చేస్తున్నాడు. కానీ ఆశ్చర్యం కలిగించేలా భీముడిలో.. తన బలాన్ని ఉపయోగించడంలో తొందర, తత్తరపాటు, బుసకొట్టడం వంటివి కనిపిస్తున్నాయి. భీముడి గాయాల నుంచి రక్తం కారుతోంది. ఆ గాయాలు అశోక వృక్షానికి నిండుగా పూలు పూచిన చందంగా కనిపిస్తున్నాయి. కానీ ఆ గాయాలను భీముడు లక్ష్యపెట్టలేదు. కర్ణుడి బాణాన్ని రెండు ముక్కలు చేసి రథాన్ని బద్ధలు చేశాడు. అప్పుడు కర్ణుడు వేరే రథం కోసం వెళ్తున్నాడు.

కర్ణుడి ముఖంపై నవ్వు మాయమైంది. పున్నమి రాత్రి సముద్రం పొంగినట్లు అతడి కోపం తారాస్థాయికి చేరింది. ఇద్దరూ పులుల్లా బలాలు చూపారు. బుసలు కొట్టే పాముల్లా పోరాడారు. భీముడు..తనను, అన్నదమ్ముళ్లను, ద్రౌపదిని పెట్టిన అవమానాలను, కష్టాలను గుర్తు తెచ్చుకున్నాడు. ప్రాణభీతిని వదిలి ఘోరంగా యుద్ధం చేశాడు. వారిరువురి రథాలూ ఢీకొన్నాయి. కర్ణుడి ధనస్సు విరిగింది. రథసారథి రథం నుంచి పడిపోయాడు. కర్ణుడు అప్పుడొక బల్లేన్ని భీముడిపై విసిరాడు. భీముడు సమయస్ఫూర్తిగా తప్పుకొని కర్ణుడిపై బాణాలు వదిలాడు. కర్ణుడు మరో ధనస్సును ఎత్తాడు. కర్ణుడు ఏ రథం ఎక్కినా దాన్ని భీముడు భగ్నం చేస్తున్నాడు.

కర్ణుడు అవస్థ చూసి దుర్యోధనుడు తన తమ్ముడైన దుర్భయుణ్ణి ఉద్దేశించి.. "ఈ దుర్మార్గుడైన పాండవుడు కర్ణుణ్ణి చంపుతాడు. తక్షణమే నీవు వెళ్లి భీముణ్ణి ఎదురించి కర్ణుడి ప్రాణాన్ని రక్షించు" అన్నాడు. అన్న ఆజ్ఞ మేరకు దుర్భయుడు భీముణ్ణి ఎదురించాడు. ఆగ్రహించిన భీముడు వరుసగా ఏడు బాణాలు విడిచాడు. వాటి ధాటికి దుర్భయుడి రథసారథితోపాటు గుర్రాలు కూడా చనిపోయాయి. దుర్భయుడు తీవ్రంగా గాయపడ్డాడు. నేల మీద పడికొట్టుకున్నాడు. శరీరం నుంచి

స్రవించి మడుగులు కడుతున్న రక్తాన్ని చూసిన కర్ణుడు విచారగ్రస్తుడై.. చనిపోతున్న దుర్భయుడి చుట్టూ మర్యాద పూర్వకంగా, విషాద సూచికంగా ప్రదక్షిణ చేశాడు. భీముడు మాత్రం యుద్ధం మానలేదు. కర్ణుణ్ణి బహు విధాలా ఎదురించి కష్టపెట్టాడు. మళ్లీ కర్ణుడు మరో రథం ఎక్కి బాగా గురి చూసి భీముడిపైకి ఓ బాణం వదిలాడు. బాణం తగిలిన బాధతో ఆగ్రహావేశుడైన భీముడు తన గదను కర్ణుడిపైకి విసిరాడు. దాంతో కర్ణుడి రథం విరిగిపోయింది. రథ సారథినీ గుర్రాలనూ చంపాడు. దీంతో కర్ణుడు భూమిపై తన ధనస్సును తీసుకొని నిలబడ్డాడు. దుర్యోధనుడు తన తమ్ముడు దుర్ముఖుణ్ణి పంపి కర్ణుణ్ణి అతని రథం మీదకు తీసుకువెళ్లే ప్రయత్నం చేశాడు. ధృతరాష్ట్రుడి మరో కుమారుడు చావడానికే తన ముందుకొచ్చాడని భావించిన భీముడు అతడిపైకి వరుసగా తొమ్మిది బాణాలను వదిలాడు. ఆ సమయంలో కర్ణుడు దుర్ముఖుడి రథం ఎక్కే ప్రయత్నంలో ఉన్నాడు. భీముడి బాణాల ధాటికి దుర్ముఖుడు అక్కడే ప్రాణాలు విడిచాడు. ఈ దృశ్యాన్ని చూసిన కర్ణుడు స్థాణువయ్యాడు.

భీముడు విడవకుండా కర్ణుణ్ణి ఎదురిస్తూనే ఉన్నాడు. భీముడి పదునైన బాణాలు కర్ణుడి కవచాన్ని ఛేదించి అతణ్ణి బాధపెట్టాయి. కర్ణుడు కూడా బాణాలు వేస్తూ భీముణ్ణీ గాయపరిచాడు. ఈ గాయాలను లక్ష్యపెట్టకుండా భీముడు ఇంకా ఎదురిస్తూనే ఉన్నాడు. తనకు సహాయం చేయడానికి వచ్చిన దుర్యోధనుడి తమ్ముళ్లు ఒకరి తరువాత ఒకరు భీముడి చేతిలో చనిపోవడం చూసి కర్ణుడు భరించలేకపోయాడు. ఈ విషాదంతోపాటు తన గాయాల బాధతో కర్ణుడు ధైర్యాన్ని కోల్పోయి ఓటమిపాలై వెళ్లిపోతున్నాడు. భీముడు తన విజయ సూచికగా నాదం చేయగా, కర్ణుడు ఓర్వలేకపోయాడు. మళ్లీ అతడు వెనక్కి తిరిగొచ్చి యుద్ధానికి దిగాడు.



విజృంభించి
పోరాడుతున్న భీముడు

## అధ్యాయం - 87

# వాగ్దాన పాలన

దృతరాష్ట్రుడు తన కుమారుల మరణవార్త, కర్ణుడి భంగపాటు విని సంజయుడితో.. "ఓయీ సంజయా! అగ్నిలో పడిన శలభాల్లా నా కుమారులు చనిపోతున్నారు. మూర్ఖుడైన దుర్యోధనుడు నా పిల్లలను యుద్ధానికి పంపి బలి తీసుకుంటున్నాడు" అని తన బాధను వెళ్ల బోసుకుంటున్నాడు. ఆ మాటలు పూర్తికాకముందే దుర్యోధనుడు అందుకొని.. "ధైర్యంలో అసమానుడు, అజేయుడైన కర్ణుడు మన పక్షాన ఉన్నాడు. ఇంకా మనల్ని ఎవరు జయిస్తారు?. కర్ణుడు నా పక్షాన ఉంటే దేవతలు సైతం నాపై యుద్ధం చేసి నన్ను జయించలేరు. ఈ పాండవులు నన్నేమి చేయగలరు?" అన్నాడు. ఇంతకుముందే భీముడితో యుద్ధంలో కర్ణుడు తోకముడిచి పారిపోవడం గురించి దృతరాష్ట్రుడు విన్నాడు.

దృతరాష్ట్రుడు సంజయుణ్ణి ఉద్దేశించి.. "సంజయా! వాయుపుత్రుడైన భీముడి అంతులేని పగను నా కొడుకు తెచ్చుకున్నాడు. మృత్యురాజంత బలం కలవాడు భీముడు. నిశ్చయంగా మేము ఆగం అయ్యాము" అన్నాడు. సంజయుడు బదులిస్తూ.."ఓ

రాజా, బుద్ధిలేని, మూర్ఖులైన కుమారుల మాట విని ఈ తీరని పగను నీవే కదా తెచ్చిపెట్టింది. ఈ మహావిపత్తునకు నీవే కారణం కాదా. ఎవరు చెప్పినా మీరు వినలేదు. రాజా, నిన్ను నీవే నిందించుకో. కర్ణుణ్ణిగానీ, యుద్ధంలో మీ పక్షాన తమ శక్తినంతటినీ ఉపయోగించిన వీరులనుగానీ నీవు నిందించకు" అని అంధరాజును ఎత్తిపొడిచాడు.

భీముడి చేతిలో ధృతరాష్ట్రుని ఐదుగురు కుమారుల మరణానికి సంబంధించిన విషయాలను సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పడం ప్రారంభించాడు: ధృతరాష్ట్రుని కుమారుల్లో ఐదుగురు దుర్మర్షుడు, దుస్సహుడు, దుర్మతుడు, దుర్ధరుడు, జయణ్ణి.. భీముడు తరుముతున్నాడు. ఆ దశలో వీరు కర్ణుణ్ణి చూసి ధైర్యం తెచ్చుకొని భీముణ్ణి ఎదురించారు. దీంతో ఉత్సాహం తెచ్చుకున్న కర్ణుడు మరలా యుద్ధం మొదలు పెట్టాడు. భీమసేనుడు మొదట ధృతరాష్ట్రుని కుమారులను విడిచి, కర్ణుడుపైనే యుద్ధం సాగించాడు. కానీ నీ కుమారులు వారి ఒత్తిడితో భీముడికి ఆగ్రహం కలిగించారు. దీంతో అతడు వారిపైపు తిరిగి ఈ ఐదుగురు అన్నదమ్ములను చంపాడు. భూమిపై వారు తమ గుర్రాలతోనూ, సారథులతోనూ చనిపోయి ఉన్నారు.

తన వల్ల ధృతరాష్ట్ర కుమారులు చనిపోవడం చూసి కర్ణుడు మరింత తీవ్ర పోరాటానికి దిగాడు. భీముడూ ఆలాగే పోరాటం ప్రారంభించాడు. కర్ణుడు పాండవులకు చేసిన దుర్మార్గం తలుచుకొన్న భీముడికి క్రోధం మరింత హెచ్చింది. పూర్తిగా కర్ణుణ్ణి నిరాయుధుణ్ణి చేయడానికి భీముడు బాణాలను వేశాడు. అప్పుడు కర్ణుడు రథంపై నుంచి కిందికు ఉరికి తన గదను భీముడిపై విసిరాడు. భీముడు తన బాణాలతో కర్ణుడి ఆయుధాన్ని పక్కకు తప్పించాడు. తన బాణ పరంపరతో కర్ణుణ్ణి పలాయనం చేయించాడు. ఇదంతా దుర్యోధనుడు చూశాడు. కర్ణుడికి సహాయంగా పంపిన తన తమ్ముళ్లయిన చిత్రుడు, ఉపచిత్రుడు, చిత్రాక్షుడు, చారుచిత్రుడు, శరాసనుడు, చిత్రాయుధుడు, చిత్రవర్మ అనే ఏడుగురిని భీముడు చంపాడు. అయితే వీరు భీముడిపై గొప్ప శౌర్యంతో యుద్ధం చేశారు. చివరికి అలా జరిగింది.

తన కోసం మరణించిన ధృతరాష్ట్ర పుత్రులను చూసి విషాద భరితుడై, కంటతడిపెడుతూ, కర్ణుడు మరో రథం ఎక్కి కోపంతో భీముణ్ణి ఎదురించాడు. ఇద్దరు వీరులూ మేఘాలు వర్షించేటప్పుడు ఉరుములు మెరుపులు ఏర్పడిన మాదిరిగా యుద్ధం చేశారు. భీముడి యుద్ధ పటిమను చూసి కృష్ణుడు, సాత్యకి, అర్జునుడు మిక్కిలి ఆనందించి ప్రశంసించారు. భూరిశ్రవసుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, శల్యుడు, జయద్రథుడు, మరికొంతమంది కౌరవ మహావీరులు కూడా భీముడి యుద్ధకుశలతకు ఆశ్చర్యపోయారు. దుర్యోధనుడు తుళ్లిపడి కోపంతో ఊగిపోయాడు. కర్ణుడి స్థితి

అతడికి చాలా ఆందోళన కలిగించింది. భీముడు.. కర్ణుణ్ణి తప్పక చంపేస్తాడని భావించాడు.

దీంతో దుర్యోధనుడు తన మరో ఏడుగురు సోదరులను పంపాడు. వారంతా భీముణ్ణి చుట్టుముట్టారు. వారందరూ ఒక్కమ్మడిగా ఒకేసారి దాడి చేయాల్సిందిగా దుర్యోధనుడు సూచించాడు. వారలాగే చేశారు. భీముడి బాణాల ధాటికి గాయపడి దుర్యోధనుడి సోదరులు ఏడుగురూ ఒకరి తరువాత మరొకరు మరణించారు. ఆఖరులో వికర్ణుడు చనిపోయాడు. అతడు అందరికీ ప్రేమపాత్రుడు. వికర్ణుడు చనిపోయి ఉండటం చూసి భీముడు సైతం ద్రవించిపోయాడు. "అయ్యో వికర్ణా! నీకు న్యాయమూ, ధర్మమూ తెలుసు. క్షత్రియ ధర్మాన్ననుసరించి నీవు మీ పక్షాన యుద్ధం చేశావు. నిన్ను సైతం నేను చంపాల్సి వచ్చింది. నీ వంటి వారిని, పితామహుడైన భీష్ముడు బలికాబడిన ఈ యుద్ధం నిశ్చయంగా మనకొక శాపమైంది" అని భీముడు అన్నాడు.

ఈ ప్రకారం ఒకరి తరువాత ఒకరు తనకు సహాయం చేయవచ్చి దుర్యోధనుడి తమ్ముళ్లు చనిపోవడం చూసి కర్ణుడు విషాదంలో మునిగాడు. రథంలోనుంచి అతడు ఈ ఘోర దృశ్యాలను చూసి కళ్లు మూసుకొని కూర్చున్నాడు. తర్వాత స్వస్థత పొంది హృదయాన్ని దృఢపరుచుకొని యుద్ధం సాగించాడు. కర్ణుడి ముఖంలో ఇదివరకటి దరహాసం పోయింది. యుద్ధంలో భీముడి రథ సారథి, గుర్రాలు చనిపోయాయి. భీముడి రథం కూడా ధ్వంసం అయ్యింది. రథంలో ఉన్న కర్ణుడు భీముడిపై ఈటె విసిరాడు. ఆ ఆయుధాన్ని తన బాణంతో తప్పించుకొనే సమయంలో భీముడు కత్తి, డాలు చేతపట్టి ముందుకు వచ్చాడు. కర్ణుడు.. భీముడి డాలును ధ్వంసం చేశాడు.

భీముడు తన కత్తిని తిప్పి విసరగా అది కర్ణుడి ధనస్సును విరిచింది. కర్ణుడు మరో ధనస్సును అందుకొని ఇదివరకటి కంటే తీక్షణమైన బాణాలను భీముడిపై వేశాడు. భీముడు కోపం పట్టలేక కర్ణుడిపైకి లంఘించాడు. కర్ణుడు తన రథం పతాక దండం పక్కన దాక్కొని తన మరణాన్ని తప్పించుకున్నాడు. ఆ తరువాత కర్ణుడు రథంపై నుంచి భూమిపైకి ఉరికాడు. అతడు వేసే బాణాలకు భీముడు నిరాయుధుడయ్యాడు. కర్ణుడు వేసే బాణాలను చచ్చిపడిన ఏనుగుల కళేబరాలను అడ్డుచేసుకొని భీముడు యుద్ధం సాగించాడు. ఈ యుద్ధం ఎక్కువ సమయం జరగలేదు. ఇక భీముడు విపత్తు దశలో ఉన్నాడు.

కర్ణుడు నవ్వుతూ భీముణ్ణి ఉద్దేశించి.. "మూర్ఖపు తిండిపోతా! నీకు యుద్ధం ఏమీ తెలియదు. నీవెందుకు ఇక్కడ యుద్ధంలో ఉంటావు. అడవులకు పోయి పండ్లు, దుంపలు తిని ఒళ్లు పెంచుకో. నీవు రాక్షసుడివి. క్షత్రియులు చేసే యుద్ధానికి నీవు తగినవాడివి కాదు. పైకి పో" అని తిట్టాడు. దీంతో భీముడు అగ్రహోదగ్రుడయ్యాడు.

కర్ణుడు.. కుంతికి తానిచ్చిన వాగ్దానాన్ని గుర్తు తెచ్చుకొని భీముణ్ణి చంపలేదు.

కృష్ణుడు.. "అర్జునా.. అటు చూడు. కర్ణుడు.. భీముణ్ణి ఎలా హింసిస్తున్నాడో?. అని చూపించాడు. మహాప్రతాపవంతుడైన తన అన్న అవస్థ చూసి అర్జునుడి కళ్లు కోపంతో ఎరుపెక్కాయి. తన గాండీవాన్ని వంచి కర్ణుడిపై బాణాన్ని ప్రయోగించాడు. కర్ణుడు సంతోషించి.. భీముణ్ణి విడిచిపెట్టి అర్జునుడితో తలపడ్డాడు. పాండవుల్లో ఒకరిని మాత్రమే చంపుతానని తాను కుంతికి బాస ఇచ్చాడు. ఆ ఒక్కడు అర్జునుడే అని మరోసారి కర్ణుడు నిశ్చయపరిచాడు

ఈ విధంగా సంజయుడు.. ధృతరాష్ట్రుడికి యుద్ధం గురించి పూసగుచ్చినట్లు వివరించాడు.

◈

యుద్ధ బీభత్సం



## అధ్యాయం - 88

# సోమదత్తుని మరణం

**ర**థ సారథి శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఉద్దేశించి.. మహా శూరుడైన సాత్యకి ఇటువైపు వస్తున్నాడు. నీ శిష్యుడూ, మిత్రుడూ అయిన అతడు శత్రువుల రంగం నుంచి జయప్రదంగా వస్తున్నాడు. అర్జునుడు.. “అది నేను ఇష్టపడను. మాధవా! ధర్మపుత్రుణ్ణి (యుధిష్టరుణ్ణి) విడిచిపెట్టి నన్ను కలవడానికి రావడం అతడికి తగని పని. నిరంతరం ధర్మపుత్రుణ్ణి పట్టుకోవడానికి ఎప్పుడు వీలు చిక్కుతుందా అని ద్రోణుడు కనిపెట్టుకొని ఉన్నాడు. అక్కడ సాత్యకి యుధిష్టరుణ్ణి కనిపెట్టుకొని అతని రక్షణ బాధ్యత చూడాల్సి ఉంది. కానీ అతడు యుధిష్టరుణ్ణి వదిలేసి ఇక్కడికి వచ్చాడు” అన్నాడు. సాత్యకిని భూరిశ్రవసుడు అడ్డుకున్నాడు. యుధిష్టరుడు.. సాత్యకిని ఇక్కడకు పంపి గొప్ప పొరపాటు చేశాడు. భూరిశ్రవసుడుకీ, సాత్యకికీ చాలా కాలం నుంచి కుటుంబ కలహాలకు సంబంధించిన క్రోధం ఉంది. శ్రీకృష్ణుడి జనని దేవకి, కన్యగా ఉన్నప్పుడు చాలా మంది రాజులు ఆమెను వరించడానికి వచ్చాడు. దీనిపై

సోమదత్తుడుకీ, శినికీ మధ్య గొప్ప యుద్ధం సంభవించింది. శినిని విజయం వరించింది. వసుదేవుడి స్థానంలో దేవకిని తన రథంపై వేసుకొని తీసుకు వెళ్లాడు. ఆ సంఘటన జరిగిన కాలం నుంచీ ఈ రెండు తెగల మధ్య.. అంటే శిని కుటుంబానికి, సోమదత్తుడి కుటుంబానికీ కలహాలు వస్తుండేవి. సాత్యకి.. శిని మనుమడు. భూరిశ్రవసుడు సోమదత్తుని కుమారుడు. కురుక్షేత్ర యుద్ధంలో వీరిద్దరూ ఎదురెదురు పడ్డారు. దీంతో భూరిశ్రవసుడు.. సాత్యకిని చూసి తక్షణమే అతణ్ణి యుద్ధానికి దించాడు. భూరిశ్రవసుడు.. సాత్యకిని ఉద్దేశించి.. "సాత్యకీ, నీవు మహా వీరుడవని, శూరుడవని అనుకొని ఇక్కడ చిందులు తొక్కుతున్నావు. ఇప్పుడు ఇక్కడ నాచేతికి చిక్కావు. నేను నిన్నిప్పుడే హతమార్చుతాను. మన ఇద్దరి ఈ కలయిక కోసమే నేను చాలా కాలం నుంచి ఎదురు చూస్తున్నాను. దశరథుడి కుమారుడైన లక్ష్మణుడు చంపిన ఇంద్రజిత్ మాదిరిగా ఈ రోజు నిన్ను చంపి యమలోకానికి పంపుతాను. నీవు చంపినవారి భార్యలకు సంతోషం కలిగిస్తాను" అని ఎగతాళిగా అన్నాడు. సాత్యకి నవ్వాడు. భూరిశ్రవసుడి మాటలకు అడ్డుతగిలాడు. నీ ప్రేలాపన అయ్యిందా?. మాటలన్నీ నిజం కావు. నీ మాటలు యోధుల్ని భయపెట్టలేవు. నీ పౌరుషం కార్యరూపంలో చూపించు. అంతేగాని వర్షించని మేఘాల్లా మాటలు పేలకు" అని లెక్కలేనితనంతో మాట్లాడాడు సాత్యకి. ఇద్దరి మధ్యా వాద ప్రతివాదాలు ముగిసి యుద్ధం ప్రారంభమైంది.

రెండు సింహాల మధ్య పోరులా యుద్ధం సాగుతోంది. ఇరువురి రథాలు ధ్వంసం అయ్యాయి. గుర్రాలు చనిపోయాయి. వారి చేతుల్లోని ధనస్సులు విరిగిపోయాయి. వారిద్దరూ భూమిపై కత్తి, డాలు పట్టి యుద్ధం చేస్తున్నారు. కాసేపటికి ఇద్దరి చేతుల్లోని కత్తులు, డాలులు ఎగిరిపోయాయి. ఇద్దరూ మల్ల యుద్ధానికి దిగారు. కలియబడి పొర్లుతున్నారు. యుద్ధం చాలా సేపు జరిగింది. ఈ సమయంలో అర్జునుడి దృష్టి జయద్రధుడు గమనం మీదే ఉంది. అందువల్ల ఇక్కడ సాత్యకి–భూరిశ్రవసుడు మధ్య జరిగే యుద్ధాన్ని గమనించలేదు. కానీ అర్జునుడి రథ సారధి శ్రీకృష్ణుడు మాత్రం సాత్యకికి ఇప్పుడేమవుతుందో అనే ఆలోచనలో పడ్డాడు. కృష్ణుడికి శిని–సోమదత్తుడు కుటంబ కలహాల గురించి తెలుసు.

శ్రీకృష్ణుడు.. అర్జునుణ్ణి ఉద్దేశించి, "ధనుంజయా, సాత్యకి అలసిపోయాడు. భూరి శ్రవసుడు అతణ్ణి ఇప్పుడే చంపుతాడు" అన్నాడు. ఇంకా అర్జునుడు జయద్రధుణ్ణే కనిపెడుతున్నాడు. శ్రీకృష్ణుడు మరలా అర్జునుడితో.."సాత్యకి కౌరవ సైన్యంతో యుద్ధం చేసి చేసి అలసి వస్తున్నాడు. ఆ భూరి శ్రవసుడు సాత్యకికి అడ్డుతగలడంతో యుద్ధం తప్పింది కాదు. ఇది గొప్ప అసమాన యుద్ధము. మనమిప్పుడు సహాయం చేయకపోతే ప్రియమైన యుయుధానుడు (సాత్యకి) చంపబడతాడు" అని అంటున్నప్పుడే.. అక్కడ

భూరిశ్రవసుడు సాత్యకిని పైకెత్తి నేలకేసి కొట్టాడు.

కౌరవ సైన్యమంతా సాత్యకి చనిపోయాడని అరిచారు. మరలా శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి బతిమాలాడు. "వృష్టి వీరుల్లో శ్రేష్ఠుడైన సాత్యకి నేలబడి చావబోతున్నాడు. నీకు సాయపడటానికి వచ్చిన అతడు నీ కళ్ల ముందే మరణిస్తున్నాడు. నీవేమీ చేయక చూస్తున్నావు" అన్నాడు కృష్ణుడు గంభీరంగా.

నేలపై విసిరికొట్టిన సాత్యకిని భూరిశ్రవసుడు పట్టుకొని "తాను చంపిన ఏనుగును ఈడ్చికెళ్తున్న సింహంలా' లాక్కెళ్తున్నాడు. అర్జునుడు గొప్ప ఆందోళనలో పడ్డాడు. 'భూరి శ్రవసుడు నన్ను యుద్ధానికి పిలవలేదు. అతడు మరొకరితో యుద్ధం చేసేటప్పుడు అతడిపై నేనెలా బాణాలు వేయగలను. నాకు ప్రియస్నేహితుడు, నాకు సహాయంగా వచ్చినవాడు నా కళ్లముందే చంపబడుతున్నప్పటికీ, బాణ ప్రయోగం చేయడానికి నామనస్సు ఇష్టపడటం లేదు' తన మనసులోని ఈ మాట శ్రీకృష్ణుడికి చెప్తున్నాడు. సరిగ్గా ఆ సమయంలో.. జయద్రథుడు అర్జునుడిపై బాణ పరంపర కొనసాగించాడు. ఆ బాణాలు మేఘాల్లా ఆవరించాయి. అర్జునుడు.. జయద్రుధుడిపైన కూడా వరుసగా బాణాలను సంధించాడు. ఇలా అతడు బాణాలు వేస్తున్నప్పటికీ తన దృష్టి భూరి శ్రవసుడు చేతిలో చావు బతుకుల్లో ఉన్న సాత్యకివైపే మరలుతోంది.

మరలా శ్రీకృష్ణుడు.. సాత్యకి అవస్థను గమనించాలని అర్జునుణ్ణి కోరాడు. "ఓ పార్థా! సాత్యకి నిరాయుధుడు. అతడిప్పుడు నిస్సహాయుడై భూరిశ్రవసుడు చేతిలో ఉన్నాడు" అన్నాడు కృష్ణుడు. అర్జునుడు అటువైపు చూసే సరికి, భూరి శ్రవసుడు తన పాదాల వద్ద పడి ఉన్న సాత్యకిని ఖడ్గంతో చంపబోతున్న దృశ్యం కనిపించింది. భూరి శ్రవసుడు ఎత్తిన కత్తితో సాత్యకిని చంపకముందే. మెరుపు వేగంతో అర్జునుడు బాణం వేశాడు. ఆ దెబ్బకు భూరి శ్రవసుడి రెండు చేతులూ తెగిపోయాయి. దాంతో అతడు నేలపై పడ్డాడు. భూరి శ్రవసుడు నిర్ఘాంతపోయి ఈ పని ఎవరు చేశారో గ్రహించాడు.

"కుంతీ కుమారుడా, నీవు ఇలా చేస్తావని నేను అనుకోలేదు. వీరుడైన నీవు ఇలా వెనుక నుంచి బాణం వేయడం తగదు. నేనింకొకరితో పోరాడుతున్నాను. నీవు నాకు తెలియకుండానే నన్నెదిరించావు. నిశ్చయంగా నీవు ఇప్పుడు చేసిన పని వీరునికి తగిన గుణం కాదు. దీన్నిబట్టి.. మన సాంగత్య దోష చెడు ఫలితాన్ని ఎవరూ ఎదురించలేరని తెలుస్తోంది. అర్జునుడా, నీవు ధర్మపుత్రుని వద్దకు వెళ్లినప్పుడు నీవు చేసిన ఈ ఘన కార్యాన్ని ఎలా చెపుతావు?. ఆహా.. అర్జునా, ఈ నీచపు తంత్రం నీకెవరు నేర్పారు?. నీ తండ్రి అయిన ఇంద్రుడి వద్ద నేర్చావా?. లేక గురువులైన ద్రోణ, కృపుల వద్ద నేర్చావా?. నాకూ, సాత్యకికి యుద్ధం జరుగుతోంది. కనీసం

నీవైపు నేను చూడను కూడా లేదు. అలాంటి నాపై నీవు బాణం ఏ ధర్మాన్ని అనుసరించి వేశావు?. నీచ జన్ముడు చేయదగిన పనిని చేసి నీ మర్యాదకు తీరని మచ్చ తెచ్చుకున్నావు. ఈ పని చేయడానికి నిన్ను వసుదేవుని కుమారుడు (శ్రీకృష్ణుడు) ప్రోత్సహించి ఉంటాడు. అంతేగాని నీ ప్రకృతి గుణాల వల్ల చేయలేదు. ఇలాంటి దొంగ దెబ్బ తీసే నీచ పని క్షత్రియయుక్తమేనా? ఆ తుచ్ఛుడైన కృష్ణుడు నీతో ఈ పని చేయించాడని నాకు తెలుసు" అని భూరి శ్రవసుడు అర్జునుణ్ణి ఉద్దేశించి ఎంతో వేదనాభరితంగా అన్నాడు.

అర్జునుడు అందుకొని.. "భూరి శ్రవసా! నీవు వృద్ధుడవు. వృద్ధాప్యం వల్ల నీలో న్యాయాన్యాయ విచక్షణ కనిపించడం లేదు. నన్నూ, శ్రీకృష్ణుణ్ణీ అకారణంగా నిందించావు. ఈ సాత్యకి నాకు సహాయం చేయడానికి వచ్చాడు. నాకు స్నేహితుడే కాదు, కుడి భుజం కూడా. నా కళ్ల ఎదుట యుద్ధంలో అతడు చంపబడటం చూసి ఏమి చేయకుండా నేనెలా ఉంటాను?. నేనా సాయం చేయకపోతే నాకు నరకం ప్రాప్తించి ఉండేది. మాధవుడి సహవాస దోషంతో నేను చెడిపోయానని అన్నావు. అలా చెడిపోవడం ఈ ప్రపంచంలో ఎవరైనా ఇష్టపడతారా?. బుద్ధి కలవరపాటు చెంది, అజ్ఞానంతో నీవు అలా అన్నావు. సాత్యకి ఇక్కడికి వచ్చినపుపడు అలసిపోయి ఉన్నాడు. యుద్ధ ఉపకరణాలు కూడా అతడి వద్ద లేవు. అలాంటి సాత్యకిని నీవు రణానికి పిలిచావు. యుద్ధంలో నీవు అతన్ని లోబరుచుకున్నావు. అతడు పరాజితుడై, నిస్సహాయుడై, శక్తి రహితుడై భూమ్మీద పడున్నాడు. అటువంటి పరిస్థితిలో పడివున్న మహావీరుణ్ణి నీవు కత్తి ఎత్తి చంపబూనడం ఏ యుద్ధ ధర్మ ప్రకారం చేశావు?. నా కుమారుడైన అభిమన్యుడు కవచం ఛేదించబడి ఆయుధం లేక అలసి, తొట్రుపాటు పడుతూ, ఏకాకిగా ఉన్నప్పుడు అతణ్ణి చంపిన వారిని నీవెలా ప్రోత్సహించావో నాకు తెలియదా?" అన్నాడు సవివరంగా.

ఈ మాటలు విన్న భూరిశ్రవసుడు సమాధానం ఇవ్వలేదు. అతడు ధ్యానంలో కూర్చున్నట్లు ఆసనం ఏర్పరుచుకున్నాడు. తరువాత ధ్యానంలో నిమగ్నమయ్యాడు. ఈ దృశ్యాన్ని కౌరవయోధులు తిలకించి విచారపడ్డారు. భూరిశ్రవసుణ్ణి హెచ్చరించి కృష్ణార్జునులను నిందించారు. వారినుద్దేశించి అర్జునుడు.. "ధీరులారా! నా బాణం వెళ్లగలిగినంత దూరంలో ఉన్న నా స్నేహితుణ్ణి ఎవరినైనా రక్షించాలన్నది నా వ్రతం. ఒక్క శత్రువునూ అతన్ని చంపనీయను. అది నా పవిత్ర వ్రతం. నన్నెందుకు నిందిస్తారు?. సరైన ఆలోచన చేయకుండా ఒకరిని నిందించడం సరికాదు'' అన్నాడు. భూరిశ్రవసుణ్ణి చూసి.. "ధీరుల్లో మహాధీరుడవు. నిన్ను సహాయం కోరిన చాలా మందికి నీవు సాయపడ్డావు. ఇప్పుడు జరిగిందంతా నీ పొరపాటు వల్లే జరిగింది.

నన్ను నిందించడంలో న్యాయం లేదు. క్షత్రియ జీవితాన నడువు. హాని అనేది మనం నిందించాల్సిన అంశం" అని అర్జునుడు అనగా.. వాటిని విన్న భూరి శ్రవసుడు వందనం చేసినట్లుగా శిరసు వంచాడు.

ఈ లోగా సాత్యకికి చైతన్యం వచ్చి లేచి నిలబడ్డాడు. క్రోధంతో తానొక కత్తిని తీసుకున్నాడు. బాణాసనంపై యోగధ్యానంలో నిమగ్నుడైన వృద్ధ వీరుడు భూరిశ్రవసుడి శిరస్సును, శరీరాన్ని.. యోగాసన స్థితిలో ఉండగానే, చుట్టూ ఉన్నవాళ్లు 'వద్దు వద్దు' అంటున్నా, అక్కడికి కృష్ణార్జునులు రాకపూర్వమే నరికేశాడు. దేవతలు, సిద్ధులు పైనుండి యుద్ధభూమిని చూస్తూ భూరి శ్రవసుడికి ఆశీస్సులు పలికారు. యుద్ధభూమిలో ఉన్న ప్రతివారూ సాత్యకి చేసిన ఘోర కృత్యాన్ని నిందించారు. తాను చేసింది మంచిదని సమర్థించుకోవడానికి సాత్యకి ఇలా అన్నాడు. "నేను తెలివి తప్పి భూమి మీద పడిన తరువాత నా కుటుంబ శత్రువైన వీడు నా ఛాతీ మీద కాలు ఉంచి నన్ను చంపబోయాడు. అందువల్ల అతడే స్థితిలో ఉన్నా నేను చంపొచ్చు" అన్నాడు. కానీ ఎవరూ అతడి నడవడిని అంగీకరించలేదు.

పగ, క్రోధం ప్రజ్వరిల్లినప్పుడు.. న్యాయసూత్రాలూ, ధర్మశాస్త్రాలూ చెప్పినట్లు జరగవని ఈ ఘటన ఉదంతాన్ని బట్టి అర్థమవుతోంది.

◈



జయద్రధుని వధించిన అర్జునుడు

## అధ్యాయం - 89

# జయద్రధుని హతం

**యు**ద్ధభూమిలో ఉన్న దుర్యోధనుడు.. "ఓయీ కర్ణా, అటో ఇటో నిశ్చయించే కాలం వచ్చింది. ఈ రోజు సూర్యాస్తమయం లోపు జయద్రధుణ్ణి (సైంధవుణ్ణి) చంపకపోతే అర్జునుడు అవమానం చెంది, తన ప్రతిజ్ఞ నెరవేర్చలేనందుకు తన ప్రాణాలను తీసుకుంటాడు. అర్జునుడు చనిపోతే.. అప్పుడీ రాజ్యం నిరపేక్షంగా అడ్డులేకుండా పూర్తిగా మన సొంతం అవుతుంది. ఈ జరగరాని ప్రతిజ్ఞను అర్జునుడు బుద్ధితక్కువై చేశాడు. ఎందుకంటే ఇలా తన చేతులతో తానే చావగలడని దేవతలు నిశ్చయించారు. నా తారాగమనం, జాతకాన్ని అనుసరించి మంచి ఉచ్ఛస్థితిలో ఉన్నట్లుంది. ఇలాంటి మంచి సమయాన్ని మనం విడవొద్దు. ఎలాగైనా అతడు చేసిన ప్రతిజ్ఞ నెరవేరకుండా మనం చూడాలి. ఈ కార్యమంతా నీదే. యుద్ధంలో నీ నిపుణత ఈ రోజు బయట పడుతుంది. అలాగే నీవూ ప్రవర్తించి నీ పరాక్రమాన్ని చూపాలి. సూర్యుడు పశ్చిమ దిశకు వంగాడు. చీకటి పడే లోపు ఈ స్వల్పకాలంలోనే అర్జునుడు

జయద్రధుణ్ణి సమీపించే అవకాశం లేదు. నీవూ, అశ్వద్ధామ, శల్యుడు, కృపుడు, నేనూ జయద్రధుణ్ణి కాచుకుంటూ సూర్యాస్తమయం లోగా అతడు అర్జునుడి చేతిలో పడకుండా మనం సర్వ శక్తులనూ ఉపయోగించాలి" అన్నాడు.

దానికి కర్ణుడు.. "రాజా, భీమసేనుడితో నేను గాయపడి ఉన్నాను. నా అవయవాలు శక్తి లేక అలసిపోతున్నాయి. అయినప్పటికీ నాకున్నమేర శక్తిని ఉపయోగిస్తాను. నీ ప్రయోజనం కోసమే నేను జీవించి ఉంటాను" అన్నాడు. ఈ విధంగా దుర్యోధనుడు, కర్ణుడు యుద్ధం చేసే విషయమై ఆలోచిస్తుండగా, అర్జునుడు కోపోద్రేకంతో కౌరవ సేనను తాకాడు. తన శక్తినంతా ఉపయోగించి సూర్యాస్తమయానికి ముందుగానే జయద్రధుణ్ణి చేరే ఉద్దేశంతో ఘోరంగా పోరాడుతున్నాడు. శ్రీకృష్ణుడు తన పాంచజన్యాన్ని మహోత్తేజంగా పూరించాడు. ఆ నాదం సాత్యకి రథసారధి అయిన దారకుణ్ణి రథంతో రావాలని సంజ్ఞ.

వెంటనే సాత్యకి రథమెక్కి కర్ణుణ్ణి తాకి శక్తిమంతంగా, నైపుణ్యంగా యుద్ధం చేస్తూ అతన్ని నిలువరిస్తున్నాడు. దారకుని రథ సారధ్య వైచిత్ర్యాన్ని, సాత్యకి శరలాఘవ నైపుణ్యాన్ని చూడ్డానికి దేవతలు ఆకాశంలో చేరారు. యుద్ధంలో కర్ణుడికి చెందిన నాలుగు గుర్రాలకు అంగవైకల్యం కలిగాయి. రథసారధి పక్కకు పడిపోయాడు. పతాక దండం ధ్వంసమైంది. ఆ వెంటనే రథం బద్ధలైంది. కర్ణుడు నిరాయుధుడయ్యాడు. ఇది చూసిన కౌరవ సైన్యంలో అలజడి రేగింది. కర్ణుడు పరిగెత్తుకొని వెళ్లి దుర్యోధనుడి రథంపైకి ఎక్కాడు. "విలుకాళ్లలో గొప్పవారు శ్రీకృష్ణుడు, అర్జునుడు, సాత్యకి. వీరికి సరిసాటి ఎవరూ లేరు" అని సంజయుడు దృతరాష్ట్రునితో అన్నాడు.

అర్జునుడు కౌరవ సేనను విడగొట్టి జయద్రధుణ్ణి చేరడానికి సిద్ధపడ్డాడు. అభిమన్యుణ్ణి అమానుషంగా చంపడాన్ని తలుచుకుంటూ అర్జునుడు కౌరవ సైన్యంపై తీవ్రంగా యుద్ధం చేస్తున్నాడు. అర్జునుడు గాండీవం నుంచి బాణాలను వదులుతున్నాడు. అతడు సవ్యచాచి. ఒకసారి ఒకచేత్తో, మరోసారి మరో చేత్తో బాణాలను వదులుతున్నాడు. అర్జునుడు అశ్వత్థామతోనూ, జయద్రధుణ్ణి కాపాడుతున్న ఇతరులతోనూ యుద్ధం చేస్తున్నాడు. అందరూ పరాజితులయ్యారు. అర్జునుడు జయద్రధుణ్ణి చేరాడు. అర్జునుడు అతడితో చాలా సేపు యుద్ధం చేశాడు. ఉభయ పక్షాల వారూ మాటిమాటికీ పశ్చిమ దిశ చూస్తున్నారు. ఎందుకంటే, సూర్యాస్తమయంలోగా జయద్రధుణ్ణి చంపుతానని అర్జునుడు శపథం చేశాడు. ఇంక సూర్యాస్తమయానికి వేళ దగ్గరవుతోంది.

మరోవైపు జయద్రధుడు బలమైన శత్రువు. యుద్ధంలో తన ప్రభావాన్ని, చతురతను కనబరుస్తున్నాడు, దీంతో అర్జునుడు బలాన్ని, నేర్పునూ ఉపయోగించాల్సి

వస్తోంది. పశ్చిమ దిశకు దిగేందుకు సూర్య బింబం ఎరుపెక్కింది. కానీ యుద్ధం కొనసాగుతూనే ఉంది. సూర్యాస్తమయానికి ఇంకా కొద్ది సమయమే ఉంది. జయద్రధుడు సురక్షితుడిగా ఉండటంతో అర్జునుడి ప్రతిజ్ఞ వమ్మయిందని దుర్యోధనుడు తనలో తానే నవ్వుకుంటున్నాడు. "అర్జునుడి ప్రతిజ్ఞ నెరవేరడం లేదు. అవమానం.. అవమానం.." అని కేకలు పెట్టాడు దుర్యోధనుడు. క్రమంగా చీకటి తెరలు పరుచుకుంటున్నాయి. ఉభయ పక్షాల వారూ "సూర్యాస్తమయం దాదాపు అయినట్లే. చీకట్లు ఆవరిస్తున్నాయి. జయద్రధుడు చంపబడలేదు. అర్జునుడు తన ప్రతిజ్ఞ విషయంలో ఓడిపోతున్నాడు" అని అనుకుంటున్నారు. పాండవుల్లో నిరుత్సాహం అలముకుంది. కౌరవులు కరతాళధ్వనులు చేస్తున్నారు. జయద్రధుడు పశ్చిమ దిశకు చూసి, "హమ్మయ్య! నేను సురక్షితుణ్ణి. ఇంకా అర్జునుడు నన్ను చంపే సమయం లేదు" అనుకున్నాడు మనసులో. అయితే ఆ క్షణంలో శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఉద్దేశించి.. "ధనుంజయా! జయద్రధుడు పశ్చిమ దిశను చూస్తున్నాడు. నేనే ఈ చీకటిని కలిగించాను. సూర్యుడింకా మీదనే ఉన్నాడు. కిందకి దిగలేదు. ఇదే సమయం. అతడు ఉత్సాహంతో మైమరచిపోయి ఉన్నాడు. నీ పని నువ్వు చెయ్యి" అన్నాడు.

దీంతో అర్జునుడు గాండీవం నుంచి ఒక బాణాన్ని వదిలాడు. గద్ద కిందకు వాలి కోడిపిల్లను పైకి తన్నుకొని పోయినట్లు అర్జునుడి పదునైన బాణం జయద్రధుడి తలను లేపుకుపోయింది. ఆ సమయంలో శ్రీకృష్ణుడు.. "అర్జునా, నీ బాణాలను త్వరత్వరగా దాపుల మాదిరిగా అమర్చి ఆకాశాన్నుంచి కింద పడకుండా, జయద్రధుడి తలను వృద్ధక్షత్రుని ఒడిలో పడేలా చెయ్యి" అని సూచించాడు. అర్జునుడు అలాగే తన బాణాలను గాలిలో అద్భుతంగా అమర్చి సైంధవుడి తలను కింద పడకుండా చేశాడు. అదో అద్భుత దృశ్యంగా కనిపించింది.

వృద్ధక్షత్రుడు తన ఆశ్రమం బయట కూర్చొని సాయం సమయ ప్రార్థనలో కళ్లుమూసుకొని ఉన్నాడు. నల్లని శిరోజాలు, బంగారు కర్ణాభరణాలుగల తెగిపడిన తన కుమారుని శిరస్సు మెల్లిగా ఆయన ఒడిలో పడింది. వృద్ధక్షత్రుడు ప్రార్థన నుంచి లేచి నిలబడగా, తల దొర్లి భూమి మీద పడింది. ఇదివరకు ఉన్న వరం ప్రకారం వృద్ధక్షత్రుని తల కూడా నూరు వక్కలైంది. ఆ విధంగా జయద్రధుడు (సైంధవుడు), అతడి తండ్రి వృద్ధక్షత్రుడు యుద్ధవీరులుండే కానరాని లోకాలకు వెళ్లారు.

శ్రీకృష్ణుడు, అర్జునుడు, భీముడు, సాత్యకి, యుధామన్యుడు, ఉత్తమౌజుసుడు తమ తమ శంఖాలను పూరించారు. యుధిష్టరుడు జయసూచిక శంఖారావాన్ని విన్నాడు. అర్జునుడు తన శపథాన్ని అమలు పరిచాడని, సైంధవుడు హతుడయ్యాడని

తలిచాడు. యుధిష్ఠరుడు తన సేనను చాలా తీవ్రంగా ద్రోణుడిపైకి పోనిచ్చాడు. రాత్రయ్యింది. ఈ పధ్నాలుగో రోజు రాత్రి అయినా యుద్ధం ఆగలేదు. యుద్ధ సూత్రం ఈరోజు అనుసరించలేదు. దినదినమూ ఉద్రేకం, పగ, కోపం పెరిగిపోతుండగా, యుద్ధంలో నీతులు, నియమాలు వెనుకడిపోతున్నాయి.

◈



ద్రోణుని తల నరుకుతున్న
దృష్టద్యుమ్నుడు

## అధ్యాయం - 90

# ద్రోణుని అస్తమయం

**మ**హాభారత కథ విన్న ప్రతివారికీ, భీముడికీ, రాక్షస భార్యకూ కలిగిన ఘటోద్ఘజుడి గురించి తెలిసే ఉంటుంది. మహాభారత వ్యక్తుల్లో శూరత్వం, స్థిరత్వం, బలం, ధైర్యం కలిగి ప్రేమపాత్రులైన ఇద్దరు యువకులున్నారు. వారు అర్జునుడి కుమారుడైన అభిమన్యుడు. భీముడి కుమారుడైన ఘటోద్ఘజుడు. వీరిద్దరూ కురుక్షేత్ర యుద్ధభూమిపై తమ ప్రాణాలను విడిచారు.

మహాభారత యుద్ధ ఆఖరు భాగంలో ఉభయ సేనలూ పెరుగుతున్నాయి. పగ తీవ్రతరమౌతోంది. పగటి పూట యుద్ధం చేసి రాత్రికి నిలుపుదల చేయడం వారికి సంతృప్తి కలిగించడం లేదు. పధ్నాలుగో రోజు సూర్యాస్తమయం తరువాత వారు యుద్ధం ఆపలేదు. దివిటీలు, కరదీపాల వెలుగులో యుద్ధం చేశారు. ఘటోద్ఘజుడు, అతని రాక్షస సేనలు రాత్రి వేళ మిక్కిలి బలవంతులై ఉండేవారు. అందువల్ల కొంతమంది సాయంతో ఘటోద్ఘజుడు దుర్యోధనుడిపై పడ్డాడు. వేల

కొలది దుర్యోధనుడి సైనికులు ఘటోద్ఘజుడి చేతిలోనూ, రాక్షస సైనికుల చేతిలోనూ చనిపోతున్నారు. రాక్షస సైనికులు గాలిలో సంచరిస్తూ మాయా యుద్ధం చేస్తున్నారు.

ఈ తరహా యుద్ధం చూసిన దుర్యోధనుడి హృదయం కుంగిపోయింది. “ఓయీ కర్ణా!. ఈ దుర్మార్గుణ్ణి అంతమొందించు. లేకపోతే మన సైన్యమంతా చస్తుంది. ఇక ఏమాత్రమూ ఆలస్యం చేయకుండా వారిని చంపు” అని ఆజ్ఞ ఇచ్చాడు. కౌరవ సైన్యం కూడా ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో కర్ణుణ్ణి వేడుకుంది. కర్ణుడు అప్పుడే ఘటోద్ఘజుని బాణం దెబ్బలు తిని ఆగ్రహంతో ఉన్నాడు. కర్ణుడి వద్ద ఇంద్రుడు బహూకరించిన ఒక ఈటె వంటి ఆయుధం ఉంది. అది ప్రయోగిస్తే కచ్చితంగా ప్రాణం తీస్తుంది. కానీ ఆ ఆయుధాన్ని ఒకమారే ప్రయోగించాలి. ఆ తరువాత ప్రయోగిస్తే అది పనిచేయదు. ఆ ఆయుధాన్ని కర్ణుడు జాగ్రత్తగా ఉంచుకున్నాడు. ఎప్పటికైనా అర్జునుడికీ, తనకూ యుద్ధం జరగక తప్పదని, ఆ సమయంలో ఈ ఈటెను ఉపయోగించి అర్జునుడి ప్రాణాలు తీయాలని కర్ణుడి సంకల్పం. కానీ ఈ రాత్రి జరుతుగుతున్న రాక్షసుల విచిత్ర దాడిని ఎదుర్కోవాలంటే ఈటెను ఉపయోగించాల్సిందేనని కర్ణుడు నిశ్చయించాడు.

ఆకాశం నుంచి తమ వైపు వస్తున్న బాణ పంరపరను పరిశీలించి తక్షణమే ఆ వైపునకు కర్ణుడు ఈటెను విసిరాడు. అది ఘటోద్ఘజుడికి తగిలింది. తక్షణమే అతడు భూమిపై పడి మరణించాడు. పాండవులంతా తీవ్ర విచారగ్రస్తులయ్యారు. యుద్ధం ఆగలేదు. ద్రోణుడు ఉద్రిక్తుడయ్యాడు. పాండవ సైన్యంలో భయంగొలిపి గొప్ప నాశనం చేస్తున్నాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు.. అర్జునుణ్ణి ఉద్దేశించి, “ఓ అర్జునా, యుద్ధ రీతిని అనుసరించి ఈ ద్రోణుణ్ణి ఎవరూ చంపలేరు. మనకు అధర్మ మార్గం తప్ప మరొకటి లేదు. ద్రోణుడు యుద్ధం చేయకుండా చేయడానికి ఒకటే మార్గముంది. అశ్వత్థామ చనిపోయాడనే మాట ద్రోణుడు వింటే జీవితం మీద విరక్తి కలిగి ఆయుధాలను విసర్జిస్తాడు. కనుక ఎవరో ఒకరు అశ్వత్థామ చనిపోయాడని ద్రోణుడికి చెప్పాలి” అన్నాడు.

కృష్ణుడు చెప్పిన ఈ మాటలకు అర్జునుడు నిర్ఘాంతపోయాడు. అక్కడున్న వారెవరూ ఆ అధర్మ మార్గాన్ని సమర్థించలేదు. యుధిష్టరుడు కొంతసేపు దీర్ఘాలోచనా పరుడై..“ఈ పాపభారం నేను వహిస్తాను” అని ఆ సందిగ్ధావస్థను తొలగించాడు. ఇది వింతగా ఉంది. ప్రపంచ సృష్టి ఆరంభంలో సముద్రం మధించబడినప్పుడు భయంకరమైన కాలకూట విషం బయల్దేరి దేవతలను దహిస్తోంది. ఆ తరుణంలో రుద్రుడు ముందుకు వచ్చి, ఆ విషాన్ని మింగి వారందనీ రక్షింపలేదా? తన పైన పూర్తిగా ఆధారపడి ఉన్న స్నేహితులను రక్షించడానికి న్యాయ విరుద్ధంగా శ్రీరాముడు

వాలిని చంపిన పాపాన్ని మూటకట్టుకున్నాడు కదా. అలాగే ఇప్పుడూ యుధిష్టరుడు మరో మార్గం కనపడక అబద్ధమాడి దాని చెడు ఫలితమైన పాపాన్నీ, సిగ్గునూ భరించడానికి నిశ్చయించాడు.

భీముడు తన ఇనుప గదను ఎత్తి, అశ్వత్థామ అను పేరుగల గొప్ప ఏనుగు తలపై మోదాడు. అది చనిపోయింది. అశ్వత్థామ అనే ఏనుగును చంపి ద్రోణుడు నడుపుతున్న స్కంధారావానికి వెళ్లి, అందరూ వినేటట్లుగా "నేను అశ్వత్థామను చంపాను" అని భీముడు బిగ్గరగా అరిచాడు. భీముడు అప్పటివరకూ నీచ తలంపు మనసులోకి రానివ్వకుండానూ, నీచ కృత్యం చేయకుండానూ ఉన్నాడు. కానీ అలా అరచి చెప్పడానికి సిగ్గు పడ్డాడు. అశ్వత్థామ చనిపోయాడనే మాటలు ద్రోణుడి హృదయాన్ని కదిలించాయి. కానీ ద్రోణుడు కొంత సందేహించాడు. ద్రోణుడు.. యుధిష్టరుణ్ణి ఉద్దేశించి.. ఓయీ యుధిష్టరా, నా కుమారుణ్ణి చంపారన్నది నిజమేనా?. ఎందుకంటే ముల్లోక రాజ్యాధిపత్యం రాకున్ననూ యుధిష్టరుడు అసత్యమాడడని నేను తలుస్తున్నాను" అని ద్రోణుడు అడగగానే.. శ్రీకృష్ణుడు తీవ్రంగా ఆందోళన చెందాడు.

శ్రీకృష్ణుడు అందుకుని.. "ఇప్పుడుగాని యుధిష్టరుడు మనకు ఉపయుక్తమైన జవాబు ఇవ్వకుండా అసత్యమాడటానికి వెనుదీస్తే, మనందరమూ చస్తాం. ఎందువల్లనంటే ద్రోణుడి బ్రహ్మాస్త్రం గొప్ప పటుత్వం కలది. పాండవులందరూ నశిస్తారు" అనుకున్నాడు. యుధిష్టరుడు కూడా తాను చేయబోయేదాని గురించి కంపిస్తున్నాడు. కానీ అతని హృదయంలోనూ జయం పొందాలనే కోరిక ఉంది. "ఇది కేవలం పాపమే" అని మనసులో అనుకున్నాడు. తన హృదయాన్ని రాయిగా చేసుకొని బిగ్గరగా.. "అవును. అది నిజమే. అశ్వత్థామ చంపబడ్డాడు" అనబోయాడు. కానీ, తాను అలా అనేటప్పుడు వచ్చే నిందాపకీర్తులు మననం చేసుకొని.. మెల్లగా గద్గద స్వరంతో.. "అశ్వత్థామ అనే గజము చనిపోయింది" అన్నాడు. యుద్ధ కోలాహలంలో గజము అనే మాట ద్రోణుడికి వినపడలేదు.

అంధుడైన ధృతరాష్ట్రునికి సంజయుడు యుద్ధ చరిత్ర చెపుతూ "ఓ రాజా, ఈ ప్రకారం గొప్ప పాపం చేయబడింది" అన్నాడు.

ఈ అసత్య వాక్యాలు యుధిష్టరుడి నోటి నుంచి వెలువడిన వెంటనే, పాండవుల రథ చక్రాలు కొంతమేర భూమిలో దిగిపోయాయి. అసత్యంతో నిండిన ఈ ప్రపంచానికి అతీతంగా ఉండే యుధిష్టరుడు తాను కూడా యుద్ధంలో విజయం కోసం అవాస్తవం పలికాడు. దీంతో అతడి రథం కూడా సామాన్యుడి మార్గాన్నే పట్టింది.

ద్రోణుడు తన ప్రియమైన కుమారుడు చనిపోయాడని విని, జీవితంపై విరక్తి చెందాడు. అతని కోరికలు కూడా పూర్తిగా నశించాయి. వృద్ధ ద్రోణుడు ఈ

మనస్థత్వంలో ఉంటే, భీముడు కఠినమైన వాక్యాలతో నిందారోపణలకు దిగాడు. "బ్రాహ్మణులైన మీరు, మీ వర్ణానికి ఉచితమైన పనులు విచిడి క్షత్రియోచితమైన యోధుల కర్మలను అవలంబించి నాశనం చేశారు. మీ బ్రాహ్మణ్యం, వర్ణోచిత కర్మలను విడిచి.. ఇలా ఇతర కర్మలను అనుసరించడం వల్లే రాజులు ఇలాంటి నాశన స్థితికి వచ్చే పరిస్థితి ఏర్పడింది. అహింస పరమ ధర్మమని, బ్రాహ్మణుడే ఆ ధర్మాన్ని నిలబెట్టి పోషించగలడని మీరు ఉపదేశిస్తారు. మీ జన్మంతోనే వచ్చి పడిన అలాంటి జ్ఞానాన్ని విడిచి, సిగ్గుమాలి, మారణకర్మయే ఉద్యోగంగా చేసుకున్నారు. మీరిలా పాపపు జీవితానికి దిగడం మా దురదృష్టం" అని భీముడు నిందా వాక్యాలు పలికాడు. ఈ మాటలతో ఇదివరకే జీవితాశ వదిలిన ద్రోణుడికి మిక్కిలి మనస్థాపం కలిగింది. తన ఆయుధాలను పడేసి, రథ స్థలంలో కూర్చొని యోగధారణ అవలంబించి, త్వరలోనే సమాధి స్థితికి వెళ్లాడు. తక్షణమే ధృష్టద్యుమ్నుడు కత్తి పట్టుకొని ద్రోణుని రథం పైకెక్కాడు. సైనికులు భయపడి హాహాకారాలు చేసినా వద్దు వద్దు అని వారించినా లక్ష్య పెట్టక తాను ద్రోణుణ్ణి చంపడానికి జన్మించానన్న వాక్యాన్ని నిలుపుతూ కత్తితో ద్రోణుడి శిరస్సును నరికాడు. భరద్వాజుడి (ద్రోణుడి) ఆత్మ అందిరికీ కన్పిస్తూ అగ్నిలా ప్రకాశవంతంగా పైకెగసి స్వర్గధామాన్ని చేరుకుంది.

◈

నిస్సహాయ స్థితిలో ఉన్న
కర్ణునిపై బాణాలు వేస్తున్న
అర్జునుడు



## అధ్యాయం - 91

# కర్ణుని మరణం

ద్రోణుడి మరణానంతరం కౌరవ సేనలోని రాజులందరూ కర్ణుణ్ణి ముఖ్య సేనానిగా అభిషేకించారు. కర్ణుడు తన అందమైన గొప్ప రథంపై నిలబడ్డాడు. శల్యుడు అతడికి సారథిగా ఉన్నాడు. కర్ణుడి గాంభీర్యమూ, మహా యుద్ధ నిపుణుడన్న కీర్తీ, కౌరవులకు ధైర్యం కలిగించింది. యుద్ధం మరలా ప్రారంభమైంది. నక్షత్ర శాస్త్రజ్ఞులు, జ్యోతిష్యులు ఆదేశించిన శుభ ముహూర్తాన యుద్ధం ప్రారంభమైంది. అర్జునుడు కర్ణుడిపైకి యుద్ధానికి వెళ్లాడు. అర్జునుడి వెనుక భీముడు బాసటగా ఉన్నాడు. దుశ్శాసనుడు భీముడిపై తన సేనతో యుద్ధాన్ని కేంద్రీకరించాడు. భీముడిపై బాణ పరంపర కొనసాగించాడు.

భీముడు తనలో తానే నవ్వుకున్నాడు. "ఈ దుర్మార్గుడు ఎటూ పోకుండా నిలబడ్డాను. నా చేతుల్లోనే ఉన్నాడు. ద్రౌపదికిచ్చిన వాగ్దానాన్ని ఈ రోజు నేను నెరవేర్చుతాను. ఈ ప్రతిజ్ఞ నెరవేర్చడానికి చాలా కాలం నుంచి వేచి ఉన్నాను" అని భీముడు అనుకున్నాడు. దుశ్శాసనుడు.. ద్రౌపదిని అవమానించిన

తీరును ఓ సారి గుర్తుకు తెచ్చుకున్నాడు. భీముడిలో ఆగ్రహం కట్టలు తెంచుకుంది. తాను స్వాధీనం తప్పి ఆయుధాలన్నీ పడేసి.. తన రథాన్ని దిగి ఉరికి దుశ్శాసనుడిపై విరుచుకుపడ్డాడు. దుశ్శాసనుణ్ణి నేల కీడ్చి అతడి అవయవాలను విరిచాడు. "దుర్మార్గపు జంతువా?. ద్రౌపది శిరోజాలను పట్టుకున్న చెయ్యి ఇదేనా?. ఇక్కడ నీ శరీరాన్నుంచి కృంగటి వేరును తుంచివేస్తాను. నీకు సహాయం చేయబోయేవారెవరైనా ఇక్కడ ఉంటే వాణ్ణి ముందుకు వచ్చి ప్రయత్నించమని చెప్పు" అని దుశ్శాసనుడితో అంటూనే దుర్యోధనుడివైపు అసహ్యంగా చూశాడు. దుశ్శాసనుడి చేతిని మొదలుకంటా విరిచేశాడు. రక్తం స్రవించే ఊడబెరికిన చేతిని యుద్ధభూమిలో విసిరేశాడు. తర్వాత తాను పదమూడేళ్ల కిందట చేసిన భయంకర ప్రతిజ్ఞను నెరవేర్చాడు. తన శత్రువు శరీర రక్తాన్ని క్రూర మృగం రీతిలో తాగాడు. "నేను నా ప్రతిజ్ఞను నెరవేర్చాను. పరమ పాపిని కడతేర్చాను" అని పెద్దగా అరిచాడు. "ఇక దుర్యోధనుడి విషయంలో నేను పెట్టుకున్న ఒట్టును నిలబెట్టుకోవాల్సి ఉంది. యాగవాగ్ని సిద్ధంగా ఉంది. ఆ యజ్ఞ పశువు కూడా సిద్ధంగా ఉండాల్సిందే" అన్నాడు భీముడు. అతడి రౌద్రాన్ని చూసిన అందరూ వణికిపోయారు. గొప్ప ధైర్యశాలి అయిన కర్ణుడు కూడా భీముడి ప్రళయాకారాన్ని చూసి భయపడ్డాడు. రథ సారధ్యం వహిస్తున్న శల్యుడు.. కర్ణుడితో, "నీవు వెనక్కి తగ్గొద్దు. నీవు పిరికివాడవని ఇతరులు పొరపాటు పడేలా నీవు ప్రవర్తించొద్దు. విషాదంలో దుర్యోధనుడు చేసేదిలేక వణికిపోతున్నాడు. నీవు కూడా అలా అధైర్య పడటం తగదు. గొప్పవాడైన దుశ్శాసనుడి మరణంతో ఇక ఈ సైన్యం ఆశలన్నీ నీవే అయి ఉన్నాయి. నీవిప్పుడు పూర్తి భారం వహించాలి. మంచి శౌర్యం గల వీరుడైనందుకు అర్జునుడితో ద్వంద్వ యుద్ధానికి ప్రయత్నించు. ఇహంలో శేష కీర్తిగాని, పరంలో స్వర్గంగానీ పొందు" అని కర్ణుడిలో ఉత్తేజం రగిలించే ప్రయత్నం చేశాడు శల్యుడు.

కర్ణుడు సమరోత్సాహం చెందాడు. ఆగ్రహంతో కళ్లు ఎర్రబడ్డాయి. అర్జునుడివైపు రథాన్ని పోనివ్వమని శల్యుణ్ణి కోరాడు. "జగడాలు.. యుద్ధాలు.. ఇక చాలుచాలు. ఉభయ నష్టదాయకమైన ఈ శత్రుత్వాన్ని ఆపివేద్దాం. ప్రియమిత్రుడా! పాండవులతో సఖ్యత పడు. యుద్ధం ఆపు" అని అశ్వత్థామ.. దుర్యోధనుడికి హితవు పలికాడు. ఆగ్రహించిన దుర్యోధనుడు.. "ఏమీ.. క్రూర మృగంలా మనుష్య రక్తాన్ని తాగి నా తమ్ముని కళేబరం ముక్కలపై తాండవం ఆడుతూ ఆ మూర్ఖుడు భీముడన్న మాటలు నీవు వినలేదా?. ఇప్పుడు సంధి మాటలకు తావులేదు. నీవెందుకు వృధాగా మాట్లాడతావు" అంటూ సైన్యంలో కొత్త మార్పులు చేసి ఎదుర్కోవడానికి ఆజ్ఞ ఇచ్చాడు.

తరువాత ఘోర యుద్ధం జరిగింది. సూర్య కుమారుడైన కర్ణుడు ఓ దివ్య బాణాన్ని అర్జునుడిపై వదిలాడు. అది మెరుస్తూ, నిప్పులు కక్కుతూ అర్జునుడివైపు

వస్తుండగా, శ్రీకృష్ణుడు సరైన కాలంలో రథాన్ని ఐదు వేళ్ల లోతున బురదలోని దిగువకు నొక్కివేశాడు. ఇలా చేయడం వల్ల ఆ బాణం అర్జునుడి తలను తాకాల్సి ఉండగా, తలపైన కిరీటాన్ని తాకింది. అర్జునుడు సిగ్గునూ, కోపాన్ని ప్రదర్శిస్తూ.. కర్ణుణ్ణి అంతమొందించేందుకు ధనస్సుకు ఓ గొప్ప బాణాన్ని గట్టిగా సంధించాడు. కర్ణుడికి దురదృష్ట కాలం సమీపించింది. ఇదివరకు చెప్పిన ప్రకారం కర్ణుడి ఎడమ రథ చక్రం హఠాత్తుగా రక్త బురదలో కూరుకుపోయింది. ఆ చక్రాన్ని పైకి ఎత్తడానికి కర్ణుడు నేలపైకి దూకాడు. "అర్జునా! ఒక్క నిమిషమాగు. నీవు మహా వీరుడవు. ధర్మం తెలిసినవాడివి. అటువంటి నీవు ఈ నా పరిస్థితిలో నా అసహాయతను పురస్కరించుకొని యుద్ధం చేయవని తలుస్తాను. నేనిప్పుడే నా రథాన్ని సరిచేసికొని వస్తాను. నీవు కోరినంత యుద్ధం చేస్తాను" అని అర్జునుణ్ణి అడిగాడు కర్ణుడు. దీనికి అర్జునుడు వెనుకడుగు వేస్తున్నాడు. ఈ తరుణంలో కర్ణుడు తనకు వచ్చిన విపత్తుతో ఆందోళన చెందుతున్నాడు. తానిదివరలో పొందిన శాపాన్ని కూడా తలుచుకున్నాడు. యుద్ధనీతిని అనుసరించమని అర్జునుణ్ణి వేడుకున్నాడు.

ఈ సంభాషణ మధ్య శ్రీకృష్ణుడు.. "ఓహో కర్ణుడా! మంచి నడవడి ఉన్నదని, వీరోచిత మర్యాద కలదని నీకు కూడా జ్ఞాపకం ఉండటం మంచిది. ఇప్పుడు నీవు క్లిష్ట పరిస్థితిలో ఉన్నావు కనుక, నీకు అవి జ్ఞాపకం వచ్చాయి. కానీ, నీవూ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, శకునీ.. ద్రౌపదిని రాజ్య సభా మధ్యకు ఈడ్చి తెచ్చినప్పుడు, ఆమెను అవమాన పరిచినప్పుడు, నీవు ఈ నీతులన్నీ ఎలా మరిచిపోయావు? ధర్మపుత్రునికి జూదం అంటే ఇష్టమని భావించి, అతడా ఆట బాగా ఆడడని తెలిసి, అతన్ని మయోపాయంతో రప్పించి, ఆటలోకి దించి, మోసపుచ్చడంలో నీ పాత్ర ఎంతయినా ఉంది. ఆ సమయంలో నీ న్యాయ సూత్రాలు ఏమయ్యాయి? అవెక్కడ దాగున్నాయి? వారిచ్చిన వాగ్దానం ప్రకారం పన్నెండేళ్ల వనవాసం, ఏడాది అజ్ఞాతవాసం జయప్రదంగా నిర్వహించి వచ్చిన తరువాత యుధిష్టరుడికి అర్ధరాజ్యం ఇవ్వకపోవడం ఏ న్యాయ సూత్రం? ఇప్పుడు నీవు వేడుతున్న ధర్మసూక్షత అప్పుడేమైంది? భీముడిని చంపేందుకు విషం పెట్టిన కుట్రలో ఆ క్రూరులతో కలిసి నీకూ భాగముంది. లక్క మేడలోకి పాండవులను పంపి వారిని సజీవ దహనం చేయడానికి చేసిన పన్నాగానికి నీవు ఇష్టపడ్డావు. అంతకాలమూ ధర్మానికేమైంది? దౌపదిపై దుర్మార్గంగా చేయిచేసుకున్న సమయంలో నీవా దృశ్యాన్ని చూస్తూ ఆనందించి నప్పుడు ఆ ధర్మం ఏమి చెప్పింది? నీ భర్తలు నిన్ను భరించలేక విడిచిపెట్టారు. వెళ్లి మరో భర్తను పెళ్లాడు అని నీవప్పుడు ఆమెను అవమానించలేదా? అప్పుడు అలాంటి మాటలు అనడానికి సిగ్గులేని నోరు, ఇప్పుడు వీరోచిత ధర్మాల గురించి ప్రసంగిస్తోంది. మంచి వీర ధర్మమే. మీరందరూ గుమిగూడి బాల అభిమన్యుణ్ణి చుట్టుముట్టి సిగ్గు

విడిచి చంపినప్పుడు అది నీకు ధర్మమైందా? దుర్మార్గుడా.. ఇప్పుడు న్యాయం, వీర ధర్మం అని మాట్లాడకు. నీవు వాటినెప్పుడూ గౌరవించలేదు" అంటూ కర్ణుణ్ణి నిందించి.. అర్జునుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించాడు. తనను శ్రీకృష్ణుడు ఎత్తిపొడుపు మాటలతో అవమానించడంపై కర్ణుడు సిగ్గుతో తల వొంచుకున్నాడు. అతని నోటి నుంచి ఒక్క మాటయినా పెగలలేదు.

కర్ణుడు రథ చక్రాన్ని బురదలోనే ఉంచి మెల్లగా రథాన్నెక్కి ధనుస్సును ఎత్తాడు. మంచి గురిచూసి అర్జునుడిపైన వేశాడు. ఆ బాణం దెబ్బకు అర్జునుడు కొంతసేపు స్పృహ కోల్పోయాడు. ఈ స్వల్ప కాలంలో కర్ణుడు రథం నుంచి దిగి మరలా బురదలోని రథ చక్రాన్ని పైకి ఎత్తడానికి తొందరగా ప్రయత్నించాడు. కానీ శాపం బలవత్తరమైంది. అదీగాక ఆ మహావీరుణ్ణి అదృష్టం కూడా విడిచిపెట్టింది. కర్ణుడు తన బలాన్నంతా ఉపయోగించినా, రథ చక్రం ఇసుమంత కూడా కదల్లేదు. ఆ పైన తాను పరశు రాముడి వద్ద నేర్చిన మహాస్త్ర మంత్రాలను స్మరణకు తెచ్చుకునే ప్రయత్నం చేశాడు. కానీ జ్ఞాపకం రాలేదు. అతి ముఖ్యమైన సమయంలో అది జ్ఞప్తి రాకుండా ఉండటం పరుశురాముని శాపం.

శ్రీకృష్ణుడు.. అర్జునుణ్ణి ఉద్దేశించి, "అర్జునా! ఇక కాల హరణం చేయొద్దు. నీ బాణాలతో ఆ దుర్మార్గుణ్ణి చంపు" అన్నాడు. కానీ అర్జునుడి మనసు వెనుదీస్తోంది. వీర ధర్మం కాని పని చేయడానికి అర్జునుడి చేతులు రాలేదు. కానీ శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఉద్దేశించి పై కారణం చెప్పినదానిపై అప్పటి పరిస్థితి గురించి వ్యాసుడు.. 'అర్జునుడు భగవంతుడి ఆజ్ఞను శిరసావహించి ఒక బాణం వేయడంతో అది కర్ణుని కంఠాన్ని తెగనరికి తలను వేరుచేసింది' అని చెప్పాడు. ఈ మారణ కర్మ అర్జునుడే చేశాడని నిరూపించడానికి వ్యాసుడు ఇష్టపడలేదు. ఎందుకంటే అర్జునుడు మూర్తీభవించిన న్యాయం. కర్ణుడు తన రథ చక్రాన్ని బురద నుంచి పైకెత్తడానికి వృథా ప్రయత్నం చేస్తుండగా, భగవంతుడైన శ్రీకృష్ణుడే కర్ణుణ్ణి చంపాలని ఉద్రేకపరిచాడు. అప్పటికాలంలోని వీరధర్మాన్ని, యుద్ధ ధర్మాన్ని అనుసరించి పైన జరిగిందంతా పొరపాటు. ధర్మ అతిక్రమణ దోషాల భారాన్ని భగవంతుడు తప్ప ఇతరులెవరు భరిస్తారు? ఇందులో తెలుసుకోదగిన అంశమేమిటంటే.. శారీరకంగా హింసించడం, యుద్ధం చేయడం, అక్రమ మార్గాన అణచివేయగలమని ఆశించడం స్వాతిశయమే అవుతుంది. న్యాయం, ధర్మం నిలబెట్టడానికి శారీరక హింసాయుక్తమైన యుద్ధం సైతం ఎన్నో లెక్కలేని అకార్యకరణీయాలకు దారి చూపుతుంది. చివరికి అధర్మమే వృద్ధి అవుతుంది.



భీముడు, దుర్యోధనుల
మధ్య తుది పోరు

## అధ్యాయం - 92

# దుర్యోధనుడు

**క**ర్ణుడు మరణించాక.. దుర్యోధనుడి విషాదానికి హద్దులేకుండా పోయింది. దుర్యోధనుడి హృదయ తాపానికి కృపాచార్యుడు ఎంతో జాలి చెందాడు. కృపుడు అర్జునుణ్ణి ఉద్దేశించి.. "కోరికలు పెంచుకొని అత్యాశకు లోనై మనం స్నేహితులపై భారాన్ని మోపాం. వారూ ఆ భారాన్ని సంతోషంగా స్వీకరించారు. యుద్ధభూమిలో ప్రాణాలు విడిచి వీర స్వర్గాన్ని చేరారు. నీకొక్కటే మార్గముంది. పాండవులతో సఖ్యత పడి సంధి చేసుకోవడమే అది. రాజా! ఈ దుర్దశకు కారణమైన యుద్ధాన్ని ఇక చేయకు" అని హితువు పలికాడు. ఇలాంటి విషమ పరిస్థితుల్లోనూ దుర్యోధనుడు తన అభిప్రాయం మార్చుకోలేదు. దుర్యోధనుడు..కృపుణ్ణి ఉద్దేశించి.. "ఒకప్పుడు బహుశా అలాంటి సంధికి అవకాశం ఉంది. కానీ ఆ సమయం గతించింది. పాండవులకూ, మనకూ ప్రతీకారం, ఈ రక్తపాతం తరువాత సంధి, సఖ్యత అనే మాటలకు తావులేదు. చావును తప్పించుకోవడానికి నేను లోబడితే ప్రపంచ నిష్టూరాన్నీ,

అపనిందనూ, అసహ్యతనూ నేనెలా తప్పించుకోగలను? అలాంటి నీచ కార్యం చేసి నేను జీవితంలో అనుభవించే సౌఖ్యం ఏమిటి? నా అన్నదమ్ములను, బంధువులను చంపిన తరువాత నేను సంధి పొసగించి అనుభవించగల రాజ్యాధికారంతో నాకేమి ఆనందం ఉంటుందని ఆశించగలను?" అని దుర్యోధనుడు చెప్పిన మాటలకు అందరూ సమ్మతించారు.

అందరూ అతనికి సంతోషం కలిగించే ప్రయత్నం చేశారు. దుర్యోధనుణ్ణి అందరూ స్థిరపరిచి శల్యుణ్ణి ముఖ్య సేనానిగా నియుక్తుణ్ణి చేశారు. శల్యుడు దృఢకాయుడు. చనిపోయిన వీరుల్లో ఏ ఒక్కరికైనా సమానుడే. అతని నాయకత్వంలో కురు సైన్యం వ్యూహపరచబడింది. యుద్ధం ఆరంభమైంది. మళ్లీ యుద్ధం ఘోరంగానే జరుగుతోంది. పాండవ పక్షాన సేనను, యుధిష్ఠరుడు..సొంతగా శల్యుడిపైకి నడిపాడు. అంతవరకూ సాధుస్వభావానికి ప్రసిద్ధి చెందిన యుధిష్ఠరుడు ఈ యుద్ధంలో అంత ఘోరంగా పోరాడటం చూసిన వారంతా ఆశ్చర్యపోయారు. కొంతకాలం వరకూ యుద్ధం సమానంగానే నడిచింది. యుధిష్ఠరుడు తన చేతిలోని ఈటెను శల్యుడిపైకి విసిరాడు. అది సూటిగా వెళ్లి శల్యుణ్ణి తాకింది. ఉత్సవాంతాన పడిపోయిన జెండా స్తంభం మాదిరిగా శల్యుని మృత శరీరం యుద్ధభూమిపై పడి రక్తమయమైంది.

ముఖ్య సేనానుల్లో ఆఖరివాడైన శల్యుడు కూడా చనిపోయిన తరువాత కౌరవ సైన్యం ఆశను విడిచిపెట్టింది. యుద్ధంలో చనిపోగా మిగిలిన ధృతరాష్ట్రుని కుమారులు అందరూ కలిసి అన్ని దిశల నుంచీ భీముణ్ణి ఎదురించారు. భీముడు కోపంతో దహించుకు పోతున్నాడు. సభలో ద్రౌపదిని అవమానించింది మొదలు, అరణ్యవాస, అజ్ఞాతవాస సమయాల్లో కౌరవులు చేసిన దుర్మార్గాల వరకూ గుర్తు పెట్టుకొని క్రోధంతో ఊగిపోతున్నాడు. భీముడు తనలో.. 'నేను వృథాగా జీవించలేదు. కానీ దుర్యోధనుడు ఇంకా బతికే ఉన్నాడు' అనుకొని చిన్న నవ్వు నవ్వాడు.

మరోవైపు సహదేవుని సేనా భాగంపైకి శకుని వెళ్లాడు. కొంత యుద్ధమైన తరువాత సహదేవుడు.. కత్తి పదునుగల ఒక బాణాన్ని శకునిపై వేస్తూ.. "మూర్ఖుడా! నీవు చేసిన మహా పాపానికి ఇది బహుమానం" అన్నాడు. ఆ బాణం సూటిగా పోయి కత్తిలా శకుని కంఠాన్ని నరికింది. కౌరవుల క్రూర కార్యాలన్నిటికీ మూలమైన శకుని తల భూమిపై దొర్లింది.

నాయకుడు లేక కౌరవ సైన్యం చెదిరిపోయింది. అన్ని దిశలకూ పరిగెడుతోంది. పాండవ సైనికులు వారిని వెన్నంటి తరిమి ఆఖరు మనిషి వరకూ చంపేశారు.

'ఓయీ భారతా! నీ పదకొండు అక్షౌహిణుల సైన్యం ఇలా ధ్వంసం అయ్యింది. ఈ కార్యనిర్వహణకు సగర్వంగా ధీరులై వచ్చిన వేలకొలది రాజులందరిలోనూ,

యుద్ధభూమిలో గొప్ప గాయాలు తగిలిన రాజు దుర్యోధనుడు మాత్రమే కనిపించాడు. యుద్ధావసాన చరిత్రను ధృతరాష్ట్రునికి సంజయుడు పూసగుచ్చినట్లు చెప్పాడు.

'పరాజితులైన తన సైన్యాన్ని కూడదీయడానికి వృథా ప్రయత్నాలు చేసిన దుర్యోధనుడు, ఒంటరివాడై తన గదను తీసుకొని ఒక నీటి మడుగు వద్దకు వచ్చాడు. అతని శరీరమంతా అగ్నిలా మండుతోంది. ఆ మడుగులోని నీరు అతన్ని ఆకర్షించింది. నీటిలోకి దిగుతూ.. బుద్ధిమంతుడైన విదురునికి ఏమి జరగగలదో తెలుసు. అతడు మాకు చెప్పాడు. వినకపోయాం. ఫలితం అనుభవిస్తున్నాం. అదే నిర్దిష్ట న్యాయం' అని మనసులో అనుకున్నాడు.

తమను ఎడతెగని వైరానికి దించిన గొప్ప శత్రువు దుర్యోధనుడు మడుగులో ఉండటాన్ని యుధిష్ఠరుడు, అతని తమ్ముళ్లు చూశారు. యుధిష్ఠరుడు.. "దుర్యోధనా! కుటుంబాన్ని, తెగను నాశనం చేసి ఈ మడుగులో దాగి ఉన్నావా? నీవు మరణం నుంచి తప్పించుకోగలవా? నీ గర్వం ఎటు పోయింది ఇప్పుడు? నీకు సిగ్గులేదా? బయటకు వచ్చి యుద్ధం చెయ్యి. పుట్టుకతో క్షత్రియుడవై, యుద్ధం-చావు అన్న నువ్వు వెనుదీస్తున్నావా?" అని ఉడికించాడు. దీంతో దుర్యోధనుడు మడుగు నుంచి బయటకు వచ్చి రాజసంతో.. "ఓయీ ధర్మపుత్రా! నేను ప్రాణాన్ని దాచుకోవడానికి ఇక్కడకి రాలేదు. భయం వల్ల కూడా నేనిక్కడికి రాలేదు. నాలో ఉన్న వేడిని ఈ నీటితో చల్లబరుచుకోవడానికి వచ్చాను. నేను చావుకు భయపడను. జీవించీ ఉండను. కానీ నేనెందుకు యుద్ధం చేయాలి? ఎందుకోసం నేను యుద్ధం చేయడానికి వచ్చానో, ఆ పదార్థమేదీ ఈ ప్రపంచంలో లేదు. నాకు సహాయం చేసిన నా పక్కనున్నవారందరూ చనిపోయారు. రాజ్యం కావాలనే నా కోరిక పోయింది. నీకీ ప్రపంచమంతా ఎదురులేకుండా వదిలిపెట్టాను. కనుక అడ్డులేని రాజ్యాధిపత్యాన్ని స్వీకరించి ఆనందించు" అన్నాడు.

యుధిష్ఠరుడు.. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి, "ఇప్పుడు నీవన్నది నిశ్చయంగా వితరణే. అదీ సూదిమొన మోపినంత భూమి అయినా ఇవ్వబోనని నీవన్న తరువాత, ఈ వాక్యాలు నీవనడం శ్లాఘనీయం. నీ వితరణ బుద్ధినీ తెలియజేస్తోంది. మేము శాంతిని కోరి రాజ్యభాగం ఇవ్వమని బతిమాలినప్పుడు మా మాటల్ని తోసిపుచ్చావు. ఇప్పుడంతా తీసుకోమని చెపుతున్నావు. మనం యుద్ధం చేసింది రాజ్యం కోసంగానీ, భూమి కోసంగానీ కాదు. నీవు చేసిన పాపాలన్నీ చెప్పమంటావా?. మాకు నీవు చేసిన హాని, అపరాధం, ద్రౌపది పట్ల నీవు చేసిన దుర్మార్గం.. నిన్ను చంపడానికి ప్రతిక్రియతోగాని ఉపశమించదు."

ఇలా వరుసబెట్టి యుద్ధ సంగతులు ధృతరాష్ట్రునికి చెపుతున్న సంజయుడు..'నీ

కొడుకు దుర్యోధనుడు, ధర్మపుత్రుడన్న కఠిన ఎత్తిపొడుపు మాటలు విని మడుగు నుంచి బయటకు వచ్చి మరలా యుద్ధానికి సిద్ధమయ్యాడు. అతడు.. మీరు ఒక్కొక్కరే నా మీదకు రండి. నేనొక్కడినే కదా. ఒంటరివాడినైన నన్ను మీరు ఎదురించరేమిటి?' అన్నాడు. వెంటనే యుధిష్ఠరుడు..“చాలా మంది కలిసి ఒక్కరిని ఎదుర్కోవడం నిశ్చయంగా అన్యాయం అయితే అభిమన్యుణ్ణి ఎలా ఎదురించారు? అతన్ని ఎలా చంపారు? మీ అందరి మధ్య ఒంటరిగా నిలబడిన ఆ కుర్రవాణ్ణి ఆందరూ కలిసి ఎదుర్కోవడం నీ అనుమతితోనే కదా జరిగింది? మనుషులకు అపాయం, కష్టం ఎదురైనప్పుడు వారు ఇతరులకు ధర్మం, వీర నీతి చెపుతుంటారు. నీవు కవచాన్ని ధరించు. మాలో నీకు ఇష్టమైన వాణ్ణి ఎంచుకొని యుద్ధం చెయ్యి. చనిపోయి స్వర్గానికి పో. జయించి రాజువవ్వు” అన్నాడు.

ఆ ప్రకారంగా దుర్యోధనుడికీ, భీముడికీ మధ్య ద్వంద్వ యుద్ధం ప్రారంభమైంది. వారి గదలు ఢీకొన్నప్పుడు మిణుగురులు వలే రాలుతున్నాయి. యుద్ధంలో దుర్యోధనుడు, భీముడు బలం, నేర్పులో సమానులు. యుద్ధం చాలా సేపు జరిగింది. జయాపజయాలు చెప్పడానికి అవకాశం లేకుండా పోయింది. ఆ యుద్ధాన్ని చూసేవారు ఆ ఇద్దరిలో ఎవరు గెలుస్తారో అని తర్కించుకోవడం కనిపించింది. కృష్ణుడు అర్జునుడితో..“ద్యూత సభలో.. దుర్యోధనుడి తొడలు విరగ్గొడతానని భీముడు చేసిన ప్రతిజ్ఞను ఇప్పుడు నెరవేర్చమని” చెప్పాడు. భీముడు ఈ మాటను విన్నాడు. వెంటనే నాటి సభలో జరిగిన అవమానాన్ని స్ఫురణకు తెచ్చుకున్నాడు భీముడు. సింహంలా లంఘించి గదతో దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టాడు. దుర్యోధనుడు నేలమీద పడిపోయాడు. దుర్యోధనుడి తలను భీముడు కాలితో తన్ని నృత్యం చేశాడు.

“భీమా, ఆగు!. నీ రుణం తీర్చుకున్నావు. దుర్యోధనుడు రాజు. మనకు పినతండ్రి కుమారుడు. అతని తలపై నీ పాదం ఉంచడం తగదు” అన్నాడు యుధిష్ఠరుడు. కృష్ణుడు అందుకుని.. “ఆ దుర్మార్గుడి ఆత్మ త్వరలో శరీరాన్ని వీడి పోతుంది. పాండు కుమారులారా! దుర్యోధనుడు మృత్యుముఖంలో ఉన్నాడు. అతని స్నేహితులూ చనిపోయారు. ఇంకా ఇక్కడ ఉండటం ఎందుకు? మీ రథాలను ఎక్కండి” అన్నాడు. దీంతో నేలపై పడిన దుర్యోధనుడు ముఖం కోపోద్రిక్తంతో ఎరుపెక్కింది. తన కళ్లను కృష్ణుడి వైపు తిప్పి..“యుద్ధ ధర్మాలను అనుసరించి బహుధైర్యంతో పోరాడిన మహావీరులను, నీ నీచపు కుట్ర, వంచనతో చంపించావు. కర్ణుడు, భీష్ముడు, ద్రోణుడు.. వీరితో మీరు ధర్మ సమరం చేయలేదు. నీకు సిగ్గు ఏ మాత్రం మిగల్లేదు” అంటూ చనిపోతూ కూడా దుర్యోధనుడు తాను చేసిన పనులకు పశ్చాతాప పడలేదు.

కృష్ణుడు అందుకొని.. “దుర్యోధనా! నీవు ఇతరులను వృథాగా నిందిస్తున్నావు.

ఆశ.. గర్వం.. నిన్ను దుర్మార్గ కృత్యాలు చేయడాకి పురికొల్పాయి. నీవు వేసిన విత్తనాల ఫలితాలనే నీవు అనుభవిస్తున్నావు" అన్నాడు. దీనికి దుర్యోధనుడు.."నీచుడా, బతికి ఉండగా నేను రాజును. ఔదార్యంగల స్నేహితుడుగా ఉన్నాను. భయంకర శత్రువుగానూ ఉన్నాను. మానుషానందాలు, దేవతలు కూడా కోరే, ఏ రాజైనా ప్రయత్నించినా పొందరాని ఆనందాలన్నిటినీ నేను పూర్తిగా అనుభవించాను. అలాంటి జీవితానికి వీరమరణమే కిరీటం వంటిది. చనిపోయి స్వర్గంలో నాకు స్వాగతం ఇవ్వబోయే స్నేహితులను, తమ్ముళ్లను జయప్రదంగా కలుసుకుంటాను.  మీ ఆశయాలన్నీ భగ్నమై క్షత్రియులందరిచేతా నీచులనిపించుకొని జీవిస్తారు మీరు. శక్తిలేక తొడలు విరిగి పడి ఉన్న నా తలపై భీముడు కాలుపెట్టాడని మనసులో ఉంచుకోను. నాకింకా లక్ష్యం ఏముంది? కొన్ని నిమిషాల్లో కాకులు, గద్దల కాళ్లు నా దేహంపై ఉండవా?" అని దుర్యోధనుడు అనేసరికి.. ఆకాశాన్నుంచి దేవతలు పుష్పాలను వర్షించారు. అత్యుత్కటమైన కోరిక దుర్యోధనుణ్ణి చెడు మార్గాన పెట్టింది. దీనివల్ల ఆగ్రహం, ఇతర ధర్మవిరుద్ధమైన కార్యాలు జరిగాయి. కానీ ధృతరాష్ట్రుని కుమారుడి జయించరాని కార్యదీక్ష, ధైర్యం విషయంలో ఎవరూ ప్రశ్నించలేరు.

◈



దుర్యోధనుని మరణం

## అధ్యాయం - 93

# పాండవులపై నిందలు

**మ**హాభారత యుద్ధం పూర్తియ్యే కాలానికి బలరాముడు తన తీర్థయాత్రలు పూర్తి చేసి కురుక్షేత్రానికి వచ్చాడు. భీమ దుర్యోధనులు చివరి యుద్ధం చేస్తుండగా వచ్చాడు. భీముడు గదతో దుర్యోధనుడి తొడలపై గురిచూసి గట్టిగా కొట్టి విరిచేయడం చూశాడు. ద్వంద్వ యుద్ధ ధర్మాన్ని అతిక్రమించి అలా కొట్టడాన్ని సహించలేకపోయాడు. "ఛీ. మీరు చేసినదంతా అన్యాయం. ఏ క్షత్రియుడైనా నాభి దిగువన దెబ్బతీస్తాడా?. ఈ భీముడు యుద్ధ న్యాయాన్ని అతి నీచంగా అతిక్రమించాడు" అని కృష్ణుడి వద్ద తన అసమ్మతిని వ్యక్తం చేశాడు బలరాముడు. "ఈ అన్యాయాన్ని చూస్తూ నీవు సహించగలవు. కానీ ఇలాంటి చెడు పనులు చూసి సహించలేను" అంటూ బలరాముడు తన నాగలిని పైకెత్తి భీముడి పైకి వెళ్లాడు. నాగలి బలరాముడి ఆయుధం. దాన్ని గొప్ప పరిస్థితులు ఏర్పడినప్పుడే ఉపయోగిస్తాడు. శ్రీకృష్ణుడికి చక్రం ఎలాగో, ఇతడికి నాగలి అలా.

బలరాముడు.. భీముడిపైకి వెళ్లడంతో కృష్ణుడు భయపడ్డాడు. కృష్ణుడు పరుగున భీమ–బలరాముల మధ్యకు వెళ్లాడు. “పాండవులు మన స్నేహితులు. బంధువులు. దుర్యోధనుడు చేసిన దుర్మార్గ కార్యాలతో పాండవులు ఎన్నో బాధలు పడ్డారు. ద్రౌపదిని సభా మధ్యలో అవమానించినప్పుడు భీముడు ‘దుర్యోధనుడి తొడలను ఈ గదతో విరగ్గొట్టి చంపుతా’ అని శపథం చేశాడు. ఆ శపథం నలుగురి సమక్షంలోనే చేశాడు. ఒక క్షత్రియుడు పవిత్రంగా ప్రతిజ్ఞ చేసినప్పుడు దాన్ని నెరవేర్చడం అతడి ధర్మం. నీ కోపంతో అపమార్గాన పడి అమాకులైన పాండవులపై అన్యాయంగా ప్రవర్తించకు. నీవు భీముణ్ణి దోషిగా భావించే ముందు, కౌరవులు.. పాండవులపై చేసిన దురంతాలను, అన్యాయాలను కూడా గమనంలో ఉంచుకో. ఒక ప్రవర్తనకు సంబంధించి మంచి చెడ్డలను నిర్ణయించడంలో, ఆ కార్యం చేయడానికి కారణభూతమైన ఇతర అంశాలన్నీ తెలుసుకోవాలి. అలా చేయకపోతే తప్పు మార్గాన నడుస్తాము. ఒక అంశాన్ని అది ఇమిడి ఉన్న పరిస్థితుల మధ్య నుంచి వేరుచేసి, దానిపై ప్రత్యేకంగా అభిప్రాయం చెపితే అన్యాయం జరుగుతుంది. కలియుగం ప్రవేశించింది. పూర్వయుగపు న్యాయ సిద్ధాంతాలు ఇప్పుడు పనికిరావు. తన ప్రాణాలు తీయడానికి ఎన్నోసార్లు దుర్మార్గంగా కృత్రిమ మార్గాన్ని ఉపయోగించిన శత్రువును నాభి దిగువ కొట్టడం తప్పు కాదు. ఒకే సారి అనేకమందిని ఎదుర్కొంటున్న అభిమన్యుణ్ణి, ఈ దుర్యోధనుడి ప్రోత్సాహంతో..కర్ణుడు ఒక బాణంతో వెనుక నుంచి కొట్టాడు. ఆ బాల వీరుణ్ణి నిరాయుధుణ్ణి చేసి లెక్కలేనంతమంది వీరులు చుట్టుముట్టి నీచ మార్గంలో చంపారు. దుర్యోధనుడు తాను పుట్టిననాటి నుంచే చెడు ఆలోచనలతో క్రూరమైన పనులు చేసి, తన ప్రజలను నాశనానికి తెచ్చాడు. ఈ మనిషిని భీముడు చంపితే పాపంలేదు. అతడి వల్ల తన జరిగిన చెడునూ, అన్యాయాన్ని భీముడు భరించాడు. పదమూడేళ్లపాటు తన ఆగ్రహాన్ని తనలోనే ఉంచుకున్నాడు. తొడలు విరగ్గొట్టి చంపుతానని భీముడు చేసిన ప్రతిజ్ఞ సంగతి దుర్యోధనుడికి తెలిసిందే. ఇప్పుడు కష్టాలను అనుభవించిన పాండవులను యుద్ధానికి పిలుస్తున్నప్పుడు.. భీముణ్ణే ‘ప్రతిజ్ఞ అమలు చెయ్యి’ అని దుర్యోధనుడు ఎందుకు పిలిచాడు?.మరి భీముడు ఈ పని చేయడం తప్పని నీవెలా ఊహించావు?” అని కృష్ణుడు చెప్పినా బలరాముడి అభిప్రాయం మారలేదు సరికదా కోపం మరింత పెరిగింది.

“దుర్యోధనుడు ధైర్యవంతులకు ప్రత్యేకించిన స్వర్గానికి వెళ్తాడు. భీముని కీర్తికి మచ్చ పోదు. దుర్యోధనుడితో ద్వంద్వ యుద్ధంలో భీముడు ధర్మ యుద్ధాన్ని విడిచాడని జనులు అనుకుంటారు. నేనిక్కడ ఉండటానికి అసహ్యంగా ఉంది'' అంటూ బలరాముడు ద్వారకకు తక్షణమే విసురుగా వెళ్లిపోయాడు.

కృష్ణుడు, యుధిష్టరుణ్ణి ఉద్దేశించి.. "ఓయీ యుధిష్టరా! ఏమిటి మౌనంగా ఉన్నావు" అన్నాడు. దానికి ధర్మరాజు సమాధానంగా.."మాధవా! చచ్చి పడి ఉన్న దుర్యోధనుడి శరీరంపైకి లంఘించి అతడి తలపై భీముడు కాళ్లతోతన్ని నాట్యం చేయడాన్ని నేను అంగీకరించలేను. ఈ చర్య వల్ల మా వంశ కీర్తి పోయింది. మమ్మల్ని కౌరవులు హింసిచారు. భీముడి హృదయంలో ఉన్న క్రోధం గురించి నాకు తెలుసు కనుక అతడిని మితిమీరి నిందించలేను. సంతృప్తి ఎరుగని ఆశ, బుద్ధిలేమి.. వీటితో బాధపెట్టిన దుర్యోధనుడికి మనం గుణపాఠం చెప్పాం. భీముడి నృత్య నీతిని గురించి, గొప్ప బాధలు పెట్టినవాడి ప్రతీకారం గురించి వితర్కించడంవల్ల ఇప్పుడు ఎలాంటి ప్రయోజనమూ లేదు" అని ధర్మరాజు తన మనసులోని బరువును దించుకున్నాడు. మనుషులు నీతిని విడిచి ప్రవర్తించినప్పుడు, అవి అంత చెడు ప్రవర్తన కాదని తలచినప్పుడు, ఏవో సాకులు చెప్పి ఉపశమింపచేసే ప్రయత్నం చేయడం హృదయానికి స్వస్థత నివ్వబోవు. సూక్ష్మబుద్ధిగల అర్జునుడు మౌనం వహించాడు. అతడు కూడా భీముడు చేసిన పనికి సమ్మతించలేదు. అది అవమానకరమైన పని అని నిందించనూ లేదు. అక్కడున్న మిగిలినవారు దుర్యోధనుడి దుర్మార్గాలను, పాప కృత్యాలను లెక్కించి ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం కనిపించింది.

శ్రీకృష్ణుడు వారందరి వైపు తిరిగి.. "వీరులారా! గాయాలతో చావ సిద్ధంగా పడి ఉన్న పరాజిత శత్రువుపై నిందా వాక్యాలాడటం తగదు. చావనున్న వాని గురించి మనం చెడుగా మాట్లాడకూడదు. వాడు మూర్ఖుడై తనంత తానే ఈ పరిస్థితి తెచ్చుకున్నాడు. అతడు చెడు సావాసాల్లో పడిపోయాడు. మనం వెళ్లిపోదాం రండి" అన్నాడు.

శారీరక, మానసిక బాధ పడుతూ భూమిపై పడిఉన్న దుర్యోధనుడు.. కృష్ణుడన్న మాటలు విని తీవ్ర కోపోద్రిక్తుడయ్యాడు. బహుకష్టంతో తన చేతులపై కొంతవరకు ఆనుకొని బాధపడుతూ..నీచుడా! సేవకుని కొడుకా! నీ తండ్రి వసుదేవుడు కంసుని సేవకుడు కాదా? రాజుల మధ్య కూర్చోవడానికి, తిరగడానికి నీకు పనిలేదు. సిగ్గుమాలిన నీచుడిలా మాట్లాడుతున్నావు. నా తొడపై కొట్టమని నీవు భీముణ్ణి ప్రోద్భలం చేయడం నేను చూశాను. నేను నిన్ను గమనించలేదని అనుకుంటున్నావా? అర్జునుడితో ఏదో సామాన్యంగా సంభాషిస్తున్నట్లు నటిస్తూ నీవు నా తొడను చూపడం నేను చూశాను. అప్పటివరకూ యుద్ధం సమానంగా ఉంది. నీకు కనికరమూ, సిగ్గూ లేవు. భీష్మ పితామహుణ్ణి చంపడానికి నీవు తంత్రం చేయలేదా? భీష్మణ్ణి ఎదిరించినప్పుడు శిఖండిని ముందుగా రథంపై ఉంచమని సలహా ఇచ్చింది నీవు కాదా? భీష్ముడు స్త్రీతో యుద్ధం చేయడానికి అసహ్యించుకొని, తాను తిరిగి యుద్ధం

చేయకుండా చనిపోయేలా చేయడం నీకు తెలియదా? ధర్మరాజుతో అబద్ధం ఆడించి ద్రోణుణ్ణి అంతం చేయించావు. యుధిష్టరుడి అబద్ధం వల్ల అస్త్ర సన్యాసం చేసి యోగాసనంపైనుంచి పరమేశ్వరుడిపై మనసు కేంద్రీకరించి సమాధి నిష్టలో ఉన్న ద్రోణాచార్యుణ్ణి నీచుడైన ధృష్టద్యుమ్నుడు చంపినప్పుడు దాన్ని నివారించకుండా నీవు ఆనందించలేదా? అర్జునుణ్ణి చంపడానికే ప్రత్యేకంగా దాచుకున్న ఈటెను ఘటోద్ఘజుడిపై ప్రయోగించినట్లు చేసిన తంత్రం నీది కాదా?. భూరిశ్రవసుడు చేతులను అన్యాయంగా తెగగొట్టినప్పుడు అతడు యుద్ధం మాని శరీరాన్నే ఆసనంగా చేసుకొని యోగ సమాధిలో ఉండగా సాత్యకి చేత కసాయిలా నరికించిన పరమ పాపిష్టివి నీవు కాదా?. యుద్ధంలో తన రథ చక్రాలు బురదలో కూరుకుపోగా, దాన్ని ఎత్తేందుకు ప్రయత్నిస్తున్న కర్ణుణ్ణి అతి నీచంగా అర్జునుడితో చంపించింది నీవు కాదా?. ఓ పనికిమాలినవాడా! మా నాశనానికి కారణభూతుడా! సూర్యాస్తమయం కాకుండానే అస్తమించినట్లు భ్రమింపచేసి, తనకు అపాయం తప్పిందని తలచి ఆనందిస్తున్న జయద్రధుణ్ణి చంపించింది నీవు కాదా?. ఇలాంటి నీ నీచకార్యాలను ప్రంపచమంతా నిందించి తీరుతుంది" అంటూ శ్రీకృష్ణుడిపై నిందారోపణలు చేశాడు. అతడు అలసి, గాయాలు అమితంగా బాధ పెడుతూ, కోపోద్రేకం కూడా కరిగిపోయి ఉన్న దశలో మరోసారి భూమిపై పడిపోయాడు.

కృష్ణుడు.. దుర్యోధనుణ్ణి ఉద్దేశించి, "ఓయీ గాంధారి పుత్రా! నీవు తుది ఘడియల్లో ఉన్నావు. ఈ బాధకు కోపం కూడా ఎందుకు తోడు చేసుకుంటావు. నీవు చేసిన దుష్టపనులే నిన్నీ స్థితికి తెచ్చాయి. ఇందతా నా వల్లే జరిగిందని అనకు. భీష్మ ద్రోణులు నీ పాపకారణంగానే చనిపోయారు. అలాగే కర్ణుని మరణానికీ నీవే కారణం. పాండు పుత్రులకు నీవు చేసిన దుష్టపనులన్నీ వర్ణించి చెప్పాలా?. నీవు ద్రౌపదిని ఘోరంగా అవమానించినందుకు నిన్నెంత శిక్షించినా అది చాలదు. ఈ చెడు ప్రవర్తన వల్ల ఉద్భవించినవే ఈ వైరం, ద్వేషం. ఇతరులను నిందించడం తగదు. నీ అత్యాశ వల్ల ఆర్జించిన రుణాన్ని యుద్ధభూమిలో పూర్తిగా తీర్చేశాము. ధైర్యవంతుడు కోరదగిన మరణాన్ని పొందుతున్నావు. యుద్ధభూమిలో ప్రాణాలర్పించిన క్షత్రియులకు ఉన్న స్వర్గ ధామానికి నీవు వెళ్తావు" అన్నాడు.

దుర్యోధనుడు తన కళ్లు మూతపడుతుండగా.. "కృష్ణా! నా స్నేహితులతో నేను స్వర్గానికి పోతున్నాను. కానీ నీవూ, నీ స్నేహితులూ భూమిపైనే ఉండి దు:ఖాన్ని అనుభవిస్తారు. నేను వేదాలను చదివాను. శాస్త్రానుసారం దానధర్మాలు చేశాను. సముద్రం మినహాయించిన భూమినంతా ఏకఛత్రాధిపత్యంగా ఏలాను. నేను జీవించి ఉన్నప్పుడు శత్రువులందరి తలలు నా పాదాల కిందే ఉన్నాయి. మనుషుల ఆనందాలు,

దేవతలు కూడా కోరదగినవి, రాజులు కూడా తమకు లేవని విచారించునవీ, వెయ్యేల..కీర్తిప్రతిష్టల శిఖరాన నేనున్నాను. క్షత్రియ వీరులు ఏదైతే కీర్తి కిరీటమని ఎంచుతారో అలాంటి యుద్ధభూమిలో మరణం పొందుతున్నాను. నాకంటే ముందు స్వర్గలోకంలో ఉన్నవారు.. నాకు ఆహ్వానం ఇవ్వదలచి ఉన్న స్నేహితులను, అన్నదమ్ములను కలుసుకోవడానికి వెళ్తున్నాను. ఎవరు హెచ్చు అదృష్టవంతుడు? నేనా? లేక భూమిపై నిర్మానుష్యమైన ఇళ్లలో ఉండి, చంపబడిన స్నేహితుల కోసం విచారిస్తూ, మీరు వాంఛిస్తున్న యుద్ధం ద్వారా మీ కోట బూడిదై ఉన్న మీరా? " అని దుర్యోధనుడు అన్నాడు. మరణానికి అంచున ఉన్న దుర్యోధనుడిపై.. దేవతలు పైనుంచి పుష్పాలు చల్లారు. గంధర్వులు ఆటలాడి పాటలు పాడారు. ఆకాశం కూడా ప్రకాశవంతం అయ్యింది. వాసుదేవుడూ, పాండవులూ చిన్నబోయారు. "దుర్యోధనుడన్న మాటల్లో యథార్థముంది. మీరు ధర్మ యుద్ధం చేస్తే వారిని జయించి ఉండకపోదురు. ఈ దుర్మార్గుడు యుద్ధంలో అజేయుడు" అన్నాడు శ్రీకృష్ణుడు.

◈



అశ్వత్థామ

## అధ్యాయం - 94

# అశ్వత్థామ

**దు**ర్యోధనుడు గాయాలు తగిలి చనిపోనున్నాడని.. భీమదుర్యోధనాదుల గదా యుద్ధపు వివరణలు విన్న అశ్వత్థామ సత్యాగ్రహం సముద్రంలా పొంగింది. తన తండ్రిని వంచించి చంపిన పాండవులపై అతడి హృదయం రగిలిపోయింది. ద్వంద్వ యుద్ధ ధర్మానికి వ్యతిరేకంగా దెబ్బతిని, చనిపోవడానికి సిద్ధంగా ఉన్న దుర్యోధనుణ్ణి చూడటానికి అతడున్న ప్రదేశానికి వెళ్లాడు. అక్కడ అశ్వత్థామ.. ఆ రాత్రే తాను పాండవులందరినీ చంపుతానని శపథం చేశాడు. తాను మరణం అంచున ఉన్న తరుణంలో అశ్వత్థామ శపథం విన్న దుర్యోధనుడు ఎంతో సంతోషించాడు. తన వద్ద ఉన్నవారితో అశ్వత్థామను తన సైన్యానికి ముఖ్య నాయకుడుగా చేశాడు. ఈ కార్యం పూర్తయిన తరువాత దుర్యోధనుడు.. అశ్వత్థామను ఉద్దేశించి, "నా అశలన్నీ నీపైనే ఉన్నాయి" అన్నాడు.

అది సాయం సమయం. అడివంతా చీకటిగా ఉంది. కృపాచార్యుడు, కృతవర్మ,

అశ్వత్థామ ఒక మఱ్రి చెట్టుకింద సేదతీరుతున్నారు. వారు చాలా అలసి సొలసి ఉన్నారు. వారు పడుకోగానే గాఢ నిద్రలోకి జారుకున్నారు. అయితే విచారం, కోపం, పగ తన హృదయంలో దహించుకుపోతున్న అశ్వత్థామకు నిద్ర రాలేదు. తానా రోజున దుర్యోధనుడి వద్ద చేసిన శపథాన్ని, అతడికి ఇచ్చిన వాగ్దానాన్ని ఎలా కార్యరూపంలో పెట్టగలనా అని ఆలోచిస్తున్నాడు. ఈ ముగ్గురు వీరులు విశ్రమించిన మఱ్రి చెట్టు శాఖలపై వందల కొద్దీ కాకులు నిద్రిస్తున్నాయి. అవన్నీ నెమ్మదిగా నిద్రిస్తున్నాయి. అప్పుడు ఒక పెద్ద ఉలూకం వచ్చి ముందు ఒక కాకితో తలపడి చంపింది. తరువాత మరోకాకితో. ఇలా విడివిడిగా కాకులను చంపుతోంది. నిద్రలో అసహాయంగా ఉన్న పక్షులను రాత్రివేళలోనే తిరిగే ఘాతుక పక్షి చంపుతోంది. రాత్రివేళ దృష్టి లేని కాకులు వలయాకారంగా తిరుగుతూ ఆ ఉలూకాన్ని ఎదురించి చంపేశాయి. ఈ దృశ్యాన్ని చూసిన అశ్వత్థామ.. "పాండవ దుర్మార్గులను, మా తండ్రిని చంపిన పాంచాలుణ్ణి, వారి అనుచరులనూ ఈ గుడ్డి కాకులు ఉలూకాన్ని ఎదురించి చంపినట్లుగా చంపాలి. వారు రాత్రివేళ గుడారాల్లో పడుకొని నిద్రిస్తున్నప్పుడు అకస్మాత్తుగా వారిపై పడి సులభంగా చంపగలం. మా పట్ల వారు చేసిన దుర్మార్గ పనులకు ఈ ప్రకారం నేను కక్ష తీర్చుకుంటాను. ఈ ఉపాయాన్ని బోధించిన ఉలూకానికి నేనెంతో కృతజ్ఞుడను. ఒకని పరిస్థితి కిందా, మీదా అయినప్పుడు అందుకనుగుణమైన సూత్రాలను అవలంబించి కార్యాన్ని చేయడంలో పొరపాటు లేదు. ఒక శత్రు సైన్యం అలసిపోయి ఉన్నప్పుడు.. చెదిరిపోయి ఉన్నప్పుడు.. మనం న్యాయ ప్రకారం ఎదురించడానికి వీల్లేనప్పుడు.. మా సైనికులు పోయి ఉన్నప్పుడు మేమెందుకు మా శత్రువులను నిద్రలో ఉండగా ఎదురించకూడదు? అందులో ఏ పొరపాటూ ఉండదు. యుద్ధనీతిని విడిచి యుద్ధం చేసి జయాన్ని పొందిన పాండవులను ఈ ప్రకారమే శిక్షించి ఓడించగలము. మాకు మరో మార్గం కనిపించడం లేదు" అనే నిశ్చయానికి వచ్చాడు.

అశ్వత్థామ తన హృదయాన్ని గట్టిపరుచుకొని వెంటనే కృపాచార్యుణ్ణి లేపాడు. తన ఆలోచనను చెప్పాడు. కృపుడు ఇది విని నిర్ఘాంతపోయాడు. అశ్వత్థామను ఉద్దేశించి.. "ఇలా ఎన్నడూ జరక్కూడదు. ఇది పూర్తిగా దుర్మార్గం. నిద్రలో ఉన్నవారిని ఎదురించడం అన్నది ఇదివరకెన్నడూ జరగలేదు. క్షత్రియోచిత నడవడికి ఎరుగరానిది" అన్నాడు కృపుడు. మళ్లీ ఆయనే "ఓయీ అశ్వత్థామా! మనం ఎవరికోసం యుద్ధం చేయాలి? ఎవరికోసం యుద్ధం చేశామో అతడు గాయపడి మరణించడానికి సిద్ధంగా ఉన్నాడు. మనం అతి విశ్వాసంతో పోరాడి మన కృతజ్ఞతను చూపాము. అత్యాశపరుడు దుర్యోధనుడి కోసం మనం పూర్తి శక్తితో యుద్ధం చేశాం. తిరుగులేని అపజయం

పొందాము. మనం ఇప్పుడు యుద్ధం సాగించడం ద్వారా కోరేదేమీ లేదు. కనుక నీవు చెప్పినట్లు చేయడం బుద్ధితక్కువ పని. మనం ధృతరాష్ట్రుని వద్దకూ, మహా సాధ్వి గాంధారి వద్దకు వెళ్లి వారి సెలవు మేరకు చేద్దాం. బుద్ధిమంతుడైన విదురుడి అభిప్రాయం కూడా తీసుకుందాం. వారందరూ మనం ఏమి చేయగలమో చెపుతారు" అన్నాడు.

కృపాచార్యుడు మాట్లాడిన తరువాత అశ్వత్థామకు దు:ఖం, ఆగ్రహం, ఉద్రేకం కలిగాయి. అతడు కఠినంగా.. "ప్రతివాడూ తానాలోచించిందే యుక్తమని, అనుసరించదగినదని నిశ్చయంగా ఉంటుంది. ఒకని బుద్ధి విశేషాన్ని బట్టే ఊహా దృష్టి ఉంటుంది. ఈ పాండవులు అతి హేయంగా ప్రవర్తించారు. ఒక అబద్ధమాడి, సర్వమూ యథార్థంగానే ఉంటుందని నమ్మకంగల నా తండ్రిని దారుణంగా చంపేశారు. యుద్ధ నీతిని విడిచి దుర్యోధనుణ్ణి కూడా దెబ్బ తీశారు. పాండవులు చేసిన ఈ దుర్మార్గపు పనులకు నేను చెప్పిందే తగిన ప్రతీకారమని నా మనస్సు నిశ్చయంగా చెపుతోంది. నేనిప్పుడు చెప్పిన కార్యాన్ని నెరవేర్చగలిగినప్పుడే నా రాజుకూ, నా తండ్రికీ రుణం తీర్చినవాణ్ణవుతాను. రాత్రి వేళ కవచాలు విడిచి నిద్రపోతున్న తరుణంలో పాండవులను, ధృష్టద్యుమ్నుణ్ణి చంపుతాను" అని అశ్వద్థామ అనడంతో కృపాచార్యుడు చాలా విచారించాడు.

కృపుడు.. అశ్వత్థామను ఉద్దేశించి, "మనుషుల్లో నీవు గొప్ప పేరు సంపాదించావు. మచ్చలేని నీ సుగుణ సంపత్తి ఈ పనితో మచ్చపడి పాల తెలుపు వస్త్రంపై రక్తపు మరక పడినట్లు కనపడుతుంది. ఎప్పుడైనా నిద్రించేవారిని చంపడం న్యాయం కాదు. ఆ పని మాను" అని అశ్వత్థామకు హితవు పలికాడు. దీనికి అశ్వత్థామ సమాధానమిస్తూ.. "అయ్యా ఏమిటి నీవు మాట్లాడుతున్నది?. అస్త్ర సన్యాసం చేసి యోగాసనంలో ధ్యానపరుడై ఉన్న నా తండ్రిని కసాయిలా నరికి చంపారు. ఒక నీటి బిందువంత ధర్మం కూడా మిగిలి లేదు. భూమిలో దిగిన రథచక్రాన్ని ఎత్తుతున్న కర్ణుణ్ణి అన్యాయంగా చంపేశారు. దుర్యోధనుడితో ద్వంద్వ యుద్ధంలో భీముడు అధర్మంగా నాభి కింద కొట్టి పడేశాడు. మనం ఇంకా అనుసరించడానికి ఏ ధర్మం మిగిలి ఉంది?'' అంటూ తన రథానికి గుర్రాలను కట్టి ప్రయాణానికి బయలుదేరుతున్నాడు. ఆ సమయంలో కృతవర్మ, కృపాచార్యుడు.. "అశ్వత్థామా! ఆగు. ఆ పనికి మేం అంగీకరించం. కానీ నువ్వు చేసే మహా సాహసకృత్యంలో నిన్ను ఒంటరిగా ఉంచబోం. నీవు అనుసరించబోయే మార్గాన్నే మేమూ అనుసరిస్తాము. నీవు పొందే పాపాన్ని మేం కూడా పంచుకుంటాం" అన్నారు. వారు కూడా అశ్వత్థామతో వెళ్లారు.

వారు పాండవ గుడారాలకు, బసలకు వెళ్లారు. తన గుడారంలో ధృష్టద్యుమ్నుడు కవచాన్ని విడిచి నిద్రపోతున్నాడు. అతడు లేచి తనను కాపాడుకోవడానికి ప్రయత్నించేలోపే అతణ్ణి అశ్వత్థామ చంపేశాడు. అంతటితోనే ఆగలేదు. పాంచాలురందరినీ, ద్రౌపదీ కుమారులను నిద్రలోనే ఒకరి తరువాత ఒకర్ని చంపాడు. ఈ ఘోరకృత్యంలో కృతవర్మ, కృపాచార్యుడు కూడా పాలు పంచుకున్నారు. తరువాత వారంతా గుడారాల నుంచి బయటపడి అన్ని గుడారాలకు నిప్పంటించారు. అగ్ని జ్వాలలు మిన్నంటాయి. నిద్రించే వీరులంతా మేల్కొన్నారు. ఆందోళనతో అటూ ఇటూ పరుగెడుతున్నారు. అలాంటి వారందరినీ ఒక్కొక్కరుగా అశ్వత్థామ చంపేశాడు. "మన కృత్యాన్ని నెరవేర్చాము. దుర్యోధనుడు చనిపోకముందే మనం వెళ్లగలిగితే మనం అతడికి ఈ సంతోషకర వార్త చెపుతాము. అతడు సంతోషంగా చనిపోతాడు" అని అశ్వత్థామ అనడంతోనే వారు ముగ్గరూ దుర్యోధనుడి దగ్గరకు వెళ్లారు.

◈

అశ్వత్థామను బంధించి
ద్రౌపది వద్దకు తెచ్చిన
పాండవులు



## అధ్యాయం - 95

# ప్రతీకారం - పగ

**"ఓ**యీ దుర్యోధనా!. నీవింకా జీవించే ఉన్నావు. ఈ వార్త విని ఆనందించు. పాంచాలులందర్నీ చంపేశాము. పాండవుల కుమారులనూ అలాగే చంపేశాము. వారి సేన అంతా నాశనమైంది. వారంతా రాత్రి నిద్రపోతుండగా, మేమీ పని చేశాం. పాండవుల వైపు ఏడుగురే మిగిలి ఉన్నారు. మన వైపున కృపాచార్యుడు, కృతవర్మ, నేనూ మిగిలి ఉన్నాం" అని చనిపోతున్న దుర్యోధనుడికీ విషయాన్ని అశ్వత్థామ చెప్పాడు. దుర్యోధనుడు తన కళ్లను మెల్లిగా తెరిచి కొన ఊపిరితో.."అశ్వత్థామా! గొప్పవాడైన భీష్ముడుగానీ, పరాక్రమశాలియైన కర్ణుడుగానీ చేయలేని పనిని నీవు నాకోసం చేశావు. నాకు ఎనలేని ఆనందాన్నిచ్చావు. నేను సుఖంగా చనిపోతాను" అని దుర్యోధనుడు గొణుగుతూ ప్రాణాలు విడిచాడు.

తన సేనంతా రాత్రి నిద్రలో నాశనం కావడం చూసిన యుధిష్ఠరుడు విషాదానికి లోనయ్యాడు. హృదయ దుర్బలుడయ్యాడు. "జయం కలిగిన తరుణంలోనే మనం పూర్తిగా పరాజితులమయ్యాం. పరాజితులైన వారే నిశ్చయంగా గెలిచారు.

ద్రౌపది కుమారులు కర్ణునితో యుద్ధంలో నిలిచారు. మన అజాగ్రత్త వల్ల వారిని పురుగుల మాదిరిగా చంపేశారు" అని శోకించాడు. ద్రౌపది కూడా శోకంలో మునిగిపోయింది. ఆమె ధర్మరాజు పక్కనచేరి రోదిస్తూ.."ఇలా నా పిల్లలను చంపిన మహాపాపి అశ్వత్థామను సంహరించి పగ తీర్చుకొని ప్రతీకారం చేయగలవారెవరూ లేరా?" అని ఆమె ప్రశ్నించింది. ఆ వెంటనే పాండవులందరూ అశ్వత్థామను వెదకడానికి వెళ్లారు. అతడి కోసం పాండవులు అన్ని దిశలకూ వెళ్లి వెదికారు, చివరికి గంగానది ఒడ్డున వ్యాసుడి వెనుక దాక్కొన్న అశ్వత్థామను చూశారు.

పాండవులనూ, శ్రీకృష్ణుణ్ణీ చూసిన అశ్వత్థామ నెమ్మదిగా ఒక తృణ ఖండాన్ని తీసి నాశనం చేయశక్తిగల మంత్రాన్ని అందులో ప్రవేశపెట్టి ముందుకు వదిలాడు. "ఇది పాండవ వంశాన్ని నిర్మూలించుగాక" అన్నాడు. తక్షణమే ఆ అస్త్రం అభిమన్యుడి భార్య అయిన ఉత్తర గర్భ కుహరంలో చేరింది. ఆ అస్త్ర ప్రభావంతో అపాండవ మవవలసిందేగాని, శ్రీకృష్ణుడు అడ్డుపడి ఉత్తర గర్భంలోని శిశువును తన ప్రభావంతో రక్షించాడు. ఆ శిశువే "పరీక్షిత్తు". పాండవులు అరణ్యాలకు తపస్సుకు పోయిన సమయంలో యుధిష్ఠరుడే అతడికి రాజ్య పట్టాభిషేకం చేశాడు.

తనతోనే పుట్టి, తన తలపై ఉన్న మాణిక్యాన్ని పెరికి దాన్ని భీముడికిస్తూ తాను ఓడిపోయానని అశ్వత్థామ అడవికి పోయాడు. భీముడీ మాణిక్యాన్ని తీసుకొని ద్రౌపది వద్దకు వెళ్లాడు. "దేవతా స్త్రీ, సౌందర్యవతి అయిన ఓ పతివ్రతా తిలకమా! ఇది నీది. నీ కుమారులను చంపినవాడు అణగదొక్కబడ్డాడు. దుర్యోధనుడు నశించాడు. నేను దుశ్శాసనుడి రక్తం తాగాను. నీకు జరిగిన దారుణ అవమానానికి ప్రతీకారం తీర్చుకొని నా రుణాన్ని తీర్చుకున్నాను" అన్నాడు భీముడు. ద్రౌపది ఆ మాణిక్యాన్ని తీసుకొని యుధిష్ఠరుడి వద్దకు వెళ్లి నమస్కరించి.."దోషరహితుడైన ఓ రాజా! దీన్ని నీ కిరీటంలో ధరించడానికి అర్హుడవు" అంది.

## అధ్యాయం - 96

# శాంతిని ఎవరు ఇవ్వగలరు?

**యు**ద్ధం పూర్తయిన తరువాత హస్తినాపురమంతా విచారంలో మునిగింది. స్త్రీలు, పిల్లలు, అందరూ వారి వారి చనిపోయిన దగ్గరి బంధువుల గురించి, ప్రేమాస్పదులైన వారి గురించి ఏడ్పులు వినిపిస్తున్నాయి. రక్తస్పర్శగల బంధువులు చనిపోవడంతో వేలాది మంది స్త్రీలు తన వెంట రాగా ధృతరాష్ట్రుడు యుద్ధభూమికి వెళ్లాడు. భయంకర యుద్ధభూమి కురుక్షేత్రంలో జరిగినదంతా తలుచుకొని బిగ్గరగా ఏడ్చాడు. కానీ ఏడిస్తే ఫలితమేముంటుంది?

సంజయుడు.. ధృతరాష్ట్రుని ఉద్దేశించి.. "ఓ రాజా! తన వాని కోల్పోయిన వారికి ఎన్ని ఉపశమన వాక్యాలు చెప్పినా వారి విషాదాన్ని విస్మరించజాలరు. నీ కుమారుల కోసం వేల కొలది రాజులు యుద్ధంలో ప్రాణాలు అర్పించారు. చనిపోయిన వారికి ఉత్తరక్రియలు చేయడానికి అవసరమైన ఏర్పాట్లు చేయాల్సిన తరుణమిది. యుద్ధంలో చనిపోయిన వారి గురించి విలపించడం తగదు. ఆత్మలు శరీరాన్ని

విడిచిపోయాక బంధుత్వమని, అన్నదమ్ములని, కుమారుడని ఆలోచించాల్సిన అవసరమే లేదు. నీ కుమారులకు నీతో సంబంధమే లేదు. బంధుత్వం మరణంతో అంతమవుతుంది. ప్రాణులు ఎక్కణ్ణుంచి వస్తాయో తెలియదు. మరణంతోనే మరలా అవి ఆ తెలియని ప్రదేశంలో నెలవవుతాయి. వారి కోసం మనం ఎందుకు విచారించాలి? శూరత్వంతో యుద్ధంలో పోరాడి మరణించినవారు ఇంద్రుని అతిథులై వెళ్తారు. జరిగిన దానికి విషాదం చెందితే ధర్మ, ధనరూపంగా పొందేదేదీ లేదు" అన్నాడు.

ఈ ప్రకారంగా దృతరాష్ట్రుని దు:ఖాన్ని శాంతింప చేసే ప్రయత్నం చేశాడు సంజయుడు. వ్యాసుడు కూడా అప్యాయంగా దృతరాష్ట్రుణ్ణి సమీపించి.. "ప్రియ కుమారా, నీకు తెలియనిదీ, నా వల్ల నీవు నేర్చుకోవాల్సిందీ ఏమీ లేదు. ప్రాణమున్నవన్నీ చనిపోవాల్సిందేనని నీకు తెలుసు. ఈ మహాయుద్ధం భూ భారం తగ్గించడానికి వచ్చిందని శ్రీమహావిష్ణువు వేణుకు చెప్పాడు. ఆ కారణం వల్ల ఈ అపప్రద నివారింపరానిది. ఇక నుంచి యుధిష్టరుడే నీ కుమారుడు. అతణ్ణి నీవు ప్రేమించడానికి ప్రయత్నించు. ఈ మార్గంలోనే నీవు విచారాన్ని విడిచి జీవిత భారాన్ని భరించు" అన్నాడు.

ఏడుస్తున్న స్త్రీ సమూహం నుంచి దారి చేసుకొని యుధిష్టరుడు.. దృతరాష్ట్రుణ్ణి సమీపించాడు. దృతరాష్ట్రుడు యుధిష్టరుణ్ణి కౌగలించుకున్నాడు. కానీ ఆ కౌగిలిలో ప్రేమ అన్నది లేదు. భీమసేనుడు తమ దర్శనానికి వచ్చాడని దృతరాష్ట్రుడికి చెప్పారు. ఆయన.. "రావచ్చు' అని చెప్పాడు. వాసుదేవుడు సర్వజ్ఞుడు. ఆతడు మెల్లగా భీముణ్ణి పక్కకునెట్టి దృతరాష్ట్రుడి కోపం తెలిసిన వాడైనందువల్ల ఒక లోహ విగ్రహాన్ని అతని ముందుంచాడు. ధృతరాష్ట్రుడు ఆ లోహ విగ్రహాన్ని గాఢంగా కౌగలించుకున్నాడు. ఆ సమయంలో తన కుమారులందరినీ భీముడు చంపాడని ధృతరాష్ట్రుడు తలచుకోవడంతో ఆ కౌగిలి తీవ్రత పెరిగి..ముక్కలుముక్కలైంది. తక్షణమే దృతరాష్ట్రుడు.."హా, కోపం నన్ను మోసం చేసింది. ప్రియమైన భీముణ్ణి చంపాను" అన్నాడు.

అప్పుడు కృష్ణుడు ధృతరాష్ట్రుడితో.. "ప్రభూ! ఇలాగే జరుగుతుందని నాకు తెలిసి ఈ ప్రమాదాన్ని తప్పించాను. నీవు భీమసేనుణ్ణి చంపలేదు. అతని స్థానంలో నేను ఉంచిన ఓ లోహ విగ్రహం ముక్కలయ్యేలా కౌగలించుకున్నావు. ఈ విగ్రహానికి నీవు చేసిన కృత్యం వల్ల నీ ఆగ్రహం శాంతించాలి. భీముడింకా జీవించే ఉన్నాడు. ధృతరాష్ట్రుడు కొంత అగ్రహం తగ్గించుకొని భీముణ్ణి ఆశీర్వదించాడు. మిగిలిన పాండవులూ ధృతరాష్ట్రుడి ఆజ్ఞను పొంది గాంధారి వద్దకు వెళ్లారు. (గాంధారి తన

భర్త ధృతరాష్ట్రుడు అంధుడైనందువల్ల తానూ నేత్రేంద్రియ కార్యాలను అనుభవించకుండా ఉండటానికి జీవితాంతం తన కళ్లకు ఓ అంగ వస్త్రాన్ని కట్టుకున్న మహాపతివ్రత) వ్యాసుడు గాంధారి వద్ద ఉన్నాడు. ఆమెతో వ్యాసుడు.. "పాండవులను ఆగ్రహించకు. యుద్ధం ఆరంభమైన కాలంలో.. ఎక్కడ ధర్మముంటుందో అక్కడ జయం ఉంటుందని వారితో నీవు అన్నావు. అలాగే జరిగింది. జరిగిన వాటిపైనే మనసు లగ్నం చేసి ఆగ్రహం పెంచుకోకూడదు. ఇప్పుడే నీ పూర్తి సహనాన్ని, ధైర్యాన్ని ప్రదర్శించాలి" అన్నాడు. అందుకు గాంధారి.."భగవాన్! పాండవుల విజయానికి నేను ఈర్ష్య పడలేదు. నా పుత్రుల మరణం వల్ల కలిగిన విషాదం నా బుద్ధిని నశింపచేసిందనటం మాత్రం సత్యం. ఈ పాండవులు కూడా నా కుమారులే. దుశ్శాసనుడు, శకుని మన వంశాన్ని నాశనం చేయడానికి కారకులని నాకు తెలుసు. అర్జునుడు, భీముడు నిందలేని వారు. నా బిడ్డల గర్వంతోనే ఈ యుద్ధం వచ్చింది. కనుక నా కుమారులకు తగిన విధంగానే జరిగింది. ఈ విషయంలో పాండవులపై నేనెలాంటి నిందారోపణా చేయను. కానీ వాసుదేవుని సమక్షంలో భీముడు.. దుర్యోధనుణ్ణి యుద్ధానికి పిలిచాడు. వారు ద్వంద్వ యుద్ధం చేశారు. దుర్యోధనుడు తన కన్నా బలవంతుడని, ద్వంద్వ యుద్ధంలో అజేయుడని తెలుసుకొని భీముడు నాభి దిగువ కొట్టి దుర్యోధనుణ్ణి చంపాడు. వాసుదేవుడు చూస్తూనే ఉన్నాడు. ఈ పని చాలా అన్యాయమైనది. ఈ నేను క్షమించలేనిది ఈ ఒక్క కృత్యమే" అని బాధపడింది.

గాంధారి వాక్యాలను విన్న భీముడు అందుకొని.. "అమ్మా! యుద్ధంలో నన్ను రక్షించుకోవడానికి నేను అలా చేశాను. అది తప్పో ఒప్పో? నీవు మాత్రం నన్ను సహించి దయతో చూడు. ద్వంద్వ యుద్ధంలో దుర్యోధనుడు నిజంగా అజేయుడే. అందుచేత నిస్సంశయంగా అన్యాయమైన ఆ తప్పు పనిని నన్ను కాపాడుకోవడం కోసం చేశాను. దుర్యోధనుడు.. యుధిష్టరుణ్ణి జూదానికి పిలిచి మోసం చేశాడు. నీ కుమారునితో మేం చాలా హింసలు పడ్డాం. తాను అక్రమంగా ఆక్రమించిన రాజ్యాన్ని మాకు ఇవ్వలేదు. మహాసాధ్వి ద్రౌపది విషయంలో నీకుమారులు ఏమి చేశారో నీకూ తెలుసు. ఆ దుర్మార్గానికి పాల్పడే సమయంలోనే నేను మీ కుమారులను చంపి ఉంటే, నీవు మమ్మల్ని నిందించేదానవే కాదు. ధర్మరాజు ప్రతిజ్ఞకు కట్టుబడి బహు కష్టంతో మేము సముదాయించుకున్నాం. కానీ తరువాత యుద్ధం చేసి అప్పటి రుణాన్ని తీర్చుకున్నాం. తల్లీ! నీవు నన్ను క్షమించాలి" అని సాధారణంగా ఉండే మనస్థత్వానికి భిన్నంగా భీముడు ఎంతో నమ్రతతో సమాధానమిచ్చాడు. గాంధారి అందుకొని.. "ప్రియ కుమారా! నా నూరుగురు కుమారుల్లో ఒక్కరిని మిగిల్చి మిగిలిన వారిని

చంపి నీ కోపాన్ని తీర్చుకొని ఉంటే.. నేను, నా అంధరాజు జీవిత శేషాన్ని ఆ శేషించిన వారినే చూసుకుంటూ గడిపేసి ఉండేవాళ్లం. ధర్మపుత్రుడేడీ?. అతన్ని పిలువు" అని ఆమె అడిగింది.

ఈ మాటలు విన్న యుధిష్టరుడు వణుకుతూ, చేతులు జోడించి గాంధారిని సమీపించాడు. ఆమె ముందు వంగి నమస్కరించాడు. మెల్లగా గొంతు పెగుల్చుకుని.. "మహారాణీ! నీ కుమారులను చంపిన క్రూరుడైన యుధిష్టరుడు, నీ శాపాన నీ ముందు నిలబడ్డాడు. గొప్ప పాపం చేసిన నన్ను శపించు. నేను జీవితాన్నిగానీ, రాజ్యాన్నిగానీ లక్ష్య పెట్టను" అంటూ ఆమె పాదాలను స్పృశించాడు. గాంధారి ఒక వేడి నిట్టూర్పు విడిచి మౌనంగా ఉన్నది. ఆమె తన తలను పక్కకు తిప్పుకుంది. ఎందుకంటే, తాను కళ్లచుట్టూ ధరించిన వస్త్రం ద్వారా ఆమె దృష్టి నేలపై ఉన్న యుధిష్టరుడిపై పడితే ఆ సమయంలోనే అతడి పాదాలు నల్లగామాడి పోయేవని కవి రాశాడు. కుమారుల మరణంతో కోప పూరితమైన గాంధారి కోప తీవ్రత అర్జునుడికి తెలిసినందున.. అతడు వాసుదేవుడి వెనుక దాగాడు. బుద్ధిమంతురాలు, మంచి గుణవంతురాలు అయిన గాంధారి పాండవులందరినీ ఆశీర్వదించి వారిని కుంతి వద్దకు పంపింది. తన కుమారులు చనిపోయారని ఏడుస్తున్న ద్రౌపది వైపు గాంధారి చూసి.. "బిడ్డా! విచారించకు. నీకూ, నాకూ ఎవ్వరు శాంతినివ్వగలరు?. నా తప్పు వల్లే ఈ వంశం పూర్తిగా నశించింది" అని ఎంతో ఆవేదనగా అన్నది.

## అధ్యాయం - 97

# యుధిష్టరుడి విషాదం

పాండవులు ఒక నెలరోజులపాటు గంగానది ఒడ్డున బస చేశారు. చనిపోయిన వీరుల ఆత్మశాంతి కోసం తిలోదక ప్రదానాలు చేస్తున్నారు. ఒకనాడు నారదుడు.. యుధిష్టరుడి ఎదుట ప్రత్యక్షమై, "కుమారా! శ్రీకృష్ణుడి దయవల్ల, అర్జునుడి ప్రభావం వల్ల, నీ ధర్మగుణం వల్ల యుద్ధంలో నీవు జయం పొందావు. నీవీ భూమంటికీ చక్రవర్తివి. నీవు ఆనందంగా ఉన్నావా?" అని అడిగాడు. యుధిష్టరుడు నారదుణ్ణి ఉద్దేశించి.."భగవాన్! నిజమే. రాజ్యం నాశనమైంది. నా బంధువులందరూ మరణించారు. ప్రేమాధికులైన కుమారులు చనిపోయారు. ఈ జయం అనేది నాకొక గొప్ప పరాజయం వలే కనిపిస్తోంది. ఓ నారదా! ఒక గొప్ప కొండ వలే ఘనమైన కీర్తి కలిగిన, ఎవరి ప్రతాపానికి ఈ ప్రపంచమంతా అద్భుతం చెందిందో, అలాంటి సోదరుడైన కర్ణుణ్ణే శత్రువని చంపాము. అన్నదమ్ములను చంపుకొనే ఈ భయంకర పాపకార్యం.. మా సంపదలకు మేము ఆశించిన పాపిష్టి ఆశ వల్లనే జరిగింది.

అతడు అలాగాక, మా తల్లికి ఇచ్చిన వాగ్దానం సుస్థిర పరచుకొని మమ్మల్ని చంపకుండా విడిచి పెట్టాడు. నేనొక పాపిష్టిని. నా అన్ననే చంపుకున్న నీచుణ్ణి. ఈ తలంపు వల్లనే నా మనస్సు మిక్కిలి బాధపడుతున్నది. కర్ణుని పాదాలు మా తల్లి పాదాలనే పోలి ఉన్నాయి. ఆ మహా సభా మందిరంలో గొప్ప అపచారమూ, పరాభవమూ జరిగినప్పుడు నా కోపం హెచ్చింది. కానీ కుంతీ దేవి పాదాలను పోలివున్న అతని పాదాలను చూసిన వెంటనే నేనా కోపమంతటినీ అణుచుకున్నాను. ఆ సంగతి ఇప్పుడు గుర్తుకొచ్చి విషాదం అధికమౌతోంది" అంటూ యుధిష్టరుడు ఒక నిట్టూర్పు విడిచాడు. నారదుడు.. యుధిష్టరుడికి కర్ణుడి చరిత్ర అంతా చెప్పి, అతనికి అప్పుడు కలిగి ఉన్న శాపాల గురించి కూడా వివరించాడు. ఒకప్పుడు కర్ణుడు తనకంటే అర్జునుడు విలువిద్యలో అధికుడని తలచి, ద్రోణుడి వద్దకు వచ్చి, తనకు బ్రహ్మాస్త్ర ప్రయోగ, ఉపసంహారాలను నేర్పమని కోరాడు. నిర్దోషి అయిన బ్రాహ్మణుడికి, గొప్ప తపస్సు చేసి పవిత్రుడైన క్షత్రియుడికి తప్ప, ఇతరులకు బ్రహ్మాస్త్ర వివరాలు తాను ఉపదేశించడానికి అర్హత లేదని ద్రోణుడు కర్ణుడుతో చెప్పాడు. దీంతో కర్ణుడు మహేంద్ర పర్వతానికి వెళ్లి, తాను బ్రాహ్మణుడినని, పరుశురాముడితో అబద్ధం చెప్పి అతని శిష్యుడయ్యాడు. పరుశరాముడి వల్ల విలువిద్య బాగా నేర్చుకొని చాలా అస్త్రాలను కూడా పొందాడు.

ఒకనాడు కర్ణుడు.. పరుశురాముడి ఆశ్రమ సమీపాన, తన ధనుర్విద్యను సాధన చేస్తుండగా, ఒక బ్రాహ్మణుని గోవుకు బాణం తగిలి అది చనిపోయింది. ఆ బ్రాహ్మణుడు ఆగ్రహించి కర్ణుణ్ణి శపించాడు. 'యుద్ధంలో నీ రథ చక్రాలు బురదలో కూరుకుపోయి.. నీవల్ల చనిపోయిన ఆవు వలే నీవూ చంపబడతావు' అని శపించాడు. పరుశురాముడు కర్ణుడంటే మిక్కిలి ప్రేమతో ఉండేవాడు. కనుక తనకు తెలిసిన విలువిద్య అంతా, బ్రహ్మాస్త్ర ప్రయోగ, ఉపసంహారాలతో కూడా పూర్తిగా నేర్పాడు. ఒకనాడు తన శిష్యుడైన కర్ణుడు బ్రాహ్మణుడు కాదని తెలుసుకున్నాడు. అది ఇలా జరిగింది: ఒక సాయంకాలం కర్ణుడి ఒడిలో గురువైన పరుశురాముడు నిద్రిస్తుండగా, కర్ణుడి తొడలో ఒక కీటకం చిన్న రంధ్రం చేసి దూరిపోయింది. అందువల్ల కలిగిన గొప్ప బాధను భరిస్తూ.. తన గురువుకు నిద్రాభంగం కలుగుతుందేమోననే భయంతో కదలక, మెదలక కర్ణుడున్నాడు. కర్ణుడు తొడకు పడిన రంధ్రం ద్వారా వెచ్చని రక్తం స్రవిస్తూ ఉండటంతో పరుశురాముడికి అది తగిలి, మెలుకువ వచ్చింది. ఏమి జరిగిందో చూసి పరుశురాముడు ఆగ్రహించాడు. 'నీవు క్షత్రియుడవు కాకపోతే కదలకుండా ఈ శరీర బాధను భరించి ఉండలేవు. నిజం చెప్పు. నీవు బ్రాహ్మణుడివి కావు. నీవు నీ గురువును దగా చేశావు. మూర్ఖుడా! నీకు తుది కాలం వచ్చేటప్పుడు నీ అస్త్ర

జ్ఞానం గుర్తు రాకుండా ఉండుగాక. నీవు నా వద్ద నేర్చినదంతా నీకు ఉపయోగించదుగాక" అని శపించాడు. పరుశరాముడికి క్షత్రియులపై ఉన్న ఆగ్రహం అందరికీ తెలిసిందే. ఇక కర్ణుడు క్షత్రియుడని తెలిసిన వెంటనే పై విధంగా శపించాడు.

కర్ణుడు ధర్మాలు బాగా చేసేవాడు. ఒకనాడు అర్జునుడి తండ్రి అయిన ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో కర్ణుడి వద్దకు వచ్చి అతని సహజ కవచాన్ని, కుండలాలను తనకు ఇమ్మని కోరాడు. వెంటనే కర్ణుడు వాటిని ఊడబెరికి అతడికి ఇచ్చాడు. అప్పటినుంచి కర్ణుడి బలం తగ్గింది. నా ఐదుగురు సోదరుల్లో ఒక్కరినే చంపుతాను అని కర్ణుడు కుంతికి మాట ఇచ్చాడు. పరుశురాముడి కోపమూ, శాపమూ వల్ల తనకు రథ సారథ్యం వహించిన శల్యుడు.. కర్ణుడి ప్రభావాన్ని చులకన చేసి, వాసుదేవుని మహిమలను పొగుడుతూ, కర్ణుణ్ణి నిరుత్సాహపరచడం వంటివి అతణ్ణి నాశనం చేశాయి. అందువల్ల కర్ణుడి మరణానికి నీవే కారణమని నీవు విచారించకు" అని నారదుడు సోదాహరణంగా చెప్పాడు.

అయినప్పటికీ యుధిష్టరుడు శాంతించలేకపోయాడు. కుంతీదేవి అందు కుని.."కుమారా కర్ణుడి చావుకు నీవే కారకుడివని విచారించకు. తన తండ్రి అయిన సూర్య దేవుడే అతనితో వాదించాడు. చెడు హృదయుడైన దుర్యోధనుణ్ణి విడిచి నీతో కలవమని చెప్పాడు. నేను కూడా ప్రయత్నించాను. కానీ మా మాటలను వినలేదు. తన మరణాన్ని తానే తెచ్చుకున్నాడు" అని చెప్పింది. దాంతో యుధిష్టరుడు.. "మా నుంచి అతని జన్మ చరిత్రను దాచి మమ్మల్ని దగా చేశావు. కావున ఈ పాపానికి నీవే కారణమయ్యావు. ఇక్కణ్ణుంచి స్త్రీల వద్ద రహస్యం దాగకపోవుగాక" అని శపించాడు. తన సోదరుని చంపానన్న విషాదాతిశయంతో యుధిష్టరుడు అందరు స్త్రీలనూ శపించాడని కవి అభిప్రాయం.

◈

## అధ్యాయం - 98

# యుధిష్టరునికి ఓదార్పు

**చ**నిపోయిన తన బంధువులందరినీ తలుచుకోవడంతో యుధిష్టరుని హృదయ పరితాపం రోజురోజుకూ పెరిగిపోతోంది. అతి తీవ్రమైన పశ్చాతాప బుద్ధితో ప్రపంచ సంబంధాలను వీడి.. తన పాప పరిహారార్థం అడవులకు వెళ్లి తపస్సు చేయాలని భావించాడు. తన తమ్ముళ్లను ఉద్దేశించి.. "రాజ్య పాలన, ప్రాపంచికానందాల్లో ఆనందం, మంచి.. ఏదీ నాకు కనిపించడం లేదు. ఈ భూమిని మీరే ఏలుకొని నేను అడవులకు పోవడానికి వదిలేయండి" అన్నాడు. అర్జునుడు.. గృహస్థ ధర్మం, దాని ఆధిక్యత, సన్యాసాశ్రమ స్వీకారం చేయకుండానే ప్రపంచానికి జరిగే మేలు గురించి చెప్పాడు. భీముడు కూడా కాస్త కఠినంగానే మాట్లాడాడు. "అయ్యో శాస్త్ర గ్రంథాలన్నీ కంఠతా పఠించి వాటి అర్థం తెలియని మూఢుని వలే నీవు మాట్లాడుతున్నావు. సన్యాసం క్షత్రియ ధర్మం కాదు. క్షత్రియుని కర్మ.. జీవనాన్ని చురుగ్గా చేస్తూ, కార్యాల్లో నిమగ్నమై ఉండాలి, తనకు ఏర్పడిన పనులు చేయాలి. అంతేగాని కర్మలనే విడిచి

అడవికి పోవడం కాదు” అన్నాడు. కర్మమార్గాన వెళ్లడమే మంచిదనడం, సన్యాస మార్గం కష్టాలతో నిండి ఉంటుందని చెప్పడం చూస్తే ధర్మపుత్రుని అభిప్రాయం సరిగా లేదని నకులుడు వాదించాడు. సహదేవుడు కూడా ఇలాగే వాదించి బతిమిలాడాడు. “నీవు నా తల్లి, తండ్రి, గురువు. నా అన్నవు. మమ్మల్ని విడిచి పోవద్దు. మాతో ఏకీభవించు” అన్నాడు సహదేవుడు. ద్రౌపది కూడా మాట్లాడింది. “మనము దుర్యోధనుణ్ణి, అతని పరివారాన్ని చంపడం యుక్తమే. దానికిప్పుడు పశ్చాతాపమెందుకు?. రాజు విద్యుక్త ధర్మమైన పనుల్లో న్యాయం చేయడం, శిక్ష విధించడం ఉన్నాయి. వాటిని తప్పకూడదు. అవి రాజు చేయాల్సిన పనుల్లో ముఖ్యమైనవి. దుర్మార్గులకు తగిన శిక్ష విధించావు. మనం పశ్చాతాప పడాల్సిన హేతువేదీ లేదు. ధర్మాన్ని అనుసరించి భూమిని పాలించే భారాన్ని వహించడమే నీ విద్యుక్త ధర్మం. విచారించడం చాలించు” అన్నది. తరువాత వ్యాసుడు చాలా విషయాలు యుధిష్టరుడితో మాట్లాడాడు. అతను చేయదగిన పని ఏదో, పూర్వపు గాథలను కూడా ఉదహరించి చెప్పాడు, పట్టణానికి వెళ్లి రాజ్య భారం వహించి, పాలించమని హితవు పలికాడు.

హస్తినాపురంలో యుధిష్టరుడు రాజ్యానికి పట్టాభిషిక్తుడయ్యాడు. రాచకార్యాలను నిర్వహించక పూర్వం .. ప్రాణావసాన కాలం ఎదురు చూస్తూ.. అంపశయ్యపై పడి ఉన్న భీష్ముని వద్దకు యుధిష్టరుడు వెళ్లాడు. ఆయన ఆశీర్వచనాలు పొందాడు. ధర్మాన్ని గురించి ఆయన వద్ద శిక్షణ పొంది వెళ్లాడు. భీష్మాచార్యుడు యుధిష్టరుడికి ఇచ్చిన ఈ ధర్మశిక్షణంతా మహాభారతంలో ప్రసిద్ధికెక్కిన ‘శాంతి పర్వం’లో ఉంది. ఈ ధర్మ వివరణలు పూర్తయిన తరువాత భీష్ముడి ఆత్మ ఆయన నుంచి వెళ్లిపోయింది.

యుధిష్టరుడు గంగానదికి వెళ్లి..గతించిన ఆయన ఆత్మశాంతి నిమిత్తం శాస్త్రోకంగా తిల తర్పణం మొదలైన కర్మలు చేశాడు. ఈ కర్మలన్నీ అయిన తరువాత యుధిష్టరుడు నది ఒడ్డున గట్టుపైకెక్కి నిలబడ్డాడు. ఆ సమయంలో జరిగిన పనులన్నీ ఒక్కసారిగా గుర్తుకొచ్చాయి. మరలా తీవ్ర విషాదం చెంది ఆ గట్టుపైనే స్మృతి తప్పి పడిపోయాడు. భీముడు అన్న వద్దకు వెళ్లి లాలిస్తూ అనునయ వాక్యాలు పలికాడు. ధృతరాష్ట్రుడు వచ్చి.. “నీవీ ప్రకారం విచారించ తగదు. లే. నీ తమ్ముళ్లు, స్నేహితుల సహాయంతో రాజ్య పాలన చెయ్యి. ఇక నీవు చేయాల్సింది రాజ్యార్హమైన పాలన చేయడమే. విషాదాన్ని నాకూ, గాంధారికీ వదిలేయి. వీర పురుషోచితంగా, యుద్ధంలో మీరు జయించారు. ఈ జయానికి సంబంధించిన కార్యాలన్నీ నీకోసం వేచి ఉన్నాయి. నేను బుద్ధి విహీనుడనై విదురుడి మాటలు వినక పెద్ద పొరపాటు చేశాను.

దుర్యోధనుడి అజ్ఞాన వాక్యాలను విని దగా పడ్డాను. కలలో చూసిన బంగారంలా ఆ ప్రకాశమంతా పోగా నా నూరుగురు కుమారులు తెలియని ప్రపంచంలోకి మాయమయ్యారు. ఇప్పుడు నీవే నాకు కుమారుడివి. విచారించకు" అన్నాడు.

◈

## అధ్యాయం - 99

# ఈర్ష్య

**భీ**ష్ముని అంత్యక్రియలు అయ్యాక వ్యాస మహర్షి యుధిష్ఠరుడికి బృహస్పతి జీవిత చరిత్ర గురించి వివరించాడు. మనుషుల్లో మహా బుద్ధిమంతుల్లో కూడా ఈర్ష్య జనించి, దాని ద్వారా చాలా బాధను అనుభవిస్తారు. దేవతల గురువైన బృహస్పతి సర్వజ్ఞుడు. అన్ని వేదాలూ, అన్ని శాస్త్రాలూ పూర్తిగా తెలిసినవాడు. అయినా అతడుకూడా నీచమైన ఈర్ష్యకు లోనై అవమానం చెందాడు. బృహస్పతికి సంవర్తనుడనే తమ్ముడున్నాడు. ఇతడు చాలా తెలిసినవాడు. మంచి స్వభావం కలవాడు కూడా. ఈ తమ్ముడికున్న సుగుణ సంపత్తిని చూసి బృహస్పతికి ఈర్ష్య పుట్టింది. బృహస్పతి సంవర్తుణ్ణి అనేకవిధాల కష్టపెడుతుండేవాడు. ఈ పరిస్థితిని భరించలేక సంవర్తుడు ఒక వింత మనిషిలా ప్రవర్తిస్తూ, అక్కడ నుంచి ఇక్కడకు, ఇక్కడ నుంచి అక్కడకూ తిరుగుతూ అన్న పెట్టే బాధలను తప్పించుకుంటూ జీవిస్తున్నాడు. ఇక్ష్వాకు వంశస్థుడైన మురుత్తుడు అనే రాజు గొప్ప తపస్సు చేసి శివుణ్ణి మెప్పించి ఆయన అనుగ్రహంతో

హిమాలయ ప్రాంతంలో ఒక బంగారు గనిని పొందాడు. ఇలా ఆయన ధనం వృద్ధి అయ్యింది. ఆ రాజు ఒక యజ్ఞం చేయడానికి సిద్ధపడ్డాడు. ఈ యజ్ఞాన్ని నడపమని మరుత్తుడు బృహస్పతిని కోరాడు. యజ్ఞమైన తరువాత మరుత్తుడు అధికుడు అవుతాడని తలచి బృహస్పతి యజ్ఞాధ్వర్యానికి అంగీకరించలేదు. మరుత్తుడు ఎంత వేడుకున్నా.. బృహస్పతి ఒప్పుకోలేదు. తర్వాత సంవర్తుని ఉనికిని తెలుసుకొని మరుత్తుడు అతని వద్దకు వెళ్లి తన యజ్ఞ భారానికి పూనుకోవాలని కోరాడు. మొదట్లో సంవర్తుడు ఈ గొప్ప గౌరవనీయమైన భారాన్ని భరించడానికి ఇష్టపడలేదు. కానీ చివరికి అంగీకరించాడు. దీంతో బృహస్పతికి తన తమ్ముడిపై గతం కంటే మరింత ఈర్ష్య కలిగింది. బృహస్పతి ఇలా ఆలోచించాడు. 'నాకు శత్రువైన ఈ సంవర్తుడు.. మరుత్తుడి యజ్ఞానికి ఆధ్వర్యం వహిస్తున్నాడు. నేనిప్పుడేమి చేయాలి? ఇలా బృహస్పతి ఆలోచనలో పడి ఈర్ష్యాధికంతో అతడి ఆరోగ్యం చెడింది. త్వరలో అతని శరీర స్థితి పాడై నీరసించి శక్తి హీనుడవుతున్నాడు. ఆ విషయం ఇంద్రుడికి తెలిసింది. ఆయన తన గురువైన బృహస్పతి వద్దకు వెళ్లి.. "ప్రభూ! నీవెందుకు ఇలా అనారోగ్యం పాలయ్యావు. దు:ఖించి ఇలా నీరసించడం ఎందుకు జరిగింది. మీకు బాగా నిద్ర పడుతోందా? సేవకులు నీ ఆజ్ఞను మన్నిస్తున్నారా? దేవతలు మీ పట్ల గౌరవభావంతో ఉన్నారా? లేక ఇందులో లోపాలు ఏమైనా ఉన్నాయా?" ఇలా ఇంద్రుడు బృహస్పతిని ఆత్రుతగా అడిగాడు.

దానికి బృహస్పతి బదులిస్తూ.. "దేవరాజా! నేను మంచి పర్యంతకంపైన సకాలంలోనే పడుకుంటున్నాను. నౌఖరులు కూడా చాలా భక్తితో నాకు సేవ చేస్తున్నారు. దేవతలు నాకు ఇచ్చే మర్యాదల్లోగాని, గౌరవంలోగాని కొరతేమీ లేదు" అని ఇకపై బృహస్పతి మాట్లాడలేకపోయాడు. అతడి అలసట, హృదయ బాధ అధికంగా ఉంది. ఇంద్రుడు మరలా ప్రేమతో బృహస్పతిని ఉద్దేశించి.. "మీరు ఎందుకు విషాదంలో ఉన్నారు? మీరేల సన్నగిల్లి పాలిపోయి ఉన్నారు? మీ మనస్సును బాధించేదేమిటి? చెప్పండి?" అని అడిగాడు. తరువాత ఇంద్రుడికి బృహస్పతి అంతా చెప్పాడు. "సంవర్తుడొక మహా యజ్ఞానికి ఆధ్వర్యం వహిస్తున్నాడు. ఇదే నన్ను బాధిస్తోంది. నీరసపెట్టి నన్ను సన్నగిల్లచేస్తోంది. నేనేమి చేయడానికి సమర్థత లేనివాణ్ణయ్యాను" అన్నాడు బృహస్పతి. ఇంద్రుడు అమిత ఆశ్చర్యం చెందాడు. "విద్యావంతుడైన ఓ బ్రాహ్మణోత్తమా! మీరు కోరి అనుభవింప తగనిది ఏదీ లేదు. మీరు బుద్ధిమంతులు. చదువుకున్నవారు. మిమ్ములను దేవతలే తమ ఆచార్యుడిగా, మంత్రిగా ఎంచుకున్నారు. సంవర్తుడు మీకేమి హాని చేయగలడు? అతని వల్ల మీకేమీ నష్టమనేదే లేదు. ఎందుకు మీరు అనవసరంగా, అదీ కేవలం ఈర్ష్యవల్ల ఈ శరీర

రుగ్మతను తెచ్చి పెట్టుకున్నారు.

ఇంద్రుడంతటి వాడు మనిషిలా తన స్వంత చరిత్రను మరిచి ఇతరులకు మంచి నడవడిక గురించి సలహా ఇవ్వడం వింతగానే ఉంది. గానీ బృహస్పతే ఇంద్రుని విషయమై చరిత్రను ఎత్తాడు.. "నీ శత్రువు ప్రభావం నీవు చూస్తుండగానే అభివృద్ధి చెందుతుంటే చూసి సంతోషిస్తావా? నీవే నా పరిస్థితుల్లో ఉంటే ఎలా ఉండేవాడివో ఊహించుకో. ఈ సంవర్తుడి నుంచి నన్ను రక్షించు. అతణ్ణి అణగదొక్కే మార్గాన్ని నీవు ఆలోచించాలి" అన్నాడు బృహస్పతి. ఇంద్రుడు అగ్నిని పిలిచాడు. ఆయనను ఉద్దేశించి.."నీవు వెళ్లి ఎలాగైనా మరుత్తుడు నిర్వహించే యజ్ఞాన్ని నిలుపుదల చెయ్యి" అని చెప్పడంతో అగ్నిదేవుడు అలాగే అని చెప్పి వెళ్లాడు. అతడు అరుస్తూ వెళ్తూండటంవల్ల మార్గంలో చెట్ల తీగలు మండాయి. భూమి కంపించింది. అగ్ని దేవుడు.. మరుత్తుని ఎదుట తన స్వరూపంతో ప్రత్యక్షమయ్యాడు. తనకు అగ్నిదేవుడు సాక్షాత్కరించడంతో ఎంతో ఆనందభరితుడయ్యాడు. ఈ అగ్నిదేవుడికి తగిన మర్యాదలను, సపర్యలను చేయవలసిందిగా తన భృత్యులను ఆదేశించాడు. "ఆయనకు అర్ఘ్యాసనం ఇవ్వండి. పాద ప్రక్షాళన చేసి అర్హమైన బహుమతులను ఇవ్వండి" అని ఆజ్ఞాపించాడు. అగ్నిదేవుడుకి అన్ని మర్యాదలూ సక్రమంగా జరిగాయి.

అగ్ని తాను వచ్చిన కార్యాన్ని చెప్పాడు. "ఈ సంవర్తుణ్ణి విడిచిపెట్టు. నీకు అధ్వర్యుడు కావాల్సి వస్తే బృహస్పతిని నీకు సహాయంగా తీసుకువస్తాను" అన్నాడు అగ్నిదేవుడు. ఇది విన్న సంవర్తుడికి కోపం వచ్చింది. బ్రహ్మచర్య వ్రతాన్ని బహుదీక్షతో నిర్వహిస్తున్న బ్రహ్మచారి ఆగ్రహం బహుశక్తి కలిగి ఉంటుంది. సంవర్తుడు.. అగ్నిదేవుణ్ణి ఉద్దేశించి.. "ఈ ప్రేలాపన మాను. నా ఆగ్రహం నిన్ను దహించకుండా చూసుకో. అగ్ని వస్తువుల్ని బూడిద చేస్తుంది. కానీ బ్రహ్మచారి అన్నిటినీ దహిస్తాడు" అని ఆగ్రహంగా అన్నాడు. అగ్ని ఆకువలే వణికాడు. అక్కణ్ణుంచి త్వరగా పారిపోయాడు. అగ్ని.. ఇంద్రుడి వద్దకు వెళ్లి అంతా చెప్పాడు. ఇంద్రుడు దాన్ని నమ్మలేకపోయాడు. "ఓ అగ్నీ, నీవు ప్రపంచంలోని వస్తువులన్నిటినీ దహించేవాడివి. నిన్నేది హింసించి దహిస్తుంది?. సంవర్తుని ఎర్రబడ్డ కళ్లు నిన్ను బూడిద చేస్తాయనే కథ ఏమిటి?" అడిగాడు ఇంద్రుడు.

"దేవేంద్రా!. బ్రహ్మభావం, బ్రహ్మచర్య వ్రతం వల్ల పుట్టే శక్తి నీకు తెలియంది కాదు. బ్రహ్మ ప్రభావంగల వారి ఆగ్రహానికి నీవు ఎలా కష్టాలను ఎదుర్కొన్నావో గుర్తుతెచ్చుకో" అని ఇంద్రుడికి గుర్తు చేశాడు అగ్ని. ఇంద్రుడు మరేమీ మాట్లాడలేదు. ఒక గంధర్వుణ్ణి పిలిచి అతడితో.. "ఇప్పుడు అగ్ని తాను చెప్పిన కార్యాన్ని నెరవేర్చలేకపోయాడు. నీవు నా పక్షాన దూతగా మరుత్తుడి వద్దకు వెళ్లు. సంవర్తునుణ్ణి

వదిలేయమని నేను చెప్పానని మరుత్తుడికి చెప్పు. అతడా పని చేయకపోతే అతడు నా అనుగ్రహానికి పాత్రుడై నశిస్తాడని కూడా చెప్పు" అని ఇంద్రుడు చెప్పాడు. గంధర్వుడు ఆ ప్రకారమే మరుత్తుడి వద్దకు వెళ్లాడు. ఇంద్రుడి సందేశాన్ని అతడికి చెప్పాడు. మరుత్త రాజు గంధర్వుడి మాటలను అంగీకరించలేదు. "నన్ను నమ్మిన స్నేహితుణ్ణి విడనాడే మహాపాతకాన్ని నేను చేయలేను. నేను సంవర్తుణ్ణి విడిచిపెట్టను" అని నిశ్చయంగా చెప్పాడు మరత్తుడు. "ఓరాజా! ఇంద్రుడు తన ఆయుధాన్ని నీపై ప్రయోగిస్తే నీవు ఇంకా ఎలా జీవిస్తావు?" అని గంధర్వుడు అంటుండగానే మేఘ గర్జన వినవచ్చింది. ఇంద్రుడు వస్తున్నాడని తలచి ప్రజలంతా భయపడ్డారు. మరుత్తుడు చాలా భయపడి సంవర్తునుణ్ణి శరుణు కోరాడు. "భయపడకు'' అని సంవర్తనుడు మరుత్తడుకి భరోసా ఇచ్చి..తన బ్రహ్మ చర్య వ్రత ప్రభావాన్ని కార్యరూపాన ప్రయోగించాడు. యుద్ధం చేయాలని వచ్చిన ఇంద్రుడు ఔదార్యంతో సఖ్యతకు వచ్చాడు. ఇంద్రుడు యజ్ఞ ప్రధాన యజ్ఞ దేవత అవడంతో తానే స్వయంగా యజ్ఞంలో పాల్గొన్నాడు. అతడు యజ్ఞాహూతులకు తన స్వరూపాన్ని చూపాడు.

ఈర్ష్య అన్నది మహాపాపిష్టిది. అది ప్రపంచంలో ఓ రోగంలా వ్యాప్తి చెందింది. విద్యలో సరస్వతిని జయించిన బృహస్పతే ఈర్ష్యకు లోనైనప్పుడు ఇక సామాన్య మానవుల గురించి ఏమని చెప్పాలి?

◈

## అధ్యాయం - 100

# ఉతంగుడు

**యు**ద్ధం పూర్తయిన తరువాత కృష్ణుడు పాండవులను తీసుకుని ద్వారకకు బయలుదేరాడు. మార్గం మధ్యలో ఒక విప్రుడైన తన బాల్య స్నేహితుడు ఉతంగుణ్ణి కలుసుకున్నాడు. కృష్ణుడు ఆగి తన రథాన్ని దిగి ఆ బ్రాహ్మణుడికి నమస్కరించాడు. ఉతంగుడి వందనాలు స్వీకరించి కుటుంబ క్షేమ సమాచార ప్రశ్నలు అడిగాడు. "ఓయీ మాధవా! నీ బావలైన పాండవులూ కౌరవులూ అన్యోన్యంగా అన్నదమ్ములవలే ప్రేమించుకుంటున్నారా?. వారు క్షేమంగా వృద్ధి పొందుతున్నారా?" అనడిగాడు. ఈ అమాయకుడు, తపశ్శాలియైన ఉతంగుడు జరిగిన యుద్ధం గురించి విని ఉండలేదు కాబోలు. కృష్ణుడు ఆ బ్రాహ్మణుడి ప్రశ్నకు ఆశ్చరపోయాడు. కొంతసేపు అతడి ప్రశ్నకు ప్రత్యుత్తరం ఇవ్వలేకపోయాడు. ఏమి చెప్పాలా అని ఆలోచించాడు. తరువాత నెమ్మదిగా జరిగిన యుద్ధ చరిత్ర అంతా అతడికి వివరించాడు.

"అయ్యా.. పాండవులు, కౌరవులు మధ్య ఒక భయంకరమైన యుద్ధం జరిగింది. వారిరువురి మధ్య యుద్ధం జరగకుండా సఖ్యత కుదిర్చేందుకు నేను ఎన్ని విధాలుగానో ప్రయత్నించాను. కానీ కౌరవులు వినలేదు. సుమారుగా వారంతా ఈ యుద్ధంలో

చనిపోయారు. ఈశ్వరాజ్ఞను ఎవరు అడ్డగలరు?" అంటూ యుద్ధాంశాలన్నీ చెప్పాడు. ఈ చరిత్ర అంతా విన్న ఉతంగుడు మహోగ్రుడయ్యాడు. కోపంతో కళ్లు ఎర్రబడ్డాయి. శ్రీకృష్ణుణ్ణి ఉద్దేశించి.. "వాసుదేవా! నీవు అక్కడ ఉండి ఇంతా జరగనిచ్చావా?. నిశ్చయంగా నీవు నీ కర్తవ్యాన్ని నిర్వర్తించలేదు. నీవు మాయోపాయాలు ప్రయోగించి వారందరినీ నాశనానికి తెచ్చావు. కావున.. ఇప్పుడు నేను పెట్టే శాపానికి సిద్ధపడు. శ్రీకృష్ణుడు అందుకుని.."శాంతి.. శాంతి.. నీవు శాంతి పొందు. నీవు ఆర్జించిన గొప్ప తపస్సు ఫలాన్ని ఇలా కోపంతో వ్యయ పరచకు. నేను చెప్పినదానిని విని ఆ తర్వాత నీకిష్టమైతే నీ శాపాన్ని పలుకు" అన్నాడు. శ్రీకృష్ణుడు ఆ బ్రాహ్మణుణ్ణి అనునయించి, అతని ఎదుట తన సర్వతో ముఖ విశ్వరూప ప్రదర్శన చేశాడు. "నేను అప్పుడప్పుడు ప్రపంచం పాడుకాకుండా ఉద్ధరించడానికి వివిధ శరీరాలను దాల్చి పుడుతుంటాను. నేను ఏ శరీరాన్ని ధరించినా దానికి అనుగుణంగా ప్రవర్తించాలి. నేను దేవతవలే పుట్టినా దేవతలా నడుచుకుంటాను. నేను ఒక యక్షిణిలా, రాక్షసిలా కనపడితే ప్రతి పనీ యక్షిణిలా, రాక్షసిలా చేస్తాను. నేనొక మానవ శరీరాన్ని గాని, పశు శరీరాన్నిగాని ధరిస్తే, ఆయా పుట్టుకలకు సహజంగా ప్రవర్తించి నా పనిని నేను నేరవేరుస్తాను. మూర్ఖులైన కౌరవులను శ్రమపడి ప్రార్థించాను. వారు అతిశయంతో, గర్వ ప్రభావంతో, మదమెక్కి నా సలహాలను లక్ష్య పెట్టలేదు. వారిని అధైర్యపరచడానికి చూశాను. అందులోకూడా నేను నెగ్గలేదు. నాకు ఆగ్రహం వచ్చి నా విశ్వరూపాన్ని కూడా వారి ముందు ప్రదర్శించాను. అది కూడా నిష్ఫలమైంది. వారు చెడు చేయడాన్ని మానలేదు. వారు యుద్ధం చేసి చనిపోయారు. ఓ బ్రాహ్మణోత్తమా! నా పట్ల నీవు కోపించడానికి కారణం లేదు" అని సవివరంగా తెలిపాడు శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడి చెప్పినవన్నీ విన్న ఉతంగుడు శాంతించాడు. కృష్ణుడు సంతోషించాడు. "నీకో వరం ఇవ్వాలని నాకు ఉన్నది. నీకేమి కావాలి" అనడిగాడు కృష్ణుడు. ఉతంగుడు.. "అచ్యుతా! నిన్ను చూశాను. నీ విశ్వరూపాన్నీ వీక్షించాను. ఇంక నాకేమీ కోరిక లేదు." అన్నాడు. కానీ కృష్ణుడు మళ్లీ ఏదైనా కోరుకో అనడిగాడు. దీంతో ఎప్పుడూ నిర్జల ఎడారి ప్రదేశంలో తిరిగే ఈ అమాయక బ్రాహ్మణుడు ఉతంగుడు.."ప్రభూ! నీవు నాకేమైనా వరం ఇవ్వదలిచినట్లయితే, నాకెక్కడ దాహమైనా అక్కడ నాకు నీరు దొరికేటట్లు వరం ఇవ్వు" అని కోరాడు. కృష్ణుడు నవ్వి.. "ఇదేనా నీ కోరిక. సరే. అలాగే కానిమ్ము" అని వరం ఇచ్చి తాను తన మార్గాన వెళ్లాడు.

ఒకనాడు ఉతంగుడికి బాగా దాహం వేసింది. ఆ ఇసుక ప్రదేశంలో ఎక్కడా నీరు కానరాలేదు. ఆ సమయంలో తాను కృష్ణుడి వద్ద నుంచి పొందిన వరాన్ని గుర్తు చేసుకున్నాడు. ఇలా స్మరించుకున్న వెంటనే ఒక నిషాదుడు కనపడ్డాడు. వాడు మురికి

చింకి గుడ్డలను ధరించాడు. అతడి చేతికున్న తాడుకు ఐదు కుక్కలు కట్టి ఉన్నాయి. అతడి వెంటనే అవి వస్తున్నాయి. నీటితో ఉన్న ఒక తోలు సంచి అతని భుజంపై వేలాడుతోంది. ఈ నిషాదుడు పెదవులు చిట్లించి.. నీకు దాహం అవుతున్నట్లుంది. ఇదిగో నీరు" అంటూ తన నీటి సంచికి అమర్చిన వెదురు గొట్టాన్ని చూపి దాని ద్వారా నీరు తాగమని ఉతంగుడికి ఇచ్చాడు. ఉతంగుడు.. ఈ నిషాదుణ్ణి, అతని కుక్కలను, నీటి సంచిని చూసి అసహ్యించుకున్నాడు. "మిత్రమా, నీరు నాకు అవసరం లేదు. నీకు వందనాలు" అంటూ శ్రీకృష్ణుణ్ణి తలుచుకొని తన మనసులో అతన్ని నిందించాడు. "నిజంగా ఇది నీవిచ్చిన వరమేనా కృష్ణా" అనుకున్నాడు. నిషాదుడు మాత్రం ఉతంగుని దాహం తీర్చుకోమని బతిమిలాడుతున్నాడు. ఉతంగుడి కోపం మరింత పెరిగింది. "నేను తాగను" అన్నాడు విసురుగా. నిషాదుడూ, కుక్కలూ అంతర్ధానమయ్యాయి.

ఇలా నిషాదుడు వింతగా అదృశ్యమవడం చూసి ఉతంగుడు ఆలోచనలో పడ్డాడు. 'ఇతడు ఎవడై ఉంటాడు. నిజమైన నిషాదుడై ఉండడు. ఇది నాపై ప్రయోగించిన ఒక పరీక్ష అయి ఉండొచ్చు. నేను మిక్కిలి పొరపడ్డాను. నా వేదాంతాలన్నీ నన్ను వీడాయి. నిషాదుడిచ్చిన నీటిని ఉపయోగంచని నేనొక గర్విష్ఠిని. మూఢుణ్ణి' అని చాలా విచారం చెందాడు. మరుక్షణమే మాధవుడు తన శంకు చక్రాలతో ఉతంగుడి ముందు ప్రత్యక్షమయ్యాడు. "ఓ పురుషోత్తమా! నాకొక గొప్ప పరీక్ష పెట్టావు. ఈ ప్రకారం నన్ను చేయడం నీకు తగునా? బ్రాహ్మణుడైన నాకు తాగమని ఒక అంటరాని నిషాదుడు నీరివ్వడమా. ఇది నీ దయా స్వరూపమేనా?" అని అడుగుతూ శ్రీకృష్ణుణ్ణి దెప్పి పొడిచాడు ఉతంగుడు.

శ్రీకృష్ణుడు నవ్వి.."ఓ ఉతంగా! నీవు నీరు కోరిన వెంటనే నీకోసం అమృతాన్ని తీసుకొని వెళ్లి, నీరని నీకు ఇవ్వాల్సిందిగా ఇంద్రుణ్ణి కోరాను. ఇంద్రుడు.. ఏదైనా ఇస్తానుగానీ, మనుషులకు చిరంజీవత్వం సిద్ధించే అమృతాన్ని ఇవ్వబోనని చెప్పాడు. కానీ నేనతన్ని మరలా కోరాను. అంగీకరించి అలాగే అమృతాన్ని తాగే నీరులా నీకిస్తానని చెప్పాడు. అయితే దీనికొక నిబంధన పెట్టాడు. తానొక చండాల రూపంలో నీ మనస్థత్వాన్ని పరీక్షిస్తానని, అలాగే తాను ఇచ్చే నీటిని (అమృతాన్ని) నీవు తాగాల్సి ఉంటుందని అన్నాడు. అతని పరిశోధనకు నేను అంగీకరించాను. ఎందుకంటే, నీవు జ్ఞానివనీ, బాహ్య స్వభావాలను లక్ష్యం చేయవనీ నేను నమ్మాను. కానీ నీవు నిరాకరించి ఇంద్రుడి దృష్టిలో నన్ను చులకన చేశావు" అన్నాడు శ్రీకృష్ణుడు

ఉతంగుడు తన పొరపాటును తెలుసుకొని సిగ్గు పడ్డాడు.

## అధ్యాయం - 101

# జొన్న పిండి

**కు**రుక్షేత్ర యుద్ధం తరువాత యుధిష్టరుడు రాజ్యాభిక్షితుడై, అశ్వమేధయాగం చేశాడు. అశ్వమేధ యాగ సమయాల్లో ప్రపంచంలోని రాజులంతా ఆచారం ప్రకారం ఆహ్వానించబడ్డారు. యజ్ఞాలను బహు కీర్తి సంపదలతో నిర్వహించారు. బ్రాహ్మణులు, బీదలు, దిక్కులేనివారు అన్ని దేశాల నుంచీ అసంఖ్యాకంగా వచ్చారు. వీరంతా అనేక గొప్ప బహుమానాలు తీసుకున్నారు. ప్రతి క్రియనూ యజ్ఞ సాంప్రదాయం ప్రకారం చేశారు. ఎంతో ఖర్చుపెట్టి అత్యద్భుతంగా నిర్వర్తించారు.

ఎక్కడినుంచో, ఎవరికీ తెలియకుండా ఓ ముంగిస అకస్మాత్తుగా.. సభికులతో, రుత్వికులతో, ఇతర బ్రాహ్మణులతో అలంకరించిన యాగశాల మధ్య కనిపించింది. నేలపై పొర్లి ఎక్కసక్కెంగా మనుషులు నవ్వినట్లు నవ్వింది. బ్రాహ్మణులంతా ఈ వింత, సృష్టి వైవిధ్య కృత్యాన్ని చూసి భయపడ్డారు. ఈ గొప్ప యజ్ఞ కార్యాన్ని పాడు చేయడానికి ఏదయినా చెడు దేవత వచ్చిందా అని బ్రాహ్మణ పురోహితులు తలిచారు. ఆ ముంగిస శరీరంలోని ఒక పార్శ్వం బంగారంలా మెరుస్తోంది.

ఈ విచిత్ర జంతువు దేశదేశాలనుంచి వచ్చిన అనేక విద్వద్బ్రాహ్మణులతోనూ, రాజులతోనూ నిండిన సభంతా కలయ చూసి.. "ఇక్కడ సమావేశమైన రాజులారా! పురోహిత బ్రాహ్మణులారా! నేనిప్పుడు చెప్పేది వినండి. మీ యజ్ఞాన్ని బహు సంపదతో, జయప్రదంగా జరిపామని మీరు తప్పక నమ్ముతున్నారు. ఒకానొక కాలంలో కురుక్షేత్రంలో నివసించే బ్రాహ్మణుడు ఒక పౌను బరువున్న జొన్నపిండిని ధర్మం చేశాడు. మీరు చేసిన అశ్వమేధ యాగం, అందులో మీరు చేసిన దాన ధర్మాలు ఆ కురుక్షేత్ర బ్రాహ్మణుడి కంటే తక్కువే. మీరేమో యజ్ఞాన్ని బాగా చేశామని అనుకొంటున్నారు. దయచేసి ఈ విషయంపై అంత స్వాతిశయం పనికిరాదు" అన్నది బంగారు వర్ణ ముంగిస. వింత గొలిపే ఈ ముంగిస ప్రేలాపన విని, సభికులు ఆశ్చర్యపోయారు. ఈ యజ్ఞాన్ని నిర్వర్తించిన బ్రాహ్మణులు అందరూ ముంగిస వద్దకు వెళ్లి.. "తగిన మంచివారితో నిర్వర్తించిన ఈ మహాయజ్ఞానికి నీవు ఎక్కణ్ణుంచి, ఎందుకు వచ్చావు? నీవెవరు? మా యజ్ఞం గురించి నిందా వాక్యాలు ఎందుకు పలికావు? ఈ అశ్వమేధ యాగం శాస్త్ర ప్రకారంగా, ప్రతి క్రియా జరిపి పూర్తిచేసింది. నీవిలా ఆ యజ్ఞాన్ని గురించి నిరసన వాక్యాలు పలకడం తగదు. యజ్ఞ దర్శనానికి వారంతా మర్యాదగా చూడబడి, తగిన గౌరవాలను, పారితోషికాలను పొందారు. వీటితో అందరూ సంతోషించి వారి స్థలాలకు ఆనందంగా వెళ్తున్నారు. మంత్రాలు సక్రమంగా ఉచ్ఛరించబడ్డాయి. చాతుర్వర్ణాల వారూ సంతోషించారు. నీవెందుకు అలా అంటున్నావు? నీ మాటల సందర్భాన్ని పూర్తిగా వివరించు" అని అడిగారు.

ఆ ముంగిస నవ్వి.."ఓ బ్రాహ్మణులారా! నేను చెప్పేది నిజం. యుధిష్ఠరుడి, మీ అదృష్టాలను నేను సహించలేక అన్నానని అనుకుంటున్నారా? ఇలా చెప్పడంలో నాకు ఈర్ష్య ఉందని భావించొద్దు. ఈ యజ్ఞం ఎంత బాగా చేసినా, కురుక్షేత్రంలో బ్రాహ్మణుడు చేసిన దానానికి సరిరాదు. ఆ బ్రాహ్మణుడు చేసిన మహా దానానికి బహుమతిగా అతడూ, భార్యా, కుమారుడూ, కోడలూ నలుగురూ వెంటనే స్వర్గానికి తీసుకువెళ్లబడ్డారు. నేను చూసిందానినే చెపుతున్నాను" అంది. కురుక్షేత్ర బ్రాహ్మణుడి కథ చెప్పనారంభించింది ముంగిస.

"మీరు యుద్ధం చేయకముందు చాలా కాలం కిందట కురుక్షేత్రంలో ఒక బ్రాహ్మణుడు ఉన్నాడు. పొలంలో ఏరుకొని తెచ్చుకునే పరిగ ధాన్యమే అతడికి ప్రతిరోజూ ఆహారం. అతడూ, భార్యా, కుమారుడూ, కోడలూ వారు నలుగురూ ఇలాగే జీవిస్తున్నారు. ప్రతిదినమూ సాయంత్రం కూర్చొని ఆ రోజు ఒక్క భోజనం తింటున్నారు. ఏ రోజయినా వారికి ధాన్యం లభించనప్పుడు మరునాడు సాయంత్రం వరకూ ఉపవాసముంటున్నారు. ఏ రోజైనా వారి క్షుద్బాధ తీరిన తరువాత ఆహారం మిగిలితే

మరునాటికి ఉంచడం లేదు. వారనుసరిస్తున్న వృత్తి ధర్మం, నీతి అలాంటిది. ఈ ప్రకారంగా వారు ఎన్నో సంవత్సరాలు గడిపారు. కొంతకాలానికి అనావృష్టి వల్ల పంటల్లేక కరువొచ్చింది. విత్తనాలు చల్లడం, పంట జాగ్రత్త పరచడం లేవు. ఏరుకోవడానికి గింజ కూడా దొరకలేదు. ఆ బ్రాహ్మణ కుటుంబం కొన్ని రోజులపాటు ఉపవాసం చేసింది. ఒకరోజు ఎండకూ, ఆకలికీ ఓర్చి తిరిగి తిరిగి వారు ఏరుకున్న జొన్నగింజలతో ఇంటికి వచ్చారు. వారా జొన్న గింజలను పిండి చేశారు. దైవ ప్రార్థన చేశారు. ఆ పిండిని నాలుగు సమ భాగాలుగా చేసి ఆహారం ఇచ్చినందుకు దేవుణ్ణి ప్రార్థిస్తూ.. తినేందుకు సిద్ధపడుతున్న సమయంలో ఆకలిబాధతో ఓ బ్రాహ్మణుడు వారింటికి వచ్చాడు.

ఇంటికి వచ్చిన అతిథిని చూసి వారందరూ గౌరవ సూచికంగా లేచి నమస్కారం చేశారు. అతణ్ణి తమతో ఆహారం తినడానికి ఆహ్వానించారు. ఆ సమయంలో ఒక అతిథి వచ్చినందుకు బ్రాహ్మణుడు, వారి కుటుంబ సభ్యులు తమ అదృష్టంగా భావిస్తూ పరమానందం చెందారు. ఇంటి యజమాని బ్రాహ్మణుడు అతిథిని ఉద్దేశించి.."ఓ బ్రాహ్మణోత్తమా! నేను బీదవాడను. ఈ జొన్నపిండీ ధర్మార్జితమైనదే. దయచేసి ఇది స్వీకరించండి. మీకు క్షేమం కలుగుగాక" అని ఆశీర్వదిస్తూ తన భాగానికి వచ్చిన జొన్నపిండిని అతిథికి ఇచ్చాడు. అతిథి కూడా ఆ పిండిని అత్యాశతో తిన్నాడు.

తిన్న తరువాత అతనికి ఇంకా ఆకలి అవుతూనే ఉంది. అతడి ఆకలిని, అసంతృప్తి రూపాన్ని చూసిన యజమాని, చాలా విషాదం చెందాడు. ఏమీ చేయడానికి తోచని తన భర్తతో భార్య.. "ప్రభూ! నావంతు ఆహారం కూడా వారికి పెట్టండి. అతిథి ఆకలి తీరితే అదే మనకు సంతోషం" అంటూ ఆమె తన భాగం జొన్నపిండిని భర్తకు ఇచ్చి అతిథికి పెట్టమంది. బ్రాహ్మణుడు భార్యనుద్దేశించి.. "విశ్వసనీయురాలా! జంతువులు, పక్షులు ఇతరాలు వాటి ఆడజాతిని జాగ్రత్తగా చూసుకుంటూ పెంచుతాయి. మనిషి అలా ప్రవర్తించగలడా? నీ ఆలోచనను నేను ఒప్పుకోను. పవిత్రమైన గృహస్థ ధర్మాన్ని నిర్వహించడానికి నీవు నాకు సేవ, సహాయం చేస్తున్నావు. అలాంటి నువ్వు ఆకలి బాధపడుతుంటే వదిలి నేనీ ప్రపంచంలోగానీ, పైలోకంలోగానీ ఏమి పొందగలను? ప్రియురాలా! నీవు చిక్కిపోయి ఎముకల గూడులా మారావు. ఆయాసపడుతున్నావు. చాలా ఆకలితో ఉన్నావు. ఇలాంటి పరిస్థితిలో నిన్ను వదిలి ఈ అతిథికి ఆహారం పెట్టలేను" అన్నాడు.

భర్తను ఉద్దేశించి.. బ్రాహ్మణోత్తమా! మీరు శాస్త్రాలన్నీ నేర్చారు. వివాహితులమైన మన ఇద్దరికీ ధర్మ, అధర్మాలు, ఇతర మనుష్య కర్మలు మన ఇరువురి మేలుకోసమే అన్నది నిజం కాదా? నన్ను దయతో చూసి నా భాగం ఆహారాన్ని

తీసుకొని మన అతిథి ఆకలిని తీర్చు. నా వలే మీరూ ఆకలితో ఉన్నారు. కనుక మీకూ, నాకూ వ్యత్యాసాలు చూడక నా కోరికను నెరవేర్చు. బ్రాహ్మణుడు చివరికి ఒప్పుకొని భార్యా భాగం జొన్నపిండిని అతిథికి ఇచ్చాడు. దాన్ని అతడు అత్యాశతో తిన్నాడు. కానీ అతడింకా ఆకలిగానే ఉన్నాడు. దీంతో బ్రాహ్మణుడిలో ఆందోళన రెట్టింపు అయింది. ఇది చూసి గృహ యజమాని కుమారుడు ముందుకొచ్చి.. "తండ్రీ ఇదిగో నా భాగం. ఇంకా ఆకలితో కనపడుతున్న మన అతిథికి పెట్టు. మన ధర్మం మనం నిర్వర్తించుకోగలిగినందుకు నేను చాలా ఆనందిస్తున్నాను" అన్నాడు.

తండ్రి ఆందోళనకు అవధి లేకపోయింది. తండ్రి కుమారుడి నుద్దేశించి.. "ముసలివారు ఉపవాసాన్ని ఓర్చుకుంటారు. యువకులకు ఆకలి ఎక్కువగా ఉంటుంది. నీవు చెప్పేది అంగీకరించడానికి నా మనసొప్పడం లేదు" అన్నాడు. "వార్థక్యంలో తండ్రిని కనిపెట్టుకొని ఉండటం కుమారుడి కర్తవ్యం. కుమారుడికి తండ్రి వేరుకాదు. తండ్రే కొత్తగా కుమారుడై జన్మిస్తాడని చెప్పారే. నిజంగా నా భాగం పిండీ నీదే. ఇది తీసుకొని  మన అతిథిని సంతృప్తి పరుచు" అని వేడుకున్నాడు. తండ్రి.."కుమారా! నీ ఔదార్యాన్నీ, ఇంద్రియ నిగ్రహాన్ని చూసి నేను గర్వ పడుతున్నాను. నీకు శుభమగుగాక. నీ ఆహారాన్ని అతిథికి ఇచ్చేందుకు ఒప్పుకుంటున్నాను" అంటూ కుమారుని ఆహార భాగాన్ని అతిథికి ఇచ్చాడు. అతిథి మూడో భాగాన్ని కూడా తిన్నాడు. అతడు ఇంకా సంతృప్తి చెందలేదు. బ్రాహ్మణుడు మరింత ఆందోళన చెందసాగాడు. ఏమి చేయాలో తెలియని అయోమయ స్థితిలో ఉన్నాడు.

అతడి కోడలు.. "ప్రభూ నా ఆహార భాగాన్ని కూడా అతిథికి ఇచ్చి ఆయన క్షుద్బాధ తీర్చండి. దీన్ని మీరు స్వీకరించి మీ బిడ్డనైన నన్ను ఆశీర్వదించండి" అన్నది. గృహయజమాని ఎంతో విచారంతో.. "ఓ పతివ్రతా తిలకమా! ఆహారం లేక కృశించి పాలిపోయిన శరీరంతో ఉన్న నీవు నీ భాగాన్ని కూడా అతిథికి పెట్టి సంతృప్తి పరిచి నన్ను కీర్తి అనుభవించు అంటున్నావా? నీ ఆహారాన్ని పెట్టడానికి నేను అంగీకరిస్తే, నిశ్చయంగా నేను క్రూరుణ్ణవుతాను. నీవు ఆకలితో కృశిస్తుంటే, నేనెలా చూస్తుంటాను" అన్నాడు మామ.

కోడలు మామ మాటలు వినక.. "తండ్రీ నాకు ప్రభువూ, యజమానీ అయిన భర్తకు మీరు ప్రభువులు. నా గురువునకు గురువు. నా దైవానికి దైవానివి. నా భాగపు జొన్నపిండిని స్వీకరించండి" అని బతిమాలసాగింది. "ఈ నా శరీరం నా ప్రాణనాధుడి ఉపయోగానికి పూర్తిగా సమర్పించింది. శుభం కలగడానికి మీరు నాకు సహాయ పడండి. దయచేసి ఈ పిండిని తీసుకోండి. బతిమాలుతాను" అన్నది. ఇలా కోడలితో బతిమాలించుకున్న వాడయిన బ్రాహ్మణుడు ఆమె ఆహార భాగాన్ని

కూడా అతిథికి ఇచ్చాడు. అతిథి తృప్తిగా ఆరగించాడు.

అతిథి ఆ కుటుంబీకులను ఉద్దేశించి.. "నిర్మల హృదయాలతో, మీరిచ్చిన ఆతిథ్యం ఫలించుగాక. మీ దానం నన్ను సంతృప్తి పరిచింది. అలా చూడండి. మీ అపూర్వ త్యాగానికి, ధర్మానికి మెచ్చుకొని దేవతలు పుష్ప వర్షం కురిపిస్తున్నారు. చూడండి. దేవతలు, గంధర్వులు, వారి ప్రకాశిస్తున్న రథాలతో వచ్చారు. మిమ్ములను కుటుంబంతోపాటు ఊర్ధ్వ స్వర్గలోకానికి తీసుకు వెళ్తారు. మీ దానం మీకూ, మీ పూర్వీకులకు కూడా స్వర్గలోక ప్రాప్తి కలిగించింది. ఆకలి మనిషి బుద్ధిని నశింప చేస్తుంది. న్యాయమైన మార్గాన్ని వదిలి పెడమార్గాన పెడుతుంది. మీరు మిక్కిలి ఆకలితో ఉన్నప్పటికీ స్వార్థాన్ని త్యజించి అన్నిటికన్నా ధర్మమే ఉత్కృష్టమైనదిగా ఎంచారు. రాజసూయ యాగాలు, అశ్వమేధయాగాలు ఎంత గొప్పగా చేసినా ఇప్పుడు మీరు చేసిన ఒక్క ఆతిథ్యమనే మహా యజ్ఞం ముందు దిగతుడుపే. రథం మీ కోసం ఎదురుచూస్తోంది. నీవూ, నీ కుటుంబమూ రథమెక్కి స్వర్గానికి వెళ్లండి" అంటూ ఆ అతిథి అదృశ్యమయ్యాడు.

కురుక్షేత్ర బ్రాహ్మణుడి కథంతా చెప్పిన ముంగిస.."నేను ఆ పక్కనే మసలుతున్నాను. బ్రాహ్మణుడి జొన్నపిండి సువాసన నన్నాకర్షించింది. అందువల్ల నా తలంతా బంగారు రంగు మయమైంది. ఆ తరువాత వారు ఆహారం తిన్న ప్రదేశంలో నేను సంతోషంతో అక్కడక్కడా పడిన పిండిపై పొర్లాను. అందువల్ల నా ఒక్క పార్శ్వం అలాగే ఉండిపోయింది. ఆ రెండో పార్శ్వం కూడా బంగార వర్ణం చేసుకోవడానికి కోరిక కలిగి ఎక్కడెక్కడ మహాయజ్ఞాలు, తపస్సులు జరుగుతాయో ఆ స్థలాలన్నిటిలోనూ ప్రయత్నిస్తున్నాను. ప్రపంచ విఖ్యాతి చెందిన యుధిష్ఠరుడు యజ్ఞం చేస్తున్నాడని విని, ఇది కురుక్షేత్ర బ్రాహ్మణుడి దానయజ్ఞానికి సరితూగుతుందని వచ్చాను. నేనీ యజ్ఞవాటికలో పొర్లినా నా రెండో పార్శ్వం బంగారు రంగు సంతరించుకోలేదు. కురుక్షేత్ర బ్రాహ్మణుడు అతిథికి పిండి దానం త్యాగం చేసినంతటి త్యాగం మీరు నిర్వహించిన ఈ అశ్వయేధయాగంలో లేదని నేను చెప్పాను" అని ఆ ముంగిసు అదృశ్యమైంది.

## అధ్యాయం - 102

# యుధిష్టరుడి రాజ్యపాలన

**మ**నిషి తాను కోరిన వస్తువు సంపాదించేవరకూ దానికోసం వెర్రివానిలా ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. అది తనకు చిక్కాక అతడు తృప్తి పొందుతాడు. కానీ మళ్లీ కోరికలు కలిగి ఆయా వస్తువుల కోసం నిరంతరం ప్రయత్నిస్తూ అవి దొరకనప్పుడు దు:ఖాన్ని అనుభవిస్తూ శాంతి లేక బాధపడుతూ ఉంటారు.

యుద్ధం చేసి శత్రువులను జయించడం క్షత్రియ ధర్మమైనప్పటికీ అన్నదమ్ములకూ, దగ్గర బంధువులకు బాధ, విచారం కలిగించి, చంపేసి సంపాదించిన వైభవం, ధనం వల్ల మనకేమి ఆనందం ఉంటుంది. యుద్ధం ఆరంభమైనప్పుడు ఈ అంశమే కారణంగా తీసుకుని అర్జునుడు, శ్రీకృష్ణుడుతో తాను యుద్ధం చేయబోనని చెప్పాడు. దీనిపై శ్రీకృష్ణుడు బదులిస్తూ, మనుషుల కర్మల గురించి, వారు విధిగా చేయాల్సిన కర్మల గురించీ చాలా వరకు వివరించాడు. కానీ అర్జునుడు తన మనసులోని భావనను, అందుకోసం అతడి మాటలు కూడా న్యాయసమ్మతం కలవీ,

బయటకు కనపడక పోయినా వాటిలో యదార్థం ఇమిడి ఉంది. పాండవులు కౌరవులను ఓడించి చక్రవర్తులయ్యారు. వారి పనులను వారు ధర్మయుక్తంగా నెవవేరుస్తున్నారు. కానీ యుద్ధ విజయంలో తాము అనుకున్నంత ఆనందం లేదని వారనుకున్నారు.

జనమేజయుడు.. వైశంపాయనుణ్ణి ఉద్దేశించి, “పాండవులు విజయం సాధించి రాజ్యం పొందాక వారు ధృతరాష్ట్రుని పట్ల ఎలా ప్రవర్తించారు” అని ప్రశ్నించాడు. ఇందుకు ప్రత్యుత్తరంగా మహాభారత కథ చెపుతున్న వైశంపాయనుడు.. “దు:ఖ సాగరంలో ఉన్న ధృతరాష్ట్రుణ్ణి పాండవులు మిక్కిలి గౌరవంతో చూస్తున్నారు. నిరంతరం సౌఖ్య పెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఆయన చిన్నబుచ్చుకోవడానికి అవకాశం ఇవ్వకుండా ప్రవర్తిస్తున్నారు. ధృతరాష్ట్రుడి అనుమతి లేనిదే యుధిష్టరుడు ఆజ్ఞలను కూడా ఇచ్చేవాడు కాదు. వందమంది కుమారులను పోగొట్టుకున్న గాంధారిని కుంతీదేవి ఎంతో ప్రేమతో, సోదరి వాత్సల్యంతో చూస్తోంది. ద్రౌపది ఈ ఇద్దరు అత్తలకు సమాన గౌరవం ఇచ్చి మెలుగుతోంది. ధృతరాష్ట్రుని మందిరాన్ని మంచి ఆసనాలతోనూ, శయ్యలతోనూ, అలంకారాలతోనూ, మంచి వస్తువులతోనూ యుధిష్టరుడు అలంకరింప చేశాడు. ధృతరాష్ట్రుడికి ఇష్టమైన, శుభ్రమైన, రుచికరమైన పంచ భక్ష్య భోజనాలను పాకశాల నుంచి ఆయనకు పంపుతున్నారు. కృపాచార్యుడు ఆయన వద్దే ఉంటున్నాడు. ధృతరాష్ట్రుడి విచారాన్ని తగ్గించడానికి వ్యాసుడు గత కాలంలో జరిగిన నీతిదాయక కథలను, చరిత్రలను తరచూ చెపుతున్నాడు. రాచకార్యాల్లో యుధిష్టరుడు.. ధృతరాష్ట్రుని సలహాలను తీసుకుంటున్నాడు. ధృతరాష్ట్రుడు కుటుంబ పెద్ద కావడం వల్ల అతడి పేరుతోనే రాజ్య పాలన చేస్తున్నాడు. తానే పూర్తి అధికారం కలిగి ఉన్నాననే తలంపు కలిగేలా యుధిష్టరుడు ప్రవర్తిస్తున్నాడు.

తన సంభాషణలో కూడా శోకతప్తుడైన వృద్ధ ధృతరాష్ట్రుడికి లేశమైనా బాధ కలగకుండా జాగ్రత్త పడుతున్నాడు. ప్రపంచంలోని అన్నిదేశాల నుంచీ వచ్చే రాజులు ధృతరాష్ట్రుడికి పూర్వం అతడు చక్రవర్తిగా ఉన్నప్పుడు ఇచ్చిన గౌరవ మర్యాదలను ఇప్పుడు కూడా ఇస్తున్నారు. అంత:పుర సేవకులు గాంధారి పట్ల భక్తితో మెలుగుతూ, ‘నా ఐశ్వర్యం నశించిందే’ అనే భావన మదిలోకి రాకుండా ఆమెను చూసుకుంటున్నారు. యుధిష్టరుడు తన అన్నదమ్ములకు.. కుమారులందరినీ పోగొట్టుకున్న తమ పెద తండ్రికి అయిష్టం కలిగించే ఏ పనీ చేయొద్దని కఠినమైన ఆజ్ఞలు ఇచ్చారు. భీముడి మాట చెప్పలేముగాని, అందరన్నదమ్ములూ యుధిష్టరుడి ఆజ్ఞలను శిరసావహిస్తున్నారు. ధృతరాష్ట్రుడూ పాండవుల పట్ల ప్రేమతో మెలుగుతున్నాడు. కొన్నాళ్ల తరువాత ఒక్కొక్కప్పుడు భీముడు వృద్ధ ధృతరాష్ట్రుడి పట్ల అపచారం చేస్తున్నాడు. ధృతరాష్ట్రుడు ఇచ్చిన ఆజ్ఞలను తొందరపాటుతో వ్యతిరేకించి, తానే ఆజ్ఞలు ఇస్తున్నాడు.

ధృతరాష్ట్రుడు వినేలా ఒక్కొక్కప్పుడు కౌరవులను ఉద్దేశించి..‘పెడబుద్ధులు కలిగిన ధృతరాష్ట్ర కుమారులు నశించినందుకు మా అన్నదమ్ములు కృతజ్ఞులై ఉండాలి’ అనేవాడు. దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనులను మరిచేవాడు కాదు. ధృతరాష్ట్రుడికి బాధను కలిగించే మాటలను భీముడు అంటున్నప్పుడు గాంధారి చాలా బాధపడేది. కానీ ఆమె గొప్ప హృదయం కలది. మహాజ్ఞాని కూడా. భీముని మాటలు ఎప్పుడైనా ఆమెకు బాధ కలిగిస్తే.. కుంతీదేవి వైపు చూసి శాంతి పొందుతుండేది. ఎందుకంటే కుంతీదేవి బహుశాంత మూర్తి, ధర్మమూర్తి కూడా. ఇలా పదిహేను సంవత్సరాలు గడిచిపోయాయి.

◈

## అధ్యాయం -103

# ధృతరాష్ట్రుడు

**యు**ధిష్ఠరుడి పరిపాలన పదిహేనేళ్లు గడిచింది. ధృతరాష్ట్రుడు తన విచారాన్ని ఎంతమాత్రమూ భరించలేనని తలచాడు. భీముడి ఎత్తిపొడుపు మాటలు వల్ల ఆయన మనస్సు దు:ఖపడుతోంది. యుధిష్ఠిరుడి ద్వారా తనకెంత మర్యాద జరుగుతున్నా.. ఎంత సౌఖ్యం పొందుతున్నా.. అవి ఆయనకు సహింపరానివి అయ్యాయి. పాండవులకు తెలియకుండా ధృతరాష్ట్రుడు ఉపవాసాలు, వ్రత దీక్షలు చేస్తున్నాడు. భర్త ఉపవాసాలు చేస్తున్నాడని భార్య గాంధారి కూడా అదే పనిచేస్తోంది. ఒకనాడు ధృతరాష్ట్రుడు ధర్మపుత్రుణ్ణి రప్పించి.."కుమారా! నీకు ఆశీస్సులు!. నీ ఇంట పదిహేనేళ్లు సుఖంగా ఉన్నాను. నన్ను బహు ప్రేమతో బిడ్డను పెంచినట్లుగా చూశావు. నేనూ సకల దాన ధర్మాలు చేశాను. పెద్దలకు చేయాల్సిన క్రియలన్నీ నిర్వర్తించాను. ఆ భాగంలో నాకేమీ కోరికలు లేవు. కుమారులు చనిపోయిన గాంధారి తన విచారాన్ని తెలియనివ్వకుండా ఇంతకాలమూ నాకు శారీరక సంరక్షణ చేస్తూనే ఉన్నది. క్రూరులైన నా కుమారులు

ద్రౌపది పట్ల క్షమించరాని ద్రోహం చేశారు. న్యాయంగా నీకు చెందాల్సిన రాజ్యాన్ని అపహరించారు. వారి పాపం వల్ల వారే పోయారు. వారు ధైర్య వీరుల్లా యుద్ధం చేసి రణభూమిలో ప్రాణాలు విడిచి వీరస్వర్గం అలంకరించారు. నేనూ, గాంధారీ మా తరువాత కాలాన చేయాల్సిన కార్యకాలం వచ్చింది. శాస్త్రాలు ఏమి చెప్పాయో నీకు తెలుసు. నేనిపుడు అరణ్యానికి వెళ్లాలి. ఈ దుస్తులు వదిలి వనప్రస్థాశ్రమానికి అవసరమైన చెట్లు బెరళ్లు, చింకి వస్త్రాలను ధరించాలి. అడవిలో నివసిస్తూ మీ అందరి మంచి కోసం దైవాన్ని ప్రార్థిస్తుంటాను. దీనికి నీ అనుజ్ఞ కోరుతున్నాను. మన తండ్రుల ఆచారాలను అనువర్తించనివ్వు. నీవు రాజువు కనుక నా తపసు ఫలితాన్ని కొంత పొందుతావు" అన్నాడు.

ధృతరాష్ట్రుడి మాటలకు యుధిష్ఠరుడు ఆశ్చర్య చకితుడయ్యాడు. "మీరిలా ఉపవాసాలు చేస్తూ, కటిక నేలమీద పడుకుంటూ, ఇలా మీ రక్తమాంసాలను కృశింప చేస్తున్నారని నాకు తెలియదు. మీరు సౌఖ్యంగా ఉన్నారని, మీకు సేవలు క్రమంగా జరుగుతున్నాయని నమ్మడంలో నేను పొరపాటు చేశాను. తండ్రీ, మీరు ఉపశమనానికి లొంగని శోకాన్ని అనుభవించారు. రాజ్యపాలనలో, సౌఖ్యంలో నాకేమీ మంచి కనపడలేదు. నేను పాపిష్ఠిని. కోరిక, ఆశ, దగాపుచ్చి నన్నిలా తెచ్చావు. నీ కుమారుడు యుయుత్సుడు రాజు కాగలడు. లేక మీ చిత్తం వచ్చినవారిని రాజుగా చెయ్యి. మీరలా చేసినట్లయితే మీరే ఈ రాజ్య కార్యాలను నిర్వర్తిస్తూ, ప్రజలను కాపాడుతూ ఉండండి. నేను అరణ్యానికి పోతాను. ఈ పొరపాట్లు, తప్పులతో నిండిన చరిత్ర ఇలా అంతం కానివ్వండి. ఇంకా నిందలూ అవమానాలూ రాకుండా నేను విముక్తి కావడానికి అంగీకరించి రక్షించమని వేడుకుంటున్నాను. నేను రాజును కాను. నీవే రాజువు. కానీ నీవు అడవులకు వెళ్లడానికి నా ఆజ్ఞ కోరుతున్నావు. ఇంకా నేను మిమ్మల్ని వెళ్లమని అనడంగానీ, వద్దని అనడంగానీ ఎలా ఆజ్ఞ ఇస్తాను. దుర్యోధనుడిపై నా కోపం ఆనాడే పోయింది. మమ్మల్ని తరిమి మనస్సులను కలతపెట్టి, ఎదుర్కోవడానికి శక్తి చాలని పరిస్థితుల్లో మమ్మల్ని దురదృష్టం వెన్నాడింది. దుర్యోధనుడు, అతని సోదరుల్లా మేమూ నీ బిడ్డలమే. గాంధారి, కుంతీదేవి ఇద్దరూ నాకు సమానమైన తల్లులే. వారిద్దరూ వారి కుమారుడనైన నాకు సమాన ప్రేమ పాత్రులే. మీరు అడవులకు వెళ్తే నేనూ మీతో వచ్చి మీకు సేవ చేయాలి. మీరు అడవులకు వెళ్లి నన్ను ఇక్కడ వదిలివెళ్తే రాజ్య పదవిలో నాకేమి ఆనందం ఉంటుంది. మీ ముందు దండ ప్రమాణం ఆచరిస్తూ.. మేం చేసిన తప్పులన్నీ క్షమించాలని మొరపెట్టుకుంటున్నాను. మీకు సేవ చేస్తేనే నాకు మనశ్శాంతీ, ఆనందమూ కలుగుతాయి. కనుక అలా చేసే అవకాశమూ, స్వతంత్రాన్ని నాకు కలిగించండి. నన్నిలా ఆశాభంగం చేసి మీరు

వెళ్లొద్దు" అని యుధిష్టురుడు వేడుకోవడంతో ధృతరాష్ట్రుడి హృదయం వేదన చెందింది.

ధర్మపుత్రుణ్ణి ఉద్దేశించి ధృతరాష్ట్రుడు.. "కుంతీదేవి ప్రియపుత్రా!. నేను అడవులకు వెళ్లి తపస్సు చేస్తాను, పాపహరమైన శారీరక కర్మలను చేస్తాను. ఇప్పుడు ఇతర విధంగా నాకు శాంతి ఉండదు. నీ ఇంట నేను చాలా సంవత్సరాలు ఉన్నాను. నీవూ, నీవారూ కల్మషంలేని సేవ చేసి భక్తి కలిగి ఉన్నారు. ఇప్పుడు నాకోరిక నెరవేర్చుకోవడానికి నీవు అనుజ్ఞ ఇవ్వాలి. నన్ను వెళ్లనివ్వు" అంటూ చేతులు జోడించి మనస్థాపంతో వణుకుతూ చెప్పాడు ధృతరాష్ట్రుడు. ఆయన విదురుడు, కృపాచార్యుడు వైపు తిరిగి.. "రాజును ఓదార్చి నేను అడవులకు వెళ్లేలా చూడమని మిమ్మల్ని వేడుకుంటున్నాను. నా మనస్సు అడవిలోనే నిమగ్నమైంది. బహుశా నా వయసే దీనికి కారణం. నేను చాలా మాట్లాడాను. అలసిపోయాను" అంటూ నిస్సహాయుడై గాంధారిపై వాలి మూర్ఛపోయాడు. నాడు లోహ భీముడి విగ్రహాన్ని పిండిచేసేంత బలము కలిగిన, ఏనుగు వంటి కండరాలు కలిగిన ధృతరాష్ట్రుణ్ణి.. యుధిష్టురుడు ఈ స్థితిలో చూడలేకపోయాడు. యుధిష్టురుడు తనకు తాను ఇలా నిందించుకున్నాడు. 'ఇదంతా ఇలా కావడానికి నేనే కారణమా? దు:ఖ భూయిష్టుణ్ణి, అపాత్రుణ్ణి, ధర్మం తెలియని అజ్ఞానిని. నా చదువు ఎందుకు?" అంటూ ధృతరాష్ట్రుడి మొహంపై నీరు చల్లి ప్రేమయుక్తంగా లాలిస్తూ, తన మృదువైన చేతులతో నిమిరాడు. ధృతరాష్ట్రుడికి స్పృహ వచ్చింది. ఎదురుగా కనిపించిన యుధిష్టురుణ్ణి ప్రేమపూర్వకంగా హృదయానికి హత్తుకున్నాడు. మెల్లగా.. "ప్రియ కుమారా! నీ చల్లని స్పర్శ నాకు సౌఖ్యం ఇచ్చింది. ఇప్పుడు బాగున్నాను" అన్నాడు ధృతరాష్ట్రుడు.

ఆ సమయంలో వ్యాసుడు వచ్చాడు. యుధిష్టురుణ్ణి ఉద్దేశించి.. "కురువృద్ధుడైన ధృతరాష్ట్రుడు కోరినట్లే చెయ్యి. అతన్ని అడవులకు వెళ్లనివ్వు. అతడు వయోవృద్ధుడయ్యాడు. అతని కుమారులు అతని ముందే చనిపోయారు. ఈ విచారాన్ని ఆయన ఎంతకాలమో భరించలేడు. దేవుడు గాంధారికి జ్ఞానమిచ్చాడు. కానీ ఆమె తన విచారాన్ని ధైర్యంతో భరించింది. వారి కోరికలకు అడ్డురాకు. ధృతరాష్ట్రుణ్ణి ఇలాగే కృశించి అక్కడ చావనీయబోకు. ప్రాపంచిక సుఖ, దు:ఖాలను విడిచి, తేనెలొలుకు సువాసనగల పువ్వులను ఆఘ్రాణిస్తూ, అడవిలో అతణ్ణి ఉండనివ్వు. రాజుల ధర్మం యుద్ధంలో మరణించడం, లేదా వారి అంత్యదశను అడవిలో పవిత్రంగా నడపడమే. ధృతరాష్ట్రుడు తాను రాజ్యం చేస్తూ యజ్ఞాలను చేశాడు. మీరు పదమూడేళ్లపాటు అరణ్యవాస క్లేశంలో ఉన్నప్పుడు, ఈ ప్రంపంచమంతా తన కుమారుని ద్వారా పూర్తిగా అనుభవించి, గొప్ప దానధర్మాలు చేశాడు. అతడికి ఏకోరికా లేకుండా నీవు జరిపావు. అతడు తపశ్చర్య, పాపవిమోచన కర్మలు చేయడానికి

సమయమొచ్చింది. నీ హృదయపూర్వక అనుమతితో అతని మనసులో కోపం లేకుండా వెళ్లనివ్వు" అన్నాడు. ధర్మరాజు.. "అలాగే కానిద్దాం" అన్నాడు. తరువాత వ్యాసుడు తన ఆశ్రమానికి వెళ్లాడు.

◈

అధ్యాయం - 104

# ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీ నిర్యాణం

**యు**ధిష్టరుడు చివరికి ధృతరాష్ట్రుడు అడవులకు వెళ్లడానికి అంగీకరించాడు. ధృతరాష్ట్రుడు, గాంధారి ఇద్దరూ యుధిష్టిరుడి గృహానికి వెళ్లి ఉపవాసానంతర భోజనం చేశారు. కుంతీదేవి గాంధారితో కలిసి కూర్చున్నది. ధృతరాష్ట్రుడు.. యుధిష్టరుణ్ణి తన పక్కన కూర్చోపెట్టుకొని చివరిసారిగా ఆశీర్వదించాడు. తరువాత ధృతరాష్ట్రుడు బయటకు వచ్చి గాంధారి భుజంపై చేయి వేసి మెల్లగా నడుస్తూ పట్టణం దాటి అరణ్యానికి వెళ్లడం ప్రారంభించారు. తన భర్త అంధుడైనందువల్ల గాంధారి కూడా తన కళ్లకు గంతలు కట్టుకొని జీవితాంతం గడుపుతూ వస్తోంది. అందువల్ల గాంధారి కుంతీదేవి భుజంపై చేయివేసింది. ఆమె దారిచూపుతుండగా ధృతరాష్ట్ర, గాంధారులు మెల్లగా గమనాన్ని మొదలుపెట్టారు.

కుంతి తాను కూడా వీరితో కలిసి వెళ్లాలని మనసులో నిశ్చయించుకుంది.

కుంతి.. యుధిష్టరుణ్ణి ఉద్దేశించి.. "కుమారా, నీవు సహదేవుడితో మాట్లాడేటప్పుడు నీ మాటల్లో కోపాన్ని చూపకు. యుద్ధభూమిలో వీరమరణం చెందిన కర్ణుణ్ణి ప్రేమతో స్మరిస్తూ ఉండండి. అతడు నాకుమారుడు. ఆ అంశాన్ని నీకు తెలియపరచక నేను నేరం చేశాను. ద్రౌపదిని ప్రేమ, గౌరవాలతో చూడు. భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడులకు కష్టం కలిగించే ఏ పనీ చేయకు. కుమారా! ఇదంతా నీ మనసులో ఉంచుకో. కుటుంబ భారమంతా పూర్తిగా నీదే అన్న విషయం మరచిపోకు'' అని హితవు పలికింది. తల్లి కుంతి.. గాంధారితో కొంత దూరం వెళ్లి ఆమె వారి నుంచి సెలవు తీసుకొని తిరిగి పట్టణానికి వస్తుందని యుధిష్టరుడు భావించాడు. కానీ కుంతి ఇలా జాగ్రత్తలు చెప్పడంతో ఆశ్చర్య చకితుడయ్యాడు. కొన్ని నిమిషాలు మాట్లాడలేకపోయాడు. తరువాత నింపాదిగా.. "తల్లీ! ఏమిటిది? నీవు మమ్మలను ఆశీర్వదించి యుద్ధానికి పంపావు. ఇప్పుడు మమ్మల్ని విడనాడి నీవు అడవులకు పోవడం తగదు" అన్నాడు. యుధిష్టరుడి ప్రార్థన ఫలించలేదు. కుంతి తన మాట మీదే నిలిచింది. "నా ప్రభువు అయిన భర్తను అతడెక్కడ ఉన్నా నేను చేరుకోవాలి. నేను గాంధారితో ఉండి అరణ్యవాసాన్ని అలవర్చుకొని త్వరలో మీ తండ్రిని చేరతాను. ఆందోళన చెందకుండా తిరిగి పట్టణానికి వెళ్లు. నీ మనస్సెప్పుడూ ధర్మంలోనే నిలుచుగాక" అని ఆశీర్వదించింది.

యుధిష్టరుడు మాట్లాడక ఊరుకున్నాడు. తరచూ వెనుకకు తిగిరి తన కుమారుల వైపు చూస్తూ కుంతి తన మార్గంలో వెళ్లిపోయింది. ఇలా ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీదేవి ముగ్గురూ ఒకరి భుజంపై మరొకరు చేతులు వేసుకొని అడవులకు వెళ్తున్న దృశ్యాన్ని ఎంతో మానవీయంగా, మహోన్నతంగా చిత్రించాడు కవి.

ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీదేవి ముగ్గురూ అడవిలో మూడేళ్లపాటు గడిపారు. సంజయుడూ వారితోనే ఉన్నాడు. ఒకనాడు ధృతరాష్ట్రుడు తన స్నానాది కర్మలు ముగించి తన ఆశ్రమానికి వచ్చేసరికి అడవికి నిప్పంటుకొంది. వాయువేగంతో అది అడవంతటినీ చుట్టబెడుతోంది. లేళ్లు, దుప్పులు, అడవి పందులు గుంపులు గుంపులుగా పరుగెత్తుతున్నాయి. అవి నీటి వాగుల వద్దకు ఆతృతగా పరిగెడుతున్నాయి. ధృతరాష్ట్రుడు.. సంజయుణ్ణి ఉద్దేశించి "ఈ అగ్ని మనందరినీ చుట్టేస్తుంది. నీవు కాపాడుకో" అన్నాడు. ఆ తరువాత ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీ తూర్పు ముఖం పెట్టి కూర్చుని యోగ ముద్రను అవలంబించారు. నిశ్చలంగా కూర్చొని ఉన్న వారిని అగ్ని ఆహుతి గొన్నది. ధృతరాష్ట్రుడి జీవితకాలమంతా ప్రేమతో అనుసరించి, ఆతడి జీవితానికి వెలుతురు ఇచ్చి, ప్రాణసమానుడుగా ఉన్న సంజయుడు తన శేషజీవితాన్ని గడపడానికి సన్యాసియై హిమాలయాలకు వెళ్లాడు.

◈



శ్రీకృష్ణునిపై
బాణం వేసిన
విలుకాడు

## అధ్యాయం 105

# శ్రీకృష్ణ నిర్యాణం

**కు**రుక్షేత్ర యుద్ధం పూర్తయిన తరువాత శ్రీకృష్ణుడు ద్వారక వద్ద ముప్పయి సంవత్సరాలు రాజ్య పాలన చేశాడు. వృష్ణులు, భోజులు, శ్రీకృష్ణుడి వంశజాతులైన మిగిలిన యదువంశజులు నిరంతం ఆనందాలను అనుభవిస్తూ.. తాగుడు మొదలైన వ్యసనాలకు లోనై సంచరిస్తున్నారు. ఎవరూ వారి సంఘ కట్టుబాట్లలో మెసలడం లేదు. అడిగేవారు లేక స్వేచ్ఛగా సంచరిస్తున్నారు. ఒకనాడు కొంతమంది రుషులు ద్వారకకు వచ్చారు. మర్యాద తెలియకుండా సంచరించే యాదవులు ఈ రుషులపై నీచ కార్యానికి ఒడిగట్టి వెక్కిరించారు. యాదవుల్లో ఒక యువకుణ్ణి స్త్రీ వలే అలంకరించి రుషుల వద్దకు తీసుకొని వెళ్లి.. "ఓ సర్వజ్ఞులారా! ఈమెకు మగపిల్లలు జన్మిస్తారా లేక ఆడపిల్లలు జన్మిస్తారా? చెప్పండి" అనడిగారు. రుషులు యాదవుల అమర్యాదకర చర్యలను తెలుసుకొని ఆగ్రహంతో.. "ఈ మనిషికి ఆడపిల్లగానీ, మగపిల్లడుగానీ జన్మించరు. ఒక గద జన్మిస్తుంది. ఆ గదే మీ వంశానికి యముడై, మిమ్మలనందరినీ

సంహరిస్తుంది" అని శాపం పెట్టి రుషులు అక్కణ్ణుంచి వెళ్లిపోయారు. యాదవులు కేవలం హాస్యానికి తలపెట్టిన చర్య ఘోర శాపం పెట్టడానికి కారణం కావడంతో వారు తీవ్ర భయాందోళన చెందారు. ఆ మరుసటి రోజే వారు స్త్రీలా అలంకరించిన సాంబుడనే యువకుడికి ప్రసూతి లక్షణాలు కనిపించి ఒక గదను కన్నాడు. ఇది చూసిన యాదవులంతా నిర్ఘాంతపోయారు. వారందరికీ భయం పుట్టింది. రుషుల శాపం మేరకు తమకు అంత్యదశ సమీపిస్తోందని గడగడలాడుతున్నారు. వారు చాలా ఆలోచన చేసి ఆ గదను చూర్ణం చేశారు. చూర్ణాన్ని సముద్రంలో పడేశారు. ఇక అపాయం తప్పిపోయిందని సంతోషించారు. కొంతకాలంపాటు ఏ సంఘటనా జరగలేదు. కాలం సాధారణంగానే గడిచింది. వర్షాకాలం వచ్చింది. మంచి వర్షాలు పడ్డాయి. యాదవులు ఎక్కడైతే ఆ గద చూర్ణాన్ని చల్లారో ఆ సముద్రపు ఒడ్డునా మొక్కలూ, తుప్పలూ పట్టాయి. నాడు రుషులు పెట్టిన శాపాన్ని మరచిన యాదవులు సముద్రపు ఒడ్డున పచ్చని తుప్పలు పెరగడం చూసి వింతగా చూస్తూ సహించలేకపోయారు. ఇలా చాలా కాలం జరిగింది. ఒక రోజున యాదవులంతా సముద్రపు ఒడ్డున విందారగించడానికి వెళ్లారు. అక్కడ నృత్యాలు, పాటలు, తాగుడు మొదలైన వ్యసనాలతో తిరిగారు. వారు సేవించిన మద్యం పని చేయడం ప్రారంభించింది. ముందుగా ఆనందం జనించినా, ఆ తరువాత వారిలో కలహాలు వచ్చాయి. అదుపులేని సంభాషణలతోనూ, పురాతన అపరాధాలను బయటకు తెచ్చీ, జగడాలు పెట్టుకున్నారు. స్వల్ప విషయానికే వారు ఆగ్రహంతో వారు గొప్ప జగడాన్ని పెట్టుకున్నారు.

యాదవుల్లో కృతవర్మ కౌరవ పక్షాన, సాత్యకి పాండవుల పక్షాన యుద్ధం చేశారు. సాత్యకి.. "ఓ కృతవర్మా! నిద్రలో ఉన్న క్షత్రియ యోధులను చంపుతావా?. నీవు మన గొప్పదైన వంశానికి శాశ్వత అపకీర్తి తెచ్చావు" అని ఎత్తిపొడుపు మాటలు అన్నాడు. మరికొంత మంది యాదవులు సాత్యకి మాటలను మెచ్చుకుంటూ "బాగు బాగు" అన్నారు. కృతవర్మ ఈ అపచారాన్ని సహించలేకపోయాడు. అతడు సాత్యకితో.. "భూరిశ్రవసుడు చేతులు నరకబడి యోగాసన సమాధిలో ఉండగా.. నీవు కసాయిలా అతణ్ణి నరికావు. అలాంటి పిరికిపందవైన నీవు నన్నే ఆక్షేపించడానికి సాహసిస్తావా?" అంటూ ఎదురు సమాధానం చెప్పాడు. మరికొంత మంది యాదవులు కృతవర్మను కలిశారు. సాత్యకి చేసిన మూర్ఖపు పనికి వీరంతా ఎకసక్కేలాడారు. త్వరలో యాదవులందరూ కృతవర్మ-సాత్యకి పక్షాలుగా చీలిపోయారు. ముందు తగవులు పడ్డారు. ఆ తరువాత కొట్లాటలకు దిగారు. అది పెద్ద యుద్ధంలా పరిణమించింది. సాత్యకి తన కృపాణాన్ని తీసి కృతవర్మపై పడి అతని తలను నరికేశాడు. అంతటితో

ఆగలేదు. "నిద్రాసక్తులైన యోధులను చంపిన పిరికిపంద చచ్చాడు" అంటూ అరిచాడు. మిగిలిన కొంతమంది యాదవులు తమ చేతికి దొరికిన ఆయుధంతో సాత్యకిపై పడ్డారు. కృష్ణుడి కుమారుడైన ప్రద్యుమ్నుడు.. సాత్యకికి సహాయంగా వెళ్లి యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో సాత్యకి, ప్రద్యుమ్నుడు కూడా చనిపోయారు. వారందరికీ మరణకాలం వచ్చిందని శ్రీకృష్ణుడు తలచాడు. శ్రీకృష్ణుడు సముద్రం ఒడ్డున తుప్పల్లో పెరిగిన పొడవైన వాటిని ఎంచుకొని వాటితో వారూ వీరూ అనకుండా అందరినీ కొడుతున్నాడు. వారి మధ్య మారణ యుద్ధం ప్రారంభమైంది. రుషుల శాపం పనిచేయడం ప్రారంభించింది. యాదవుల చేతుల్లో ఉన్న ఒక్కో మొక్క ఒక్కో గదగా మారింది. వాటితో యాదవులు ఒకర్నొకరు కొట్టుకొని వారంతా చనిపోయారు.

ఇదంతా చూస్తున్న బలరాముడు.. సిగ్గుతోనూ, చిరాకుతోనూ భూమిపై పడ్డాడు. తాను ప్రాణ త్యాగం చేయడానికి అతడు యోగము పూనాడు. యోగంలో అతని ఆత్మజ్యోతి ఒక మెరుపు తీగలా ముఖం నుంచి వెళ్లి సముద్రంలో లీనమైంది. ఇలా బలరామునితో ఉన్న నారాయణాంశం అంతరించింది.

ఇదివరకు విధి నిర్ణయ ప్రకారం, యాదవులందరూ ఒకర్నొకరు చంపుకోవడాన్ని, బలరాముడి నిర్యాణాన్ని చూసిన శ్రీకృష్ణుడు.. ధ్యాన యోగం నుంచి తన అవతార అంత్యదశ గురించి తలిచాడు. ఆ నిర్జన ప్రదేశంలో సంచరిస్తున్నాడు. ఆ సమయంలో "నేను వెళ్లే కాలం వచ్చింది" అని అనుకుంటూ నేలపై పడి నిద్రలోకి జారుకున్నాడు. తుప్పలతో నిండిన ఆ సముద్రపు ఒడ్డున వేట కొచ్చిన ఓ వేటగాడు.. దూరం నుంచి తుప్పల మధ్య పడివున్న వాసుదేవుణ్ణి ఏదో మృగమని తలిచాడు. ఆ వేటగాడు తన ధనస్సును ఎక్కుపెట్టి ఒక బాణం వేశాడు. అది శ్రీకృష్ణుడి పాదాల అడుగుభాగం నుంచి శరీరం తిన్నగా దూసుకుపోయింది.

ఇలా మహాత్ముడైన వాసుదేవుడు మానవలోకాన్ని వీడాడు.

కుక్క వెంటరాగా
పాండవుల
తుది ప్రయాణం



## అధ్యాయం - 106

# యుధిష్ఠరుని అంత్యపరీక్ష

**శ్రీ**కృష్ణుని నిర్యాణం, యాదవ వంశ నాశనం గురించిన విచార వార్తలు హస్తినాపురాన్ని చేరాయి. పాండవులీ వార్తను విని భూమిపై వారికున్న ఆశను వదులుకున్నారు. అభిమన్యుడి కుమారుడైన పరీక్షిత్తుకు రాజ్య పట్టాభిషేకం చేసి ఐదుగురు అన్నదమ్ములు, ద్రౌపది పట్టణాన్ని వదిలారు. పుణ్యస్థలాలను సేవిస్తూ, తీర్థయాత్రలు చేస్తూ, హిమాలయ ప్రాంతానికి చేరారు. ఎక్కడిదో ఓ కుక్క కూడా వారిని అనుసరిస్తూ వస్తోంది. అందరూ తమ తుది ప్రయాణంగా పర్వతారోహణాలు చేస్తున్నారు. అలా చేసేటప్పుడు అలసిపోయి ఒక్కొక్కరు మరణిస్తున్నారు. చిరుత ప్రాయుడైన సహదేవుడు మొదట ప్రాణాలు విడిచాడు. ఆ తరువాత నకులుడు, ద్రౌపది, వారి తరువాత అర్జునుడు, భీముడు మృతి చెందారు. యుధిష్ఠరుడు.. తన ప్రేమాస్వరూపులైన తమ్ముళ్ల, ద్రౌపది మరణం చూశాడు. అతడు బహుశాంతంగా యాత్ర సాగిస్తున్నాడు. కుక్క యుధిష్ఠరుణ్ణి అనుసరిస్తోంది.

తన తమ్ముళ్లందరూ తనను ఒంటరి చేసినా ఆ కొండ ప్రాంత మార్గంలో ఆయాసంగా నడిచి వెళ్తున్న యుధిష్ఠిరునకు ధర్మరాజే శునక రూపంలో వెంటపడింది. ఆ పర్వత ఉన్నత శ్రేణికి చేరిన తరువాత రథారూఢుడైన ఇంద్రుడు యుధిష్టరుడుకి ప్రత్యక్షమయ్యాడు. ఇంద్రుడు.. యుధిష్టరుణ్ణి ఉద్దేశించి.. "నీ తమ్ముళ్లూ, ద్రౌపదీ నీ కంటే ముందే స్వర్గాన్ని చేరారు. శరీర భారంతో నీవు వెనుకబడ్డావు. నీవు ఈ రథం ఎక్కి నాతో రా. నేను నిన్ను తీసుకొని వెళ్లడానికి వచ్చాను" అన్నాడు. యుధిష్టరుడు ఇంద్రుని రథం ఎక్కడానికి వెళ్తుండగా.. కుక్క కూడా ఎక్కేందుకు రథంపైకి పాకులాడుతోంది. "వద్దు, వద్దు, స్వర్గంలో కుక్కలకు స్థలం లేదు" అంటూ ఇంద్రుడు కుక్కను కిందకి తోసేశాడు. "అలాగైతే స్వర్గంలో నాకూ స్థలం లేదు" అని యుధిష్టరుడు అన్నాడు. "నా విశ్వాసపాత్రమైన కుక్కను వదలాల్సిన అవసరం లేదు. నేనూ రథం ఎక్కను" అంటూ మానేశాడు. ధర్మరాజు తన కుమారుడగు యుధిష్టరుడి విశ్వాసాన్ని పరీక్షించేందుకు కుక్క రూపంలో వచ్చాడు. యుధిష్టరుడి ధర్మ చర్యలకు ఎంతో సంతోషించి కుక్క రూపంలో ఉన్న ధర్మరాజు మాయమయ్యాడు.

యుధిష్టరుడు స్వర్గానికి చేరాడు. అక్కడ దుర్యోధనుడు చూశాడు. అతడు అందమైన సింహాసనంపై కూర్చొని ఉన్నాడు. అతడు సూర్యకాంతి వలే ప్రకాశిస్తున్నాడు. అతని చుట్టూ వీరాధిదేవీ, ఇతర దేవతలూ పరివేష్టించి ఉన్నారు. యుధిష్టరుడు తన తమ్ముళ్లనుగానీ, ఇతరులను గానీ అక్కడ చూడలేదు. అతడు ఆశ్చర్యపోయాడు. యుధిష్టరుడు.. "ఓ స్వర్గలోక వాసులారా!. నా తమ్ముళ్లు ఎక్కడున్నారు?. ఈ ఆశాపరుడు, బుద్ధితక్కువ వాడు ఇక్కడున్నాడు. నేనితడితో కాలక్షేపం చేయను. ఇతని ఈర్ష్యచేత, పగచేత, మేము బంధువులనూ, స్నేహితులనూ చంపుకున్నాం. ఈ దుర్మార్గుని ఆజ్ఞతోనే.. మా కళ్లముందు పాంచాలిని సభా భవనానినికి ఈడ్చి ఘోరంగా అవమానించాడు. అతణ్ణి చూడటం నాకు అసహ్యంగా ఉంది. నా తమ్ముళ్లు ఎక్కడ ఉన్నారో చెప్పండి. అక్కడికి నేను వెళ్తాను" అన్నాడు. బహు శోభతో ఉన్న దుర్యోధనుడి వైపునకు తన దృష్టి పడకుండా కళ్లను పక్కకు తిప్పుకున్నాడు. యుధిష్టరుడి ఈ చర్యను చూసి ఇష్టపడక దేవరుషి నారదుడు నవ్వుతున్నాడు.

"ప్రతిభావంతుడైన ఓ రాజా!, ఇది యుక్తంగా లేదు. స్వర్గంలో మేము చెడు ఊహలు కలిగి ఉండము. దుర్యోధనుడి గురించి నీవిలా అనకు. క్షత్రియ ధర్మం బలంతోనే ధైర్యశాలి అయిన దుర్యోధనుడు ఈ పదవిలో ఉన్నాడు. మనసులో కేవలం శారీరక సంబంధమైన అంశాలను ఉంచుకొని చెడు ఊహలను చెందకూడదు. న్యాయాన్ని అనుసరించి రాజు దుర్యోధనుడితో కూడా ఇక్కడే ఉండు. అసహనానికి, పగకు, స్వర్గాన తావులేదు. నీవు నీ శరీరంతోనే స్వర్గానికి వచ్చావు కనుకనే నీవు

ఇలాంటి ఊహలున్నాయి. కుమారా! వాటిని విడిచిపెట్టు" అన్నాడు నారదుడు. యుధిష్టరుడు సమాధానమిస్తూ.. "ఓ రుషీశ్వరా! ఈ దుర్యోధనుడు తప్పొప్పులు తెలియనివాడు. పాపిష్టి. మంచివాళ్లకు దు:ఖాన్ని కలిగించినవాడు. శత్రుత్వాన్ని, క్రోధాన్ని పెంచినవాడు. అసంఖ్యాక మానవ మారణహోమానికి కారకుడు. మహావీరులకు దక్కాలల్సిన స్వర్గాన్ని ఇతడు ఉచితంగా పొందాడు. ధైర్యశాలులూ, మంచి గుణాలుగల నా తమ్ముళ్లు, ద్రౌపది ఈ స్వర్గంలో లేకుండా ఏ లోకాన ఉన్నారు?. వాళ్లనూ, కర్ణుణ్ణీ, నాకోసం యుద్ధంలో ప్రాణాలర్పించిన స్నేహితులను, రాజులను చూడటానికి నాకు ఆతృతగా ఉంది. వాళ్లను నేనెక్కడా చూడలేదే?. ఇంకా, విరటుడు, దృపదుడు, ధృష్టకేతుడు, శిఖండిని, పాంచాల రాకుమారులను నేను కలుసుకోవాలనుకుంటున్నాను. ఇంకా నాకోసం యజ్ఞంలో ఆజ్యంలా వారి శరీరాలను యుద్ధంలో ఆహుతిచ్చిన వారందరూ ఏరీ?. వాళ్లలో ఒక్కరూ ఇక్కడ లేరే?. వారంతా ఎక్కడున్నారు?. వారి మధ్య నేనూ ఉండవలసిన వాణ్ణి. యుద్ధమైన తరువాత కర్ణుడికి కూడా తర్పణం చేయమని నా తల్లి కుంతి చెప్పింది. ఆ సంగతి తలుచుకుంటే ఇప్పుడు దు:ఖం వస్తోంది. నా రక్తం పంచుకొని పుట్టిన అతడు.. నా సోదరుడని ఎరుగక కర్ణుడి చావుకు కారకుణ్ణయ్యాను. అతణ్ణి చూడటానికి నా మనసు ఆతృతగా ఉంది. ప్రాణం కంటే నాకు ప్రియతముడైన భీముడు, కేవలం ఇంద్రుని వలే ఉండే అర్జునుడు, కవలలయిన నకుల సహదేవులు, ధర్మశీలి ప్రియమైన పాంచాలి.. వారందరినీ చూసి వారి మధ్య ఉండాలని నాకు ఉన్నది. నాకు స్వర్గంలోనే ఉండాలనే కోరిక లేదు. నా తమ్ముళ్లకు దూరంగా నేనిక్కడ ఉడటం ఇక్కడ నాకేమి ఉపయోగం?. వారంతా ఎక్కడుంటారో అదే కావాలిగాని, ఇది కాదు" అన్నాడు ధర్మరాజు.

ఈ మాటలు విన్న దేవతలు.. "ఓ యుధిష్టరా! నీవు నిశ్చయంగా వారితోనే ఉండాలని కోరుకుంటే నిరభ్యంతరంగా అక్కడికే వెళ్లండి. ఆలస్యం చేయనవసరం లేదు" అంటూ వారు యుధిష్టరుణ్ణి తీసుకువెళ్లమని ఒక సేవకుణ్ణి ఇచ్చి పంపారు. ఈ సేవకుడు ముందు నడవగా యుధిష్టరుడు వెనుక అనుసరించాడు. వారటు వెళుతుండగానే చీకటి ఆవరించింది. ఆ చీకటిలో అమానుషమైన, చూడటానికి అసహ్యం కలిగించే రూపాలు కనిపించాయి. రక్తపు బురదలో దుర్వాసనగల, విసర్జన పదార్థాల్లో ఈదుకొని వెళ్లారు. ఈ మార్గం మాంసం ముక్కలతో, ఎముకలతో, చనిపోయిన వారి శిరోజాలతో నిండి ఉంది. పురుగులంతటా మునుగుతూ తేలుతున్నాయి. భరించరాని దుర్గంధం వెదజల్లుతోంది. అంతటా మానవ అవయవ ఖండాలే కనిపిస్తున్నాయి. యుధిష్టరుడు భయవిహల్వుడయ్యాడు. తత్తరపాటు చెందాడు. అతడిలా వెళ్తుండగా.. అతని మనసులో వేలకొలది ఊహలు మెదిలి బాధ పెడుతున్నాయి.

"ఈ మార్గాన మనం ఇంకా ఎంతవరకు వెళ్లాలి. నా తమ్ముళ్లు నిజంగా ఎక్కడ ఉన్నారు?. మిత్రమా! నాకు చెప్పు?" అని యుధిష్ఠరుడు ఎంతో హృదయ విదాకరమైన మనసుతో సేవకుణ్ణి అడిగాడు. ఆ సేవకుడు నెమ్మదిగా.. "నీకు ఇష్టం కాకపోతే మనం తిరిగి వెళ్లిపోదాం" అన్నాడు. ఆ ప్రదేశంలో ఉన్న దుర్వాసన భరించలేక యుధిష్ఠరుడికి తిరిగి వెళ్లాలనే బుద్ధి పుట్టింది. కానీ అతడి ఊహను తెలుసుకున్నట్లు అదృశ్యమైన, అశ్రావ్యమైన ధ్వనులు తనకు పరిచయమైన వాటివలే యుధిష్ఠరుడికి వినపడ్డాయి. "ఓ ధర్మపుత్రా! మరలిపోకు. కొన్ని నిమిషాల కాలమైనా ఇక్కడ ఉండు. నీవిక్కడ ఉండటంతో మాకు క్షణికంగానైనా బాధలు తప్పాయి. నీవు ఇక్కడికి వస్తూ.. నీతోకూడా స్వచ్ఛమైన పరిమళ వాయువుకూడా తెచ్చావు. కావున మా కష్టాలు కొంతమేర తగ్గినట్లు ఉన్నాయి. కుంతీ కుమారా! నీ దర్శనమే మాకు సౌఖ్యాన్నిస్తూ మా బాధను తగ్గిస్తున్నది. కనుక కొద్దికాలమైనా సరే ఇక్కడ ఉండు. తిరిగిపోకు. నీవిక్కడుంటే మా బాధల్లో తీవ్రత తగ్గినట్లుంది" అని అదృశ్య ధ్వనులు వేడుకున్నాయి. తన చుట్టూ నుంచి వస్తున్న శబ్దాలను వింటూ యుధిష్ఠరుడు మనసులో చాలా బాధపడుతూ చకితుడై నిలబడ్డాడు. తీవ్ర బాధలు, విషాదాలు అనుభవిస్తున్నట్లుగా కంఠ ధ్వనులు వినడంతో యుధిష్ఠరుడు ఎంతో కనికరంతో.."అయ్యో.. పాపపు జీవులారా! ఇలా మొరపెట్టే మీరెవరు?. మీరెందుకు ఇక్కడ ఉన్నారు?" అన్ని ప్రశ్నించాడు. "ప్రభూ! నేను కర్ణుణ్ణి" అని ఓ కంఠం పలికింది. "నేను భీముణ్ణి" అని మరో కంఠం, 'నేరు అర్జునుణ్ణి' అని ఇంకో కంఠం, 'నేను ద్రౌపదిని" అని, "నేను నకులుణ్ణి", "నేను సహదేవుణ్ణి" అని ఇలా శబ్దాలు వినిపించాయి. 'మేము ద్రౌపదీ కుమారులం' అని మరోవైపు నుంచి వినవచ్చింది. ఇలా అన్ని దిశల నుంచీ విచార, బాధా సూచికలైన మాటలను విని యుధిష్ఠరుడు సహించలేకపోయాడు.

"ఏ పాపాలకు మీరు నేరస్థులయ్యారు?. ధృతరాష్ట్ర కుమారుడు దుర్యోధనుడు స్వర్గంలో మహేంద్రుడిలా కూర్చున్నాడు. అతడేమి మంచి కార్యాలు చేశాడని స్వర్గంలో ఉన్నాడు? మీరెందుకు నరకంలో ఉన్నారు? నేను కలగంటున్నానా?. లేక అజాగ్రత్తలో ఉన్నానా?. నా మనస్సు చంచలమైందా?. లేక నాకు పిచ్చిపట్టిందా?" ఎంతో కోపంతో యుధిష్టిరుడు దేవతలను, ధర్ముణ్ణి నిందించాడు. తనతో ఉన్న దేవ సేవకుడితో కఠినంగా.. "నీవు నీ యజమానుల వద్దకు వెళ్లు. నా యందు విశ్వాసం కలిగి ఉండటానికి మించి ఏ పాపాన్ని ఎరుగని నా తమ్ముళ్లు నరక బాధలు అనుభవిస్తున్నారు. నేనిక్కడే ఉంటాను" అన్నాడు గంభీరంగా.

సేవకుడు యుధిష్ఠరుడు అన్న మాటలను ఇంద్రుడికి చెప్పాడు. ఈ విధంగా దినము ముప్పయ్యవ భాగం గడిచింది. విచారగ్రస్థుడై ఉన్న యుధిష్ఠరుడు ఎదుట

ఇంద్రుడు, యముడు ప్రత్యక్షమయ్యారు. వారు వచ్చే సరికి చీకటి పోయింది. భయంకర దృశ్యాలు కనపడటం లేదు.

యుధిష్ఠరుడు తండ్రియైన ధర్మాధిపతి యముడు.. తన కుమారుని వైపు చూసి నవ్వినప్పుడు సుగంధ వాసనలు వీచాయి. "నరుల్లో బుద్ధిమంతుడా! నిన్ను పరీక్షించడం ఇది మూడోసారి. నీ తమ్ముళ్ల కోసం నీవు నరకంలో ఉండటానికి సిద్ధపడ్డావు. కొంచెం కాలమైనా రాజులకు, రాజ్య పరిపాలకులకు నరక ద్వారం ద్వారా వెళ్లడం తప్పదు. అందువల్లనే దిన ప్రమాణంలో ముప్పయ్యవ భాగ కాలం నీవు నరకం బాధ పొందడానికి పాత్రుడవయ్యావు. గొప్ప కీర్తిమంతుడగు నీ సవ్యసాచి గానీ, నీ ప్రేమాస్పదుడైన భీముడుగానీ, నిజంగా నరకంలో లేనేలేరు. న్యాయవర్తి అయిన కర్ణుడూ నరకంలో లేడు. ఇంకా నీవు ఎవరెవరు నరకంలో బాధపడుతున్నారని తలచావో వారెవ్వరూ నరకంలో లేరు. అదంతా నిన్ను పరీక్షించడానికి కల్పించిన ఇంద్రజాలం. ఇది నరకం కాదు. స్వర్గం. అదిగో అక్కడ త్రిలోక సంచారి నారదుణ్ణి నీవు చూస్తున్నావు కదా. ఇక విచారం మాను".

ఇలా యముడు ధర్మపుత్రుడితో అన్న వెంటనే అతడు మార్పు చెందాడు. మానుష శరీరం పోయి దేవ శరీరి అయ్యాడు. మానవ శరీరంతోనే క్రోధం, పగ అనేవి పోయాయి. ఇవన్నీ దైవ స్వరూపాలయ్యాయి. ఇలా తన వారందరినీ కలవడంతో యుధిష్ఠరుడికి శాంతి, సౌఖ్యం కలిగింది.

శ్రీకృష్ణార్పణమస్తు

– మంగళం మహా –

ఓం శాంతి శాంతి శాంతి



"మతం అంటే పరమ సత్యాన్ని గ్రహించడానికి ఉపకరించే సాధనం. భగవత్ స్వరూపాన్ని ఆత్మ దర్శించడానికి మతం సాధనం... ప్రపంచంలోని సర్వమతాలూ చెప్పే సారం ఇదే. అయా మతాల పేర్లు వేరువేరుగా ఉండొచ్చు. మత ప్రబోధకులు వేరువేరుగా ఉండొచ్చు. వేరువేరు పద్ధతులను, సాంప్రదాయాలను కలిగి ఉండవచ్చు. కానీ, భారతదేశంలో మారుమూల కీకారణ్యాల్లో బోధించినా, జెరూసలేం కొండలపైన బోధించినా, అరేబియాల్లోని ఎడారుల్లో బోధించినా ఆ బోధనల పరమార్థం ఒక్కటే. మన ఆత్మ పరమాత్ముని సందర్శించగలగడం. ఒకసారి ఆ విధంగా పరమాత్మను సందర్శించగలిగిన వారికి ఇక మతం అవసరమే ఉండదు. ఇది విశ్వసత్యం"

\- స్వామీ వివేకానంద

సమధర్మ ప్రచార పరిషత్ సంఘం